# శ్రీవివేకానందసంపూర్ణగ్రంథావళి

[ శతతమ జన్మదినోత్సవ ప్రచురణము ]

## తొమ్మిదవ సంపుటము





శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4

# విజ్ఞప్తి

శ్రీవివేకానందస్వాముల రచనలును ఉపన్యాసములును అద్భుతశక్తిమంతములు, భక్త్యాదర్శపరిపూర్ణములు. చదివినవారి డెందములలో శాశ్వతస్థానమును అవి సంతరించుకొనును. వానిని చదివిన పిమ్మట ఎందఱో ఆదర్శదేశభక్తులైరి. ఎందఱో సర్వసంగపరిత్యాగ మొనర్చి తమ జీవితములను మానవసేవ కంకిత మొనర్చుకొనిరి. ప్రతిమానవుఁడును బలవంతుఁడుగను ధీరుఁడుగను ఉండవలె ననుట స్వామీజీ కోరిక. ముఖ్యముగ ప్రస్తుతపరిస్థితులలో ప్రతిభారతీయునకును మాతృదేశగౌరవమును అప్రధృష్యముగ నిలుపుటకు ధైర్యమును బలమును దేశభక్తియు ఎంతైనను ఆవశ్యకములు. ఈసమయమున స్వామీజీ శంఖారావమును-జీవనప్రదమగు సందేశమును—మనదేశమున ఇంటింటికి అందజేయుట అవశ్యకర్తవ్యము. ఆఉద్దేశముతోనే స్వామీజీశతతమజయంతి మహోత్సవప్రణాళికలో ఒకఅంగముగా ఆంగ్లమున ఎనిమిది సంపుటములుగా నున్న సంపూర్ణగ్రంథావళిని విషయానుగుణముగ విభజించి ప్రాంతీయభాషలలో అనువదింపించి పది సంపుటములుగా ప్రకటించుచున్నాము. ప్రభుకృపచే తెలుగులో ఎనిమిది సంపుటములు ఇంతకుపూర్వమే వెలువఱుపగలిగితిమి. ఇది తొమ్మిదవసంపుటము. దీనిలోను దీనికి తర్వాతి సంపుటములోను స్వామీజీ లేఖలు పొందుపఱుపబడియున్నవి. 1888 నుండి 1895 వఱకు వ్రాయబడినలేఖలు ఇందులో నున్నవి. 1896 నుండి 1902 వఱకు వ్రాయబడినవి పదవసంపుటములో అచిరకాలములోనే వెలువడగలవు.

లేఖలందు వ్రాసినవారి మనస్సు ప్రతిఫలించును. ముఖ్యముగా అంతరంగికులకు వ్రాసిన జాబులలో భావములు నిర్నిరోధముగ వెలువడును. వానిని బట్టి రచయిత మనఃపరిణతిని వికాస

మును ఆంతరచరిత్రమును మనము గ్రహింపగల్గుదుము. మహనీయులు వారి ఆంతరంగికులకు వ్రాసిన లేఖలను గనుటకై లోకులువ్విళులూరుట కిదే కారణము. వేఱుమార్గములలో తెలియ శక్యముగాని ఆమహనీయుల జీవితచరిత్రాంశములు వారి లేఖల వలన తెలియనగును. అట్టి విలువలో శ్రీవివేకానందస్వాముల లేఖలు అప్రతిమానములు. చదువరి జీవితములో మహత్తర పరిణామమును గల్గించు దివ్యశక్తి ఈ లేఖలలో ప్రతివాక్యమునం దున్న దనుట స్వభావోక్తి.

శ్రీచిరంతనానందస్వాములయు ఆచార్య శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారియు అనువాదములను యథావసరముగ వినియోగించుకొని ఈ సంపుటమునకు సంపాదకులైన శ్రీమాన్ నేలటూరి భక్తవత్సలముగారే ఇందలి లేఖలలో అత్యధిక భాగమును తెలిగించియున్నారు. ఈ మువ్వురికిని మేము కృతజ్ఞులము.

వేదాంతియు యోగియు దేశభక్తాగ్రణియు నగు శ్రీ వివేకానందస్వామివ్రాసిన మహోత్సాహప్రదములగు ఈలేఖలను ఆంధ్రభాషాభిజ్ఞులైన సోదరులు భక్తిశ్రద్ధలతో చదివి పవిత్ర భారతమాతకు అత్యనురూపులైన ప్రజలుగా భాసిల్లుదురు గావుత మని మా ఆశంస.

అందఱికిని అందుబాటులో నుండుటకై ఈగ్రంథమూల్యమును చాల తక్కువగ నిర్ణయించియున్నాము. ఈశతవార్షికోత్సవ సంవత్సరములోనే కొనువారికి వెలలో 10% తగ్గింపబడును.

నవంబరు, 1963

ప్రకాశకుడు

# లేఖలు

## 1

(వారణాశిలోనున్న పండిత శ్రీ ప్రమదాదాసమిత్రకు వంగభాషలో వ్రాసినది)

బృందావనము,
ఆగస్టు 12, 1888.

ప్రియమహాశయా,

అయోధ్యను విడిచి పవిత్రబృందావనమున చేరితిని. కాళాబాబుకుంజములో వసించుచున్నాను. పట్టణములో మనస్సు సంకుచితమగుచుండును. రాధాకుండము మున్నగు తావులు ఆనందదాయకములై యుండునని వింటిని. కాని అవి పట్టణమునకు కొంతదూరమున నున్నవి. అచిరకాలములో హరిద్వారమునకు పోవలెనని నా ఉద్దేశము. అచట మీకు పరిచితుడైనవ్యక్తి ఎవ్వరైన నున్న నాతనికి పరిచయముచేయుచు దయతో నాకు జాబు వ్రాసిన నాకెంతో ఉపకారముచేసినవారలగుదురు. ఇచ్చటికి మీరు వచ్చుటేమైనది? దయతో వెంటనే జవాబు వ్రాయుడు.

భవదీయుడు
వివేకానంద

## 2

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)
శ్రీ శ్రీ దుర్గాశరణమ్

బృందావనము,
ఆగస్టు 20, 1888

ప్రియమహాశయా,

వృద్ధుడైన నా సోదరశిష్యుడొకడు కేదారనాథ బదరీనాథ మహాక్షేత్రములను దర్శించి, బృందావనమునకు తిరిగివచ్చి గంగాధరుని సంధించెను. గంగాధరుడు రెండుపర్యాయము

టిబెట్టు భూటానులవఱకు పోయి వచ్చినాడు. ఈ సమాగమముచే ఆతడు పరమానందభరితుడై ఉద్వేగమున తలమునుకలై ఆనంద బాష్పములు కార్చినాడు. చలికాలము నాతడు కంఖలులో గడపినాడు. మీ రాతనికిచ్చిన కమండలువు నాతడింకను తనయొద్ద నుంచుకొనినాడు. అతడు తిరిగి వచ్చును. బృందావనమునకు ఈ మాసములోనే వచ్చునని అనుకొనుచున్నాము. అతనిని కలిసికొనవలెనను ఉద్దేశముతో నా హరిద్వారప్రయాణమును కొన్ని దినములు ఆపుకొంటిని. మీతో వసించు శైవబ్రాహ్మణునకు నా ప్రణామములు అందింపుడు. మీకు నా వందనములు.

భవదీయుడు
వివేకానంద

## 3

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)
ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ

బరానగరమఠము,
నవంబరు 19, 1888.

మాన్యమహాశయా,

మీరు పంపిన రెండుపుస్తకములు అందినవి. మహానురాగ సంభరితమైన మీ జాబు నా కెంతో ఆనందమును చేకూర్చినది. సువిశాలమై ఔదార్యభరితమైన మీహృదయమున కది చిహ్నము. మహాశయా, నాపూర్వజన్మసుకృతమువలన మీరు బిచ్చమెత్తి జీవించు సన్న్యాసినైన నాయెడల ఇంతటి కారుణ్యమును చూపుచున్నారు. వేదాంతగ్రంథమును మాకు దానముచేయుటచేత నేనుమాత్రమే కాక, శ్రీరామకృష్ణానుయాయులైన సన్న్యాసులందఱును ఆజన్మము మీకు ఋణపడినవారైరి. ఎల్లరు మీకు భక్తిపూర్వకముగ ప్రణమిల్లుచున్నారు. పాణినీయవ్యాకరణమును పంపుడని మిమ్ము ప్రార్థించినది కేవలము నాకొఱకే కాదు. ఈ

మఠములోనివారు సంస్కృతశాస్త్రగ్రంథములను విశేషదీక్షతో పఠించుచున్నారు. వంగరాష్ట్రములో వేదముల ప్రచారము తగ్గినట్లు తోచుచున్నది. ఈమఠములోని పల్వురకు సంస్కృతభాష సువిదితము. వారికి వేదసంహితలను నేర్వవలె నను తలంపున్నది. దేనిని చేపట్టినను సమగ్రముగా నిర్వహింపవలె నని వారి యభిప్రాయము. తొలుత పాణినియవ్యాకరణమున నిష్ణాతులు కాక వైదికవాఙ్మయమును సంపూర్ణముగా ఆకళించుకొనుట సాధ్యము కా దని, అందుకు పనికి వచ్చు సాధనములలో అదే శ్రేష్ఠ మని, విశ్వసించి, దాని 'ప్రతి' యొకటి ఆవశ్యక మని అనుకొన్నారు. మేము బాల్యమున పఠించిన 'ముగ్ధబోధ' యను వ్యాకరణము 'లఘుకౌముది' కంటె బహుభంగుల మేలైనది. మీరు స్వయముగ మహావిద్వాంసులు. ఈ విషయమున గుణనిర్ణేతలలో మీరే వరిష్ఠులు. పాణినియాష్టాధ్యాయి మాకన్నిటికంటె తగియుండు ననుకొందు రేని (మీ కిష్ట మున్నచో వీలైనచో) ఆగ్రంథమును పంపిన ఆజన్మము మమ్ము మీకు ఋణపడినవారినిగ చేసికొన్నవారగుదురు. దీక్షయు ప్రజ్ఞయు సునిశితమేధయు గల వ్యక్తులకు మఠములో అభావము లేదు. మాగురుదేవుని కటాక్షమువలన అచిరకాలములో వారు పాణినియవ్యాకరణమును నేర్చి వంగసీమ యందు వేదపునరుద్ధరణ మొనర్ప గల రని నే నాసింప వచ్చు. మాపూజ్య గురుదేవుని రెండుఛాయాచిత్రములును సరళశైలిలో నున్న గురుదేవునుపదేశాలను ఎవరో సంకలించి అచ్చువేసిన వానిని రెండు సంపుటాలను మీకు పంపుకొనుచున్నాను. వీనిని మీరు స్వీకరించి మా కానందము చేకూర్తు రని ఆశపడుచున్నాను. నాయారోగ్య మిపుడు చాల మెఱుగైయున్నది. రెండు మూడు నెలలలో మీ సమాగమభాగ్యము నాకు లభించు నని విశ్వసించుచున్నాను.

భవదీయుడు
వివేకానంద

## 4

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

శ్రీ శ్రీ దుర్గా

బాఘ్బజారు,
కలకత్తా,
నవంబరు 28, 1888.

ప్రియమహాశయా,

మీరు ఎంతో దయతో పంపిన పాణినీయగ్రంథము నాకు చేరినది. అందుకు నాకృతజ్ఞతను చిత్తగింతురు గాక.

నేను మరల జ్వరపీడితుడనైతిని. కావున మీకు వెంటనే ప్రత్యుత్తరమీయజాలనైతిని. దయతో మన్నింపుడు. నా ఆరోగ్యము బొత్తిగా బాగులేదు. మీకు శారీరక మానసిక సౌఖ్యమును చేకూర్పుమని జగజ్జననిని ప్రార్థించుచున్నాను.

భవదీయసేవకుడు
వివేకానంద

## 5

(శ్రీప్రమదాదాసమిత్రకు)

దేవోజయతి

బరానగరము,
ఫిబ్రవరి 4, 1889.

ప్రియమహాశయా,

ఏదో కారణమున నేడు నామనసుకు సంక్షోభము నిరుత్సాహముకల్గినది. ఆ ముహూర్తమున వారణాసీ దివ్యనగరమునకు ఆహ్వానించుచు మీరు వ్రాసిన జాబు అందినది. దీనిని నేను విశ్వేశ్వరుని* ఆహ్వానముగా తలదాల్చుచున్నాను. నా గురుదేవుని

* వారణాసిలోని ప్రధానదేవాలయమున వెలసియున్న మహాదేవుడు.

అవతారస్థలమునకు నే నిపుడు యాత్రపోవుచున్నాను. అందు కొన్ని దినములుండి మీ సమక్షమునకు వత్తును. కాశిని విశ్వనాథుని సందర్శించినపుడు ఎవనిహృదయము ద్రవింపదో, అతడు శిలాహృదయుడే. నా యారోగ్య మిపుడు చాల మెఱుగుగా నున్నది. జ్ఞానానందునకు నావందనములు అందింపుడు. సాధ్యమైనంత త్వరలో వత్తును. విశ్వేశ్వరుని సంకల్పమే కదా తుదకంతటికిని ఆధారము ... విశేషములు మనము కలిసికొనినపుడు.

భవదీయుడు

వివేకానంద

## 6

(మాస్టరు మహాశయుడన ప్రసిద్ధుడగు శ్రీ మహేంద్రనాధగుప్తకు వ్రాసినది)

ఆంతూ్పరు,*

ఫిబ్రవరి 7, 1889.

ప్రియ మ.—,

నీకు నా కృతజ్ఞతాభివందనాలొకలక్ష! బాబూ, శ్రీరామకృష్ణుని నీవు సరిగా అర్థముచేసికొంటివి.

అయ్యో, ఆయనను అర్థముచేసికొనగలవారు కొలదిమంది, కొలదిమంది మాత్రమే!

భవదీయుడు

వివేకానంద

మలిమాట – ఇకముందు భువిపై శాంతిని వర్షింపగల సిద్ధాంతహృదయపు లోతులలోనికి చొరవగాంచినట్టి యెవనిని చూచినప్పుడును నాహృదయము ఆనందముతో నర్తించును. అప్పుడు నాకు వెఱ్ఱెత్తకుండుటే ఆశ్చర్యము.

* ఇది హుగ్లీజిల్లాలోని ఒకపల్లె. శ్రీప్రేమానందస్వామి స్వస్థలము.

## 7

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

బరానగరము,
ఫిబ్రవరి 22, 1889.

ప్రియమహాశయా,

వారణాసికి పోనెంచియుండిన నేను ముందుగ నా గురుదేవుని జన్మస్థలమును సందర్శించి, పిదప అచటికి పోదలచితిని. కాని దురదృష్టవశమున నేనా గ్రామమునకు పోవునపుడు మార్గమధ్యమున జ్వరపీడితుడనైతిని. కలరాలక్షణములగు వమనమును అతిసారమును కలిగినవి.

మూడునాల్గు దినములు కడచినపిదప జ్వరము మరల వచ్చినది. శరీరము నీరసముగానున్నది. రెండడుగులైన నడువలేకున్నాను. కావున వెనుకటి ఉద్దేశమును మానుకోవలసివచ్చెను. ఈశ్వరసంకల్పమేమో యెఱుగను – నాశరీర మందుకు తగదు. ఐనను శరీరమే సర్వస్వముకాదు కదా! కొలదిదినము లిందుండి కొంత కోల్కొనిన పిదప మిమ్మందు కలిసికొనగలనని విశ్వసించుచున్నాను. అదెట్లైనను విశ్వేశ్వరసంకల్పమే చెల్లి తీరును. మీరు కూడ నన్నాశీర్వదింపుడు. మీకును సోదరుడు జ్ఞానానందునకును వందనములు.

భవదీయసేవకుడు
వివేకానంద

## 8

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

బాఘ్బజారు,
కలకత్తా,
మార్చి 21, 1889.

మాన్యమహాశయా,

మీ కడపటిజాబు నాకు అంది చాలదినములైనవి. ప్రత్యేక కారణములవలన సత్వరప్రత్యుత్తరమీయజాలనందుకు దయతో

మన్నింపుడు. నేనిపుడు చాల అస్వస్థుడనై యున్నాను. అపుడపుడు జ్వరమువచ్చుచున్నది. ప్లీహమందుగాని మఱే యవయవమందుగాని దోషమేమియులేదు. హోమియోపథీ ఔషధమును సేవించుచున్నాను. కాశికిపోవు ఉద్దేశమును ప్రస్తుతము నేను పూర్తిగా మానుకోవలసివచ్చుచున్నది. శరీరస్థితినిబట్టి, తర్వాత ఈశ్వరేచ్ఛ ననుసరించి యేమిజరిగినను జరుగును. సోదరుని జ్ఞానానందుని మీరు కలిసికొంటిరేని, నా రాక నిరీక్షించుచు అచట లెడయవలదని చెప్పుడు. నే నచటికి వత్తు ననుట యెంతయు సంశయాస్పదము. మీకును జ్ఞానానందునకును వందనములు.

భవదీయుడు
వివేకానంద

## 9

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)
శ్రీ శ్రీ దుర్గాశరణమ్

బరానగరము,
జూన్ 26, 1889.

ప్రియమహాశయా,

పెక్కుకారణములవలన చాలకాలమునుండి మీకు జాబు వ్రాయలేకపోయితిని. దయతో మన్నింపుడు. గంగాధరునిగుఱించిన వార్త నాకిపుడందినది. నా సోదరశిష్యులలో ఒకరిని అతడు కలిసికొనెను. ఇరువురును ఇపుడు ఉత్తరఖండములో (పవిత్రహిమాలయములందు) ఉన్నారు. ఇచటివారిలో నలుగురము ఇపుడు హిమాలయములం దున్నాము. గంగాధరునితో కలిసి ఐదుగురమైతిమి. శివానందుడను సోదరశిష్యుడు కేదారనాథక్షేత్రమునకు పోవుచు శ్రీనగరములో గంగాధరుని కలిసికొనెను. గంగాధరుడిచటికి రెండుజాబులను వ్రాసెను. అతడు హిమాలయములకు వచ్చిన ప్రథమసంవత్సరమున టిబెట్టులో ప్రవేశించుట కాతనికి

అనుమతి లభింపలేదు. తర్వాతిసంవత్సరము లభించినది. ఆతనిపై లామాలకు విశేషప్రీతి. అతడు టిబెట్టుభాషను నేర్చుకొనెను. జనులలో నూటికి తొంబదిమంది లామా లనియు ఐనను వారిలో పలువురు తాంత్రికపూజావిధానము నవలంబింతు రనియు ఆతడు తెల్పెను. ఈ కావున చలి చాల మిక్కుటముగ నున్నది. ఆహార పదార్థములు దుర్లభములు. ఎండునంజుడుమాత్రము లభించును. గంగాధరునకు ఉన్నచోట చన్నచోట ఆహారమిదే. నా ఆరోగ్యము ఫర్వాలేకున్నది. కాని నా మానసికస్థితి భయంకరము.

భవదీయుడు
వివేకానంద

## 10

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

జగదీశునకు జయము

బాఘ్బజారు,
కలకత్తా,
జూలై 4, 1889.

ప్రియమహాశయా,

నిన్నటిదినమున నాకందిన మీ లేఖయందలి వార్తలు నాకమితానందమును చేకూర్చినవి. మీకు జాబువ్రాయుమని గంగాధరునితో చెప్పుమంటిరి. కాని నాకందు కవకాశము లేకున్నది. గంగాధరప్రభృతులు మాకు జాబులువ్రాయుచున్నను, వారే ప్రదేశమందును రెండు మూడుదినములకంటె అధికకాలము తడయుటలేదు. కావున మీ లేఖ లందువ్యవధి లేదు.

పూర్వాశ్రమమున నాకు చుట్టమైన యొకడు వైద్యనాథ సమీపమున సిముల్తలయొద్ద ఒకబంగళాను కొనెను. అచటి శీతోష్ణపరిస్థితులు ఆరోగ్యకరములుగానున్నందున నేనచట కొంత కాలముంటిని. కాని వేసవియెండ ముదురుటతో తీవ్రమైన అతిసార

వ్యాధి తగులొన్నది. పరుగున ఆ ప్రదేశమును వీడి యిప్పుడే వచ్చితిని.

వారణాసికి రావలెనని, మీ సమాగమభాగ్యమునంది, కొన్నిదినములందుండి మీతో ఇష్టాగోష్ఠి సలుపవలెనని నేను పడుచున్న తీవ్రాశ అనిర్వచనీయము. కాని అంతయు ఈశ్వరేచ్ఛపై ఆధారపడియున్నది. మనకు పరస్పరము ఎట్టిహృదయసంబంధము జన్మాంతరమునుండి అనువర్తించుచున్నదో! కలకత్తాలో అధికార పట్టభద్రులు సంపన్నులు ఎందఱెందఱో నాపై ప్రేమానురాగ వర్షము గురిపించుచున్నప్పటికి వారిపొత్తున నాకు మిక్కుటమైన విసుగే కలుగుచున్నది. కాని మీతో ఒకదినము గడపినంత మాత్రమున నా హృదయము ముగ్ధమై మిమ్ము సన్నిహితబంధువులని ఆధ్యాత్మికజీవితమున సైదోదులని తలదాల్చుచున్నది. మఱి యొక కారణ మిదై యుండును:

త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తర సౌహృదాని.*

మీ హితోపదేశమునకు నేను కృతజ్ఞుడను. అది మీ సాధనానుభవప్రభవము. అన్నిరీతుల నూతనభావములను మస్తకమున నిముడ్చుకొనుటవలన అపుడపుడు బాధపడవలసివచ్చుననుట ఎంతయు నిక్కము. పెక్కుతూరు లిట్టి యనుభూతి నాకు కల్గియున్నది.

కాని ఈ పర్యాయము నేను పడు బాధ వేఱు. అనుగ్రహమయుడగు భగవంతునిపై నేను విశ్వాసమును గోలుపోలేదు. ముందెన్నడును కోలుపోను. శాస్త్రములందలి నా విశ్వాసము అచంచలము. కాని ఈశ్వరేచ్ఛ ననుసరించి నాజీవితమున కడచిన ఆఱేండ్లును అన్నిఅడ్డంకులతోడి విఘ్నములతోడి నిరంతరముసాగు

---

* కాళిదాసుని 'శాకుంతలము'. 5-వ అంకము: "భావమున స్థిరపడిన జననాంతరసౌహృదములను ప్రాణికి తెలియకే ప్రాణి మనస్సు స్మరించును."

పోరాటముతో నిండియున్నవి. ఆదర్శశాస్త్రము నాకు లభించినది. ఆదర్శపురుషుని దర్శించితిని. కాని తుదివఱకు దేనినికాని కొనసాగింపజాలకున్నాను—ఇదే అగాధమైన నా వ్యథ.

ముఖ్య విషయ మిది :— కలకత్తాలో నుండగా నాకు మేలొందు అవకాశము కానరాదు. కలకత్తాలో నాతల్లియు ఇద్దఱు సోదరులు నున్నారు. నేను జ్యేష్ఠుడను, రెండవవాడు ఎఫ్. ఏ. పరీక్షకు చదువుచున్నాడు. మూడవవాడు పసివాడు.

ఈవఱలో వారిస్థితి బాగుగనేయుండినది. కాని మా తండ్రిగారు మరణించినప్పటినుండి వారిస్థితి దుర్భరమగుచున్నది—ఒక్కొక్కప్పుడు వారు పస్తుండవలసియు వచ్చుచున్నది. తుట్టతుదకు కొందఱు చుట్టములు వారి నిస్సహాయస్థితిని అండజేసికొని వారి పైతృకగృహమునుండి వారిని తఱిమివేసిరి. హైకోర్టులో వ్యాజ్యముజరిపి కొంపలో కొంత రాబట్టుకొన్నారు. కాని నిప్పచ్చరము వారినిపుడు పీడించుచున్నది—వ్యాజ్యాలవలన దాపురించు సహజస్థితి!

కలకత్తాకు సమీపముననుండి నేనీ దురవస్థను చూడవలసి వచ్చుచున్నది. రజోగుణము ప్రకోపించుచు అహంకార మొక్కొక్కప్పుడు చెలరేగుచు క్రియాంగణములోనికి నన్నుఱికించు నుబలాటరూపముదాల్చెడిది. ఇట్టిక్షణములందు నాహృదయమున దారుణమైన యుద్ధము చెలరేగుచుండును. కావుననే నా మానసిక స్థితి భయావహమైయున్నదని వ్రాసితిని. ఇపుడు వారి వ్యాజ్యము తుదముట్టినది. మఱికొన్ని దినము లిందుండి పరిస్థితులను చక్కబఱచి ఈ తావునకు స్వస్తిచెప్పి మరలిరాకుండ నిటనుండి నేను పోగలుగునట్లు నన్నాశీర్వదింపుడు.

ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశన్తి యద్వత్

తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి, న కామకామీ.*

మహోన్నతదైవీశక్తితో నా హృదయబలము వర్ధిల్లునట్లును సమస్తమాయాస్వరూపములు నాయొద్దనుండి దూరముగ తొలగిపోవునట్లును నన్ను ఆశీర్వదింపుడు. ఏలయన "మేము సిలువను చేకొంటిమి, నీవు దానిని మాపై మోపితివి. మరణమువఱకు దానిని వహింపజాలు శక్తిని మాకు ప్రసాదింపుము. తథాస్తు"— "ఇమిటేషన్ ఆఫ్ క్రైస్తు".

నేనిప్పుడు కల్కత్తాలో నున్నాను. నా చిరునామా: బలరామ్బాబుగారింట, 57 రమాకాంతబోసువీధి, బాఘ్బజారు.

భవదీయుడు
వివేకానంద

## 11

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

సిమ్లా,
కల్కత్తా,
జూలై 14, 1889.

మాన్యమహాశయా,

మీయుత్తరము అంది నాకెంతో ఆనందము కలిగినది. ఇట్టిపరిస్థితులలో ప్రాపంచికజీవితముమీదనే మనస్సు నిలుపుడని పలువు రుపదేశింతురు. కాని మీరు సత్యపరులు, దృఢహృదయులు. ఉత్సాహోల్లాసకరములైన మీ మాటలు నాకెంతో ఆశ్వాసమును చేకూర్చినవి. ఇచ్చటి నా చిక్కులు ఇంచుమించుగ

* వచ్చి తనలోపడి తన్ను నింపు నీళ్లచే పొంగుకాని ప్రవాహముకాని లేకుండు సముద్రమువలె, అన్నికామములను తనలో గ్రసింపజేసికొని నిర్వికారుడుగ నుండువాడు శాంతినొందును. మఱి కామములను కామించువానికన్ననో, శాంతిలేదు. భగవద్గీత II 70.

కడముట్టినవి. భూమివిక్రయమునకై ఒకమధ్యవర్తిని నియోగించితిని. విక్రయము త్వరలో జరుగునని విశ్వసించుచున్నాను. ఈపని ముగియుచో మనోవ్యథనుండి పూర్తిగా విముక్తుండును. హుటాహుటి పయనమై వారణాసిలో మీకడకు వత్తును.

భవదీయసేవకుడు
వివేకానంద

## 12

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

దేవోజయతి

బరానగరము,
కలకత్తా,
ఆగస్టు 7, 1889.

ప్రియమహాశయా,

మీ జాబుచేరి వారముదినములకంటె ఎక్కువకాలమే గడచినది. మరల జ్వరము పైకొనుటవలన మీకు ఇన్నాళ్లను ప్రత్యుత్తరమీయజాలకపోయినందుకు దయతో మన్నింపుడు. మూడుపక్షములు నా యారోగ్యము బాగుండినది. కాని కడచిన పదిదినములలో మరల వ్యాధి బాధకలిగినది. ఇపుడు స్వస్థుడనై యున్నాను.

మిమ్ము అడుగవలసిన కొన్నిప్రశ్నలున్నవి నాకు. మీరు సంస్కృతమున మహావిద్వాంసులు. దయచేసి ఈ క్రిందిప్రశ్నలకు సమాధానములను ప్రసాదింపుడు.

(1) ఉపనిషత్తులలోగాక వేదములలో నెందైన జాబాలసుతుడైన సత్యకాముని జానశ్రుతినిగూర్చిన ఉదంతము కలదా?*

* ఈ ప్రశ్నలోని యథార్థభావ మిది: వేదాంతసూత్రభాష్యమందు శ్రీశంకరాచార్యులు (1-iii-34-37 అను) సూత్రములు ఉపనిషదర్థము జానశ్రుతి సత్యకాములకు, వారు శూద్రులుకాకపోవుటవలన ఉపదేశింపబడిన దని నిరూపించుచున్నట్లు మూలగ్రంథము నాధారముగాగొని తెలిపిరి.

(2) తమ వేదాంతసూత్రభాష్యమందు స్మృతిని ఉదాహరించు పెక్కుపట్టులలో శ్రీ శంకరాచార్యులు మహాభారతమునే ప్రమాణీకరింతురు. గుణముపై వర్ణము ఆధారపడెననుటకు స్పష్టములైన ఋజువులు మహాభారతమందలి భీష్మపర్వమందును, అందలి అజగరోపాఖ్యానమందును, ఉమామహేశ్వరులకథయందును మనకు గోచరించుటవలన, ఈ విషయమును ఆయన తమగ్రంథములలో ఎటనైన తెల్పియున్నారా?

(3) వేదములందలి పురుషసూక్తమున వర్ణము వంశక్రమాగతమైనదని వివరింపలేదు. వంశక్రమాగతమని తెల్పు నిదర్శనములు వేదములందు ఏవేవి?

(4) శూద్రుడు వేదములు చదువరాదనుటకు శ్రీ శంకరాచార్యుడు వేదములనుండి ఎట్టిఋజువును దెలుపలేకపోయెను. శూద్రుడు యజ్ఞ మొనరించుట కర్హుడుకాకపోవుటవలన అతడు ఉపనిషత్తులు మున్నగువానిని పఠించుటకుకూడ అర్హుడుకాడని తెలుపుటకై ఆయన "యజ్ఞేఽనవక్లృప్తః"† అను తైత్తిరీయ సంహితలోని వాక్కు నుదాహరించెను. 'అథ' అను శబ్దమునకు అర్థము 'వేదాధ్యయనము తరువాత' అని కాదనియు, వైదికమంత్రములను బ్రాహ్మణములను పఠింపక ఉపనిషత్తులను పఠింపరాదని తెలుపు ఆధారమేమియు లేదనియు, వైదికకర్మకాండకును వైదికజ్ఞానకాండకును ఆంతరమైన అనుక్రమసంబంధము లేదనియు—'అథాతో బ్రహ్మజిజ్ఞాసా'‡ అను సూత్రమును వ్యాఖ్యానించు

---

శ్రీ శంకరాచార్యుల వ్యాఖ్యానముపిదపకూడ ఈ సూత్రములు సందేహాస్పదములగుటవలన ఈ వ్యక్తులను గురించిన ఉల్లేఖనము వేదములందు మరెందైన గలదా యనుటను స్వామి తెలిసికొనగోరుచున్నారు.

† తైత్తిరీయసంహిత, VII-1-1-6. "యజ్ఞకర్తృత్వము శూద్రునకు లేదు."

‡ వేదాంతసూత్రములు, 1 i-1. 'ఇక నిప్పుడు బ్రహ్మమునుగూర్చిన విచారము'.

నపుడు శ్రీశంకరులు వచించిరి. వేదమందలి కర్మకాండను చదువకయే బ్రహ్మజ్ఞానము నందవచ్చుననుట నిర్వివాదాంశము. కావున కర్మకాండకును జ్ఞానభాగమునకును అనుక్రమసంబంధము లేనపుడు, ఆచార్యులు "అతర్క-ప్రమాణముచేతనే" అను మాటలను చొప్పించి, తామే మునుపు చెప్పినమాటను శూద్రునివిషయమునమాత్రము కాదను టేల? శూద్రుడు ఉపనిషత్తుల నేల చదువరాదు?

మహాశయా, 'ఇమిటేషన్ ఆఫ్ క్రీస్తు' అను గ్రంథమును మీకు మెయిలులో పంపుచున్నాను. ఈ గ్రంథమునకు కర్త ఒక క్రైస్తవసన్న్యాసి. ఇది అద్భుతమైనగ్రంథము. అట్టి వైరాగ్యమును దాస్యభక్తియు క్రైస్తవులందునయిత ముందు వెలిగి ఆశ్చర్యాన్వితుల మయ్యెదము. మీరు ఈగ్రంథము నీవఱలో చదివియే యుందురు. చదివియుండనిచో దయచేసి యిపుడు పఠింతురేని నే నెంతేని సంతోషింతును.

భవదీయుడు
వివేకానంద

## 13

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)
దేవోజయతి

బరానగరము,
ఆగస్టు 17, 1889.

ప్రియమహాశయా,

మిమ్ము గౌరవపూర్వకముగా సంబోధించినందులకు కడచిన జాబులో క్లేశము తెలిపితిరి. అందుకు బాధ్యత నాదికాదని నా మనవి. మీ వరిష్ఠగుణములదే! మీ యుదాత్తగుణములు న న్నాకర్షించువిధము చూడగా, పూర్వభవములందు మీకును నాకును కొంత ఆంతరంగికమైన బాంధవ్యముండియుండుననియు

ఈవఱలో నేను వ్రాసిన ఒకానొకజాబులో తెలిపితిని. ఇందు నేను గృహస్థులకును, సన్న్యాసులకును నడుమ నెట్టి వ్యత్యాస మును పాటింపను. మహత్త్వమును, హృదయవైశాల్యమును, పవిత్రతయు కలవారెల్లరియెడ భక్తితో సదా నేను నతమస్తకుడ నైయుందును. శాంతిః శాంతిః శాంతిః! ఈ కాలమున గౌరవ పిపాసువులై, జీవికకై త్యాగము నభినయించుచు, ఉభయలక్ష్య ములనుండి పడిపోవుచున్న సన్న్యాసులలో లక్షకొక్కడైనను మీవంటి మహాత్ముడుండుగాకని నేను ప్రార్థించుచుందును. నా సోదరశిష్యులు,— మీ యుదారగుణములను వినిన నా సోదర శిష్యులలో, బ్రాహ్మణులు మీకు తమ వరిష్ఠ ప్రణామములను సమర్పించుచున్నారు.

నాప్రశ్నలకు మీరిచ్చిన సమాధానములచే, ఒక విషయ మున నా కుండిన అపోహ తొలగినది. ఇందుకై ఆజన్మము మీకు ఋణపడియుందును. ఆ ప్రశ్నలలో మఱొకటి ఇది: వర్ణము గుణాశ్రితమని మహాభారతాది పురాణములలో చెప్పబడియున్నది కదా. అందుంగూర్చి శ్రీ శంకరాచార్యులు ఏమేని సిద్ధాంతము తల్పిరా? తెల్పియున్నచో అదెందున్నది? ఈదేశములో ప్రచ లితమైన ప్రాచీనాభిప్రాయమునుబట్టి వర్ణము వంశానుగతమైన దనుట నిస్సంశయము. స్పార్టనులలోని దాసులకంటె, అమెరికా లోని నీగ్రోలకంటె అధమముగా ఒక్కొకపుడు శూద్రు లిందు హింసింపబడుచుండిరనుటగూడ నిస్సంశయమే! ఇక నాయభిప్రా యము:— ఈ వర్ణవిషయములో నా కేపక్షముమీదను పక్ష పాతము లేదు. ఏలయన అది సాంఘికనియమమనియు, గుణకర్మ లపై ఆధారపడినదనియు నే నెఱుగుదును. గుణకర్మలను కాదని, వర్ణభేదములకు ఎవ్వరేని మనసున చోటిచ్చిరేని, తీవ్రమైన హానియే దాపురించును. ఈ విషయములలో, గురుకటాక్షము వలన నాకుకొన్ని స్థిరభావములుకలవు. కాని మీయభిప్రాయ ములుకూడ నాకు తెలియవచ్చుచో, నాయాశయములలో కొన్ని

స్థిరపడవచ్చు, కొన్ని దిద్దుపడవచ్చు. తేనెపట్టును కదపినగాని, పెరనుండి మధుకణములెట్లు రాలును? కావున నేను మఱికొన్ని ప్రశ్నలు అడుగుచున్నాను. నే నజ్ఞానినని, బాలకుడనని భావించి, అగ్రహింపక నాప్రశ్నలకు సముచిత సమాధానములిండు.

(1) వేదాంతసూత్రములు తెలుపు ముక్తియు, అవధూత గీత మున్నగు గ్రంథములలో ఉల్లేఖింపబడిన నిర్వాణమును ఒక్కటియేనా?

(2) జగద్వ్యాపార వర్జమ్ అను సూత్రము * ప్రకారము పూర్తి దేవత్వము ఎవ్వరికిని కలుగనప్పుడు 'నిర్వాణము' నకు నిజమైన అర్థమేమి?

(3) పూరీలో సార్వభౌమునితో శ్రీ చైతన్యస్వామి ఇట్లనెనని విందుము: "వ్యాససూత్రములు నాకర్థమగుచున్నవి. అవి ద్వైతసిద్ధాంతమునే ప్రతిపాదించుచున్నవి. కాని వ్యాఖ్యానకర్త వానిని అద్వైతపరములుగ వివరించెను. ఆవివరణము నాకు బోధపడలేదు." ఇది యథార్థమా? శ్రీచైతన్యస్వామికిని శ్రీప్రకాశానందసరస్వతికిని ఈవిషయమునుగుఱించి వాదము జరిగినదనియు, ఈ వాదములో శ్రీచైతన్యస్వామికే విజయము చేకూరెననియు సంప్రదాయము తెలుపుచున్నది. శ్రీ చైతన్యదేవుని భాష్య మొకటి శ్రీప్రకాశానందుని మఠమందున్నట్లు వదంతి.

---

* "జగద్వ్యాపారవర్జం ప్రకరణా ద సన్నిహితత్వాచ్చ" వేదాంత సూత్రము (IV-iv-7). "ప్రకరణమునుబట్టియు అసన్నిహిత్వమునుబట్టియు సృష్టిస్థితిసంహారాత్మకమగు జగద్వ్యాపారము తప్ప". ఆ జగద్వ్యాపారము భగవంతునకుమాత్రమే ఉండును, ముక్తపురుషునికి ఉండదు. అట్లగుచో "నిర్వాణమున జీవుడు దేవునితో నైక్య మొందు" ననుట కర్థ మేమని స్వామి అడుగుచున్నాడు.

ఈ ప్రశ్నలలో పెక్కింట స్వామివేదాంతజ్ఞానము నధిగమించుటకు మునుపటి దశలు వ్యక్తములగుచున్నవని మనము గ్రహింపవలెను.

(4) తంత్రములందు శ్రీశంకరాచార్యుడు ప్రచ్ఛన్న బౌద్ధుడని పేర్కొనబడెను. బౌద్ధమహాయానగ్రంథమైన "ప్రజ్ఞా పారమిత"లో తెల్పబడిన యభిప్రాయములు ఆచార్యులు ప్రతిపాదించిన వేదాంతాభిప్రాయములతో సంపూర్ణముగా సరిపోవుచున్నవి. "మనము బ్రహ్మము అని దేనిని పేర్కొనుచున్నామో అదియే బౌద్ధులు శూన్యమని"రని పంచదశికర్తకూడ తెలుపుచున్నాడు. దీని కంతటికి అర్థమేమి?

(5) వేదాంతసూత్రములందు వేదప్రామాణ్యమున కాధారమేల చూపబడలేదు? ఈశ్వరాస్తిత్వమునకు వేదములు ప్రమాణములని మొదట తెలుపబడినది. మరల వేదములకు ప్రమాణము "అది ఈశ్వరుని నిశ్వసితము" అను వాక్యమని తెలుపబడినది. ఇది (పాశ్చాత్యతర్కశాస్త్రము తెలుపు 'ఆర్గ్యుమెన్ట్ ఇన్ ఎ సర్కిల్' అను) అన్యోన్యాశ్రయ దోషముచే దూషిత మగుటలేదా?

(6) వాదముచే పర్యవసానము నొందలేము. కావున విశ్వాస మవసరమని వేదాంతము కోరుచున్నది. ఇట్లగుచో సాంఖ్యన్యాయదర్శనములందు ఇంచుకంత నెరసు గోచరించినను దానిని నిశితతార్కికవాదశరపరంపరలచే ముంచివేయు టెందుకు? అదియునుగాక ఎవరిని విశ్వసింపవలెను? తనమతమును నిలద్రొక్కవలెనను నున్మాదము ప్రతివానికి నున్నట్లున్నది. సిద్ధమహాపురుషులలో శ్రేష్ఠుడగు కపిలమహామునియే పొరవడెనని వ్యాసు నభిప్రాయమగునేని అంతకంటె ఎక్కువగ వ్యాసుడు పొరవడియుండబోడని యెవ రందురు? కపిలునకు వేదము అర్థము కాలేదా?*

---

* కపిలుడు సిద్ధశ్రేష్ఠుడని భగవద్గీత: X 26 తన వేదాంతసూత్రభాష్యమున (II-i-1) శ్రీ శంకరాచార్యులు వేదకపిలుడును సాంఖ్యకపిలుడును ఒక్కరు కారేమో అనిరి.

(7) "శబ్దము" వేదము (సత్యప్రమాణము) పరమసిద్ధి నందిన మహర్షుల వాక్కే అనుట న్యాయమతము. ఋషులు తాము సర్వజ్ఞులు. సరళములైన ఖగోళసత్యములే వా రెఱుగరని సూర్యసిద్ధాంతానుసారము రుజువైనది? భూమి త్రికోణముగా నున్నదనియు, భూమిని వాసుకి యను పాము మోయుచున్న దనియు, ఇంకను ఇట్టివాని నెన్నిటినో చెప్పిన ఋషుల ప్రతిభ భవసాగరమును దాట మనకు తరణోపాయమని ఎట్లంగీకరింతుము?

(8) తన సృష్టికర్మములో ఈశ్వరుడు సత్కర్మ దుష్కర్మలకు పరతంత్రుడగుచో, ఆయనను ఆరాధించుటవలన మనకు చేకుఱు ప్రయోజనమేమి? నరేశచంద్రుని చక్కని గేయమొకటి ఉన్నది. అం దిట్లు కలదు :

"తమకు భవితవ్య మెవరికిఁ దప్ప దేని
జననిరో దుర్గ నీనామజప మిఁ కేల?"

(9) ఒకటి రెండు ప్రమాణములకును బహుళప్రమాణములకును విరోధమున్నచోట, ఆ బహుళప్రమాణములను త్రోసిరాజనుట నిజముగ అయుక్తమే. కాని చిరకాలముండిన మధుపర్కము* వంటి ఆచారములను "అశ్వమేధము, గోమేధము, సన్న్యాసము, శ్రాద్ధములందు మాంసనివేదనము" ఇత్యాది ఒకటి రెండు ప్రమాణములనుబట్టి ఉపసంహరించుకొనుటేల? వేదములు నిత్యములైయుండ, "ఈ ధర్మసూత్రము ద్వాపరయుగ

* అతిథులకు గోమాంససమ్మిశ్రమగు ఉపహార మర్పించు వేదకాలాచారమునకు మధుపర్క మని పేరు. దానిని నిషేధించు ప్రమాణవాక్యమును స్వామి యిట కొంత భాగ ముదాహరించెను. ఆ పూర్తివాక్యమున కర్థ మిది:- 'అశ్వమేధము, గోమేధము, శ్రాద్ధములందు మాంసనివేదనము, సన్న్యాసము, వంశప్రతిష్ఠకై మృతభర్తృక భర్తృసహోదరుని గూడుట అను ఈ ఆచారములు కలియుగమున నిషిద్ధములు.

మునకు", "ఈ ధర్మసూత్రము కలియుగమునకు" అని ప్రత్యే కించు టేల? ప్రత్యేకించుటకు అర్థమేమి?

(10) వేదములను ప్రసాదించిన భగవంతుడే వానిని రద్దుచేయుటకై బుద్ధుడై అవతరించెను. ఈ రెండు తెఱగుల ఈశ్వరశాసనములలో దేనిని శిరసావహింపవలెను? ఈ రెండిం టిలో ఏది ప్రామాణికముగ నిల్చును? మొదటిదా? తరువాతిదా?

(11) కలియుగములో వేదమంత్రములు నిరర్థకములని తంత్రశాస్త్రము తెలుపుచున్నది. ఈ శివాజ్ఞలలో దేనిని పాలింప వలెను?

(12) దేవుని వాసుదేవ సంకర్షణాది రూపచతుష్టయము నారాధింపరాదని బ్రహ్మసూత్రములలో వ్యాసుడు తెలిపెను. ఆ వ్యాసుడే భాగవతమందు ఆరూపచతుష్టయారాధనమహాఫల ముల విస్తారముగ చెప్పియున్నాడు. ఈ వ్యాసుడు పిచ్చివాడా?

ఇవికాక ఇంకను పెక్కు సంశయములు కలవు. వానిని నా మనమునుండి మీరు దయతో తొలగింతురను ఆశతో వాని నికముందు మీ సమక్షమున నివేదింతును. సమక్షమున కలిసి కొన్నప్పుడే కాని అట్టి ప్రశ్నల నన్నిటిని మీయెదుట నుంచుట శక్యము కాదు, అనుకొన్నంత సంతృప్తియు కలుగదు. కావున మిమ్ము కలసికొన్నప్పుడు నా యీ సంశయములన్నిటిని మీ మ్రోల విన్నవింపవలెనని యున్నాను. ఈ సందర్శనభాగ్యము గురుననుగ్రహమున అచిరకాలములో చేకూరునని ఆశపడు చున్నాను.

సాధనానుష్ఠానమున ఆంతర పరిణతి లేనిదే ఈ విషయము లను గుఱించి కేవలతర్కముచే సరియైన నిర్ణయములకు రాలేమని చెప్పగా వినియున్నాను. కాని ఆరంభదశయందు కొంతమట్టుకైన సంతృప్తి ఆవశ్యకమని తోచుచున్నది.

భవదీయుడు
వివేకానంద

## 14

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

శ్రీ దుర్గాశరణమ్

బాఘ్బజారు,
కలకత్తా,
సెప్టెంబరు 2, 1889.

ప్రియమహాశయా,

దయతో మీరు వ్రాసిన రెండుజాబులును అంది, కొన్ని దినములయినవి. మీలోని భక్తిజ్ఞానముల సమన్వయమునుచూచి పరమప్రీతినొందితిని. వాదములు ఆక్షేపములు మానుకొమ్మని మీరు కావించిన హితబోధ నిజముగ మిక్కిలి సరియైనది. నిజమున కదే మానవుని జీవితలక్ష్యము. "పరమందును అపరమందును ఆత్మను సాక్షాత్కరించుకొన్నవానికి హృదయగ్రంథులు ఛేదిల్లును. సర్వసంశయములును విచ్ఛిన్నములగును. సకలకర్మములును క్షయమొందును."* కాని మాగురుదేవుడు చెప్పుచుండినట్లు నిండుచున్నకుండ గుడగుడమను శబ్దముచేయును గాని, నిండినకుండ నిశ్శబ్దముగా నుండును. నా దశ అదే అని గుర్తింపుడు. రెండు మూడువారములలో మిమ్ము కలసికొన వీలగునేమో అనుకొనుచున్నాను. భగవంతు డీ కోర్కెను తీర్చునుగాక.

భవదీయుడు
వివేకానంద

* ముండకోపనిషత్తు, II-ii-8.

## 15

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)
దేవోజయతి

బాఘ్బజారు,
డిసెంబరు 3, 1889.

ప్రియమహాశయా,

మిమ్ముగూర్చి విని చాలకాలమైనది. మీ మనశ్శరీరపరిస్థితులు బాగున్నవని అనుకొనుచున్నాను. నా సోదరశిష్యులలో ఇరువురు త్వరలోనే వారణాసికి తరల నున్నారు. ఒకనిపేరు రాఖాలు, రెండవవాడు సుబోధు. రాఖాలు మా గురుదేవునకు అత్యంతప్రియుడు. అతడెక్కువగా ఆయన చెంగటనే ఉండెడివాడు. మీకు వీలగుచో కాశిలో నుండగా వారు మకాము చేయుటకై ఏదేని సత్రమువారికి వారినిగూర్చి సిఫారసుచేయుడు. నన్నుగుఱించిన వార్తలెల్ల వారినోట వినగలరు. మీకు నా భక్తి ప్రణామములు.

భవదీయుడు
వివేకానంద

మఱిమాట :—గంగాధరు డిపుడు కైలాసమునకు బయలుదేఱుచున్నాడు. విదేశీయుల గూఢచారి యని సంశయించి, మార్గమధ్యమున టిబెట్టువారు అతనిని చంపదలచిరి. ఇంతలో కొందఱు లామాలు కనికరించి అతనిని విడిపించిరి. ఒక టిబెట్టు వర్తకునిద్వారా ఈ వార్త మాకు తెలిసినది. ల్హాసా కంటబడు వఱకు గంగాధరుని ఉడుకు చల్లాఱదు. వానికి కల్గిన లాభమేమనగా అతని మేని కష్టసహత్వము విశేషాభివృద్ధినందినది. ఏమియు కప్పుకొనకయే అంతగా శ్రమలేక మంచుకొండపై అతడొకరాత్రిని గడపినాడు.

వివేకానంద

## 16

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

దేవోజయతి

బరానగరము,

కలకత్తా,

డిసెంబరు 13, 1889.

ప్రియమహాశయా,

మీ యుత్తరమువలన అన్నివివరములు తెలిసినవి. తరువాత చేరిన రాఖాలు లేఖవలన మీ సమాగమవార్తలు నాకు తెలిసినవి. మీరు రచించిన చిన్నగ్రంథము చేరినది. శక్తి అవినాశ్యము అను సూత్రము (థియరి ఆఫ్ కన్సర్వేషన్ ఆఫ్ ఎనర్జి) కనుగొనినప్పటినుండి యూరపులో ఒకవిధమైన వైజ్ఞానికాద్వైతము వ్యాపించుచు వచ్చినది కాని అదంతయు పరిణామవాదమే. దీనికిని, శంకరుల వివర్తవాదమునకును గల భేదమును మీరు చూపితిరి, మేలే. జర్మను అతీతవాదుల (ట్రాన్సెండెంటలిస్ట్స్) ను గేలిసేయుచు స్పెన్సరు చేసిన వ్యంగ్యరచనను మీ రుదాహరించితిరి. అది నేను ఆమోదింపలేకున్నాను. వారు పెట్టిన బిచ్చములమీద పెరిగినవాడే స్పెన్సరు. మీ ప్రతిద్వంద్వి గా తన 'హెగెలు'ను సరిగా అర్థముచేసికొనగలుగుచున్నాడా అనునది సందేహాస్పదము. ఏదెట్లున్నను, మీ సమాధానము సూటిగా, ఘాటుగా ఉన్నది.

భవదీయుడు

వివేకానంద

## 17

(శ్రీ బలరామ్బోసుకు)

ఓ౦ శ్రీరామకృష్ణ

వైద్యనాథము,
డిసెంబరు 25, 1889.

ప్రియమహాశయా,

కడచిన కొన్ని దినములుగా నేను వైద్యనాథములో పూర్ణ బాబుగృహములో నున్నాను. ఇచ్చట చలి అంతగాలేదు. నా ఆరోగ్యముకూడ సరిగాలేదు. ఇచ్చటి నీటిలో 'ఇనుము' అధిక ముగా నుండుటవలన కాబోలు అజీర్ణవ్యాధిచే బాధపడు చున్నాను. ఈచోటు, ఈఋతువు, ఇక్కడి సావాసులు—ఇం దేదియు నాకు నచ్చలేదు. రేపు నేనిందుండి వారణాసికి పోవు దును. దేవగడములో అచ్యుతానందుడు గోవిందచౌధురియింట ఆగినాడు. మావార్త అందగానే తనయింట మేమతిథులుగ నుండవలెనని అక్కఱతో చౌధురి పట్టుపట్టినాడు. తుదకొకసారి మమ్ములను మరల గలసికొని తన వేడికోలును చెల్లించునట్లు నిక్కచ్చిచేసెను. అతడు గొప్పకర్మవీరుడు. అతని వెంబడి నెంద ఱెందఱో ఆడువా రుందురు. వారిలో చాలమంది వృద్ధస్త్రీలు, సాధారణవైష్ణవసంప్రదాయము వారు.......అతని గుమాస్తాలకు కూడ మాపై ఆదరము మెండు. వారిలో కొందఱికి యజ మానిపై అమితమైనద్వేషము. అతడుచేసిన చెడుపనులను వారు చెప్పినారు. సందర్భవశమున — గుఱించిన విషయము కదిపితిని. ఆమెనుగుఱించి మీ కెన్నెన్నో అపోహలు, సంశయము లున్నవి. కాబట్టి ప్రత్యేకముగా విచారించి నే నీ యుదంతమును మీకు వ్రాయుచున్నాను. ఈ కార్యస్థానములోని వృద్ధులైన గుమాస్తా లకుసయితము ఆమెయెడ విశేషగౌరవాదరములు.—గారియొద్దకు ఆమె పసిప్రాయములోనేచేరుకొని అప్పటినుండి ఆయనకు భార్యగా మన్నది....ఆమెశీలము నిర్దుష్టమైనదని ఎల్లరు ఏకగ్రీవముగా అంగీ

కరించుచున్నారు. ఆమె పాతివ్రత్యమునకు వెలితి ఎన్నడును లేదు. భార్య భర్తతో మెలగినరీతిలోనే కాక ...... గారితో ఆమె వేఱురీతిని మెలగియుండలేదు. అఖండపతిభక్తిగలదామె. నైతికకళంకము పాటెలుటకు అవకాశము బొత్తిగాలేని పసిప్రాయముననే ఆమె వచ్చెను. —— గారిని వీడియేగినపిదప ఆమె ఆయన కొకలేఖ వ్రాసెను. తానాయనపట్ల పత్ని మెలగినట్లు మెలగెనే కాని వేఱొకరీతి మెలగలేదనియు, వ్యభిచరణశీలునితో కూడి మనుట తనకు అశక్యమనియు ఆమె ఆజాబులో తెల్పెను. ఆయన యొద్దనుండు ఉద్యోగులలో పెద్దవారి నమ్మకములో సైతము అతడు పైశాచవర్తనుడే. వారియభిప్రాయములో —— దివ్యవనిత. ఆమె వీడిపోయినపిదపనే —— గారు బొత్తిగా సిగ్గులేని వారుగ తయారైరని వారందురు.

ఆమె పూర్వజీవితము గుఱించి చెప్పుకొనబడుచుండిన కథలలో నాకు మొదట నమ్మకములేదు. కావుననే దీనినంతయు మీకు వ్రాయుచున్నాను. సంఘము ఆమోదింపని చుట్టఱికములో అంత పవిత్రతయుండవచ్చునని విన్నప్పుడు అది వింత కట్టుకథ అని నేననుకొనెడివాడను. కాని క్షుణ్ణముగ విచారింపగా అదంతయు సరియే అని తెలియవచ్చినది. ఆమె పరమపవిత్రురాలు, పసితనమునుండియే పరమపవిత్రురాలు—అందునుగూర్చి ఆవంతైన సంశయము నాకులేదు. ఆమెనుగుఱించి ఆ రీతిగా సంశయించుటచే, మీరును నేనును అందఱమును ఆమెయెడల అపచారము చేసినవారమే. ఆమెకు పునఃపునః నమస్కరించుచున్నాను. నా దోషమును మన్నింపుమని ఆమెను ప్రార్థించుచున్నాను. ఆమె కల్లరి కాదు.

పతితయు అసత్యపరయునగు మహిళ కంతటి ధైర్యముండుట అసంభవమని తెల్పుటకు ఈ అవకాశమును వినియోగించుకొనుచున్నాను. ఆధ్యాత్మికధర్మమందును ఆమెకు సదా దృఢవిశ్వాసమున్నదట.

మఱి మీవ్యాధి ఇంకను తగ్గుమొగము కాలేదే! వెచ్చించుట కెంతో ధనమున్న నేకాని ఇది రోగులుండుటకు తగిన తావు కాదని నాయభిప్రాయము, ఏదైన వివేకపథమును ఆలోచింపుడు. ఇక్కడ ప్రతివస్తువును వేఱుచోటునుండి తెచ్చుకోవలసినదే.

మనఃపూర్వకముగ భవదీయుడు
వివేకానంద

## 18

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

దేవోజయతి

వైద్యనాథము,
డిసెంబరు 26, 1889.

ప్రియమహాశయా,

సుదీర్ఘకాలము ప్రయత్నించి ఈనాటికి మీ సమక్షమున వ్రాలగల్గుచున్నాను. ఒకటి రెండు దినములలో పవిత్ర కాశీ క్షేత్రములో మీచరణసన్నిధికివచ్చి చేరుకొందును.

కొన్నాళ్లుగా నే నిచట ఒక కలకత్తాపౌరమహాశయునింట నున్నాను. కాని నామనస్సు వారణాసికై ఎంతయు తహతహపడు చున్నది.

అక్కడ కొన్నాళ్లుండి, అన్నపూర్ణావిశ్వనాథులు* నా యదృష్టరేఖ నెట్లు దిద్దుదురో చూడవలెనని యున్నది. "దేహమునైన విడువవలెను. మంత్రమునైన సాధింపవలెను."† ఇది నాసంకల్పము—కాశీనాథుడు నాకు తోడ్పడుగాక!

భవదీయుడు
వివేకానంద

---

* వారణాసిలో వెలసిన పార్వతీ పరమేశులు.

† "శరీరం వా పాతయామి మంత్రం వా సాధయామి."

## 19

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

అలహాబాదు,
డిసెంబరు 30, 1889.

ప్రియమహాశయా,

ఒకటిరెండు దినములలో వారణాసికి వచ్చుచున్నానని ఒకజాబులో మీకు వ్రాసియుంటిని. కాని విధినిర్ణయము నెవ్వరు మార్పగలరు? చిత్రకూటము ఓంకారనాథము మున్నగుక్షేత్రములకు తీర్థయాత్రచేసి ఇచటికి వచ్చిన యోగిను అను సోదర శిష్యునకు మశూచివ్యాధి పైకొనినదనెడివార్త అందినది. కావున అతనికి ఉపచరించుటకై నేనిచటికి వచ్చియున్నాను. ఇపుడతడు పూర్తిగా స్వస్థుడైయున్నాడు. ఇచట నున్న కొందఱు బంగాలీ మహాశయులు, ఎంతయు భక్త్యనురాగ భరితులుగనున్నారు. వారు చాల ప్రేమతో నన్ను విచారించుకొనుచున్నారు. ఈ మాఘమాసమున ఇక్కడనే ఉండి కల్పవిధి* ననుష్ఠింపుమని, నేను నిరాకరింపరాని రీతిలో వారు నన్ను కోరుచున్నారు. కాని నా మనస్సులో 'కాశి' 'కాశి' 'కాశి' యని కాశినామమే ఆవృత్తమగుచున్నది. మిమ్ము దర్శించుటకు నా మనస్సువ్విళ్ళూఱుచున్నది. ఔను, వీరి వేడికోళ్ళను తప్పించుకొని, వీరి పట్టునుండి తప్పించుకొని ఒకటి రెండు దినాలలో కాశీనాథుని పవిత్రక్షేత్రమునకు వచ్చి చేరిపోవలెనని నాచేతనైనంత ప్రయత్నింపబోవుచున్నాను. నాసోదరశిష్యులలో ఒకడు అచ్యుతానందసరస్వతి అను సన్న్యాసి మిమ్ము దర్శించి నన్నుగూర్చి అడుగునేని నేను త్వరలో కాశికి వచ్చుచున్నానని దయచేసి ఆయనకు తెలుపుడు. అతడు చాల మంచివాడు; విద్వాంసుడును. అతనిని బంకిపూరులో విడిచి రావలసివచ్చినది. రాఖాలును, సుబోధును .ఇంకను కాశీలో

---

* పవిత్ర త్రివేణీ సంగమమందు విశేషదీక్షతో నిర్వహింపబడు స్నానము.

నున్నారా? ఈసంవత్సరము కుంభమేళ మహోత్సవము హరిద్వారములో జరుగునో జరుగదో విచారించి దయతో నాకు తెలుపుడు.

ఎందఱినో వివేకులను, ఎందఱినో భక్తులను, ఎందఱినో సాధువులను, ఎందఱినో పండితులను ఎన్నిచోట్లలోనో కలిసికొనియున్నాను. వారు నన్నెంతో అనుగ్రహించియున్నారు. కాని 'భిన్నరుచిర్హిలోకః' 'తలకొక్క రుచి కాదె ధరణి నరులకు'† మన యిద్దఱి ఆత్మల కున్న చుట్టఱిక మేమో నే నెఱుగను. మీ సన్నిధానమున నాకు గలుగు ప్రీతిసంతుష్టులు వేఱెచ్చటను గలుగవు. కాశీనాథు డేమిచేయనున్నాడో చూతము.

భవదీయుడు
వివేకానంద

నా విలాసము—శ్రీ గోవిందచంద్రబాబుగారింట, చౌకు, అలహాబాదు.

## 20

(శ్రీ బల్రాముకు)

జై శ్రీరామకృష్ణ

అలహాబాదు,
డిసెంబరు 30, 1889.

ప్రియమహాశయా,

వచ్చునప్పుడు గుప్త ఒకచీటి వ్రాసిపెట్టెను. మఱునాడు యోగానందునొద్దనుండి వచ్చిన జాబుచే అన్నిసంగతులును తెలిసినవి. వెంటనే నేను అలహాబాదుకు పయనమైతిని. మఱునా డిందు చేరితిని. చేరిచూడగా యోగానందుడు పూర్తిగా తేఱుకొనియుండెను. అతనికి వచ్చియుండినది తట్టమ్మవారు. ఒకటి రెండు మశూచికపు పొక్కులుకూడ నున్నవి. వైద్యుడు మహోదారుడు. ఇచట నొక

† కాళిదాసు "రఘువంశము".

సోదరబృందము గలదు. అందున్నవా రందఱు మహాభక్తులు; సాధుసంసేవనమనిన చెవిగోసికొనువారు. మాఘమాసమున నిక్కడ నుండుమని వారు ప్రత్యేకముగ నన్ను కోరుచున్నారు. కాని నేనేమో వారణాసికి కదలిపోవుచున్నాను. మీరెట్లున్నారు? మీకును, మీకుటుంబమునకును క్షేమముగూర్ప ఈశ్వరుని ప్రార్థించుచున్నాను. తులసీరాము, చునీబాబుగార్లకును ఇతరులకును నా వందనములు దయచేసి అందింపుడు.

అనురాగపూర్ణ భవదీయ
వివేకానంద

## 21

(శ్రీ యజ్ఞేశ్వరభట్టాచార్యకు)

ఆలహాబాదు,
జనవరి 5, 1890.

ప్రియ ఫకీరుకు,

... నీ కొకమాట. నేను నిన్ను మరల చూచుట సమకూడకపోవచ్చు అను విషయమును సదా జ్ఞప్తియుంచుకొనుము. నీతిమంతుడవై యుండుము. ధైర్యశాలివై యుండుము. పూర్ణహృదయుడవై యుండుము. నైతికపథమున అస్ఖలితుడవుగ నుండుము. తెంపరితన మనిపించుకొనునంత ధైర్యము గల్గియుండుము. మతసిద్ధాంతములతో నీబుఱ్ఱను బరువెక్కించుకొనకుము. పాపమును భీరువులు చేయుదురే కాని ధీరులు చేయనేచేయరు, మనసులో తలంపనైన తలంపరు. ఎట్టివాడైనను ప్రతియొక్కనిని ప్రేమింపుము. మానవుడవుగ మెలగుము, నీ సొంత పర్యవేక్షణలోనున్న వారిని — అనగా రాముని, కృష్ణమయిని, ఇందును — ధైర్యవంతులుగాను, నీతిమంతులుగాను, సానుక్రోశులుగాను చేయ ప్రయత్నింపుము. నాబిడ్డలైన మీకు నీతిపరత్వమును, ధైర్యమునుతప్ప — వేఱు మత మక్కఱలేదు. పిఱికితనము లేనిచో,

పాపములేనిచో, అపరాధములేనిచో, దుర్బలతలేనిచో,—తక్కిన దెల్ల తనంతట అదే వచ్చును....నాటకమునుజూచుటకుగాని, దౌర్బల్యావహమగు నెట్టివినోదమును జూచుటకుగాని నీవెన్నడును రామును నీతో దీసికొనిపోకుము — ఎన్నడైనగాని వానిదాపున కాతనిని పోనీయకుము.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 22

(రామూదులకు)

అలహాబాదు,
జనవరి 5, 1890.

ప్రియ రామ-కృష్ణమయి-ఇందులకు,

బిడ్డలారా, పాపముచేయుటయు అసత్యములుచెప్పుటయు పిఱికిపందల, దుర్బలుల—పనులని జ్ఞప్తినుంచుకొనుడు. నీతిమంతులుగనుండ ప్రయత్నింపుడు, ధైర్యవంతులుగనుండ ప్రయత్నింపుడు, దయామయులుగనుండ ప్రయత్నింపుడు.

భవదీయ
వివేకానంద

## 23

(శ్రీ బల్రామ్బోసుకు)

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ.

అలహాబాదు,
జనవరి 5, 1890.

ప్రియమహాశయా,

దయతో మీరు వ్రాసిన లేఖలో మీ అనారోగ్యవార్త కని మిగుల చింతిలుచున్నాను. మీరు వైద్యనాథమునకు పోయి

అచట నుండుటనుగూర్చి నేను వ్రాసిన జాబులోని సారాంశమిది: పైకమును చిల్లిగవ్వలుగా వెదజల్లుచుండకున్న మీవంటి దుర్బల సుకుమారశరీరుల కచట జీవితము గడచుట అసాధ్యము. చోటు మార్పు మీకు నిజముగా ఆవశ్యకమైనచో, చౌకగానుండు చోటును నిర్ణయించుకొనుటకే మీ రింతకాలము ఆలసించియుంటి రేని, ఇది శోచనీయమే. ... వాతావరణము మట్టుకు వైద్య నాథము శ్రేష్ఠమైనదే! కాని అచటి నీరు మంచిదికాదు. అది జీర్ణశక్తిని చెఱచును. నేను ప్రతిదినమును అజీర్ణముతో బాధపడు చుండెడివాడను. మీ కీవఱలో ఒకజాబు వ్రాసియుంటిని. అది మీకందినదా? ఒకవేళ అది బిళ్ల అంటింపని జాబగుటచే దానిగతికి దానిని వదలితిరా? చోటుమార్పు మీకు అనివార్యమే అగుచో, ఎంత త్వరగా మాఱిన అంత మేలని నా అభిప్రాయము. ప్రతిదియు మీ అక్కఱలకు సరిపడునదిగా నుండవలెనని కోరు స్వభావము మీది. ఇట్లు వ్రాసినందులకు మన్నింతురుగాక! కాని ఈ ప్రపంచమున అట్టి పరిస్థితి చాల దుర్లభము. "ఆత్మానం సతతం రక్షేత్" "సర్వావస్థలందును తన్ను తానే కాపాడుకొనవలెను." "దేవుడా, కనికరింపు" అని ప్రార్థించుట మేలే! కాని పురుష ప్రయత్నము చేయువానికే పరమపురుషుడు తోడ్పడును. మీ ధనమును ఖర్చుపడనీయకుండుటకే మీరు ప్రయత్నింతురేని, మీ చోటుమార్పును దేవుడు తనపైతృకధనమును వెచ్చించి సమకూర్చునా? దేవునిపై అంతగా ఆధారపడియుండగలమనుటే మీ తలంపైనచో, దయచేసి వైద్యుని పిలువకుండుడు. ... అది మీకు సరిపడకున్న, మీరు కాశీకి పోవలెను. నేనిక్కడినుండి ఈపాటికి వెడలిపోయియుందును. కాని ఇచటివారు నన్ను పోనిచ్చుటలేదు. మరల చెప్పుచున్నాను—చోటుమార్పుటే నిశ్చితమైనచో, లోభముచే ఆలసింపకుడు. ఇట్లొనరించిన ఆత్మహత్యయే యగును. తన్నుదాను చంపుకొనువానిని దేవుడైనను సంరక్షింప

లేదు. తులసీబాబుగారికిని, తక్కినవారికిని నా వందనము లందింపుడు.

సాదరముగ ఇట్లు విజ్ఞాపించు

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 24

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

దేవోజయతి

బాబుసతీశచంద్రముఖర్జీగారింట,
గోరాబజారు, ఘాజీపూరు,
జనవరి 21, 1890.

ప్రియమహాశయా,

నేను ఘాజీపూరు చేరి * మూడుదినములైనవి. నా బాల్య మిత్రుడైన శ్రీసతీశచంద్రముఖర్జీ గృహములో నున్నాను. ఈ ప్రదేశము మనోహరముగానున్నది. సమీపముననే గంగానది ప్రవహించుచున్నది. కాని అందు స్నానమొనరించుట కష్ట సాధ్యము. ఏలయన దానికి సరియైన దారిలేదు. ఇసుకలో నడచి పోవలెను. అది చాల కష్టము. నా మిత్రుని తండ్రియు ఉదార హృదయుడునగు ఈశానచంద్రముఖర్జీగారినిగూర్చి మీకు చెప్పి యుంటినికదా, ఆయన ఇట నున్నాడు. ఈనాడాయన కాశికి తరలుచున్నాడు. అందుండి కలకత్తాకు పోగలరు. కాశికి పోవలె నని నాకెంతో ఆశగ నున్నది. కాని బాబాజీని* సందర్శింపవలె నని నేనిచటికి వచ్చిన ఉద్దేశ మింకను సిద్ధింపలేదు. కావున మఱి కొన్నిదినముల ఆలస్యము అనివార్యమగుచున్నది. ఇచట

* మహాయోగియైన పవహారిబాబా.

చూచుట కంతయు బాగున్నది. ఇచటివారందఱు పెద్దమనుష్యులు, కాని మిక్కిలి పాశ్చాత్యీకృతులుగ నున్నారు. అనుశోచనీయవిషయమిది :—పాశ్చాత్యరీతుల అనుకరణము ప్రతిదియు నాకు పరమదుస్సహము. ఇచట అట్టి అనుకరణములేనివాడు నా మిత్రుడొక్కడే. ఐనను ఈ విదేశీయులు ఇచ్చటికి ఎట్టివ్యర్థమైన నాగరకతను తెచ్చిపెట్టిరి! ఎంతటి ఐహికవ్యామోహమును వారు సృజించిరి! దుర్బలహృదయులైన వీరిని విశ్వనాథుడు సంరక్షించుగాక! బాబాజీసందర్శనమైనపిదప, అన్నివివరములు మీకు తెలిపెదను.

భవదీయుడు
వివేకానంద

మఱిమాట : ఔరా మనవిధి వైపరీత్యము! శ్రీశుకభగవానుని కనిన యీ దేశమున నిప్పుడు సన్న్యాసము 'వెఱ్ఱి' అని, 'పాప'మని నిరాదరమున కగ్గమగుచున్నది.

## 25

(శ్రీ బల్రామ్బోసుకు)

జై శ్రీరామకృష్ణ

ఘాజీపూరు,
జనవరి 30, 1890.

మాన్యమహాశయా,

ఘాజీపూరులో నే నిప్పుడు సతీశబాబుగారింట నున్నాను. నే నిటీవల చూచిన తావులలో అన్నిటికంటె ఈ ప్రదేశమే ఉత్తమము. వైద్యనాథములోని నీరు చాల అనారోగ్యకరము, అజీర్ణమును కలిగించును. అలహాబాదులో ఇఱుకట మెక్కువ. నేను కాశీలోనున్న కొన్నిదినములలో రేయింబవళ్లు జ్వరపీడితుడనై యుంటిని. మన్నిజ్వర మచ్చట అంత ఎక్కువ. ఘాజీపూరు, అందును ముఖ్యముగ నేనున్న ప్రాంతము, మిక్కిలి ఆరోగ్యకర

ముగ నున్నది. నేను పవహారిబాబా గృహమును జూచితిని— అన్నిప్రక్కల ఎత్తైన గోడలున్నవి. ఇంగ్లీషువారి బంగళాలపద్ధతిలో అది నిర్మింపబడియున్నది. లోపలిభాగమున తోట కలదు. పెద్ద గదులు, పొగగొట్టములు మున్నగునవి ఉన్నవి. లోపలికి వచ్చుటకు బాబాజీ ఎవ్వరిని అనుమతింపడు. ఆయనకు మనసుపుట్టి నప్పుడు, ఆయనే వాకిలివఱకువచ్చి తాను గుమ్మములోపల నుండియే మాటాడును—అంతే! ఒకనాడు నే నచటికిపోయి, చలిలో ఎంతోసేపు వేచివేచి తిరిగిరావలసివచ్చెను. — రాబోవు ఆదివారమునాడు నేను కాశికి పోయెదను. ఈలోగా బాబాజీతో సమాగమము నాకు లభించినయెడల సరే, లేకున్న ఆ మహాత్మునకు స్వస్తిచెప్పెదను. ప్రమదాబాబుగా రుండుచోటునుగుఱించి వారణాశినుండి నిష్కర్షగా వ్రాసెదను. కాళీభట్టాచార్యుడు రావలెననియే నిశ్చయించుకొనియున్నచో, నేను ఆదివారము నాడు కాశికి పయనమైనపిదప రానిండు, కాని ఆయన రాకుండుటే మేలు. వారణాశిలో కొన్నిదినములుండి నేను హృషీకేశమునకు తరలెదను. ప్రమదాబాబు నాతో రావచ్చు. మీకందఱకు నా వందనములు. ఫకీరు, రాము, కృష్ణమయి మున్నగువారికి నా యాశీస్సులు.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

మఱిమాట :—ఘాజీపూరుకువచ్చి కొంతకాలముందురేని మీకు చాల మేలుగల్గునని నా యభిప్రాయము. ఇచ్చట సతీశుడు మీకొక బంగళా సంపాదించిపెట్టగలడు. గగనచంద్రరాయి అను నొకడున్నాడు. అతడు నల్లమందు కార్యాలయమున నధికారి. చాల సరసుడు, ఉపకారపరుడు, కలుపుగోలుతనమున్నవాడు. అన్ని యేర్పాట్లను వారు వేయుదురు. ఇంటియద్దె పదునైదుకు ఇరువదికి నడుమ ఉండును. బియ్యపుధర అధికము! పాలు

రూపాయికి పదునాఱు మొదలు ఇరువదిసేర్లవఱకు లభించును. తక్కినవస్తువులన్నియు చాల చౌక. అంతేకాక ఈ మహాశయుల విచారణలో ఎట్టి యిక్కట్టు కల్గుటకును అవకాశములేదు. కాని ఇంచుక వ్యయమగును. నలుబదేబదిరూకలు ఖర్చుకావచ్చు. వారణాశిలో మన్నెజ్వరము విపరీతముగనున్నది. నే నెప్పుడును ప్రమదాబాబు తోటలో నుండనేలేదు. నే నెల్లప్పుడు తనగోష్ఠిలో నుండుట ఆయనకు ప్రియము. తోట చాల సొంపుగ నున్నది, సమృద్ధిగల్గియున్నది, విశాలముగనున్నది, తెఱవబడియేయున్నది. ఈ పర్యాయము పోయినపుడు, ఆ యారామమందే ఉందును, ఉండి మీకు తెల్పెదను.

## 26

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

ఈశ్వరకృపాజయతి

ఘాజీపూరు,
జనవరి 31, 1890.

ప్రియమహాశయా,

బాబాజీని కలసికొనుట చాల కష్టముగ నున్నది. ఆయన తనగృహమునుండి వెలికి అడు గిడడు. మాటాడుద మను కోరిక ఆయనకు కలిగినపుడు వాకిలివఱకు వచ్చి గుమ్మములోపలినుండియే మాటాడును. ఆయన ఆరామభవనమును మాత్రము చూచి వచ్చితిని. అందు పైకి పోను పోను సన్నగ నుండు పొగగొట్టము లమరి యున్నవి. చుట్టును ఎత్తైన గోడ లున్నవి. లోనికిరానిచ్చు దారులు లేవు. లోపల గుహలవంటి గదు లున్నవనియు, ఆయన అం దుండు ననియు, లోనికి తొంగిచూచినవారు వే రెవ్వరును లే రనియు, ఆయన చేయు పనులకు ఆయనే సాక్షి యనియు — జనులు చెప్పుదురు. ఒకనాడు వేచియుండి వేచియుండి ప్రాణము విసిగి మరలి వచ్చివేసితిని. కాని అవకాశమునకై మరల నిరీక్షిం

తును. భానువారమునాడు నేను కాశీక్షేత్రమునకు తరలుదును, బాబాజీని సందర్శించు నా ఉబలాట మేమో మందగించినది. కాని ఇచ్చటి బాబులు నన్ను వదలరు. వెడలిపోవుటకు ఈదిన మైనను నేను సిద్ధమే. కాని భానువారమునాడే తరలెదను. హృషీకేశమునకు పోవలె నను మీాపన్నాగ మే మైనది?

భవదీయుడు
వివేకానంద

మలి మాట: ఈ చోటు ఆరోగ్యకరముగ కనిపించు చున్నది. అదొక్కటే ఇం దున్న మేలు.

## 27

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

జై విశ్వేశ్వర

ఘాజీపూరు,
ఫిబ్రవరి 4, 1890.

ప్రియమహాశయా,

దయతో మీారు వ్రాసిన జాబు చేరినది. నామహాభాగ్యము పండి బాబాజీతో సమాగమము నొంద గాంచితిని. నిజముగ ఆయన మహర్షి! అంతయు అద్భుతావహముగ నున్నది. ఈ నాస్తికయుగమున ఆయన భక్తియోగసంజాతమైన మహోన్నతాద్భుతశక్తికి లక్ష్యము. ఆయన అనుగ్రహమును నే నాశ్రయించితిని. ఆయన నాకు ఆసపాటును ప్రసాదించెను. ఏ అత్యల్పసంఖ్యాకులకో లభించు భాగ్య మది! నేను కొన్నాళ్లిచట నుండవలె ననియు నాకు తాను కొంత శ్రేయము నొనగూర్తు ననియు బాబాజీ కోరెను. కావున ఆయోగీంద్రునాజ్ఞానుసారము నేను మఱి కొంతకాల మిట నుందును. ఇది మీాకును అత్యంతప్రీతికర మగు ననుటకు సందియము లేదు. జాబులో వ్రాయను గాని,

వింతవిషయము లున్నవి. కలసికొన్నప్పుడు సమక్షమున తెల్పుదును. అట్టివారిజీవితములను ప్రత్యక్షముగ చూడ కున్న శాస్త్రవిశ్వాస మఖండరీతిని వర్ధిల్ల జాలదు.

భవదీయుడు
వివేకానంద

## 28

(శ్రీ ప్రమదాదాసమిత్రమ)

జై శ్రీవిశ్వేశ్వర

ఘాజీపూరు,
ఫిబ్రవరి 7, 1890.

ప్రియమహాశయా,

ఇప్పుడే మీవార్త అంది చాల ఆనందించితిని. వెలికగపడు లక్షణములను బట్టి చూడ బాబాజీ వైష్ణవుడు, యోగమునకును భక్తికిని వినయమునకును మూర్తీభావము. ఆయన ఇంటికి నలువైపుల గోడ లున్నవి. కొన్ని తలుపు లున్నవి. ఈ గోడలకు నడుమ సుదీర్ఘమైన యొక భూగర్భబిల మున్నది. ఆబిలమున తన మేనిని వ్రాల్చుకొని ఆయన సమాధి నిమగ్నుడగును. బిలమునుండి వెలికి వచ్చినప్పుడుమాత్రమే ఆయన ఇతరులతో మాటాడును. ఏమి భుజించునో ఎవరు నెఱుగరు. కావున ఆయనను పవ్హారీ (=పవనాహారి) బాబా అని ప్రజలు పేర్కొందురు. ఒకప్పు డైదేండ్లకాలము వెలుపలికి రాక ఆయన బిలమందే యుండెను. మహాసమాధి నొందినా డని ప్రజ లనుకొనిరి. కాని ఇప్పుడు ఆయన మరల వెలుపల నున్నాడు. ఇప్పుడాయన ప్రజల యెదుటికి వచ్చుట లేదు. గుమ్మమునకు లోపలనుండియే మాటాడును. అంతటి మధురమైన వాణిని నేను విని యుండనే లేదు. ప్రశ్నలకు సూటిగా జవాబు చెప్పక ఆయన "ఈ దాసున కేమి

తెలియు'' ననును, కాని సంభాషణ సాగుకొలది వెలుగు వెలువడును. ప్రశ్న లడిగి నే నాయన నెంతో ఒత్తిడిచేయగా ఆయన నాతో ''కొన్నాళ్లిచ్చటనుండి న న్ననుగ్రహింపు'' డనెను. ఈ విధముగ ఆయన ఎప్పుడును మాటాడడు. కావున ఇందునుబట్టి నాసంశయముల తీర్త మనెడి ఆయన యుద్దేశమును నేను గ్రహించితిని. నే నడిగినప్పు డెల్ల ఆయన నన్ను ఉండు మనుచున్నాడు. కావున ఆశతో వేచియున్నాను. ఆయన పండితు డనుటకు సందియము లేదు. కాని పాండిత్యపుజాడ బయటికగపడదు. ఆయన వేదోక్తక్రతువులను చేయును. పున్నమనుండి అమావాస్యవఱకు యజ్ఞాహుతులు సాగుచునే యుండును. కావున ఈపక్షము ముగియులోగా బిలములోనికి పో డనుట నిశ్చయము. ''దాసుడను'' ''నాభాగ్యము'' అను ఇట్టి మాటలను ఏకరువుపెట్టుచుండునే గాని ఆయన సూటిజవాబులు చెప్పడే, ఆయన *అనుమతిని పడయుటెట్లు! సొంతమునకు మీ కుద్దేశ మున్నచో ఈజాబును చూచిన తక్షణమే బయలుదేఱి రండి. రాకపోయిన, ఆయన మహాసమాధినొందినపిమ్మట తీవ్రపశ్చాత్తాపము మీ మనస్సులో నిలిచిపోవలసివచ్చును. సమాగమము పడసిన వెంటనే, అనగా ఒకసారి ఏకాంతముగ మాటాడినవెంటనే రెండు దినాలలో మీరు తిరిగి పోవచ్చు. నామిత్రుడు సతీశచంద్రబాబు మిమ్ము చాల ప్రీతితో ఆదరించును. కాబట్టి ఈ జాబును చూచిన వెంటనే రండి. ఇంతలో నేను బాబాజీకి మీ విషయమును చెప్పిపెట్టెదను.

భవదీయుడు
వివేకానంద

మఱిమాట: ఆయనతోడి సాహచర్యము దుర్లభమైనను అట్టి మహాత్మునకై పడ్డ శ్రమ ఎన్నటికిని వ్యర్థము కాదు.

---

* బాబాజీని దర్శించుటకు ప్రమదాదాసమిత్రుని అనుమతి.

## 29

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

ఈశ్వరకృపాజయతి

ఘాజీపూరు,
ఫిబ్రవరి 13, 1890.

ప్రియమహాశయా,

మీ అస్వాస్థ్యమును విని వ్యథపడుచున్నాను. నాకును నడుములో ఒకవిధమైన నొప్పి యున్నది. అది హెచ్చి ఇటీవల చాల బాధపెట్టుచున్నది. రెండు దినాలవఱకు బాబాజీయొద్దకు పోలేకుంటిని. నాసంగతిని తెలిసికొని పోవుటకు బాబాజీయొద్ద నుండి యొకడు వచ్చెను. కావున ఈదినము పోవుచున్నాను. లెక్కకు మిక్కిలియైన మీ ప్రణామములను నే నందింతును. "వెలుగు వెలువడును" అనగా అద్భుతగురుభక్తివైరాగ్యములు ప్రకాశించును. అంతటి మహాద్భుతక్షాంతివినయములను నేను వే ఱెడల కన్నది లేదు. ఏ మేలు నాకు లభించినను అందు మీ భాగము మీకు తప్పక చెందును. నమ్ముడు.

భవదీయుడు.
వివేకానంద

## 30

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

ఈశ్వరకృపాజయతి

ఘాజీపూరు,
ఫిబ్రవరి 14, 1890.

ప్రియమహాశయా,

సోదరుడు శరత్తు వ్రాసిన జాబును పంపు డని నిన్నటి నాజాబులో వ్రాయ మఱచితినేమో. దయచేసి దానిని పంపుడు. సోదరగంగాధరునినుండి వార్త తెలియవచ్చినది. అత డిప్పుడు

కాశ్మీరములో శ్రీనగరమున రామ్బాగ్‌సమాధియొద్ద నున్నాడు. నడుమునొప్పి నాకు చాల బాధ కలిగించుచున్నది.

భవదీయుడు
వివేకానంద

మలి మాట : రాఖాలును, సుబోధును ఓంకార్, గిరినార్, ఆబూ, బొంబాయి, ద్వారక అను ప్రదేశములను చూచుకొని బృందావనమునకు వచ్చియున్నారు.

## 31

(శ్రీబలరామ్బోసుకు)

నమో భగవతే శ్రీరామకృష్ణాయ

సతీశచంద్రముఖర్జి గారింట,
గోరాబజార్, ఘాజీపూరు,
ఫిబ్రవరి 14, 1890.

మాన్యమహాశయా,

పశ్చాత్తాపముతోనిండిన మీ లేఖ అందినది. వెంటనే నేనిందుండి వెడలిపోవుటలేదు. బాబాజీ వేడికోలును తప్పించుకొనుట అసాధ్యము. సాధుసేవవలన చెప్పుకోదగిన ఫలమేమియు కలుగలేదను చింతను తెలిపితిరి. ఇది సత్యమును, సత్యేతరమును కూడ. ఆదర్శానందమును లక్ష్యముగాకొన్న, మీరనినది సత్యమే! కాని దృష్టిని వెనుకకుమరల్చి ఆరంభదశనుండిపరికించితిరేని మొదట మీరొక జంతువై యుంటిరని ఇపుడు మానవులరైతిరని, భావికాలమున దేవుడుగనో దేవదేవుడుగనో అయ్యెదరని గుర్తింతురు. అట్టి యనుతాపము, అసంతృప్తి, కలుగుట మేలే. అది పురోభివృద్ధికి నాంది. అదిలేకున్న ఎవ్వరు ఉన్నతినందజాలరు. పాగను తలపై ధరించి, తత్‌క్షణమే ఈశ్వరసాక్షాత్కారమునందువాడు అక్కడే

ఆగిపోవును; ఇక ముందుకు పోలేదు. నిరంతముగ అట్టి అసంతృప్తి మీమనసును పీడించుచుండుటవలన మీరు ధన్యులరే. మీకెట్టి ఎగ్గు కలుగదని దృఢముగ నమ్ముడు. ... నిశితమైన మేధగలవారలు. శాంతియే సిద్ధికి శ్రేష్ఠోపాయమని బాగుగ నెఱుగుదురు. ఈ విషయమున లఘుచిత్తులమైన మావంటి బాలకులు మీయొద్ద నేర్చికొనవలసిన దెంతేని కలదనుటలో నాకెట్టి సందేహమునులేదు. ... మీరు వివేకులు. నేను ఇంతకన్న తెలుపనక్కఱలేదు. మనుష్యునకు చెవులు రెండు నోరొక్కటియే! సరళభాషణము మీ సహజగుణము. పెద్ద వాగ్దానములు చేయక జాగ్రత్తగనుందురు. మీ యీ లక్షణము లొక్కొకపుడు నాకు కినుక పుట్టించుచుండును. కాని యోచించి చూచినపుడు మీరే వివేకముతో ప్రవర్తించితిరని గ్రహించుచుందును. “గతి మందము సిద్ధి అమోఘు” మైనది. “సారము తగ్గినప్పుడే వేగము హెచ్చును”. కాని ఈ జగతిలో అన్నిటికిని మాటలే ఆధారము. మాటల (అందును గంభీర మితభాషణులగు మీమాటల) అంతరార్థమెఱుగుట ఎల్లరకు రాదు. దీర్ఘకాలసంసర్గమువలనగాని ఒకనిహృదయమును గ్రహించుట సాధ్యముగాదు. ... మతము శాఖలందులేదు — కోలాహలములందులేదు. పూజ్యుడైన మన గురుదేవుని ఈ ప్రబోధము నేల మఱతురు? మీకు చేతనైనంత వఱకు తోడ్పడుడు. కాని దానివలన గలిగిన ఫలమేమో, అది మేలో కీడో నిర్ణయించు నధికారము మనకు లేదు. ... పాపము గిరీశబాబునకు పాటిల్లిన మహాదుఃఖమునుబట్టి ఇప్పుడు ఆతడు మాతృదేవిని సేవించినయెడల ఆతనికి అనంత మనశ్శాంతి కలుగును. అతడు నిశితబుద్ధిగలవాడు. ... మన ప్రియగురుదేవునకు మీలో అఖండవిశ్వాసము గలదు. మీ యింట నేతక్కమఱెందును ఆయన భుజించి యెఱుగడు. మాతృదేవికికూడ మీయందు సంపూర్ణవిశ్వాసముగలదని వింటిని. వీనినన్నిటినిబట్టి తాము దయచేసి చపలస్వభావులమును బాలకులమునగు మా

దోషములనన్నిటిని, అవి మీ పుత్రుడు చేసిన తప్పులుగా భావించి, దయచేసి సహింపవలసినది, క్షమింపవలసినది. నేను చెప్పవలసిన దింతే! వార్షికోత్సవము ఎపుడు జరుగనున్నదో తిరుగు టపాలో నాకు తెలుపుడు. నడుములో ఒకనొప్పి నాకు చాల బాధగలిగించుచున్నది. అచిరకాలములో ఈ ప్రదేశము, మైళ్ళకొలది విస్తరిల్లియుండు పూచిన గులాబీతోపులతో మిగుల రమణీయమై యుండును. ఉత్సవసమయమునకు క్రొంగ్రొత్త గులాబీపూలను మండెలను పంపుదునని సతీశు చెప్పుచున్నాడు. ... మీ కుమారుడు పిఱికిపంద కాక ధీరమానవుడగునట్లు ఈశ్వరు డనుగ్రహించుగాక!

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

మఱిమాట: అమ్మ వచ్చియుండినచో, దయచేసి నా అసంఖ్యాకనమస్కారములను ఆమెకు అందింపుడు. నాకు సడలని దీక్ష అలవడునట్లు ఆమెను ఆశీర్వదింపుమనుడు. ఈ జన్మములో అది లభ్యముగానిచో, ఈ జన్మము వెంటనే తుదముట్టునుగాక!

## 32

(శ్రీ సదానందస్వామికి)

ఘాజీపూరు,
ఫిబ్రవరి 14, 1890.

ప్రియగుప్తకు,

నీవు కుశలమే అని అనుకొందును. ఆధ్యాత్మికసాధన సాగించుచుండుము. ఎల్లరకును నీవు భవ్యకింకరుడవని గ్రహించి వారికి పరిచర్య సలుపుము. నీ వెవరియొద్ద నున్నావో వారికి భవ్యభృత్యుడనని తెలుపుకొనుటకును, వారిపాదధూళిని తల దాల్చుటకును అర్హత నాకుసైతములేదు. ఇది ఎఱిగి వారిని

సేవింపుము. వారియందు భక్తిగల్గియుండుము. వారు నిన్ను దూషించినను, తెగించి నీకు నొప్పికలిగించినను, కోపింపకుము. కామినులతో నెప్పుడును కలియకుము. కఠినజీవితము నించుకించుకగా నలవఱచుకొనుము. భిక్షాహారమువలన శరీరపోషణ మొనరించుకొనుట క్రమక్రమముగా అభ్యాసము చేసికొనుము. శ్రీరామకృష్ణుని నామజపముచేయువాడెవడైనను సరే నీకు గురువని ఎఱుంగుము. ప్రభుత్వము చెలాయించుట అందఱికిని సులువే, దాస్యము చేయుట చాల దుష్కరము. ముఖ్యముగా నీవు శశి ననుసరింపుము. దృఢమైన గురుభక్తియు, సడలని క్షాంతియు, దీక్షయు లేకున్న దేనినిగాని సాధింపలే మనుట నిజమని యెఱుగుము. నీకు నీతినిష్ఠ ఉండవలెను. అందుండి అంగుళమైన తప్పితివేని, నీవిక నెప్పటికిని వినష్టుడవే.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 33

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

దేవోజయతి

ఘాజీపూరు,
ఫిబ్రవరి 19, 1890.

ప్రియమహాశయా,

పర్యటనములను ఆపుకొమ్మనియు, ఎందేని స్థిరపడుమనియు, టిబెట్టులో అతడు కలసికొన్న సాధువులయు, వారి యాచారవ్యవహారములయు వివరములను నాకు వ్రాసిపంపుమనియు సోదర గంగాధరునకు జాబువ్రాసితిని. అతడొసగిన ప్రత్యుత్తరము నిందుతో పంపుచున్నాను. హృషీకేశములో నున్న సోదరుడు కాళీకి జ్వరము మాటిమాటికిని వచ్చుచున్నది. ఇందుండి వానికి తంతివార్త పంపితిని. దీని కాతడిచ్చు జవాబులో

నేను తనకడకు రావలెనని కోరుచో ఇంనుండి తిన్నగా నేను హృషీకేశమునకు తరలవలసివచ్చును. అచటికిపోవు నావశ్యకత లేనిచో, ఒకటి రెండుదినములలో మీయొద్దకు వచ్చుచున్నాను. ఔను, మహాశయా, ఈ మాయాజాలమును నే నల్లుచున్నందుకు మీరు నవ్వవచ్చు. కాని జరుగుచున్నదదే; సందేహములేదు. ఇనుప సంకెల యున్నది; బంగారుసంకెల యున్నది. బంగారుసంకెలవలన చాల మేలు కల్గును; మేలు పూర్తిగా కలిగిన యనంతరము ఆ సంకెల తనంత దాను ఊడిపడిపోవును. నా గురుదేవుని బిడ్డలు నా సేవ లందుకోవలసినవారు. ఈ విషయమున మాత్రమే నాకింకను కర్తవ్యశేష మున్న ట్లనిపించును. వీలునమసరించి, కాళీసోదరుని అలహాబాదుకుగాని, మరేతావునకుగాని పంపెదనేమో. మీ చరణములపొంత నా నూటొక్క దొసగుల సమర్పించుచున్నాను.— "నేను మీకు తనూభవుడ. మిమ్ము శరణువేడితిని. నాకు దారి చూపుడు".*

భవదీయుడు
వివేకానంద

## 34

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

దేవోజయతి

ఘాజీపూరు,
ఫిబ్రవరి 25, 1890.

ప్రియమహాశయా,

నాకు నడుమునొప్పివలని బాధ హెచ్చుగా నున్నది. లేకున్న నే నీవఱలోనే మీవ్రమోల వ్రాల యత్నించియుందును. ఇచట నా మనస్సున కింక శాంతి లభింపదు. బాబాజియింటనుండి నేను వచ్చి మూడుదినములైనవి. కాని ఆయన దయతో ఇంచు

* గీత II-7 వ శ్లోకమునకు ఛాయ.

మించుగా ప్రతిదినము నా యోగక్షేమము లడిగించుచునే యున్నాడు. నడుమునొప్పి ఇంచుక ఉపశమించినతోడనే, నేను బాబాజీయొద్ద సెలవుగైకొందును. మీ కనంతప్రణామములు.

భవదీయుడు
వివేకానంద

## 35

(శ్రీ అఖండానందస్వామికి)

ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ

ఘాజీపూరు,
ఫిబ్రవరి, 1890.

ప్రియ అఖండానందునకు,

నీ జాబు చూచి చాల ఆనందించితిని. టిబెట్టునుగూర్చి నీవు వ్రాసినవి చాల ఆస క్తి లూరించునవిగ నున్నవి. ఒక్కసారి అచటికి పోయిరావలె ననెడి ప్రయత్నములో నున్నాను. టిబెట్టును సంస్కృతభాషలో ఉత్తరకురువర్ష మందురే గాని మ్లేచ్ఛదేశ మనరు. లోక మంతటికిని అది యెత్తైన పీఠభూమి యగుటచే అచట చలి అత్యుత్కటము. కాని క్రమముగ ఆ చలికి పను పడుట శక్యమే. టిబెట్టుదేశప్రజల ఆచారవ్యవహారములనుగూర్చి నీ వేమియు వ్రాయలేదే. వారికి అతిథిసత్కారనిష్ఠ అంతగా నుండియున్న, నిన్నేల రానీయక ఆపిరి? దయచేసి అన్నిటిని వివరముగ పెద్దజాబులో వ్రాయుము. నిన్ను చూడవలెనన్న తహతహ ఉన్నది. కాని వచ్చుటకు నీకు వీ లుండదే అని చింతిలు చున్నాను. నాకు అందఱిమీద నున్న ప్రేమకంటె నీమీద నున్న ప్రేమయే యెక్కువ అనిపించుచున్నది. ఐనను నేను ఈ మాయ నుండికూడ విడుపొందుటకు ప్రయత్నింతును.

టిబెట్టులోని తాంత్రికాచారములనుగూర్చి నీవు వ్రాసితివే అవి బౌద్ధము క్షయోన్ముఖమైన కాలమున భారత దేశమున పుట్టు వొందినవే. మన వాడుకలో నున్న తంత్రములు బౌద్ధులు సృజించినవే అని నా యభిప్రాయము. ఆ తాంత్రికక్రియలు మన వామాచారసిద్ధాంతమునకంటెను ఘోరతరములు. ఏలయన అందు వ్యభిచారము నిర్నిరోధమై ఏర్పడెను. అవినీతిచే బౌద్ధులు చెడిపోయినపుడే కుమారిలభట్టు వారిని తఱిమివేసెను. కొందఱు సన్న్యాసులు శ్రీశంకరునిగుఱించియు బౌలువర్గమువారు శ్రీచైతన్యునిగూర్చియు "చాటుగా ఇంద్రియపరాయణు" డని "త్రాగుబోతు" తని "సర్వవిధహేయవ్యసనదాసు" డని చెప్పుదురే అట్లే ఈకాలపు తాంత్రికబౌద్ధులును బుద్ధదేవుని వామాచారపరాయణునిగా పేర్కొని, ప్రజ్ఞాపారమితయందలి తత్త్వగాథ మున్నగు సుందరసుభాషితములకు పెక్కింటికి అసభ్యవ్యాఖ్యానములు చేయుచుందురు. దాని కంతటికిని ఫలితముగ ఈకాలమున బౌద్ధులు రెండువర్గాలవారుగా చీలియున్నారు. బర్మీయులును సింహళీయులును తంత్రములను తృణీకరించిరి. హిందూదేవతలను దేవేరులను విడనాడిరి. అంతేగాక ఉత్తరబౌద్ధులకు పరమపూజ్యుడగు అమితాభబుద్ధుని త్రోసిరాజనిరి. అందుల వివరమును సారమును ఇది: ఎందలో దేవతలయు దేవేరులయు ఆరాధనము ఉపదిష్టమైయున్న ప్రజ్ఞాపారమితాదిగ్రంథములలో ఉత్తరబౌద్ధులారాధించు అమితాభబుద్ధాది దేవతలయు దేవేరులయు ప్రస్తావము లేదు. దక్షిణబౌద్ధులు బుద్ధిపూర్వకముగనే శాస్త్రముల నతిక్రమించిరి. దేవతలను దేవేరులను విడనాడిరి. బౌద్ధములో "సర్వము ఒరులకొఱకే" అనుకొను దశ టిబెట్టులో సర్వత్ర వ్యాప్తమై కనిపించుచున్నది కదా! అది ఆధునికయూరపువారిచిత్తముల కెంతయు నచ్చినది. ఐనను ఆ దశనుగూర్చి చెప్పవలసిన విషయములు నాకు ఎన్నో గలవు. వాని నీ జాబులో నిముడ్చుట అసాధ్యము. బుద్ధు డేమి చేసె ననగా — ఉపనిషత్తులలో ఒక్క

వర్ణమువారికి మాత్రమే ప్రవేశార్హమైయున్న మతధర్మకవాట మును (ఎల్లరకు) సుప్రవేశముగ తెఱచివేసెను. నిర్వాణసిద్ధాంతమువలన అతనికి ప్రత్యేకముగ కల్గిన గొప్పతన మే మున్నది? ఆయన కున్న సాటి లేని విశ్వానుభూతియే ఆయనగొప్పతనము. ఆయనమతమునకు గౌరవము గూర్చు సమాధి మున్నగు నున్నత సంప్రదాయములు ఇంచుమించు అన్నియు వేదములలో గలవు. అచ్చట లేని వే మనగా అతనిప్రతిభయు, అతనికరుణయు. నాటి నుండి నేటివఱకు ఆ ప్రతిభకును ఆ కరుణకును సాటి విశ్వచరిత్ర మున లేదు.

యజ్ఞములు మున్నగు బాహ్యసాధనములు చిత్తశుద్ధిసాధకములు అనుట వైదికకర్మసిద్ధాంతము. అట్టి సిద్ధాంతము యూదులమతమునను కలదు. అన్ని మతములలోను కలదు. దానిని మొట్టమొదట ప్రతిఘటించినవాడు బుద్ధుడు. కాని ఆశయాల అంతస్సార మేమో మునుపటివలెనే యుండెను. ఆయన ఉపదేశించిన మనోవ్యాయామసిద్ధాంతమును చూడుము. వేదములకు బదులు సుత్తములను నమ్ము డనెడి ఆయన ఆదేశమును చూడుము! వర్ణవ్యవస్థకూడ మునుపటియట్లే యుండినది. (బుద్ధుని కాలమున వర్ణవ్యవస్థ పూర్తిగా అంతరింపలేదు.) కాని గుణమును బట్టి వర్ణనిర్ణయము జరుగుచుండెను. బౌద్ధధర్మమును నమ్మని వారు సత్యమును నమ్మనివారు (హెరెటిక్సు)గా పేర్కొనబడిరి. అంతయు ప్రాచీనపద్ధతియే. 'సత్యమును విశ్వసింపనివాడు' అను మాట బౌద్ధులలో చాలకాలముగ నుండునదే. కాని వా రెన్నడును కత్తిదూయలేదు. (మంచివారు!) ఎంతో సహనము కల్గి యుండిరి. తర్కము వేదములను ఊదిపాఱవేసినది. మఱి మీ మతమునకు ఋజు వేమి? (వేఱు ఋజువు లేనప్పుడు) నమ్మకమే శరణ్యము! అన్నిమతాలలో నున్న క్రమమే ఇందును. అయినను అది ఆ కాలమున కెంతయు ఆవశ్యకముగ నుండెను. కావుననే ఆయన అవతరించెను. అతని సిద్ధాంతము కపిలునిసిద్ధాంతమును

బోలినదే. మఱి శంకరునిసిద్ధాంతమో, ఇంత కన్న ఎంత మహత్తరమైనది, యుక్తియుక్తమైనది! బుద్ధుడును, కపిలుడును సదా చెప్పున దిది : "లోకమున నిండియుండునది దుఃఖమే, వేఱేదియు కాదు, ఇం దుండి పాఱిపొండి. ఔను, మన నెంచిన, పాఱిపొండి." ఇచట సౌఖ్యము బొత్తిగా లేదా — ఈ మాట యెట్టి దనగా — "ఈ లోకము సౌఖ్యపరిపూర్ణము" అను బ్రాహ్మసమాజమువారి మాటవంటిదే. దుఃఖ మున్నది, నిజమే. కాని ఏమి చేయగలము? నిరంతర మనుభవించి పనుపడినచో కష్టమే సుఖముగ కనిపించు నని కొంద ఱన వచ్చు. శంకరుడు ఈ వాదము నవలంబింపలేదు. ఆయన చెప్పినది — ఈ జగత్తుకు అస్తిత్వమును ఉన్నది, నాస్తిత్వమును ఉన్నది. అనేకత్వమున్నను ఇది ఏకమే. నేను ఈ మర్మమును విప్పిచెప్పెదను. అచ్చట దుఃఖమే ఉన్నదో వేఱే దైన నున్నదో నేను తెలిసికొందును. భయంకరమైనదాని నుండి పాఱిపోయినట్లుగా నేను దానినుండి పాఱిపోను. దానిని గూర్చిన సమస్తమును నేను తెలిసికొందును. ఈ అన్వేషణమున కల్గు మితిలేని బాధయూ, అది యెంత ఉన్నదో అంతటిని నేను నాయొమ్మున హత్తుకొందును. ఇంద్రియజన్యములైన సుఖమును దుఃఖమును క్షయమును వినాశమును జూపి నీవు నన్ను భయపెట్టుటకు నే నేమి మృగమనా? దానినిగూర్చి నేను తెలిసికొందును. అందుకై నాజీవిత మర్పింతును. జ్ఞేయ మైనది ఈ జగత్తున లేదు. కావున ఈ ద్వంద్వజగత్తునకు అతీతమైనది, ప్రజ్ఞాపార అని బుద్ధుడు పేర్కొన్నది ఏదేని యున్న నాకు కావలసిన దదే. దాని నంటి సుఖ మున్నను దుఃఖ మున్నను నేను లక్ష్యపెట్టను. ఎంత ఉదాత్తమైన, ఎంత మహత్తరమైన ఆశయము! బౌద్ధధర్మము ఎదిగినది ఉపనిషత్తులనుండియే. శంకరుని వేదాంతము ఎదిగినదియు ఉపనిషత్తులనుండియే. కాని మహాద్భుతమైన బుద్ధదేవుని కరుణ శంకరునకు లేదు. శంకరున కుండినది కేవల శుష్క మేధ. తంత్రములకు వెఱచి పామరులమూకకు వెఱచి వ్రణమును నయము

చేయుయత్నములో ఆయన చేతినే ఖండించివేసినాడు.* అందుం గూర్చి వ్రాయవలసినచో బృహద్గ్రంథమునే వ్రాయవలెను. కాని అందుకు కావలసిన పాండిత్యము గాని వ్యవధి గాని నాకు లేదు.

బుద్ధదేవుడు నా యిష్టదేవత, నా స్వామి. దేవునిగూర్చిన సిద్ధాంతమును ఆయన బోధింప లేదు. ఆయన తానే దేవుడు. అందు నాకు పూర్ణవిశ్వాసమే. భగవంతు ననంతమహిమ కొక పరిమితినిగూర్చు శక్తి యెవరికిని లేదు. తన కొక పరిచ్ఛేదమును గూర్చుకొను శక్తి దేవునకే లేదు. సుత్తనిపాతమందలి గందార సుత్తమునకు నీయనువాదము చాల బాగున్నది. ఆ గ్రంథము లోనే మఱొక సుత్తము కలదు. ధనియసుత్తము. అందును ఇట్టి యాశయమే కలదు. ఇట్టి యాశయములు కల భాగములు పెక్కు ధమ్మపదమందును కలవు. కాని అది నిజముగ అన్నిటికంటె పైమెట్టు.

జ్ఞాన విజ్ఞానతృప్తాత్మా
కూటస్థో విజితేన్ద్రియః.

జ్ఞానవిజ్ఞానములచే సంతృప్తినొందినవా డెవడో, అన్నిపరిస్థితు లందును నిర్వికల్పుడుగ నుండువా డెవడో, ఇంద్రియములను వశపఱచుకొన్నవా డెవడో, దేహాభిమానమును పూర్తిగ విడ నాడినవా డెవడో వాడు మత్తమాతంగమురీతి దేనినిగాని లక్షిం

* దేశమున వైదికులచే శూద్రు లని నిందింపబడు పామరప్రజల మరులు గొల్పిన తాంత్రికమతపు వైపరీత్యములబారినుండి వైదికమతవిశుద్ధిని కాపాడు ఔత్సుక్యముచే శంకరుడు ఆ పామరప్రజల క్షేమమును ఉపేక్షించెను. దానినే కాబోలు స్వామి చెప్ప సెంచినది. వైదికక్రతువు లొనర్చు నర్హతను చెప్పు సందర్భమునను, జ్ఞానోపాసనల కర్హతను చెప్పు సందర్భమునను ఆయర్హతలు శూద్రులకు లే వనెడి ప్రాచీనవాదమునే శంకరుడు తన బ్రహ్మసూత్రభాష్య మునం దవలంబించెను. అది మన్నింపరాని తప్పుగా స్వామి భావించిన ట్లున్నది.

పక యథేష్టముగ తిరుగాడవచ్చు. కాని నావంటి.అల్పుడు కదలక ఒకచోట కూర్చుండి సాక్షాత్కారము కల్గు దనుక భక్తి నభ్యసింప వలెను. అటుపిమ్మటనే అత డారీతి ప్రవర్తింప వచ్చు. కాని ఆ దశ చాల దవ్వున నున్నది.—నిజమున కెంతో దవ్వున నున్నది.

చిన్తాశూన్య మదైన్య భైక్ష మశనం, పానం సరిద్వారిషు
స్వాతన్త్ర్యేణ నిరఙ్కుశా స్థితి, రభీ ర్నిద్రా శ్మశానే వనే।
వస్త్రం క్షాళనశోషణాదిరహితం ది గ్వాస్తు శయ్యా మహీ.
సఞ్చారో నిగమాన్తవీథిషు, విదాం, క్రీడా పరే బ్రహ్మణి॥

విమాన మాలమ్బ్య శరీర మేతత్
భున క్త్యశేషాన్ విషయా నుపస్థితాన్।
పరేచ్ఛయా బాలవ దాత్మవేత్తా
యో ఽవ్య క్తలిఙ్గో ఽననుష క్తబాహ్యః॥

దిగమ్బరో వాపి చ సామ్బరో వా
త్వగమ్బరో వాపి చిదమ్బరస్థః।
ఉన్మత్తవ ద్వాపి చ బాలవద్వా
పిశాచవ ద్వాపి చర త్యవన్యామ్॥

(వివేకచూడామణి, 538-40)

"జ్ఞానులు చింతయు దైన్యమును లేక భిక్షాన్నము నారగింతురు. నదీజలముల గ్రోలుదురు. స్వతంత్రులుగను నిరంకుశులుగను జీవింతురు. శ్మశానమున గాని అడవిలో గాని నిర్భయముగ నిద్రింతురు. వారి వస్త్రములు చెట్టుపట్టలో, ఉతుకుటయు ఆఱబెట్టుటయు అక్కఱ లేని దిక్కులో! నేలయే వారికి పాన్పు. వేదాంతవీథులలోనే వారి సంచారము. పరబ్రహ్మమందే వారి

విహారము. ఆత్మవిదునకు బాహ్యలింగము లుండవు. బాహ్య వస్తువులందు సంగ ముండదు. దేహమే ఆత్మ అనుకొనక, అతడు దేహమును దాల్చి యుండును. తమంతట లభించిన శబ్దాదివిషయ ములను ఒరులకోర్కెచే బాలునివలె ననుభవించును. జ్ఞానాకాశ స్థితుడు వస్త్రములను ధరించును లేదా చర్మాంబరుడుగ నుండును. కాకున్న దిగంబరుడుగ నుండును. అతడు భువియందు ఒక్కొ క్కప్పుడు ఉన్మత్తునివలెను, ఒక్కొక్కప్పుడు శిశువువలెను, వేరొకప్పుడు పిశాచమువలెను చరించును.''

మీ కట్టి దశ సిద్ధింపవలె ననియు ఖడ్గమృగమువలె సంచ రించువారుగ మీరుండవలె ననియు మా గురుదేవుని దివ్యచరణ ములను ప్రార్థించుచున్నాను.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 36

(శ్రీ అఖండానందస్వామికి)

ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ

ఘాజీపూరు,
మార్చి 1890.

ప్రియ అఖండానందునకు,

నిన్న చేరిన నీ జాబును చూచి చాల ఆనందించితిని. నేను ప్రస్తుతము ఈ యూరి మహాద్భుతయోగియు భక్తుడునగు శ్రీ పవహారీబాబాజీయొద్ద నున్నాను. ఆయన తనగదినుండి వెలికి రాడు. గుమ్మమునకు లోపలినుండియే ప్రజలతో మాటాడు చుండును. గదిలో నొక బిల మున్నది. అది ఆయన ఉండు చోటు. ఆయన సమాధిమగ్నుడై కొన్ని నెలలకాల ముండు నట. అతని

ధీరత అత్యాశ్చర్యకర మైనది. మన బంగాళదేశము భక్తికిని జ్ఞానమునకును నెలవు. ఇచట యోగమనుమాటయే లేదు. ఉన్న కొంచెమును హఠయోగమునకు సంబంధించిన శ్వాసవ్యాయామమే. అది ఒకరకపు గారడివిద్యయే కాని మ రేదియు కాదు. కావున ఈ యద్భుతరాజయోగియొద్ద నేనున్నాను. ఆయన నాకు కొంత ఆసపాటును కలిగించియున్నాడు. ఇచటి చిన్న తోటలో నొక పౌరమహాశయుని చక్కని భవన మున్నది. నే నచటనుండ మనుకొను చున్నాను. బాబాజీకుటీరమునకు చాల సమీపమున నున్నది ఆతోట. సాధువుల నుపచరించుటకు బాబాజీసోదరు డొక డచట నున్నాడు. నేను నాభిక్షు నతనియొద్ద గొందును. ఈ వేడుక యెట్లు ముగియునో చూత మని నేను పర్వతప్రాంతములకు పోవు పన్నాగమును ప్రస్తుతమునకు మానుకొనుచున్నాను. కడచిన రెండు నెలలుగా నడుమునొప్పి నన్ను పీడించుచున్నది. అందుచేతనే కొండ లెక్కుట నా కిప్పుడు అసాధ్యముకూడ. కాబట్టి వేచి యుండి బాబాజీ నా కే మను గ్రహించునో చూతును గాక.

మంచివిషయము లెచ్చట నున్నను గ్రహింపవలె ననుట నా లక్ష్యము. దీనినిబట్టి కొందఱు మిత్రులు గురుదేవునందలి నా భక్తి తొలగు ననుకొందురు. అట్టి తలంపులను వెఱ్ఱివారి తలంపు లనియు దురభిమానులతలంపు లనియు నేను గణింతును. ఏల యన గురువు లందఱు నొక్కటే, విశ్వగురువగు దేవునంశములే, దేవునినుండి ప్రసరించు కిరణములే.

నీవు ఘాజీపూరుకు వత్తు వేని గోరాబజారులో సతీశబాబునింటగాని గగనబాబునింటగాని విచారించిన చాలును. నేనెచ్చట నుండునదియు తెలియును. లేదా పవహారీబాబా ఇచట చాల ప్రఖ్యాతుడు. ఆయనపేరు చెప్పిన చాలు, ఆయన ఆశ్రమమును ఎవ డైనను తెలుపగలడు. నీ వచ్చటికి వచ్చి పరమహంసను

గూర్చి విచారించిన చాలు. వారు నీకు నా వార్తను తెలుపుదురు. మొఘలుసరాయికి సమీపమున 'దిల్దర్నగర్' అను నొకస్టేషను కలదు. అచ్చట నీవు చిన్నరైలుకు మాఱవలె. తారాఘాటు నొద్ద దిగవలె. దాని కెదురుగ నున్నది ఘాజీపూరు. ఘాజీపూరు చేరుటకు నీవు గంగను దాటవలెను.

ప్రస్తుతమునకు నేను ఘాజీపూరులో కొన్నాళ్లుందును. వేచియుండి బాబాజీ ఏమిచేయునో చూతును. నీవును వత్తువేని పైని చెప్పిన భవనమున కొన్నాళ్లు మన మిద్దఱము నుందము. తర్వాత కొండలకో, లేక వేఱెచటికేని పోవునట్లు నిర్ణయమైనచో, అచటికో, బయలుదేఱుదము. నేను ఘాజీపూరులోనున్న వార్తను దయచేసి బరానగరమున నెవరికిని తెలుపకుము.

శుభాశీస్సులు, శుభాశంసలు,

సదా భవదీయుడు
వివేకానంద

## 37

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

దేవో జయతి

ఘాజీపూరు,
మార్చి 3, 1890.

ప్రియమహాశయా,

దయతో మీరు వ్రాసిన జాబు ఇప్పుడే చేరినది. నాకు కఠినవేదాంతాశయా లున్నను నా స్వభావము చాలమృదు వనుట మీ రెఱుగరు. ఈ మార్దవము నాకు హానికరముగ నున్నది. రవంత తాకిడి గల్గిన చాలు. నేను లొంగిపోదును. నా శ్రేయమునుగూర్చియే ఆలోచింత మని ఎంతో ప్రయత్నింతును కాని నా అధీనము తప్పి, ఇతరుల శ్రేయమునుగూర్చి ఆలోచించుటకే

పూనుకొనుచుందును. నా శ్రేయమునే గడించుకొంద మను దృఢ నిశ్చయముతోనే ఈతూరి నేను తరలితిని. కాని అలహాబాదులో నొక సోదరుడు వ్యాధిగ్రస్తుడై యున్నాడను వార్త అందగనే అచటికి పరుగిడవలసినవాడనైతిని. ఇప్పు డీ వార్త హృషీకేశము నుండి వచ్చుచున్నది. మానసికముగ నేనచ్చట వ్రాలితిని. శరత్తుకు తంత చేసితిని. ఇంకను జవాబు లేదు. తంతెలకు సైతము ఆలస్య మగుచోటు నిజముగ మంచిదే! నడుమునొప్పి మొండికి వేసికొని నన్ను పీడకున్నది. నొప్పి చాల ఎక్కువగా నున్నది. కొన్నాళ్ళుగా నేను పవ్హారిజీని దర్శించుటకు పోజాల కున్నాను. కాని నా క్షేమవార్తను తెలిసికొనిపోవుట కొకనిని ప్రతిదినమును ఆయనయే దయతో పంపుచున్నాడు. ఇప్పుడు విషయక్రమము తలక్రిందులై కన్పట్టుచున్నది. బిచ్చగాడనై నే నాయన గడపయొద్ద నుండగా, ఆయన నాయొద్దనుండి విషయ ముల గ్రహింప గోరుచున్నాడు! ఈ యోగి కింకను పరిపూర్ణత గల్గ లేదు కాబోలు. క్రతువులలో వ్రతములలో అనుష్ఠానము లలో నిభృతజీవితములో అతిమాత్రప్రవణత ఉన్నది. సముద్రము సమగ్రముగ గట్లనడుమ ఇముడ దనుట నా గట్టి నమ్మకము. కాబట్టి ఊరక ఈ సాధువును తొందరచేయుట మంచిది కా దని తీర్మానించుకొంటిని. త్వరలోనే ఆయనయొద్ద సెలవు పొందుదును. వేఱుగతి లేదు. ఇంతటి మెత్తనివానిగ చేసి దైవము నన్ను చంపినది! బాబాజి నన్ను పోనీయడు. గగన్బాబు నన్ను పోనీయడు. (ఈ గగన్బాబును మీ రెఱిగియుందురు. ఋజు వర్తనుడు, భక్తుడు, సదయహృదయుడు.) జవాబుగా వచ్చు తంతెచే నే నీ చోటును వీడిపోవలసివచ్చిన పోవుదును. అట్టి తంతెరాకున్న, నేను కొన్నాళ్లలో వారణాశికి మీయొద్దకు వత్తును. నేను మిమ్ము విడిచిపెట్టబోను. మిమ్ము నేను హృషీకేశ మునకు తప్పక పిలుచుకొని పోవలెను. అడ్డుమాటలు సాకులు చెల్లవు: పరిశుభ్రత కక్కడ ఇబ్బందు లున్నవనియు, కొండలలో

స్త్రీలు చిక్కు వనియు, చోటుండ దనియునా చెప్పుచున్నారు? తీర్థము లెట్టివో కలియుగపుసన్న్యాసు లెట్టివారో మీ రెఱుగుదురు. మీరు ధన మిత్తురేని మీకు చోటు చేయుటకై దేవాలయాధికారులు గుడిలో ప్రతిష్ఠింపబడియున్న విగ్రహమునైనను పాఱవేయుదురు. కాబట్టి తలదాచుకొను నీడకై చింత అక్కఱలేదు. అక్కడ ఏ కష్టము నుండ దని చెప్పుచున్నాను. అచట ఇప్పుడు వేసవియెండ ప్రారంభమై యున్న దనుకొనుచున్నాను. ఆ యెండ వారణాశిలో మీ రనుభవించు ఎండయంతటి దుస్సహము కాదు లెండి. కాబట్టి ఆమట్టుకు మేలే. అచట రాత్రులు సదా చల్లగా నుండును. కాబట్టి మంచి నిద్ర తప్పక యుండును.'

ఎందుకు మీ రంత భయపడుచున్నారు? మీ కెచ్చటను ఎట్టి కష్టము లుండ వనుటకును మీ రింటికి క్షేమముగా మరలి వత్తు రనుటకును నేను పూటపడెదను. ఈ ఆంగ్లేయుల పాలనములో ఏ ఫకీరుకును ఏ గృహస్థుకును చిక్కులు గలుగ వనుట నా యనుభవము.

పూర్వజన్మములనుండి అనువర్తించుచున్న సంబంధము మన యిరువురి మధ్య నున్న దనుట కేవలము నారిత్త యూహయేనా? మీ యొద్దనుండి ఒక్క జాబు వచ్చిన, చూడు డది ఎట్లు నా నిశ్చయమును పూర్తిగా త్రోసిరా జనుచున్నదో! వెంటనే నా పనుల నన్నిటిని వెనుకకు నెట్టివేసి, వారణాశికి వచ్చుటకు తొందరపడుచున్నాను!

సోదరగంగాధరుని మఠమునకు ర మ్మని మరల నొక జాబు వ్రాసియున్నాను. అతడు వచ్చు నేని మిమ్ము కలిసికొనును. వారణాశిలో శీతోష్ణపరిస్థితి ఇప్పు డె ట్లున్నది? ఇక్కడి వాసము చే, నా కుండిన మన్నెజ్వరలక్షణము లన్నియు నిర్మూలించినవి. నడుము నొప్పి మాత్రమే నాకు వెట్టెత్తించుచున్నది. నొప్పి రాత్రి యనక పగులనక ఎడతెంపులేక ఎంతయు బాధపెట్టుచున్నది.

కొండల నెక్కియైన దిగఁదనో ఎఱుఁగను. ఆశ్చర్యకరమైన క్షమాశక్తి బాబాజీలో కనిపించుచున్నది. కావుననే ఆయనయొద్ద కొంత యాచించుచున్నాను. కాని ఎంత సేపటికిని పుచ్చుకొనుటే కాని ఇచ్చు మనఃపరిపాకము జాడగానైన లేదు. కావున నేనును వీడి పోగెదను.

భవదీయుడు
వివేకానంద

మఱిమాట :—ఇక నేను ఏ మహాత్ముని గాని ఆశ్రయింప బోను —

నీలోనె యుండుమా నిబ్బరంబుగను
ఎవరిగుమ్మముఁ జొర నేల నో మనస?
మహనీయనిధి స్వామి మనసులోఁ గలఁడు.
అతనివాకిట నుండు నగణితమణులు.
తలఁచిన దిచ్చు చింతామణి యతఁడు.
హృద్గతంబగు భక్తి యొసఁగినఁ జాలు,
కూర్చున్న చోటికే కూడును సిరులు.

అని మహాకవి కమలాకాంతు డనెను.

కావున తుదకు తేలిన గొప్ప నిర్ణయ మిది: శ్రీరామ కృష్ణునకు సాటి లేరు. అపూర్వమైన ఆ పరిపూర్తి, ఆగి అర్హత పరికింపక అందఱిమీఁదికిని ప్రసరించు ఆ మహాద్భుతకరుణ, బద్ధజీవులపట్ల ప్రగాఢమగు ఆ సానుభూతి — భువి నింకెవరి యందును లేవు. ఆయనే చెప్పుచుండినట్లుగ ఆయన అవతార మైన కావలెను, లేదా, నిత్యపరిపూర్ణుడగు ఏ పరమపురుషుని గూర్చి 'అజాయమాను' డనియు 'బహుధావిజాతు' డనియు వేదాంతము చెప్పునో ఆ పరమపురుషుడైన కావలెను. ఇది ఎడలని సడలని నా విశ్వాసము. 'యోగిని ధ్యానించుటచేత

గమ్యము చేర వచ్చు'* నను సూత్రమున అట్టి పరమపురుషు నుపాసనమునే పతంజలి చెప్పియున్నాడు.

ఆయన జీవితకాలములో నా కోరికలలో ఒక్కదానినైన నిరాకరింపలేదు. కోట్లకొలదిగ నా తప్పులను ఆయన క్షమించియున్నాడు. నాయందు ఆయన కున్నంత మహాప్రేమ నా తల్లిదండ్రులకు సైతము లేదు. ఈమాట అతిశయోక్తియు కాదు, ప్రౌఢోక్తియు కాదు, కేవల సత్యసూక్తి. ఆయన శిష్యులలో ప్రతియొక్కనికిని తెలిసిన విషయ మిది. గొప్పవిపత్తులు నాకు వాటిల్లినప్పుడు గొప్ప వంచనలు నను లోగొన్నప్పుడు మహావ్యథతో విలపించుచు "ఓదేవా, నన్ను రక్షింపు" మని ప్రార్థించియున్నాను. కాని ఎందుండియు సాయము లభింప దాయె. ఈయన మహాద్భుతయోగి కానిండు, అవతారము కానిండు, ఏమైన కానిండు, ఈయన జీవుల హృదయములలో జొచ్చి చూడగల తన దివ్యదృష్టిచే నా సర్వదుఃఖమును గుర్తించి, నన్నిచ్చటికి రప్పించుకొని, నేను వలదన్నను నా దుఃఖముల బోగొట్టెను. ఆత్మ అమరమే యగుచో, ఆయన ఇప్పటికిని జీవించియున్నచో "ఓరామకృష్ణదేవా, దయాపయోనిధీ, మదేకైకశరణ్యా, తనలోని ప్రత్యంగుళమందును ఉదాత్తతాసంపద గల యీ నామిత్రుని కోర్కెలనెల్ల తీర్పుమా" అని మాటిమాటికిని ప్రార్థింతును. నేను కనుగొన్న ఏకైకనిర్హేతుకకృపాసముద్రుడగు ఆయన మీకు సకలశుభము లొసగును గాత. శాంతిః శాంతిః శాంతిః.

దయచేసి వెంటనే జవాబు వ్రాయుడు.

భవదీయుడు
వివేకానంద

---

* 'ఈశ్వరప్రణిధానాద్వా' (23) అను పతంజలిసూత్రమున 'ఈశ్వర' అని యున్నది, 'యోగి' అని లేదు. "ముఖ్యత స్తు మహత్కృపయైవ భగవత్కృపాలేశా ద్వా" III-38 అను సూత్రములో నారదుడు పరాభక్తికి మహత్కృప ముఖ్యప్రాపక మనియు భగవత్కృపాలేశమును ప్రాపకమే అనియు చెప్పియున్నాడు.

## 38

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

దేవో జయతి

ఘాజీపూరు,
మార్చి 8, 1890.

ప్రియమహాశయా,

మీజాబు నాకు చేరినది, కావున నేను ప్రయాగకు తరలుదును. ఆ ఊరిలో మీరెచ్చట బసచేయుచున్నారో దయచేసి నాకు తెలుపుదురుగాక.

భవదీయుడు
వివేకానంద

మలిమాట :—అభేదానందుడు మీయూరు చేరుకొనినప్పుడు, అతనిని కలకత్తాకు తరలింతురేని, ఎంతయు కృతజ్ఞుడనయ్యెదను.

భవదీయుడు
వివేకానంద

## 39

(శ్రీ బలరామ్బోసుకు)

ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ

ఘాజీపూరు,
మార్చి 15, 1890.

మాన్యమహాశయాం,

దయతో మీరు వ్రాసిన జాబు నిన్న చేరినది. సురేశబాబుగారి వ్యాధి పెచ్చుపెరిగిపోయినవార్త నాకెంతయు విషాదజనకమాయెను. కానున్నది ఐతీఱును. మీరును వ్యాధిగ్రస్తులగుట యెంతయు శోచనీయము. 'నేను' అన్న తలంపున్నంత

వఱకు వైద్యక్రియలలో లోటు చేయుట అవివేకముగా గణింప వలసియుండును. అది పాపమును అపరాధమును అగును. 'నే' నన్న తలంపు లేనివాడు శాంతి వహించుట ఉత్తమము. ఈ దేహము జీవాత్మకు వాసస్థానము. యథార్థముగ ఇది కర్మానుష్ఠానమునకు సాధనము. దీనిని నరకకూపముగ మార్చుకొనువాడును దీని నుపేక్షించువాడును ఇద్దఱును నిందార్హులే. కాబట్టి పెనుదీయకుడు. తమంతట గల్గు పరిస్థితుల కనుగుణముగ నడచుకొనుడు.

నాభినన్దేత మరణం నాభినన్దేత జీవితమ్।
కాల మేవ ప్రతీక్షేత నియమమ్ భృతకో యథా॥

చావు గల్గినను అభినందింప రాదు, బ్రతుకు కల్గినను అభినందింప రాదు. ఆజ్ఞకై బంటు వేచియున్నట్టుగా కాలమునకై వేచియుండవలెను. వారణాశిలో భయంకరమైన చలిజ్వరము వ్యాపించియున్నది. ప్రమదాబాబు అలహాబాదుకు వెడలిపోయినాడు. బాబురాము ఆకస్మికముగ నిటకు వచ్చినాడు. జ్వరము అతనికి అంటుకొన్నది. అట్టి పరిస్థితిలో అతడు తరలుట తప్పు. ... నేను రేపు ఇటనుండి వెడలిపోవుచున్నాను. అమ్మకు నా అసంఖ్యాకములైన ప్రణామములు. నాకు సమదృష్టి అలవడునట్లు, పుట్టుకతోనే కల్గు బంధములు తొలగునట్లు, స్వయముగ తెచ్చుకొన్న బంధములలో నేను తగుల్కొనకుండునట్లును మీ రందఱును నన్ను ఆశీర్వదింపుడు. శంకరు డొక డుండునేని, అతనికి అవకాశమును శక్తియు నుండు నేని అతడు మీ కందఱకును మహోన్నత శుభముల ప్రసాదించు గాక — ఇదే నేను సదా కోరునది.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 40

(శ్రీ అతులచంద్రఘోషుసు)

ఘూజీపూరు,

మార్చి 15, 1890.

ప్రియఅతులబాబు,

నీవు అనుభవించుచున్న మనోవ్యధ విన్న నాకెంతయు ఖేదము కల్గుచున్నది. నీకు నచ్చిన పనినే చేయుము.

యావ జ్జననమ్ తావ న్మరణమ్
తావ జ్జననీజఠరే శయనమ్
ఇతి సంసారే స్ఫుటతరదోషః
కథ మివ మానవ తవ సన్తోషః ?

జన్మ మున్నంతకాలము మరణమును ఉన్నది. మరణ మున్నంతకాలము మరల తల్లిజఠరమున శయనించుటయు నున్నది. సంసారమున మిక్కిలి స్ఫుటముగ నున్న దోష మిది. ఓమానవుడా, నీకిచ్చట సంతోష మెక్కడిదోయి ?

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

మలిమాట :—రేపు నేనిటనుండి తరలుచున్నాను. విధి ఏవంకకు కొనిచనునో చూతును గాక.

## 41

(శ్రీ అఖండానందస్వామికి)

ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ

ఘూజీపూరు,

మార్చి, 1890.

ప్రియఅఖండానందా,

నీ మతొక జాబు ఇప్పుడే చేరినది. గిలికినరీతిగా వ్రాయబడియున్న దానిని చాల కష్టపడి చదివినాను. క్రిందటిజాబులో

నేను అన్నిటిని వివరముగా వ్రాసియున్నాను. ఈజాబు చేరిన వెంటనే నీవు బయలుదేఱు. నేపాళముమీదుగ టిబెట్టునకు పోవు దారినిగూర్చి వ్రాసియున్నావు. ఆదారి నాకు తెలిసినదే. టిబెట్టు లోనికి ప్రవేశానుమతి ఎవరికిగాని సులభముగ లభింపదు. అట్లే నేపాళములోసైతము దాని రాజధానియగు ఖట్మండుకును ఒకటి రెండు యాత్రాస్థలములకును తప్ప వేఱు చోట్లకు ప్రవేశానుమతి ఎవరికిని లభింపదు. కాని ఇప్పుడు నా మిత్రు డొకడు నేపాళ మహారాజుగారికి గురువుగాను వారి పాఠశాలలో ఉపాధ్యాయుడు గాను ఉన్నాడు. అతడు నాకు తెలిపిన విషయము — సైన్య సాహాయ్యమునకై నేపాళప్రభుత్వమువారు చైనాకు ధనము చెల్లింతురు. దానిని వారు ల్హాసామీదుగ పంపుదురు. ఆ అదనున ఒక సన్న్యాసి ల్హాసాకు చైనాకు మంచూరియాకు ఉత్తరచైనాలోని తారాదేవిక్షేత్రమునకు సైతము పోయివచ్చినాడు. ఆ నా మిత్రుడు ఏర్పాటుచేయునేని మనమును గౌరవాదరములతో టిబెట్టు చైనా ల్హాసా మున్నగా అన్నింటిని దర్శింప వచ్చు. కావున నీవు తక్షణమే ఘాజీపూరుకు బయలుదేఱు. కొన్నాళ్లిచ్చట బాబాజీతో నుందము. తర్వాత నేను నా మిత్రునకు వ్రాసెదను. అన్ని ఏర్పాట్లును అయిన తర్వాత, నేను తప్పక నేపాళముమీదుగ టిబెట్టునకు పోవుదును.

ఘాజీపూరుకు రావలె ననిన నీవు దిల్దార్నగరునొద్ద బండి దిగవలెను. అది మొగల్‌సరాయికి రెండు మూడు స్టేషను లీవల నున్నది. ఇక్కడ నేను సంపాదింపగల్గియున్నచో ప్రయాణవ్యయ మును నీకంపి యుందును. కావున నీవే సంపాదించుకొని, రమ్ము. గగన్బాబుగా రింట నేనున్నాను. ఆయన చాల సరసుడు, ఉదాత్తచిత్తుడు, ఉదారుడు. కాళి, జబ్బుపడినా డన్న వార్త విన్న వెంటనే గగన్బాబు ప్రయాణవ్యయమునకు ధనమును హృషీకేశమున కంపెను. అంతే కాదు. నాకై యెంతో పైకము వ్యయించియున్నాడు. కాబట్టి కాశ్మీరుప్రయాణమునకు ధనము

వలెని నడిగినచో సన్న్యాసధర్మమునే ఉల్లఘించి నట్లగును. కావున అడుగుట మానుకొన్నాను. ఈజాబు చేరిన వెంటనే పైకమును నీవే సేకరించుకొని బయలుదేఱు. అమరనాథమును దర్శింప వలె నను పిచ్చిని ప్రస్తుతమునకు అణచిపెట్టుకో.

భవదీయప్రేమపూర్ణ,
వివేకానంద

## 42

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

దేవోజయతి

ఘాజీపూరు,
మార్చి 31, 1890.

ప్రియమహాశయా,

గడచిన కొన్నాళ్లు నేనిచట లేను. ఈదినము మరల నిటనుండి వెడలిపోవుచున్నాను. సోదరుని గంగాధరుని ఇటకు రమ్మని వ్రాసితిని. అతడు వచ్చునేని మే మిద్దఱమును కలసి మీయొద్దకు వత్తుము. కొన్ని ప్రత్యేక కారణములచే నేనిటకు కొంత దూరమున నున్న పల్లెలో అజ్ఞాతవాసము నింకను సాగించు చుందును. అచటనుండి జాబులు పంపువసతి లేదు. మీజాబున కిన్ని నాళ్లు నేను జవాబు వ్రాయలేకపోవుట కదే కారణము. సోదరుడు గంగాధరుడు వచ్చును. రానివా డగుచో నాజాబున కీపాటికి జవాబు వచ్చియుండును. సోదరుడు అభేదానందుడు కాశిలో వైద్య 'ప్రియ' మహాశయునియొద్ద నున్నాడు. నా మఱొక సోదరుడు నాతో నుండినాడు, ఇప్పుడే అభేదానందు డుండు చోటికి బయలుదేఱినాడు — అతని ఆగమనవార్త ఇంకను అందలేదు. అతని ఆరోగ్యమును బాగుండనందున అతనినిగూర్చి ఎక్కువ ఆందోళనపడుచున్నాను. అతనిపట్ల చాల క్రూరముగ నడచు కొన్నాను. అనగా నన్నువీడిపొమ్మని చాల పీడించినాను. వేఱుగతి

లేదు చూడుడు. నేనుఅంతదుర్బలహృదయుడను. ప్రేమవ్యాకులతలకు అంతగా లోబడినవాడను. నా మనసుగట్టిపడునట్లు నన్నాశీర్వదింపుడు. నామనఃపరిస్థితినిగూర్చి మీతో ఏమందును! అయ్యో. నామనసునందు రాత్రింబగళ్లు నరకాగ్నియే మండుచున్నట్లున్నది. ఇంతవఱకును నేను చేయగల్గిన దేమియు లేదు, ఏమియు లేదు, జీవిత మిట్లు కలుషితమై వ్యర్థముగ గడచిపోవుచున్నది — కర్తవ్యమునుగూర్చి దిక్కు తెలియనివాడనుగ నున్నాను. బాబాజీ తియ్యని మాటలు చెప్పుచు నన్ను పోవనీయక నిలుపుచున్నాడు. అయ్యో, ఏమి చప్పుదును? మీయెడ నేను నూర్లకొలదిగ అపరాధములను చేయుచున్నాను. అవి మనోవ్యథలచే వెఱ్ఱెత్తిన వాని దుశ్చేష్టితము లని యెంచి మన్నింపుడు. అభేదానందుడు అతిసారవ్యాధితో బాధపడుచున్నాడు. మీరు దయచేసి అతని పరిస్థితిని విచారించి, అతడు మఠమునకు రాగోరిన అచటికి వచ్చియున్న మాసోదరునితో అతనిని మఠమునకు పంపుడు. నేను మీకెంతయు కృతజ్ఞుడ నగుదును. మాసోదరశిష్యులు నన్ను క్రూరు డనియు, స్వార్థపరు డనియు తప్పక అనుకొనుచుందురు. అయ్యో! నే నేమి చేయగలను? నామనస్సులోతులలోనికి చూచువా రెవరు? రాత్రింబగళ్లు నే నెంత బాధపడుచున్నానో ఎవ రెఱుగుదురు? ఇంచుకేని వెనుదీయని శాంతియు, దీక్షయు నాకు కల్గునట్లు ఆశీర్వదింపుడు. మీ కనేకనమస్సులు.

భవదీయుడు
వివేకానంద

మఱిమాట :—అభేదానందుడు సోనాపూర్పురమున వైద్యప్రియమహాశయునింట నున్నాడు. నా నడుమునొప్పి యథాపూర్వమే.

## 43

(శ్రీ అభేదానందస్వామికి)

ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ

ఘాజీపూరు,
ఏప్రిల్ 2, 1890.

ప్రియ కాళీ,

నీజాబును, ప్రమదాబాబుగారిజాబును, బాబురాముజాబును చూచి ఆనందించితిని. నా కిక్కడ బాగుగనే యున్నది. నన్ను చూడవలె నని యున్న దంటివి. ఆ ఆశ నాకును కలదు. అందుకే పోవ భయపడుచున్నాను. అంతేగాక బాబాజీ నన్ను పోవల దనుచున్నాడు. కొన్నాళ్లదాక సెలవు పొంది ఆయనయొద్ద నుండి పోవుటకు ప్రయత్నింతును. కాని నా కున్న భయ మిది :— హృషీకేశముపై నాకున్న మరులుచే నేను కొండలవంక కాకృష్టుడ నగుదును. ఆమరులును దులుపుకొనుట ముఖ్యముగ నావంటి దుర్బలచిత్తునకు చాల కష్టము. ఏమి చేసినను నడుమునొప్పియు నన్ను విడుచునట్లు లేదు. ఇ దొక పీడ! కాని నేను దీనికి వాడుక పడుచున్నాను. దయచేసి నా అసంఖ్యాకవందనములను ప్రమదా బాబున కందింపుము. నా మనశ్శరీరములకు రెంటికిని ఎంతయు మేలు గూర్చు మైత్రి ఆయనది. ముఖ్యముగ ఆయనకే నేను ఋణపడియున్నాను. రావలసినవి యెట్లో ఒకట్లు వచ్చును.

శుభాశంసలు,

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 44

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

ఘాజీపూరు,
ఏప్రిల్ 2, 1890.

ప్రియమహాశయా,

నాకు మీరు కావించిన యుపదేశములలో వైరాగ్యమును గూర్చి చెప్పితిరి. నాకది యెందుండి లభించును? వైరాగ్యము కొఱకే నేనిట్లు భూమండల మంతటను పరిభ్రమించుచున్నాను. నిజమైన వైరాగ్యము నాకెప్పుడేని కల్గినచో మీకు తెల్పుదును. అట్టిది మీకు లభించినను అందులో నేనొక భాగహారి ననుటను దయచేసి జ్ఞప్తి యుంచుకొనుడు.

భవదీయుడు
వివేకానంద

## 45

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

జై శ్రీరామకృష్ణ

బరానగరము,
మే 10, 1890.

ప్రియమహాశయ,

నానావ్యాకులతలచేతను జ్వరము మరల వచ్చుటచేతను నేను మీకు జాబు వ్రాయజాలకపోయినాను. అభేదానందుని జాబువలన మీ క్షేమవార్త తెలిసినది. సంతోషించుచున్నాను. గంగాధరు డీపాటికి కాశికి వచ్చియుండును. మృత్యుదేవత మన మిత్రులను స్వజనమును ఎందఱినో కబళించివేయుచున్నందుకు నేనెంతయు (విచార) గ్రస్తుడనై యున్నాను. అచటకి నేపాళము నుండి నాపేరట ఏజాబును రాలేదు కాబోలు. (కాశీపతి)

విశ్వనాథుడు నా కెన్నడు విశ్రాంతిని ప్రసాదించునో ఎఱుగకున్నాను. ఎండవేడిమి ఇంచుక తగ్గుమొగమైనచో నే నిచటినుండి వెడలిపోవుదును. కాని ఎచ్చటికి పోవలె ననుట ఇంకను కుదుర లేదు. మీరు భక్తులు. "నాభక్తుల కెవరు భక్తులో వారే నాభక్తులలో శ్రేష్ఠులు" అనెడి భగవద్వాక్యము తలంపునకు వచ్చి మిమ్ము వేడుకొనుచున్నాను. నాకు బలము ప్రసాదింపుమని దయచేసి విశ్వనాథుని ప్రార్థింపుడు.

భవదీయుడు
వివేకానంద

## 46

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)
దేవో జయతి

57, రమాకాంతబోస్‌వీథి,
బాఘ్బజారు, కలకత్తా,
మే 26, 1890.

ప్రియమహాశయా,

ప్రతికూలపరిస్థితుల సుడిగుండములో చిక్కుకొని దురంత మనఃస్సంక్షోభము నొందుచు విశ్వనాథుని ప్రార్థించుచు మీకీ జాబు వ్రాయుచున్నాను. నే నీ క్రింద వ్రాసిన అన్నింటి ఔచిత్యానౌచిత్యములను సాధ్యతాసాధ్యతలను ఆలోచించి జవాబు వ్రాసి అనుగ్రహింపుడు.

(1) నా దేహము తిలతులసీదళసహితముగ శ్రీరామకృష్ణుని చరణములకు అర్పిత మనియు కావున నేను ఆయనకు దాసుడ ననియు మీకీ వఱకే తెలుపుకొనియున్నాను. ఆయన ఆజ్ఞను నేను తలదాల్పకుండజాలను. జ్ఞానమందును భక్తియందును ప్రేమయందును సిద్ధులందును అతిమానుషోన్నతుల నధిగమించి నలువదేండ్ల కాలము కఠోరవైరాగ్యనిస్సంగతాపావిత్ర్యములను తప

సాధనలను జరిపి ఆ మహాయోగి తనప్రాణ మర్పించుటెల్ల వ్యర్థమే అగునేని ఇక మన కాధారము కాగల దేది కాని ఎం దున్నది? కావున ఆయన మాటలు పరతత్త్వముతో ఐక్య మొందినవాని మాటలుగా నమ్ముట నా కనివార్యము.

(2) తాను నెలకొల్పిన ఈ సన్న్యాసభక్తసంఘసేవకు నేను న న్నర్పించుకోవలె ననుట శ్రీరామకృష్ణుడు నా కిడిన యాజ్ఞ. నాకు స్వర్గము కలుగనీ, నరకము కలుగనీ, మోక్షము కలుగనీ, వే ఱేది రానీ — అందుకు సంసిద్ధుడనై ఈ సంఘసేవయందు దీక్ష కలిగియుండ వలెను.

(3) సర్వసంగముల విడనాడిన తన భక్తు లొక సంఘముగ కూడి యుండవలె నని ఆయన ఆజ్ఞ. సంఘమును కూర్చుపని నా కప్పగింపబడినది. మాలో ఎవరేని ఈచోటి కాచోటికి ప్రయాణములు చేయ వచ్చు. అవి ప్రయాణములు మాత్రమే. నిలువనీడ బొత్తిగా లేక తిరుగుచుండుట పరిపూర్ణమహోన్నతసిద్ధి నొందినవానికిమాత్రమే ఉచిత మని ఆయన యభిప్రాయము. ఆదశ కల్గుటకు ముందు ఎటనైన స్థిరముగ నుండి సాధనలలో గాఢముగ మునిగిపోవలెను. దేహాదిస్మృతి పూర్తిగా వీడిపోయిన వాడు తనకు కల్గిన ఏదశనైన ననుసరింపవచ్చును. అట్లు కానప్పుడు సదా పర్యటించుచుండుట సాధకునకు హానికరము.

(4) గురుదేవుని ఆ యాజ్ఞానుసారము అతని సన్న్యాస శిష్యులబృంద మిప్పుడు బరానగరమున ఒకజీర్ణగృహమున కూడి యున్నారు. ఇన్నాళ్లును వారి ఆహారమునకును వా రుండు నింటి అద్దెకును కావలసిన ఐవీజును సురేశచంద్రమిత్రబాబు, బలరాం బోసుబాబు అను గురుదేవుని గృహస్థ శిష్యు లిద్దఱు ఇచ్చుచు వచ్చిరి.

(5) వివిధకారణాలచే శ్రీరామకృష్ణదేవుని శరీరము అగ్ని సాత్కరింపబడినది. ఆ పని చాల నిందార్హ మనుటకు సందియము

లేదు. ఆ భస్మశేష మిప్పుడు పదిలపఱుపబడియున్నది. గంగా తీరమున దాని కొఱకు తగిన గుడి యేర్పడినచో మా తల కెక్కియుండు పాపభరమునకు పరిహారమును కొంతమట్టుకు చేయ గల్గుదు మని నా యభిప్రాయము. ఆ పవిత్ర శేషములు, ఆయన పీఠము, ఆయన పటము మా మఠమున ప్రతిదినము యథావిధి ఆరాధింపబడుచున్నవి. నా సోదరశిష్యులలో నొకడు బ్రాహ్మణ వంశీయుడు, ఆ పూజాకార్యమున అహర్నిశములు వ్యగ్రుడై యున్నా డనుట మీకు తెలిసిన విషయమే. ఆ పూజ కగు వ్యయ మునుకూడ పైని పేర్కొనబడిన మహాత్ములిద్దఱే భరించుచు వచ్చిరి.

(6) శ్రీరామకృష్ణుని అవతరణముచే వంగజాతి పవిత్ర మైనది, వంగదేశము పావనమైనది. వాగాడంబరబాహ్యపటాటోపయుతమైన పాశ్చాత్యసంస్కృతి వ్యామోహమునుండి భారతీయుల నుద్ధరించుటకే ఆయన అవతరించెను. అందుకే తన సన్న్యాసశిష్యులలో అత్యధికసంఖ్యాకులను ఆయన విశ్వకళాపరిషత్తుకు చెందినవారినుండియే యెన్నుకొనెను. అట్టి ఆయనకు ఒక స్మారకమును ఈవంగదేశమున ఆయనజీవించి సాధనలనెరపిన తావునకు సమీపమున ఏర్పఱుపలేకున్నామే, ఇంతకంటె శోచనీయమైన విషయ మే మున్నది?

(7) గంగగట్టున కొంత నేలను కొని పవిత్రములైన గురుదేవుని అస్థికల కచట నారాధనాలయమును, శిష్యులు కలిసియుండుట కొఱకు వాసస్థానమును ఏర్పఱుపవలె ననెడి ఉత్కటాభిలాష పైనిపేర్కొనబడిన మహాశయుల కిద్దఱికిని ఉండెను. నేల కొను గోలుకై సురేశబాబు ముందుగా వేయిరూపాయి లిత్తు ననెను. మఱికొంతధనమును తర్వాత నిత్తు ననెను. కాని దుర్జ్ఞేయమైన భగవత్సంకల్పముచే ఆయన నిన్న రాత్రి లోకాంతరగతు

డాయెను. శ్రీబల్రామ్బాబుగారి నిర్యాణము మీ కితఃపూర్వమే తెలిసినవార్త.

(8) గురుదేవుని పవిత్రశరీరశేషములను పీఠమును గాని శిష్యులు ఎటనుండగలరో యెఱుగము. (బెంగాలులోని ప్రజల మాటలు కోటలు దాటుచుండు ననుటయు, అమలు జరుపుట కొక్కఁయడుగేని వారు ముందుకు రా రనుటయు—మీ రెఱిగిన విషయమే.) శిష్యులు సన్న్యాసులు, తమదారి యెటు సాగినను వెడలిపోవుటకు వారు ఈక్షణమందైనను సంసిద్ధులే. కాని వారి కింకరుడ నగు నేను శ్రీరామకృష్ణదేవుని పవిత్రశేషములను నెల కొల్పుటకు జేనెడు నేల అలభ్యమైనందుకు దుర్భరమనోవ్యథ నందు చున్నాను. నాగుండె పగులు చున్నది.

(9) వేయిరూపాయలలో కలకత్తాసమీపమున నొక భూమినికొని గుడిని కట్టుట అసాధ్యము. నేలను కొనుటకే అయిదు వేలరూపాయలో ఏడువేలరూపాయలో కావలెను.

(10) శ్రీరామకృష్ణుని శిష్యుల కిప్పు డున్న మిత్రులు ఆశ్రయులు మీ రొక్కరే. వాయవ్యరాష్ట్రమున మీకు గొప్ప పేరు గొప్పస్థానము ఉన్నది. విశాలమిత్రవర్గ మున్నది. మీ కిష్ట మున్నచో ఆరాష్ట్రమున మీకు తెలిసిన సంపన్నభక్త మహా జనులచేత చందాలు వేయించి యీ పనిని నెగ్గించిన బాగుండదా అను విషయమును ఆలోచింపు డని మిమ్ము ప్రార్థించుచున్నాను. బంగాళమున గంగాతీరమున శ్రీరామకృష్ణదేవుని పవిత్రశేషముల కును ఆయనశిష్యులకును ఒక నిలయమును నిర్మించుట అవశ్య కర్తవ్యమే అని మీకు తోచినచో, మీ రనుమతింతు రేని, నేను మీయొద్దకు వత్తును. ఈ ఉదాత్తప్రయోజనమునకై, మా గురు దేవునకై, ఆయనబిడ్డలకై యింటింటి కేగి యాచించుటకు సంకో చము నా కించుకేని లేదు. దయచేసి విశ్వనాథప్రార్థనాపూర్వక ముగ ఈవిషయమును బాగుగ ఆలోచింపుడు. నిలువనీడయు

సాయమును లభింపమిచే ఆభిజాత్యవంతులును విద్యాసంపన్ను లును ఋజువర్తనులును అగు ఈతరుణసన్న్యాసులు శ్రీరామ కృష్ణుని లక్ష్యముల కనుగుణముగ జీవితములు గడపలేకయే పోవుదు రేని మనదేశ భావిస్థితినిగూర్చి అయ్యో అనుకొన వలసినదే అని నా యభిప్రాయము.

(11) "నీవు సన్న్యాసివి. ఈయాశలుపెట్టుకొని బాధపడ నీ కేల?" అని మీ రందురేని అందుకు నేను చెప్పు జవాబు — నేను శ్రీరామకృష్ణుని దాసుడను. ఆయన అవతరించి సాధనలు నెరపిన దేశమున ఆయనపేరును శాశ్వతముగ నిల్పుటకైయు, ఆయన కలిపిన మహాలక్ష్యముల అనుసరింప తచ్ఛిష్యులకు ఇంచుకైన తోడ్పడుటకైయు, దొంగతనమును దోపిడిని చేయవలసి వచ్చినను చేయుట నా కిష్టమే. మీరు నాకు ప్రాణబంధువులని నే నెఱుగుదును. కావున నా మనస్సు విప్పి మీకు చెప్పుచున్నాను. నేను మరల కలకత్తాకు వచ్చియుండుట ఇందుకే. బయలుదేఱు టకు ముందే ఈవిషయమును మీకు చెప్పియుంటిని. ఇక నేమి చేయుట ఉత్తమ మని మీకు తోచునో అట్లు చేయు డని మీకు అప్పగించుచున్నాను.

(12) ఇట్టి ఆలయనిర్మాణము కాశీవంటిచోట చేసిన బాగుండు నని మీ రందు రేమో, ఇందు నాయభిప్రాయముచెప్పియే యున్నాను. గురుదేవు డవతరించి సాధనల నెరపినచోట స్మారకమైన గుడిని నిర్మింపజాలకపోవుట అత్యంతశోచనీయము! బెంగాలు పరిస్థితి జాలిపుట్టించుచున్నది. వైరాగ్యమునకు సరియైన అర్థమేమో ఇచ్చట ప్రజలు కలనైన నెఱుగజాలరు. భోగపరతయు ఇంద్రియపరతయు బెంగాలీల ఆయువుపట్లను అంతహెచ్చుగ గ్రసించుచున్నవి. అనైహికపరతయు వైరాగ్యమును భగవంతుడీదేశమునకు ప్రసాదించును గాక! చెప్పుకోదగినది వీరియొద్ద నేమియు లేదు. వాయవ్యరాష్ట్రప్రజలకు, ముఖ్యముగా వారిలోని

సంపన్నులకు, ఇట్టి ఉదారవిషయములం దత్యంతో త్సాహ మున్న దని నా నమ్మకము. ఇందుకు ఉత్తమ మని మీకు తోచినట్టి ఏదో యొక ప్రత్యుత్తరమును దయచేసి పంపుడు. ఈనా డిప్పటి కింకను గంగాధరు డిక్కడికి చేర లేదు. రేపు చేర వచ్చు. అతని పునర్దర్శనమునకై నేను మిక్కిలి ఉవ్విళ్లూఊచున్నాను.

జాబును దయచేసి పైని తెల్పియుండు చిరునామాకు వ్రాయుదురు గాక!

భవదీయుడు
వివేకానంద

## 47

(శ్రీ ప్రమదాదాసమిత్రకు)

బాఘ్బజారు, కలకత్తా,
జూన్ 4, 1890.

ప్రియమహాశయా,

మీజాబు చేరినది. మీసలహా చాల వివేకాంచితముగ నున్న దనుటకు సందేహాము లేదు. దేవుని సంకల్పము నెగ్గి తీఱు ననుట ఎంతయు నిజమే. మేమును ఇద్దఱిద్దఱుగ, ముగ్గురు ముగ్గురుగ, చిన్నజట్లుగ ఇచ్చట వ్యాపించుచున్నాము. గంగా ధరుని నుండి రెండు జాబులు నాకును వచ్చినవి. అతనికి ప్రస్తుతము చలిజ్వరము వచ్చియున్నది. అతడు గగన్బాబుగారింట నున్నాడు. గగన్బాబు అతనివిషయమున ప్రత్యేకశ్రద్ధ వహించుచున్నాడు. జ్వరము నిమ్మళించుటే తడవుగ అత డిచ్చటికి వచ్చివేయును. మీకు నా సభక్తికప్రణామములు.

భవదీయదాసుడు
వివేకానంద

మఱిమాట :—అభేదానందాదులకు క్షేమమే.

## 48

(శ్రీ శారదానందస్వామికి, కృపానందునకు)

బాఘ్బజారు, కలకత్తా,
జూలై 6, 1890.

ప్రియశరత్తుకు, ప్రియకృపానందునకు,

మీజాబులు సరిగా మాకు చేరినవి. సంవత్సరమున ఈ ఋతువులో అన్నిచోట్లకంటె ఆల్మోరా అధికారోగ్యకర మందురు. కాని మీరు జబ్బున పడితిరే! అది మన్నెజ్వరము కా దనుకొందును.

గంగాధరుని పెంకెతనము త్రిప్పటలచే దిద్దువడి అతడు వంచిన తెల్ల వంగు మృదుశిశువుగనై యున్నాడు. మనపట్ల మనగురుదేవునిపట్ల అతనిప్రేమ హెచ్చినది. ధైర్యము, స్థైర్యము, సాహసము, ఆర్జవము కలిగి యున్నాడు. మార్గదర్శకు డొకడు కావలె. ఆ మార్గదర్శకునకు పరమవిధేయుడుగ మెలగుట గంగాధరుని సహజశీలము. మెలగినచో అతడు స్పృహణీయపురుషుడుగ తయారగును.

ఈసారి ఘాజీపూరును విడిచి వచ్చు నుద్దేశము నాకు లేకుండెను. కల్కత్తాకు వచ్చు తలంపు లేనే లేదు. కాని కాళి జబ్బున పడినా డని విని కాశికి పోవలసివచ్చినది. బలరాముబాబు నాకస్మికమరణవార్త నన్ను కలకత్తాకు రప్పించినది. సురేశబాబును, బలరాంబాబును ఇద్దఱును గతించిరి. శ్రీ గిరీశచంద్రఘోషు మఠమును పోషించుచున్నాడు. ప్రయాణవ్యయమునకు పైకము లభించుటే తడవుగ ఆల్మోరాకు పోవలెనని, అటనుండి గంగాతీరమున ఘఢ్వాలులో ఏదే నొకచోట కుదుటబడి సుదీర్ఘకాలము ధ్యానములో నుండ మని — నా సంకల్పము. గంగాధరుడును నాతో వచ్చుచున్నాడు. ఇందుకే ఈయుద్దేశముతోనే నే నతనిని కాశ్మీరమునుండి తీసికొనివచ్చితిని.

కల్కత్తాకు వచ్చుటకై మీరేమియు త్వరపడ నక్కఱ లేదని నా యభిప్రాయము. సంచారకార్యక్రమమును విరమించితిరి. అది మంచిదే. కాని కూర్చుండి ధ్యానింత మని నిశ్చయించుకొనవలె. అది మీ ఏకైకకర్తవ్యము. అందుకు మీరు ఇంకను యత్నింపలేదు. నిద్రించుచున్న కన్యను నిద్రనుండి తటాలున లేపి అమ్మాయీ, లే లెమ్ము, నీపెండ్లి నీకై కనుపెట్టుకొనియున్నది అని అందురే, జ్ఞాన మటువంటిది కా దని నాతలంపు. ఏయుగమునగాని జ్ఞానసిద్ధినందినవారు అత్యల్పసంఖ్యాకులుగనే యుందురనియు, కాబట్టి మనము కృషిని సాగించుచునే యుండవలెననియు, మరణించువఱకును సాగించుచుండవలసినదే యనియు నా దృఢాభిప్రాయము. అది నా ప్రాతబడినపద్ధతి, తెలిసినదా? ఇప్పటి బూటకపుసన్న్యాసిజ్ఞానము నేను బాగుగ నెఱిగినదే. మీకు శాంతి గల్గుత, బలము గల్గుత. బృందావనమున రాఖాలుతోగూడ నున్న దక్షుడు బంగారుపండించుకొన నేర్చినాడనియు, పక్కాజ్ఞానిగనైనా డనియు రాఖాలు వ్రాసియున్నాడు. భగవంతుడతనిని అనుగ్రహించును గాక. మీరు తథాస్తు అందురు గాక.

ఇప్పుడు నా ఆరోగ్యము చాల బాగున్నది. ఘాజీపూరు వాసముచే కలిగిన మేలు కొంతకాలము నిలిచియుండునని నా గట్టి నమ్మకము. హిమాలయములకు ఎగిరిపోదమని ఆత్రపడుచున్నాను. ఈసారి నేను పహ్వారీబాబాయొద్దకుగాని మఱొక యోగివద్దకుగాని పోబోను. మహోన్నతలక్ష్యమువంకకు పోవుచున్నవారిని వారు మళ్లింతురు. సూటిగా పైకే!

ఆల్మోరాలోని శీతోష్ణపరిస్థితి మీ కెట్లున్నది? శరత్తుకాని నీవుకాని అచటినుండి రానక్కఱలేదు. ఆత్మకు హితమును కావించుకొనక, అంతమంది ఒక్కచోట కలసియుండుట వలన నుపయోగ మేమి? మూర్ఖులై సదా ఒకచోటినుండి మఱొక చోటికి తిరుగుచుండకుడు. అదంతయు చాల మంచిదే కాని వీరులుగ నుండుడు.

నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।
ద్వన్ద్వైర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛ న్త్యమూఢాః పద మవ్యయం తత్ ॥

మానమోహములులేనివారును, సంగదోషము నణచుకొన్నవారును, జ్ఞానవిద్యయం దాసక్తికలవారును, కోరికలు మానినవారును, సుఖదుఃఖములనెడి ద్వంద్వములనుండి విడు పొందినవారు నగు జ్ఞానులు నాశరహితమైన (మోక్ష) స్థానమును ప్రాపింతురు. (గీత. XV-5).

మి మ్మెవడు నిప్పులోని కుఱుకు మనును? సాధనానుకూలమైనచోటు హిమాలయములందు మీకు కనబడకున్న వేఱు ఏచోటుకైనను పొండి.

అన్ని ప్రశ్నలపరంపర మనోదార్బల్యమును సూచించును. లెండోయి, శక్తిమంతులారా, బలిష్ఠులై యుండుడు. కృషిని సాగించుచునే యుండుడు. శ్రమపడుచునే యుండుడు. వ్రాయుట కింకేమియు లేదు.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 49

(లాలాగోవిందసహాయునకు)

ఆజ్మీరు,
ఏప్రిల్ 14, 1891.

ప్రియగోవిందసహాయ్,

... అస్వార్థపరుడవుగను, పరిశుద్ధుడవుగను నుండ ప్రయత్నింపుము. అదే ధర్మసర్వస్వము. ...

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 50

(లాలాగోవిందసహాయునకు)

మౌంటుఆబూ,
ఏప్రిల్ 30, 1891.

ప్రియగోవిందసహాయ్,

ఆ బ్రాహ్మణబాలునకు ఉపనయనమును చేసితివా? సంస్కృతము చదువుకొనుచున్నావా? ఎంతవఱకు పురోగమించితివి? మొదటిభాగమును పూర్తి చేసియుందు వనుకొనుచున్నాను. శివపూజ శ్రద్ధతో చేయుచున్నావా? ఇప్పటికి చేయకున్న ఇక చేయ ప్రయత్నింపుము. "మొదట దేవునిరాజ్యము నాశ్రయింపుము. తర్వాత సకలశుభములు నీకు సమకూడగలవు". దేవుని అనుసరింపుము, ఏమికోరినను పడయగలవు. ... సేనాపతిమహాశయుల కిద్దఱికి నా వరిష్ఠవందనములు. ఉన్నతపదవులందున్నట్టి వారు నావంటి బుక్కాపకీరునెడ చాల కరుణాళులై యున్నారు. బిడ్డలారా, ధర్మసూక్ష్మము సిద్ధాంతములలో లేదు. ఆచరణలోనే యున్నది. మంచివారుగ ఉండుట, మంచి చేయుట — ఇదే ధర్మసర్వస్వము. "దేవా, దేవా అని ఆక్రందించువానికి లేదు, తండ్రి సంకల్పానుగుణముగ నడచుకొనువానికే స్వర్గము". మీరుఆళ్వారు ప్రాంతీయులు. మీ దొక మంచి యువసమాజము. అచిరకాలములోనేమీరు సంఘాలంకారభూతులుగను మిము గన్న దేశమాతకు మంగళసంధాతలుగను అగుదు రని ఆశించుచున్నాను.

మంగళము లాసించు ...

భవదీయ
వివేకానంద

మఱిమాట :— లోకమున అప్పుడప్పుడు ఒత్తిడి కలిగినను క్షోభిల్లవలదు. క్షణమున అది సమసిపోవును. సమస్తమును బాగుండును.

## 51

(లాలాగోవిందసహాయునకు)

మౌంటుఅబూ,
1891.

ప్రియగోవిందసహాయ్,

మనస్సు ఏదిక్కు పట్టినను, నీవు జపమును సాగించుచునే యుండవలెను. ప్రాణాయామము చేయవలసిన దీ లాగు ... అని హార్ బక్షునకు తెల్పుము.

సంస్కృతమును కష్టపడి అభ్యసింపుము.

భవదీయప్రేమయుత
వివేకానంద

## 52

(శ్రీ హరిదాస్ విహారీదాస్ దేశాయ్‌గారికి)

బరోడా,
ఏప్రిల్ 26, 1892.

ప్రియదివాన్ జీసాహెబుకు,

దయతో మీరు వ్రాసిన జాబు నా కిచ్చటికే అందినది. చూచి యెంతయు ఆనందించితిని. నదియాదుస్టేషనునుండి మీ యిల్లు చేరుటకు నా కించుకేని శ్రమ కల్గలేదు. ఇక మీసోదరులా, తాముండవలసినట్లే, అనగా మీకు సోదరులుగనే, యుండిరి. భగవంతుడు మీకుటుంబమునకు వరిష్ఠశ్రేయముల వర్షించుగాక. నా పర్యటనలలో ఇట్టిగుణోజ్జ్వలకుటుంబమును నేను కన్నది లేదు. మీ మిత్రుడు (శ్రీ) మణిభాయి అన్ని వసతులను సమకూర్చినాడు. ఆయనతోడి నా సాహచర్యమునుగూర్చి చెప్పవలె ననిన—మేము కలసికొన్నది రెండుపర్యాయములే. మొదటిసారి ఒక్కనిమిష కాలము. రెండవసారి దాదాపు పదినిమిషములకాలము. ఇచ్చటి విద్యాబోధనవిధానమునుగూర్చి ఆయన నాతో ప్రసంగించినది

ద్వితీయసమాగమమప్పుడే. ఇచ్చటి గ్రంథాలయమును రవివర్మ చిత్రములను చూచితిని రెండి. ఇక్కడ చూడదగినవి ఇంచుమించు అవే. కాబట్టి నేటి సాయంకాలమే నేను బొంబాయికి తరలుచున్నాను. ఇచ్చట నన్ను కరుణతో ఆదరించిన దివాన్‌జీకి (లేదా మీకు) నా ధన్యవాదములు. ఇతరవిషయములను బొంబాయినుండి వ్రాసెదను.

భవదీయప్రేమయుత
వివేకానంద

మలిమాట ;—నదియాదులో శ్రీ మణిలాలునభూభాయిని సంధించితిని. ఆయన గొప్పపండితుడు, భక్తుడు. ఆయనసాహచర్యము నా కెంతయు ప్రీతికరముగ నుండెను.

## 53

(శ్రీ హరిదాస్ విహారీదాస్‌దేశాయిగారికి)

పూనా,
జూన్ 15, 1892.

ప్రియ దివాన్‌జీసాహెబుకు,

మీయొద్దనుండి వార్త వచ్చి సుదీర్ఘకాల మైనది. మీ మనసు నొచ్చునట్లుగ నే నేమియు చేయలే దనుకొనుచున్నాను. నే నిచ్చట మహాబలేశ్వరవాసియగు ఠాకూరుతో వచ్చి ఆయనతోనే ఉన్నాను. నే నిచట వారముదినము లుందును. అంతకంటె ఒకటిరెండు దినము లెక్కువగనైన నుందును. తర్వాత హైదరాబాదుమీదుగ రామేశ్వరమునకు తరలుదును.

జునగడమున మీదారినుండి చిక్కులన్నియు ఈపాటికి తొలగియుండును. తొలగియుండు నని నా నమ్మక మనియైన చెప్పవచ్చు. మీ యారోగ్య మెట్లున్నదో — ముఖ్యముగ ఆ బెణుకు ఎట్లున్నదో తెలిసికోవలెనని చాల ఆత్రముగ నున్నది.

భవనగరరాజకుమారుని గురువగు మీ మిత్రుని 'శుర్తిని' చూచితిని. ఆయన సర్వగుణపూర్తిగల మహాశయుడు. 'ఆయన సఖ్యము లభించుట కేవలము నాభాగ్యమే' అని అనుకొనదగినంత మంచివాడు. ఉదారశీలుడు.

ఉదారచిత్తులగు మీ సోదరులకును అచటి మీ యితర మిత్రులకును ఎంతయు హృదయపూర్వకములైన నా శుభాశంసలు. మీ రింటికి వ్రాయు జాబులో నభూభాయిగారికి నా శుభాశంసలను దయతో అందజేయుడు. వెంటనే బదులు వ్రాసి నాకు సంతోషము గూర్తురని అనుకొనుచున్నాను.

మీకును మీవారికిని నా కృతజ్ఞత, హృదయపూర్వకములైన వందనములు, ప్రార్థనలు.

భవదీయశ్రద్ధాయుత
వివేకానంద

## 54

(శ్రీ హరిదాస్ విహారీదాస్‌దేశాయిగారికి)

బొంబాయి,
ఆగస్టు 22, 1892.

ప్రియ దివాన్‌జీసాహెబుకు,

మీజాబు చేరినది. నాయెడ మీకరుణ యథాపూర్వముగనే యున్నదనుటకు అది నిదర్శనము. కావున ఎంతయు సంతోషించితిని.

మీ కీలు (వ్యాధి) ఇప్పటికి ఇంచుమించు పూర్తిగా నయమైనందుకు నాకు చాల సంతోషము. ఇచ్చట నాకు కొన్ని సంస్కృతగ్రంథములు లభించినవి. వానిని చదువుటకు నాకు తోడ్పడువారును లభించియున్నారు. ఈతోడ్పాటు అన్యత్ర దుర్లభ మని నా యభిప్రాయము గావున వానిని చదివి ముగింపవలె

వని యుత్సుకుడనై యున్నాను. ఆ కారణముచే నేను మాట తప్పినందుకు నన్ను మన్నింపవలయు నని ఉదారుడైన మీసోదరునికి దయతో చెప్పుడు. నిన్న మీమిత్రుడగు మనస్సుఖారాముని దర్శించితిని. ఆయన ఒకసన్న్యాసిమిత్రుని తనయింట నుంచుకొని యున్నాడు. ఆయనకును ఆయనకుమారునికినిగూడ నాపై ఎంతో దయ.

ఇచ్చట పదునైదు ఇరువదినాళ్లుండి తర్వాత రామేశ్వరమునకు తరలుదును. అటనుండి మరలిన పిమ్మట తప్పక మీయొద్దకు వత్తును.

ఉన్నతాత్ములును ఉదాత్తచిత్తులును కృపాళువులును అగు మీవంటివారే నిజమునకు ఈలోకమునకు సంపద. తక్కినవారు సంస్కృతకవి చెప్పినట్లుగ మాతృయౌవనవనకుఠారులు!

తండ్రివలె నన్ను మీరు కనికరించినరీతిని విచారించినరీతిని విస్మరించుట యెన్నటికిని అసాధ్యము. సర్వవరదాయకుడగు భగవంతుడు మీకు లోకమున వాంఛనీయముల నన్నిటిని ఒసంగవలె ననియు, కడపట — ఆ దినమును ఆయన సుదీర్ఘకాలము త్రోసిపెట్టును గాక — మిమ్ము తన అనంతవిశుద్ధసుఖానందనిలయమునకు చేర్చుకొనుగాక అనియు ప్రార్థించుట తప్ప నీవంటి మహామంత్రికి నావంటి బుక్కాపకీరు చేయగల ప్రత్యుపకార మేముండును?

భవదీయుడు
వివేకానంద

మరిమాట:— ఈప్రాంతములలో సంస్కృతభాషాజ్ఞానమును ఇతరపాండిత్యమును బొత్తిగా లేవు. ఆలోటును గుర్తించి నేనెంతయు చింతిలుచున్నాను. ఈ ప్రాంతమువారికి భోజననిద్రస్నానాదుల విషయమున మూఢవిశ్వాసాలు ఒకమోపెడు ఉన్నవి. అవే వారి మతము, మతసర్వస్వము!

పాపము! దుష్టులును టక్కరులును ఐన పురోహితులు "ఇదే వేదసారము, హిందూసిద్ధాంతసారము" అని ఏమి బోధించినను వారి వేషములను వికటచేష్టలను అనుసరించి వారు పతనమొందుదురు. (ఈ పురోహితప్రభువులుగాని వీరితాతముత్తాతలుగాని ఇప్పటికి నాలుగువందలతరములుగా వేదముల సంపుటము నొక్కదానినైనను చూచియైనను ఎఱుగరు అను విషయమును జ్ఞప్తియుంచుకొనుడు.) కలియుగబ్రాహ్మణుల రూపమున నున్న రాక్షసులబారినుండి వారిని భగవంతుడు కాపాడుగాక.

మీయొద్దకొక బెంగాలీబాలకుని పంపినాను. వానిని దయతో ఆదరింతు రని ఆశించుచున్నాను.

భవదీయుడు
వివేకానంద

## 55

(శ్రీ పండిత శంకరలాలుకు)

బొంబాయి,
సెప్టెంబరు 20, 1892.

ప్రియపండితమహాశయా,

తమజాబు నాకు సక్రమముగా చేరినది. ప్రశంసల కర్హత నాకు లేకుండగా నన్ను అట్లు ఏల పొగడవలెనో నాకు తెలియదు. జీససుప్రభువు చెప్పియున్నట్లుగా "ఉన్నమంచివా డొక్కడే, దేవుడు, వేఱెవరును లేరు". ఇతరు లందఱును దేవుని చేతి ఉపకరణమాత్రులే. పరాత్పరుడగు సర్వేశ్వరునకు జయము. అర్హులైనవారికి జయము. కాని నాబోటి అనర్హునకు కాదు. ఇచ్చట "దాసునకు బత్తెమున కర్హత లేదు". అందును ఫకీరున కెట్టి ప్రశంసార్హతయు లేదు. తనవిధిని నిర్వర్తించినంతమాత్రమునకు మీరు మీకింకరుని కొనియాడుదురా?

...... పండిత సుందరలాల్జీయు మా గురువుగారును * దయతో న న్నిట్లు జ్ఞప్తియం దుంచుకొని యున్నందులకు ఇంతం తనరానంతగా కృతజ్ఞుడను.

ప్రస్తుతము మీకు మఱొకవిషయమును చెప్పెదను. హిందువులకు మూలసూత్రమునుబట్టి తేలు విషయములను గుర్తించు కొనుచు పోవు (డిడక్టివ్) చిత్త మున్నదే కాని, విషయములను బట్టి మూలసూత్రమును తేల్చుకొను (ఇండక్టివ్) చిత్త మెప్పుడును లేదు. ఒకసామాన్యసూత్రమును మున్ముందు నిరాక్షేపముగ తలదాల్చి కేశనిర్భేదనకల్పములగు వాదములు సాగించుట మన శాస్త్రగ్రంథములం దన్నింట గాననగును. కాని తలదాల్పబడిన ఆ సూత్రమే యెంతయు శిశూచితముగ నుండవచ్చు. మూలసూత్రముల యాథార్థ్యమును ఆక్షేపించినవాడుగాని, పరిశీలించినవాడుగాని యెన్నడును లేడు. స్వతంత్రముగ ఆలోచించుట మనలో లేనే లేదు. కావున విశేషములను పరికించి మూలసూత్రముల నెఱుగు యత్నముచే రూపొందు విజ్ఞానశాస్త్రములు మనలో మృగ్యములైనవి. ఇట్టిపరిస్థితికి కారణ మేమి? రెండుకారణము లున్నవి. కార్యోత్సాహమునకంటె విశ్రాంతియందును భావనయందును అధికప్రీతిని కలిగించు తీవ్రోష్ణవాతావరణ మొక కారణము. పురోహితులైన బ్రాహ్మణులు దూరదేశములకు ప్రయాణింప నెప్పుడును పూనుకొనకపోవుట రెండవ కారణము. పర్యటించినవా రున్నారు. దూరదేశములకు పోయినవా రున్నారు. కాని ప్రాయికముగ వా రందఱును స్వలాభైకపరతచేతను మతాచార్యులకైతవముచేతను వైజ్ఞానికముగ నభివృద్ధి చెందు అవకాశము పూర్తిగా కోల్పోయినట్టి వర్తకులు. కావున వారు చూచి చేసిన తెలివిడులవలన మానవుల విజ్ఞానమునకు వృద్ధి గల్గక క్షయమే చేకూరినది. వారు చూచి చేసిన

* స్వామీజీకి మహాభాష్యము పాఠముచెప్పినవారు.

తెలివిడు లన్నియు తప్పులు, అతిశయోక్తులు. బొత్తిగా గుర్తు చిక్కనంత వికృతప్రతిపాదనలు.

కాబట్టి, మనము పర్యటింప వలెను, అన్యదేశములకు పోవలెను. తెలిసినదా? మనముకూడ ఒకదేశీయులముగ మరల గణన కెక్క వలె ననిన అన్యదేశములలో సంఘయంత్ర మెట్లు పనిచేయుచున్నదో పరిశీలింపవలెను; ఇతరదేశాలవారి మనస్సులలో ప్రవర్తిల్లుచున్న విషయాలతో మనకు నిర్నిరోధమును బాహాటమున్నైన సాంగత్య ముండ వలెను. అన్నిటికన్న ముఖ్యమైన దేమనగా మనము దురధికారముచూపుట మానుకోవలెను. ఎంతటి పరిహాసాస్పదమైన దశకు మనము వచ్చితిమి. ఒకమాలడు, మాలడుగానే, ఎవనియొద్దకేని వచ్చునేని ప్లేగు వ్యాధిని తఱిమిన ట్లతనిని తఱిమివేయుదురు. కాని అతడే ముందుగా నొకపాదిరి యొద్దకు పోవు ననుకొనుడు, ఏవో కొన్ని ప్రార్థనమంత్రాలు గొణగి ఆ పాదిరి ఒకగిన్నెడు నీరు అతని నెత్తిని చల్లుననుకొనుడు, తర్వాత అత డొక కోటును — ఎంతో శిథిలమైన కోటునైనను సరే — తగిలించుకొని మిక్కిలి సనాతనాచారపరుడగు హిందు వుండు గదిలోనికి వచ్చు ననుకొనుడు, అప్పు డతని కొక ఆసన మీయక, హృదయపూర్వకముగ అతనితో కరచాలనము చేయక ఉండ గల ధైర్యవంతుడు సనాతనాచారపరులగు హిందువులలో నా కగపడలేదు. వైపరీత్యమున ఇంతకు పైమెట్టు లేదు. దక్షిణ భారతదేశమున ఈ పాదిరీలు ఏమి చేయుచున్నారో వచ్చి చూడుడు. నిమ్నవర్గాల ప్రజలను వారు లక్షలకొలదిగ తమ మతములోనికి కలుపుకొనుచున్నారు. పురోహితుల అధికారము భారతదేశమంతటిలోను తిరువాన్కూరులో ఎక్కువ. అచటి భూమియందు ప్రత్యంగుళమును బ్రాహ్మణుల ఆస్తి. అచటి మహిళలు — రాజకుటుంబమునకు చెందిన మహిళలుసైతము బ్రాహ్మణుల కుంపుడుగత్తెలుగ నుండుట తమకు మహోన్నతగౌరవ

మని భావింతురు. అటువంటి తిరువాన్కూరి ప్రజలలో ఇంచు మించు ఒకపాతికభాగమువారు క్రైస్తవులుగ మాఱిరి. నేను వారిని నిందింపజాలను. దేవిడ్డులోను జెస్సెలోను వారి కేమి వంతున్నది? ఓదేవా, మానవుడు మానవునికి సోదరుడుగ నుండు కాల మెప్పుడు వచ్చును? ఎప్పుడు?

భవదీయుడు
వివేకానంద

## 56

(శ్రీ హరిదాస్ విహారిదాస్‌దేశాయిగారికి)

బొంబాయి.

ప్రియ దివాన్జీసాహేబుకు,

ఈ జాబును తెచ్చు బాబు అక్షయకుమార్‌ఘోషు నాకు విశిష్ట మిత్రుడు, కల్కత్తాలో గౌరవార్హకుటుంబములలో నొకదానికి చెందినవాడు. కల్కత్తాలో ఆకుటుంబమువారిని చిరకాలముగ నే నెఱిగియున్నను, ఇతనిని ఖండ్వాలో జూచినప్పటినుండిమాత్రమే నా కితని పరిచయము.

ఈ బాలుడు ఋజువర్తనుడు, మేధాశాలి, కల్కత్తా విశ్వ విద్యాలయమున పట్టపరీక్షకు క్రిందితరగతివఱకు చదువుకొన్న వాడు. బెంగాలులో నిప్పటి జీవితపరిస్థితు లెంత దుర్భరములో మీ రెఱిగినవిషయమే. పాప మీ కుఱ్ఱవాడు నౌకరికై అల్లాడు చున్నాడు. మీ సహజకృపాభరితహృదయ మెఱిగిన నేను ఈ యువకుని క్షేమైన సాయపడుడని మి మ్మడుగుచున్నాను, ప్రార్థించు చున్నాను. ఈ వేడ్కోలుకు మీ రేమియు కలత చెంద రని అనుకొనుచున్నాను. ఇంతకంటె నే నెక్కువగ వ్రాయ నక్కఱ లేదు. ఇతడు ఒడలుదాచుకొనక పాటుపడువా డనియు, విశ్వా

పాత్రు డనియు మీరే గుర్తింపగలుగుదురు. మీరు ఉదాత్తులరు, కృపాళువులరు. ఒక్కసాయము చేయుటచే, కోటిప్రాణిజీవిత మంతయు సుఖమయ మగు సందర్భమున, అట్టి సాయమునకు ఈ బాలుడు పాత్రు డని మీకు నేను జ్ఞప్తిపఱుపవలసిన యావశ్యకత లేదు.

ఈ నా ప్రార్థనవలన మీ కిబ్బందియు చిరాకును గల్గ దను కొనుచున్నాను. మిక్కిలి ప్రత్యేకపరిస్థితులలో ఈ ప్రార్థన చేసి యున్నాను. ఇట్లు ప్రార్థించుట కిదే మొదలు, ఇదే తుద. మీ కృపాశీలమును విశ్వసించుచు ఆశించుచున్నాను.

భవదీయ శ్రద్ధాయుత
వివేకానంద

## 57

(శ్రీ అళసింగపెరుమాళుకు)

హైదరాబాదు,
ఫిబ్రవరి 21, 1893.

ప్రియ అళసింగా,

విశ్వకళాపరిషత్పట్టభద్రుడగు నీ యువమిత్రుడు నన్ను పిలుచుకొనిపోవుటకు స్టేషనుకు వచ్చియుండెను, ఒకబెంగాలీమహాశయుడును వచ్చియుండెను. ప్రస్తుతము నేను ఆ బెంగాలీమహాశయునింట నున్నాను. రేపు నీ యువమిత్రునింటికి మాఱి కొన్నాళ్లుందును. ఇచటి వివిధదృశ్యములను చూచెదను. ఇక కొన్నాళ్లలో మదరాసులో నా రాకను నీవు నిరీక్షింపవచ్చు. ఏలయన, నే నిప్పుడు రాజపుత్రస్థానమునకు పోజాలను. ఆలాగు చెప్పవలసి వచ్చినందుకు చింతిలుచున్నాను. ఇక్కడ ఇప్పటికే ఎండవేడిమి అతిభయంకరముగ నున్నది. ఇక రాజపుత్రస్థానమున ఎండవేడిమి

ఇం కెంతగ నుండునో నే నెఱుగను. వేడిమి నించుకేని నే నోర్వ లేను. కాబట్టి నేను చేయబోవు తర్వాతిపని బెంగుళూరుకు మరలి వచ్చుట, అచటినుండి వేసవిని గడపుటకు ఉదకమండలమును చేరుట. వేడిలో నాబుఱ్ఱ ఉడికిపోవును.

కావున నా పన్నాగము లన్నియు నేలపాలై నవి. అందుకే నేను మద్రాసునుండి పరుగున వెలువడ గోరినది. అట్లు చేసిన, కొన్ని నెలల వ్యవధి నాకు లభించియుండును. ఆ కాలములోగా ఉత్తరభారతసంస్థానాధిపతులలో నన్ను అమెరికాకు పంపగలవాని నొకనిని వెదకి పట్టవీ లయ్యెడిది. కాని అయ్యో, కాలాతిక్రమ ణము సంభవించినది. మొదటివిషయము ఈ ఎండలో నే నల్లాడ లేను. నా ప్రాణములు పోవును. రెండవవిషయము రాజపుత్ర స్థానములోని నా గాఢమిత్రుల చేతికి నేను చిక్కితినేని వారు నన్ను యూరపునకు పోవనీయరు. తమపార్శ్వములందే కట్టిపడ వేసికొందురు. కాబట్టి నా మిత్రులకు తెలియనీయక, క్రొత్తవాని నెవనినైన అవలంబింత మని పన్నాగించితిని. కాని మదరాసులో కల్గిన జాగుచేత నా ఆశలన్నియు పటాపంచ లైనవి. నిట్టూర్పుచు నేను ఆ యాసలను వదలుకొనుచున్నాను. భగవంతుని సంకల్పము నెఱవేఱును. ఐనను కొన్నిదినములలో నిన్ను చూడగలను. నీవు ఇంచుమించు గట్టిగ నమ్మియుండవచ్చును. ఒకటిరెండుదిన ములు మదరాసులోనుండి తర్వాత బెంగుళూరుకు అటనుండి ఉదకమండలమునకును పోయి — మహారాజు గారు న న్నంపుదు రేమో చూడవలసియున్నది. "అంపుదు రేమో" అనుట ఏల యనగా (ద) రాజులు చేసిన వాగ్దానము తప్ప రని నేను విశ్వసింపలేను. వారు రాజపుత్రులు కారు. రాజపుత్రుడు ప్రాణమునైన విడుచునే గాని మాట తప్పడు. కాని మానవుడు తనజీవితము గడచినకొలదియు విషయములు తెలిసికొనుచుండును. విశ్వమున గురువులకును గురువు అనుభవమే.

"దివియందువలెనే భువియందును నీ సంకల్పమే నెఱ వేఱును. ఏలయన, కాలతత్త్వమున్నంతవఱకును వైభవము నీది, రాజ్యము నీది" మీకెల్లరకు నా అభినందనములు.

మీ

సచ్చిదానంద*

## 58

(డాక్టరు నంజుండరావుగారికి)

ఖేత్రి,

ఏప్రిల్ 27, 1893.

ప్రియ డాక్టరుమహాశయా,

మీజాబు ఇప్పుడే నాచేతి కందినది. గౌరవార్హత ఇంచు కేని లేని నాయందు మీరు వహించుచున్న ప్రేమచే నేనెంతయు ఆనందించుచున్నాను. పరితాపము — బాలాజీగారి పుత్రుడు దేహవియోగ మొందెనను వార్త విని యెంతయు దుఃఖించు చున్నాను. "ఈశ్వరుడు ఇచ్చినాడు, ఈశ్వరుడే మరల పుచ్చు కొన్నాడు, ఈశ్వరనామము భాగ్యవంత మగుత" అందురు పెద్దలు. ఉన్నవస్తువునకు దేనికిని నాశము కల్గుట లేదు. నాశ మొందుట అసాధ్యము. మనకు తెలిసిన ది దొక్కటే. మనము చేయవలసినదెల్ల ఇంతే:—శాంతముగ సంపూర్ణముగ భగవ దర్పితభరులమై ఉండవలెను. సేనాపతి సైనికుని ఫిరంగీ కెదురుగ పొమ్మని ఆజ్ఞాపించెనేని సైనికునకు అందుంగూర్చి తప్పు లెన్ను టకో గొణుగుకొనుటకో అధికారము లేదు. దుఃఖము ముంచుకొని వచ్చియున్న ఈ సమయమున బాలాజీకి ఈశ్వరుడే ఓదార్పు కూర్చును గాక. ఈ దుఃఖమే కారణముగా కరుణామూర్తియగు

* ఆ దినాలలో స్వామిజి తనకు పెట్టుకొనియుండిన పేరు.

జగన్మాతృహృదయమునకు ఆయన మీదుమిక్కిలి అంతరంగికుడుగ స్వీకరింపబడును గాక.

నా నౌకాయాత్రకు సంబంధించినంతవఱకు కావలసిన ఏర్పాట్లును ఇంతకుముందే బొంబాయిలో చేసిపెట్టియున్నాను. ఖేత్రీమహారాజో, నా సోదరశిష్యుడో, నా ప్రణాళికలో అడ్డముగ ఎట్టివిఘ్నమును ఎప్పుడును కల్గింపరని శ్రీ భట్టాచార్యునకు తెలుపుడు. ఇక రాజుగారా, నామీద ఆయన వహించియుండు ప్రేమకు మితియే లేదు.

లోకశంకరుడగు పరమేశ్వరుడు మీకందఱకు ఇహమందును పరమందును మంగళము లొనగూర్చుగాత. ఇదే నా నిరంతర ప్రార్థన.

వివేకానంద

## 59

(శ్రీ హరిదాస్ విహారిదాస్‌దేశాయిగారికి)

ఖేత్రి,
ఏప్రిల్ 28, 1893.

ప్రియ దివాన్జీసాహేబుకు,

ఇచటికి వచ్చు దారిలో నదియాదునొద్ద మీ తావునకు పోయి నా వాగ్దానము చెల్లించుకొనగోరితిని కాని కొన్ని పరిస్థితులు నన్ను అడ్డగించినవి, వానిలో అన్నిటికంటె ప్రముఖమైనది అచట మీరు లేకుండుట. హామ్లెట్టు పాత్రను విడిచిపెట్టి హామ్లెట్టు నాటక మాడుట నవ్వులచేటు. కొన్నాళ్లలో మీరు నదియాదుకు మరలి రానున్నారని నాకు గట్టిగ తెలిసియున్నందున, త్వరలోనే, ఇరువదిదినాలలోగా, నేను బొంబాయికి మరలిపోవనున్నాను గనుక, మీ ఊరికి వచ్చుపనిని అప్పటికి పెట్టుకొనుట మేలని ఎంచితిని.

ఇచట ఖేత్రిరాజాజీ నన్ను చూడవలె నని చాల ఆత్రపడి తన ఆంతరంగికకార్యదర్శిని మద్రాసుకు పంపెను, కావున నేను ఖేత్రికి తరలిరావలసివచ్చినది. కాని ఎండవేడిమి అతిదుస్సహముగ నున్నది, కావున చాల త్వరలోనే ఇందుండి వెడలిపోవుచున్నాను.

మ ఱొక మాట. నే నించుమించు దాక్షిణాత్యరాజు లందఱ పరిచయము గడించితిని. పెక్కుచోట్ల చాల వింతదృశ్య ములను చూచితిని, మిమ్ము ఈతూరి కలసికొన్నప్పు డావిషయ ములను ఆమూలాగ్రము మీకు తెల్పెదను. నాపై మీ కున్న ప్రేమ నే నెఱుగుదును. మీ ఊరికి రానందుకు మీరు నన్ను మన్నింతు రని నా గట్టి నమ్మకము. ఏమైనను కొన్నాళ్ళలో మీయొద్దకు రానున్నాను.

ఇం కొక్క విషయము: జునగడమున మీయొద్ద ఇప్పుడు సింహకిశోరము లున్నవా? మా రాజుగారికై మీ రొక్క కిశోర మును ఎర వీయ గలరా? మీ రిష్టపడుదు రేని, అందుకు బదులుగా ఆయన మీకు రాజపుత్రస్థానమందలి కొన్ని మృగముల నీయ గలడు.

రతీలాల్భాయిని నేను రైలుబండిలో చూచితిని. ఆయన ఎప్పటి రమ్యపురుషుడే కృపాళుడే. మీ జీవితము సదా పవిత్ర మైనది, శుభమైనది. మహాకృపానాథుడగు సర్వేశ్వరుని పుత్రు లయు పుత్రికలయు అసంఖ్యాకుల సేవకు అంకితమైనది. అట్టి మీ జీవితమున ఈచరమభాగమును ఎల్లరును గౌరవించుచున్నారు. బాగుగా ప్రశంసించుచున్నారు. అట్టిది మీకు ఎంతయు తగినదే. ఈ జీవితచరమభాగమున సర్వేశ్వరుడు మీకు సర్వస్వమై యుండు గాత మని కోరుటకంటె, ప్రియదివాన్జీసాహేబు, హెచ్చుగా ఏమి కోరుదును? తథాస్తు.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 60

(శ్రీ హరిదాస్ విహారిదాస్‌దేశాయిగారికి)

ఖేత్రి,
మే 1893.

ప్రియదివాన్జీసాహేబు,

మీరు నాకు జాబు వ్రాయునప్పటికి నాజాబు మీకు చేరి యుండలేదనుట నిజము. మీజాబు నాకు సంప్రీతిని సంతాపమును ఏకకాలమున గలిగించినది. మీవంటి ఉదారహృదయులకు ఉన్నతపదవీస్థితులకు మహాప్రభువులకు నేను ప్రియుడనుగనుండుట సంప్రీతికారణము. నా ఉద్దేశ్యమును మీ రామూలాగ్ర మపార్థము చేసికొని వ్రాసినందుకు సంతాపము. మీరు నాకు ప్రియులని, మీపై నా కున్నది పితృగౌరవమని, మీపట్లను మీకుటుంబము పట్ల నా కృతజ్ఞతకు నిజముగ మితి లే దని—నమ్ముడు. నిజ మిది: చికాగోకు పోవు కోరిక నాకు ముందే యుండె ననుట మీజ్ఞప్తిలో ఉండవచ్చు. మదరాసులో నుండగా, 'మైసూరు' 'రామనాథపుర' మహారాజులతో కూడుకొని అచటి ప్రజలు తమంతట తామే నన్ను విదేశముల కంప అన్ని యేర్పాట్లను గావించిరి. ఖేత్రీమహారాజు గారికిని నాకును మధ్య నున్న ప్రగాఢప్రేమబంధములను కూడ స్మరింపుడు. నేను అమెరికాకు పోవుచున్నా నని యథావిధిగా ఆయనకు వ్రాసితిని. నాపైని తమ ప్రేమకొలది ఖేత్రీమహారాజు గారు నేను విదేశాలకు తరలుటకు ముందు ఆయనను చూడక తప్ప దనుకొనిరి. అందుల కొక ప్రత్యేకకారణ మే మనగా, ఆయన కనంతరము సింహాసనము నధిష్ఠింపగల పుత్త్రు నొకనిని పరమేశ్వరుడు ఆయన కనుగ్రహించినాడు, అచట మహోత్సవ ములు సాగుచున్నవి. నన్ను తప్పక రప్పించుకొనుటకై దూర మనుకొనక ఆయన తన ఆంతరంగిక కార్యదర్శిని నన్ను పిలుచు కొని ర మ్మని మదరాసు కంపెను. నేను పోయి తీరవలసినదే.

ఇంతలో మీరు నదియాదులో ఉన్నారో లేనో తెల్పవలసిన దని మీ సోదరునికి తంతె చేసితిని. దురదృష్టవశమున అందుకు జవాబు నాకు అంద లేదు. పాపము కార్యదర్శి తనప్రభువుకై మద్రాసుకు రాకపోకలయూపాన చాల శ్రమపడి యుండెను. ఉత్సవసమయము లోగా మేము క్షేత్రికి చేరకున్నచో తనప్రభువు చాల వెతచెందు నన్న ఒక్క విషయముపై నే దృష్టినుంచి, ఆయన మాకు జయపూరు వఱకు టిక్కెట్లను తత్క్షణమే కొనెను. దానిలో మేము రతీలాలును సంధించితిమి. నాతంతె చేరిన దనియు, అందుకు ప్రత్యుత్తరము కూడ పంపబడె ననియు శ్రీ విహారిదాసు మాకై నిరీక్షించు చున్నా డనియు ఆతడు మాకు తెలిపెను. నిష్పక్షపాతముగ ధర్మమును నిర్ణయించుటే ఇన్నాళ్లును మీవిధిగ నుండెను కదా. ఇప్పు డిందు ధర్మనిర్ణయము చేయవలసినవారు మీరే. ఈ సంద ర్భమున నే నేమి చేయుదును, చేయగలను? నదియాదులో దిగియుండినచో క్షేత్రిలోని ఉత్సవ సమయమునకు నే నందుకో గల్గియుండను. మఱొకవైపు నా ఉద్దేశ్యాలకు అపార్థములను కల్పింప వచ్చును. కాని మిమ్ము నే నెఱుగుదును, నాయందలి మీ సోదరునిప్రేమ నే నెఱుగుదును. కొన్నాళ్లలో చికాగోకు తరలునప్పుడు నేను బొంబాయికి మరలవలసియుండు ననియు నే నెఱుగుదును. కావున మరలివచ్చినప్పుడు వత్తము అనుకొనుటే ఉత్తమపరిష్కార మని నే నెంచితిని. మీసోదరులు నాప్రక్కన నుండి పరిచర్య చేయనందుకు నే నవమానపడితి నంటిరే, అది నా కలలో నైనను లేనిది, మీరు క్రొత్తగా కనుగొంటిరి. మీరు మనసులలో నున్నదానిని కనిపట్టగల వారైతి రేమో దేవునకే ఎఱుక. తమాషమాట లటుండనిండు, ప్రియదివాన్జీసాహేబ్, జునగడములో మీరు చూచినప్పుడు నే నెట్టివాడనో ఇప్పుడును అట్టి లీలాప్రియుడనే, తుంటరినే, నిజము చెప్పుచున్నాను, అట్టి అమాయికబాలుడనే. పరమోదారులగు మీపైని నాప్రేమ అట్లే ఉన్నది, లేదా, నూఱంతలుగ పెరిగినది. ఏల యన దక్షిణభారత

ములో ఇంచుమించు అన్ని సంస్థానములలోను ఉన్న దివాన్లతో మిమ్ము నేను నామనస్సున పోల్చిచూచుకొన్నాను. నిజమునకు మీయుదారగుణములకు మితి పెట్టుటకు నాశక్తులు చాల వనుట నే నెఱిగియున్నను ప్రతిసంస్థానమునకు పోయినప్పుడును మీ ప్రశంస వచ్చినప్పు డెల్ల నావా క్కెంత ధాటీమండితమయ్యెడిదో అందుకు దేవుడే సాక్షి. ఈ సమాధానమే చాల కున్నచో, తండ్రి పుత్రుని మన్నించినట్లుగా మీరు నన్ను మన్నింపవలసిన దని ప్రార్థించుచున్నాను. నాకంత ఉపకారకులైన మీపట్ల నేను కృతఘ్నుఁడ నైతి నను తలంపు నన్ను వెన్నాడకుండు గాక.

మీ
వివేకానంద

మఱిమాట :—నేను నదియాదునొద్ద దిగకపోవుటను గూర్చి మీసోదరుని మనస్సున ఏదేని అపోహ యున్నచో దానిని పోగొట్టుటకు నేను మీపైనే ఆధారపడుచున్నాను. నేను కేవలము పిశాచమే ఐనను వారికరుణను ఉపకారాలను మఱచుట నాకు శక్యము కాదు.

ఇక తక్కిన యిద్దఱు స్వాములనుగూర్చి — వారు నా సోదరశిష్యులు, లోగడ జునగడమున మీయొద్దకు వచ్చినవారే. వారిలో ఒకడు మాకు నాయకుడు. మూడేండ్ల కాలమునకు తర్వాత వారిని నేను కలసికొంటిని, ఆబూవఱకు కలసియే వచ్చితిమి, తర్వాత నేను వారిని వీడిపోయితిని. మనకు కావలె నని, బొంబాయికి వచ్చుదారిలో వారిని నేను నదియాదుకు మరల పిలుచుకొని రాగలను. మీమీదను మీవారిమీదను సర్వేశ్వరుడు శ్రేయముల వర్షించును గాక.

మీ
వి.

## 61

(శ్రీ హరిదాస్ విహారిదాస్‌దేశాయిగారికి)

బొంబాయి,
మే 22, 1893.

ప్రియదివాన్జీసాహేబు,

బొంబాయి చేరి కొన్నాళ్లైనవి, కొన్నాళ్లలోనే ఇటనుండి తరలిపోదును. నేనుండుటకు చోటిమ్మని మీరొక వణ్యామహాశయునకు జాబు వ్రాసితిరే, అతడు వ్రాసిన బదులు — అతనింట అతిథు లిప్పటికే నిండుగ నున్నారట, వారిలో కొందఱు వ్యాధిగ్రస్తులుగను ఉన్నారట, నాకు చోటు చూపలేనందుకు తాను చాల చింతిల్లుచున్నాడట. తుదకు మాకు గాలి బాగుగా వచ్చు మంచిచోటు దొరకినది.

... ఖేత్రిమహారాజుగారి అంతరంగికకార్యదర్శియు నేనును కలిసి ఒక్కచోటనే ఉన్నాము. నాయందు ఆయన కున్న కరుణకును ప్రేమకును నాకృతజ్ఞతను మాటలలో చెప్ప లేను. రాజపుత్రస్థానములో రాజులు సైతము లేచి ఎవనిని గౌరవింతురో అతడు తాజీమిసర్దా రనబరగును. ఈయన తాజీమిసర్దారు. అట్టివాడైయు ఈయన చాల సరళస్వభావుడు. ఒకొక్కసారి ఈయన నాకు చేయు సేవకు నే నించుమించు సిగ్గుపడవలసియుండును.

... మానవులలో అత్యంతశ్రేష్ఠులైనవారికి కూడ తఱచు కష్టములు గల్గుచుండును, అవమానములు సంభవించుచుండును. అది అసమాధేయముగ నుండ వచ్చు. కాని ఇచ్చట ప్రతిదాని హృదయములోను అంతరతమభాగములోను మంచియే యున్న దనుటయు నాజీవితానుభవమే. పైపైన కల్లోలము లెట్లున్నను లోతున అన్నిటికిని అట్టఅడుగున అనంతశ్రేయఃప్రేమమూల మున్నది. ఆ మూలమును మన మందుకొనకుండువఱకును చిక్కులు పడుచుందుము. ఆ ప్రశాంతనిలయము నొక్కసారి చేరుకొందు

మేని ప్రళయవాయువులు ఘోషించుగాక, తుపాను విజృంభించు గాక, యుగయుగములుగా పర్వతమూల బంధముపై నిర్మితమైన యిల్లు చలింపజాలదు. జీవిత మంతయు పరోపకారములకర్పించిన మీవంటి సజ్జనులు నిస్స్వార్థులు పావనులు ఇప్పటి కెన్నడో ఆ అప్రకంప్యమూలమును చేరుకొని ఐనది. దానినే భగవంతుడు గీతలో బ్రహ్మనిష్ఠ అని పేర్కొనియున్నాడు.

తిన్న దెబ్బల ఫలితముగా, మీరు ఇహపరములందు ప్రేమ కేకైకలక్ష్యమగు వానికి మఱింత సన్నిహితుల రగుదురు గాక. భూతవర్తమానభవిష్యములలో ప్రతిదానిలోను మీ కాయన సాక్షాత్కారము గల్గుత. ఉన్నవానిని చన్నవానిని అన్నింటిని మీ రాయనలో, ఆయనలో మాత్రమే, సాక్షాత్కరించుకొందురు గాక. తథాస్తు.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 62

(శ్రీమతి ఇందుమతిమిత్రకు)

బొంబాయి,
మే 24, 1893.

ప్రియజననీ,

నీ జాబును ప్రియ హరిపాదుని జాబును జూచి ఎంతయు ఆనందించితిని. నీకు నేను జాబులను మిక్కిలి తఱచుగా వ్రాయ జాలకున్నందుకు దయచేసి చింతిల్లకుమా. నీ క్షేమమునకై నేను దేవుని సదా ప్రార్థించుచున్నాను. తే 31 ది అమెరికాకు తరలుటకై ఏర్పాట్లన్నియు సిద్ధముగ నున్నవి కావున ఇప్పుడు బెల్గామునకు పోలేను. ఈశ్వరు డనుకూలించునేని, అమెరికా యూరపులలో పర్యటించి మరలి వచ్చినప్పుడు నిన్ను దర్శింతును. సదా

శ్రీకృష్ణార్పితజీవనులుగ మనుడు. మనము ఈశ్వరునిచేతి ఆట బొమ్మలము అను విషయమును సదా జ్ఞప్తియుంచుకొండి. సదా విశుద్ధి గల్గి యుండుడు. వాక్కునందును క్రియలందును ఎట్లో, అట్లే మనసునందుసైతము కల్మష మంటకుండునట్లు దయచేసి జాగరూకత వహింపుడు. మీచేతనైనంతవఱకు ఒరులకు మేలు చేయుటకే ప్రయత్నింపుడు. మనసుచే వాక్కుచే క్రియచే పతికి సేవచేయుటే సతికి ముఖ్యధర్మ మని జ్ఞప్తియుంచుకొమ్ము. నీకున్న అవకాశము కొలది దయచేసి భగవద్గీతాపారాయణమును ప్రతిదినమును చేయుచుండుము. '...దాసి' అని ఏల సంతకము చేసితివి. 'దాసుడు' 'దాసి' అని సంతకము చేయవలసినవారు వైశ్యులును శూద్రులును; 'దేవుడు' 'దేవి' అని సంతకము చేయవలసినవారు బ్రాహ్మణులును క్షత్త్రియులును. పైగా ఈ వర్ణాదివిభేదములు వివేకులైన ఆధునికబ్రాహ్మణులు కల్పించినవే. ఎవడు దాసుడు? ఎవరికి? ప్రభువైనహరికి అందఱమును దాసులమే. కావున మహిళ తనపెనిమిటియింటిపేరునే వాడవలెను. 'ఫలానాఫలానామిత్ర' అన్నట్లుగా. ఇది సనాతనవైదికాచారము. అమ్మా, విస్తరించి వ్రాయుట అనావశ్యకము. నీక్షేమమునకై నేను నిరంతరము ప్రార్థించుచుందు నని సదా నీకు తెలిసియుండవలెను. అమెరికా నుండి, అచటి వింతలను వర్ణించుచు, జాబులను నీకప్పుడప్పుడు వ్రాయుచుందును. ఇప్పుడు బొంబాయిలో నున్నాను. తే 31 ది వఱకు ఇట నుందును. నన్ను నావ నెక్కించి సాగనంపుటకు శ్రీ ఖేత్రీమహారాజావారి ఆంతరంగికకార్యదర్శి ఇచటికి వచ్చి యున్నాడు.

శుభాశీస్సులు.

భవదీయ ఆర్జవయుత
వివేకానంద

## 63

(అళసింగప్రముఖ మద్రాసుమిత్రులకు)

యోకోహామా,
జూలై 10, 1893.

ప్రియ అళసింగ - బాలాజీ - జి. జి. బాంకింగ్ కార్పొరేషనువారు - మొదలుగా మదరాసు మిత్రులందఱికి,

నా పర్యటన(వివర)ములను సదా మీకు తెలిపించుచుండ నందుకు నన్ను మన్నింపుడు; ఏదినముకాని మానవుని కార్యక్రమము అందును ముఖ్యముగ వస్తువులను దక్కించుకొనుచు భద్రపఱచుకొనుచుండు జీవితమునకు క్రొత్తవాడ నగు నా కార్యక్రమము నిర్విరామమే. అది నా శక్తిని ఎంతో గ్రసించివేయుచున్నది. నిజమున కది మిక్కుటమైన జంజాటమే.

బొంబాయినుండి కొలొంబోకు చేరుకొంటిమి. మాఓడ ఇంచుమించు ఆ దినమంతయు ఆ రేవున ఆగియుండినది. దిగిపోయి నగరమునుచూచుటకు మేము ఆ యవకాశమును వినియోగించుకొంటిమి. పురవీథులగుండ పోయితిమి. మేము చూచిన వానిలో నాకు జ్ఞప్తియున్న దొక్కటే. ఏదనగా ఒకగుడి. అందు మేను వ్రాల్చి నిర్వాణమందుచున్న తీరులో బుద్ధదేవుని పెద్ద విగ్రహ మొకటి యున్నది.

* * *

తర్వాత మా ఓడ ఆగినచోటు పినాంగు. అది మలయ ద్వీపకల్పమున సముద్రతీరభూఖండము. మలయప్రజలు అందఱును మహమ్మదీయులు. పూర్వకాలమున ఓడదోపిడిగాండ్రుగ, వర్తకులకు మహాభయంకరులుగ వారు పేరుగాంచినవారు. కాని బురుజులమర్చబడియుండు ఆధునిక యుద్ధనౌకల అమోఘములైన ఫిరంగులు మలయప్రజలచే ప్రశాంతతరములగు వృత్తులను అవలంబింప

జేసినవి. పినాంగునుండి సింగపూరుకు పోవుదారిలో మహోన్నత పర్వతయుత సుమత్రద్వీపపు క్షణకాలదర్శనము మాకు గల్గినది. పూర్వకాలమున ఓడదోపిడిగాండ్రకు ప్రియసంచారస్థానములుగ నుండిన పెక్కుచోట్లను ఓడనాయకుడు నాకు చూపెను. స్ట్రెయిట్సు సెటిల్మెంట్సు( జలసంధుల వలసభూముల)కు రాజధాని సింగపూరు. అందు వృక్షజాతులుండు చక్కని తోట ఉన్నది. అచటి తాళ తరుసమూహము మహోజ్జ్వలము. విసనకఱ్ఱలబోలిన ఆకులు గల తాళవృక్షములు, శాటసారుల తాళవృక్షము లనబడునవి, అట సమృద్ధిగ నున్నవి. పనసచె(ట్లవంటిచె)ట్లు సర్వత్ర ఉన్నవి. మద్రాసులో మామిడిపండ్లవలె, ప్రశస్తములైన మంగోస్తీను పండ్లు ఇట సమృద్ధములు. ఐనను మామిడిపండుకు సాటి లేదు లెండి. ఇచటి ప్రజలు భూమధ్యరేఖ కంత చేరువగానున్నను వీరి నలుపు మద్రాసుప్రజల నలుపులో సగమునకంటె తక్కువే. చక్కని (మ్యూజియము ) పురావస్తుకేంద్ర మొకటి సింగ పూరులో ఉన్నది.

తర్వాతి మజిలి హాంగ్కాంగు. చైనాదేశమునే సమీపించితి మనిపించును. చైనీయాంశ మిచట అంత హెచ్చు. కార్మిక వృత్తులు వర్తకము అన్నియు వారి చేతులలోనే ఉన్నవి. హాంగ్కాంగు నిజమైన చైనా. ఓడ ఆగిన తత్క్షణమే, తీరభూమికి చేర్చుటకు నూర్లకొలది చైనీయుల పడవలు మిమ్ము చుట్టవేసి కొనును. జంటచుక్కానులు గల యీ పడవలు మిక్కిలి వింత గొలుపును. పడవనడపువాడు సకుటుంబముగ పడవలోనే వసించు చుండును. సాధారణముగా చుక్కానులొద్ద పడవవాని యిల్లాలే ఉండును. ఒకచుక్కానిని చేతులతోను రెండవచుక్కానిని ఒక కాలితోను ఆమె నడపుచుండును. వారిలో నూర్గురిలో తొంబండుగురు, బిడ్డలను తమ వీపులకు కట్టివేసికొనియుందురు. బిడ్డల చేతులకును కాళ్లకును మాత్రము స్వేచ్ఛ యుండునట్లు కట్టివేసి కొందురు. అమ్మ యావచ్ఛక్తితో శ్రమపడుచున్నప్పుడును

ఎక్కువబరువులను త్రోయుచున్నప్పుడును, ఆశ్చర్యకరలాఘవ ముతో ఒకపడవనుండి మఱొకపడవలోనికి దాటుచున్నప్పుడును, ఆమెవీపున నిబ్బరముగ వ్రేలుచున్న చిట్టిచైనీయ'జాను'ను చూచుట వింతదర్శనముగ నుండు. ప్రవేశించుచు వెలువడుచు నుండు పడవల పొగనావల త్రొక్కుట ఇట అతిమాత్రముగ నుండును. జుట్టుతోసహా తల చిదిగిపోవు నేమో అని భీతిగొలుపు పరిస్థితిలో ఆ చిట్టిజాను ఉండును, కాని అతని కది లక్ష్యము లేనే లేదు. అట్టి జీవితముపై నతనికి మరులు లే దనిపించును. పెత్తత్తించునంత కార్యవ్యగ్రతలో నున్న అమ్మ ఆ బిడ్డకు అప్పు డప్పుడు బియ్యపుపిండిరొట్టెముక్క ఇచ్చుచుండును. ఆ రొట్టె ముక్కలో ఏమున్నదో గ్రహించుటలో బిడ్డ సంతృప్తి పడు చుండును. చైనీయశిశువు పూర్తిగా వేదాంతియే. ఏవయసులో భారతీయ శిశువులకు దోగాడుటకైన రాకుండునో ఆ వయసున ఈ చైనీయశిశువు పనులు చేయ బోవును. 'అనివార్య'శాస్త్ర మును అతడు మఱింతచక్కగా నేర్చినాడు. చైనీయులును, భారతీయులును చలనరహితమైన నాగరకతాస్థితిలో నిలబడి పోవుటకు గల కారణములలో వారి ఉత్కటదారిద్ర్య మొకటి. సాధారణచైనీయునకుగాని భారతీయునకుగాని దైనందిన జీవితావ సరములనుగూర్చిన దిగులే మిక్కుటమై వేఱు దేనినిగూర్చిగాని ఆలోచించుటకు వారికి అవకాశమే యుండదు.

హాంగ్కాంగు చాల చక్కని పట్టణము. అది కొండచరి యలపైని శిఖరములపైని నిర్మితమై యున్నది. నగరమందుకంటె ఆ తావులలో చలువ హెచ్చుగ నుండును. కొండశిఖరమునకు చేర్చు నిట్రమైన ట్రాముబండ్లదారి కలదు. బండ్లను ధూమశక్తి నడపును. గొలుసులు లాగును.

హాంగ్కాంగులో మేము మూడుదినాలుంటిమి. కాంటనును చూచుటకు పోయితిని. అది ఒకనదికి ఎనుబది మైళ్లెగువలో

నున్నది. ఎంత పెద్ద ఓడలైనను పయనించుట కనువుగా నది వెడల్పు గలిగి యున్నది. హాంగ్కాంగుకును కాంటనుకును మధ్య చైనీయనావలు అనేకములు రాకపోకలు చేయుచుండును. ఆ నావలలో ఒకదానిలో సాయంకాలమున నెక్కి ఉదయమప్పటికి కాంటనుకు చేరుకొంటిమి. కలకలములో జీవముట్టిపడు ఏమి దృశ్యము! నది నంతటిని కప్పివేసినట్లుగా ఎన్ని నావలు! వర్తకమున కుపయోగపడు పడవలే కాదు. ఇండ్లుగా నుపయోగపడు పడవలును నూర్లకొలదిగ నున్నవి. వానిలో పెక్కులు చక్కనివిగను పెద్దవిగను ఉన్నవి. నిజమున కవి రెండు మూడంతస్తులెత్తు గల పెద్దభవనములే. చుట్టును వరండా లున్నవి. వాని నడుమ వీధు లున్నవి. అన్నియు తేలుచున్నవి!

చైనీయప్రభుత్వమువారు విదేశీయులు బసచేయుటకై చిన్న భూఖండమునిచ్చియున్నారు. మే మందు దిగితిమి. మాచుట్టును నదికి గల రెండు గట్లలోను మైళ్ళకొలదిగ వ్యాపించి ఆ పెద్దనగరమున్నది. త్రోపాడుకొనుచు పెనగులాడుచు ఉప్పొంగుచు ఘోషించుచునున్న మానవుల వన మన దగి యుండెను అది. అంతజనాభా యున్నను, కార్యక్రమములు పోటెక్కి యున్నను, నేను చూచిన నగరములలోనెల్ల అదే అత్యంతమాలిన్యభూయిష్ఠము. భారతదేశమందలి నగరములలో మాలిన్య మనగా నే మర్థమో ఆ అర్థపు మాలిన్యము కాదు. ఏల యన చైనీయులు పెంటనలుచునైనను పడియుండనీయరు. అక్కడి మాలిన్యమునకు కారణ మే మనగా జీవితకాలములో స్నానము చేయనే కూడదని చైనావాడు దీక్షగా సాగించుచున్న ఆచారము. ప్రతియిల్లును ఒకఅంగడియే. ప్రజల కాపురములు ఇండ్ల పైఅంతస్తులందు. వీధులు ఎంత ఇఱుకైనవనగా అందుపోవుచున్న మనుష్యునకు రెండువైపుల నున్న అంగళ్లు తగులుచుండును. పది అడుగుల దూరమున కొక అంగడిగా మాంస మమ్ము నంగళ్లున్నవి. పిల్లిమాంసమును, కుక్క

మాంసమును అమ్మెడి అంగళ్లుకూడ నున్నవి. చైనీయులలో మిక్కిలి పేదవర్గాలవారు మాత్రమే కుక్కమాంసమును, పిల్లి మాంసమును తిందురు.

చైనీయమహిళలు బయట నెప్పుడును అగపడరు. ఉత్తర భారతదేశమున హిందువులలో నున్నంత కచ్చితమైన పరదాపద్ధతి వారిలో నున్నది. కూలిపనివాండ్ర స్త్రీలను మాత్రము వెలుపల చూడ వీలగును. వీరిలోగూడ మీా చంటిపిల్ల పాదములకంటె చిన్నపాదములు గల స్త్రీ ఒక్కొక్కప్పుడు కననగుచుండును. ఆమె కుంటు నని చెప్పవలెనే గాని నడచు నని చెప్ప లేము.

చైనీయులదేవాలయములను కొన్నింటిని చూడబోయితిని. కాంటనులో నున్న దేవాలయము లన్నిటిలో పెద్దది ప్రథమబౌద్ధ సార్వభౌముని స్మృతికిని, బౌద్ధమత మవలంబించిన మొదటి అయిదువందలమందిశిష్యుల స్మృతికిని అంకితమై యున్నది. నట్ట నడుమనున్న విగ్రహము బుద్ధదేవునిదే. ఆయనకు క్రిందకూర్చున్న ట్లున్న విగ్రహము సార్వభౌమునిది. దాని కిరువైపుల వరుసలుగ శిష్యుల విగ్రహము లున్నవి. అన్నియు దారువున చెక్కబడిన చక్కని విగ్రహములు.

కాంటనునుండి హాంగ్కాంగుకు మరలితిమి. అక్కడినుండి జపానుకు చేరుకొంటిమి. మొట్టమొదట మేము సమీాపించిన రేవు నాగసాకి. అచట దిగి కొన్ని గంట లుండి వీథులగుండ సంచరించి తిమి. ఏమి భేదము! భూమండలప్రజలలో పరిశుభ్రతను అత్యంతము పాటించువారిలో జపానీయు లొకరు. ప్రతివస్తువును పరిశుభ్రముగను సొంపుగను ఉన్నది. వారివీథులన్నియు వెడల్పు గలవి, వంపులు లేనివి. సక్రమముగ కట్టబడినవి. వారి చిన్న యిండ్లు పక్షులపంజరములవలె నుండును. ప్రతిపట్టణమునకును పల్లెకును పరభాగశోభ కలిగించుచు దేవదారువృక్షసమాచ్ఛాదితములైన పచ్చని చిన్న కొండ లున్నవి. పొట్టివారును తెల్లని

మేనివన్నెగలవారును వింతదుస్తులవారును అగు జపానీయులు వారి నడవడులు వైఖరులు హావభావములు — ప్రతిదియు రమ్యమే. జపాను రమ్య వస్తువులకు నిలయమైన దేశము. ఇంచుమించు ప్రతియింటికిని వెనుక వైపు తోట ఉన్నది. చిన్నపొదరిండ్లు పచ్చికచదుకములు కృత్రిమజలాశయములు చిన్నరాతివంతెనలు ఇవన్నియు జపానీయులపద్ధతి ప్రకారము చాల మనోహరముగ అమర్పబడి యుండును.

నాగసాకినుండి కోబి చేరితిమి. ఇచ్చట నేను ఓడను విడిచి పెట్టి యోకోహామాకు భూమార్గమున బోయితిని. జపానుదేశాంతర్భాగమును చూడవలె ననుట నా ఉద్దేశము.

జపానుదేశాంతర్భాగమున నేను మూడునగరములను దర్శించితిని. వస్తూత్పత్తికావించునగరములలో గొప్పదగు ఒసాకా, మునుపటి రాజధాని యగు క్యోటో, ఇప్పటి రాజధాని యగు టోకియో. టోకియో కలకత్తాకంటె ఇంచుమించు రెండంతలు పెద్దది. టోకియోలోని జనాభాకూడ కలకత్తాజనాభాకంటె రెండింతలు.

అనుమతి పత్రము (పాస్పోర్టు) లేనిదే ఏ విదేశీయునిగాని దేశాంతర్భాగమున పర్యటింపనీయరు.

ఈకాలపు ఆవశ్యకతలవిషయమున పరిపూర్ణమైన మెలకువ పొందిన ప్రజలుగా జపానీయులు ఇప్పుడు కనిపించుచున్నారు. సక్రమమైన అమరిక గల సైన్యమున్నది. సైనికులకు తుపాకులు గలవు. వారి ఉద్యోగులలోనే ఒకానొకడు కనిపట్టిన తుపాకులు అవి. అవి యెవరితుపాకులకును తీసిపోవు. వారు తమ యుద్ధనౌకా దళమునుగూడ నిరంతరము వర్ధిల్లచేసికొనుచున్నారు. మైలు పొడుగు గల ఒకసొరంగమును నేను చూచితిని. జపానీయుడైన ఇంజనీ రొకడు త్రవ్వినది అది.

అగ్గిపెట్టెలు తయారుచేయు కర్మాగారములు అత్యంతదర్శనీయములై యున్నవి. ప్రతివస్తువును తమదేశములోనే తయారుచేసికొనవలె నను పట్టుదల వారి కున్నది. చైనాజపానులమధ్య ప్రయాణములు సలుపు నౌకలు జపానీయులవి కలవు. ఆ నౌకామార్గమును అచిరకాలములో బొంబాయినుండి యోకహామా వఱకు పెంచు నుద్దేశము కలదు.

ఎన్నో దేవాలయములను దర్శించితిని. ప్రతిదేవాలయమందును ప్రాచీనబెంగాలీలిపిలో వ్రాయబడిన సంస్కృతమంత్రములున్నవి. పూజారులలో సంస్కృత మెఱిగినవారు ఒకకొందఱే. కాని వారు మేధావంతులు. ముందంజ వేయవలె ననెడి నవ్యకాలపుటుద్రేకము పూజారులమఠాలోనికి కూడ చొచ్చుకొన్నది. జపానీయులను గుఱించి నామనసులో నున్న విషయముల నన్నిటిని ఒకచిన్నజాబులో పట్టింపలేను. నేను కోరున దేమనగా మన యువకులు కొందఱు ప్రతిసంవత్సరమును చైనాకును జపానుకును వచ్చి చూచి పోవుచుండవలె నని. ముఖ్యముగా జపానీయుల ఊహలో భారతదేశము శుభములకెల్ల ఉదాత్తములైనవానికెల్ల నిలయమైన స్వప్నభూమి. ఇక మీరు, మీ రెట్టివారు? బ్రతికి నన్నినాళ్లు పిచ్చిమాటలు మాటాడుచుందురు. రిత్తమాటలవారు, మీ రెక్కడ? రండి, ఈప్రజలను చూచి పోయి అవమానముచే మీముఖములను దాచుకొండి. అస్తావిస్తముపట్టిన వృద్ధులజాతి మీది. గడప దాటిన మీ కులము చెడును! తలపైని పెక్కు శతాబ్దాలుగా సదా వర్ధిల్లుచు గడ్డకట్టుకొనిపోయిన గ్రుడ్డినమ్మకాలమోపు మోయుచు కూలబడియుండి, పెక్కు శతాబ్దాలుగా ఆహారవస్తువులలో ఇది స్పృశ్యమా అది అస్పృశ్యమా అను చర్చలలో నియావచ్ఛక్తిని వెచ్చించుచు, యుగయుగాలుగా నిరంతరముగ సాగుచున్న సంఘదురధికారముచే మానవత్వము పూర్తిగా పిండివేయబడిన మీరెక్కడ! మీరిప్పుడు చేయుచున్న

దేమి?... ఆకలికి నకనకబడుచున్న బిడ్డలు మీలో ప్రతివిద్యార్థి కాళ్లకును చుట్టవేసికొనుచు అన్నమో రామచంద్రా అని అలమటించుచున్నారు. మీరు పుస్తకములను హస్తభూషణములుగ దాల్చి సముద్రతీరములందు విలాససంచారములు చేయుచున్నారు. యూరపియనుల విజ్ఞానమునుండి పొందని పొసగని జీర్ణముకాని తుంటెలను వల్లించుచున్నారు. అధమపక్షము ముప్పదిరూపాయల గుమాస్తాగిరినో అధికపక్ష మొకన్యాయవాదిపదవినో పొందుట మీయాత్మల ఏకైక లక్ష్యమై యున్నది. భారతీయయువకుని ఆశ అధిరోహింపగల పైమెట్టు న్యాయవాదవృత్తియే ఐయున్నది. మిమ్ము మీపుస్తకాలను గౌన్లను యూనివర్సిటిడిప్లొమాలను అన్నిటిని ముంచివేయుటకు చాలినంత నీరు సముద్రమున లేదా?

రండి. మానవులు కండి. పురోహితు లెప్పుడును చక్కబడరు, వారి హృదయములకు విశాలత ఎన్నడును కలుగదు, వారు పురోగతికి ప్రతిబంధకములు. కావున వారిని బహిష్కరింపుడు. శతాబ్దములకొలది నెగడిన మూఢవిశ్వాసాలనుండియు దురధికారాలనుండియు ఉప్పతిల్లినవారు వారు. మతాచార్య కైతవమును మొదట నిర్మూలింపుడు. రండి. మానవులు కండి. మీ సంకుచితగర్తములనుండి వెలికి వచ్చి మీ చూపును విదేశాలపై ప్రసరింపజేయుడు. ఆదేశాలవారెట్లు ముందున కేగుచున్నారో కనుడు. మానవునిపై మీకు ప్రేమ ఉన్నదా? మీదేశముపై మీకు భక్తి ఉన్నదా? ఉన్నచో, రండి, శ్రేయములను ఉన్నతులను బడయుటకు పోరాడుదముగాక. వెనుకకు చూడనే చూడకుడు. అత్యంతప్రియుల అత్యంతసన్నిహితుల కుయి చెవిని బడినను, వెనుకకు మరలకుడు. వెనుజూడకుడు, ముందునకే చూడుడు.

కనీసము వేయిమంది యువమానవుల బలిగోరుచున్నది భారతమాత. బలిగా గోరుచున్నది 'మానవుల' ననుటను గుర్తిం

పుడు, 'మృగముల'ను కాదు. గడ్డకట్టుకొని పోయియుండిన మీనాగరకతను కరగించుటకు సాధనముగా భగవంతు డిటకు తెచ్చినదే ఆంగ్లేయుల యీ ప్రభుత్వము. ఆంగ్లేయుల కిట స్థిర స్థానమును కూర్చుటకు తోడ్పడినవారిలో అగ్రగణ్యులను కన్నది మదరాసే. ఇప్పుడు క్రొత్తపరిస్థితులను—పేదలపట్ల సానుభూతిని, ఆకలిగొన్నవారికి అన్నమును, సకలప్రజలకును ప్రబోధమును—సాధించుటకై ప్రాణములను లెక్కింపక పోరాడుటకు మీ తాతముత్తాతల దురధికారముచే మృగప్రాయులై పోయిన వారిని మరల మానవీకరించుటకై ప్రాణములను లెక్కింపక పోరాడుటకు నిస్స్వార్థులగు మానవులను, పరిపూర్ణులగు మానవులను ఎందఱిని మదరాసు సరఫరా చేయుటకు సిద్ధముగ నున్నది?

భవదీయుడు
వివేకానంద

మఱిమాట: మనకు కావలసినది వార్తాపత్రికల బూటకము కాదు, పేరుసంపాదించుకొనుట కాదు, మనకు కావలసినది పని, ప్రశాంతమైన నిరాడంబరమైన నిశ్చలమైన పని — అని మీరు సదా జ్ఞప్తియుంచుకొండి.

వి.

## 64

(శ్రీ అళసింగపెరుమాళుకు)

బ్రీజీ మెడోస్,
మెట్కాఫ్, మసాచూసెట్స్,
ఆగస్టు 20, 1893.

ప్రియఅళసింగ,

నీ జాబు నిన్న చేరినది. జపానునుండి నేను వ్రాసిన జాబు నీకును ఈపాటికి చేరియుండును. జపానునుండి తరలి వాన్కోవరు

చేరుకొంటిని. అది ఉత్తరపసిఫికుమీదుగా పోవు దారి. చాల చలిగా నుండినది. కప్పడపుదుస్తులు చాలక చాల బాధ పడినాను. ఎట్లో ఒకట్లు వాన్కోవరు చేరితిని. అటనుండి కానడా మీదుగా చికాగోకు చేరితిని. చికాగోలో దాదాపు పంద్రెండు దినము లుంటిని. ఇంచుమించు ప్రతిదినమును అచ్చట పెద్దసంతకు పోవుచుంటిని. అది పెద్ద పని. దానిని చూచిముగించుటకు కనీసము పది దినములు కావలెను. వరదరావు నన్నొక మహిళకు పరిచయపఱచినాడు కదా! ఆమెయు ఆమెభర్తయు చికాగో ప్రజలలో అత్యున్నతవర్గమునకు చెందినవారు. వారు నన్నెంతయు కనికరముతో ఆదరించినారు. నేను చికాగోను వీడి బోస్టనుకు వచ్చితిని. బోస్టనుకు చేరువఱకు శ్రీ లాలూభాయ్ నాతోనే యుండెను. నాయందు చాలదయకలిగియుండెను.

ఇచ్చట నాకు అనివార్యముగ నగు వ్యయము చాలభయము గొల్పుచున్నది. నీకు జ్ఞప్తియున్నది కదా. నీవు నాచేత నిచ్చిన నోట్లు పౌ. 170 లు. చిల్లర పౌ. 9 లు. ఇప్పుడు నాచేత మిగిలి యున్నది పౌ. 130 లే!! ఇచ్చట నాకు సగటున దినమునకు ఒక్కపౌను ఖర్చగును. మనధనమానము ప్రకారము ఇచ్చట ఒకచుట్ట వెల ఎనిమిదిఅణాలు. అమెరికనులు ఎంత ధనవంతు లనగా — ధనమును వారు మంచినీళ్లుగ వ్యయింతురు. ఇచ్చట ప్రతివస్తువు వెలను, ప్రభుత్వశాసనము వేఱు ఏదేశమువారును అందుకోలేనంత ఎక్కువగా నిర్ణయించును. మామూలు కూలిపని వాని దినసంపాదనము 9 రూపాయలు, లేదా 10 రూపాయలు. దానిని పూర్తిగా అతడు వ్యయించును. బయలుదేఱుటకుముందు మనము కలలు కనుచుండిన సుఖపరిస్థితులు కరగిపోయినవి. ఇక ఇప్పుడు నేను అసాధ్యముల నెదుర్కొని పోరాడవలసియున్నది. ఈ దేశమునుండి బయటపడుద మని ఇండియాకు మరలి పోద మని ఒక నూఱుసార్లనుకొంటిని. కాని దృఢనిశ్చయుడనై యున్నాను. పరాత్పరుని యాదేశ మున్నది నాకు. ఏదారియు నాకు కన్పించుట

లేదు. కాని పరాత్పరుని కన్నులకు కనిపించుచునేయున్నది. బ్రతుకు కల్గనీ చావు కల్గనీ, నేను నా ఉద్యమమును నిర్వహించి తీరవలెను.

బోస్టనుకు సమీపమున నొకపల్లెలో ఒకవృద్ధాంగనయింట అతిథినై ప్రస్తుత మున్నాను. రైలుబండిలో ఆమె పరిచయము నాకు ఆకస్మికముగ కలిగినది. వచ్చి తమ యింట నుండు మని ఆమె న న్నాహ్వానించినది. ఆమెతో నున్నందువలన నా కొక లాభము. ఆమె కొక లాభము. దినమున కగు పౌను వ్యయము తప్పిపోవుట నాలాభము. "భారతదేశమునుండి వచ్చిన వింత పురుషు డిడుగో" అని మిత్రుల నెల్ల పిలిచి చూపగల్గుట ఆమె కున్న లాభము. ఇ వన్నియు అనుభవించితీరవలసినదే. వస్తులు, చలి, నా వింతవేషము చూచి వీథులలోనివారు కావించు గేలి — వీనిని నే నెదుర్కొనవలసియున్నది. కాని అబ్బాయి, ఎంతో శ్రమపడనిదే ఘనకార్యములు ఎప్పుడును సాధింపబడవు.

... ఇది క్రైస్తవులదేశ మను విషయమును గుర్తింపుము. క్రైస్తవేతరులకు మాటచెల్లుబడి ఇచట ఇంచుమించు పూర్ణాను స్వారమే. లోకములో ఏమతవర్గమువారి శత్రుత్వమునైనను సరే నేను లక్ష్యపెట్టను. మేరీతనయునిప్రజలమధ్య నే నున్నాను. జీసను ప్రభువు నాకు తోడ్పడును. హిందూమతమందలి ఉదారాశయము లును నాజరెత్తుమతప్రవక్తయందలి నా భక్తియు వీరికి చాల ప్రియములే. గాలిలీమహాసీయునకు వ్యతిరేకముగ నే నేమియు బోధింప నని వారితో ననుచుందును. క్రైస్తుప్రభునితోబాటు భారతీయమహానీయులనుగూడ స్వీకరింపు డని మాత్రమే నేను క్రైస్తవులను కోరునది. వారు నామాట నామోదించుచునే యున్నారు.

చలికాలము సమీపించుచున్నది. అన్నిరకాల లావైన దుస్తులను నేను సమకూర్చుకోవలసియుందును. ఈదేశీయులకంటె

మన కెక్కువ లాభమైన కష్టదినములు రావలయును. ...అబ్బాయి, ఉత్సాహము వహింపుము. ధైర్యము పూనుము. భారతదేశమున మనము ఘనకార్యములను సాధింపవలె ననుట భగవన్నిర్ణయము. విశ్వసింపుము. మనము సాధింతుము. అసహాయులమును నిందితులమును నిజముగ హృదయముకలవారము నగు మనమే ... వారు కారు.

చికాగోలో మొన్న ఒక తమాషాసంభవము. కపూర్తల రాజు ఇచ్చట నుండెను. చికాగోప్రజలలో కొందఱు ఆయనను ''కనకపుసింహాసనమున కూర్చుండబెట్టి'' గౌరవించుచుండిరి. ఒకసారి సంతలో ఆ రాజుగారిని సంధించితిని. కాని పేదఫకీరుతో సంభాషణము ఇంచుకేని పొసగని మహోన్నతుడుగా నతడుండెను. సంతలో — వెఱ్ఱిచేష్టల మహారాష్ట్రబ్రాహ్మణు డొకడు దోవతి ధరించి గోటితో గీయబడిన పటముల నమ్ముచుండెను. రాజునకు ప్రతికూలముగా నాబ్రాహ్మణుడు అచ్చటివార్తాహరులకు అతడు హీనవర్ణమువా డని, ఆరాజులు బానిసలే కాని వే ఱేమియు కారని, వారి జీవితములు సాధారణముగ అవినీతిదుష్టము లని — అన్నిరకముల విషయములు చెప్పెను. ఈరీతి నిజమునే ప్రచురించు పత్రికాసంపాదకులకు అమెరికా ప్రసిద్ధమైనది! నిజమరులైన ఆ సంపాదకులు ఆ బాలుడు చెప్పిన కథలకు కొంత ప్రామాణ్యము నొసంగ గోరిరి. కావున మఱుదినమే వారు తమపత్రికలలో భారతదేశమునుండి వచ్చిన ఒకజ్ఞాని (అనగా నన్నుగూర్చిన) వర్ణనలతో పుటలు నింపిరి. అపారముగ నన్ను ప్రశంసించిరి. నేను ఏమేమో చెప్పినట్లుగ వ్రాసిరి. నిజమునకు కలలోనైన నే నన్న మాటలు కా వవి. కపూర్తలరాజునుగూర్చి ఆ మహారాష్ట్రబ్రాహ్మణుడు చెప్పిన విషయముల నెల్ల నేను చెప్పినట్లుగా వీరు ప్రచురించిరి. ఇది చక్కని ఉద్వాసనముగ నైనది. చికాగో ప్రజలు ఆ రాజుగారిని వెంటనే బహిష్కరించిరి. ...నాదేశీయుని తెఱుముటకు ఈ పత్రికాసంపాదకులు నన్నే ఉపయోగించుకొనిరి.

ఇందువలన తెలియు విషయ మేమనగా ఈదేశమున బిరుదుల కంటెను, ధనవైభవమునకంటెను, ప్రతిభకే యెక్కువ గౌరవము.

మహిళల కారాగారాధ్యక్షురాలైన జాన్సనుసతి నిన్న ఇచటికివచ్చెను. దానిని వారు 'కారాగార' మనరు. రిఫార్మేటరి (=బాగుపఱచుచోటు) అందురు. అమెరికాలో నేను చూచిన యన్నిటికంటె అదే మహత్తరమైనది. అందుండు వారిపట్ల అధికారులు దయతో ప్రవర్తింతురు, వారిని బాగుపఱచి, సంఘమున ఉపయోగపడువారినిగా చేసి పంపివేయుదురు. ఎంత చక్కగా నున్నది, ఎంత గొప్పగా నున్నది, నమ్మవలె ననిన ప్రత్యక్షముగ చూడవలసినదే. భారతదేశమున పేదలపట్ల నిమ్నులపట్ల మన కుండు తలంపుల స్మరించినప్పుడు నాహృదయము ఎంత వ్యధ చెందినది. వారికి అవకాశము లేదు, తప్పించుకొను దారి లేదు, పైకివచ్చు దారి లేదు, భారతదేశమున పేదవారికి నిమ్నులకు పతితులకు మిత్రులు లేరు, సహాయులు లేరు, ఎంతైన యత్నింతురు గాక, వారు ఉన్నతి నంద లేరు. క్రూరమైన సంఘము వర్షించు ప్రహారములు వారికి తగులుచుండును. దెబ్బ ఎందుండి వచ్చి పడుచున్నదియు వా రెఱుగరు. నానాటికి వారు మఱింత అధఃపతనము కాంచుచున్నారు. తాము మానవులే అన్న విషయమును వారు మఱచిపోయిరి. ఫలితము బానిసతనమే. ఆలోచింప గలట్టివారు, గడచిన కొన్ని యేండ్లలో ఈ విషయమును గుర్తించినారు, కాని దురదృష్టవశమున వారు ఈ చెడుగునకు కారణము 'హిందూమతమే' అని నిర్ణయించిరి. కావున విశ్వమతము లన్నింట ఉదాత్తతమమైన యీ మతము నణచివేయు టొక్కటే మేలొనగూర్పు నుపాయ మని వారి యభిప్రాయము. మిత్రమా, విను. భగవదనుగ్రహముచే ఇందలి మర్మమును నేను కనుగొంటిని. హిందూమతము చేసిన తప్పు లేదు. తప్పు లేకపోవుటే కాదు, ఈయందఱుగా విస్తరిల్లినది నీయాత్మయే'' అని నీకు నీ మతము నేర్పుచున్నది. లేక పోయిన

దే మనగా ఈసిద్ధాంతమునకు అసలు, సానుభూతి లేకపోయినది. హృదయము లేకపోయినది. భగవంతుడు బుద్ధుడుగా అవతరించి మరల మీ నడిమికి వచ్చి, కనికరించుటెట్లో, పేదల దుఃఖితుల పతితుల పట్ల ఎట్లు సానుభూతి వహింపవలెనో నేర్పినాడు. కాని మీ రాయనబోధను చెవిబెట్ట రైతిరి. అసచ్ఛిద్ధాంతములచే రక్కసుల వంచించుటకు దేవు డారూపు దాల్చె ననెడి ఘోర కథను మీ మతాచార్యులు కల్పించిరి. నిజమే, మనమే ఆ రక్కసులము, ఆయనను నమ్మినవారు కారు. జీససు ప్రభువును తిరస్కరించి యూదులు నాటినుండి బిచ్చగాండ్రై నిలువ నీడ లేక, ఎల్లర చేతను హింసలనొందుచు లోకమం దెల్లెడల అల్లాడుచున్నారు కదా. అట్లే మిమ్ము పరిపాలించుట తమకు లాభకరమని తోచిన దేశాలవారి కెల్ల మీరును బానిసలై యున్నారు. ఔరా హింసకులు! ఒకనాణెపు రెండువైపులవంటివే 'హింసించుట'యు 'దాస్యముచేయుట'యు నని మీ రెఱుగరు. 'బానిస' 'లోక కంటకుడు' అనునవి ఏకార్థకపదములు.

బాలాజికిని జి. జి. కిని జ్ఞప్తి ఉండవచ్చు. పుదుచ్చేరిలో ఒకనాటిసాయంకాలము ఒకపండితునితో సముద్రప్రయాణములను గూర్చి మాకు జరిగిన చర్చ. ఆ పండితుని క్రూరసంజ్ఞలును, 'కదాపిన' 'ఎన్నడును లేదు' అనెడి అతని మాటయు సదా నాస్మృతిలో నున్నవి. ప్రపంచములో భారతదేశ మొక చిన్న భాగమనియు చక్కని యీ భారతభూమిపై క్రాలుచు ఒకరొకరిని అణచివేసికొన ప్రయత్నించుచున్న ముప్పదికోట్లవానపాములను జూచి ప్రపంచ మంతయు ఏవగించుకొనుచున్న దనియు వా రెఱుగరు. ఈ పరిస్థితిని తొలగింప వలెను. ఇందుకు కర్తవ్యము మతమును నాశనము చేయుట కాదు. హిందుసిద్ధాంతపు ఉదారబోధనలను అనుసరించుట, వీనితో హిందూసిద్ధాంతపు పరిణతరూపమే మైన బౌద్ధములో గల ఆ యద్భుత 'సానుభూతి'ని కలుపుకొనుట.

పవిత్రతాభినివిష్టులు భగవద్విశ్వాసదుర్గపరిరక్షితులు, పతితుల – దరిద్రుల – హింసితుల – పట్ల సానుభూతిచే సింహధైర్యావేశమునొందినవారు సంఘోద్ధరణసందేశమును సాహాయ్యకరణ సందేశమును మోక్షసందేశమును సర్వసమత్వసందేశమును ప్రచారము చేయుచు ఈ దేశ మంతటను పర్యటింపవలెను.

హిందూమతము ఘోషించునంత గొప్పగా మానవుల పూజార్హతను బోధించు మతము వే ఱొకటి భువిని లేదు. హిందూమతమువలె పేదల నిమ్నుల కుత్తుకలను త్రొక్కివైచుచున్న మతమును వే ఱొకటి లేదు. ఈతప్పు మతముది కాదనియు పారమార్థిక వ్యావహారిక సిద్ధాంతాలరూపమున అన్నివిధములైన క్రూరదురధికారనియమములను కల్పించెడి కితవులైన మతాచార్యుల దనియు భగవంతుడు నాకు ప్రత్యక్షముగ తెలిపినాడు.

అధైర్యపడకుడు. గీతలో భగవంతుడు చెప్పిన "కర్మానుష్ఠానమందే నీయధికారము. ఫలితములందు నీకధికారము లేనే లేదు" అనెడి మాటను స్మరింపుము. అబ్బాయి, నడుముకట్టు. భగవంతుడు నన్ను పిలుచుకొని వచ్చిన దిందులకే. చిక్కులతో బాధలతో నిండిన జీవితమార్గమున విధి నన్నీడ్చుకొని పోయినది. నాకత్యంతప్రియులును అత్యంతసన్నిహితులును పస్తుండి ప్రాణము విడుచుచుండగా ప్రత్యక్షముగ చూచినాను. నన్ను గేలిచేసినారు. అనుమానించినారు. నన్ను ఏవగించుకొనుచు పరిహసించినవారిపైని సానుభూతి వహించుటచేతనే నేను కష్టముల పాలయితిని. సరే, అబ్బాయీ, దుఃఖమే గురువుగ నుండు పాఠశాల ఈజీవితము. మహాత్ములును, ప్రవక్తలును పాఠములు నేర్చుకొను పాఠశాల ఇది. సానుభూతిని కలుపునట్టి, ఓర్పును నేర్పునట్టి పాఠశాల, మనము పాద మూనుకొనియుండు విశ్వము బ్రద్దలైనప్పటికిని చలింపని సడలని దృఢసంకల్పమును మన కలవఱచు పాఠశాల.

వారిని చూచి నేను "అయ్యో పాప మనుకొందును. తప్పు వారిది కాదు. సంఘమున వారు గొప్పవారు కావచ్చు, పై వారు కావచ్చు. ఐనను, వారు శిశువులే. ఔను. నిజముగ శిశువులే. వారిది సంకుచిత జగత్తు. అందు తినుట త్రాగుట గడించుట బిడ్డలను కనుట అను ఇవి మితిని క్రమమును తప్పక ఒకదాని తర్వాతి నొకటి వచ్చుచుండును. ఈ సంకుచితజగత్తున కవతలికి కొన్ని యడుగుల దూరమున కైనను వారి చూపు ప్రసరింపజాలదు. దీని కవ్వల వారేమియు ఎఱుగరు, కూపస్థమండూకములు! వారి నిద్రకు చేగి యెప్పుడును లేదు. తా మరసినంతలో 'ఈజీవితము సుఖమయ'మనెడిభ్రాంతివారికున్నది. శతాబ్దములకొలది భారత దేశ వాతావరణమున చెల్లిన ప్రజాహింసకు ఫలితముగ నిండియున్నట్టి ఏ దుఃఖవిలాపము కాని, శోకప్రలాపము కాని, పతనము కాని, పేదఱికము కాని ఆ భ్రాంతిని క్షోభిల్ల చేయదు. దేవునిప్రతిరూపమగు మానవుని పట్టి బరువులు మోయు జంతువుగను, లోకజననిప్రతి రూప యగు మహిళను బిడ్డల గను బానిసగను, జీవితమును నరక ముగను చేసిన మానసిక నైతిక భౌతిక దురధికారప్రాభవము చెల్లిన కాలము వారి స్మృతిపథమున లేనే లేదు. కాని, మఱి కొంద ఱున్నారు, వారికి చూ పున్నది, కనికర మున్నది. వారు తమ డెందములలో రక్తాశ్రువులు కార్చుచుందురు. దీని కొక చికిత్స యున్న దని వా రెఱుగుదురు. ఎంతకైనను తెగించి, తమ ప్రాణములనైన బలియిచ్చి, ఆ చికిత్స చేయుటకు వారు సంసిద్ధులై యున్నారు. స్వర్గరాజ్యము వారిదే. తమ అంతస్తునుండి వారు, క్షుద్రవిషము నుమియుటకు సదా సంసిద్ధులై యున్న యీ హేయ కీటముల వెఱ్ఱులను అవలోకించుటకు వ్యవధి లేదు. మిత్రులారా, అది సహజమే కదా.

ధనవంతు లనబడు వారిని నమ్మకుడు. వారిలో సజీవలక్షణ ములకంటె మృతలక్షణము లెక్కువ. నా ఆస మీాయందే, నవ్యము

లైనను, తక్కువవారైనను, విశ్వాసవంతులరగు మీయందే. భగవంతునందు విశ్వాసము కలిగియుండుడు. ఇది ఆచారాను సరణముకాదు, కానే కాదు. దీనులకై పరితపింపుడు, సాయ మపేక్షింపుడు, సాయము లభించి తీరును. హృదయమం దీ బరువుతో బుద్ధియం దీ ఆశయముతో నేను పన్నెండేండ్లు దేశాటనము కావించితిని. ధనికులని గొప్పవారని తలంపబడువారిలో ఒక్కొక్కరియింటికిని పోయినాను. నెత్తురోడ్చు గుండియతో భూగోళార్ధమును దాటి సాయము నన్వేషించుచు ఈ క్రొత్తదేశమునకు చేరుకొంటిని. భగవంతుడు పరమోదారుడు. ఆయన నాకు తోడ్పడు నని నే నెఱుగుదును. చలిచేతనో ఆకలిచేతనో ఈదేశమున నేను మరణించినను మరణింపవచ్చు కాని, అధఃకృతులకై అజ్ఞులకై పేదలకై సాగించు ఈ పోరాటమును, వారి పట్ల ఈ సానుభూతిని దాయధనముగా యువకులరైన మీకొసంగుచున్నాను. ఇప్పుడు ఈక్షణమున పార్థసారథిస్వామిసన్నిధికి పొండి. పేదలును నిమ్నులును అగు గోకులమందలి గొల్లలకు చెలిగా అవతరించినవాడు ఆయన, (రామావతారమున) *మాలవాడైన గుహుని కౌగిలించుకొన వెనుదీయని వా డాయన, బుద్ధావతారమున సంపన్నుల పిలుపుల ఒప్పరికించి, ఒకదాసిదాని పిలుపును మన్నించి ఆమె నుద్ధరించిన వా డాయన, పేదలును పతితులును పీడితులును భగవంతునకు నిరతిశయప్రియులు, వారి కొఱకే ఆయన యుగయుగమందును అవతరించుచుండును. ఆయన యెదుటికి పోయి సాగిలపడుడు, పతితులకై మహాత్యాగ మొనర్పుడు, మీ యావజ్జీవితముల త్యాగ మొనర్పుడు, "నానాటికి నధఃపతనము నొందుచున్న యీ ముప్పదికోట్ల ప్రజల సముద్ధరణకై మా యావజ్జీవితముల నర్పించుచున్నా" మని ప్రతిజ్ఞ చేయుడు.

---

* బోయ వొర అని హృదయము.

ఇది ఒక్క దినములో ముగియుపని కాదు, దారి విషకంటక మయము. కాని పార్థసారథి మనకును సారథిగ అగుటకు సంసిద్ధుడై యున్నాడు. అది మనకు తెలిసిన విషయమే. ఆయనయందలి సత్యవిశ్వాసముతో, ఆయనపేరు చెప్పి, యుగయుగాలుగా భారత భూమిపై ప్రోగువడియుండు దుఃఖపర్వతమునకు నిప్పు అంటింపుడు. అది భస్మమై పడిపోవును. రండి, మఱి, ఇందుకు అభిముఖులు కండి, సోదరులారా, ఇది ఘనకార్యము. మనమో, ఇంత నీచులము. కాని మనము పరంజ్యోతిబిడ్డలము, దేవునిశిశువులము, దేవునకు జయము! మనము నెగ్గి తీరుదుము. ఈ పోరాటములో నూర్లకొలదిగ ప్రాణులు ప్రగ్గుదురు, వారిస్థానముల నింపుటకు నూర్లకొలది ప్రాణులు సంసిద్ధులుగ నుందురు. నేను నెగ్గకే ఇట మరణింపవచ్చు, మఱియొకడు ఈపనికి పూనుకొనును. వ్యాధి మీకు తెలిసినదే, మందు మీకు తెలిసినదే, మీకు కావలసినది శ్రద్ధ యొక్కటే. 'ధనికు'లని 'అధికు'లని పేర్కొబడువారిని కన్నెత్తియైన చూడకుడు. హృదయశూన్యులై రచనలు చేయు మేధావంతులను క్రూరములైన వారి పత్రికావ్యాసములను లక్ష్య పెట్టకుడు. విశ్వాసము, సానుభూతి! అమోఘవిశ్వాసము, అమోఘసానుభూతి!! జీవిత మొక లెక్కలోనిది కాదు, మరణ మొక లక్కలోనిది కాదు, కడుపులోనిచిచ్చు ఒకలెక్కలోనిది కాదు, చలి ఒకలెక్కలోనిది కాదు. జై జగదీశ్వర! ముందుకు నడువుడు, సర్వలోకనాథుడు మన సేనానాథుడు. పడిపోయినవా రెవరో పరికింత మని వెనుకకు తిరిగి చూడకుడు. ముందుకే! పైకే!! ఇట్లే ఇట్లే మనము సాగిపోదము. సోదరులారా, ఒకడు పడిపోయిన, వాని పని కింకొకడు పూనుకొనును.

ఈగ్రామమునుండి రేపు బోస్టనుకు పోవుచున్నాను. అచట ఒక పెద్దమహిళామండలి కలదు. రమాబాయికి ఆ మండలియే తోడ్పడుచున్నది. ఆ మండలి ఆధ్వర్యమున నే నుపన్యసింపబోవు

చున్నాను. బోస్టనులో నేను మొట్టమొదట పోయి కొన్నివస్త్రములను కొనవలెను. ఇచ్చట నేను మఱింతదీర్ఘకాలము ఉండవలెననిన ఇప్పటి నావింత దుస్తులు పనికి రావు. ప్రజలు వీధులలో నన్ను చూచుటకు వందలకొలదిగ గుమిగూడుచుందురు. కాబట్టి నేను పొడుగైన నల్లకోటును ధరింపవలె నని కోరుచున్నాను. ఉపన్యసించునప్పుడు తొడుగుకొనుటకై ఒక ఎఱ్ఱఅంగీయు ఒక తలపాగయు ఉంచుకొనవలెనని యున్నాను. ఆలాగు చేయు మని నాకిచ్చటి మహిళల సలహా. ఇచ్చట చెల్లుబడి వారిమాటకే. వారి సానుభూతి నాకు ఆవశ్యకము. నీకు ఈజాబు చేరునప్పటికి నాయొద్ద నున్న పైకము కరగిపోయి పౌ. 70 లో పౌ. 60 లో మిగులును. కాబట్టి కొంత పైక మంపుటకు నీచేతనైనంత ప్రయత్నము చేయుము. ఇచ్చట కొంత మాటచెల్లుబడి సంపాదింపవలె ననిన కొంతకాల ముండక తప్పదు. శ్రీభట్టాచార్యుల లేఖ నాకిచ్చటికి చేరినందున ఫోనోగ్రాఫులను చూడలేకపోయితిని. మరల చికాగోకు పోయితినేని వానిని అన్వేషింతును. నేను చికాగోకు మరలిపోదునో పోనో నాకే తెలియదు. అచటి నా మిత్రులు నన్ను భారత దేశమునకు ప్రతినిధిగా నుండగోరుచున్నారు. వరదరావు నాకు పరిచయము కలిగించిన మహాశయుడు ఇచటి సంత కధికారులలో నొకడు. చికాగోలో నెలకంటె ఎక్కువ దినము లుండినచో నాయొద్దనున్న కొంచెము డబ్బును పూర్తిగా ఖర్చు కావలసివచ్చును. కాబట్టి అప్పుడు నేను నిరాకరించితిని.

. అమెరికాలో, ఒక్క కానడాలో తప్ప, రైలుబండ్లలో తరగతులు లేవు. కాబట్టి నేను మొదటితరగతిబండిలోనే ప్రయాణింపవలెను. ఏలయన ఉన్న దదొక్క తరగతే. పుల్మన్ను బండ్లలో ప్రయాణించు సాహసము నాకు లేదు. వానిలో చాల వసతులు గలవు. హోటలులోవలె స్నానభోజనపాననిద్రావసతులు కలవు. కాని దానికి పట్టు ధనము అపారము.

సంఘములో చొరవ గాంచి మనమాటను వినునట్లు చేసి కొనుట చాల కష్టమైన పని. నగరములలో ఇప్పు డెవ్వరును లేరు. వా రిప్పుడు వేసవి విశ్రాంతిస్థానములకు పోయి యున్నారు. చలికాలమప్పటికి అందఱును మరలి వత్తురు. కాబట్టి నేను వేచి యుండవలెను. ఇన్ని తిప్పలు పడిన పిమ్మట నాయుద్యమమును సులువుగా మానుకొనబోను. నీచేతనై నంతవఱకు నాకు సాయము చేయుచుండుము. అంతే. సాయము నీవు చేయలేకపోయినను నేను తుది వఱకు ప్రయత్నించి తీరవలసినదే. చలిచేతనో వ్యాధి చేతనో ఆకలిచేతనో నేను ఇచ్చట మరణింతునేనియు, ఈపనికి మీరు పూనుకొనుడు. పవిత్రత, ఆర్జవము, శ్రద్ధ! జాబు వచ్చిన ను పైకము వచ్చినను నే నుండు చోటికి అందచేయవలసిన దని కుక్కువారితో చెప్పియున్నాను. రోమునగరనిర్మాణము ఒక్క నాటిలో ముగియ లేదు. (తలచినంత నే తాత పెండ్లియగునా?) నేను ఇక్కడ ఆఱునెలలపాటు ఉండుటకు ఐపీజును మీరు పంప గలరేని అంతయు సరిపడు నని నా ఆశ. ఈలోగా ఏదే నొక తరణోపాయమును కనుగొనుటకు నేనును యావచ్ఛక్తి ప్రయత్నించుచున్నాను. నన్ను పోషించుకొనుట కొక ఉపాయమును నేను కనుగొందునేని తక్షణమే, నీకు తంతివార్త నందింతును.

మొదట అమెరికాలో ప్రయత్నించి చూతును. నెగ్గకున్న, ఇంగ్లండులో ప్రయత్నించి చూతును. అక్కడను అపజయమే కల్గునేని భారతదేశమునకు మరలి వత్తును. వచ్చి ఈశ్వరాజ్ఞకై వేచియుందును. రామదాసునితండ్రి ఇంగ్లండుకు పోయియున్నాడు. ఇంటికి చేరిపోద మని తహతహపడుచున్నాడు. అతనిహృదయము చాల మంచిది. వణిక్కుల మొరటుతనము పైకిమాత్రము కని పించును. జాబుచేరుటకు ఇరువదిదినములకంటె ఎక్కువ కాలము పట్టును. న్యూఇంగ్లండులో ఇప్పుడు కూడ చలి మిక్కుటముగ నున్నందున రాత్రులందును వేగుజాములందును ప్రతిదినమును

మంటలుమండజేసికొనుచున్నాము. కానడాలో చలి ఇంతకంటెను ఇంకను హెచ్చు. చిన్నగుట్టలమీదకూడ అక్కడ నున్నట్లుగ మంచును నేను వేరెక్కడను చూచియుండలేదు.

క్రమముగా నేను నా కొక దారి నేర్పఱుచుకొనగలను. కాని డబ్బు విపరీతముగ ఖర్చగు ఈ దేశమున అందుకై నేను సుదీర్ఘ కాల ముండవలసి వచ్చును. భారతదేశమున ఇప్పుడు రూపాయి విలువ హెచ్చించిన తక్షణమే ఈ దేశమున భయము జనించినది. అనేకయంత్రాలయములు పని ఆపివేసినవి. కాబట్టి ఇప్పుడే నాకెట్టి ఆసపాటును శక్యము కాదు. కాని నేను వేచియుండవలెను.

ఇప్పుడే చలికాలమునకు కావలసిన దుస్తులను దర్జీవాని యొద్ద కుట్ట నిచ్చివచ్చినాను. దానికే కనీసము రూ. 300 లో మఱికొంత యెక్కువో పట్టును. అంత ఖర్చైనప్పటికిని, ఆదుస్తులు డాబుసరిగనుండునే గాని, మంచివి మాత్రము కావు. జనులదుస్తుల విషయమున ఇచటి మహిళల కున్న శ్రద్ధ ప్రత్యేకము. ఇచ్చట మాటచెల్లుబడి వారికే. మతప్రచారకులకు వా రెప్పుడును ఆశాభంగము కలిగింపరు. మన రమాబాయికి ఏటేటను వారు సాయము చేయుచున్నారు. మీరు నన్ను అమెరికాలో పెట్టిపెట్ట లేక పోయినచో ఇచ్చటినుండి వెలిబడుటకై నను కొంత పైకము పంపుడు. ఈమధ్యకాలమున ఇచ్చట నేవేని అనుకూలములు కల్గిన వ్రాసెదను. లేక తంతె చేసెదను. సముద్రముమీద తంతి వార్తనంపుటకు మాట కొకటికి నాల్గురూపాయలు కట్టవలెను.

భవదీయ
వివేకానంద



చికాగోలో శ్రీ వివేకానందస్వామి — (సెప్టెంబరు, 1893)

65

(ప్రొఫెస్సరు జాన్ హెన్రీరైటుగారికి)

సాలెమ్,
ఆగస్టు 30, 1893.

ప్రియఅధ్యాపక్జీ,

ఈ దినము నేనిచ్చటినుండి వెడలిపోవుచున్నాను. చికాగో నుండి ఏదైన ప్రత్యుత్తరము మీకు వచ్చియుండు ననుకొను చున్నాను. శ్రీ సాన్బారనుగారినుండి నాకొక ఆహ్వాన మందినది. అందు నేననుసరింపవలసిన పద్ధతి వివరాలు సమగ్రముగ వ్రాయ బడి యున్నవి. కావున నేను సోమవారమునాడు సారటోగాకు పోవుచున్నాను. మీశ్రీమతికి నావందనములు. ఆస్టినుకును, పిల్ల లందఱికిని—నా ప్రేమాశీస్సులు. మీరు నిజముగ మహాత్ములరు. శ్రీమతి రైటుగారి కన్ననో, ఎవ్వరును సాటి లేరు.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

66

(ప్రొఫెస్సరు జాన్ హెన్రీరైటుగారికి)

సాలెమ్,
శనివారము, సెప్టెంబరు 4, 1893.

ప్రియఅధ్యాపక్జీ,

నన్ను పరిచయపఱచుచు తా మంపిన లేఖలకు నా హృద యపూర్వక కృతజ్ఞతాభివందనముల మీ కర్పింప త్వరపడు చున్నాను. కొందఱు ప్రతినిధుల పేర్లను కాంగ్రెసునుగూర్చిన తక్కుంగల విషయములను తెల్పుచు చికాగోనుండి శ్రీ తెలేసు వ్రాసిన జాబు నాకు చేరినది.

మీ సంస్కృతభాషాగురువులు శ్రీమతి సాన్బొరనుకు వ్రాసిన జాబులో నన్ను పురుషోత్తమజోషి అనుకొని పొరవడినారు. బోస్టనులో ఒక సంస్కృతగ్రంథాలయ మున్నదనియు అట్టి గ్రంథాలయము భారతదేశమున దుర్లభమనియు ఆజాబులో వ్రాసియున్నారు. ఆ గ్రంథాలయమును జూచిన నే నెంతో ఆనందింతును.

సోమవారమునాడు నన్ను సారటోగాకు ర మ్మని శ్రీ సాన్బొరనుగారు వ్రాసియున్నారు. ఆ ప్రకారము నే నటకు పోవుచున్నాను. అప్పు డచ్చట నేను సానటోరియ మనెడి పూటకూలింటిలో బసచేయుదును. ఈ మధ్యకాలమున చికాగోనుండి ఏదేని వార్త వచ్చిన దయతో సారటోగాలోని సానటోరియమునకు మీ రందచేయ గల రని విశ్వసించుచున్నాను.

మీరును పరమోదాత్తురాలైన మీ ధర్మపత్నియు మీ ముద్దుబిడ్డలును నా మదిని ఎంతగా హత్తుకొంటి రనగా, ఆ మీ ముద్రలు నా మదినుండి మాసి పోనేపోవు. మీమధ్యనున్నంత సేపు స్వర్గధామమున కెంతో చేరువగా నున్న ట్లనిపించినది నాకు. వరదరాజైన భగవంతుడు మీకు వరిష్ఠశుభముల వర్షించు గాక.

ఈ క్రింది బంతులు పద్యరచనామార్గమున నా తప్పటడుగులు. వీనిని మీయెదుట పెట్టుట దుండగము. ఐనను నామీది ప్రేమచే మీరు క్షమింతురని నమ్మెదను.

భవదీయుడు
వివేకానంద

గుట్టలందు, వనాలఁ, గొండల, గుడులఁ,
క్రైస్తవ – ముస్లిము – ప్రార్థనాలయము
ల, నిగమముల, అల్కొరానులో, బైబి
లున—నిన్ను వెదకితిఁ, గనఁగ లేనైతి.

దుర్గమారణ్యంపు మార్గాన నొంటిఁ
జిక్కి యాక్రందించు శిశువును బోలి
నాదేవ నాప్రియ నాదేవదేవ
'ఏగి తెట' కనఁగ 'ఏగితి' ననెడి
మాఱుమ్రోతయె మఱుమాటగ నయ్యె.
దినములు గడచెను, దీఱె రాత్రులును,
సంవత్సరంబులు సనియెను గడచి.

నాతల నొక వహ్ని నను నేచుచుండెఁ,
బగలు ముగిసి రాత్రివచ్చె నెఱుంగ.
గుండె రెండయినయట్లుండెను నాకు.
ఎండకు వానకు నెండఁగఁ దడియఁ
గాయము వ్రాల్చితి గంగగట్టునను.
వేడి కన్నీళ్ళచే వే డెక్కినిసుము,
కల్లోలఘోషతోఁ గలిసె నాయేడ్పు,
అన్ని దేశాలలో అన్నిమతాల
పావననాములఁ బ్రార్థించి తిట్లు :—
"దయచేసి చూపుఁడు దారిని నాకు
గంతవ్యమును జేరఁగనట్టి మీరు".
ఈరీతిగా నేను నేడ్చుచునుండ
క్షణ మొక్క యుగముగాఁ గనఁబడె నాకు.
సంవత్సరంబులు సనె. నొక్కనాఁడు,
నామూల్గులనడుమ, నాయేడ్పునడుమ,
ఆప్యాయనంబుగ, నతిమృదువుగను,
'నాపుత్త్ర' 'నాపుత్త్ర' 'నాపుత్త్ర' యంచు
నన్నెవ్వరో పిల్చినట్లుగఁ దోఁచె.
ఆరవము హృదిని అన్ని తంత్రులను
గూడి రోమాంచంబు గూర్చె మేనికిని.

ఎందుండి విన్చునో యెఱుఁగఁగఁగోరి
నిల్చి చూచితిఁ జుట్టు నెలవుల నెల్ల;
వెనుక నెట్టెదుటను వెదకితి నెంతో,
అదుగడ్గునను వించె నా దివ్యవాణి.

మోదాబ్ధి నాయాత్మ మునిఁగియె పోయెఁ.
పారవశ్యము గల్గె, స్వాధీన మెడలె.
మెఱుప దొక్కటి యంత మెఱసెను హృదిని.
హృదయకవాటంబు తెఱవఁగఁ బడియె.
ఆనంద! మానంద!! మటఁ గన్న దేమి?
నా ప్రియవల్లభ నా సర్వ మైన
నీవె యం దుంటివి, నీస్థానమె యది.

వెదకితి నన్నాళ్లో వెలుపల నెల్ల.
హృదయపీఠి నిటుల వెలసియున్నావు.

ఆనాఁటినుండియు నవనియెల్లెడలఁ
గొండల లోయల గుట్టల వనుల
ఎంతో దూరంబుగ నెంతో యెత్తుగను
ఎందు నేఁ దిరిగిన నీశుండు నాదు
ప్రక్కనే యున్నట్లు స్పష్ట మయ్యెడిని.

హరిణాంశుమృదుకాంతి, నర్కునిదీప్తి,
చుక్కలదీధితి, సొంపును, శక్తి—
అతఁడు పెట్టిన భిక్షె, యవ్వాన నెల్ల
వెలుఁగొందుచున్నట్టి వెలుఁ గతఁడె సుడి.
తొలిమలిసంజలఁ దోరమా కాంతిఁ,
బోరెక్కు జలధిని. బులుఁగులరవళి,
రమణీయమైనట్టి ప్రకృతియంతటను—
జూచుచునున్నాఁడ సు, మ్మది యతఁడె.

పెక్కు కష్టాల నేఁ జిక్కుకొన్నపుడు,
హృదయము భీతిమూర్ఛిల్లడియపుడు,
గట్టి నియమములఁ బెట్టి నన్ బ్రకృతి
కదలనీయక పట్టి యదిమియున్నపుడు—
'నీచెంత నున్నాఁడ నేను గను మిదె'
అనెడి నీ మధురమా నా శ్వాసవాణి
వినఁబడుచుండు నా వీను లలరఁగ.

నాగుండె దిట వొందు, నాకు నీ వుండ,
వేయి చావు లయిన భీతియే లేదు.

బుడుత నూయెల నిద్రపుచ్చఁగఁ దల్లి
పాడుచుండెడి జోలపాటలలోన,
శిశువుల క్రీడలఁ, జిఱునవ్వులందు,
ఆటపాటల—నీవె యగపడుచుందు.

పరమమిత్రుల ప్రేమబంధంబ వీవె
ఈవె తల్లికి బిడ్డ నించెడి ముద్దు.
'మాత' యనెడి పిల్పు మధురిమయందు
దీపించుచుండును దేవదేవుండె.

ఆదియుగమునుల కారాధ్యుఁ డైతి,
వన్ని మతాలకు నాదిమూలమవు,
నాల్గు వేదాలును నాల్కురాన్ బైబి
లును నేకకంఠానఁ గొనియాడు నిన్నె.

శరవేగముగఁ బాఱు చైతన్యధునిని
ఆత్మల కన్నింటి కాత్మవు నీవు .
'ఓమ్ తత్ స దోమ్ దేవ' ఓ ప్రాణనాథ,
నీవాఁడ నీవాఁడ నీవాఁడ నయ్య.

## 67

(ప్రొఫెసరు జాన్ హెన్రీరైటుగారికి)

చికాగో,
అక్టోబరు 2, 1893.

ప్రియ అధ్యాపక్షీ,

నా దీర్ఘకాలమౌనమునుగూర్చి మీరేమనుకొనుచున్నారో నే నెఱుగను. నా మౌనమునకు మొదటి కారణము: నేను కాంగ్రెసులో అడుగుపెట్టినది మొట్టమొదలు పూర్తిగ అసంసిద్ధుడనై యుంటిని. కాబట్టి అది కొంతకాలము నాకు మితిమీఱిన కార్యవ్యగ్రత కలిగించినది. రెండవకారణము: కాంగ్రెసులో నేను ఇంచుమించు ప్రతిదినమును ఉపన్యాసములు చేయుచున్నాను. జాబు వ్రాయుటకు వ్యవధియే లేకుండినది. కడపటి కారణము, అన్నిటికంటె గొప్పకారణము: కృపాళువైన నామిత్రమా, మీకు నేను ఎంతో ఋణపడియున్నాను. త్వరత్వరగా ఆచారార్థపు లేఖలు మీకు వ్రాయుట మీ అహేతుకమైత్రినే అవమానించినట్లగును. కాంగ్రెసుకార్యక్రమము ఇపుడు ముగిసిపోయినది.

ప్రియసోదరా, విశ్వమునలువంకలనుండి వచ్చిన తార్కికులయు మంచివక్తలయు ఆ మహాసదస్సున మాటాడుటకు నాకు చాల భయము వేసినది. కాని దేవుడు నాకు బలమొసగినాడు. ఇంచుమించు ప్రతిదినము వేదికలెక్కి సదస్సులను ధైర్యముతో ( ? ) ఎదుర్కొనుచున్నాను. నేను బాగుగ మాటాడియుండిన, అందుకు వలసిన బలమును నాకు సర్వేశ్వరుడిచ్చినాడు. వక్తృత్వములో శోచనీయముగ నేను అపజయము కాంచియున్న — అది నాకు ముందే తెలిసినవిషయము. ఏలయన నా అజ్ఞానము ఆత్యంతికము.

మీమిత్రులు ఆచార్యబ్రాడ్లీగారు నాపట్ల ఎంతయు దయగలిగియుండినారు. సదా నన్ను ప్రోత్సహించుచుండినారు.

'కోన్కి-సాక్' నగు నాయందు ఇచ్చట అందఱును చాల దయ
గలిగియున్నారు. ఆ దయ నా మాటల కందనిది. ఈ గొప్ప దేశపు
పండితమతాచార్యులందును భారతదేశమునుండి వచ్చిన అజ్ఞుడైన
బుక్కా-ఫకీరునందును సమదృష్టి గల సర్వేశ్వరునకు మహోన్నత
జయము! సోదరా, నాజీవితమున ప్రతిదినము భగవంతుడు
నా కెంతగా తోడ్పడుచున్నాడు! గంతలనుదాల్చి, బిచ్చమెత్తి
బ్రతుకుచు మానవసేవారూపమున ఆ మాధవసేవ చేయుచుండు
టకై నే నొక్కొక్కప్పుడు లక్షలకొలదిసంవత్సరములు జీవించి
యుండవలె నని కోరుచుందును.

నే నెంతగనో కోరున దిది—మీ రిచ్చటనుండవలె; భారత
దేశమునుండి వచ్చిన మధురవ్యక్తులగు మావారిని కొందఱిని,
మృదుహృదయుడగు ధర్మపాలబౌద్ధుని, వాగ్మిశేఖరుడగు మజుం
దారును చూడవలె; ఈ ప్రబలమహాదేశమున పుట్టి పెరిగిన
మీ హృదయములతోడి సానుభూతితో కొట్టుకొను గుండెలు కల
పురుషులు పేదదేశమును దూరదేశము నగు భారతదేశమున
నుండుట గుర్తింపవలె. నే నెంతో కోరుచున్నాను.

పరమపావనురాలగు మీ ధర్మపత్నికి నా నిత్యనమోవాక
ములు. మీముద్దుబిడ్డలకు నానిత్యప్రేమాశీస్సులు.

మీపుత్రిక తనపుత్రికకు నన్నుగూర్చి వ్రాసినదని కర్నలు
హిగ్గిన్సను నాతో చెప్పినాడు. ఆయన పరమోదారుడు. నాయం
దపారసానుభూతికలవాడు. నేను రేపు ఈవాఁస్టనుకు పోవు
చున్నాను. అచ్చట ఆచార్యబ్రాడ్లీని దర్శింతమని నాఆశ.

ఈ భౌతికదేహము పడిపోవుటకు ముందే మనమందఱ
మును ఇంకనింకను విశుద్ధులముగను పావనులముగను అగునట్లును
పరిపూర్ణపారమార్థికజీవితములు గడపునట్లును సర్వేశ్వరు
డనుగ్రహించుగాక!

వివేకానంద

[వేఱుకాగితముపై నున్న ఈజాబు తరువాయి.]

ఇచ్చట నాజీవితముతో సంతృప్తి చెంది ఇప్పుడు నేనుండ బోవుచున్నాను. ఏపరిస్థితినైనను సరే భగవత్ప్రసాదముగ తల దాల్చుటయు, ప్రశాంతముగ అందుకు పనుపడుటయు, జీవితములో నా మామూలు. మొట్టమొదట అమెరికాలో నేను ఇంచుమించు జలమునకు దవ్వైన జలచరమువలె నుంటిని. భగవత్సంకల్పపర తంత్రుడనుగ నుండు నావాడుకను మానుకొని స్వప్రయత్నపరు డనుగ కావలసి వచ్చు నేమో అని దిగులుపడుచుంటిని. అట్లు అయియుండిన, అది యెంతటి దుండగము, కృతఘ్నత! మంచు కప్పిన హిమవచ్ఛిఖరములపైని, ఎండవేడిమి దుస్సహమైన భారత దేశపుమైదానములందును నాకు మార్గదర్శకుడుగ నుండిన భగవం తుడే ఇచ్చటను నాకు మార్గదర్శకుడుగను సహాయుడుగను నుండుట స్పష్టముగ కనిపించుచున్నది. జయము, జయము, అతనికి జయము. కావున నేను ప్రశాంతముగ నాపాతదారులనే అనుసరించుచున్నాను. ఎవరో ఒకరు నాకు కుడువకూడును నిలువ నీడను ఇచ్చుచున్నారు. ఎవరో ఒకరు వచ్చి భగవంతునిగూర్చి ఉపన్యసింపు మని న న్నడుగుచుందురు. వారు దైవప్రేషితు లని నే నెఱుగుదును. ఆ పిలుపులను తలదాల్చుట నా కర్తవ్యము. నాకు కావలసినవాని నన్నిటిని భగవంతుడే సరఫరా చేయు చున్నాడు. ఆయన సంకల్పము నెఱవేఱును.

"అనన్యులై నన్ను చింతించుచు ఏజనులు పర్యుపాసింతురో నిత్యాభియుక్తులైనట్టి వారియోగక్షేమభారమును నేను వహిం తును". (గీత)

ఏషియాలోను అంతే, యూరపులోను అంతే, అమెరికా లోను అంతే. భారతదేశపుఎడారులలో అంతే. అమెరికాలో మహావేగముగ సాగు వ్యాపారములందును అంతే. ఏలయన దేవుడు ఇచ్చటకూడ లేడా? ఆయన అట్లు చేయడేని, క్షణికమగు

ఈ మట్టిదేహమును నన్ను పరిత్యజింపుమని ఆయన కోరుచున్న ట్లుగా నే నర్థము చేసికొందును. సంతోషముతో శరీరము త్యజింప కోరుదును.

సోదరా, మనము కలసికొనవచ్చును, కలసికొనకపోవ చ్చును. భగవంతునకు తెలియును. మీరు ఉదాత్తులరు. పండి తులరు. పవిత్రులరు. మీకుగాని మీ ధర్మపత్నికిగాని ఉపదేశించు సాహసమునకు నేను పూనుకొనను. కాని మీ పిల్లలకై ఈ క్రింది వేదవాక్యములను ఉదాహరించుచున్నాను :

"నాల్గువేదములును శాస్త్రములును భాషావళియు తర్క మును సకలేతరవైదుష్యములును కేవలము ఆలంకారికములు. నిర్వికల్పప్రేమనిధియగు సర్వేశ్వరుని జేరుటకు మనలను సమర్థు లనుగా జేయునదేదో అదే నిజమైన పాండిత్యము, నిజమైన జ్ఞానము."

"చర్మమునకు స్పర్శజ్ఞతయు కన్నులకు చూపును జగత్తు నకు యాథార్థ్యమును కలిగించుచున్నవాడు భగవంతుడే. మఱి ఆ భగవంతుని దృష్టిగోచరత్వమును స్పర్శవేద్యత్వమును యాథా ర్థ్యమును ఇం కెంతటిదో!"

"ఆయననుగూర్చి విన్నతర్వాత ఇక వినవలసినది నే ఁడేమియు లేదు, ఆయనను జూచినతర్వాత ఇక చూడవలసినది వే ఁడేమియు లేదు, ఆయనను ప్రాపించిన పిమ్మట ఇక ప్రాప్తవ్యము వే ఁడేమియు లేదు".

"ఆయన మనచక్షువునకు చక్షువు, శ్రోత్రమునకు శ్రోత్రము, ప్రాణమునకు ప్రాణము".

ముద్దుబిడ్డలారా, మీ నాయనకంటెను మీ అమ్మకంటెను గూడ ఆయన మీ కెక్కువ సన్నిహితుడు. మీరు పూలవలె నిష్కళంకులరు, విశుద్ధులరు. అట్లే ఉండుడు. భగవంతుడు స్వయ

ముగనే మీకు తన్ను చూపుకొనును. ప్రియాఆస్టిన్, నీవు ఆడుకొనుచున్నప్పుడు నీతో ఆడుకొనుచు మహాక క్రీడాసఖు డున్నాడు. నిన్ను ఇతరులందఱు ప్రేమించునంతకంటె హెచ్చుగా ప్రేమించువా డతడు. అహో, వేడుక అతనిలో అంత నిండుగ నుండును! ఆయన సదా ఆడుకొనుచుండును, ఒకొక్క ప్పుడు పెద్దబంతులతో ఆడుకొనుచుండును, ఆ బంతులనే మనము సూర్యు డనియు భూమి యనియు పేర్కొనుచుందుము. ఒక్కొక్కప్పుడు మీవంటి శిశువులతో ఆడుకొనుచుండును, మీతో సదా నవ్వుచు క్రీడించుచునుండును.

అతనిని చూచుటయు అతనితో ఆడుకొనుటయు ఎంత వేడుకగా నుండునో, ఆలోచింప వోయి, మిత్రమా.

ప్రియ అధ్యాపక్జీ, నేనిప్పుడే కదలుచున్నాను. చికాగోకు పోయినప్పుడు మాత్రము తప్పక లియాన్సుదంపతులను దర్శింప బోవుట నా కలవాటు. ఇచట నేను చూచిన మహోదారులగు దంపతులలో, వా రొకరు. మీరు నాకు దయతో జాబు వ్రాయు దురేని, దయచేసి దానిని "మిస్టర్ జాన్ బి. లియాన్సుగారిల్లు 262 మిచిగనుఅవెన్యు, చికాగో" అను విలాసముననే వ్రాయుడు.

"అనేకమగు ఈజగత్తులో ఏకమును, ఈఅసారాస్థిరముల జగత్తున నిత్యసత్తును, మృత్యుమయమగు ఈజగమున ఏకైక జీవుడును ఎవడో—అతనిని అవలంబించినధీరులకే శాశ్వతశాంతి సిద్ధించును, కాని ఇతరులకు సిద్ధింపదు, ఇతరులకు సిద్ధింపదు".

(వేదములు)

"ఎవడు వేదాంతులకు బ్రహ్మమో, నైయాయికులకు ఈశ్వరుడో, సాంఖ్యులకు పురుషుడో, మీమాంసకులకు కార ణమో, బౌద్ధులకు ధర్మమో, నాస్తికులకు శుద్ధశూన్యమో, భక్తులకు నిరవధికపరమభక్తియో అతడు మనల నెల్లర కృపతో

తనరక్షణక్రిందికి కైకొనునుగాక". న్యాయ(ద్వైత)పక్షమునకు చేరిన గొప్పతత్త్వవేత్తయగు ఉదయనాచార్యుని శ్రీసూక్తి యిది. అతని అద్భుతగ్రంథమగు "కుసుమాంజలి"లో ఇది ప్రారంభాశీర్వాదమంగళము. ఆగ్రంథమున, (రెవలేషన్ ) శ్రుతి నిరపేక్షముగా అనంతప్రేమనిధియు నైతికపరిపాలకుడు ఐన సాకార భగవంతుని అస్తిత్వమును సిద్ధాంతముచేయుటకు ప్రయత్నించియున్నాడు.

సదాకృతజ్ఞుడగు మీమిత్రము
వివేకానంద

## 68

(టన్నాట్ఉడ్సతికి)

చికాగో,
అక్టోబరు 10, 1893.

ప్రియ శ్రీమతి టన్నాట్ఉడ్నకు,

నీజాబు నిన్న చేరినది. ఇప్పుడే నేను చికాగోలో ఎల్లెడల ఉపన్యాసములు చేయుచున్నాను. నాఅభిప్రాయము ప్రకారము నాఉపన్యాసములు చాల బాగుగ సాగుచున్నవి. ఒక్కొక్క ఉపన్యాసమునకు అధికపక్షము 80 డాలర్లు అధమపక్షము 30 డాలర్లు ముట్టుచున్నవి. విశ్వమతమహాసభవారు ఉచితముగానే చికాగోలో నాపేరును చాల బాగుగ ప్రకటించిరి. కాబట్టి ఇప్పుడు నేనిరంగమును విడిచివచ్చుట హితము కాదు. అట్లు విడిచిరాకుండుట మీకు సమ్మతమే అని నా నమ్మకము. ఐనను బోస్టనుకు నేను త్వరలోనే రావచ్చు. ఎప్పుడు వత్తునో చెప్పలేను. స్ట్రీటరునుండి నిన్ననే మరలి వచ్చితిని. అచ్చట నాకు ఒక్కఉపన్యాసమునకు 87 డాలర్లు లభించినవి. ఈవారములో ప్రతిదినము నా ఉపన్యాసకార్యక్రమము కలదు. ఈవారము

ముగియునప్పటికి ఇంకను ఎక్కువ వచ్చు నని నా నమ్మకము. శ్రీఉడ్స్‌గారికి నాప్రేమ, మన మిత్రుల కందఱికి అభినందనములు.

భవదీయసత్యపూర్ణ,
వివేకానంద

## 69

(ప్రొఫెసరు జాన్ హెన్రీరైటుగారికి)

జాన్ లియాన్ గారింట,
262 మిచిగన్ అవెన్యూ, చికాగో,
అక్టోబరు 26, 1893.

ప్రియ అధ్యాపక్జీ,

ఇచ్చట నా పని బాగుగా సాగుచున్న వార్త విని మీరు సంతసింతురు. ఇచ్చట ఇంచుమించు అందఱును, సనాతనాచార మందు అతిమాత్రాభినివేశము కలవారు తప్ప, నాయందు చాల దయగలిగి యున్నారు. దూరదేశములనుండి ఇచ్చట సమావిష్టులైన వారిలో పెక్కండ్రకు నిర్వహించుకోవలసిన కార్యక్రమములు ప్రణాళికలు ఆశయములు కలవు. ప్రతిఒక్కరికి విజయావకాశము గల దేశము అమెరికా ఒక్కటే. నేను మేలైన ఆలోచన చేసి, నా ప్రణాళికలను గూర్చి మాటాడుటను పూర్తిగా మానుకొన్నాను. ఏల యన "క్రైస్తవమతబాహ్యు" (హీతెన్) నకు తన ప్రణాళికకంటె ఎక్కువే వచ్చు నను నమ్మకము నాకు కలిగినది. కాబట్టి నా సొంత ప్రణాళికను నిర్వహించుకొనుటకై ఆసక్తితో పాటువడుటకు పోగోరుచున్నాను. ఇతరోపన్యాసకుల వలెనే నాప్రణాళికను మఱుగుపఱచుకొని పనిచేయుచుందును.

ఎవడు న న్నిచటికి తెచ్చెనో ఇప్పటికిని నన్ను విడువకున్నాడో అతడు నే నిట నుండగా నన్ను విడువబోడు. నాపని బాగుగా సాగుచున్నది. ధనసంపాదనవిషయము ఇంకను

మెఱుగుగ నుండు నను ఆసపాటున్నది. ఈవార్త తెలిసిన నీవు సంతసింతువు. ఈవ్యాపారములో నేను అనుభవము బొత్తిగా లేనివాడను. కాని నాపనిని త్వరగా నేర్చుకొందును. చికాగోలో ప్రజాప్రీతి నాయం దపారముగ నున్నది. కావున మఱికొంత కాల మిచట నుండి ధనము రాబట్టుకొందమని నా కోరిక.

నెలకు రెండుసార్లు సమావేశమగు మహిళలసభ (లేడీస్ ఫార్ట్‌నైట్లీక్లబ్)లో రేపు నేను బౌద్ధమునుగూర్చి ఉపన్యసింపబోవు చున్నాను. ఈనగరమున అన్నిటికంటె మాట చెల్లుబడి ఆసభకే ఎక్కువ. నా సదయమిత్రమా, నీయెడగాని మిమ్ము నాకు ప్రసాదించిన ఆ సర్వేశ్వరునియెడగాని కృతజ్ఞత నెట్లు చెల్లించుకొన వలెనో ఎఱుగకున్నాను. ఏల యన నాప్రణాళిక విజయవంతమగు నను నమ్మకము నా కిప్పుడు కలుగుచున్నది. దానిని నెగ్గునట్లు చేసినవారు మీరు.

ఈ జగతిని పురోగమించు మీకు అడుగడుగునను సౌఖ్య మంగళములు గల్గుత.

మీ బిడ్డలకు నా ప్రేమాశీస్సులు—

సదా భవదీయప్రేమపూర్ణ,
వివేకానంద

## 70

(శ్రీ అళసింగపెరుమాళుకు)

చికాగో,
నవంబరు 2, 1893.

ప్రియ అళసింగా,

క్షణకాలము నాలో కన నైన దుర్బలత నీ మనసున కెంతో నొప్పి కలిగించినందులకు ఎంతో వగచుచున్నాను. ఆ సమయములో నా జేబులో చిల్లిగవ్వ లేదు. అప్పటినుండి

భగవంతుడు మిత్రులను నాయొద్దకు పంపినాడు. బోస్టనుకు సమీపమున ఒకానొక పల్లెలో డాక్టర్ రైటుగారిని పరిచయ పఱచుకొంటిని. హార్వర్డ్ విశ్వవిద్యాలయములో ఆయన గ్రీకు భాషాధ్యాపకుడుగా నున్నాడు. ఆయన నాయెడల విశేషసాను భూతిని వహించినాడు. విశ్వమతమహాసభకు నేను తప్పక పోవలె నని ఆయన నొక్కి చెప్పినాడు. ఆ మహాసభకు నేను పోయిన యెడల ఈ దేశమున కంతటికిని నాపరిచయము కలుగునని ఆయన అభిప్రాయము. నే నెవ్వరిని ఎఱుగకపోవుటవలన నాకై అన్ని ఏర్పాటులను ఆయన చేయబూనెను. నేను వెంటనే చికాగోకు మరలి వచ్చితిని. ఈమహాసభకు ప్రాక్పశ్చిమ దేశములనుండి వచ్చిన ప్రతినిధులతోబాటు నాకును ఒకమహాశయునింట బస ఏర్పాటయ్యెను.

మతమహాసభ సమావేశమగునాటి ప్రాతఃకాలమున కళామందిరము (ఆర్ట్ పాలస్) అనుభవనములో మేమందఱము సమావేశమైతిమి. మతమహాసభసమావేశములకై ఒక పెద్ద హాలును, తాత్కాలికములగు చిన్నహాలులు కొన్నియు నిర్మింప బడినవి. అన్ని దేశములవారును అచ్చట నుండిరి. ఇండియా నుండి బ్రహ్మసమాజీయుడగు మజుందారును, బొంబాయివాడగు నాగర్కరును, జైనుల ప్రతినిధి గాంధియును, అనిబెసెంటుసతిని గూడి దివ్యజ్ఞానసమాజప్రతినిధిగా శ్రీచక్రవర్తియు వచ్చియుండిరి. వీరిలో మజుందారును నేనును ప్రాతమిత్రులము. చక్రవర్తి నా పే రెఱుగును. మమ్ము బారులుగతీర్చి విభవోత్తరమైన ఊరేగింపుగా నడిపించి వేదికయొద్దకు చేర్చిరి. దిగువ నొక హాలు, పైని ఒక పెద్ద గ్యాలరీ, ఆదేశపు పరిష్కృతసంస్కృతికి ప్రతినిధులుగా సమాసీనులైన ఆరేడువేలమంది స్త్రీపురుషులు, సభావేదికపై నాసీనులైన ప్రపంచమండలి సమస్తదేశముల పండితప్రకాండులు — ఆ దృశ్య మును భావించి చూడుము! ఇక జీవితములో నెన్నడును ప్రజల యెదుట నిలిచి ప్రసంగింపని నేను ఈ మహాసభసమక్షమున నిలిచి

ఉపన్యసింపవలెను! మహాక్రమముతో సంగీతముతో క్రియాకలాప ముతో ఉపన్యాసములతో మహాసభ ప్రారంభమైనది. తర్వాత ప్రతినిధులలో ఒక్కొక్కరిని సదస్యులకు పరిచయపఱచుట జరిగినది. పరిచయవాక్కులు ముగిసిన తర్వాత వారు వేదిక నెక్కి యుపన్యసించిరి. ఇక నాగుండె తటతటకొట్టుకొనుచుండినది. నా నాలుక ఇంచుమించు ఎండియే పోయినది. ఇంత దడగా నున్నందువలన ఉదయ ముపన్యసించుటకు సాహసింపజాలనైతిని. మజుందారు చక్కగా నుపన్యసించినాడు. చక్రవర్తి మఱింత చక్కగా నుపన్యసించినాడు. వారు విశేషముగ కొనియాడబడిరి. వారు తమ ఉపన్యాసములను వ్రాసిపెట్టుకొని ముందే సంసిద్ధులై వచ్చిరి. నేను మూర్ఖుడను. వ్రాసిపెట్టుకొన్న ఉపన్యాస మొక్క టేని నాయొద్ద లేదు. శ్రీసరస్వతీదేవికి ప్రణమిల్లి ఉపన్యాస వేదికపై నడుగిడితిని. డాక్టరు బఱ్ఱోసు నన్ను గూర్చి పరిచయ వాక్యములు పలికినాడు. నేను చిన్నఉపన్యాసము చేసినాను. "అమెరికా సోదరసోదరీమణులారా" అని సదస్సును సంబోధించి తిని. రెండు నిమిషములసేపు చెవుడుపఱచు కరతాళాభివందన ములు మ్రోగినవి. తర్వాత నా యుపన్యాసమును సాగించితిని. ఉపన్యాసము ముగించి భావోద్రేకముచే ఇంచుమించు బడలి కూర్చుంటిని. నాటిఉపన్యాసములలో నాఉపన్యాసమే సర్వోత్తమ మని మఱునాడు పత్రిక లన్నియు ప్రకటించినవి. నేను అమెరికా యం దంతటను ప్రఖ్యాతుడ నైతిని. "మూకం కరోతి వాచాలం" "మూగవానిని వాచాలుగాగ జేయు" అని మహావ్యాఖ్యాత శ్రీధరుడు చెప్పినమాట నిజము. అతనిపేరుకు జోహారు లెసగు గాక! ఆనాటినుండి నేను ప్రసిద్ధపురుషుడనైతిని. హిందూమత మునుగుఱించిన నా వ్యాసమును నేను చదివిననాడు సభాగారమున జనులు కిటకిటలాడిపోయిరి. ఆకూట మంతకుముం దెన్నడును ఇంతగా నిండలేదు. ఒకానొక పత్రికనుండి కొన్నిమాటల నుదా హరించుచున్నాను: "స్త్రీలు, స్త్రీలు, స్త్రీలు, ప్రతిష్ఠలమందును

మూలమూలలలోను క్రిక్కిఱిసిపోయిరి. వివేకానందునకు ముందు వక్తలు చదువు వ్యాసములు ముగియువఱకు ఓపికతో వేచి యుండిరి. ఎంతోసేపు వేచియుండిరి. ......'' పత్రికలందు ప్రచురింపబడిన భాగములను నీకు పంపితినేని ఆశ్చర్యపడిపోదువు. కాని పేరుప్రతిష్ఠలు నాకు గిట్టవనుట నీకు తెలిసినవిషయమే. ఒక్కమాట చెప్పెదను, చాలు. ఉపన్యాసవేదికమీఁదికి ఎప్పుడు నేను పోయినను చెవులను గింగురు మనిపించు అభినందనధ్వానములు మ్రోగెడివి. ఇంచుమించుగ పత్రికలన్నియు నన్నెంతగనో ప్రశంసించినవి. స్వమతదురభిమానము ఉత్కటముగ గల పత్రికల వారు సైతము "సుందరవదనుడును, ఆకర్షకప్రభావుడును, అద్భుతవచఃకౌశల్యసంపన్నుడును అగు నితడే విశ్వమతమహాసభలోనుండిన యందఱిలోను అత్యంతప్రముఖుడు'' అని అంగీకరించి తీరవలసివచ్చినది. ప్రాచ్యదేశీయు డెవడును ఇతఃపూర్వము అమెరికాప్రజల హృదయములలో ఇంతగా హత్తుకొన్నవాడు లేడని తెలిసికో, చాలు.

వారి కారుణ్యమును వర్ణించు టెట్లు? ఇచట నాకెట్టి కొదువలును లేవు. హాయిగా ఉన్నాను. యూరపుప్రయాణమునకు కావలసిన పైకమంతయు నాకిచట లభించును. ...నరసింహాచార్యు డను నొక బాలుడు మా నడుమ గోచరించినాడు. మూడేండ్లనుండి అతడు పోమరిగా నగరమున తిరుగుచున్నాడు. పోమరియో కాడో — నాకతనియందు మోజు కలిగినది. వానిని గుఱించి నీకు తెలిసిన దేమైన నున్నచో అన్ని వివరములను వ్రాయుము. అతడు నిన్నెఱుగును. పారీసునగరమున వస్తుప్రదర్శనము జరిగిన సంవత్సరమున అతడు యూరపునకు వచ్చినాడు. ...

ఇపుడు నాకు దారిద్ర్యము తీరిపోయినది. ఈనగరములో మిక్కిలి చక్కనివగు పెక్కుభవనరాజములలోనికి నాకిప్పుడు ప్రవేశము కలదు. సదా ఎవరికో ఒకరికి అతిథినై ఉన్నాను.

వేఱు ఏ దేశీయులకు లేని కుతూహలము ఈ దేశీయులకు కలదు. ప్రతివిషయమును తెలిసికొనవలెనని వీరు కుతూహలపడుచుందురు. ఇక వీరి మహిళలా ... ప్రపంచమహిళ లందఱికంటె వీరిది చాల ముందడుగు. అమెరికాలో సామాన్యముగా సంస్కృతి, మగవారి కంటె మహిళలకు చాల నెక్కువ. మగవారు బ్రతికినన్నినాళ్లు ధనమునకై ఊడిగమును చేయుచుందురు. మహిళలు తాము మేలొందుటకు ప్రతియవకాశమును దక్కించుకొందురు. వీరు సదయహృదయులు. ఉన్న మాటను చెప్పివేయు స్వభావము కలవారు. దేనినైన ప్రచారముచేయవలె ననెడి తిక్క గల వా రందఱును ఇచ్చటికి వత్తురు. ఆ ప్రచారాలలో అధికభాగము మంచివి కావు, అను మాట' చెప్పుటకు చింతిలుచున్నాను. అమెరికనుల దోషాలు అమెరికనుల కున్నవి. దోషాలు ఏ దేశీయులకు లేవు ? సారముగ నేను చెప్పున దిది — నాగరకతకు బీజములను నాటినది ఆసియా, మానవుని వర్థిల్లజేసినది యూరపు. మహిళలకును సామాన్యజనులకును అభివృద్ధి కూర్చుచున్నది అమెరికా. మహిళలకును కార్మికులకును అమెరికా స్వర్గధామముగ నున్నది. అమెరికాలోని సామాన్యజనులతోను మహిళలతోను మనదేశమందలి సామాన్యజనులను మహిళలను పోల్చి పరికించినచో విషయము వెంటనే నీకు స్పష్ట మగును. అమెరికనులలో ఒకఉదారస్వభావము అతిత్వరగా రూపొందుచున్నది. రాతికి తిరుగబడు చిప్పలవంటి కఠినులు కైస్తవులలో నున్నారు. (ఈమాట వారిదే) అట్టివారిని నీవు ఇండియాలో చూచియుందువు. వారిని మనసులో నుంచుకొని అమెరికనుల గుణదోషనిర్ణయమును చేయరాదు. అట్టి వారు ఇచ్చటను నున్నారు. కాని వారి సంఖ్య త్వరత్వరగా తగ్గిపోవుచున్నది. ''ఆధ్యాత్మికపరత'' ''ఆధ్యాత్మికపరత'' అని హిందువులు నియతముగా చెప్పుకొను బడాయి కలదు కదా. ఆ ఆధ్యాత్మికపరతవంకకు గొప్పదైన ఈ అమెరికా దేశము అతిత్వరగా పురోగమించుచున్నది.

హిందువు తన ఆస్తికధర్మమును వదలుకొనకూడదు. కాని దానిని తగిన హద్దులలో నిలిపి, పెంపొందుటకై సంఘమునకు స్వేచ్ఛ నీయ వలెను. జరిగిన ఘోరములకును కలిగిన పతనమునకును కారణము మతాచార్యకైతవ మైయుండ, భారతీయసంస్కర్తలందఱును ఆ కారణము హిందూమతమే అని తలంచిరి. అది పెద్ద పొరపాటు. వెంటనే వారు అవినాశ్యమగు మతహర్మ్యమును పడగొట్టుటకై నడుముకట్టిరి. పర్యవసాన మేమి? అపజయము! బుద్ధునిమొదలు రామమోహనరాయివఱకును ప్రతియొక్కరును వర్ణవ్యవస్థ మతవ్యవస్థ అని భ్రమించి మతమును వర్ణమును అన్నిటిని పడగొట్టుటకు ప్రయత్నించి భంగమొందిరి. పురోహితులు వెఱ్ఱిగా ప్రలాపించుచున్నప్పటికిని, వర్ణము గడ్డకట్టుకొనిపోయిన అప్పటపు సాంఘికవ్యవస్థ. దానివలని ఉపయోగము ముగిసిపోయినది. ఇప్పుడు దానిదుర్గంధము మాత్రమే భారత వాతావరణమున నిండియున్నది. సంఘమున ప్రజలు కోల్పోయిన మానవత్వమును తిరిగి వారి కిచ్చినప్పుడే వాతావరణములోని దుర్గంధమును తొలగించుటకు శక్య మగును. ఇచట పుట్టిన ప్రతి మానవునకు తాను మానవుడ నను నెఱుక కలదు. ఇండియాలో పుట్టిన ప్రతిమానవునకు తెలిసినది తాను సంఘమునకు బానిసనని. ప్రాణి ఎదుగవలె ననిన అందుకు ఏకైకావశ్యకము స్వాతంత్ర్యము. స్వాతంత్ర్యమును తొలగించితిమేని ఫలితము పతనమే. ఈ కాలమున "పోటీలు" వచ్చిపడుటతో వర్ణవ్యవస్థ త్వరత్వరగా ఎట్లు అదృశ్యమగుచున్నదో చూడు! దీనిని మాపుటకు ఇప్పుడే మతమును అక్కఱ లేదు. అంగళ్లు పెట్టుకొను బ్రాహ్మణులు చెప్పులు కుట్టు బ్రాహ్మణులు సారాతయారుచేయు బ్రాహ్మణులు ఇప్పుడు ఉత్తరభారతదేశమున సర్వసామాన్యముగ కననగుచున్నారు. కారణ మేమి? పోటీలే కారణము. ఇప్పటి ప్రభుత్వమువారి ఏలుబడిలో పొట్టనింపుకొనుటకై తనకు నచ్చిన ఎట్టి వృత్తిని చేయుటకును ఎవనికిని నిషేధము లేదు. ఇందుల ఫలితము

ఉత్కృటకోటికమైన పోటీలు. కావున వేలకొలది మానవులు నిరుద్యోగులై అడుగున పడియుండక తమ జన్మలక్ష్యములగు మహోన్నతపదవులను అన్వేషించుచున్నారు, పడయుచున్నారు.

నే నీ దేశములో అధమపక్షము ఈ చలికాలము దాటిపోవు వఱకైనను ఉండవలెను. పిమ్మట యూరపుకు పోవలెను. నా అక్కఱల నన్నిటిని దేవుడే తీర్చును. అందుంగూర్చి నీవు కలవర పడ నక్కఱ లేదు. నీ అనురాగమునకు నా కృతజ్ఞతను మాట లలో చెప్ప లేను.

నానాటికి భగవంతుడు నాచెంతనే యుండుట అనుభవ గోచర మగుచున్నది. ఆయన చూపుదారి ననుసరించుటకే నేను ప్రయత్నించుచున్నాను. ఆయన సంకల్పము సిద్ధించుత. ...... లోకోపకారముగ మనము ఘనకార్యములు నిర్వహింతుము. నిర్వహించుట జగద్ధితముకొఱకే కాని పేరుప్రతిష్ఠలకై కాదు.

'ఏల' 'ఎందుల' కనుచుఁ బ్రశ్నింపరాదు
పనియొనర్చుటె మనవిధి ప్రాణ మొడ్డి'.*

సోత్సాహుడవై యుండుము. ఘనకార్యములను నెఱపుటకై దేవుడు మనల నెన్నుకొని యున్నా డనియు మనము వానిని తప్పక నెరవేర్తుమనియు విశ్వసింపుము. నడుముకట్టి సంసిద్ధుడవై యుండుము. అనగా విశుద్ధుడవుగను పావనుడవుగను నుండుము. నిర్వ్యాజముగ ప్రేమింపుము. నిష్పచ్ఛరముననున్నవారిని దుఃఖి తులను పతితులను ప్రేమింపుము. భగవంతుడు ని న్నను గ్రహించును.

రామనాథపురరాజు మున్నగువారిని అపుడపుడు చూచు చుండుము. భారతదేశమందలి సామాన్యజనులపట్ల సానుభూతి

---

* అవర్స ఈస్ నాట్ టు క్వెశ్చిన్ వై, అవర్స ఈస్ టు డూ అండ్ డై.

వహింపు డని వారికి నొక్కి చెప్పుము. వారు పేదలకుత్తుకల నెట్లు త్రొక్కివైచుచున్నారో తెలిపి పేదల నుద్ధరింప పాటుపడకున్నచో మానవు లనిపించుకొను నర్హత వారికి లే దని చెప్పుము. నిర్భయ ముగ నుండుము. భగవంతుడు నీ చెంగట నున్నాడు. జ్ఞానహీనులై ఆకలితో అల్లాడుచున్న భారతప్రజాకోటిని పరమేశుడు తప్పక ఉద్ధరించును. మనయువకుల పెక్కండ్రకంటెను రాజకుమారు లలో అనేకులకంటెను ఇచటి రైల్వేపోర్టరుసైతము చదువులో మిన్న. హిందూమహిళలలో అత్యధికసంఖ్యాకలు ఊహింప గలంతవిద్యకంటె అమెరికాలో ప్రతిమహిళకును గల విద్య ఎంతో వరిష్ఠమైనది. అట్టివిద్య మన కేల సాధ్యము కాదు? అట్టివిద్య మన కుండితీరవలెను.

నీవు పేద వని తలంపకు. ధనము, శక్తి కాదు. సౌజన్యమే పవిత్రతయే శక్తి. రమ్ము, సమస్తవసుంధరయందును అది అంతే అను విషయమును గుర్తింపుము.

ఆశీస్సులతో,

భవదీయుడు
వివేకానంద

మలిమాట: మఱొక వార్త విను. నీబంధువు వ్రాసిన వ్యాసము నేను చూచినవానిలో మిగుల వింతయైనది. అది వర్తకునిపట్టీవలె నున్నది. విశ్వమతమహాసభలో అది పఠనార్హము కా దని తలంచినారు. కావున నరసింహాచార్యులు అందలి కొన్ని భాగములను ప్రక్కనునున్న ఒకహాలులో చదివెను. అందులో నొక్కమాటయైనను ఎవ్వరికిని అర్థము కాలేదు. ఇట్లని అతనితో చెప్పకు. అల్పాక్షరములందు అనల్పార్థము నిముడ్చుట గొప్పకళ. మణిలాల్ ద్వివేది వ్యాసములోకూడ అత్యధికభాగమును కత్తిరింప వలసివచ్చెను. వేయింటికంటె ఎక్కువ వ్యాసములే చదువ

బడినవి. కాబట్టి అట్టి ఉద్రిక్తభావబంధురములగు ఉపసంహార వాక్కులకు వ్యవధి లేదాయెను. వక్తకు సాధారణముగ నీయబడు అరగంటకంటె నాకు చాలఎక్కువకాల మిచ్చినారు. ... ఏలయన శ్రోతలను సభలో నిలుపుటకై వారికి నచ్చిన వక్తల ఉపన్యాసములను సాధారణముగ చివరకు నెట్టియుంతురు. భగవంతుడు వారికి మేలు చేయుగాక. వారికి ఎంత సానుభూతి యున్నది! ఎంత ఓర్పు! ఉదయము పదిగంటలనుండి రాత్రి పదిగంటలవఱకు వారు కదలక కూర్చుందురు. నడుమ భోజనమునకు అరగంటసేపు మాత్రమే విరామకాలము. ఒకదాని తర్వాత నొకటిగా వ్యాసములు చదువబడుచుండును. అం దధికభాగము చాల చప్పిడి వ్రాతలుగనే యుండును. కాని శ్రోతలు తమకు నచ్చిన వక్తల ఉపన్యాసములను వినుటకై వేచియే యుందురు.

శ్రోతలకు నచ్చినవక్తలలో సింహాళీయుడగు ధర్మపాలు డొకడు. కాని దురదృష్టవశమున అతడు మంచివక్త కాడు. వారి కిచ్చుటకు అతనియొద్ద నున్నది "మాక్సుముల్లరు" "రిస్డేవిడ్సు" అను వారి గ్రంథములనుండి కైకొన్న ఉదాహరణములు మాత్రమే. అతడు చాలమధురమైన వ్యక్తి. విశ్వమతమహాసభ సమావేశములలో మే మిద్దఱము మిక్కిలి ఆంతరంగికుల మైతిమి.

పూనానుండి వచ్చిన క్రైస్తవమహిళ కుమారి సోరాబ్జీయు జైనులప్రతినిధి శ్రీగాంధియు ఉపన్యాసములు కావించుచు పర్యటించుచు ఈదేశమున సుదీర్ఘకాలము నిలువ నున్నారు. వారు నెగ్గగలరనియే నా నమ్మకము. ఈదేశమున ఉపన్యసించుట చాల లాభకరమైన వృత్తి. ఒక్కొక్కప్పుడు మంచి ఆదాయము వచ్చుచుండును.

శ్రీ ఇంగర్సాలుకు ఒక్కొక్కఉపన్యాసమునకు అయిదాఱు వందల డాలర్లు లభించుచున్నవి. ఈదేశమున అతడు సర్వోత్కృష్ట

వక్తగా ప్రసిద్ధుడు. ఈజాబును ప్రచురింపకు. చదివిన తర్వాత దీనిని శ్రీ ఖేత్రీమహారాజుగారికి పంపుము. అమెరికాలో తీసిన నాఫోటోను ఆయనకు పంపితిని.

వి.

## 71

(ఉడ్సుసతికి)

541 డియర్ బారన్ అవెన్యూ,
చికాగో,
నవంబరు 19, 1893.

శ్రీమతి ఉడ్సుసతికి,

మీ జాబునకు ఉత్తరము వ్రాయుటకు అయిన ఆలస్యమునకు మన్నింపుడు. మరల మిమ్మెప్పుడు దర్శింప గల్గుదునో నే నెఱుగను. మడిసోనుకును, మిన్నియపోలీసుకును రేపు బయలు దేఱుచున్నాను. మీరు చెప్పిన ఆంగ్లమహాజనుడు లండను వాసియగు డాక్టరు మొమెరి. ఆయన లండను నగరపు పేదప్రజలలో సుప్రసిద్ధుడైన పనివాడు, చాలమధురమైన వ్యక్తి. మీకు తెలియదేమో, ప్రపంచమున కంతటికిని ఇచ్చటి మతమహాసభకు ప్రతినిధిని పంపనివారు ఆంగ్లేయక్రైస్తవులుమాత్రమే. కాంటర్ బరీ ఆర్చిబిషపు ఈ మతమహాసభను తూలనాడియున్నప్పటికిని డాక్టరు మొమెరి ఈ మహాసభకు వచ్చినాడు.

నేను జాబులు తఱచు వ్రాసినను వ్రాయకున్నను మీయెడను నా సదయమిత్రమును ఉదాత్తుడునగు మీపుత్రునియెడను నా అనురాగము ఎప్పుడు నొక్క రీతిగనే యుండును.

నాగ్రంథముల నన్నిటిని శ్రీ హేలుగారింట నాకు చేరునట్లుగా పంపగలరా? నాకిప్పుడు వానితో పనియున్నది. రవాణా రుసుము ఇక్కడ కట్టబడును.

మిమ్ము మీవారిని సర్వేశ్వరు డనుగ్రహించు గాక!

సదా మీ మిత్రము
వివేకానంద

మలిమాట: కుమారి సాన్బారనుకును ప్రాచ్యదేశీయులగు మన ఇతరమిత్రములకును మీరు జాబువ్రాయుట తటస్థించిన వారికి నా ప్రగాఢవందనములను దయతో అందజేయుదు.

సత్యాయుతభవదీయ
వివేకానంద

## 72

(శ్రీ హరిపాదమిత్రకు)

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

జార్జి-డబల్యూ హేలుగారింట,
541 డియర్‌బార్న్ అవెన్యూ,
చికాగో,
డిసెంబరు 28, 1893.

ప్రియహరిపాదునకు,

నా చికాగో నగరోపన్యాసములు హిందూదేశపత్రికలలో కననగుట చాల వింతగా నున్నది. ఏల యన నేనే పని చేసినను దానిని నాచేతనైనంతవఱకు ప్రకటించుకొనకుందును. ఇచ్చటి విషయములనేకములు నా మదికి వచ్చియున్నవి. ఈ దేశమున పేదఱికము లేదని ఇంచుమించు నిరాక్షేపముగ చెప్పవచ్చును. ఇచ్చటి మహిళలవలె విద్యాసంస్కృతీ సంపన్న లయిన వారిని నేను వే ఱచ్చటను ఎప్పుడును చూచియుండలేదు. మగవాడిలో బాగుగ చదువుకొన్నవారు మనదేశములో నున్నారు. కాని

ఇచటి మహిళలవంటి మహిళలు మీ రెచ్చటను కానరారు. ధర్మాత్ముల ఇండ్లలో లోకజనని లక్ష్మీరూపమున నుండు ననుట యథార్థమే. మంచువలె నిష్కళంకవిశుద్ధహృదయములు గల మహిళలను వేలకొలదిగా నిచట చూచియున్నాను. ఔరా, వారికి ఎంత స్వేచ్ఛ కలదు. సాంఘికనాగరవిధులకెల్ల నియామకత్వము వారిది. పాఠశాలలలో కళాశాలలలో మహిళలు నిండుగ నున్నారు. మనదేశమున స్త్రీలను క్షేమముగ వీధులలో సంచరింపనిచ్చుటకు వీలు లేదు. నాపట్ల ఇచ్చట మహిళల దయ కొలదికి మించినది. ఇచ్చటికి నేను వచ్చినప్పటినుండి నన్ను వారిండ్లలో సత్కరించుచున్నారు. నాకు భోజనము పెట్టుచున్నారు. నా ఉపన్యాసములకు ఏర్పాట్లు చేయుచున్నారు. అంగళ్లకు నన్ను పిలుచుకొనిపోవుచున్నారు. నా వసతికి సౌఖ్యమునకు కావలసిన వాని నెల్ల వారు చేయుచున్నారు. వారికి నేను పడియున్న ప్రగాఢకృతజ్ఞతాఋణమును ఇంచుకైన తీర్చుకొను సామర్థ్యము నా కెప్పుడు నుండ బోదు.

నిజమైన శక్త్యారాధకు డెవరో నీ వెఱుగుదువా? విశ్వవ్యాప్తమగు శక్తి భగవంతుడే అని ఎవ డెఱుగునో ఆ శక్తి మూర్తిభావమును మహిళలందు ఎవడు సాక్షాత్కరించుకొనునో - వాడు. ఇచ్చటి మగవారు చాలమంది మహిళలను ఆదృష్టితోనే చూతురు. ఏ కుటుంబములలో మహిళలకు సుఖమును ఆదరమును కలవో ఆ కుటుంబములవారిని వేల్పులు అనుగ్రహింతు రని మనువుకూడ చెప్పియున్నాడు. మహిళలను ఎంతగా ఆదరించుట అపేక్షణీయమో అంతగా ఇచటి మగవారు వారిని ఆదరించుచుందురు. కావుననే వారు అంతటి సుస్థితిలో అంతటి స్వాతంత్ర్యముతో అంతటి శక్తితో అంతటి వ్యుత్పత్తితో చెలగుచున్నారు. మనము బానిసలముగను దుఃఖజీవనులముగను నిర్జీవులముగను ఉండుటకు కారణమేమి? జవాబు స్పష్టమే.

ఇక్కడి వారికి ఎంత పవిత్రత ఎంత స్వచ్ఛత ఉన్నదో చూడుము. మగువలకు ఇరువది ఇరువదియైదు సంవత్సరముల వయస్సు రాకముందు వివాహము లేదు. పక్షులకున్నంత స్వేచ్ఛా సంచారము వారి కున్నది. అంగళ్లకు పోవుదురు. పాఠశాలలకును కళాశాలలకును పోవుదురు. ధనము గడింతురు, అన్ని విధములైన పనులను చేయుదురు. సంపన్నులుగ నుండువారు పేదలకు మేలు చేయుటలో తత్పరత వహింతురు. ఇక మన మేమి చేయుచున్నా మనగా వయస్సు మీఱినచో వ్యభిచరణమును అవినీతియు తల చూపునేమో అని బాలికలకు పదియునొక్క సంవత్సరముల వయస్సు నిండక మునుపే తప్పక పెండ్లి చేయుచున్నాము. మన మనువు ఏ మని విధించియున్నాడు? "కొడుకులను ఎంత శ్రద్ధతో జాగరూకతతో పోషించుచున్నామో చదివించుచున్నామో కూతుండ్రను కూడ అంతశ్రద్ధతోను అంతజాగరూకతతోను పోషింపవలయును, చదివింపవలయును. ముప్పదేండ్లు బ్రహ్మ చర్యము పాటించిన తర్వాతనే కొడుకులకు పెండ్లి చేయవలెను. అట్లే కూతుండ్రును బ్రహ్మచర్యమును పాటింపవలయును. వారిని తల్లిదండ్రులు చదివింపవలయును. వాస్తవముగ మనము చేయు చుండున దేమి? మీ మహిళలస్థితిని మీరు బాగుపఱుపగలరా? బాగుపఱుపగలిగిననే మీరు మేలొందు ఆసపాటు కలదు. లేకున్న ఇప్పు డున్నట్లే అధోగతిలో నుండవలసినదే.

మన దేశమున ఎవడేని నిమ్నవర్ణమున జన్మించునేని అతనికి ఆసపాటు లేదు. అతడు శాశ్వతముగ వినష్టుడే. ఏల? ఏమి దురధికారప్రాభ మిది! ఈ దేశములో ప్రతిమానవునకును అవ కాశము లున్నవి. ఆసపా టున్నది. ఉద్దేశించిన వానిని సాధించు కొనుసామర్థ్య మున్నది. ఈనా డతడు పేదగా నుండవచ్చు. రేపే అతడు సంపద - పాండిత్యము - లోకపూజ్యత - కలవాడుగ కా వచ్చు. పేదలకు సాయము చేయ వలె నను ఉబలాటము

ఇచ్చట ప్రతివానికిని కలదు. భారతదేశమున మనము చాల పేదవార మను ఘోష మిక్కుటముగ కలదు. కాని పేదల సుస్థితికై నెలకొల్పబడిన ధర్మసంస్థలు ఎన్ని ఉన్నవి? భారతదేశమున కోట్లకొలదిగ నున్న పేదప్రజల దుఃఖములకును కష్టములకును నిజముగ విలపించువాడు ఎందఱున్నారు? మనము మానవులమేనా? వారి మనుగడకు వారి అభివృద్ధికి మన మేమి చేయుచున్నాము? వారిని మనము తాకము. వారి సాంగత్యమును తప్పించుకొందుము. మనము మానవులమేనా? వేలకొలదిగనున్న ఆ బ్రాహ్మణులు భారతదేశమందలి అధఃపతితుల నిమ్నుల కొఱకేమి చేయుచున్నారు? "తాకకు" "తాకకు" — సదా వారి పెదవులపై నర్తించుమాట ఇదొక్కటే. వారివలన మన సనాతనధర్మమునకు ఎట్టి పతనము ఎట్టి నైచ్యము దాపురించినది! మన ఆస్తికధర్మము ఇప్పు డెందులో నున్నది? "తాకకు" మనుటలో. అందులో మాత్రమే, వే ఱెందును లేదు.

నే నీ దేశమునకు వచ్చినది నా కుతూహలము తీర్చుకొనుటకు కాదు. పేరుప్రతిష్ఠలు గడించుటకు కాదు. దరిద్రభారతీయులకు సాయము చేయుటకు సాధనములు ఏమేని సంపాదింపగలనేమో ప్రయత్నించుటకే వచ్చితిని. దేవుడు తోడ్పడునేని ఆ సాధనము లేవో క్రమముగా నీకు తెలియును.

ఆధ్యాత్మిక పరతలో అమెరికనులు మనకంటె చాల తక్కువమెట్టువారే. కాని సంఘసుస్థితిలో మనకంటె వారిది చాల పైమెట్టు. మనఆధ్యాత్మికపరతను వారికి బోధింతము. వారి సంఘమున గల శ్రేష్ఠాంశములను మన మలవఱచుకొందము.

ప్రేమతో వరిష్ఠాశీస్సులతో—

భవదీయుడు
వివేకానంద

## 73

(శ్రీ టి. ఆర్. బాలాజీరావుగారికి)*

ప్రియ బాలాజీ,

"మనతల్లిగర్భమునుండి మనము దిగంబరులముగనే వెలువడితిమి; దిగంబరులముగనే వెనుదిరిగి పోవుదుము. ఈశ్వరుని దివ్యనామమునకు మంగళము" ఈలాగు చెప్పినాడు ప్రాచీన యూదుసాధు, మానవులకు సంభవింపగల మహాదారుణ కష్టములను తాను అనుభవింపవలసివచ్చినప్పుడు ఆయన చెప్పినదానిలో తప్పు లేదు.

జీవితరహస్యమంతయు ఇందులోనే ఇమిడి యున్నది. సాగరముపై భాగమున కల్లోలములు పొటకరించవచ్చు. తుపానులు కొట్ట వచ్చు. కాని సముద్రపుటడుగుభాగము నిరవధిక శాంతికిని నిరవధికసుస్థితికిని నిరవధికానందమునకును నెలవై యుండును. "విలపించువారు ధన్యులు, ఏలయన వారు ఓదార్పబడుదురు." ఎందులకో తెలియునా? ఆపదలు ముంచుకొనివచ్చినప్పుడు తండ్రి విలాపములను, తల్లి ఆక్రందనములను లెక్కింపని (విధి) హస్తములు గుండెను పిండునప్పుడు దుఃఖనిరుత్సాహనిర్వేదభరముచే మన పాదములక్రిందినేల క్రుంగిపోవుచున్నప్పుడు — అట్టి సమయములందే 'లోపలికన్ను' తెఱచుకొనును. దిగ్వలయమంతయు అనిర్భేద్యదుఃఖరాశిగ నున్నప్పుడు తళుక్కు మని వెలుగు వెలుగును. మనము కనుచుండిన కలలు మాసిపోవును. ప్రకృతిలోని పరమమర్మమైన సత్తను అంతఃప్రబోధముచే సాక్షాత్కరించుకొందుము. దుర్బలనౌకలను ముంచివేయగల భారము పైకొన్నప్పుడే ప్రతిభాశాలియు, ధీరుడును, వీరుడునైనవాడు

---

* ఈయన మదరాసువాసులగు భక్తులలో నొకడు. వీరింట నొక దుస్సహదుఃఖసంభవము జరిగినప్పుడు వ్రాసిన జాబిది.

అనంతమును నిర్గుణమును నిత్యానందము నగు సత్తను ప్రత్యక్షముగ చూచును. ఆసత్తనే, అనంతతత్త్వమునే వివిధనామములతో వివిధప్రాంతీయులు ఆరాధించుచున్నారు. ఆత్మను ఈదుఃఖగర్తమున బంధించియున్న సంకెలలు తాత్కాలికముగ తెగిపోవును. తాత్కాలికముగ జీవుడు పైపై మెట్లు ఎక్కిపోయి పోయి సర్వేశ్వరుని సింహాసనమును చేరుకొనును. "దుర్జనులు పెట్టు బాధలు అంతరించునట్టియు డస్సినవారికి విశ్రాంతిగూర్చునట్టియు పరమపద మది".

సోదరా, రాత్రింబగళ్లు నిర్విరామముగ ప్రార్థనలను చేయుచునేయుందుము. "నీసంకల్పము నెఱవేఱుత" మని నిర్విరామముగ రాత్రింబగళ్లు అనుసంధించుచుందుము.

"ఏల, ఎందుల కనుచు ప్రశ్నింప రాదు,
పని యొనర్చుటె మనవిధి ప్రాణ మొడ్డి".

"దేవా, నీ పావననామమునకు మంగళము. నీసంకల్పము నెఱవేఱుత. దేవా, మేము లోబడవలసినవార మని ఎఱుగుదుము. దెబ్బకొట్టుచున్నది తల్లి చేయియే అని మే మెఱుగుదుము. ఆత్మ అందుల కనుకూలముగ నున్నను దేహము బలహీనముగ నున్నది. కామజనకా, నీవు బోధించిన ప్రశాంతప్రపత్తివిధానమును ప్రతిఘటించి పోరాడునట్టి ఒకవ్యథ హృదయమున నున్నది. నీకంటియెదుటనే మాకుటుంబమువా రందఱును వినాశమొందినప్పుడు రొమ్ముపై చేతులు కట్టుకొని చూచుచుండిన నీవు మాకు బల మొసంగుము. రమ్ము, దేవా, పార్థసారథీ, నిన్ను శరణొందుటే ఈజీవితమునకు మహోన్నతలక్ష్యమనియు, పరమపురుషార్థమనియు అర్జునున కుపదేశించితివే, అట్లే నాకును ఉపదేశింపుమా. ఉపదేశించితివేని ఆప్రాచీనమహనీయులవలె నేనును సమస్తభరము నీ కర్పించి 'ఓం శ్రీకృష్ణార్పణ మస్తు' అని దృఢముగ అనుసంధించుచుండ వచ్చును".

సర్వేశ్వరుడు నీకు శాంతి కలిగించుత మని అహోరాత్రములు ప్రార్థించు—

సచ్చిదానంద

## 74

1893.

ప్రియ...

...నీ కొక మాట. నిన్ను నేను మరల చూచుట ఘటిల్లకపోవచ్చు ననుటను సదా జ్ఞప్తియం దుంచుకొనుము. నీతిపరుడవుగ నుండుము. ధీరుడవుగ నుండుము. హృదయపూర్తి, అమోఘనీతి, ఎంతకైనను తెగించు ధైర్యము కలిగి యుండుము. మతసిద్ధాంతములతో నీ బుఱ్ఱను కలవరపెట్టుకొనకు. పిఱికివారు మాత్రమే పాపము చేయుదురు. ధీరులు ఎన్నడును చేయరు. మానసికముగనైనను చేయరు. ఎట్టివానినైనను ప్రతివానిని ప్రేమింప ప్రయత్నింపుము. మానవుడుగ నుండుము. నీ సొంత పర్యవేక్షణలో నున్న రా—ను, కె—ను, ఐ—ను ధైర్యవంతులుగ నీతిమంతులుగ సానుభూతిసంపన్నులుగ రూపొందింప ప్రయత్నింపుము. నాబిడ్డలారా, నీతిపరతయు ధీరతయు తప్ప మీకు వేఱొక ధర్మము లేదు. పిఱికితనము లేకున్న, పాప ముండదు, నేర ముండదు, దుర్బలత యుండదు — తక్కిన వెల్ల తమంతట సిద్ధించును. ...నాటకశాలకుగాని దుర్బలతను కలిగించు వినోదములు సాగుచోటికిగాని రా—ను పోనీయకు, నీవును పిలుచుకొని పోకు.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

ప్రియ రా— కె— ఐ—,

నాబిడ్డలారా, పిఱికివారును దుర్బలులును మాత్రమే పాపములు చేయుదురు, అసత్యమును చెప్పుదురు అనుటను జ్ఞప్తి యుంచుకొనుడు. ధీరు లెల్లప్పుడును నీతిబద్ధులై యుందురు. నీతిమంతులరుగనుండ, ధీరులుగనుండ, సానుభూతికలవారుగ నుండ — ప్రయత్నింపుడు.

భవదీయుడు
వివేకానంద

## 75

(శ్రీ హరిపాదమిత్రకు)

మార్గావ్,
1893.

ప్రియహరిపాదునకు,

నీజాబొకటి ఇప్పుడే నాకు చేరినది. నే నిచ్చటికి క్షేమముగా చేరితిని. పంజిమును దాని సమీపమున నున్న మఱికొన్ని పల్లెలను దేవాలయములను దర్శింప నేగితిని. మరలి ఈదినమే వచ్చితిని. గోకర్ణము, మహాబలేశ్వరము మున్నగు క్షేత్రములకు నేను సంకల్పించియుండిన యాత్రను మానుకొనలేదు. రేపు ప్రొద్దున బండిలో ధార్వాడకు బయలుదేఱుచున్నాను. చేతికఱ్ఱను నాతో తెచ్చుకొన్నాను. డాక్టరు యర్గేకరు మిత్రుడు నన్ను చాల ఆదరించినాడు. శ్రీభట్‌గారికిని అక్కడనున్న ఇతరులకును నావందనములను దయతో అందజేయుము. భగవంతుడు నీకును నీధర్మపత్నికిని మంగళము లవారిగ నొసగుత. పంజిము నగరము మిక్కిలి శుద్ధముగను నీటుగను నున్నది. ఇచ్చట నున్న

క్రైస్తవులలో అత్యధికసంఖ్యాకులు చదువుకొన్నవారు. హిందువులలో అత్యధికసంఖ్యాకులు విద్యావిహీనులు.

భవదీయప్రేమపూర్ణ
సచ్చిదానంద

## 76

(మదరాసు శిష్యులకు)

జార్జిడబల్యూహేలుగారింట,
541 డియర్ బార్న్ అవెన్యూ, చికాగో,
జనవరి 24, 1894.

ప్రియమిత్రులారా,

మీజాబులు నాకు చేరినవి. నన్నుగూర్చి ఇన్ని వార్తలు మీ కందినందుకు నే నాశ్చర్యపడితిని. ఇంటీరియరుపత్రికలో నన్ను ఖండించుచు వ్రాసియున్న వాక్యములను మీరు పేర్కొంటిరి. అమెరికనుప్రజ లందఱివైఖరియు నట్టిదే అని తలంపగూడదు. ఆపత్రిక ఇచ్చట ఎవ్వరికిని తెలిసినది కాదు. మిక్కిలి అసహనముతోనుండిన పత్రికను ఇచ్చటివారు "ఊదా ముక్కు" (బ్లూనోస్) ప్రసిబిటేరియను పత్రిక అందురు. అట్టి కోవకు చేరినది ఆ పత్రిక. కాని "ఊదాముక్కు" లన్నియు మొరటుతనము కలవి కావు. అమెరికను ప్రజలును మతాచార్యవర్గములో పెక్కండ్రును న న్నెంతో ఆదరించుచున్నారు. ప్రజ లందఱును ఎవనిని భూషింతురో వానినే దూషించుటచే కొంత ప్రసిద్ధి గడింతమని ఆ పత్రికవారు ఆస పడిరి. ఆ జిత్తు ఇచ్చట ఎల్లరకును తెలిసినదే. అందుంగూర్చి వా రేమియు అనుకొనరు. మన భారతదేశమున నున్న (క్రైస్తవ)మతప్రచారకులు ఈవార్త నాధారపఱచుకొని లాభపడుటకు ప్రయత్నింపవచ్చు. ప్రయత్నింతురేని "చూడు, యూదుడా, న్యాయాధికారులు విధించిన శిక్ష నీపైని

బడినది'' అను వాక్యములు వారికి చెప్పుడు. వారి వెఱ్ఱిఅఱపులు ఉండు గాక. వారి ప్రాతకట్టడము పునాదులతో కదిలిపోయినది.' అది పడిపోక తప్పదు. ప్రాచ్యదేశీయమతములు ఇచ్చటికి చొచ్చుకొనుటచే భారతదేశమున కై్రస్తవమతప్రచారకుల కున్న మంచి జీవనాధారము ఖండిత మగు నేని, వారినిగూర్చి అయ్యో పాపము అనుకొందును. ఆ మతాచార్యవర్గప్రముఖులలో నొక్కరైనను నాకు ప్రతికూలురు లేరు. సరే. తటాకములో నేనున్నప్పుడు స్నానమును చక్కగా చేయవలెను.

ఒకపత్రికనుండి ఒకభాగమును మీకు పంపుచున్నాను. ఇచ్చటి సదస్సులలో నేను చదివిన హిందూమతసంక్షేపము అందు కలదు. నా ఉపన్యాసములు ప్రాయికముగ అప్పటికప్పుడు ఆశువుగ కావింపబడినవే. ఈదేశమునుండి కదలివచ్చుటకు ముందు నా ఉపన్యాసముల నన్నిటిని గ్రంథముగ రూపొందింప గోరుచున్నాను. భారతదేశమునుండి నాకెట్టి సాయమును అక్కఱ లేదు. కావలసినంత నాకిక్కడనే కలదు. మీయొద్ద నున్న పైకమును పెట్టి ఈ చిన్న ఉపన్యాసమును అచ్చు వేయింపుడు. ప్రకటింపుడు. దేశభాషలన్నిటిలోనికి అనువదింపజేయుడు. దేశమంతట వెదజల్లుడు. అది మనదేశసమష్టిచిత్తమును మనయెదుట నుంచును. కేంద్రకళాశాల నొకదానిని స్థాపించుటయు, అందుండి భారతదేశమున అన్నిదిక్కులకు వ్యాపించుటయు అనెడి మన ప్రణాళికను నీవు ఈమధ్యకాలమున విస్మరింపకుము. పాటుపడుము.

ఇక అమెరికనుమహిళలనుగూర్చి—వారిదయకు నాకృతజ్ఞతను మాటలలో చెప్ప జాలను. సర్వేశ్వరుడు వారిని అనుగ్రహించుగాక. ఈదేశమున మహిళలే ప్రతియుద్యమమునకును ప్రాణము. దేశసంస్కృతికంతటికిని వారే ప్రతినిధులు. ఏలయన తాము విద్య గడించుటకు మగవారికి తీఱిక లేకున్నది.

'కిడ్డీ' వ్రాసిన జాబులు అందినవి. వర్ణవ్యవస్థ కావలెనా పోవలెనా అను విషయముతో నా కెట్టి అక్కఱయు లేదు. భారత దేశములోనేమి వెలుపలనేమి మానవజాతి పెంపొందించుకొన్న ఉదాత్తాశయములను అత్యంతపతితులయు అత్యంతదరిద్రులయు గుమ్మములొద్దకు అందజేయవలయు ననియు, సొంతముగా వారిని ఆలోచించుకొననీయవలె ననియు, నా సంకల్పము. వర్ణవ్యవస్థ ఉండవలెనా ఉండకూడదా, పరిపూర్ణస్వాతంత్ర్యము మహిళల కుండవలెనా ఉండవలదా—అను విషయములతో నాకు పని లేదు. "అభివృద్ధికిగాని శ్రేయమునకుగాని ఏకైకసాధకము స్వాతంత్ర్యము, ఇచ్ఛాస్వాతంత్ర్యము, క్రియాస్వాతంత్ర్యము". స్వాతంత్ర్యము లేనిచో, మానవుడును, జాతియు, దేశమును అధఃపతనము నొందవలసినదే.

ఆలోచనలందును పనులందును మానవుని స్వాతంత్ర్యశక్తి ఒరులకు హానికరము కాకుండునంతవఱకును, ఆ శక్తిని — వర్ణము గాని, తదితరము గాని, మతము గాని, తదితరము గాని, మానవుడు గాని, వర్గము గాని, దేశము గాని, సంస్థ గాని, — నిరోధించునేని అది ఆసురము గావున పతన మొంది తీరవలెను.

నా జీవితాభిలాష యంతయు ఇది : ప్రతిమానవుని గుమ్మము నొద్దకు ఉదాత్తాశయములను అందజేయు సాధననివహామును పూన్పవలెను. మగవారిని మహిళలను తమ విధిని తామే నిర్ణయించుకొననీయవలయును. జీవితసమస్యలలో అత్యంత ముఖ్యములైనవానిని గూర్చి మన తండ్రితాతలును అన్యదేశీయులును ఏమే మభిప్రాయపడిరో వారిని తెలిసికొనినిందు. ముఖ్యముగ ఇప్పు డితరు లేమి చేయుచున్నారో చూచి వారిని తమ కర్తవ్యమును నిర్ణయించుకొనినిందు. రసాయనపదార్థములను కలుపుట మనపని. అవి ఘనీభవించుట ప్రకృతిసూత్రానుసారము నెఱవేఱును. పాటుపడుదు. ధీరులుగ నిల్చుదు. భగవంతునందు

విశ్వాసము కలిగియుండుడు. పనిని ప్రారంభింపుడు. త్వరలోనో మఱికొన్నాళ్లకో నేను వచ్చుచున్నాను. మీ ముందుంచుకొన వలసిన లక్ష్యము: "ధర్మహాని కాని రీతిలో ప్రజోద్ధరణము".

కుటీరమే మనదేశపు టాయువుపట్టని జ్ఞప్తియుంచుకొనుడు. కాని, అయ్యో! కుటీరవాసులకు ఎవ్వరును ఎప్పుడును ఎట్టి ఉపకారమును చేయలేదే. మన ఆధునికసంస్కర్తలు వితంతుపునర్వివాహనిర్వహణకార్యక్రమమందు మిక్కిలి వ్యగ్రులై యున్నారు. నేనును ప్రతిసంస్కారమందును సానుభూతి కలవాడనే. కాని దేశస్థితి ప్రజల (జీవిత) పరిస్థితిమీద ఆధారపడి యుండునే కాని వితంతువులకు లభించు భర్తలసంఖ్యపై ఆధారపడియుండదే. ప్రజలను మీ రుద్ధరింపగలరా? అంతరమైన ఆధ్యాత్మికశీలమును కోల్పోవనీయక, వారు పోగొట్టుకొన్న మానవత్వమును వారికి మరల నీయగలరా? సమత్వమందును స్వాతంత్ర్యమందును క్రియలందును శక్తియందును మీరు పాశ్చాత్యులందఱకంటె పాశ్చాత్యులరు కాగలరా? తోడ్తోడనే ఆధ్యాత్మికసంస్కృతిలోను పారమార్థికసహజావబోధములందును పరిపూర్ణహిందువులుగ వర్తింపగలరా? చేయవలసినది ఇది: మనము దానిని తప్పక చేయుదుము. చేయుటకే మీ రందఱును జన్మించియున్నారు. ఆత్మవిశ్వాసము కలిగి యుండుడు. మహావిశ్వాసములనుండియే మహాక్రియలు ఉద్భవించును. సదా ముందునకే సాగుడు. ప్రాణము పోయినను సరే, పేదలపట్లను పతితులపట్లను సానుభూతి కలిగియుండవలయును — ఇదే మన లక్ష్యము.

ధీరవత్సలారా, పురోగమింపుడు.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

మఱి మాట: ఈ జాబును ప్రకటింపకుడు. ఒక కేంద్రకళాశాలద్వారా ప్రజోద్ధరణాశయమును ప్రచారము చేయుట

లోను ఆ శలాశాలలో శిక్షితులైనవారిచేత మతధర్మముతోబాటు విద్యనుగూడ పేదలయిండ్లగుమ్మములొద్దకు అందజేయించుటలోను చెఱు పేమియు లేదు. అందతేకిని ఇందు అక్కఱ కల్గింప ప్రయత్నింపుదు.

కొన్ని పత్రికాభాగములను — శ్రేష్ఠవరిష్ఠపత్రికలభాగములను మీకు పంపుచున్నాను. అం దొకటి డాక్టరు థామసు వ్రాసినది. అమెరికనుమతాచార్యులలో ఆయన అగ్రగణ్యుడు, కాకున్న అగ్రగణ్యులలో నొకడు. కావున ఆయనరచన చాల విలువ గలది. ఇంటీరియరు పత్రిక అసహనదురభిమానములు కలదైనను, చెడ్డపేరునందు తృష్ణకలదైనను, ఆపత్రికయు అమెరికను ప్రజలప్రీతిని నేను చూఱగొంటి నని చెప్పక తప్ప లేదు. ఆపత్రిక నుండి కూడ కొన్నిబంతులను పంపుచున్నాను.

వి.

## 77

(శ్రీ హరిదాస్ విహారీదాస్‌దేశాయ్‌గారికి)

చికాగో,
జనవరి 29, 1894.

ప్రియదివాన్జీసాహేబుకు,

మీ కడపటి లేఖ కొన్నాళ్లక్రిందటనే అందినది. దీనులైయున్న మా అమ్మను తమ్ములను చూచుటకు మీరు పోయినందుకు సంతోషము. నాహృదయమున దుర్బలకోణ మొకటి యున్నది. దానినే మీరు తాకితిరి. దివాన్జీ. నేను పాషాణహృదయుడనగు పశువను కానని మీరు తెలిసికొనవలయును. లోకమందు నేను ప్రేమించు ప్రాణి ఎవ్వరైన నున్నచో, మా తల్లియే. కాని నా నమ్మకము మునుపును ఇప్పుడును కూడ నిది— నేను సన్న్యసింపకున్నచో ఏ గొప్పసందేశమును ప్రచారము

చేయుటకు మా మహాగురుదేవుడు అవతరించెనో, ఆ సందేశము వెలుగులోనికి రాదు. పైగా నిప్పుడు పోటెక్కిన విషయలోలతా నాత్మవాదముల కల్లోలములధాటికి దుర్గములవలె నిల్చిన ఆ యువకులకు నిలువ నీడ ఏదీ? భారతదేశమునకు, ముఖ్యముగా బంగాళమునకు వీ రెంతో మేలు చేసినారు. ఇంతకును ఇది ప్రారంభమే. కలకాలము విశ్వమంతయు తమ్ము ఆశీర్వదించు చుండగలట్టి పనులను వీరు, దేవునిసాయముతో, చేయనున్నారు. సాయపడువారు లేక, తమ్ము తలంచుకొననైన తలంచుకొనువారు లేక యుగయుగములుగ అధఃపతనము నొందుచున్న కోట్ల కొలది ప్రజలపట్ల నా ప్రేమయు, నేను సాక్షాత్కరించుకొన్న హిందూదేశపు భవిష్యన్మతమును, యావత్ప్రపంచపు భవిష్యన్మతమును, ఇవి ఒక వైపున్నవి. నా కత్యంతసన్నిహితులును అత్యంతప్రేమపాత్రులునగు వారిని దుఃఖముపాలు చేయుట ఒక వైపున్నది. ఇందు మొదటిదానిని నే నెన్నుకొనుచున్నాను. "క్షేమించిన దానిని దేవుడు నిర్వహించును". నేను నమ్మిన దేదేని యున్న అది — దేవుడు నాదండ నున్నా డనుటే. నాలో ఋజుత్వము ఉన్నంతవఱకు నన్ను ప్రతిఘటించు శక్తి దేనికిని లేదు. ఏలయన భగవంతుడు నాకు తోడగును. భారతదేశమున ఎంద ఱెందఱో నన్ను అర్థముచేసికొనలేకపోయినారు. పాపము! వా రెట్లు అర్థముచేసికోగలరు? వారి తలపులు తినుట, త్రాగుట అనెడి దినసరి కార్యక్రమమున కవ్వల కెప్పుడును దాటిపోవు. ఉదారహృదయులగు మీవంటివా రేకొలదిమంది మాత్రమో న న్నర్థము చేసికొందు రని నే నెఱుగుదును. ఉదారులైన మిమ్ము భగవంతు డనుగ్రహించును గాక. అర్థము కానిండు, కాక పోనిండు, ఈ యువకుల నొక సంస్థగా రూపొందించుటకే నేను జన్మించియున్నాను. వీరే కారు, ప్రతినగరములోను ఇంకను నూర్లకొలది యువకులు నాతో చేరుటకు సంసిద్ధులై యున్నారు. ఊరటను, నీతిపరతను, ఆస్తిక్యమును, విద్యను, అత్యంతపతితు

లును, అత్యంతదీనులునగు వారి గుమ్మములొద్ద కందజేయుటకై అవార్యతరంగములంబోనివారిని భారతదేశమంతటను పంపవలెనని నా కోరిక. నేను ఈపనినైన చేయుదును, ప్రాణమునైన విడుతును.

మన ప్రజల కది తెలియదు, దానిని వా రర్థముచేసికొనుటయు లేదు. అంతే కాదు, వేయేండ్లకాల మనుభవించిన బానిసతనమునకు సహజఫలితమైన ఉత్కటాసూయయు సంశయప్రవణతయు వారిని ప్రతినూతనాశయమునకును విరోధులనుగా చేసివైచినది. అయినను పరాత్పరుడగు భగవంతు డున్నాడు.

మీరు ప్రస్తావించిన హారతి మున్నగునవి, భారతదేశమున అన్నిభాగములలో గల ప్రతిమఠమునందును ఉన్న ఆచారములే. ఇక గురూపాసనమా, వేదవిహితములైన కర్తవ్యములలో ప్రప్రథమము. అందును గుణదోషము లున్నవి. ఐనను మన దొక అద్వితీయసమాజ మనియు, తన మత మవలంబింపు డని ఒరులను నిర్బంధించు నధికారము మనలో నెవ్వనికిని లే దనియు మీరు జ్ఞప్తియుంచుకొనవలెను. మనలో నెక్కండ్రకు ఏరూపమైన విగ్రహారాధనమందును విశ్వాసము లేకున్నను, ఇతరులు విగ్రహముల నారాధించునప్పుడు 'కాదు' 'కూడ' దనుటకు మనకు హక్కు లేదు. అట్లంటి మేని మనమతప్రథమసూత్రమునకే భంగము గల్గును. అదియునుగాక దేవుని మానవునందే మానవుని గుండనే ఎఱుగ నగును. కాంతిస్పందనములు సర్వత్ర, కటిక చీకటికోణములందుసైత మున్నను దీపమునందుమాత్రమే అది మానవుని కంటి కగపడును. అట్లే భగవంతుడు విశ్వవ్యాప్తుడుగ నున్నప్పటికిని మన భావన కాయన ఒకమహాపురుషరూపమున మాత్రమే అందుబా టగును. దయార్ద్రపూర్ణుడైన స్థితికర్త సహాయుడు, సంరక్షకుడు — అనెడి దేవునిగూర్చిన యాశయము లన్నియు మానవత్వప్రయుక్తాశయములే, దేవునకు మానవుని

రూపుదాల్పునాశయములే. వీని కాశ్రయుడుగ నొకమానవు డుండ వలెను, అతనిని గురు వనుడు, ప్రవక్త యనుడు, అవతార పురుషు డనుడు. నీవు నీదేహమునుండి వెలి కుఱుకలేనట్లే మానవుడు తనప్రకృతిని అతిక్రమింపలేడు. చరిత్రలో వచ్చు ప్రవక్తలందఱికంటె నూఱంత లెక్కువ పవిత్రుడగు తమగురువును కొందఱారాధింతురేని, అందేమి సేగి యున్నది? క్రైస్తునుగాని, కృష్ణునిగాని, బుద్ధునిగాని ఆరాధించుట హానికరము గానప్పుడు, పనులందుగాని తలంపులందుగాని అపవిత్రత ఎప్పుడును లేనట్టియు సాక్షికదృష్టికల తక్కినప్రవక్తలందఱికంటె సహజావబోధముచే అత్యధికతరమైన ప్రతిభగలట్టియు ఈయనను ఆరాధించుటవలన ఎట్టి హానియేని ఏల కలుగవలయును? మతములో సత్యమున్న దనుటే గాక ప్రతిమతమును సత్యమే అనెడి ఆశయమును మొట్ట మొదట ప్రపంచములోనికి తెచ్చినవా డీయనయే. తత్త్వశాస్త్ర విజ్ఞానశాస్త్రములసాయము లేకయే వేఱెద్దానిలోడ్పాటును లేకయే ఈ ఆశయము విశ్వమంతటను నాటుకొనుచున్నది.

ఇదియు తప్పనిసరి కాదు. మా సోదరులలో ఎవరుగాని తనగురువునే మీ రారాధింపవలె నని చెప్పియుండలేదు. లేనే లేదు, ఎంతమాత్రమును లేదు. కాని ఒక డట్లు ఆరాధించునేని అతని నడ్డగించుటకును ఎవరికిని అధికారము లేదు. ఏల? ఏల యనగా అట్లు చేయుట ఈసంఘమునే రూపుమాపును. లోకమున కననైన అనన్యాదృశమైన సంఘ మిది. పదితలంపులవారు పది ఆశయాలవారు పదిమంది పరిపూర్ణసామరస్యముతో ఇందు కలిసియున్నారు. దివాన్జీ, భగవంతుడు కరుణాపూర్ణుడు, మహి మాంచితుడు, వేచియుండుడు, ఇంతకన్న అతిశయములను మీరు చూతురు.

ప్రతిమతమునెడను మేము సహనము కల్గియుండుట మాత్రమే కాదు, ప్రతిమతమును మాకు సమ్మతమే. దేవుని

తోడ్పాటుతో ఈసందేశమును విశ్వమంతట ప్రచార మొనర్చుటకే ఈ నా ప్రయత్నము.

ఏదేశమునకుగాని ఏమానవునకుగాని గొప్పతనము కలుగవలె ననిన అందుకు మూడు విషయములు అపేక్షితములు. (1) సౌజన్యశక్తులందు దృఢవిశ్వాసము, (2) ఈర్ష్యానుమానములు లేకుండుట, (3) మంచి చేయవలె ననియు మంచిగ నుండ మనియు ప్రయత్నించువారి కెల్ల తోడ్పడుట.

మహాద్భుతప్రతిభాదిసంపన్నమగు హిందూదేశము కుక్క-చింపిన విస్తరి యగుటకు కారణ మేమి? ఈ ప్రశ్నకు నా జవాబు. "అసూయ"! ఒకరిని చూచి యొకరు ఇంత అసూయపడువారును ఇంత కడుపుమంట చెందువారును దౌర్భాగ్యదుష్టమగు హిందూజాతియందున్నంతగా వేఱెచ్చటను లేరు. ఎపుడైనను మీరు వెలువడి పాశ్చాత్యదేశములకు వత్తురేని, ఇచ్చట మీరు గుర్తించు వానిలో ప్రప్రథమము ఇచ్చటి ప్రజల ఈర్ష్యారాహిత్యమే. భారతదేశమున ముగ్గురు మనుష్యులు ఐదునిమిషములసేపు కలిసి పని చేయ లేరు. అధికారమునకై ప్రతివాదును పోరాడును. తుట్టతుదకు సంస్థ అంతయు ధ్వంస మగును. ఈశా, పరమేశా, నిరసూయులముగ నుండుటను మే మెప్పుడు నేర్చుకొందుము! అట్టిదేశములో, ముఖ్యముగా బంగాళములో భేదములున్నప్పటికిని అమరమైన ప్రేమబంధముచే నొక్కటిగ కూర్పబడిన యొక సంఘమును సృజించుట ఆశ్చర్యకరము కదా. ఈ సంఘ మింకను వర్ధిల్లును. నిత్యశక్తి — పురోగమనములతో మిళితమైన ఈ అద్భుతౌదార్యాశయము హిందూదేశమంతటను వ్యాపింప వలెను. దేశమునంతటిని అది తేజఃప్రసర్పితముగ చేయవలెను. ఈ బానిస దేశమునకు పరంపరాప్రాప్తముగ సంక్రమించిన ఉత్కటాజ్ఞాన-ద్వేష-వర్ణాహంకార మహా ధ్యాసూయలు ఉన్నప్పటికిని ఆ యౌదార్యము సంఘపు ప్రతిరోమకూపమునను చొచ్చుకొన వలెను.

విశ్వవ్యాప్తమైన చలనరహితగా యనెడి కడలినీటిలో కొండలవలె నిల్చి యుండు నుదాత్తప్రకృతులగు కొందఱిలో మీరొకరు.

సదాభవదీయవిశ్వాసపూర్ణ
వివేకానంద

## 78

(శ్రీ సింగారవేలుమొదలియారుగారికి)

541 డియర్బారన్ అవెన్యూ,
చికాగో,
మార్చి 3, 1894.

ప్రియ 'కిడి',

... విశ్వాసము అద్భుతమగు నంతరవలోకనమును అద్వితీయతరణోపాయము నను నంతవఱకు నీతో నే నేకీభవింతును; కాని యది పురోవృద్ధి నరికట్టు స్వమతదురభినివేశమును గలుగజేయవచ్చును—అందలి ప్రమాదమది. జ్ఞానము మంచిదే, కాని యది శుష్క-వేదాంతముగా బరిణమింపవచ్చును—ఇది యిందలి ప్రమాదము. భక్తి దొడ్డదియే, ఉదాత్తమైనదియే, కాని యది నిరర్థకభావపరత్వమై నశింపవచ్చును. వలయునది వీనియన్నిటి సామరస్యము. రామకృష్ణు డిట్టి సమరసమూర్తి. ఇట్టి మహనీయులు చాల అరుదు; కాని యీ మహనీయు నాదర్శముగా గొని — ఈతని యుపదేశములను ఆదర్శముగాగొని — మనము ముందునకేగవచ్చును. మనలో ప్రతివ్యక్తియు నాతని పరిపూర్ణతను బొందజాలకపోయినను, అన్యోన్యలోపపరిహారమూలమున, అన్యోన్యవ్యత్యాయసమీకరణమూలమున, అన్యోన్యాశయపూరణమూలమున, సరుదుపాటుమూలమున నట్టి పరిపూర్ణతను సాధింప

వచ్చునుగదా. ఇది పలువుర యేకీభావముచేగలుగు సామరస్యము. ఇతరమతసంప్రదాయములనన్నిటి నతిక్రమించినట్టిది.

మతధర్మము అమోఘముగనుండవలయుననిన, నుత్సాహము ఆవశ్యకము. దీనికితోడు శాఖాసంప్రదాయములు పెచ్చుపెరిగిపోవు చిక్కు కలుగకుండ జూచుకొనవలయును. పాత్త్రికదృష్టి లేని సంప్రదాయము నవలంబించితిమేని మన కీ ప్రమాదము తొలగును, అందు ప్రత్యేక సంప్రదాయములందలి లాభము లన్నిటితోబాటు విశ్వమతవైశాల్యము నుండును.

భగవంతుడు సర్వాంతర్యామియైయున్నను మానవరూపమునను మానవశీలమునను మాత్రమే మనకు గ్రాహ్యుడు కాగలడు. రామకృష్ణునంతటి పరిపూర్ణుడైనవ్యక్తి మున్నెన్నడును లేడు—ఆతని శీలవ్యక్తిత్వములనే మనము ఆశ్రయింపవలెను; మఱియు ప్రతివ్యక్తియు దన దృక్పథము ననుసరించి యాతని భగవంతునిగనో, రక్షకునిగనో, ఆచార్యునిగనో, ఆదర్శమూర్తిగనో, మహాపురుషునిగనో పరిగణింప మనము అంగీకరింపవలయును.

సాంఘికసమత్వమునుగాని, యసమత్వమునుగాని బోధింపక, ప్రతివ్యక్తికిని సమానపుహక్కులు గలవని, సర్వవిధములను భావస్వాతంత్ర్యమును క్రియాస్వాతంత్రమును ఆవశ్యకమని, మనము చాటుదము.

ఆస్తికులను నాస్తికులను, విశిష్టాద్వైతులను అద్వైతులను, అజ్ఞేయవాదులను (అగ్నాస్టిక్స్)—ఎవ్వరినైనను మనము నిరాకరింపము; శిష్యుడగుటకు వలయునది యొక్కటేనియమము—మహోదారము, మహాగంభీరము నగు శీలము నలవఱుచుకొనుటయే.

ప్రవర్తనమునుగూర్చికాని, శీలమునుగూర్చికాని, అన్నపానీయములనుగూర్చికాని—అవి యితరులకు బాధకలిగింపకుండ

నంతవఱకు—మనము ఏవిధమైన ప్రత్యేకనియమమును విధింప బోము.

పురోవృద్ధి నరికట్టునట్టిదో, పతనమునకు తోడ్పడునట్టిదో, ఏదియైనను పాపమే; ఉద్ధరించునదియు సమన్వయము నొందించు నదియు నేదియైనను బుణ్యమే.

తన కేది యనుకూలించునో, తోడ్పడునో దానిని గుర్తించి ఎన్నుకొని యనుసరించుటకు ప్రతివ్యక్తికిని స్వాతంత్ర్యమును మనము ఒసంగుదుము. ఉదాహరణమునకు — మాంసాహారము ఒకనికిని ఫలాహారము మఱియొకనికిని దోడ్పడవచ్చును. ప్రతి వ్యక్తియు యథేష్టముగా తన ప్రత్యేకాభిరుచిని అనుసరింపవచ్చు; ఇతరుల ప్రవర్తనమును—దానిని దాము అవలంబించిన దమకది హానికరమగునను కారణమున—నిరసించుటకుగాని, వారు తమ మార్గము నవలంబింప నిర్బంధించుటకుగాని యెవ్వరికిని హక్కు లేదు. ఈ పురోగమనమున గొందఱకు భార్యయున్నచో సాయ పడవచ్చును, గొందఱకామె కేవలము బాధకురాలు గావచ్చును. కాని వివాహితుడగువాని మార్గము తప్పు అనుటకు నవివాహితు డగు సాధకునకు అధికారములేదు. తనయాదర్శమునే తనసోదరు డును అవలంబింపవలయునని నిర్బంధించుట కధికారము అసలే లేదు.

ప్రతిజీవుడును దేవుడనియే మన నమ్మకము. జీవుడు అజ్ఞానమేఘములచే నావరింపబడిన జ్ఞానభాస్కరుడు; ఈమేఘముల సాంద్రతయందుగల వ్యత్యాసమే ఒకజీవికిని మఱియొకజీవికిని గల వ్యత్యాసమునకు కారణము. తెలిసినను దెలియకున్నను సర్వమత ధర్మములకును ఇదియే మూలాధారమనియు నైహికముగాగాని, యాముష్మికముగాగాని, వైజ్ఞానికముగాగాని మానవాభ్యుదయ చరిత్రమున కంతకును నిదియే వ్యాఖ్యానమనియు మన నమ్మకము— ఒక్క ఆత్మతత్త్వమే వివిధావస్థలయందు వ్యక్తమగుచున్నది.

ఇదియే వేదసారమని మన నమ్మకము.

ఇతరజీవుల నిట్లు, అనగా వారు భగవత్స్వరూపులని గుణించుటయు వారియెడ తదనుగుణముగా వర్తించుటయు ప్రతిజీవికిని కర్తవ్యమని మన నమ్మకము; ఇతరజీవులను ద్వేషించుటయు నిరసించుటయు, ఏ రూపమునను, ఏ విధమునను హింసింప దలపడుటయు తగదని మన నమ్మకము. ఇది సన్న్యాసులకు మాత్రమే కాదు, సమస్త స్త్రీ పురుషులకును ధర్మము.

ఆత్మయందు జాతిభేదము లేదు, లింగభేదము లేదు, ఏ విధమైన కళంకమును లేదు.

వేదములలోగాని, దర్శనములలోగాని, పురాణములలోగాని, తంత్రములలోగాని, యెచ్చటను ఆత్మయందు జాతి మత లింగభేదములున్నట్లు తెలుపబడలేదని మన నమ్మకము. కావున "మతతత్త్వములకు సంఘసంస్కారముల జోలి యేల?" యను వారితో మనము ఏకీభవింతుము. సాంఘికసూత్రములను విధించి వ్యక్తులనడుమ భేదమును పాటింపవలయుననుట మతతత్త్వములకు దగదని వారికి మనము తెలుపునపుడు వారును మనతో నేకీభవింపవలయును. ఇట్టి సమస్తభ్రమలను కార్యములను నిర్మూలించుటయేగదా మతతత్త్వముల గమ్యము!

కాని యీ భేదముల మూలముననే పరమసామ్యమును పరమైక్యమును సాధింపగలమని వారు వాదించుచో, 'బురదచే బురద యెన్నటికిని క్షాళితముకాదని మతధర్మము తెలుగెత్తి ఘోషించుచున్న'వని వారికి మన సమాధానము.

చెడుగుచే మానవునకు మంచి కలుగును కాబోలును!

మతధర్మముల సమ్మతి నార్థికపరిస్థితుల ననుసరించి సాంఘికనియమము లేర్పడియున్నవి. సాంఘికవిషయములలో జోక్యము గలుగజేసికొనుటయే మతముచేసిన గొప్పతప్పు. కాని,

''సంఘసంస్కరణములతో మతతత్త్వములకు సంబంధములేదు'' అని పలుకుచునే మతము ఎట్లు మరల వంచించునో! మతమునకు సంఘసంస్కారకర్తృత్వముండదగదనియే మన మతము. సాంఘిక శాసనకర్తృత్వమునకు మతమునకు అధికారము లేదనుటనే నొక్కి చెప్పుదును. జోక్యము విడిచిపెట్టుడు, మీ పరిమితులలో మీరున్నచో, మిగిలినదంతయు జక్కబడును.

1. పరిపూర్ణత మానవునియం దుండనే యున్నది, దాని నావిష్కరించుటే విద్య.

2. దివ్యత్వము మానవునియం దుండనే యున్నది, దాని నావిష్కరించుటే ధర్మము.

కావున నాటంకములను దొలగించుటయే యీ రెండింటి యందును (అనగా విద్యావిషయమునను బరమార్థవిషయమునను) ఆచార్యుని విధి. నే నెప్పుడును జెప్పెడిరీతిని మనము లేనిపోని జోక్యము కల్పించుకొననిచో సమస్తము చక్కబడును. మార్గము నుండి యాటంకములను దొలగించుటయే మనవిధి. మిగిలిన దంతయు భగవంతుడే యొనరించును.

కావున మీరు ముఖ్యముగా మనసులో నుంచుకొనవలసిన విషయమిది: ఆత్మతోడనే మతతత్త్వములకు గల సంబంధము; సాంఘికవిషయములలో జోక్యము గలుగజేసికొనుటకు వానికి ప్రసక్తి లేదు: ఇంతవఱకు జరిగిన దుండగమెల్ల ఇదే. ఒకనిసొత్తు బలాత్కారముగా నపహరించి, యాతడు తిరిగి దానిని రాబట్టుకొన యత్నించుచో, మురుక్కుచు, మూలుగుచు, స్వత్వాధికార పవిత్రతనుగూర్చి ధర్మసూక్తులను సాయించినట్లున్నదీ కథ!

తమ కేమి హక్కుగలదని—కోట్లకొలది జనుల జీవితము దుఃఖభాజనముచేయుచు—ప్రతి సాంఘికవిషయమునను మతాచార్యులు జోక్యమును గలుగజేసికొనినారు?

క్షత్రియులు మాంసాహారులని నీ వేమో అధిక్షేపించి నావే! మాంసమో, గింసమో — హిందూమతమందలి యుదాత్తాశయముల కన్నింటికిని, మనోహరాశయములకన్నింటికిని వారే మూలపురుషులు! ఉపనిషత్తులు రచించినదెవరు? రాముడెవరు? కృష్ణుడెవరు? బుద్ధుడెవరు? జైనతీర్థంకరు లెవరు? క్షత్రియుడు ధర్మముపదేశించినప్పుడెల్ల నతడు దానిని ఎల్లరసామ్మ్ముగ చేసి వేయును. బ్రాహ్మణుడు ఏమివ్రాసిపెట్టినను అందు కితరులకు అధికారములేదు పొమ్మనును. గీతను వ్యాససూత్రములను జదువుము, లేనిచో నెవరిచేనైనను వానిని జదివించుకొనుము. గీతలో సమస్త స్త్రీ పురుషులకును సర్వవర్ణములకును మోక్షమార్గము తెలిచివేయబడినది, కాని వ్యాసుడు శూద్రులను వంచింప వేదములకు లేనిపోని యర్థములు గల్పింపజూచును. ఒక మాంసపు ముక్క మూలమున భగవంతుని కరుణారసమింకిపోవుననుటకు భగవంతుడు మీవలె భయగ్రస్తుడగు మూర్ఖుడాయేమి? అగుచో నట్టి భగవంతుడు కాసుచేయలేడు.

నామీద నేమియు నాశపెట్టుకొనకు, కాని నీకు నేను వ్రాసియున్నటుల, నీతో జెప్పియున్నటుల, భారతదేశము ఎన్నటికైనను భారతీయులచేతనే యుద్ధరింపబడవలయును. కావున మాతృదేశీయయువకులారా, మీలో వందలకొలదిమంది యీ నూతనాశయమునుగూర్చి యించుమించుగా వీరావేశపరులు కాగలరా? ఆలోచించి సామగ్రిని సంపాదించి, రామకృష్ణుని జీవితమును వ్రాయుడు. అం దద్భుతలీలల ప్రస్తావమును జాగ్రత్తతో మానుడు. ఆయన సిద్ధాంతములకు నిదర్శనముగా నుండునట్లు జీవితచరిత్ర వ్రాయబడవలయును. ఆతని చరిత్ర మాత్రమే వ్రాయవలెను — నన్నుగాని, సజీవులగు మఱెవ్వరిని గాని యందు జొనుపకుడు. లోకమున కాత డేమి బోధించెనో, అందులకు నిదర్శనమగు నాతని చరిత్ర మెట్టిదో — తెలుపుటయే

మీ ముఖ్యాశయమై యుండవలయును. అనర్హుడనైనను నా యధీనమందుపెట్టబడిన రత్నపేటికను వెలికిగొనివచ్చి దానిని మీకు అందచేయుటయే నా కాత డొసగిన యాజ్ఞ. మీ కెందుకో తెలియునా? ఐహికవిషయలాలసులగు వంచకులు, ఈర్ష్యాళువులు, బానిసలు, పిఱికిపందలు ఎన్నడును ఏమియు జేయజాలరు కావున, బానిసజాతికి స్వతస్సిద్ధమగు నసూయ మన జాతిశీలమందలి విషము. ...వీరి యీయసూయచేతనే, సర్వశక్తిసంపన్నుడగు సాక్షాత్పరమేశ్వరుడు కూడ ఏమియు జేయజాలడు.

తన కర్తవ్యమును నెఱవేర్చి యిపుడు గతించిన వానిగా నన్నుగూర్చి భావింపుడు. కార్యభారమంతయు మీభుజముల మీదనే యున్నదని భావింపుడు...యువకులారా, భారతమాతృపుత్రులారా, ఈ కార్యమును నిర్వహింప విధినిమంత్రితులమని భావింపుడు. మీరే యీమహోద్యమమునకు బూనుకొనుడు. భగవంతుడు మిమ్ము ననుగ్రహించుగాక! నన్ను విడిచిపెట్టుడు. నన్ను లక్షింపకుడు. నూతనాదర్శమును, నూతనసిద్ధాంతమును, నూతనజీవనవిధానమును జనులకు బోధింపుడు. ఏ వ్యక్తిని నిరసింపకుడు, ఏ యాచారమును నిందింపకుడు, వర్ణ వ్యవస్థను గూర్చికాని ఏ సంఘదోషమును గూర్చికాని ననుకూలముగాగాని ప్రతికూలముగాగాని బోధింపకుడు: "స్వేచ్ఛనొసగుడు" అని మాత్రమే బోధింపుడు. అంతయు స్వయముగనే చక్కబడును.

ధీరులారా, సుస్థిరులారా, వత్సలారా, మీకందఱకును నా యాశీర్వచనములు.

మీ

వివేకానంద

# 79

(హేలు సోదరులకు)

డిట్రాయిట్,
మార్చి 12, 1894.

ప్రియసోదరీమణులకు,

నేను ప్రస్తుతము శ్రీపామరుగారితో నున్నాను. ఆయన చాల మంచివాడు. మొన్న రాత్రి కొందఱు ప్రాతమిత్రులకు ఆయన విందు చేసినాడు. వారిలో ఒక్కొక్కరును, అఱువదియేండ్లుదాటిన వయస్సువారే. ఆసంఘమునకు ఆయన "ఓల్డుబాయిసక్లబ్బు" (ప్రౌఢబాలకపరిషత్తు) అని పేరుపెట్టియున్నాడు. సంగీత నాటక శాలలో నేను రెండున్నరగంటలసేపుపన్యసించితిని. శ్రోతలు ఎంతయు ప్రీతులైరి. నేను బోస్టనుకును, న్యూయార్కుకును పోవుచున్నాను. అచ్చటి నాఖర్చులకు చాలినంత పైకము నాకిచ్చుట లభించును. ఫ్లాగ్‌గారి విలాసమును ప్రొఫెసరు రైటుగారి విలాసమును — ఈరెంటిని నేను మఱచిపోయితిని. మిచిగనులో నేను ఉపన్యసింపబోను. మిచిగనులో నుపన్యసింపుమని శ్రీహాల్డను గారు నన్ను ప్రోత్సహింప నేటిప్రొద్దున ప్రయత్నించిరి. కాని బోస్టనును న్యూయార్కును కొంతచూచితీరవలెనని దృఢనిశ్చయుడనై యున్నాను. మీకు నిజము చెప్పుచున్నాను. వక్తృత్వములో నాకౌశలమును ఖ్యాతియు పెరుగుకొలది నాకు విసుగెత్తుచున్నది. కట్టకడపట నేను కావించిన ఉపన్యాసము నా ఉపన్యాసములన్నింటిలో వరిష్ఠమైనది. శ్రీపామరుగారికి ఆనందోద్రేకము కలిగినది. శ్రోతలు ఇంచుమించు మంత్రముగ్ధులుగ నుండిరి. కావున ఉపన్యాసము ముగిసినపిమ్మటనే ఇంత సుదీర్ఘకాలము ఉపన్యాసము చెల్లిన సంగతి నేను గుర్తించితిని. శ్రోతలలో పరాకుగాని వ్యాకులము గాని కననైనచో అది వక్తకు తగులును. నాకు విసుగెత్తిపోవుచున్నది. అట్టి అనర్థములనుండి భగవంతుడు

నన్ను కాపాడును గాక! ఈశ్వరు డనుకూలించునేని బోస్టను లోనో న్యూయార్కులోనో నేను విశ్రమించెదను. మీకందఱికిని నాప్రేమ. మీరు సదా సుఖులై యుందురు గాక!

భవదీయప్రియసోదరుడు
వివేకానంద

## 80

(హేలు సోదరులకు)

డిట్రాయిట్,
మార్చి 15, 1894.

ప్రియవత్సలారా,

వృద్ధుడైన పామరుతో నాకు కాలము చక్కగానే గడిచి పోవుచున్నది. ఆయన చాల ఉత్సాహశీలుడు, మంచివాడు. కడపటి ఉపన్యాసమునకు నాకు 127 డాలర్లే లభించినవి. డిట్రాయిట్‌లో సోమవారమునాడు నేను మరల నుపన్యసింపబోవు చున్నాను. లిన్నులో నొకానొక మహిళకు జాబువ్రాయు మని మీ అమ్మ నన్ను కోరినది. ఆమెను నే నెన్నడును చూచియుండ లేదు. పరిచయము బొత్తిగా లేనప్పుడు జాబు వ్రాయుట మర్యాద యగునా? ఆమెను గుఱించి మఱి కొన్ని వివరములను దయచేసి నాకు తెల్పుదురు గాక. లిన్ను ఎచ్చట నున్నది? ఇచ్చటి పత్రికలలో నన్ను గుఱించి తెల్పబడిన వార్తలలో అన్నిటికంటె ఎక్కువ హాస్యకరమైనది ఇది: "హైందవఝంఝా మారుతుడు వచ్చియున్నాడు. పామరుగారింట అతిథిగనున్నాడు. పామరు హిందువుగ మాఱిపోయినాడు, భారతదేశమునకు పోవు చున్నాడు. రెండుసంస్కారములు తప్పక చేయవలె నని అతడు నొక్కి చెప్పుచున్నాడు. పామరుగారి లాగ్రాంజు క్షేత్రములో ఉద్భవించిన గుఱ్ఱములు జగన్నాథస్వామిరథమును లాగవలె

ననుట మొదటిది. హిందువు లారాధించు పవిత్రగోగణములో జర్సీ గోవును చేర్పవలె ననుట రెండవది". ఆగుఱ్ఱములన్నను జెర్సీగోవులన్నను పామరుగారికి ఉత్కటమైన ప్రేమ. అతని లాగ్లాసు క్షేత్రములో అవియు ఇవియు అత్యంతసమృద్ధిగ నున్నవి.

మొదటి ఉపన్యాసమునకు ఏర్పాట్లు సరిగా జరుగలేదు. హాలునకు అద్దెయే 150 డాలర్లగుటే అందుకు కారణము. నేను హార్ట్ఫర్డును వదలుకొంటిని. ఇచ్చట మఱియొకడు ముందుకు వచ్చినాడు. అత డింతకన్న మేలుగా నిర్వహించునేమో చూతము. పామరు నన్ను దినమంతయు నవ్వించుచుండును. రేపు మఱొక విందు జరుగ నున్నది. ఇంతవఱకు అంతయును బాగుగనే యున్నది. కాని ఇచ్చటికి వచ్చినప్పటినుండి నా హృదయము మిక్కిలి విషణ్ణమై యున్నది. కారణ మేమో నే నెఱుగను.

ఉపన్యసించుట మున్నగు సర్వానర్థములవలన నాకు విసుగు పుట్టుచున్నది. నూర్లకొలది రకముల మనుష్యమృగములతోడి ఈ కలయిక నన్ను కలవరపఱచినది. నా అభిరుచిని చెప్పెదను: నేను వ్రాయలేను, మాటాడలేను. గంభీరముగ ఆలోచింపగలను. ఉద్రిక్తుడనైనప్పుడు భావవిస్ఫులింగములను వెలిగ్రక్కగలను. కాని శ్రోతలు అల్పసంఖ్యాకులుగ నుండవలెను. ఏర్చి ఎన్నుకొన్నవారుగ నుండవలెను. అట్లు విన్నవారికి నచ్చినచో వారు నా ఆశయములను కొనిపోయి విశ్వమంతట వెదజల్లుదురు. వెదజల్లుట నా పని కాదు. పనులకు ఇది కేవలము న్యాయ్యమైన విభాగము. ఆలోచించుట భావములను వెదజల్లుట—ఈ రెండు పనులలోను ఒక్కవ్యక్తియే నెగ్గి యుండ లేదు. ఆలోచించుటకు ముఖ్యముగ ఆధ్యాత్మికముగ ఆలోచించుటకు మానవునకు స్వేచ్ఛ యుండ వలెను.

ఈ స్వాతంత్ర్యప్రతిపాదనము, 'మానవుడు కేవల మొక యంత్రము కా'డను నిరూపణము సమస్తమతతత్త్వముల సారము. కావున దీనినిగూర్చి నియతక్రమములో ఆలోచించుట అసాధ్యము. ప్రతిదానిని యంత్రస్థాయికి దించు ప్రవణత పాశ్చాత్యులకు కలదు. అదే వారికి మహాద్భుతసంపన్నదశను కలిగించినది. పాశ్చాత్య దేశములనుండి, ఆధ్యాత్మికధర్మమును పూర్తిగ తఱిమివేసిన దిదే. ఏకొంతైనను శేషించియున్నచో అది వట్టి కవాతులోనికి దిగినది.

నిజమునకు నేను ఝంఝామారుతమను కాను. ఎంత మాత్రమును కాను. నాకు కావలసినది ఇచ్చట లేదు. ఇచ్చటి "తుపాను" వాతావరణమును నే నిక ఓర్చుకొనలేను. పూర్ణ సిద్ధి కిది మార్గము; పరిపూర్ణత నొంద పాటుపడవలెను. కొందఱు మహిళలను మగవారిని పరిపూర్ణత నొందింప పాటుపడవలెను. పందులయెదుట ముత్యములను చల్లరాదు. కాలమును ఆరోగ్య మును బలమును నాశ మొనర్చుకొనరాదు. ఆధ్యాత్మిక సింహ ములను కొందఱిని రూపొందింప వలెను. నా సంకల్పించిన జగద్ధితాచరణ మిదే.

ప్లాగ్‌నుండి ఒక జాబు నాకిప్పుడే అందినది. ఉపన్యాస కార్యక్రమమున నాకు తోడ్పడు సామర్థ్య మతనికి లేదు. అతడు నన్ను ముందు బోస్టనుకు పొమ్మనుచున్నాడు. సరి, లక్ష్యపెట్టి ఇక ఉపన్యాసములు చేయబోను. శ్రోతలవెఱ్ఱుల కనుగుణముగ నన్ను దిద్దుకొనుచు ఉపన్యసింప యత్నించుట చాల విసుగు కలిగించుచున్నది. ఐనను ఈ దేశమునుండి బయటికి పోవుటకు ముందు ఒకటిరెండు దినములు చికాగోలో నుండుటకు మరల నచటికి వత్తును. దేవుడు మి మ్మెల్లర ననుగ్రహించుగాక!

సదా కృతజ్ఞుడగు మీ సోదరుడు
వివేకానంద

## 81

(చికాగోలోనున్న కుమారి హారీట్ మెకెన్లీకి)

డిట్రాయిట్,
మార్చి 17, 1894.

ప్రియసోదరికి,

నీవు పంపిన పార్సిలు నిన్న చేరినది. ఆ మేజోళ్లు నీవు పంపినందుకు చింతిలుచున్నాను. అవి ఇక్కడ నాకు దొరకునవే. వానిని నీవు పంపుట నీప్రేమను సూచించుచున్నది. తుదకు నా సంచి, మితిమీరి క్రుక్కిన కూరవలె పెరిగిపోయినది. నాతో దాని నెట్లు మోసికొనిపోవుటో తెలియదు.

ఈదినము నేను శ్రీమతి బాగ్లీసతిభవనమునకు మరలి వచ్చితిని. ఏలయన ఇంతదీర్ఘకాలము నేను పామరుగారితో నున్నందుకు ఆమె బాధపడుచుండెను. పామరుగారింట నిజముగ సత్కాలక్షేపమే జరిగినది. ఆయన నిజముగ వినోదప్రియుడు. హృదయశాలి. సత్కాలక్షేపమందును, వేడివిస్కీయందును రవంత మితిమీఱిన ప్రీతి గలవాడు. కాని ఆయన ఆమూలాగ్రము అమాయికుడు, సరళస్వభావమందు శిశువువంటివాడు.

ఆయన యింటినుండి నేను వచ్చివేసినందుకు చాల దుఃఖపడినాడు. కాని అందుండి రాక నాకు తప్ప లేదు. ఇచట నొక చక్కని బాలిక కలదు. నేనామెను రెండుసార్లు చూచితిని. ఆమెపేరు నాకు జ్ఞప్తి లేదు. చాల బుద్ధిమతి, చాల రూపవతి, చాల పారమార్థికపరతకలది, చాల ఐహికవిరక్తిగలది, భగవంతుడామె ననుగ్రహించును గాక! శ్రీమతి మాక్డూవెల్ సతితోగూడి ఆమె నేటి ప్రొద్దున వచ్చినది. చాలచక్కగ గంభీరముగ ఆధ్యాత్మికపరముగ మాటాడినది. నేను పూర్తిగ ఆశ్చర్యవివశుడనైతిని. యోగులను గూర్చి ఆమె కన్ని విషయములును తెలియును. సాధనలో స్వయముగ ఎంతో పురోగమించినది.

"నీదారులు 'దేవా' అన్వేషకులకు అందవు". ఆమె అంత అమాయికురాలు, విశుద్ధురాలు, పావనురాలు, భగవంతు డామె ననుగ్రహించు గాక! అత్యంతశ్రమభరితము దుఃఖపూర్ణము నగు నాజీవితమున వరిష్ఠలాభ మిదే; అప్పు డప్పుడు మీవంటి పవిత్రా నందపూర్ణవదనులను దర్శింపగాంచుట. బౌద్ధుల గొప్ప ప్రార్థన ఇది: "భువి గల సాధువుల కెల్ల ప్రణమిల్లుచున్నాను". ఏ మోమున దేవుడు తన వ్రేలితో స్పష్టముగ "నావాడు" అని వ్రాసియుండునో అట్టి మోమును చూచినప్పుడెల్ల ఆ బౌద్ధుల ప్రార్థనకు నిజమైన యర్థము నా కనుభవగోచర మగుచుండును. పవిత్రతాసౌజన్యామృతసింధువులరగు మీరందఱును సదా సుఖులు గను శ్రేయోభాజనులుగను ఉందురు గాత. ఘోరసంసారపంక మును మీ చరణములు ఎప్పుడును అంటకుండు గాక! పుష్పముల వలె అవతరించిన మీరు పుష్పములవలెనే మని నిష్క్రమింతురు గావుత. ఇదే మీసోదరుడ నగు నా నిరంతర ప్రార్థనము.

వివేకానంద

## 82

(చికాగోవాసినియగు కుమారి మేరీహేలుకు)

డిట్రాయిట్,
మార్చి 18, 1894.

ప్రియసోదరి మేరీ,

కలకత్తానుండి వచ్చిన జాబును దయచేసి నాకు పంపినం దుకు హృదయపూర్వక ధన్యవాదములు. అది కలకత్తాలో నున్న నాసోదరులు వ్రాసిన జాబు. నా గురుదేవుని జయంతిమహోత్సవ మునకు ఆహ్వానించు సందర్భమున వ్రాసిన జా బది. నాగురు దేవుని గుఱించి నేను చెప్పగా ఎంతో నీవు వినియున్నావు గదా!

కావున దానిని నీకు పంపుచున్నాను. మజుందారు కలకత్తాకు మరలి వచ్చె ననియు ''అమెరికాలో వివేకానందుడు చేయని పాపము లేదు'' అని ప్రచారము చేయుచున్నా డనియు ఆజాబున వ్రాయబడియున్నది...... అమెరికావారగు మీరు మహాద్భు తాధ్యాత్మికపురుషునిగా భావించునత డిట్టివాడు! అది వారి తప్పు గాదు. యథార్థమైన ఆధ్యాత్మికపరత సిద్ధించువఱకు అనగా స్వాత్మస్వరూపమును యథార్థముగ సాక్షాత్కరించుకొనువఱకును ఆత్మప్రపంచమును దర్శించు వఱకును ఎవడు గాని గింజకును ఊకకును భేదము నెఱుగ లేడు. వాగాడంబరమునకును గంభీర భావమునకును భేదమును గుర్తింప లేడు. పాపము ఆమజుందారును గూర్చి జాలిపడుచున్నాను. అంత నీచత్వమునకు పాల్పడినాడే! వయసుమీఱినను బాలుడే యగు నతనిని భగవంతు డను గ్రహించు గాక!

జాబులోపలి వైపున్న విలాసము ఇంగ్లీషులో వ్రాయబడి యున్నది. చిన్ననాటి సహచరుడు వ్రాసిన నాప్రాతపేరది. ఆసహచరుడును సన్న్యాసదీక్ష స్వీకరించి అయినది. అది యెం తయు కావ్యశృంగారము గలపేరు. జాబులో వ్రాసియుండునది సంక్షిప్తరూపము. పూర్తిపేరు నరేంద్రుడు. నరేంద్రు డనగా నరులకు ఇంద్రుడని యర్థము. మిక్కిలి హాస్యాస్పదమైన పేరు. కాదా? కాని మాదేశమున పేర్లట్టివి. అందుకు మనము చేయ గల దేమియు లేదు. కాని ఇప్పు డా పేరును వదలుకొని నేను సంతోషముతో నున్నాను.

నేను క్షేమము. మీరును క్షేమముగనే ఉన్నా రను కొందును.

సదా భవదీయసోదరుడు
వివేకానంద

## 83

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ

జార్జి డబల్యూ హేలుగారింట
541 డియర్బారన్ అవెన్యూ, చికాగో,
మార్చి 19, 1894

ప్రియశశి,

ఈ దేశమునకు వచ్చినప్పటినుండి నీకు జాబు వ్రాయలేదు. కాని సోదరుడు హరిదాసు* వ్రాసిన జాబువలన వార్తలన్నియు తెలిసినవి. గిరీశచంద్రఘోషు మున్నుగా మీ రందఱును ఆయనను ఉచితరీతి ఆదరించుట మిక్కిలి మేలైన పని.

ఈ దేశమున నా కెట్టి కొదువలును లేవు. కాని భిక్షాటనమునకు ఇచట అనుమతి లేదు. పాటుపడుట, అనగా పలుతావుల నుపన్యసించుట నాకు తప్పదు. ఇచ్చట యెండయు చలియు సమానములు. వేసవివేడిమి కల్కత్తాకంటె ఇచ్చట ఇంచుకైనను తక్కువ కాదు. ఇక చలికాలములో చలిని వర్ణించుటెట్లు! భూమినంతటిని మూడు నాలుగడుగులఎత్తువఱకును, కొన్ని యెడల ఆఱేడడుగులఎత్తువఱకును—మంచు కప్పియుండును. దక్షిణభాగములలో మంచు లేదు. మంచు ఇచ్చట లక్ష్యమే లేదు. ఏలయన పాదరసము ఫారన్హీటులో 32 డిగ్రీ లున్నప్పుడు సైతము ఇచ్చట మంచు కురియును. కల్కత్తాలో పాదరసము ఎన్నడును 60 డిగ్రీలకు తగ్గదు. ఇంగ్లండులో (౦) సున్నను సమీపింపనే సమీపింపదు. కాని ఇందు సున్నను దాటి నాలుగైదుడిగ్రీలకు

---

* ఈయన జునగడమునకు మాజీదివాను. అమెరికాకు తరలుటకు ముందే స్వామీజీకి ఇతనితో సన్నిహితపరిచయమేర్పడెను. స్వామికి పలువురు సంస్థానాధిపతులతో పరిచయము కలిగించినవా డితడు.

వెనుకబడును. ఉత్తరమున కనడాలో పాదరసము గడ్డకట్టుకొని పోవును. అప్పుడు ఆల్కహాలు థెర్మామీటరును ఉపయోగించుకొనవలసివచ్చును. చాల చలిగ నున్నప్పుడు అనగా పాదరసము ఫారన్హీటులో 20 డిగ్రీలకంటె క్రింద నున్నప్పుడు మంచు కురియదు. మంచుకురిసినదినము చలి అతిమాత్రముగ నుండునని నే ననుకొనుచుండెడివాడను. కాని అట్లు కాదు. చలి అంతగా లేని దినములలోనే మంచు కురియును. మిక్కుటపు మంచువలన ఒకవిధమైన మత్తు కలుగును. అప్పుడు మామూలు బండ్లు నడవవు. చక్రములు లేక నేలపై జాఱుచు పోవు (స్లెడ్జ్) మోటు బండిమాత్రమే నడచును. అన్నియు గట్టిగ గడ్డకట్టుకొనిపోవును. నదులమీదను కాలువలమీదను చెరువులమీదను ఏనుగుసైతము నడిచిపో గలదు. అత్యంతవేగముతో పడు నయాగరా జలపాతములుసైతము చలువరాతివలె ఘనీభవించును. కాని నా ఆరోగ్యము బాగున్నది. మొదట నేను కొంత భయపడితిని. కాని అనివార్యముగ నేను రైలుబండిలో పయనింపవలసియున్నది. ఒకనాడు కానడా సరిహద్దులొద్ద నుందును. మఱునాడు దక్షిణ సంయుక్తరాష్ట్రములలో ఉపన్యసించుచు కనబడుదును. నీగదిలో వలె ఇచ్చటి బండ్లలో ఆవిరిగొట్టములమూలమున వెచ్చగ నుండును. చుట్టును మచ్చలేని తెల్లమంచురాసులుండును. అహో! ఎంత రమణీయదృశ్యము.

నాముక్కును చెవులును ఊడి పోవు నేమో యని చాల భయపడినాను. కాని నేటివఱకు అవి సరిగనే యున్నవి. ఏమైనను వెలుపలికి పోవునపుడు మోపెడు వెచ్చని దుస్తులతో — ఒక బొచ్చుకోటు కాళ్లకు జోళ్లు ఉన్నితో చేయబడిన నిలువుటంగీ— ఇంత పెద్దహంగామాతో పోవలసియుండును. ఊపిరి విడిచివిడువక మునుపే అది గడ్డమునను మీసమునందును గడ్డకట్టుకొనిపోవును. దీని కంతకును తోడు విచిత్రము, నీటిలో మంచుగడ్డను వేసికొన

నిదే ఇండ్లలో వారు మంచినీరు త్రాగరు. ఏలన ఇండ్లలో వెచ్చగా నుండును — ప్రతిగదికిని మెట్లదారికిని ఆవిరిగొట్టముల మూలమున వెచ్చదనము కల్గింపబడియుండును. కళలలో సాధన సామగ్రిలో భోగానుభవములలో వీరు ప్రథములు, అగ్రగణ్యులు. ధనమును సంపాదించుటలోను వ్యయించుటలోను గూడ ప్రథములును అగ్రగణ్యులును వీరే. కూలివానికిని సేవకునకును దినబత్తెము ఆఱురూపాయలు. గుఱ్ఱపుబండిబాడుగ మూడురూపాయలకు తగ్గదు. నాలుగణాలకంటె తక్కువ వెలగల పొగచుట్ట ఇచ్చట దుర్లభము. మంచిబూట్లజోడు వెల ఇరువదినాలుగు రూపాయలు. కోటునకును పంట్లామునకును కలిసి వెల అయిదు వందలరూపాయలు. సంపాదించినట్లే వారు వ్యయింతురు. ఒక్కొక్క ఉపన్యాసమునకును రెండువందలరూపాయల మొదలుకొని మూడువేలరూపాయలవఱకును దొరకును. నేను అయిదు వందలవఱ కెక్కినాను.* నా యదృష్ట మిప్పుడు ఉచ్చస్థితినే అందియున్నది. ఈప్రజలకు నాయందు మక్కువ. నా ఉపన్యాసములు వినుటకు వేలకొలదిగ వచ్చుచుందురు.

భగవదిచ్ఛానుసారము నే నిచట (శ్రీ)......మహాశయుని కలిసికొంటిని. మొట్టమొదట ఆయనకు నాయందు హృదయపూర్వకసద్భావ ముండెను. కాని చికాగోప్రజ లందఱును తండతండములుగా నాయొద్దకు రానారంభించినంతనే అతని మనస్సులో కుళ్లు బయలుదేఱినది......క్రైస్తవమతాచార్యులు నన్ను అణచుటకు విశ్వప్రయత్నము చేసిరి. కాని గురుదేవుడు నాదండ

* చికాగోలో విశ్వమతమహాసభ సమావేశానంతరము స్వామి కొంత కాలము ఒకఉపన్యాససంస్థ యాధ్వర్యమున ఉపన్యసించుచు వచ్చెను. కాని తన కది స్వాతంత్ర్యప్రతిబంధకముగ నుండుటచే ఆ సంస్థతో సంబంధము వదలుకొని తా నార్జించిన ధనములో విశేషభాగము భారతదేశమందలి వివిధ భాగములలో అనేకధర్మకార్యములకు వినియోగింపసాగను.

నుండగా నెవ్వ రేమిచేయ గలరు! అమెరికా దేశీయులందఱును నన్ను ప్రేమించుచు గౌరవించుచు నావ్యయములను భరించుచు నన్ను తమగురునిగా పూజించుచున్నారు......నాకు ప్రతికూల ముగా ఏమి చేయుటకును మీ మతాచార్యులకు శక్తి లేక పోయి నది. పైగా ఈదేశీయులు విద్యాధికులు. "మేము విధవలకు వివాహము చేయుదుము" "విగ్రహారాధన చేయము" అను నిట్టి యాలాపములు ఇక నిచ్చట చెల్లవు. వీరికి కావలసినది పాండి త్యము, వేదాంతవిజ్ఞానము. కల్లబొల్లిమాట లిక పనికిరావు.

ధర్మపాలుడు మంచిబాలుడు. ఎక్కువగ నతడు చదువు కొన లేదు గాని పరమసాధుశీలము కలవాడు. ఈదేశమున అతని పట్ల ప్రజాభిమానము అత్యధికముగ కలదు.

సోదరా, నాకు తెలివికలిగినది......"యే నిఘ్నంతి నిర ర్థకం పరహితం తే కే న జానీమహే" "వృథాన్యార్థభంగము గావించెడి వార లెవ్వరో ఎఱుంగన్ శక్యమే ఏరికిన్?" (భర్తృ హరి) అన్నా, మనము దేని నైనను తొలగించుకోగలము గాని ఈపాడు ఈర్ష్యను మాత్రము తొలగించుకొనలేము... పరదూష ణము పరులగొప్పతనమును చూచినంతనే కడుపుమంట — ఇది మన దేశీయులందఱికి గల పాతకము. 'నా ఘనతయే ఘనత, వే రెవ్వరును నామెట్టు నందుకో రాదు!'

ఈ దేశస్త్రీలవంటిస్త్రీలు జగమున వే తెచ్చటను లేరు. ఎంతటి విశుద్ధలు, స్వతంత్రలు, ఆత్మప్రత్యయవతులు, సదయ హృదయలు! మహిళలే ఈదేశమునకు ప్రాణము, ఆత్మ. సకల పాండితికిని సంస్కృతికిని వారే పట్టుగొమ్మలు. "యా శ్రీః స్వయం సుకృతినాం భవనేషు" "సుకృతవంతులయిండ్లలోనుండు మహిళ శ్రీమహాలక్ష్మియే" (చండీ.) అను వచనము ఈదేశము నకు చెల్లును. ఇక "అలక్ష్మీః పాపాత్మనాం" "పాపులగృహమం

దున్న మహిళ దురదృష్టదేవత'' అను అందలి పంక్తియే మన సీమకు వర్తించును. ఈ విషయమును పర్యాలోచింపుము. పరమేశ్వరా, అమెరికాయందలి మహిళలను జూచి నేను ఆశ్చర్య స్తబ్ధుడ నగుచున్నాను. ''త్వం శ్రీ స్త్వ మీశ్వరీ త్వం హ్రీః'' ''నీవు లక్ష్మివి, నీవు ఈశ్వరివి, నీవు హ్రీదేవివి'' ''యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా'' ''శక్తిరూపమున నేదేవి సకల భూతములందును నెలకొనియున్నదో'' (చండీసప్తశతినుండియే) ఇత్యాదివచనము లన్నియు ఈ దేశమునకు వర్తించును. స్వచ్ఛ వినిర్మలమానసులగు మహిళామతల్లులు ఇట వేలకొలదిగ నున్నారు. వారి స్వచ్ఛవినిర్మలహృదయముల కీ దేశమందలి మంచే ఉపమానము. ఇక మనబాలికలను చూడుము. పదుమూడవయేడు వచ్చుటకుముందే వారు తల్లు లగుచున్నారు! ఈశ్వరా, నా కిపు డంతయు బోధపడుచున్నది. సోదరా, ''యత్ర నార్య స్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః'' ''మహిళలు పూజింపబడుచోట వేల్పులు రమింతురు'' అన్నాడు ప్రాచీనుడు మనువు. మనము ఘోరపాపులము. స్త్రీలను నరక ద్వారము లనియు నీచక్రిము లనియు ఇంకను ఏమేమో అనుట చేతనే మనకు అధఃపతనము కలిగినది. ఔరా! స్వర్గమునకును నరకమునకును ఎంతభేదము! ''యాథాతథ్యతో ర్థా న్వ్యద ధాత్'' ''దేవుడు తాను దేనిని ఇచ్చినను అర్హతనుబట్టియే ఇచ్చియున్నాడు''. వ్యర్థాలాపములచే స్వామిని మోసగింప గలమా? స్వామి అన్నాడు —

''త్వం స్త్రీ, త్వం పుమా నసి,
త్వం కుమార, ఉత వా కుమారీ''

''నీవు స్త్రీవి, నీవు పురుషుడవు, నీవు కుమారుడవు, కుమారివియు నీవే'' (శ్వేతాశ్వతరోపనిషత్తు) అని. మఱి మనమో ''దూరం అపసర, రే చండాల'' ''ఓమాలవాడా, ఓమాదిగవాడా,

తొలగుము, దూరముగ తొలగుము'' అనియు, ''కేన ఏషా నిర్మితా నారీ మోహినీ'' ''మోహింపజేయునట్టి ఈ స్త్రీని నిర్మించిన దెవరు?'' అనియు అఱచుచున్నాము. సోదరా, దక్షిణ దేశమున అగ్రజాతులవారు నిమ్నజాతులవారిని పెట్టు ఎంతెంత ఘోరహింసలను నాకన్నులు నొవ్వ కాంచియున్నాను. గుళ్లలో ఏమి ఒడ లెఱుంగని సివము! పేదలదుఃస్థితిని తొలగింపజాలని మతము — మానవులను దేవతలుగా నొనర్పజాలని మతము — మత మగునా? మన మతమునకు సనాతనధర్మ మనిపించుకొను నర్హత కల దందువా? మనది కేవలము ''నన్ను ముట్టుకోకు'' మనెడి మతము. ''నన్ను ముట్టుకోకు, నన్ను ముట్టుకోకు'' ఇదే ఎంత సేపటికిని! కుడిచేతితో తినవలయునా, ఎడమచేతితో తినవలయునా? పానీయమును కుడివైపునుండి గ్రహింపవలయునా, ఎడమవైపునుండి గ్రహింపవలయునా?...'' అనియే రెండువేల యేండ్లుగా దేశనాయకులు చర్చించుచున్న దేశము అధోగతిపాలు కానిచో మఱి యే దేశము అధోగతిపాలగును? ''కాలః సుప్తేషు జాగర్తి కాలో హి దురతిక్రమః'' — ''సమస్తము నిదురించుచుండగా కాలము మేల్కొని యుండును, దురతిక్రమము గదా కాలము!'' అంతయు పరమాత్మునకె ఱుక. నాయనా, వాని కనుమూయగలవా డెవ్వడు?

లక్షలకొలది జనులు ఇప్పపువ్వులు తిని బ్రదుకు దేశము, ఏ యిరువది ముప్పదిలక్షలమందియో సాధువులును ఏ పదికోట్ల మందియో బ్రాహ్మణులును వారి శ్రేయస్సునకై ఇసుమంతయేని పాటుపడక, వారి రక్తమును బీల్చి పిప్పిచేయుచున్న దేశము దేశమా, నరకమా? అది ధర్మమా, పిశాచతాండవమా? నాయనా, ఈ సంగతి నీవు సమగ్రమముగా గ్రహింపవలసినది — భారతదేశమం దంతటను నేను పయనించినాను, ఈ దేశము

(అమెరికా)ను కూడ జూచినాను — కారణములేని కార్య ముండునా? పాతకములేనిదే దుఃఖానుభవము గలుగునా?

సర్వశాస్త్ర పురాణేషు వ్యాసస్య వచనం ధ్రువమ్,
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్.

సర్వశాస్త్రపురాణములందును ఈ వ్యాసవచనము ధ్రువము — పరోపకారమే పుణ్యము. పరపీడనమే పాపము. కాదా?

నాయనా, ఈ దారుణమును దలచినకొలదియు, ముఖ్యముగా మనదేశీయుల దారిద్ర్యమును అజ్ఞత్వమును దలచిన కొలదియు నాకు నిద్రపట్టకుండెను. కన్యాకుమార్యగ్రమున, కుమారీమాతృదేవియాలయమున, భారతదేశాంతిమశిలపై గూరుచుండియుండ నాకొక మార్గము తట్టినది. ఇంతమందిమి ఉన్నాము సన్న్యాసులము, ప్రజలకు వేదాంతమును కఱపుచు దిరుగుచున్నామే — ఇదియంతయు నున్మాదము. "'అన్నమో రామచంద్రా!' యని పలవించు నార్తులకు మతబోధ సేయుట పనికిరా"దని మన గురుదేవుడు వచింపలేదా? అజ్ఞతవలననే కదా, వారు కేవలపశుప్రాయులై మనుచున్నారు! తరతరములనుండియు మనము వారి రక్తమును బీల్చి పిప్పిచేసి కాలిక్రింద పడవైచుకొని త్రొక్కివేయుచున్నాము.

... స్వార్థరహితులు, పరోపకారపరాయణులు నగు సన్న్యాసులు గొందఱు నోటిపాఠముల మూలమునను భూగోళ పటములు, చిత్రప్రదర్శకదీపములు, గోళములు మొదలగు సాధనముల మూలమునను విద్యావ్యాప్తిచేయుచు నా చండాలము జనుల స్థితిగతులను జక్కజేయ బహువిధముల ప్రయత్నించుచు నూరూర సంచరింతురనుకొనుము — ఇది సకాలమున లోకకల్యాణము నొనగూర్పదా? ఈ యుపాయముల నన్నింటిని ఒక చిన్న లేఖలో

వివరింపజాలను. దాని వివరమును సంక్షేపమును ఇది — కొండ మహమ్మదుగారియొద్దకు రానపుడు మహమ్మదుగారే కొండ యొద్దకు పోవలయునుగదా. పేదలు పాఠశాలలకు పోజాలనంతటి నిరుపేదలై యున్నారు, మఱియు కావ్యాదులను జదువుటవలన వారికి లాభమేమియు లేదు. ఈ దేశీయులమగు మనము మానవత్వమును గోల్పోయియున్నాము; దేశక్షోభ కంతకును ఇదియే కారణము. జనులకు మరల మానవత్వమును జేకూర్చి జనసామాన్యమును ఉద్ధరించుటయే మనము చేయవలసినపని. హిందువులేమి, మహమ్మదీయులేమి, క్రైస్తవులేమి — ఎల్లరును వారి నణగద్రొక్కినారు. మరల వారి నుద్ధరించునట్టి శక్తి లోపలి నుండియే, అనగా సనాతన హిందువులనుండియే వెలువడవలయును. ఏ దేశమునకైనను అనర్థకారణము మతధర్మనిరసనమే కాని మతధర్మముకాదు. తప్పు ప్రజలదే కాని మతముది కాదు.

ఈ మహాకార్యమును నిర్వహించుటకు మనకు వలయు సాధనములు రెండు — (1) మనుష్యులు, (2) ధనము. గుర్వనుగ్రహమున ప్రతి పట్టణమునను పది పదునైదుగురు ధీరులు దొరకకపోరను విశ్వాసముతో నుంటిని. తరువాత వలయు ధనమును సంపాదించుటకై తిరుగాడితిని, కాని హిందూదేశీయులు ఇందులకు ధనము వ్యయింతురనుకొందువా!!... స్వార్థపరతకు మూర్తిభావములైనవారు, దమ్మిడినైనను ఖర్చుచేయుదురా! కావున ధనమును నేనే ఆర్జింతమని ఈ దేశమునకు వచ్చినాను, పిమ్మట స్వదేశమునకు మరలి నా యీ జీవితపరమాశయమును సాధింప నా మిగిలిన యాయువును ధారపోయగోరితిని.

మనదేశమున సాంఘిక సుగుణములు కొఱవడి యున్నట్లే ఈ దేశమున పారమార్థికశీలము కొఱవడియున్నది. వీరికి నేను ఆధ్యాత్మికపరత నొసగుచున్నాను, నాకు వీరు ధనమొసగుచున్నారు. నా గమ్యప్రాప్తి కింకను నా కెంతకాలము పట్టునో

తెలియకున్నది ... వీరు వంచకులు కారు, అసూయ యనునది వీరియందు బొత్తిగా లేనే లేదు. హిందూస్థానమున నే నెవ్వరి మీదను ఆధారపడను. శక్తికొలదియు స్వయముగనే వలయు ధనమును సంపాదింప ప్రయత్నించి నా కార్యక్రమమును గొనసాగింతును, లేదా, తత్ప్రయత్నమున ప్రాణములు ధారపోయుదును — "సన్నిమిత్తే వరం త్యాగో వినాశే నియతే సతి" — మరణము ధ్రువమైయుండ సదుద్యమమునకై ప్రాణములు ధారపోయుట మేలుకాదా?

ఇదియంతయు నేమి భ్రాంతియని మీరు అనుకోవచ్చు! నా మనసులో నేమున్నదో మీకు తెలియకున్నది. నా యుద్యమమును గొనసాగించుటకు మీ రెవ్వరైన తోడ్పడిన సరియే, తోడ్పడరా, గురుదేవుడే నాకు దారి చూపును ... ఈర్ష్యను విడిచి మన మేకీభవింపజాలకున్నాము. ఇది మన దేశమునేపట్టియున్న పాపము! ఈ దేశమున నీర్ష్య కలికమునకైనను గానరాదు, ఇందువలననే వీరింత గొప్పవారైనారు.

మనవంటి కూపస్థమండూకములను లోకమున మఱెచ్చటను నేను గనలేదు. ఏదేని క్రొత్తగా ఏదేశమునుండియైనను వెలువడనిండు, దానిని అంగీకరించువారిలో అమెరికావారు అగ్రస్థానమున నుందురు. ఇక మనమో, — మనవంటివారు లోకమున లేరు, ఆర్యసంతతివారము!! ఆ జాతీయత, యే కోశమున ప్రకటమగుచున్నదో నాకు గానరాకున్నది. ... ఐనను వీరు ఆర్యసంతతియట!

సదా మీ
వివేకానంద

84

(రెవరెంద్ ఆర్. ఎ. హ్యూముగారికి)*

డిట్రాయిట్,
మార్చి 29, 1894.

ప్రియసోదరా,

నీజాబు ఇప్పుడే చేరినది. నేను చాలతొందరలో నున్నాను. కావున నీవు వ్రాసినదానిలో నున్న కొన్ని స్ఖాలిత్యములను మాత్రమే సవరించుటకై స్వతంత్రించుచున్నాను. క్షమింపుము.

మా మతమునుగూర్చి మీ అభిప్రాయము ఏమైన నగుగాక! ప్రపంచములో ఏ మతమునుగుఱించి గాని మతప్రవక్తను గుఱించి గాని ప్రతికూలముగ చెప్పదగిన మాట ఒక్కటైనను నాకు లేదు. నా కన్నిమతములును పవిత్రములే. ఇది మొదటి విషయము. ఇక రెండవది: మతప్రచారకులు మా దేశభాషలను నేర్చుకొనుట లేదని నేను చెప్పితి ననుట కేవల మనృతము. నేను చెప్పినది వారిలో కొందఱైనను సంస్కృతభాషయందు అక్కఱ వహించుట లేదని. ఆ మాట ఇప్పటికిని నిలుపుకొందును. ఏ మతసంస్థనుగూర్చి గాని నేను ప్రతికూలముగ ప్రసంగించితి ననుట అసత్యము. భారతీయులను క్రైస్తవమతమునకు మరల్చుట ఎన్నటికిని శక్యము గాదని నొక్కిచెప్పుచున్నాను. మాదేశమున

* ఈయన ఒక క్రైస్తవమతప్రచారకసంస్థకు నాయకుడు. స్వామిని వాదమునకు రప్పించుటకై తే 21-3-1894 ది నాడు మసాచుసెట్సులోని ఆబర్న్డేలునుండి స్వామి కొకజాబు వ్రాసెను. "వివేకానందస్వామీ, భారతీయసోదరా", అని జాబును ప్రారంభించెను. హ్యూముపుట్టినది భారతదేశమున. క్రైస్తమతప్రచారకులు భారతదేశమున నిర్వహించుచుండు మత ప్రచారప్రణాళికన్యాయ్యమే అనియు, దానినిగూర్చి స్వామి పల్కిన ఖండన వాక్కులు సత్యదూరము లనియు, ఇతని మతము.

పతితప్రజలపరిస్థితి క్రైస్తవమతముచే బాగుపఱుపబడిన దను మాటను నే నొప్పుకొనను. మ ఱొక్క మాట. దక్షిణభారతీయ క్రైస్తవులలో అత్యధికసంఖ్యాకులు కాథొలిక్కు లగుటయే గాక వర్ణ (కాస్ట్) క్రైస్తవులని వారు తమ్ము నిర్దేశించుకొనుచున్నారు. అనగా వా రింకను తమ వర్ణములను అంటిపట్టుకొనియే యున్నా రనుట. హిందూసంఘము తమ వినాయింపుపద్ధతులను మాను కొన్నచో వీరిలో నూటికి తొంబండుగురు మరల హిందూమత మును — అం దెన్ని లోపములున్నను — తప్పక ఆశ్రయింతు రని నా విశ్వాసము.

కడపటివిషయము : భారతీయసోదరా, అని నన్ను సంబో ధించితివి. అందుకు నా హృదయపూర్వకమైన ధన్యతను నివేదించు కొనుచున్నాను. విదేశీయులైన యూరోపియనులలో భారతదేశ మున జన్మించినవారిలో సైతము ఎవడును, మతప్రచారకుడు గాని మఱొకడు గాని, నిందితభారతప్రజలలో నొకనిని సోదరా అని పిలువ సాహసించుటకు ఇదే ప్రారంభము. భారతదేశములో న న్నిట్లు పిలుచు ధైర్యము నీ కుండునా? మీ మతప్రచారకులలో భారతదేశమున పుట్టినవారితోను పుట్టనివారితోను నీవు చేసినట్లే చేయు డని చెప్పుము. భారతీయులను సోదరమానవులుగ గణింపు డనుము. ఇక తక్కిన విషయములను గుఱించి — మా మతము మా సంఘము భూగోళసంచారులయు కథకులయు విమర్శలకు తల యొగ్గు నని వ్రాసితివే, అందుకు నేను ఔ నంటినేని, నీవే నన్ను మూర్ఖు డందువు.

సోదరా—క్షమింపుము—నీవు భారతదేశమున జన్మించియుండ వచ్చు గాని మా మతమునుగూర్చియు మా సంఘమునుగూర్చియు నీ కేమి తెలియు నోయి! నీ కే మేని తెలియుట కేవలము అసాధ్యము. మా సంఘద్వారములు ఆలాగు మూసిపెట్టబడి యున్నవి. పైగా జాతిని మతమును గూర్చి తన మనస్సులో

ముందుగనే యున్న కొలతలను బట్టిగదా ప్రతివాడును గుణదోష ములను నిర్ణయించుచుండును. నన్ను సోదరభారతీయుడా అని సంబోధించినందుకు భగవంతుడు నిన్ననుగ్రహించు గాక. ప్రాచ్య పాశ్చాత్యదేశీయులకు సఖ్యసౌభ్రాత్రములు ఇంకను గల్గవచ్చును.

భవదీయసౌభ్రాత్రయుత
వివేకానంద

## 85

(కుమారి మేరీ హేలుకు)

డిట్రాయిట్,
మార్చి 30, 1894.

ప్రియ సోదరీ,

పైకము చేరిన దని తెలియపఱచుచు అమ్మ చర్చి వ్రాసిన జాబుతోబాటు నీ జాబును ఇప్పుడే చేరినది. ఖేత్రీజాబును చూచి యెంతో ఆనందించితిని. నీవు చదువుటకై దానిని మరల నీకు పంపుచున్నాను. ఇచ్చటి పత్రికలనుండి కొన్ని ఉద్ధారములు అతడు కోరుచున్నా డని ఆజాబును చూచినచో నీకు తెలియును. డిట్రాయిట్పత్రికోద్ధారములు మాత్రమే నాయొద్ద నున్నవి. వానిని నే నంపెదను. వే ఱేవియు నాయొద్ద లేవు. మఱి కొన్ని నీకు చిక్కునేని, నీకు శక్యమగునేని, నీకు అనుకూలమే అగునేని—దయచేసి అతనికి పంపుము. అతని విలాసము నీకు తెలిసినదే—ఖేత్రీమహారాజు, రాజపుత్రస్థానము, ఇండియా. ఈజాబు పరమపావనకుటుంబమువారు చదువుకొనుటకుమాత్రమే. బ్రీడుసతి నాకు మొదట ప్రచండపరుషవాక్కులతో నొక జాబు వ్రాసినది. కాని తర్వాత ఈదినము నాకు చేరిన తంతెలో ఆమె

నన్ను పైవారము వచ్చి తనకు అతిథిగా నుండు మని కోరి యున్నది. దానికి ముందే న్యూయార్కునుండి శ్రీమతి స్మిత్తుసతి వ్రాసిన జాబు చేరినది. తన పక్షముననూ, కుమారి హెలెన్గాల్డు అను మహిళపక్షముననూ, మఱొక డాక్టరుపక్షముననూ, నన్ను న్యూయార్కుకు రమ్మని ఆహ్వానించుచు వ్రాసినది. లిన్ను క్లబ్బు వారు నన్ను పైనెల 17-వ తేదీనాడు రమ్మని కోరుచున్నారు. కావున మొదట న్యూయార్కునకు పోయి లిన్నుసమావేశమునకు సకాలమునకు వచ్చెదను.

శ్రీమతి బాగ్లీసతి నేనాదేశము విడిచి పోకూడదని పట్టు పట్టి కోరుచున్నది. తదనుసారము పైవేసవిలో నేను వెడలిపో కుందునేని, అన్నిస్కామునగరమునకు నాప్రయాణము జరుగ వచ్చు. బాగ్లీసతి అచ్చట చక్కని భవనము ఏర్పాటు చేసి యున్నది. బాగ్లీసతి మిక్కిలి ఆధ్యాత్మికపరతకలది. శ్రీపామరు పానవ్యసనలోలుడైనను చాలమంచివాడు. ఇంతకన్న ఏమి వ్రాయుదును? నాదేహ మనఃపరిస్థితులు చాల బాగున్నవి. మీ రందఱును నాప్రియతమసోదరీమణులందఱును భగవదనుగ్రహ పాత్ర లగుదురు గాక! మఱొకమాట. శ్రీమతి పెర్కిన్సతి నా కనేక వస్తువులను కానుకలుగ నిచ్చినది. వానిలో జాబులపెట్టె పుస్తకాలసంచి గోళ్లచికిలీచేయు ఉపకరణములు మున్నగునవి ఉన్నవి. వానిని, అందును ముఖ్యముగ ముత్తెపుపిడి అమర్చిన గోళ్లచికిలీసాధనమును నేను వల దన్నను ఆమె నన్ను నిక్కచ్చి చేసినందువలన ప్రతిగ్రహింపవలసివచ్చినది. ఆసాధనముతో ఏమి చేయువలెనో నాకు తెలియదు. భగవంతుడు వారి నెల్ల అనుగ్ర హించును గాక. ఆమె నాకొక సలహా చెప్పినది. ప్రజాసమా వేశములకు వచ్చునప్పుడు ఆఫ్రికాదుస్తులను పోలిన ఈదుస్తులను ఎప్పుడును ధరింపవల దన్నది. ఇప్పుడు నేను సదస్సులలో మసలువాడ నైనాను! భగవంతుడా, దీనికి తర్వాత నిక నేమి వచ్చునో! సుదీర్ఘకాలము జీవింతుమేని వింత యనుభవములు

కలుగును. మీ కందఱికిని, నా పవిత్రకుటుంబమువారి కందఱికిని, నా అనిర్వాచ్యమైన ప్రేమ!

భవదీయసోదరుడు
వివేకానంద

## 86

(శ్రీ అళసింగపెరుమాళుకు)

న్యూయార్కు,
ఏప్రిలు 9, 1894.

ప్రియఅళసింగా,

నీ కడపటి జాబు కొన్నాళ్లక్రిందనే చేరినది. ఇచ్చట నేను మిక్కిలి కార్యవ్యగ్రుడనై యున్నాను. ప్రతిదినము పెక్కు జాబులను వ్రాయవలసియున్నది. కాబట్టి నీవు నాయొద్దనుండి జాబులు తఱచు వచ్చుచుండు నని నిరీక్షించుటకు అవకాశము లేదు. కాని ఇచట జరుగుచున్నది నీకు తెలిసియుండునట్లుగా చేయుటకు నాచేతనైనంతవఱకు ప్రయత్నించెదను. విశ్వమత మహాసభనుగుఱించిన గ్రంథములలో నొకదానిని నీకు పంపుడని చికాగోవారికి జాబు వ్రాసెదను. కాని నా ఉపన్యాసములలో చిన్నవి రెండు నీ కిప్పటికి చేరి యుండును.

భారతదేశము నా కార్యరంగ మనియు అచటికి మరలి ర మ్మనియు సెక్రటరీసాహెబు వ్రాయుచున్నాడు. అందుంగూర్చి సందేహము లేదు. కాని, సోదరా, తన వెలుగును భారతదేశ మంతటిపై వెదజల్ల గల దీపమును మనము వెలిగింపవలెను. కావున త్వరపడకుందముగాక! భగవదనుగ్రహముచే సమస్తమును మనకు చేకుఱును! అమెరికాలో పెద్దనగరములలో పెక్కింట నే నుపన్యాసములు చేసితిని. ఇచ్చటి విపరీతపుఖర్చులకు అచ్చు కొన్న తర్వాత భారతదేశమునకు మరలివచ్చుటకు చాలినంత

ధనము నాయొద్ద నున్నది. ఇచ్చట నేను మంచిమిత్రులను పెక్కండ్రను సంపాదించితిని. వారిలో కొందఱు చాల మాట చెల్లుబడి కలవారు. శుద్ధశ్రోత్రియులైన క్రైస్తవమతాచార్యులు మాత్రము నాకు ప్రతికూలురుగ నున్నారు. నన్ను మార్కొనుట సులభమైన పని కా దని గుర్తించి అన్నివిధముల నన్ను నిందించు టకు నాపేరు చెఱచుటకు నాదారి కడ్డములు కల్గించుటకు ప్రయ త్నించుచున్నారు. 'మ—' వారికి తోడైనాడు. ఈర్ష్యచే అతనికి వెఱ్ఱెత్తినది. నేను పెద్ద మోసగాడ ననియు దుష్టుడ ననియు అతడు వారికి చెప్పినాడు. కలకత్తాలోగూడ అతడు, అమెరికాలో నేను పెడదారిపట్టి పాపిష్ఠజీవితమును గడపుచున్నా నని ప్రచారము చేయుచున్నాడు. భగవంతు డతని ననుగ్రహించు గాక! సోదరా, ప్రతిబంధము లేక ఏ మంచి పనిని గాని చేయ లేము. తుదవఱకు ఎవరు పట్టువిడువకుందురో వారే గెలుపొందు దురు. ... సత్యయుగము (స్వర్ణయుగము) రానున్న దని నా నమ్మకము. అప్పుడు అందఱు నొక్కవర్ణమువారుగ నుందురు. అందఱి కొక్క వేదమే యుండును. శాంతిసామరస్యములు అమరి యుండును. భారతదేశమునకు నూతనజీవనమిచ్చునది ఈ సత్య యుగాశయమే. దీనిని నమ్ముము. నీవు చేయగలిగినచో, ఒక్క పనిని చేయ వలెను. మదరాసులో ఒకపెద్దసమావేశమును ఏర్పాటుచేయగలవా? రామనాథపురరాజుగారినో లేక అట్టి ప్రముఖుని మఱియొకనినో అధ్యక్షునిగ జేసి, ఇచ్చట నేను గావించిన హిందూమతప్రతిపాదనము మీకు పరమసమ్మతమైన దని ఒక తీర్మానము చేసి దానిని "చికాగోహెరాల్డు" "ఇంటరోషను" "న్యూయార్కుసన్" మిచిగనునందలి డిట్రాయిట్ లోని "కమర్షలడ్వర్టైజర్" అను పత్రికలకు పంప వలెను. చికాగో నగరము ఇల్లినాయిసులో నున్నది. 'న్యూయార్కుసన్' పత్రికను గూర్చి వివరము లక్కఱ లేదు. మిచిగనురాష్ట్రములో నున్నది

'డిట్రాయిట్'. దాని ప్రతులను (కాపీలను) చికాగోలోని విశ్వమతమహాసభాధ్యక్షుడగు డాక్టరు బర్రోసుకు పంపుము. అతని ఇంటినెంబరు నేను మఱచిపోయినాను. వీధిపేరుమాత్రము 'ఇండియానాఅవెన్యూ'. ఒక కాపీ శ్రీమతి జె. జె. బాగ్లీసతికి. ఆమె విలాసము 'వాషింగ్టన్ అవెన్యూ, డిట్రాయిట్'.

ఈ సమావేశమును సాధ్యమైనంత గొప్పసమావేశముగా చేయ ప్రయత్నింపుము. హేమాహేమీలైనవారి నందఱిని పట్టుము. తమమతముకొఱకు దేశముకొఱకు వారీ సభలో చేరి తీరవలెను. ఈసమావేశమును దీనియుద్దేశమును ఆమోదించునట్టి జాబులను మైసూరుమహారాజునొద్దనుండియు దివానునొద్దనుండియు సంపాదింప ప్రయత్నింపుము. అట్లే ఖేత్రీనుండియు. నీకు సాధ్యమైనంత పెద్దసభను కూర్పవలెను. నీకు సాధ్యమైనంత కోలాహలము చేయవలెను.

ఇచట నేను నిర్వహించిన పనినిగూర్చి మదరాసునుండి నన్నిచ్చటికి పంపిన హిందువుల పరిపూర్ణామోదమును తెలుపునదై ఉండవలెను ఆ తీర్మానము.

శక్యమగునేని ఇప్పుడు ప్రయత్నింపుము. ఇది అంత పెద్ద పని కాదు. నీకు అందుబాటైన అన్నిప్రాంతములనుండియు సానుభూతిలేఖలను సంపాదింపుము. వానిని అచ్చు వేయించి, కాపీలను అమెరికనుపత్రికలకు పంపుము. నీకు సాధ్యమైనంత శీఘ్రముగ చేయవలెను. నాసోదరులారా, ఇది మన కెంతో తోడ్పడును. ఇచ్చట బి-ఎస్-నీచులు అన్ని విధముల అనర్థప్రసంగములను చేయుచున్నారు. సాధ్యమైనంత త్వరలో వారినోళ్లను మూయింపవలెను.

లెండి, యువకులారా, కార్యనిర్వహణమునకు నడుము కట్టుడు. మీ ర ట్లొనర్పగలిగిన భవిష్యత్తున ఎంతో సాధింపగలమని నా నమ్మకము. సనాతనమైన హిందూమతము శాశ్వతముగ

వెలయుగాక! అనృతవాదులును, దుష్టులును నశింతురు గాక! లెండి, లెండి, నా వత్సలారా, విజయము తప్పక మనదే!

ఇక నాలేఖలను ప్రకటించుటనుగూర్చి — నేను వచ్చునంతవఱకు మన మిత్రులకై నాలేఖలలో తప్పక ప్రచురింపవలసిన భాగములను ప్రచురింపవచ్చు. పనిని ప్రారంభించితిమా, మన పేరు అపారముగ మ్రోగిపోవును. పనిచేయక వట్టిమాట లాడుట నా కిష్టము లేదు. నే నెఱుగను గాని కలకత్తాలో గిరీశచంద్ర ఘోషును మిత్రయు నాగురుని ఆప్తవర్గమునెల్ల ప్రోగుచేసి ఇట్టి పనినే కలకత్తాలో చేయ గలరు. చేయగలిగినచో మేలు. కలకత్తాలోకూడ ఈతీర్మానములనే చేయుటకు సాధ్యమగు నేమో వారి నడుగు. మన ఉద్యమమున సానుభూతిగలవారు కలకత్తాలో వేలకొలదిగ నున్నారు. ఐనను నాకు వారియందున్న విశ్వాసమున కంటె నీయం దున్న విశ్వాసము హెచ్చు.

వ్రాయుటకు వే తేమియు లేదు.

మన మిత్రులందఱికొఱకై సదా దైవప్రార్థనము చేయుచున్నాను. వారికి నా అభినందనములను అందజేయుము.

ఆశీస్సులతో,

భవదీయ
వివేకానంద

## 87

(ప్రొఫెసరు జాన్హైట్రీసై టుగారికి)

న్యూయార్కు,
ఏప్రిలు 25, 1894.

ప్రియఅధ్యాపక్షీ,

మీరు నన్నాహ్వానించినందులకు ఎంతయు కృతజ్ఞుడను. మే 7-వ తేదీ నాడు వత్తును. ఇక పాస్పు విషయమా—మిత్రమా

మిూప్రేమయు, ఉదారహృదయమును, పాషాణమును (హంస తూలికల) పాన్పుగా మార్ప గలదు.

సాలేములో జరుగు గ్రంథకర్తల ప్రాతఃకాలపువిందునకు నేను పోజాలను. పోజాలనందులకు చింతిలుచున్నాను.

మే 7-వ తేదీ నాటికి ఇంటికి వచ్చివేయుదును.

సత్యాయుత భవదీయ
వివేకానంద

## 88

(కుమారి ఇసబెల్ మెకెంస్లీకి)

న్యూయార్కు,
ఏప్రిలు 26, 1894.

ప్రియసోదరీ,

నీజాబు నాకు నిన్న చేరినది. నీవు చెప్పినది యెంతయు సరే. పిచ్చివారిపత్రికయగు ఇంటీరియరులోని వినోదము నాకు రక్తిగొల్పినది. [చికాగో ఇంటీరియరు, స్వామికి ప్రతికూలమైన పత్రిక. ప్రెసిబిటేరియనులది]. కాని నిన్న నీవు భారతదేశము నుండి పంపిన తపాలు నిజముగ సుదీర్ఘకాలమునకు అందిన సువార్తయే. మాతృశ్రీ చర్చియు తన జాబులో అట్లే చెప్పియున్నది. ధివాన్జీ వ్రాసిన చక్కని జాబొకటి అందున్నది. ఆపెద్దాయన ఎప్పటివలెనే నాకు తోడ్పడుదు ననుచున్నాడు. భగవంతు డతని ననుగ్రహించు గాక. నన్నుగూర్చి కలకత్తాలో ప్రచురింపబడిన చిన్నకరపత్ర మొకటి యున్నది. నాజీవితమున కనీస మొక్కసారి యైనను ప్రవక్తకు స్వదేశమున జరిగిన గౌరవమును ఆ కర పత్రము తెలుపుచున్నది. నన్నుగూర్చి అమెరికాపత్రికల నుండియు భారతీయపత్రికలనుండియు గైకొనబడిన ఉద్ధారములు గలవు. కల్కత్తాపత్రికలనుండి కైకొని ముద్రించిన ఉద్ధారములు

మఱింత ప్రీతికరములుగ నున్నవి. కాని అందలి ప్రశంస సీమాతీతముగనున్నందున దానిని మీకు పంపుట లేదు. ఆదర్శమహాపురుషుడనని, అద్భుతపురుషవతంసుడనని, పిచ్చి పిచ్చిగ నన్ను కొనియాడియున్నారు. కాని వారు నా కంద జేసినది యావద్భారత దేశధన్యతనే. నా దేశమువారే ఐనను, వారు నన్నుగూర్చి చెప్పువానిని ఒకందుకు తప్ప నేను లక్ష్యపెట్టను. నా కొక వృద్ధురాలైన తల్లి యున్నది. బ్రతికినన్నినాళ్లు ఆమె బాధ లనుభవించినది. ఆబాధలనడుమనే మానవసేవకయ్యు మాధవసేవకయ్యు నన్నామె అర్పింపగలిగినది. బిడ్డలలో ప్రాణాధిక ప్రియుడైనవానిని, కలకత్తాలో మజుందారు చెప్పుచున్నట్లుగా దూర దేశమున మృగజీవితము గడపుమని వదలుకొనుట ఆమెకు కేవలము మరణకల్పమైయుండును. కాని భగవంతుడు పరాత్పరుడు. ఆయన బిడ్డల కెవ్వరును హానికూర్పలేరు.

నేను వెదుకకుండగనే, గుట్టు బయల్పడినది. నన్నింతగ ప్రశంసించుచును, హిందూమతప్రతినిధిగ నే నమెరికాకు వచ్చినందునకు భగవంతునికి ధన్యవాదము లర్పించుచు నున్న మన పత్రికలలో ముఖ్యమైనదానికి సంపాదకు డెవ రనుకొనుచున్నావు? మజుందారుని ఆప్తబంధువే. పాపము మజుందారు అసూయచే అసత్యములు చెప్పి తన ఉద్యమమును చెఱచుకొన్నాడు. నన్ను నేను కాచుకొనుటకు ఎప్పుడును ప్రయత్నించియుండలే దనుట దేవు డెఱుగును.

ఇంతకు ముందే ఫోరమ్ పత్రికలోని గాంధీగారి వ్యాసమును చదివితిని.

గతమాసపు 'రివ్యూ ఆఫ్ రివ్యూస్' అను పత్రిక సంచిక నీయొద్ద నున్నచో - ఇండియాలో ఆంగ్లోద్యోగులలో అత్యున్నతపదవియందున్న యొకడు భారతదేశమందలి నల్లమందుసమస్యనుగూర్చి చెప్పు సందర్భమున హిందువులను ఎట్లు ప్రశంసించి యున్నాడో తెల్పు భాగమును ఆపత్రికలో అమ్మకు చదివి విని

పింపుము. అతడు హిందువులను ఆంగ్లేయులతో పోల్చి హిందువులను మిన్నంట పొగడియున్నాడు. సర్. లెపెల్ గ్రిఫిన్ — హిందూజాతికి అత్యంతవిరోధులలో నొకడు. అతని నిట్లు పక్షము మార్పించిన దేది?

బోస్టనులో శ్రీమతి బ్రీడుగారి గృహమున నాకు కాలక్షేపము చాల చక్కగా జరిగినది. ప్రొఫెసరు రైటుగారిని చూచితిని. నేను మరల బోస్టనుకు పోవుచున్నాను. నాకు క్రొత్తగౌనును దర్జీవాడు కుట్టుచున్నాడు. (హార్వర్డు) కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో నే నుపన్యసింపబోవుచున్నాను. అచట నేను ప్రొఫెసరు రైటుగారింట అతిథినై యుందును. బోస్టను పత్రికలలో అచ్చటి వారు నాకు విభవోత్తర స్వాగతము పలుకుచున్నారు.

ఈ వెట్టియంతయు నాకు విసుగుగ నున్నది. మేనెల రెండవ సగమప్పటికి నేను చికాగోకు మరలివత్తును. అచట కొన్నాళ్లుండి, ప్రాచ్య దేశములకు మరలుదును.

గడచినరాత్రి వాల్డోర్ఫుహోటలులో నే నుపన్యసించితిని. శ్రీమతి స్మిత్తుసతి టిక్కెట్లు అమ్మినది. ఒక్కొక్కటిక్కెట్టు రెండేసిడాలర్లు. హాలునిండిపోయినది. కాని అది చిన్నహాలు. ఆపైకములో దమ్మిడీ అయినను ఇంకను నా కంట బడలేదు. ఈదినమున ఎప్పుడో ఒకప్పుడు కంటబడు ననుకొందును.

లిన్నులో నూఱుడాలర్లు సంపాదించితిని. క్రొత్తగౌను మొదలైన పిచ్చివ్యయములు చేయవలసియున్నందున ఆపైకమును నేను పంప లేదు. బోస్టను నగరమున ధనము లభించు నను ఆస లేదు. కాని నాకు శక్యమగు నేని అమెరికనుల మేధను తాకవలెను, లేప వలెను.

నీప్రియసోదరుడు
వివేకానంద

## 89

(కుమారి ఇసబెల్ మెకండ్లీకి)

న్యూయార్కు,
మే 2, (నిజమునకు 1-వ తేదియే) 1894.

ప్రియసోదరీ,

ఆగ్రంథకమును నీకిప్పుడే పంపుటకు వీలుకాదనుకొనుచున్నాను. కాని భారతదేశమునుండి నిన్న వచ్చిన యొకపత్రికాఖండ మున్నది. దానిని నీకంపుచున్నాను. నీవు చదివినతర్వాత దానిని దయచేసి శ్రీమతి బాగ్లీసతికి పంపుము. ఈపత్రికకు సంపాదకుడు శ్రీమజుందారుకు బంధువు. పాపము మజుందారును గుఱించి నేనిప్పుడు దుఃఖించుచున్నాను.*

నాకోటునకు ఇచ్చట సరియైన కావివస్త్ర దొరకలేదు. కావున రంగులలో దానికి తర్వాత మేలైనదానితో, కాథొలిక్కు మతాచార్యులుధరించు పసుపుమించిన యెఱుపు వస్త్రతో నన్ను తృప్తిపఱచుకొనవలసినవాడ నైతిని.

కోటు కొన్నాళ్లలో తయారగును.

మొన్న వాల్డార్ఫులో ఉపన్యసించినందుకు 70 డాలర్లు లభించినవి. రేపటి ఉపన్యాసమునప్పుడు మఱికొంత లభించునని ఆశించుచున్నాను.

7-వ తేది నుండి 19-వ తేదివఱకు బోస్టనులో ఉపన్యాసములు ఏర్పాటైయున్నవి. కాని వారు ధనమును చాల తక్కువగ నిత్తురు.

నిన్ననే నే నొక హుక్కాగొట్టమును పదుమూడుడాలర్లు పెట్టి కొన్నాను. దయచేసి ఈసంగతిని నాయన పోపుగారికి చెప్ప

* ఈరెండు వాక్యములను ఎడమవైపు మార్జినులో అడ్డముగ వ్రాయబడి యున్నవి.

వలదు. కోటు ఖరీదు 30 డాలర్లగును. నాస్థితి చాల మేలుగా నున్నది. భోజనము......చాలినంత ధనము. ఇకమీాదట ఉప న్యాసములు ముగియుచుండగనే త్వరలోనే బ్యాంకులో కొంత పైకము వెయ్యగలనని ఆసించుచున్నాను.

......నేటి సాయంకాలము శాకాహారుల విందు సమా వేశములో ఉపన్యసింపబోవుచున్నాను.

సరి, నేనొక శాకాహారిని. అది దొరికినప్పుడు నేను దానినే కోరుదును. ఎల్లుండి లైమనుఆబట్టుగారింట విందుకు రమ్మని నాకు మఱొక ఆహ్వానము కూడ నున్నది. రానురాను నా కిచ్చట దినములు చాల సుఖముగ గడచుచున్నవి. బోస్టనులోకూడ కాల మింత సుఖముగనే గడచు నని విశ్వసించు చున్నాను. కాని విసుగెత్తించుచున్న దే మనగా ఉపన్యసించుట యనెడు పాడు పని, ఎట్లో 19 వ తేది దాటుదుమేని ఒక్కదూకు బోస్టనునుండి......చికాగోకు......అటు తర్వాతనే నాకు ఊపి రాడును. విశ్రాంతి చేకూరును, రెండు మూడువారములవిశ్రాంతి, ఊరక కూర్చుండి మాటాడుచుందును. మాటలాడుచు ఆడుచు పొగత్రాగుచుందును.

మఱొక మాట. మీా న్యూయార్కు ప్రజలు చాల మంచి వారు. ప్రతిభకంటె ధన మెక్కువగ కలవారు, అంతే.

హార్వర్డు విశ్వవిద్యాలయమున విద్యార్థిసదస్సులో ఉపన్య సింపబోవుచున్నాను. బోస్టనులో మాా దుపన్యాసములు, హార్వ ర్డులో మాా దుపన్యాసములు — అన్నియు శ్రీమతి బ్రీడు సతి ఏర్పాటు చేసినవే. ఇక్కడకూడ కొన్ని ఏర్పాట్లు చేయు చున్నారు. కావున చికాగోకు పోవుదారిలో నేను మరల న్యూ యార్కుకు వత్తును. వచ్చి మాటలతో కొన్ని గట్టిదెబ్బలు కొట్టి లభించిన ముల్లెను సంచిలో వేసికొని చికాగోకు ఎగిరి పోవుదును.

చికాగోలో దొరకని వస్తువులు ఏవైనను నీకు న్యూయార్కునుండి గాని బోస్టనునుండి గాని తేవలసియున్నచో తక్షణమే వ్రాయవలసినది. నాచేతిలో డాలర్లు కొల్లగ నున్నవి. నీకేమి కావలసియున్నను నిమిషములో పంపగలను. అడుగుట బాగుండ దని సంకోచింపకు. నాయొద్ద టక్కరితనములు లేవు. సోదరుడనైన చోట సోదరుడనే. ఈ లోకములో నేను ద్వేషించునది ఒక్కటే, వంచన.

మీప్రియసోదరుడు
వివేకానంద

## 90

(ప్రొఫెసరు జాన్హెన్రీరైటుగారికి)

న్యూయార్కు,
మే 4, 1894.

ప్రియఅధ్యాపకా,

దయతో మీరు వ్రాసిన జాబు ఇప్పుడే చేరినది. మీరు చెప్పినట్లు చేయుట నాకు మిక్కిలి సంతోషకర మని మీకు నేను తెలుప నక్కఱ లేదు.

కర్నలు హిగ్గిన్సన్‌గారు వ్రాసిన జాబుకూడ చేరినది. ఆయనకు జవాబు వ్రాసెదను.

ఆదివారము [మే 6] నాడు బోస్టనులో నుందును. సోమవారమునాడు శ్రీమతి హౌసతిమహిళామండలిలో ఉపన్యసింతును.

సత్యాయుత భవదీయ
వివేకానంద

## 91

(శ్రీ అభేదానందస్వామికి)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
1894.

ప్రియకాళీ,

నీ జాబువలన తెలియనైన సంగతుల కన్నిటికి కృతజ్ఞుడను. ఆ తంతివార్త ట్రిబ్యూనుపత్రికలో పడినదను సంగతి నాకు తెలియు లేదు. నేను చికాగోను విడిచి ఆఱు నెల లైనవి. అచటికి మరలుటకు తీఱుబడి ఇంకను కలుగ కున్నది. కావున అన్నివార్తలు తెలిసికొను వసతి లేదాయెను. నిజమునకు నీవు చాల పాటు పడితివి. ఇందుకు చాలినంతగ కృతజ్ఞతను తెల్పుకొనుట నా కెట్లు శక్య మగును? మీ రందఱును అద్భుత కార్యకుశలతను చూపితిరి. శ్రీరామకృష్ణుని వాక్కులు అసత్యము లెట్లగును? మీలో అద్భుతోత్సాహము కలదు. శశిసన్యాలునుగూర్చి ఇంతకుపూర్వమే వ్రాసియున్నాను. శ్రీరామకృష్ణననుగ్రహముచే ఏది గాని మన కంటబడక యుండదు. ఒకకక్షునుగాని అతనికి నచ్చినదేనినైన గాని నెలకొల్పునుగాక! ఏమి హాని కల్గును? "శివా వః సన్తు పన్థానః" "మీ దారులు శుభప్రదము లగుత!" ఇక రెండవ విషయము: నీజాబులోని ధోరణి నా కర్థము కాలేదు. మనకొక మఠమును నిర్మించుకొనుటకై నేను సొంతముగ ధనమును ప్రోగు చేసెదను. అందుకు ప్రజలు నన్ను నిందింతురేని, ఆ నింద ఏ విధమునగాని మనల నేమిచేయునో నాకు తెలియుటలేదు. మీచిత్తములను మీరు నిశ్చలములుగను ఉన్నతస్థాయిలోను నిల్పుకొని యున్నారు. అందువలన మీ కెట్టి హానియు కలుగదు. మీలో మీకు పరస్పరము నిరతిశయప్రేమ కల్గియుండుత. ప్రజలుచేయు దూషణభూషణములపట్ల ఉపేక్ష కలిగియుండిన చాలును. మన

ఉద్యమమునందు కాళీకృష్ణబాబునకు గాఢానురాగము కలదు. ఆయన గొప్పవాడు. నా ప్రత్యేకప్రేమను దయచేసి ఆయన కంద జేయుము. దేవునిదయచే మీలో అనైకమత్యము కల్గకుండునంత వఱకు మీ కెట్టి ఆపదయు లేదు, నమ్ముడు. "రణే వనే పర్వత మస్తకే వా" "కయ్యమున గాని కాననమున గాని పర్వతశిఖర మున గాని". "శ్రేయాంసి బహువిఘ్నాని" "సదుద్యములకు ఆటంకములు పెక్కు లుండును". అదియంతయును సహజమే ప్రగాఢమనశ్శాంతిని నిలుపుకొండి. నీచులు మిమ్ముగూర్చి ఏ మన్నను ఇంచుకేని లక్షింపకుడు. ఉపేక్ష ఉపేక్ష ఉపేక్ష! వివరము లన్నియు ఇంతకుముందే శశికి (రామకృష్ణానందునకు) వ్రాసియున్నాను. దయచేసి వార్తాపత్రికలను చిన్నగ్రంథములను ఇక పంపకు. బెంగాలీసామెత చెప్పినట్లుగా "ఊకదంచు రోకలిని నాకమునకు చేర్చిన దాని దంపుడుపని అచటను సాగుచుండును". భారతదేశములోవలె ఇచ్చటను ఆ అల్లాటమే. అచ్చటకంటె ఇచ్చట అధిక మే మనగా ఒరుల బరువులను మోయుచుండుట. ప్రజలపుస్తకములకు ఈదేశమున కాతాదారులను నే నెట్లు సంపా దింపగలను? ఇచ్చట పెక్కండ్రలో నే నొక్కడను, అంతే. అంత కన్న హెచ్చేమియు లేదు. ఈదేశమున పత్రికలును అటువంటివి ఇతరములును నన్ను గూర్చి ఏమి వ్రాసినను వానిని నేను అగ్నిభగవానునకు అర్పింతును. నీవును అట్లే చేయుము. అదే సరియైన దారి.

గురుమహారాజుపనికై ప్రజలలో కొంతప్రకటనము ఆవశ్యక మాయెను. అది జరిగినది. అంతవఱకు అది మేలే. పామరుల మూక మనలనుగూర్చి ఏమి ప్రలాపించినను నీవు ఇంచుకేని లక్ష్య పెట్టకుండ వలెను. నేను ధనమునే ప్రోగుపోసికొనుచున్నానో, వారు చెప్పు ఇతరకార్యములలో దేనినైనను చేయుచున్నానో ఈ కొన్నిస్కాల అభిప్రాయాలు (గురు)దేవుని కార్యమును ఆటంకపఱచునా? ప్రియసోదరా, నేను వృద్ధుడ నగుచున్నాను.

నీ వింకను పసివాడవుగనే ఉన్నావు. అట్టివారి అభిప్రాయములందును ప్రతిపాదనలందును నాకున్న గౌరవమే మాత్రమో, ఇందును బట్టి నీవూహింపవచ్చు. మీరు నడుముకట్టి నాకు అండగా నావెంబడి నుండువఱకు భూలోకప్రజలందఱును కలిసి మనల నెదిరించినను భయము లేదు. నాకు ఇంతమట్టుకు అర్థమగుచున్నది: నేను చాల ఉదారవైఖరిని అవలంబింపవలెను. మీకు తప్ప వేఱెవ్వరికిని నేను వ్రాయకూడ దని తోచుచున్నది. మఱొకమాట. గుణనిధి ఎచ్చట నున్నాడు? అతనిని కనిపట్టుటకు ప్రయత్నింపుడు, పరిపూర్ణదయతో అతనిని మరమునకు చేర్పుడు. అతడు చాల చదువుకొన్నవాడు. చాల ఋజుత్వము కలవాడు. రెండుతుండ్ల భూమిని సంపాదించుటకు మీరు మీచేతనైనంత ప్రయత్నింపవలెను. జను లేమైన నందురు గాక! ఎవడు గాని పత్రికలలో నా కనుకూలముగ వ్రాయనీ, ప్రతికూలముగ వ్రాయనీ, నీ వించుకయు లక్ష్యపెట్టకూడదు. ప్రియసోదరా, మరల మరల నిన్ను ప్రార్థించుచున్నాను. బుట్టలునిండు వార్తాపత్రికలను నా కింక పంపవలదు. విశ్రాంతిమాట నెత్తగలవు? ఈ దేహమును విడిచిపెట్టినప్పుడే క్షణకాలవిశ్రాంతి మనకు కల్గును. కాబట్టి సోదరా, నీ ఈ ఉత్సాహముతో చుట్టునున్న దేశమంతయు ఉత్సాహముతో పొంగిపోవునట్లుగ ఒక్కసారి ఉత్సవమున కేర్పాటు చేయుము. భేష్, భళీ! దూషకులతండము పూర్తిగా ప్రేమప్రవాహపు పొంగుచే కొట్టుకొనిపోవును. మీరు ఏనుగులరు. చీమకాటుకు మీకు భయమెందులకు?

నీవు పంపిన అభినందనపత్రము నా కంది ఎంతో కాలమైనది. దానికి జవాబును ప్యారీబాబుకు పంపియున్నైనది.

జ్ఞప్తియుంచుకో — కన్నులు రెండు, అట్లే చెవులును రెండు. కాని నోరొక్కటే. ఉదాసీనత, ఉదాసీనత, ఉదాసీనత! ''న హి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి'' ''నాయనా,

మంచి చేసినవాని కెన్నడును దుర్గతి కలుగదు". అయ్యో! భయపడుటయా! సోదరా, ఎవరిని చూచి మనము భయపడ వలెను! ఇచ్చటి పాదిరీలును వారివారును ఘోషించి ఘోషించి నోరు మూసికొనిరి. విశ్వమంతయును అట్లే అగును.

నిన్దన్తు నీతినిపుణా యది వా స్తువన్తు,
లక్ష్మీ స్సమావిశతు, గచ్ఛతు వా యథేష్టమ్,
అద్యైవ వా మరణ మస్తు, శతా న్తరే వా,
న్యాయ్యా త్పథః ప్రవిచల న్తి పదం న ధీరాః ॥

నీతినిపుణులు నిందింపనీ, స్తుతింపనీ, లక్ష్మి దాని యిచ్ఛ చొప్పున రానీ, పోనీ, మరణము నేడే కలుగనీ, నూరేండ్లకు పిమ్మట సంభవింపనీ, ధీరులు న్యాయ్యమార్గమునుండి అడుగు కదల్పరు. (భర్తృహరి నీతిశతకము).

సామాన్యప్రజలతో నీవు కలిసియుండుట సైత మక్కఱ లేదు. వారిని యాచింపను వలదు. భగవంతుడు సర్వము నిచ్చు చున్నాడు. ఇకముందును ఇచ్చుచుండగలడు. భయ మేమి, తమ్ముడా? ప్రబలవిఘ్నములను దాటియే ఘనకార్యముల సాధింప నగును. "హే వీర, కురు పౌరుష మాత్మనః, ఉపేక్షితవ్యా జనాః సుకృపణాః కామకాఞ్చనవశగాః" "ఓ వీరా, పౌరుషము వహింపుము. కామలోభదాసులైన కృపణులు ఉపేక్షింపబడ దగినవారు". నే నిప్పు డీ దేశమున స్థిరముగ నెలకొంటిని. కావున సాహాయ్య మక్కఱ లేదు. కాని మి మ్మందఱను నేను ప్రార్థించున ది దొక్కటే. సోదరప్రేమచే నాకు తోడ్పడవలె ననెడి ఆత్రము మీలో ఏ పౌరుషమును లేపినదో, ఆ పౌరుషమును భగవత్సేవకు వినియోగింపుడు. మనసును విప్పి చెప్పుట తప్పక లాభదాయక మని నీకు తోచినప్పుడే తప్ప అట్లు చెప్పకు. అత్యంతప్రబల శత్రువుతో మాటాడునప్పుడైనను సరే ప్రియమును హితము నైన భాషను ఉపయోగింపుము. ధనకాంక్ష సుఖరతి కీర్తిపిపాస

మానవుల కందఱికిని మిక్కిలి సహజమే. ఉభయసేవలకును (భగవత్సేవ, కామినీకాంచనసేవ) అది అనుకూలించునేని సకల మానవులును ఆత్యంతికోత్సాహమునే వహింతురు. లోకకల్యాణమును తప్ప వేఱు దేనిని కోరక పరగుణపరమాణువులను పర్వతీకరించి పని చేయుశక్తి మహాయోగికి మాత్రమే యుండును. "పరగుణపరమాణూన్ పర్వతీకృత్య, అపి చ త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయన్తః" మొ॥ (చూ. భర్తృహరి నీతిశతకము). ఆత్మేతరమే సర్వము అని భావించుచు అజ్ఞాననిమగ్నబుద్ధులగు మొద్దన్నలు వారి పిల్లచేష్టలను చేయుచుందురు గాక! వేడి తాళలేని తక్షణమే వారు తమంతటనే విడిచిపెట్టుదురు. వారిని చంద్రునిమీఁదికి ఉమ్మివేయనీ. అది వారి మొగాననే వచ్చి పడును. "శుభం భవతు తేషాం" "వారికి శుభము కలుగుత". వారిలో సార మేమేని యున్నచో వారి గెల్పు నెవ్వరు నిరోధింపగలరు? అట్లు గాక వారివి అన్నియు కడుపుమంటకూతలే యగుచో అన్నియు నిరర్థకములే యగును. హరమోహనుఁడు జపమాలను పంపినాడు. సరి. కాని మనదేశములో అమలులోనుండు మతమువంటి మతము ఇచ్చట చెల్ల దని తెలిసికో. ప్రజలరుచి కనుగుణముగ మీరు దానిని సరిచేయవలెను. వారినందఱిని హిందువులుగ కం డని చెప్పుదురేని వారు మీనుండి తొలగిపోవుదురు. మిమ్ము ద్వేషింతురు. మనము క్రైస్తవపాదిరీలనుండి తొలగి వారిని ద్వేషించుచున్నట్లుగా. హిందూశాస్త్రగ్రంథములందలి కొన్ని ఆశయములు వారికి నచ్చినవి. అంతే. అంతకంటె ఎక్కువ ఏమియు లేదు. ఆవిషయమును తెలిసికో. మగవారిలో అత్యధికసంఖ్యాకులు మతము మున్నగువానిని గూర్చి బాధపడుట లేదు. మతవిషయములలో మహిళలకు కొంత ఇష్ట మున్నది. అంతే, వారి ఇష్టముగూడ అంత యెక్కువ కాదు. అద్వైతసిద్ధాంతమున నమ్మకము కొన్నివేలమంది ప్రజలకు కలదు. ప్రమాణగ్రంథములనుగూర్చి గాని వర్ణవ్యవస్థనుగూర్చి గాని మహిళలనుగూర్చి గాని

మీకు వాడుకపడియుందు దుర్బోధములైన పిచ్చిప్రసంగములు కావింతురేని వారు మిమ్ము వీడిపోవుదురు. ఏది గాని మెట్టు మెట్టుగా క్రమముగా పురోగమించును. ఓర్పు, విశుద్ధి, దీక్ష.

మీ
వివేకానంద

## 92

(ప్రొఫెస్సరు జాన్రైట్ గారికి)

17 బీకన్వీధ,
బోస్టను,
మే 1894.

ప్రియ అధ్యాపక్జీ,

ఆ చిన్న పుస్తకములును జాబులును మీ కిప్పటికి చేరి యుండును. మీకు వలయునేని భారతదేశసంస్థానాధిపతులును మంత్రులును వ్రాసిన కొన్నియుత్తరములను చికాగోనుండి పంపుదును. ఈమంత్రులలో ఒకరు కొన్నాళ్ల క్రింద అభినిపరిషత్తులో (ఓపియమ్కమిషను) అధికారులలో నొకరుగ నుండిరి. ఆ పరిషత్తు వారు రాయల్ కమిషను ఆధ్వర్యమున భారతదేశమున పనిచేయుచుండిరి. వలయునేని వారిచేత మీకు వ్రాయింతును, నేను వంచకుడను కానని. కాని, సోదరా, దాచుటయు, అణచుటయు, లేదుపొమ్మనుటయు — ఇదే మన జీవితలక్ష్యము.

పరిత్యజించుటయు ప్రతిగ్రహింపకుండుటయు మనకు హితము. నాబుఱ్ఱలో ఈవెఱ్ఱి లేకుండెనేని నే నిచ్చటికి వచ్చియే యుండను. విశ్వమతమహాసభకు మనవారు నన్నంపగోరినప్పుడెల్ల వలదనుచుండిన నేను అందు పాల్గొనుటకు కారణము అది నాఉద్యమమునకు తోడ్పడవచ్చుననెడి ఆశయే. "నేను ఆసభకు పోవచ్చు పోకపోవచ్చు. ఇష్టమున్నచో నన్నంపుడు" అని

వారితో చెప్పియే వచ్చితిని. నాకు పూర్ణస్వాతంత్ర్య మిచ్చియే వారు నన్నంపిరి.

మిగిలిన దానిని మీరు నిర్వహించితిరి.

సదయసఖా, మీకు అన్నివిధముల సంతృప్తి చేకూర్పవలసినట్లు నైతికముగ నేను అప్పుపడియున్నాను. ఇక తక్కిన ప్రపంచము ఏ మన్నను నేను లక్ష్యపెట్టను. సన్న్యాసి తన్ను తాను కాపాడుకోకూడదు. కాబట్టి ఆ జాబులను గాని ఆ పుస్తకములలో దేనినైన గాని ఎవరికిని చూపకు డనియు ప్రకటింపకు డనియు మిమ్ము వేడుకొనుచున్నాను. ముసలిపాదిరి ఎత్తిన యెత్తులను నేను లక్ష్యపెట్టను. కాని మజుందారును ఆవేశించిన ఈర్ష్యాజ్వరము నన్ను భయంకరముగ కదిపివైచినది. అతనికి ఇప్పటికంటె హెచ్చు తెలివి కలుగవలె నని ప్రార్థించుచున్నాను. ఏలయన అతడు గొప్పవాడు, మంచివాడు, బ్రతికినన్నినాళ్లు మేలు చేయుటకే పాటుపడినవాడు. నాగురుదేవుని సూక్తులలో నొకటి ఇపుడు దీనిచే ఋజువైనది. "పొగమసి నిండిన గదిలో నున్నప్పుడు నీ వెంత మెలకువతో నున్నప్పటికిని కొన్ని నల్లచుక్కలు నీ గుడ్డలకు అంటుకొని తీరును". అట్లే ఈలోకమున నున్నంత వఱకును పవిత్రతాసౌజన్యముల పాటింప నెంతపాటువడినను మానవుని ప్రకృతిలో నొకభాగము నీచమార్గప్రవణము కాక తప్పదు.

ఐహికమార్గమునకు విరుద్ధమైనది దేవునొద్దకు చేర్చు మార్గము. భగవత్సేవయు కామినీకాంచనసేవయు ఏకకాలమున లభింపగన్నవారు లేరు, లేనే లేరు.

నేను మతప్రచారకుడనుగ నుండినది లేదు, ఇక నెప్పుడును ఉండబోను. నా ఉనికిపట్టు హిమాలయములలో ఉన్నది. "ఓ దేవా. నాసోదరు లనుభవించు భయంకరదుఃఖమును చూచితిని, విమోచనమార్గమును వెదకితిని, కనుగొంటిని, కనుగొన్న

ప్రతిక్రియను చేయుటకు నా శక్తికొలది ప్రయత్నించితిని, నెగ్గనైతిని. కావున నీ సంకల్పమే నెఱవేఱుత'' మని నేను హృదయపూర్వక ముగ చెప్పగలను, చెప్పగలంతగ నన్ను నేను తృప్తిపఱచు కొంటిని.

మిమ్ము మీవారిని భగవంతుడు సదా అనుగ్రహించు చుండును గాత.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

541, డియర్బార్న్ అవెన్యూ, చికాగో
రేపో ఎల్లుండియో చికాగోకు పోదును.

భవదీయ
వి.

## 93

(శ్రీ శారదానందస్వామికి)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
మే 20, 1894.

ప్రియశరత్తుకు,

నీ జాబు చేరినది. శశి క్షేమము తెలిసి సంతోషించినాను. మీ కొక వింత సంగతిని తెలిపెదను: మీలో ఎవనికైనను అనారోగ్యము కలిగినప్పుడు అతడుగాని మీలో మఱొకడుగాని ఆ రోగగ్రస్తుని మీ మనోదృష్టికి తెచ్చుకొని అతడు పరిపూర్ణా రోగ్యవంతుడుగ నున్నట్లు మానసికముగను సుదృఢముగను భావింపవలసినది. అతనికి తెలియకే మీరు అట్లు భావన చేయ వచ్చు. అతనికి వేలకొలది మైళ్ళ దూరమున ఉండియు మీ రట్లు భావన చేయ వచ్చు. ఆ భావన అతిశీఘ్రముగ అతనిని రోగ

నిర్ముక్తునిగ చేయును. దీనిని జ్ఞప్తియుంచుకొని ఇక నెప్పుడును రోగులుగ నుండకుడు. ఈపాటికి మీకు పైకము చేరియుండును. మీ కందఱకును సమ్మత మేని, మఠమునకై నేను పంపిన పైకము నుండి 300 రూపాయలను గోపాలున కీయ వచ్చును. ఇక పంపుటకు నాయొద్ద ఏమియు ఇప్పుడు లేదు. నేను మదరాసును విచారించుకొనవలసియున్నది.

కూతుంౘ్రడ పెండ్లికై సన్యాలుకు అంత విషాద మెందుకో నే నర్థము చేసికొనలే కున్నాను. ఏ సంసారమునుండి తాను విముక్తి నొందగోరుచున్నాడో ఆ మలినసంసారములోనికే తనకూతుంౘ్రడను లాగబోవుచున్నాడు. అందుంగూర్చి నాకు శక్యమగు అభిప్రాయ మొక్కటే. అది హేయము అనుటే! యువకునివిషయమున గాని, యువతివిషయమున గాని పెండ్లి అను పేరే నాకు వెగటు. బంధములో పడుటకు నే నొకనికి తోడ్పడవలయుననియా నీ ఆశయము! మూర్ఖా, నా తమ్ముడు మోహన్ పెండ్లాడినను అతనిని నేను తఱిమి వేయుదును. ఆ విషయమున నాది చాల గట్టి తీర్మానమే.

భవదీయప్రేమయుత
వివేకానంద

## 94

(ప్రొఫెసరు జాన్హైౘ్రీరైటుగారికి)

541, డియర్బారన్ అవెన్యూ,
చికాగో,
మే 24, 1894.

ప్రియ అధ్యాపక్జీ,

రాజపుత్రస్థానమున మా సంస్థానాధిపతులలో నొకరైన ఘనశ్రీ ఖేత్రీ మహారాజావారు వ్రాసిన యొక జాబును ఇందు

వెంట మీకు పంపుచున్నాను. భారతదేశసంస్థానములలో అన్నిటి కంటె పెద్దదైన జునగడమునకు మాజీమంత్రియు భారతదేశపు గ్లాడ్‌స్టన్ అనబరగువాడును అగు అభినిపరిషదధికారి వ్రాసిన జాబునుకూడ పంపుచున్నాను. నేను వంచకుడను కానను విష యమున నమ్మకమును మీకీ రెండుజాబులును కలిగించు నను కొందును.

ఒక విషయమును మీకు చెప్పమఱచితిని. మజుందారు పార్టీనాయకుని*తో నేనెన్నడును నన్ను ఏకీభవింపజేసికొనినది లేదు. ఏకీభవింపచేసికొంటి నని అతడు చెప్పకొను అతని మాట నిజము కాదు.

చదువుకొన్నతర్వాత ఈజాబులను మీరు దయతో నాకు పంపివేయగలరని ఆసించుచున్నాను — ఆగ్రంథకము తప్ప — అది నాకు లక్ష్యము లేదు.

ప్రియమిత్రమా, నేను యథార్థసన్న్యాసి ననుటకు వలసిన ప్రతిరుజువును మీకు చూపవలసిన బాధ్యత నాకు కలదు. కాని అది మీకు మాత్రమే. తక్కిన పామరుల మూక నన్ను గుఱించి ఏమన్నను ఏమనుకొన్నను నేను లక్ష్యపెట్టను.

"కొందఱు నిన్ను యోగి యందురు. కొందఱు చండాలు డందురు. కొందఱు వెఱ్ఱియందురు. కొందఱు రాక్షసుడవందురు. కావున ఎవరిని లక్ష్యపెట్టక సూటిగ నీపనికి పొమ్ము," అన్నాడు మా యతిశ్రేష్ఠులలో నొకడు, అతడు భారతదేశమున మొదటి సార్వభౌముడుగనుండెను, పేరు భర్తృహరి, ఆ ప్రాచీన కాలముననే సన్న్యసించినవాడతడు. భగవంతుడు మిమ్ము సదా

* కేశబ్చంద్రసేను తాబోలు.

అనుగ్రహించును గాక! మీపిల్ల లందఱికి నాముద్దులు. పరమోత్తమురాలైన మీశ్రీమతికి నా అభివందనములు.

సదా భవదీయమిత్రము
వివేకానంద

మఱిమాట: పండిత శివనాథశాస్త్రివర్గమువారితో నాకు సంబంధ ముండినది. కాని ఆసంబంధము సంఘసంస్కారవిషయములమట్టుకే. 'ఎమ్.' 'సి' 'ఎస్'—అను వీ రందఱును నిష్కపటులు కా రని సదా నాఅభిప్రాయము. ఆయభిప్రాయమును మార్చుకొనవలసినకారణము ఇప్పటికిని లేదు. ఆధ్యాత్మికవిషయములలో నామిత్రుడైన పండిట్జీతోసైతము నేను అత్యంతభిన్నాభిప్రాయుడను. మా అభిప్రాయములు భేదిల్లిన విషయములలో "సన్న్యాసము" ముఖ్యమైనది. అది పరమోన్నతలక్ష్య మని నే నందును. అది పాప మని అత డనును. సన్న్యసించుట మహాపాప మని బ్రాహ్మసమాజీయుల మతము.

మీ
వి.

మీదేశములో క్రైస్తవవిజ్ఞానము క్రిస్చియనైన్సు వలె కల్కత్తాలో బ్రాహ్మసమాజము కొంతకాలము వ్యాప్తిచెంది పిమ్మట అంతరించినది. అది అంతరించినందుకు నాకు సంతోషమును లేదు, దుఃఖమును లేదు. అది తన పనిని నెఱవేర్చినది. సంఘసంస్కారమే దానిపని. ఆధ్యాత్మికవిషయములలో బ్రాహ్మసమాజము కాసు చేయదు. కావున అది అంతరింపవలసినదే. అది అంతరించినందులకు కారణభూతులైనవారిలో నే నొకడ నని "మ"—అభిప్రాయపడునేని అది పొరపాటే. వారు చేసిన సంస్కారములవిషయమున నేనిప్పటికిని ఎంతో సానుభూతి కలవాడనే. కాని వారి 'అవివేకమతము' సనాతనవేదాంతమునెదుట నిలువ

లేక పోయినది. నే నేమి చేయుదును ? అది నాతప్పా? "మ"— తన వార్ధక్యమున బాలిశ బుద్ధి కలవాడైనాడు. అతని జిత్తులు మీ క్రైస్తవపాదిరీలజిత్తులకంటె ఇంచుకయు మేలైనవి కావు. సర్వేశ్వరుడు అతనిని అనుగ్రహించి శ్రేయోమార్గమును చూపును గాక!

మీ
వివేకానంద

మీరు అన్నిస్క్వాముకు ఎప్పుడు పోవుదురు ? ఆస్టినుకు బైముకు నాముద్దులు. మీ దేవేరికి నావందనములు. ఇక మీయెడ నాకృతజ్ఞతయు భక్తియు అనిర్వాచ్యములైనవి.

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 95

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

చికాగో,
మే 28, 1894.

ప్రియ అళసింగా,

నీకు జవాబును ఇంతకంటె ముందుగా వ్రాయలేక పోయితిని. ఏల యన న్యూయార్కునుండి బోస్టనుకు, బోస్టను నుండి న్యూయార్కునకు సుడియుచుంటిని. అంతేకాక నరసింహుని జాబునకై నిరీక్షించుచునుంటిని. నేను భారత దేశమునకు మరలి వచ్చు టెప్పుడో ఎఱుగను. నావెనుకనుండి నాకు దారిచూపుచున్న దేవునకే సర్వమును విడిచిపెట్టుట మేలు. నేను ప్రాణములతో లేనట్లు భావించి నేను లేకుండనే కృషిని సాగింప ప్రయత్నింపుడు. ఎవరి కొఱకుగాని దేనికొఱకుగాని వేచియుండకుడు. మీకు చేత

నైనదేదో దానిని చేయుము. ఏఒక్కనిమీదనైనను ఆధారపడి ఆశాసౌధమును నిర్మించుకొనకుము. నన్ను గుఱించి వ్రాయుటకు ముందు నరసింహాచారిని గుఱించి చెప్పెదను. అతడు ఎందును నెగ్గ లేనివాడైనాడు....అయినను తుది దశలో నుండగా నా సాయ మర్థించుచు జాబు వ్రాసినాడు. నాచేతనైనంతవఱకు సాయమును చేయుటకే ప్రయత్నింతును. ఈ లోగా అతడు మనదేశమునకు మరల చేరుటకు పైకమును సాధ్యమైనంత శీఘ్రముగ పంపు డని నీవు అతనిచుట్టములతో చెప్పుము. ... అతడు ఆపదలోనున్నాడు. పస్తుండనీయక నేను చూచుకొనెదను లే.

ఇచ్చట ఉపన్యాసకార్యక్రమమును అత్యధికముగ సాగించి నాను. ... ఇచటి ధనవ్యయము విపరీతము. ప్రతిచోటను మహో దాత్త మహోన్నత కుటుంబములవారు సదా నన్ను ఉపచరించు చున్నప్పటికిని పైకము వాయువేగమున రావలసియున్నది.

ఈ వేసవిలో నే నీ దేశమును విడిచిపోవుట జరుగునో జరుగదో నే నెఱుగను. చాలవఱకును జరుగ దేమో! ఈలోపుగా అంగనివహమును నిర్మించి మనప్రణాళికలను ముందుకు సాగింప పాటుపడుము. సర్వమును నీకు శక్యమే అని విశ్వసింపుము. భగవంతుడు మన పజ్జ నున్నా డని తెలిసికొండి. ధీరులారా, ముందంజ వేయుడు.

నేను స్వదేశములోనే చాలినంత ప్రశంస గడించితిని. మెప్పు కలుగనీ కలుగకపోనీ నిదురింపకుడు. సడలుపాఱకుడు. మన ప్రణాళికలలో లవలేశమైనను ఇంతవఱకు నిర్వర్తితము కాలే దను విషయమును జ్ఞప్తియుంచుకొండి.

మీ పలుకుబడిని చదువుకొన్న యువకులమీదికి పర్వింపుడు. వారి నొక్కటిగా చేర్పుడు. వారిని సాంగోపాంగమైన సంస్థగా రూపొందింపుడు. మహిమత్యాగకృత్యములచేతనే మహిమలక్ష్యములు సాధింప నగును. స్వార్థగంధ ముండకూడదు.

పేరుప్రతిష్ఠ లక్ష్యము లేదు; నాకు గాని, మీకు గాని, నా గురుదేవునకుగాని, పాటుపడుడు, ఆశయమును పన్నాగమును అమలు పఱపుడు. నా వత్సలారా, ధీరోదాత్తధర్మాత్ములారా, మన మనోరథచక్రములను ముందుకు పాఱించుటకై మీ భుజములను పూన్పుడు. పేరుకై కీర్తికై అర్థరహితములైన ఎట్టి ప్రయోజనములకైనను సరే వెను దిరిగి చూత మని ఆగకుడు. అహంకార మమకారములను దులుపుకొని పాటువడుడు. గడ్డిపోచలను కలిపి దారముగ పేనినచో అప్పుడది మదపుటేనుగులను కట్టివైచుటకు సైతము చాలియుండు నను విషయమును జ్ఞప్తియుంచుకొండి. సర్వేశ్వరుడు మిమ్మందఱ ననుగ్రహించును గాక! దైవశక్తి మీలో ఇప్పటికే యున్న దని నా నమ్మకము. అది మీయందఱిలో అట్లే యుండు గాక! "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరాన్నిబోధత" "లెండి, మేలుకొండి, లక్ష్యము చేరువఱకు ఆగకుడు" అనుచున్నవి వేదములు. లెండి, లెండి, సుదీర్ఘమగు రాత్రి కాలము ముగిసిపోవుచున్నది. దినము సమీపించుచున్నది. కెరటము లేచినది. ఇక దానిపోటును ఏదియు ప్రతిఘటింపజాలదు. ఉత్సాహము, వత్సలారా, ఉత్సాహము. ప్రేమ నాబిడ్డలారా, ప్రేమ; విశ్వాసము; శ్రద్ధ; భయపడకుడు; అన్ని పాపములకంటె అధికమైన పాపము భయము.

అందఱికిని నా ఆశీస్సులు. మదరాసులో మన ఉద్యమమునకు తోడ్పడిన ఉదారాశయులందఱకును నా నిరంతరప్రేమను కృతజ్ఞతను అందింపుడు. పట్టు విడువకూడ దని వారికందఱికిని నాప్రార్థన. ఆశయములను వెదజల్లుడు. గర్వింపకుడు. దేనిని గూర్చిగాని పిడివాదము చేయకుడు. దేనికిని ప్రతికూలముగ వర్తింపకుడు. రసాయనవస్తువులను కలుపుట మనపని. అవి ఘనీభవించుట ఎట్లో ఎపుడో భగవంతునకే ఎఱుక. అన్నిటికంటె ముఖ్య మే మనగా ఇది—నాగెల్పుచేగాని మీగెల్పులచేగాని పొంగి

పోకుడు. ఘనకార్యములను చేయవలసియున్నది. ఇక చేయవలసి యున్నదానితో పోల్చిచూచిన ఇప్పటికి చేసిన దేపాటి? విశ్వసింపుడు, విశ్వసింపుడు. ఆజ్ఞ అందినది. భగవంతుని ఆజ్ఞ అందినది. భారతదేశము ఉన్నతి నందితీరవలెను. పేదలకును సామాన్యజనులకును, సుఖము కల్గించితీరవలెను. భగవంతుడు ఏరికైకొన్న ఉపకరణములు మీరని ఆనందింపుడు. పారమార్థిక పరత అనెడి వెల్లువ లేచినది. అడ్డు లేక అంతు లేక అన్నిటిని గ్రసించుచు భువిపై పాఱుచున్న ఆ వెల్లువ నాకు కనిపించుచున్నది. ప్రతిమానవుడును ముందు కేగును. సకలసుకృతములును ఆ ప్రవాహవేగమును బలపఱచును. ప్రతియొక్కరు దాని దారిని సుగమ మొనర్తురు. సర్వేశ్వరునకు జయము!...

నా కెట్టి సాయమును అక్కఱలేదు. కొంత పైకమును ప్రోగుచేయుటకు ప్రయత్నింపుడు. వింతబొమ్మలనుజూపు యంత్రములు దేశపటములు గోళములు మున్నగువానిని కొన్ని రసాయన వస్తువులను కొనుడు. ప్రతిదినము సాయంకాలము కొంతమంది పేదలను నిమ్నవర్గములవారిని చండాలురనుసైతము ఒకసమూహముగ సమావేశపఱచి, మొదట వారికి ఆధ్యాత్మికవిషయమును కొంత ఉపన్యసింపుడు. తర్వాత వింతరూపముల చూపు ఆయంత్రము మున్నగు పరికరములద్వారా వారికి భూగోళ ఖగోళాది శాస్త్రవిషయములను వారి వాడుకభాషలో నేర్పుడు. ఉత్సాహము నిండి తొణకుచుండు యువకులబృందమునొకదానిని తర్ఫీదుచేయుడు. మీలోని ఉత్సాహమును వారిలోనికి సంక్రమింపజేయుడు. ఈసంస్థ నానాటికి విరివిజెందునట్లు మెట్టుమెట్టుగ పెంపొందింపుడు. యావచ్ఛక్తితో పాటుపడుడు. నీరంతయు ప్రవహించి పోయినపిమ్మట ఏటిని దాటుద మని వేచియుండకుడు. వివిధపత్రికలను ముద్రించుట మున్నగునవి మంచిపనులే. సందేహము లేదు. కాని అసలుపని రవంతయైనను సదా సాగుచుం

డుటకంటెను గెలుచుచుండుటకంటెను వరిష్ఠమైనది. భట్టాచార్య్యనింట నొకసభను సమావేశపఱుపుడు. కొంతపైకము సమకూర్చుకొని ఇప్పుడు నేను చెప్పిన వస్తువులు కొనుడు. ఒకకుటీరమును అద్దెకు తీసికొనుడు. పనికి పూనుకొనుడు. ఈపని ముఖ్యము. పత్రికలప్రాముఖ్యము దీనికి వెనుకనే. సామాన్యజనులు మీవశమున నుండవలెను. ఆరంభ మల్పమైనందులకు భయపడకుడు. ఘనకార్యసిద్ధులు పిమ్మట వచ్చును. ధీరులుగ నుండుడు. మీసోదరులకు మీరు నాయకులమాద మని ప్రయత్నింపకుడు. వారికి సేవ చేయుడు. నాయకుల మౌదమను క్రూరోన్మాదముచే ఎన్నో నౌకలు జీవితమహార్ణవమున మునిగిపోయినవి. ఈవిషయమున అనగా నిస్స్వార్థులైయుండి పాటుపడుటలో ప్రత్యేకజాగరూకత వహింపుడు. నేను చెప్పనెంచినదాని నెల్ల వ్రాయలేకపోయితిని. కాని నాధీరవత్సలారా, సమస్తపరిజ్ఞానమును మీకు దేవు డొసగును. పనికిపొండి. నాశిశువులారా జగదీశునకు జయము.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 96

(ప్రొఫెసరు జాన్రైటుగారికి)

541, డియర్బారన్ అవెన్యూ, చికాగో,
జూను 18, 1894.

ప్రియఅధ్యాపక్షీ,

తక్కిన లేఖ లంపుట కైన ఆలస్యమునకు నన్ను మన్నింపుడు. ఇంతకన్న తొందరగ వానిని కనుగొనజాలకపోయితిని. ఒకవారముదినములలో న్యూయార్కుకు పోవుచున్నాను.

అన్నిస్థానములకు వత్తునో రానో నాకే తెలియదు. మరల నేను కోరువఱకును లేఖలను నాకు పంప నక్కఱ లేదు. నాకు ప్రతికూలముగ ఆ బోస్టనుపత్రికలో వెలువడిన వ్యాసముచేత శ్రీమతి బాగ్లీసతి కలవరపడుచున్నట్లున్నది.* డిట్రాయిట్టునుండి పత్రికప్రతిని నాకు అంపి ఆమె నాతో జాబులు జవాబులు చాలించు కొన్నది. భగవంతు డామెను అనుగ్రహించును గాక. నాయం దామె యెంతో కనికరము చూపుచుండినది.

నా సోదరా, మీవంటి దృఢహృదయులు అరుదు. ఇ దొక వింత చోటు — ఈ మనలోకము — పూర్తిగా క్రొత్తవాడను సర్టిఫికేట్లు (యోగ్యతాపత్రములు) సైతము లేనివాడను అగు నాపట్ల ఈదేశీయులు చూపినంతటి దయకు నేను భగవంతున కెంతయు కృతజ్ఞుడనై యున్నాను.

మీకు సదా కృతజ్ఞుడగు
వివేకానంద

మలిమాట : ఈ తూర్పిండియా తపాలుబిళ్లలు మీబిడ్డలకు, వారికి నచ్చినచో.

## 97

(శ్రీ హరిదాసు విహారీదాసు దేశాయిగారికి)

చికాగో,
జూను 20, 1894.

ప్రియ దివాన్జీ సాహెబుకు,

విశేషదయతో తాము వ్రాసిన జాబు నే డందినది. నా కటుసాహసోక్తులవలన ఔదార్యభరితమైన తమహృదయము

* ఆమె ఆవ్యాసమును స్వామిజీకి పంపి మౌనమువహించినది. ఆ మౌనముచే ఈ అపోహకలిగి స్వామిజీ నొచ్చుకొనెననుట స్పష్టము.

నకు బాధ కలిగించినందుకు మిగుల చింతిలుచున్నాను. మీమృదు సవరణలకు నేను తలయొగ్గెదను. “నేను మీపుత్రుడను, ప్రణమిల్లుచున్నాను. నాకు తెలియజెప్పుడు”.—గీత. నాప్రేమయే నాచేత ఆలాగు మాటాడించినది. దివాన్జీసాహేబు, ఇట్లని తాము బాగుగ నెఱుగుదురు. వెనుకనుండి ఆడిపోయువారు అన్యమార్గమున నాకెట్టి ఉపకారమును చేయలేదు. మీరు మిక్కిలి వారు నా కెగ్గుచేసిరి. నేను తమప్రతినిధి నని మనభారతప్రజలు అమెరికనులతో నోరెత్తి ఒక్కపలుకైన పలికిరికారు. మనవారు నన్ను తమప్రతినిధి నని చెప్పి, నాపట్ల కనికరము చూపినందుకు అమెరికనులకు ధన్యవాదములను కొన్నింటినైన తెలిపిరా? నేను వట్టి మోసగాడ నని అమెరికాకు వచ్చిన తర్వాతనే కాషాయము ధరించితి నని మనవారు చెప్పుచున్నారు. ఈప్రచారమువలన నాపట్ల అమెరికావారి ఆదరము తగ్గలేదు కాని వారు నాకు చేయుచుండిన ఆర్థికసాహాయ్యముమీద ఈప్రచారప్రభావము తీవ్రముగ సోకినది. నాకు సాయము చేయుటకై వారు చాపిన చేతుల నది వెనుకకు లాగించినది. నేనీ దేశమునకు వచ్చి ఒక సంవత్సరము గడచిపోయినది. నేను వంచకుడను కానని పల్లెత్తు మాట అమెరికనులతో తాము చెప్పిన బాగుండు నని మనదేశీయ ప్రముఖులలో ఒక్కరికైనను స్ఫురింప లేదే! నాకు అపకారమ్ము చేయు అవకాశమునకై సదా వెదకుచుండువారు పాదిరీలు. భారతదేశమున క్రైస్తవపత్రికలలో నన్నుగూర్చి ప్రతికూలముగ వ్రాయబడిన సంగతులను నిర్విరామముగ సేకరించుచు వాని నిచ్చట ప్రకటించుచున్నారు. నీవు గమనింపవలసిన విషయ మేమనగా భారతదేశమున క్రైస్తవులు వేఱు, హిందువులు వేఱు అను సంగతి ఇచ్చటివారికి తెలియదు.

నా సొంత ఉద్యమమునకు మూలధనమును సేకరించుటే నా అమెరికాయాత్రకు ప్రధానలక్ష్యము. మరల ఆ విషయము నెల్ల మీకు మనవి చేయుదును గాక.

పాశ్చాత్యులకును ప్రాచ్యులకును గల భేద మంతయు ఇది — వారికి ఏకదేశీయతాభావము కలదు — మనకు లేదు. అనగా పాశ్చాత్యమున నాగరకతయు విద్యయు అందఱికి నున్నవి. జనసామాన్యమందు అవి చొచ్చుకొనినవి. ఇండియాలోను అమెరికాలోను ఉన్నతవర్గాలప్రజలు ఒక్కస్థాయివారుగ నుందురు. కాని ఇరుదేశములందలి నిమ్నవర్గాలకు పరస్పర మున్న అంతర మపారము. ఆంగ్లేయులకు ఇండియాను జయించుట అంత సులభ మెట్లాయెను? వారు తా మేకదేశీయుల మను అధ్యవసాయము కలవారు. మనము అట్లు కాము. అదే కారణము. మన మహా పురుషులలో ఒకరు మరణించిన యెడల మఱియొక మహాపురుషు నికై మనము శతాబ్దములకొలది వేచియుండవలెను. వారిలో ప్రముఖులు అంతరించినంత తొందరగా ఆవిర్భవించుచును ఉందురు. నా దేశాభ్యుదయమునకై మా దివాన్జీసాహేబు దీర్ఘ కాలము జీవింపవలె నని నేను భగవంతుని ప్రార్థించుచునే యుందును. కాని ఆయన అస్తమించినప్పుడు ఆయనస్థానమునకు మఱొకనిని సంపాదించుటలోని కష్టము భారతజాతికి తెలియ నగును. ఆ కష్టము ఇప్పుడు మీరొనరించు సేవలను వారు వదలు కొనజాలకుండుటచేత స్పష్ట మగుచున్నది. మహాపురుషులసంఖ్య మనలో చాల తక్కువగ నున్నది. ఏల? ఎన్నుకొనబడతగిన ప్రముఖుల సంఖ్య వారిలో అంత హెచ్చుగా నుండుటయు మనలో నంత తక్కువగా నుండుటయునే కారణము. మన దేశములో 30 కోట్ల ప్రజ లున్నారు. మూడుకోట్లు నాలుగుకోట్లు ఆఱుకోట్లు జనసంఖ్య గల దేశములతో పోల్చి చూచిన మనలో ఎన్నుకోబడ దగిన మహాపురుషుల సంఖ్య చాల తక్కువ. ఏలయన వారిలో చదువుకొనిన పురుషులును స్త్రీలును అంత అధికముగ నున్నారు. మిత్రమహాశయా, నన్ను అపార్థము చేసికొనకు. మనలో ఈ పెద్ద లోప మున్నది. దానిని తొలగింప వలయును.

జనసామాన్యమునకు విద్య కఱపుడు. వారి నుద్ధరింపుడు— అపుడే ఏకదేశీయతాభావము శక్య మగును. పుండు ఎచ్చట నున్నదో మన సంస్కర్తలు గమనింపరు. దేశమును సంరక్షింప వలె ననిన వితంతువులకు వివాహములు చేయవలె నని వారి యుద్దేశము. వితంతువులకు లభించు మగలసంఖ్యనుబట్టి దేశము రక్షిత మగు నని యెంచెదరా? తప్పు మనమతమిది కాదు. ఏల యన బొమ్మ ఉన్నను లేకున్నను ఒక్కటే. ఉన్న లోప మంతయు ఇది — గుడిసెలందు వసించుచున్న అసలు భారతదేశీయులు తమ మానవత్వమును వ్యక్తిత్వమును మఱచిరి. హిందువు లేమి, మహమ్మదీయు లేమి, క్రైస్తవు లేమి తమపాదములక్రింద వారిని త్రొక్కిపెట్టిరి. ఎవరి జేబులందు కొన్నిరూకలు కలవో వారి పాదములక్రింద నలుగుచుండుట కొఱకే తాము పుట్టితి మని ఆ యభాగ్యులు తలపోయుచున్నారు. వారు కోల్పోయిన వ్యక్తిత్వ మును వారికి తిరిగి యొసగ వలెను. వారికి చదువు కఱపవలెను. విగ్రహము లుండనీ ఉండకపోనీ, వితంతువులకు చాలినందఱు భర్తలు లభింపనీ లభింపకపోనీ, వర్ణము మంచిది కానీ కాకపోనీ— ఈ ప్రశ్నలతో నన్ను నేను బాధించుకోను. ప్రతిజీవుడును తన మోక్షమునకు తానే కృషి సలుపవలెను. రసాయనపదార్థముల కలుపుట మన కర్తవ్యము. ఈశ్వరనిబంధనల ననుసరించి అవి ఘనీభవించును. వారి మెదడులందు మన మాశయములను చొప్పింతము. తర్వాతి పనిని వారే నిర్వర్తించుకొందురు. అనగా సామాన్యప్రజలకు విద్య గఱపవలెను. ఈ చిక్కు లున్నవి — ధనములేని ప్రభుత్వము ఏమియు చేయజాలదు, ఏమియు చేయదు. అందుచే పాలకులవలన మనము పడయగల సాయ మేమియు లేదు.

ప్రతిగ్రామములోను మనము ధర్మపాఠశాలలను నెలకొల్ప గల స్థితిలో నున్నా మనుకొనుడు. కాని నిరుపేదలైన బాలురు పొట్టపోసికొనుటకై పొలములకు పోయి నాగళ్లను చేబూనగోరి

నంతగా మీ బడులకు రా నిష్టపడరు. మన చేతులలో పైకము లేదు. చదువుటకై వారు వచ్చునట్లు చేయలేము. సమస్య చక్కబడుటకు దారి లే దనిపించును. చిక్కునుండి బయటపడుట కొక దారిని నేను కనుగొంటిని. అది యిది — "మహమ్మదుకడకు పర్వతము రానిచో పర్వతమునొద్దకు మహమ్మదే పోవలెను. పేదలు విద్యాశాలలకు రాలేనప్పుడు వారు పొలములలో నున్నను కర్మాగారములో నున్నను ఎచ్చట నున్నను విద్యయే వారియొద్దకు పోవలెను. ఎట్లు? నా సోదరులను మీరు చూచియున్నారు. అట్టి స్వార్థరహితులను విద్వాంసులను మహనీయులను నూఱులకొలదిగ నేను సంపాదింపగలను. ప్రజలలో ప్రతియొక్కనిగుమ్మము నొద్దకును మతమునే గాక విద్యనుగూడ అందజేయుచు వీరు గ్రామమునుండి గ్రామమునకు పర్యటించుచుండవలెను. ఇట్లే వితంతువులను స్త్రీలకు విద్యను బోధించువారినిగా తర్బీదుచేయవలె నను ప్రణాళికాబీజముకూడ నా మనసున కలదు.

పల్లెప్రజలు పగటివేళ తమతమ పనులను ముగించుకొని తమతమ ఊళ్లలో ప్రవేశించి ఒకచెట్టుక్రిందనో మఱొకచోటనో చుట్టలు కాల్చుచు ముచ్చటలతో కాలమును పుచ్చుచుందు రనుకొనుడు. విద్వాంసులగు ఈ సన్న్యాసులలో నిద్దఱు వారి నచ్చట నిలుపుకొని కేమరాను చేబూని ఖగోళచిత్రములనుగాని వేఱు బొమ్మలనుగాని వివిధదేశములవారి జీవితములనుండి చరిత్రలనుండి చూపుదు రనుకొనుడు. భూగోళములద్వారా దేశపటముల ద్వారా, నోటిమాటచేతనే ఎంతప్రబోధమును నిర్వర్తింపవచ్చును! దివాన్జీ నేత్రముక్కటే కాదు జ్ఞానమునకు ద్వారము. వీనులు సైతము ఆపాటి జ్ఞానప్రాపకములు కాగలవు. ఈవిధముగ వారికి ఆశయము లేర్పడును. నీతిపరత కుదురును. శ్రేయమునొందు ఆసపాటు కల్గును. ఇంతటితో మనపని ముగియును. శేషించిన దానిని వారు చేసికొందురుగాక. సన్న్యాసులచే ఈ త్యాగమును

చేయించునదేది? ఇట్టిపనికి పూనించునదేది, మతధర్మోత్సాహమే! ప్రతి క్రొత్తమతతరంగమునకును ఒక క్రొత్తకేంద్రము కావలయును. క్రొత్తకేంద్రముచేతనే ప్రాతమతమునకు మరల చైతన్యము కలుగును. మీ సంప్రదాయములను సిద్ధాంతములను త్రోసిరాజనుడు. అవి యెన్నడును పనికిరావు. మార్గమును చూపుటకు శీలసంపన్నుడు కావలయును. చైతన్యమూర్తి కావలెను. కేంద్రీభూతుడు కావలెను. మానవుడుగ నవతరించిన దేవుడు కావలెను. ఆ కేంద్రముచుట్టును తక్కినవెల్ల గుమిగూడి ఒకఉప్పెనవలె సంఘముపై పడవలెను. ఆ ప్రవాహవేగము అన్నిటిని త్రోసికొనిపోవును. అన్నిమాలిన్యములను కడిగివేయును. ప్రమానును పీచురేగకుండువైపున కోయుట సులభము. అట్లే ప్రాచీనహిందూమతమును హిందూమతముచేతనే సంస్కరింప వీలగును. అంతేకాని క్రొత్తగా తలయెత్తిన ఈ సంస్కారోద్యమములచేత శక్యము కాదు. సంస్కర్తలు ప్రాచ్యపాశ్చాత్య సంస్కృతులను తమలో మేళవించుకొనగల్గవలెను. అట్టి మహోద్యమమునకు నాంది మన కంటబడి ఐన దనియు రానున్న ఉప్పెనయొక్క ఘోష మనచెవిని బడుచున్న దనియు మీకు తోచుటలేదా? అట్టి కేంద్రభూతుడు మానవరూపముదాల్చిన దేవుడు లోకమునకు మార్గమును చూపుటకై భారతదేశమున అవతరించెను. అతడే మహానుభావుడగు రామకృష్ణపరమహంస. ఈ బలగము మెల్లగ ఆయనచుట్టు గుమిగూడుచున్నది. చేయవలసిన పనిని వారు చేయుదురు. దివాన్జీమహాశయా, ఇందు కొక సంస్థ కావలెను. ఈ చక్రమును తిరల్చుటకు కొంచెముగానైనను పైకము కావలెను. భారతదేశమున మనకు ఎవరు ధనము నిచ్చియుందురు? కావున దివాన్జీమహాశయా, నేను అమెరికాకు వచ్చితిని. మీకు జ్ఞప్తి యుండ వచ్చు. పైకమును నేను పేదలయొద్దనే యాచించితిని. సంపన్నులు ఇచ్చుటకు వచ్చిన పైకమును నేను కైకొనలేదు. ఏలయన నా ఆశయములను వారు అర్థము

చేసికొనలేకపోయిరి. ఈదేశమున ఒకసంవత్సరమునుండి ఉపన్యాసములు చేయుచునే యున్నాను. కాని నాఉద్యమమును నెలకొల్పుటకు వలసిన ధనమును గడించు పన్నాగములో నెగ్గలేకపోయినాను. (సొంతమునకు నాకు ఏ అక్కఱలును లేవు లెండి.) మొదటి కారణము ఈసంవత్సరము అమెరికాకు చాల చెడ్డకాలము. అమెరికనులలో పేదవారు వేలకొలదిగ నిరుద్యోగులైయున్నారు. రెండవ కారణము పాదిరీలును ...ను నా ఆశయములకు అడ్డుగల్గింప ప్రయత్నించుచున్నారు. మూడవ కారణము ఒకసంవత్సరకాలము గడచిపోయినది. నేను వంచకుడను కాననియు యథార్థసన్న్యాసిననియు హిందూమతప్రతినిధిననియు అమెరికనులకు తెలుపుట అను ఈపాటి ఉపకారమునైనను మన దేశీయులు చేయజాలకపోయిరి. భళీ, నాదేశీయులారా! దివాన్జీ సాహేబు, మన దేశీయులపై నాకు ప్రేమయే. మానవులతోడ్పాటు నా కక్కఱలేనేలేదు. కొండలగుండను లోయలగుండను ఎడారులగుండను వనములగుండను ఎవడు నాకు తోడై వచ్చెనో అతడే నాకు తోడై యుండు నని నా విశ్వాసము. లేకున్న ఈ పనిని నిర్వహించుటకు నాకంటె అత్యంతమధికసమర్థుడైన మఱొకవీరుడు ఎప్పుడో ఒకప్పుడు భారతదేశమున జన్మించును. దానిని గూర్చి తెలుపవలసినదాని నెల్ల మీకు తెలిపియున్నాను. దివాన్జీ, మీరు నాకు ఉదారమిత్రము. నాయందు నిజమైన సానుభూతియు కనికరమును గల కొలదిమందిలో మీ రొకరు. ఇంత పెద్దజాబు వ్రాసినందుకు నన్ను మన్నింపుడు. మిత్రమా, నేను కలలు గనువాడనని కల్పనాప్రవణుడనని మీరు తలంప వచ్చును. తలంచుటకు మీకు పూర్తి స్వాతంత్ర్యము కలదు. కాని ఆత్యంతికమైన త్రికరణశుద్ధికలవాడ నని మాతృదేశముపై అత్యుత్కటమైన ప్రేమ గల్గియుండుటే నాలోని పెద్ద త ప్పనియు — ఇంతమాత్రమైన నమ్ముడు. ఉదారసఖా, అత్యుదారసఖా, మీకును మీవారికిని సదా శుభములు కలుగుత. మీపట్ల ఎన్నటికిని

సడలని నా కృతజ్ఞతను నివేదించుకొనుచున్నాను. మీకు నేను పడియున్న అప్పు ఇంతంత కాదు. మీరు నాకు మిత్రులైనందు చేతమాత్రమే కాదు. జీవించినన్నినాళ్లును మీరు భగవత్సేవను దేశమాతృసేవను అంతచక్కగా చేసినందుచేతగూడ.

సదా భవదీయ కృతజ్ఞుడు
వివేకానంద

## 98

(శ్రీ శ్రీ మైసూరుమహారాజావారికి)

చికాగో,
జూను 23, 1894.

మహారాజా,

శ్రీమన్నారాయణుడు, మీకు మీవారికి, యోగక్షేమము లొసగు గాక. ప్రభువులు కృపతో సాయపడుటచే, ఈ దేశమునకు వచ్చుట నాకు సాధ్యపడినది. వచ్చినప్పటినుండియు అందఱికిని పరిచితుడనైతిని. అతిథిపరాయణులగు ఈ దేశప్రజలు, నాకు కావలసిన వన్నియు సరఫరా చేసినారు. ఈ దేశ మద్భుతము. ఈ ప్రజలును ఎన్నో విధముల అద్భుతప్రజలే. నిత్యకృత్యములకు, ఈ దేశప్రజలు ఉపయోగించునన్ని యంత్రములను, ఏ దేశప్రజలును ఉపయోగింపరు. ఇక్కడ ప్రతివస్తువును యంత్రమే. అంతే కాదు; ప్రపంచజనసముదాయములో, ఈ దేశప్రజ, ఇరువదింట నొక భాగము మాత్రమే. అయినను, వారి సిరిసంపదలు, ప్రపంచపు సిరిసంపదలలో, ఆఱింట నొకపాలుగ నున్నది. వారి భోగభాగ్యములకు మితియే లేదు. కాని, ఇక్కడ, ప్రతివస్తువున కును విపరీతమైన ధర. ఇచ్చట నున్నంత హెచ్చుకూలి, ప్రపంచ ములో నెచ్చటను లేదు. కాని కార్మికులకును కామందులకును పోరాటము సదా సాగుచునే యుండెను.

స్త్రీలకు అమెరికాలో నున్నట్టి హక్కులు, ప్రపంచమున నెక్కడను లేవు. క్రమముగా సర్వమును వారు తమచేతులలో చిక్కించుకొనుచున్నారు. వింతవిషయ మిది. ఉత్తమసంస్కారము గల మగవారికన్న, అట్టి సంస్కారవతులైన మహిళలసంఖ్య అత్యధికము. కాని ఉత్తమప్రతిభాశాలులు, ఇంకను మగవారిలోనే హెచ్చు. సహజమే. పాశ్చాత్యులు మన వర్ణవిభేదమును దూషింతురు. కాని, దానికంటె అన్యాయ్యమైన వర్గము—ధనిక వర్గము — వారిలో నున్నది. అమెరికనులు చెప్పునట్లు, డాలరు సర్వశక్తిమంతము. ఇక్కడ అది దేనినైనను సాధింపగలదు.

ప్రపంచమున ఏ దేశముననను ఇన్ని చట్టములు లేవు. ఎచ్చటను చట్టముల ఇంత నిర్లక్ష్యము చేయరు. నీతిలో, పాశ్చాత్యులందఱికంటె పేదలైన హిందూప్రజలే, మొత్తముమీద ఎంతో అధికులు. మతవిషయమున ఇక్కడివారు పైవేషాలవారుగనైన నుందురు, పరమతాసహనస్వమతదురభిమానవంతులుగనైన నుందురు. వీరి మూఢవిశ్వాసమతములతో విసుగెత్తి, ఇచ్చటి వివేకులు, క్రొత్తవెలుగునకై, భారతదేశమువైపు చూపులు పఱపుచున్నారు. పవిత్రవేదములలోని ఉదాత్తాశయములు ఇంచుకంత లభించినను, వీరెంత ఆతురతతో గైకొందురో, కనులార చూచిననే, ఏలినవారికి ఎఱుకపడగలదు. అధునాతన భయంకర విజ్ఞానశాస్త్రాఘాతముల కెదురు నిల్చి, వేదములు అక్షతములుగ నున్నవి కదా. "శూన్యమునుండి సృష్టి పుట్టినది. ఆత్మయు సృష్టింపబడినదే. దేవుడు నిరంకుశుడు, స్వర్గ మని చెప్పబడు నొకచోట, సింహాపీఠిపై కూర్చుండి, ఆయన రాజ్యమేలుచుండును. నరకాగ్నులకు చల్లబాటే లేదు". ఇట్టి సూత్రముల యెడల చదువుకొన్న వారి కెల్లరికి వెగటు పుట్టినది. "సృష్టి అనాది, అనంతము. ఆత్మయు అట్లే శాశ్వతము. ఈశ్వరుడు అంతర్యామిగా మనలో నున్నాడు" అను వేదములలోని ఉదాత్తభావము

లను ఏదో యొక రూపమున వారు తొందఱలో స్వీకరించు చున్నారు. ఇక నేబదియేండ్లలోపల — ఆత్మయు సృష్టియు ఉభయమును శాశ్వతమే యనియు, ఈశ్వరు డనగా పరిపూర్ణ డనియు, పరాత్పరు డనియు — మన వేదములలో చెప్పియున్న దానిని ప్రపంచవిద్వాంసు లందఱును అంగీకరింపగలరు. ఇప్పటికే, వారిలో విద్వాంసులైన మతాచార్యులు, బైబిలును ఈ ధోరణి లోనే వ్యాఖ్యానించుచున్నారు. నా నిర్ణయ మే మనగా, వారి నాగరికతలో పారమార్థికపరత హెచ్చవలె, మననాగరికతలో వాస్తవపరత హెచ్చవలె — అని.

భారతదేశములో అన్ని యనర్థములకును మూల మొక్కటే, పేదవారి దుఃస్థితి. పాశ్చాత్త్యు లందలి పేదలు పిశాచములే. వారితో పోల్చి చూచిన, మన పేదలు కేవలము దేవతలే. కావుననే, మన పేదల నుద్ధరించుట చాల సులభమైన విషయము. మనము చేయవలసిన సేవయెల్ల — వారికి విద్య గఱపుటయు, పోగొట్టుకొన్న వ్యక్తిగౌరవము మరల పొందించుటయు. మనప్రజలును ప్రభువులును చేయవలసిన పెద్ద పని ఇది. ఇంతవఱకు ఈ విషయములో ఏమియు జరుగలేదు. పురోహితాధికారము, విదేశాక్రమణము శతాబ్దులుగా వారి నణగద్రొక్కి యుండినవి. కడకు భారతదేశమున పేదలు తాము మనుష్యుల మనుటనుగూడ మఱచిపోయినారు. వారి బుద్ధులలో భావములు చొప్పింప వలెను. చుట్టును ప్రపంచములో జరుగుచున్నవానిని చూచునట్లు వారు కన్నులు తెఱవవలెను. అప్పుడు వారిముక్తి వారే సాధించుకొందురు. ప్రజగాని, నరుడుగాని, నారిగాని, ఎవరిముక్తిని వారే సాధించుకో వలెను. ఆశయములను వారికి ఈయవలెను. వారికి కావలసిన సాహాయ్య మంతమాత్రమే. తర్వాత తక్కిన దెల్ల దానిఫలితముగ వచ్చియే తీరును. రసాయనవస్తువులను కలుపుట మనపని. తర్వాత పలుకులుగా పేరుట ప్రకృతిసూత్రమే కదా. వారి బుద్ధుల

లోనికి మన యాశయములు చొప్పించుట మన కర్తవ్యము. తక్కినది వారే చేసికొందురు. భారతదేశాన చేయవలసిన పని యిదే. నా మనస్సులో చిరకాలముగ నున్న సంకల్ప మిదే. భారతదేశమున దానిని సాధింపలేకపోయితిని. అందుకే యీ దేశమునకు వచ్చితిని. పేదలకు విద్యాదాన మొసగుటలో మహాకష్ట మొకటి అడ్డువచ్చును:— తమరే ప్రతిగ్రామములో నొక ధర్మ విద్యాలయమును స్థాపించితి రనుకొనుడు. దానివలన ఏ మేలును ఉండదు. భారతదేశదారిద్ర్య మట్టిది. పేదబాలురు బడికిపోవుట మాని పొలములలో తండ్రులకు తోడ్పడబోవుదురు. లేదా, ఏదైన జీవికను గడింప బోవుదురు. ఇక నిప్పుడు కొండ మహమ్మదు నొద్దకు రాకున్న, మహమ్మదే కొండయొద్దకు పోవలెను కదా. పేదబాలుడు చదువుకొనుటకు రాకున్నచో చదువే పేదబాలునికడకు పోవలెను. మనదేశములో స్వార్థత్యాగులు, ఏకాగ్రచిత్తులు అయిన సన్న్యాసులు మతప్రచారము చేయుచు పల్లెనుండి పల్లెకు వేలకొలదిగ పోవుచున్నారు. వారిలో కొందఱినైన లౌకికవిషయములనుకూడ నేర్పు ఉపాధ్యాయులుగ తయారుచేసితిమేని, పల్లె పల్లెలో, ఇంటింటను, వారు మతమును, చదువునుకూడ చెప్పుచు పోవుదురు. ఒకపల్లెకు ఒకసాయంకాలము అట్టివారిలో నిద్దఱు కేమెరాతో, గ్లోబుతో, కొన్ని దేశపటములు మున్నగువానితో వచ్చిరి అనుకొందము. తెలియనివారికి ఖగోళ, భూగోళవిషయముల నెన్నిటినో నేర్పవచ్చును కదా. ఒకజీవితకాలములో పుస్తకముల నుండి సంపాదించుకొను విషయవిజ్ఞానముకంటె నూఱంత లెక్కువ విషయజ్ఞానమునే వారు భిన్నదేశీయులనుగూర్చి కథలు వినిపించి వారికి కలిగింప గలరు. అయినను ఈ పనికి సంస్థ కావలెను. అనగా మరల ధనమే కావలెను. ఈ ప్రణాళికను నిర్వహించుటకు భారతదేశమున జనులు కావలసినంతమంది యున్నారు. కాని పాపము వారికి పైసా లేదు. చక్రమును కదలించుటే కష్టము. కదలిన పిదప వర్ధిల్లు వేగముతో నది దొర్లుచు పోవును.

నా దేశములోనే సాహాయ్యము కోరి ధనికుల సానుభూతి పొందలేక నిష్ఫలుడనై ఏలినవారితోడ్పాటుచే ఈ దేశమునకు వచ్చి చేరితిని. భారత దేశమున పేదలు చచ్చిన నేమి, బ్రతికిన నేమి, అమెరికనుల కించుకేని లక్ష్యమా, వా రేల లక్ష్యపెట్టవలెను ? మనవా రీ స్వార్థమును తప్ప వేఱేమియు ఆలోచింపరే.

ప్రభుమహాశయా, జీవితము క్షణభంగురము. ఐహిక దంభము లన్నియు నశ్వరములే. ఒరుని కొఱకు బ్రతుకువారే బ్రతుకువారు. ఇతరులు బ్రతికియున్నారనుటకంటె చచ్చి రనుటే తగును. ఉదారమనస్కుఁడు, ఉన్నతుడు, దేశపాలకుడును నైన తమవంటి భారతమాతృకుమారుడు దేశమాతను ఆమె కాళ్లపై నిలబెట్టుటకు ఎంతో పనిచేయగలడు. భావిసంతతివారికెల్ల పూజ్య ముగ తనపేరు నిల్పుకొని పోగలడు.

అజ్ఞానమగ్నులైన పీడిత భారతీయజనకోటులను గుఱించి పరమేశ్వరుడు మీ యుదారహృదయమును అనుకంపార్ద్రముగా చేయవలయు నని ప్రార్థించు.

భవదీయుడు
వివేకానంద

## 99

(రావుబహదూరు నరసింహాచారిగారికి)

చికాగో,
జూను 23, 1894.

ప్రియమహాశయా,

నాయందలి మీకరుణ నాకు ధైర్యమును కలిగించు చున్నది. ఆధైర్యముతో మీదయను వినియోగించుకొన జూచు చున్నాను. అమెరికాసంయుక్తరాష్ట్రములలో శ్రీమతి పాటరు

పామరుసతి సర్వప్రధానురాలైన మహిళ. విశ్వవస్తుప్రదర్శనము నకు ఆమెయే అధ్యక్షురాలు. ఒకపెద్దమహిళల సంస్థకు ఆమె అధ్యక్షురాలు. ప్రపంచమున ఎక్కడగాని మహిళలను ఉద్ధరించుటయందు ఆమె కత్యంతాసక్తి. దక్షిణప్రభ్వీణికి ఆమె ముఖ్య సఖి. ఆమెసంపదను హోదాను చూచి యూరోపునందలి రాజ కుటుంబములవారు ఆమె నాదరించిరి. ఈదేశమున ఆమె నావిషయ మున చాల దయగలిగి యుండెను. ప్రస్తుత మామె చైనా, జపాను, సయాము, ఇండియా దేశములలో పర్యటింపబోవుచున్నది. భారత దేశమున రాష్ట్రపతులు (గవర్నరులు)ను తక్కిన పైపదవుల వారును ఆమెను ఆదరింతురు లెండి. ఐనను ఆంగ్లోద్యోగుల తోడ్పాటును గోనక మన సంఘమును చూడవలె నని ప్రత్యేక ముగ ఆమె ఆత్రపడుచున్నది. మైసూరులో మీ అద్భుతకళా శాలనుగూర్చి భారతీయమహిళల ఉద్ధరణమునకై మీరు చేయు చున్న ఉదారకృషినిగూర్చి పెక్కుపర్యాయములు ఆమెకు నేను చెప్పియున్నాను. అమెరికాకు వచ్చినట్టి మనదేశీయులపట్ల అమెరి కనులు చూపిన ఆదరమునకు బదులు అమెరికానుండి ఇట్టి విశిష్ట వ్యక్తులు వచ్చినప్పుడు కొంతైన వారి నాదరించుట మన ధర్మ మని నా యభిప్రాయము. మీ రామెను ప్రీతితో ఆదరింతురనియు మన మహిళలపరిస్థితిని ప్రత్యక్షముగ విలోకించుటకు మీ రామెకు తోడ్పడగల రనియు నాఆశ. ఆమె మతప్రచారకురాలు కాదు. క్రైస్తవురాలైనను కాదు, అనునంతవఱకు మీకు నేను హామీ ఈయగలను. విశ్వమందంతటనున్న మహిళలు ఏ మతమువారైన నగుదురు గాక, వారి పరిస్థితిని చక్కజేయు పాటుపడవలె నని ఆమె కోరిక. ఇది ఈదేశమున నాకెంతో తోడ్పడును. భగవం తుడు మి మ్మనుగ్రహించును గాక.

యథాపూర్వభవదీయప్రేమయుత
వివేకానంద

## 100

(కుమారి మేరికి, కుమారి హేలుకు)

జార్జి డబల్యూ హేలుగారింట,
541, డియర్బారన్ అవెన్యూ, చికాగో,
జూను 26, 1894.

ప్రియసోదరీమణులారా,

హిందీమహాకవి తులసీదాసు తనరామాయణానువాద ప్రారంభమంగళపద్యమున ఇట్లనెను : "అసాధువులకు సాధువులకు కూడ ప్రణమిల్లుచున్నాను. కాని అయ్యో, వా రుభయులును నన్ను సమానముగ బాధించువారే. వచ్చి నాతో కూడుటచే అసాధువులు బాధ కల్గింతురు. సాధువులు నన్నువీడి యేగునప్పుడు నాప్రాణమునే తమతో గొంపోవుదురు".

అది అట్లే అని నే నందును. ఈప్రపంచమున నాకున్న ఆనందమును ప్రేమయు పవిత్రులగు భగవద్భక్తుల యనురాగమే. అట్టి నాకు వారియెడబాటు అత్యంతదుర్భరబాధాకరము. కాని ఇవి సంభవింపవలసినవే. ఓ ప్రియునిమురళీగానమా, దారి చూపుము. నీవెంబడినే వచ్చుచున్నాను. మధురోదారపవిత్రాత్మలగు మి మ్మెడబాసినప్పుడు నాకు కల్గు బాధయు ఔత్సుక్యమును అనిర్వాచ్యములు. స్థితప్రజ్ఞుడను (స్టాయిక్) కారాదా అని ఎంతగనో కోరుచున్నాను.

సుందరగ్రామదృశ్యములను చూచుచు మీ రానందించుచున్నా రనుకొందును. "సర్వభూతముల కేది రాత్రియో దాని యందు సంయమి మేలుకొనియుండును. దేనిలో భూతములు మేలుకొని యుండునో తత్త్వదర్శియగుమునికి అది రాత్రి".

ఈలోకపు ధూళి యైనను మి మ్మెప్పుడు నంటకుండు గాక. ఏలయన ఈధూళి పువ్వులుకప్పిన క్రుళ్లుడుమాంసఖండమే అని

కవులు వ్రాయుదురు. మీకు శక్యమగునేని దాని నంటకుండుడు. స్వర్గపక్షినిసుగులారా*, పైకెగురుడు. పాపముల మురికిగుంట యగు ఈ ప్రపంచపు స్పర్శ మీపాదములకు కలుగుటకుముందే పైకి వచ్చివేయుడు.

"ఓ మేలుకొన్న ఆత్మా, మరల నిదురింపకు".

"లోకులు పెక్కండ్రను ప్రేమింతురు గాక! మనకు ప్రియు డొక్కడే — భగవంతుడు. వారి మాటలు మనము లక్ష్య పెట్టము. కాని మాప్రియుని వర్ణించుచు ఆయనకు వారు అన్ని విధముల ఘోరగుణములను ఆరోపించినప్పుడు మాత్రము మనము భయపడుదుము. వారికి నచ్చినట్లు వారు చేయుదురు గాక. మన కేమో భగవంతుడు ప్రియుడే. నాప్రియుడు, నాప్రియుడు, అంత కంటె వేఱేమియు కాదు.

"ఆయన కెన్ని గుణము లున్న నేమి, ఎంతశక్తి, హితకర శక్తి యైనను సరే, ఉన్న నేమి. ఎవరికి లక్ష్యము! మరల మరల మమ్మునుగ నక్కఱలేకుండ ఒక్కసారిగనే చెప్పుచున్నాను. ధనసంపదను చూచి కాదు మేము ప్రేమించుట. మాప్రేమను మే మెన్నడును అమ్మము. మే మిత్తుమే గాని కోరము".

"ఓ వేదాంతీ, భగవంతుని స్వరూపమును శక్తులను గుణములను మాకు చెప్పుటకు వచ్చుచున్నావు. ఓరి మూర్ఖా,

* ఇది బెంగాలీసంప్రదాయగ్రంథములలో పేర్కొనబడిన హోమా అనెడి పక్షి. ఆపక్షి యెత్తుగా ఆకసమున వసించుచు అక్కడనే గ్రుడ్డుపెట్టు నట. వెంటనే ఆగ్రుడ్డు క్రిందికి పడ తొడంగు నట. కాని అది ఎంతో ఎత్తులో నుండి పడుచున్నందున పడుటకు ఎన్నో దినములు పట్టు నట. నడిదారి లోనే ఆగ్రుడ్డు పగులును. అందుండి పిల్ల వెలువడును. దాని కన్నులు తెఱచు కొనును. ఱెక్కలును మొలచును. కన్నులు తెఱచినంతనే తాను పడుచున్నా ననియు నేలకు కొట్టుకొన్నంతనే తుత్తునియ లగుదు ననియు గ్రహించి తక్షణమే తల్లియొద్ద కెగిరి పోవును. ఈపక్షిని శ్రీరామకృష్ణుడు నిత్యముక్త నకు ఉపమానముగ చెప్పెడివాడు.

ఆయన అధరచుంబనమును కోరి అందుకై మేము ప్రాణములు విడుచుచున్నాము''.

''నీ నిరర్థకవాక్కులను మీయింటికే కొనిపొమ్ము. నీకు శక్య మగునేని నాప్రియుని ముద్దును నాకు చేర్పుమా''.

''ఓరిమూర్ఖా, భయపడుచు వెఱగుపడుచు తొట్రుపడు మోకాళ్లతో ఎవరి కెదుట నోయి నీవు ప్రణమిల్లుచున్నది? దేవుడు క్షణకాలమైనను దవ్వున కెగిరిపోవునేమో అని వెఱచి నేను హారమును నాకంఠమునుండి తీసి ఆయనకంఠమున వేసి దాని కొక దారమును 'కాలరు'గా కట్టి ఆయనను నాతో లాగు కొని వచ్చుచున్నాను. అది 'ప్రేమ'హారము, దానిఉద్రేక మే ఆ దారము. ఓరి మూర్ఖా, నీ వెఱుగవోయి, ప్రేమబద్ధుడై ఆ అనంతుడు నా పిడికిట ఇమిడిపోవును. బృందావనములో గొల్ల చెలువల నూపురరవగానమున కీ జగన్నియంత నర్తించుచుండె ననుట నీ వెఱుగవా?

కేవలము అనుభవమునకు మాత్రమే విషయమైన అనిర్వా చ్యమును నిర్వచింప ప్రయత్నించిన అవివేకమునకును నా వెఱ్ఱి వ్రాతలకును నన్ను మన్నింపుడు.

సదా ఆశీస్సులతో,

మీ సోదరుడు

వివేకానంద

## 101

(మదరాసులో ఒకశిష్యునకు)

541, డియర్బారన్ అవెన్యూ, చికాగో,
జూను 28, 1894.

ప్రేమాస్పద—

మైసూరు జి. జి. * నుండి మొన్న ఒక జాబు వచ్చినది. దురదృష్టవశమున జి. జి. నేను సర్వజ్ఞుడ నను భ్రాంతిలో నున్నాడు. లేకున్న లేఖపై కన్నడమున నున్న విలాసమును మఱికొంత స్పష్టముగ తెలియునట్లు వ్రాసియుండును. నాకు వ్రాయు జాబులను చికాగోకు కాక వేఱు ఏ చోటుకు వ్రాసినను చాల తప్పే. ఈ పొరపాటు మొదట నాదే లెండి. ఏల యన చిరునామా కనిపించిన తావుల కెల్ల నా పేరట జాబులు రువ్వు మన మిత్రుల చక్కనిబుద్ధిని నేను ఊహించియుండవలసినది. నేను నిరంతరము పర్యటనమును చేయుచునే యున్నాను. ఏచోటికి నా పేరట జాబు వ్రాసెదరో ఆ జా బక్కడికి చేరునప్పటికి నే నటనుండి వేయిమైళ్లదూరము పోయియుందును. ఈవిషయము వారికి బాగుగా తెలిసినదే అని మన మదరాసు బృహస్పతులకు చెప్పుము. చికాగోలో నాకొక మిత్రు డున్నాడు. అతనిల్లు నాబస.

ఇచ్చట నా ఆశలు ఫలించు నవకాశము ఇంచుమించు పూర్ణానుస్వారమే. ఏల యన నా లక్ష్యము శ్రేష్ఠమైనదైనను ఈ కారణములు దానిని చెడగొట్టినవి. భారతదేశవార్తలు నాకందుటకు మదరాసులేఖలే ద్వారములు. నాకు భారతదేశమున కలుగుచున్న ప్రశంసనే మాటిమాటికి నాజాబులు తెలుపు చుండును. కాని అది మీకును నాకును నడిమిదే. అళసింగ

* జి. జి. నరసింహాచార్యులు.

పంపిన మూడు చదురపంగుళములకత్తిరింపు తప్ప నాకు తెలిసి భారతదేశమున ఏపత్రికలోను నన్ను గుఱించి ఏమియు వ్రాయ బడుట లేదు. అందుకుతోడు భారతదేశమున క్రైస్తవులు చెప్పు వానినెల్ల పాదిరీలు శ్రద్ధతో సేకరించి సక్రమముగ ప్రచురించు చున్నారు. ఇంటింటికి పోయి వారు నాకు మిత్రులుగనుండు వారు నన్ను వదలుకొనునట్లు ప్రచారము చేయుచున్నారు. వారి ఉద్యమము చాల బాగుగనే నెగ్గినది. ఏలయన భారతదేశము నుండి నాకనుకూలమైన మాట ఒక్కటైనను వచ్చుట లేదు. భారతదేశమున హిందూపత్రికలు నన్ను మిన్నంట ప్రశంసించు చుండ వచ్చు. కాని అట్టి మాట ఒక్కటైనను అమెరికాకు అందనే లేదే. కావున నేను వంచకుడ నని ఈ దేశమున అనేకులు తలంచుచున్నారు. ఇచటి పాదిరీలకు నాపట్ల ఈర్ష్యాళువు లైన ఇచ్చటి హిందువులు సహాయులు. కావున నో రెత్తి చెప్పుటకు నాకొక్క మాటయైనను లేదు. కేవలము మదరాసు యువకుల ప్రోత్సాహబలముపై నాధారపడి విశ్వమతమహాసభకు నేను వచ్చుట అవివేక మని నాకిప్పుడు తోచుచున్నది. వారికి నేను సదా కృతజ్ఞుడనే. కాని వారు నిర్వహణసామర్థ్యము లేక వట్టి యుత్సాహము పొంగులువాఱు యువకులు. యోగ్యతా పత్రములు అధికారపత్రములు లేకయే నే నిచ్చటికి వచ్చి యున్నాను. పాదిరీలును బి-ఎస్-లును అట్లు దుష్ప్రచారము చేయుచుండగా వంచకుడను కా నని నిరూపించుకొనుటకు నాకు వేఱుదారి ఏదీ? కొన్ని మాటలను వెచ్చించునంతటి సులభమైన పని వే ఱొకటి లే దని నాకిప్పుడు తోచినది. మదరాసులోను కల్కత్తాలోను పురప్రముఖుల సమావేశములు చేయించుట. నన్ను న న్నాదరించిన అమెరికాప్రజలను అభినందించుచు తీర్మానము చేయుట. అధికారపూర్వముగ అనగా సమావేశ కార్యదర్శిద్వారా ఆతీర్మానము నమెరికాకు పంపుట. డాక్టరు బట్లోసు వంటి వారికి పంపి పత్రికలలో ప్రచురింపుడని కోరుట,

అట్లు బోస్టనులో న్యూయార్కులో చికాగోలో వివిధపత్రికలకు పంపుట——ఇంతకంటె సులభముగ చేయదగిన పని మఱొకటి లేదని నాకు తోచినది. కాని అదియు భారతీయులు పూనుకొనలేని భీకరకార్యమే, అని నా కిప్పుడు తెలిసినది. ఒక్క సంవత్సర కాలముగ, నా కనుకూలమైన మాట చెప్పినవాడు ఒక్కడైన లేడు. ప్రతియొక్కడును ప్రతికూలముగ చెప్పినవాడే! మీకొంపలలో నన్ను గుఱించి మీ రే మనుకొన్నను అది ఇచ్చట ఎవరికైనను ఎట్లు తెలియును? రెండు నెలలనాడు ఇందుంగూర్చి అళసింగపెరుమాళుకు జాబు వ్రాసితిని. అత డింతవఱకు జవాబైనను వ్రాయ లేదు. అతని ప్రేమ మందగించిన దేమో! కావున నీవు మొట్టమొదట ఆవిషయమునుగూర్చి యోచింపుము. తర్వాత ఈజాబును మదరాసువారికి చూపుము. పైగా నా సోదరులు కేశవచంద్రసేనునుగూర్చి అవివేకముతో అర్థరహితముగా ప్రసంగింతురు. మదరాసువారు....నుగూర్చి నేనువ్రాసినదెల్ల వారికి తెలుపుచుండుటచే నాకు విరోధులనే సృజించుచున్నారు....అయ్యో! ప్రతిభయు నిజమైనశక్తులును గల్గి నాకు తోడ్పడు వాడు భారతదేశమున ఒక్కడైన నుండ రాదా! కాని ఈశ్వరసంకల్పము నెఱవేఱుత. ఈదేశమున నే నొకవంచకుడుగ నున్నాను! యోగ్యతాపత్రము లేవియు లేక, ఎన్నియో ఇచ్చట లభించునులే అనుకొని విశ్వమతమహాసభకు వచ్చుట నా అవివేకము. మెల్లగా నేను దానిని సాధించుకొనవలసియున్నది.

మొత్తముమీద అమెరికనులు హిందువులకంటె కోటిరెట్లు ఎక్కువ ఉదారులు. కృతఘ్నులును హృదయశూన్యులునగు వారిదేశములో చేయ గలిగినంతకంటె ఎక్కువ మేలును నే నీ దేశమున చేయగలను. ఇంతకును నాకర్మను (విధిని) నేను నిర్వర్తింపవలెను కదా. నా ఆర్థికస్థితిమట్టుకు ఇప్పుడు చాల బాగున్నది, ఇక ముందును చాల బాగుండగలదు. క్రిందటిజానాభా లెక్కలప్రకారము అమెరికాలో....ల సంఖ్య 625 మాత్రమే.

వారితోడి కలయిక ఏరీతిలోనైనను నాకు సాయపడుటకు బదులు క్షణములో నన్ను రూపుమాపును. నన్ను లండనుకుపొమ్మని శ్రీఓల్డు మున్నగువారిని దర్శింపు మని చెప్పుటలో అళసింగుని పిచ్చి యుద్దేశ్య మేమి? మూర్ఖుడు! తమమాటల అర్థమును తా మెఱుగరు ఆబాలురు. ఈమదరాసీపిల్లజట్టువారి బుఱ్ఱలలో రహస్యము దాగదు, పొద్దస్తమానము పిచ్చిప్రసంగములు చేయుచుందురు. కాని చాల చిన్నపనినైనను చేయవలసివచ్చినప్పుడు కంటికి కగపడరు. మూర్ఖులు, ఏబదిమంది మనుష్యులను కూర్చి సమావేశములను కొన్నింటనైన చేయింపలేరు. రిక్తమాటలను మాత్రమే నాకు సాయ మంపుచుందురు. లోకమును వశపఱచుకొనుటనుగూర్చి అధికప్రసంగములు చేయుచుందురు. ఫోనోగ్రాఫును గుఱించి నీకు వ్రాసియుంటిని. ఇప్పు డిచ్చట ఒక విద్యుద్వ్యజనము (ఎలెక్ట్రిక్కు-పంకా) ఉన్నది. చాలచక్కగా పని చేయుచున్నది. ఖరీదు 20 డాలర్లు. బాటరీ నూఱుగంటలసేపు పనిచేయును. తర్వాత దానిని ఏఎలెక్ట్రిక్కు యంత్రమునొద్ద గాని మరల నింపుకొనవచ్చును. హిందువులపొత్తు ఇక చాలును. వారి కొక నమస్కారము. ఈశ్వరుని సంకల్పము నెఱవేఱుత. నేను నావిధిని తలదాల్తును. దానికి ప్రణమిల్లుదును. ఐనను నన్ను కృతఘ్ను డని భావింపకు. ... నా అర్హతను మించియు తమశక్తికి మించియు మదరాసుప్రజలు నాకు మే లొనర్చిరి. హిందువులమైన మనకు మానవత్వము ఇంకను కలుగ లే దను విషయమును క్షణకాలము మఱచితిని. హిందువులపై ఆధారపడితిని. ఆత్మప్రత్యయమును క్షణకాలము త్యజించితిని —— ఇది నా అవివేకము. నా అవివేకమే నా చిక్కులకు కారణము. భారతదేశమునుండి ఏమైన వచ్చు నని ఒక్కొక్కక్షణమునను ఎదురు చూచుచుంటిని. కాని అది ఎప్పుడుగాని రాలేదు. ముఖ్యముగ, గడచిన రెండునెలలు నేను చాల బాధపడినాను. భారతదేశము నుండి ఏమియు రాలేదు. వార్తాపత్రికమైనను రాలేదు.

నా మిత్రులు నెలలతరబడి వేచియుండిరి. ఏమియు రాలేదు. ఒక్కమాటయైనను! ఆ కారణముచే అనేకులకు నాయందు నిరాదరము వర్ధిల్లినది. తుదకు వారు నన్ను వదలుకొనిరి. మనుష్యులపై మృగశీలురపై ఆధారపడినందుకు ఇది నాకు శిక్ష. మనదేశీయులు ఇంకను మానవులుగ రూపొందలేదు. పొగడించుకొనుటకు వారు సదా సంసిద్ధులే. కాని ఒక్కమాట యైనను చెప్పవలసిన వంతు తమకు వచ్చినప్పుడు వారు మాయ మగుదురు.

మదరాసు యువకులకు నా నిరంతరధన్యవాదములు. భగవంతుడు వారిని సదా అనుగ్రహించును గాక. ఏ ఆశయమునైనను కొనసాగింపవలయు ననిన అందుకు ప్రపంచమునకంతటికిని అమెరికా శ్రేష్ఠమైన క్షేత్రము. కావున నేను అమెరికాను త్వరలో విడువ నుద్దేశింపలేదు. ఏల? ఇచ్చట నాకు అన్నపానములు వస్త్రములు సమృద్ధిగ నున్నవి. అందఱు నాయందు దయగలిగి యున్నారు. ఇంతకును కారణము కొన్ని మంచి మాటలే. అట్టి మహోన్నతదేశమును విడిచిపెట్టి మృగస్వభావులును కృతఘ్నులును మతిహీనులును మూర్ఖులును మూఢవిశ్వాసములకు నిత్యపరవశులును దయాదాక్షిణ్యరహితులునగు నిర్భాగ్యులుండు దేశమునకు నే నేల రావలెను? కావున మరల నొక నమస్కారము. ఈ జాబును నీవు వివేకముకలవారికి చూపవచ్చు. మదరాసీలలో — నే నెంతగనో ఆధారపడియుండిన అళసింగునిలో సైతము — వివేక మంతగా లే దని నా యభిప్రాయము. మఱొక మాట. మజుందారు వ్రాసిన పరమహంస శ్రీరామకృష్ణుని జీవిత చరిత్రపు ప్రతులను కొన్నింటిని దయతో చికాగోకు పంపుదువా? అవి కల్కత్తాలో కొల్లగ నున్నవి. 541, డియర్బారన్ అవెన్యూ (వీధి కాదు) చికాగో, అను విలాసమునుగాని, "థామసుకుక్కుగారింట, చికాగో" అను విలాసమును గాని మఱవకుము. వేఱు విలాసములకు వ్రాసిన చాలచిక్కు జాగు కలుగును. ఏలయన

నేను నిరంతరము పర్యటించుచున్నాను. చికాగో నా ముఖ్య స్థానము. మన మదరాసుమిత్రులకు ఇంత మాత్రమైనను స్ఫురింప లేదే. నా నిరంతరమంగళాశంసలను జి. జి. కి ని అళసింగునకును కార్యదర్శికిని ఇతరులకందఱికిని దయచేసి అందజేయుము. వారి క్షేమమునకై నేను సదా ప్రార్థించుచున్నాను. నాయందే నాకు సంతృప్తి లేదు గాని వారియందు అసంతుష్టి నాకు ఇంచుకైన లేదు. నా జీవితములో నేను ఘోరమైన ఒక్క తప్పును చేసితిని. ఒక్కసారి చేసితిని. ఒరులు సాయపడుదు రని అనుకోనుటే ఆ తప్పు. దాని ఫల మనుభవించితిని. తప్పు నాదే గాని వారిది గాదు. భగవంతుడు మదరాసుమహాజనుల నందఱిని అనుగ్రహిం చును గాక. వారు కనీసము బెంగాలీలకంటె ఎంతో మేలు. బెంగాలీలు వట్టి మూర్ఖులు. వారిలో ఆత్మ లేదు. శక్తి లేనే లేదు. నమస్కారము. నమస్కారము. నేను నా పడవను వెల్లువలో తరలించితిని. ఇక నేమైన సంభవించును గాక. మొరటుగా నేను కొన్ని విమర్శనలు చేసితినే, వానిని చేయుటకు నా కధికారము లేదు. నా అర్హతను అత్యంతము అతిక్రమించి మీరు నాకు మేలు చేసితిరి. నా కర్మను నేను అనుభవింప వలెను. గోణుగక సణుగక అనుభవింపవలెను. భగవంతుడు మి మ్మెల్లర అనుగ్రహించును గాక.

భవదీయసత్యయుత
వివేకానంద

మఱి మాట: అళసింగడు కాలేజీ మూసినా రేమో! ఆ సంగతి నా కంద లేదు. ఇంటి విలాసము నెప్పుడును అతడు నాకు తెలుప లేదు.

కిడి, మనజట్టును విడిచి పెట్టినా డేమో అని నా భయము.

వి.

## 102

(శ్రీమతి జార్జి డబల్యూ హేలునతికి)

పిష్కిల్లాండింగ్, న్యూయార్కు,
డాక్టర్ ఇ. గర్న్సెగాంట,
జూలై, 1894.

అమ్మా,

నిన్న ఇచ్చటికి చేరుకొంటిని. కొన్నాళ్లిచ్చట నుందును. న్యూయార్కులో నుండగా నీ జాబొకటి చేరినది. కాని "ఇంటీరియరు" నాకు చేరలేదు. చేరనందుకు సంతోషమే. ఏల యన నే నింకను పరిపూర్ణుడను కాను. ప్రెసిబిటేరియనుమతా చార్యులకు, ముఖ్యముగా ఇంటీరియరుపత్రికవారికి నాయందు గల "నిస్స్వార్థప్రేమ" నే నెఱిగియున్నందున ఈ "మధురక్రైస్తవ మహాజనుల" పట్ల దురభిప్రాయములను నా హృదయమున తల చూపనీయక దూరముగ నుండ మని నా కోరిక. కోపము, ఎంత ధర్మహేతుకమైనను, మహాపాపమే అని మాశాస్త్రము బోధించు చున్నది. ఎవనిమతమును వా డనుసరింప వలెను. ధర్మహేతుక మైన కోపమునకును మామూలుకోపమునకును శాస్త్రసమ్మతమైన హింసకును మామూలుహింసకును ధర్మహేతుకమైన దూషణకును అధర్మహేతుకమైన దూషణకును — ఉన్న భేదమువంటి భేద ములను నామట్టుకు నేను గుర్తింపజాల నైతిని. సూక్ష్మాతిసూక్ష్మ మైన ఆ నైతికభేదము మా దేశనీతిశాస్త్రమున ఎన్నడును ప్రవే శింప కుండును గాక. ఎగతాళిమాట అటుండ నిమ్ము. అమ్మా చర్చి, వీరి మోసము, వీరి కపటత, వీరి స్వాభిమానము పేరు ప్రతిష్ఠలుకావలె ననెడి వీరి తీట నేను బాగుగ నెఱుగుదును. వీరికి ప్రేరకములు అవే అని ఎఱుగుదును. కావున వీరి ఆటలను ఇంచుకైన లక్ష్యపెట్టను.

ఫొటోగ్రాఫులను గుఱించి :—మొదట పిల్లలు కొన్ని కాపీలను తెచ్చిరి. రెండవసారి నీవు కొన్నిటిని తెచ్చినావు. వారు ఇయ్యవలసినది మొత్తము 50 కాపీలు. నాకంటె సోదరి ఇసబెలుకు బాగుగ తెలియును.

నీకు నాయనపోపునకు నా హృదయపూర్వకప్రేమాభివందనములు.

మీ ...

వివేకానంద

మఱిమాట : ఎండబెట్టను ఏలాగు అనుభవించుచున్నావు? వేడిమిని నేనిచ్చట బాగుగనే ఓర్చుకొనుచున్నాను. సముద్రము మీద నున్న స్వాంప్స్కాటుకు రమ్మని సంపన్నమహిళ యొకతె నన్నాహ్వానించినది. ఆమె పరిచయము నాకు గడచిన శిశిరకాలమున న్యూయార్కులో కలిగినది. నేను కృతజ్ఞతను తెలుపుకొని రాజాలనంటిని. ఇచటివారి, ముఖ్యముగా సంపన్నుల, అతిథిసత్కారమును స్వీకరించు విషయమున నేను చాల మెలకువ కలిగి యున్నాను. చాలసంపన్నులైన వారు మఱికొందఱు కూడ ఇచట నన్నాహ్వానించిరి. నేను నిరాకరించితిని. ఇచటి పనియందంతటను ఉన్న మర్మమును ఈపాటికి నేను గ్రహించితిని. అమ్మా చర్చి, నీ హృదయపూర్వకతకు భగవంతుడు నిన్ను నీవారిని అనుగ్రహించును గాక. ఈ ఋజుత్వము ప్రపంచములో అంత అరుదుగ నున్నది.

భవదీయ ప్రేమయుత

వి.

## 103

(హేలిసోదరీమణులకు)

న్యూయార్కు,

జూలై 9, 1894.

సోదరీమణులారా,

జగదంబకు జయము. అనుకొన్నంతకంటె ఎక్కువగ సాధించితిని. ప్రవక్త ఆదరింపబడినాడు. ఆదరింపబడుట లేదనెడి కొదువను తీర్పవలె ననెడి పట్టుదలతో ఆదరింపబడినాడు. భగవంతుని కనికరమును చూచి నేను శిశువువలె ఏడ్చుచున్నాను. సోదరీమణులారా, భగవంతుడు తనబంటు నెప్పుడును విడిచిపెట్టడు. మీకు నేను పంపుచున్న జాబు అన్నిసంగతులను వివరించును. ఈ అచ్చు కాగితములు అమెరికాప్రజలయొద్దకు వచ్చుచున్నవి. అందు పేర్కొనబడినవారు మాదేశమున అత్యంత ప్రముఖులు. సభాధ్యక్షుడు కల్కత్తాసంపన్నులలో ప్రధానుడు. మహేశచంద్రన్యాయరత్న అనెడి మఱొకడు భారతదేశమున కంతటికిని బ్రాహ్మణవరిష్ఠుడు. ప్రభుత్వమువారే ఆ వరిష్ఠతను గుర్తించిరి. ఆయన సంస్కృతకళాశాలాధ్యక్షుడు. సమస్త వృత్తాంతమును ఈ జాబే మీకు తెల్పును. సోదరీమణులారా, నే నెంతటి దుష్టుడను! భగవదనుగ్రహము ఈలాగు కనఁబడుచున్నను నా విశ్వాస మప్పుడప్పుడు తడబడుచుండునే. భగవంతుని రక్షణలో నే నుండుట ప్రతినిమిషము కనఁబడుచున్నను మరల అప్పుడప్పుడు మనస్సు అధైర్యపడుచుండును. సోదరీమణులారా, దేవు డున్నాడు — జగజ్జనకు డున్నాడు. లోకమాత యున్నది. దేవుడు తనబిడ్డలను ఎన్నడును విడిచిపెట్టడు. విడిచిపెట్టనే పెట్టడు. విపరీతసిద్ధాంతముల నటుంచి, శిశువులవలె భగవంతుని శరణు

చారుడు. ఇంతకన్న నెక్కువగ నేను వ్రాయలేను — మగువవలె విలపించుచున్నాను.

దేవా, ఆత్మనాథా, నీకు మంగళము.

భవదీయప్రేమయుత
వివేకానంద

## 104

(శ్రీ అళసింగపెరుమాళుకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
జూలై 11, 1894.

ప్రియఅళసింగా,

"541, డియర్బారన్ అవెన్యూ, చికాగో" అనెడి విలాసమునకే తప్ప వేఱెచ్చటికిని నీవు జాబులు వ్రాయకూడదు. నీ కడపటి జాబు దేశమంతయు చుట్టుకొని వచ్చి నాకు చేరినది. నాకు ఆపాటి ప్రఖ్యాతి కలిగియున్నందుననే ఆ జాబు నాకు చేరగలిగినది. తీర్మానములలో కొన్నింటిని డాక్టరు బ్యారోసుకు పంపవలెను. నాయందలి ఆయన కనికరమునకు కృతజ్ఞతను తెలుపుచు జాబునుకూడ వ్రాయవలెను. ఆ జాబును అమెరికను వార్తాపత్రికలలో ప్రకటింపుమని ఆయనను కోరవలెను. ఏలయన అట్లు ప్రకటించినచో నేనెవరిప్రతినిధియు కానని పాదిరీలు ప్రచారము చేయుచున్న అసత్యవార్తలకు మంచి ఖండన మగును. నాయనా, కార్యకౌశలము అలవఱచుకో, మన మింకను ఘనకార్యములను చేయ నున్నాము. క్రిందటిసంవత్సరము నేను బీజములను మాత్రమే చల్లినాను. ఆ పైరును ఈ సంవత్సరము కోసికొంద మని యున్నాను. ఈ మధ్యకాలమున భారతదేశమున సముత్సాహమును శక్యమైనంత అభివృద్ధిలో నిల్పుము. కిడి అతనిదారిని అతడు పోవును గాక. కాలము వచ్చినప్పుడు అతడు చక్క నగును. అతనిబాధ్యతను నేను చేపట్టితిని. సొంతఅభిప్రా

యము కలిగియుండుటకు అతనికి పూర్తిహక్కున్నది. పత్రికను అతనిచే వ్రాయించుచుండుము. అట్లు వ్రాయుచుండిన అతని మనస్సు కుదురుపాటు తప్పకుండును. అతనికి నా ఆశీస్సులు.

. పత్రికను ప్రారంభింపుము. నే నప్పుడప్పుడు వ్యాసములు పంపుచుందును. బోస్టనులోని హార్వర్డువిశ్వవిద్యాలయపు ప్రొఫెసరు జాన్హెన్రీరైటుగారికి ఒకపత్రికను పంపుచు ఈదేశమున నాకు ప్రథమసఖుడుగనుండినందులకు కృతజ్ఞతను తెలుపు లేఖను కూడ వ్రాయవలెను. ఆ లేఖను పత్రికలలో ప్రకటింపు మని కోరుచు జాబు వ్రాయవలెను. పాదిరీలదుష్ప్రచారమునకు ఇది ఖండన మగును.

డిట్రాయిటులో చేసిన యుపన్యాసమునకు నాకు 900 డాలర్లు (2,700 రూపాయలు) లభించినవి. తక్కిన ఉపన్యాసములలో ఒకదానికి గంటసేపు చేసిన ప్రసంగమునకు 2,500 డాలర్లను (7,500 రూపాయలను) గడించితిని. కాని నాచేతికి వచ్చినవి 200 డాలర్లే! ఉపన్యాసములు చేయించిన వంచకపరిషత్తువారు నాకు టోపీ వేసిరి. వారిని నేను వదలుకొంటిని. ఇచ్చట నేను చాలధనమును వ్యయించితిని. ఇంచుమించు 3,000 డాలర్లు మాత్రమే మిగిలి యున్నవి.

పై సంవత్సరము ముద్రణకార్యము ఎక్కువగ నుండును. నే నొక క్రమమార్గమున పనిచేయబోవుచున్నాను. ... సంకల్పశక్తి సర్వమును సాధించును. ... నీ వొక సమితిని నెలకొల్పవలెను. దాని సమావేశములు చక్కగ జరుగుచుండవలెను. వానినిగూర్చి నీవు నాకు శక్యమైనంతతఱచుగ వ్రాయుచుండవలెను. నిజమునకు నీకు శక్యమైనంత యుత్సాహమును రప్పించుకొనుము. అసత్యమును గూర్చి మాత్రము మెలకువ గలిగియుండుము. నా బాలులారా, పనికి పూనుకొనుడు. మీకు ఉత్సాహము పుట్టును. నిర్మాణాత్మక మైనశక్తి మనప్రకృతిలో బొత్తుగా లేదు. కాని దానిని కలిగించు కొనవలెను. గొప్పరహస్యము ఇది — ఈర్ష్యారహితత.

మీ సోదరుల అభిప్రాయములకు తలయొగ్గుటకు సదా సంసిద్ధులరై యుండుడు. కోపము మాన్పుటకు సదా ప్రయత్నించుచుండుము. మర్మ మంతయు అదే. ధీరముగ పోరాటము సాగింపుడు. జీవితము క్షణభంగురము. ఒక గొప్ప లక్ష్యమునకై ఆ జీవితము నర్పింపుము. నరసింహునిగూర్చి ఏమియు వ్రాయవే ఏల? అతడు ఇంచుమించుగా పస్తులతోనే కాలము గడపుచున్నాడు. నేను కొంత ఇచ్చితిని. అతడు తర్వాత ఎక్కడికో పోయినాడు. ఎక్కడికో నే నెఱుగను. జాబు వ్రాయడు. అక్షయుడు మంచి పిల్లవాడు. అతడు చాల ఇష్టుడు. దివ్యజ్ఞానసమాజసభ్యులతో జగడమాడుట వ్యర్థము. నేను నీకు వ్రాసిన వానినెల్ల, పోయి వారికి చెప్పకు. ... దివ్యజ్ఞానసమాజమువారు మనకు మార్గదర్శకులు. నీ వెఱుగవా? జడ్జి హిందువు, కర్నలు బౌద్ధుడు. ఇచ్చటి వారిలో అందఱికంటె జడ్జియే అధికసమర్థుడు. జడ్జికి తోడ్పడుదని హిందూదివ్యజ్ఞానసమాజసభ్యులతో చెప్పుము. తోడిమతమువాడనియు అమెరికనులకు హిందూమతమును విప్పి చెప్పుటకు శ్రమపడినవా డనియు అభినందించుచు జడ్జికి నీ వొక జాబు వ్రాయగలిగిన అతని హృదయమున కదెంతో హితకర మగును. ఏ కక్షలోను మనము కలియ కూడదు. కాని ప్రతికక్షవారితోను సానుభూతి కలిగి పాటుపడవలెను. ... పాటుపడుడు, పాటుపడుడు — ప్రేమచేత అందఱిని వశపఱచుకొనుడు.

వికాస మొంద ప్రయత్నింపుడు. చలనమును వృద్ధియునే జీవితలక్షణము లనుటను జ్ఞప్తియుంచుకొనుడు. అచ్చట కావింపబడిన తీర్మానములను డాక్టరు జె. హెచ్. బట్రోసుకు ... డాక్టరు పాలుకారూసుకు ... సెనెటరు పామరుకు ... శ్రీమతి జె. జె. బాగ్లీసతికి పంపవలెను. అవి అధికారికముగ అందవలెను. విదేశీయులపద్ధతులు నీ వెఱుగవు కావున నీకు ఈ సలహాలు వ్రాసితిని. ... పురోగతిని సాగించుచునే యుండుము. ఇప్పటివఱకు మనము అద్భుతకార్యములను నిర్వహించితిమి. ధీరాత్మ

లారా, ముందుకు పదండి. మనము గెల్చితీరుదుము. సాంగో పాంగములైన సమితులను నెలకొల్పుడు. పనికి పూనుకొనుడు. అదొక్కటే మార్గము.

సంవత్సరములో ఈ దినములలో ఇచట చేయవలసిన ఉపన్యాసకార్యక్రమము అంతగా నుండదు. కావున కలము చేపట్టి రచనలు చేసెదను. ఈ కాల మంతయు శ్రమించి రచనలు చేసెదను. తర్వాత శీతకాలము వచ్చును. ప్రజలు ఇండ్లకు మరలుదురు. నే నుపన్యాసములు మరల ప్రారంభింతును. ఉపన్యాసములతోబాటు సమితులనుగూడ ఏర్పఱచెదను. మీ కందఱకును నా ప్రేమాశీస్సులు. నేను జాబులు తఱచుగ వ్రాయ కున్నను ఎవరినిగాని ఎప్పుడుగాని మఱచిపోను. నే నిప్పుడు నిరంతరముగ పర్యటించుచున్నందున నాకు వ్రాయబడిన జాబులు ఒక విలాసమునుండి మఱొకవిలాసమునకు త్రిప్పి పంపబడుచుండవలెను.

కష్టపడి పనిచేయుడు. పవిత్రులుగను నిర్మలులుగను కండి. ఉత్సాహతేజము తప్పక కల్గును.

భవదీయప్రేమయుత
వివేకానంద

## 105

(హేలు సోదరీమణులకు)

స్వాంప్సాకాటు,
జూలై 26, 1894.

గారాబుబిడ్డలారా,

దయచేసి నా జాబులను మనవర్గమును దాటిపోనీయకుడు. సోదరి మేరీ నాకు చక్కని జాబు వ్రాసినది. ముందు కుఱుకు నాయం దెట్లు కలుగుచున్నదో చూడుడు. అదంతయు సోదరి జీని నాకు బోధించు పాఠము. ఆమె రాక్షసివలె దుముకి కలదు,

పరుగిడ గలదు; ఆటాడ గలదు, ప్రతిజ్ఞలు చేయగలదు. నిమిష మునకు 500 ల చొప్పున అపభ్రంశవాక్కు లాడ గలదు. ఆధ్యాత్మికవిషయమున మాత్రము ఆమె కెక్కువ శ్రద్ధ లేదు. చాల తక్కువశ్రద్ధయే! ఈ దిన మామె స్వగ్రామమునకు పోయి యున్నది. నేను గ్రీనేకరుకు పోవుచున్నాను. శ్రీమసతిని దర్శించు టకు పోయి యుంటిని. స్టోనుసతియు నచట నుండెను. పుల్మాను సతియు ఆమెతో కూడనే యుండెను. సువర్ణమత్కుణము లందఱును ఈ ప్రాంతీయలైన నాప్రాతనెచ్చెలు లందఱును నచ్చట నుండినారు. వారి దయయు ఎప్పటివలెనే యుండెను. గ్రీనేకరు నుండి మరలి వచ్చునప్పుడు దారిలో శ్రీమతి బాగ్లీసతిని దర్శించు టకై అన్నిస్క్వామునకు పోయి కొన్నా ళ్లుందును. ఛీ, ప్రతివిష యమును మఱచిపోవుచున్నాను. కడలిలో చేపలవలె మునకలు వేసితిని. ఇందు ప్రతిలవమును నా కానందకరముగ నున్నది. "డాన్ లా ప్లేన్" "అది పిశాచగ్రస్త మగుత" అని హార్యెట్ నాకు నేర్పిన పాట ఏమి పిచ్చిపాట. నేను దాని నొక ఫ్రెంచి పండితునియెదుట వల్లించితిని. నా అద్భుతమైన అనువాదమునకు అతడు పడిపడి కడుపు చెక్క లగునట్లు నవ్వినాడు. మీరు నాకు ఫ్రెంచిభాషను నేర్పు పద్ధతి అది. చెప్పుచున్నాను: మీది మత రహితమూర్ఖులతండము. ఒడ్డునబడిన పెద్దచేపవలె మీ రిప్పుడు ఊపిరికై కొట్టుకొనుచున్నారా? మీరు కీచుకీచు మనుచున్నారు. సంతోషము. ఔరా, ఇచ్చట యెంత చల్లగ హాయిగ నున్నది. ఉడుకుచు మాడుచు కీచుకీచు మనుచు బుసకొట్టుచు నున్న ముది మహిళల నలుగురిని తలంచుకొన్నప్పుడు ఇచటి హాయి నూఱంత లుగ హెచ్చుచున్నది. ఎంత హాయిగా చల్లగా నున్నా నిచ్చట. హహా!

న్యూయార్కురాష్ట్రములో ఒకచోట కుమారి ఫిలిప్సునకు మంచి చోటొకటి కలదు. కొండ, చెఱువు, నది, అడవి అన్నియు నున్నవి. ఇ కేమి కావలయును? నే నిచట ఒక హిమాలయ

ప్రాంతమును ఏర్పఱచి అట నొక మఠమును స్థాపింపబోవు చున్నాను. నేను బ్రతికియున్నా ననుట ఎంత నిజమో ఆ పనిని చేయుదు ననుట అంత నిజము. అమెరికా మతరంగము ఘోష లతో పోరాటములతో కొట్లాటలతో ఉన్మాదములతో ఇప్పటికే ఒక సుడిగుండముగ నున్నది. దానిలోనికి మఱొక భేదఫలమును విసరివేయక నే నీ దేశమును వదలి రాబోను. సరి, ప్రియవృద్ధాంగనలారా, మీ రప్పు డప్పుడు ఆ కాసారమును చూచుచుండుడు. ఎండవేడిమితో కూడిన ప్రతిమధ్యాహ్నవేళయందును సరస్సులో అడుగుదాక మునుగ నభిలషించుచుందురు. చల్లగా హాయిగా ఉండునంతవఱకు లోతుకు పోవ, చెఱువునడుగునేలపై పవ్వళింప, నలువైపులను పైవైపును చల్లదన ముండ, మంచునీటిని త్రాగుచు నిశ్శబ్దముగ నిశ్చలముగ అట పరుండి—నిద్రపోవక—నల్లమందు తెచ్చు మైకమువంటి అర్ధచైతన్యస్థితిలో కలలు గనుచు కునుకు తీయుచుండ గోరుదురు. మధురమైన అనుభవము! దేవుడు నాయాత్మ ననుగ్రహించును గాక. ఏనుగునైనను చంప గల చలి తిమ్మిరివాయువు నాకు పెక్కుసార్లు కలిగియున్నది. కావున నేను చల్లనీటికి దూరముగ నుండ గోరుదును.

గారాబు చెల్లాయిలారా, మీ రందఱును సుఖముగ నుందురు గావుత మని సదా ప్రార్థించుచుండు

వివేకానంద

## 106

గ్రీనేకరుఇన్,
ఇలియట్, మెయిన్,
జూలై 31, 1894.

ప్రియసోదరీమణులారా,

చాలకాలమునుండి మీకు నేను జాబు వ్రాయ లేదు. వ్రాయుటకు సంగతులును నాకు లేవు. ఇ దొక సత్రము. పల్లె

విడిది. క్రైస్తవవిజ్ఞానవేత్తలు తమ సభ నిట జరపుకొనుచున్నారు. కడచిన వసంతకాలములో నేను న్యూయార్కులో నుండగా ఈ సమావేశమును తలపెట్టిన మహిళ నన్నిచ్చటి కాహ్వానించి నది. కావున ఇక్కడికి వచ్చియున్నాను. ఇది మిగుల చక్కని చల్లని తావు, సందేహము లేదు. చికాగోలోని నా తొల్లింటి మిత్రు లెందఱో ఇచ్చట ఉన్నారు. మిల్సుసతియు కుమారి స్టాక్హాముసు ఇతరమహిళలును మహాజనులును పెక్కండ్రు నదీ తీరమున బహిరంగప్రదేశములో వేసికొనిన డేరాలలో బసచేయు చున్నారు. వీరికి కాలము సోల్లాసముగ గడచిపోవుచున్నది. వీరందఱును ఒక్కొక్కప్పుడు వైజ్ఞానికవస్త్రము లనబడు దుస్తు లను దిన మంతయు ధరించియుందురు. వారి ఉపన్యాసకార్య క్రమము ఇంచుమించు ప్రతిదినమును ఉన్నది. బోస్టనునుండి వచ్చిన కాల్విల్లా అను నతడు ఇచ్చట నున్నాడు. సారాయి కైపుతో అతడు ప్రతిదినము ఉపన్యసించుచుండును. యూనివర్స ల్ ట్రూత్ అను పత్రిక సంపాదకురాలు ఇచట స్థిరపడినది. ఆమె పూజాకలాపములను నిర్వహించుచు తరగతులను జరపుచు అన్ని రకాల వ్యాధులకును వైద్యమును నేర్పుచున్నది. చాలత్వరలోనే వారు గ్రుడ్డివారికి కన్ను లొసగుట మున్నగు అద్భుతములు చేయ గల రని నా ఆశ! మొత్తమున కది వింతముఠా. సాంఘిక నియమములను వా రంతగా పాటింపరు. చాల స్వేచ్ఛగా సుఖ ముగా ఉన్నారు. మిల్సుసతి సముజ్జ్వలప్రతిభావతి. తక్కిన మహిళలును అట్టివారే. ... డిట్రాయిటునుండి వచ్చిన మఱొకతె — విశేషసంస్కారవతి, సుందరశ్యామనేత్ర, సుదీర్ఘకుంతల, నన్ను సముద్రమున పదునైదు మైళ్ల దూరమున ఉన్న ఒకలంకకు పిలుచుకొనిపోబోవుచున్నది. అచటి వాసము హాయిగ ఉండు ననుకొనుచున్నాను. ... ఇందుండి అన్నిస్క్వాముకు పోవుదు నేమో అనుకొనుచున్నాను. ఈచోటు అందముగా ఆనంద కరముగా నున్నది. ఇచటి స్నానము చాల బాగున్నది.

కోరాస్టాక్హాము నాకై స్నానాంబరములను తయారు చేసి యిచ్చి నది. నేను బాతువలె హాయిగా నీటిలోనే ఉన్నాను. ముఱికి పల్లెవాసులకుసైతము ఇది మధురానుభూతి. వ్రాయుటకు ఇంత కంటె వేఱేమియు లేదు. కార్యభార మెక్కువగ నున్నది. అమ్మ చర్చికి ప్రత్యేకముగా జాబు వ్రాయుటకు వ్యవధి చిక్కకున్నది. కుమారి హేలాకు నా ప్రేమాభివందనములు.

బోస్టనువాసియైన ఉడ్ ఇచట నున్నాడు. మీవర్గములోని గొప్పజ్యోతులలో అత డొకడు. వ్హిరల్పూలుసతి వర్గమునకు చేరుట అతని కసమ్మతము. తాత్త్విక - రసాయనిక, భౌతి కాధ్యాత్మికాదిమార్గములలో తాను మానసికమహాభిషగ్వరుడ నని అతడు చెప్పుకొనును. నిన్న నొక భయంకరమైన తుపాను వీచినది. దానివలన డేరాలకు మంచి చికిత్స జరిగినది. వారి ఉపన్యాసములు జరుగుచుండిన పెద్ద డేరా పూర్వోక్తచికిత్సా విధానమువలన మానవదృష్టికే పూర్తిగా అగోచరమైపోవునంతటి ఆధ్యాత్మికాభివృద్ధి నందినది! ఆధ్యాత్మికభావోద్రేకముచే సుమారు రెండువందల కుర్చీలు ఆ ప్రదేశమున నృత్యము చేయు చుండినవి! మిల్సుకంపెనికి చెందిన ఫిగ్సుసతి ప్రతిదినము ప్రొద్దున ఒకతరగతికి పాఠము చెప్పుచుండును. మిల్సుసతి ఇట నెల్లెడల గంతులు వేయుచున్నది. వీరందఱును మహోల్లాసముతో నున్నారు. ప్రత్యేకముగా కోరావిషయమై నేను ఆనందించు చున్నాను. కడచిన శీతకాలములో ఆమెయు ఆమెవారును చాల బాధపడిరి. కావున ఈ యించుకంత ఆనందము ఆమెకు హితమే. తమతమ మకాములలో వా రనుభవించు స్వేచ్ఛతో కూడిన హాయిని చూచిన మీ రాశ్చర్యపడుదురు. కాని వారు చాల మంచివారు, పవిత్రులు, రవంత విపరీతవర్తనులు. పైశనివారము వఱకు నే నిచట నుందును. ...

... మొన్నటిరాత్రి వీరందఱు ఒక దేవదారువృక్షముక్రింద నిద్రించిరి. ప్రతిదినము ప్రొద్దునను హిందువులపద్ధతిలో కూర్చుండి

వారితో నేను ప్రసంగించునది ఆ చెట్టుక్రిందనే. వారి వెంబడి పోయితిని. నక్షత్రములక్రింద ఆరాత్రి మాకు హాయిగ గడిచినది. భూమాత ఒడియందు నిద్రించితిమి. ఆరాత్రి ప్రతిక్షణము నాకు పరమానందమును కలిగించినది. ఒకసంవత్సరకాలము మోటు జీవితము గడపిన నేను ఆ నేలపై నిద్రించుటయు వనమధ్యమున ఆ వృక్షతలమున ధ్యానించుటయు ఒనగూడినట్టి ఆరాత్రి మహిమలను నీకు వర్ణించి చెప్పజాలను. సత్రమువా రందఱును ఇంచుమించు ధనవంతులే. మకాములో నుండు మహిళలును మహాజనులును ఎల్లరును ఆరోగ్యవంతులు, తరుణవయస్కులు. ఆర్జవ సంపన్నులు, పవిత్రులు. శివోహమ్, శివోహమ్ అని వారికి నేను నేర్పుదును. అమాయికులును పవిత్రులును నిరవధికధైర్యవంతులును అగు వీ రందఱును ఆ మంత్రమును వల్లింతురు. ఇట్లు సుఖమును ఆదరమును అనుభవించుచున్నాను. నాకును డేరాలలోని ఈ శిశువులకును పేదటికమును ప్రసాదించినందులకు దేవునకు కృతజ్ఞుడను. డ్యూడులును డూడైనులును హోటలులో ఉన్నారు. కాని ఇనుపనరాలవారు ఉక్కుటాత్మలవారు సుతీక్ష్ణోత్సాహులును మకాములో నున్నారు. కుంభవృష్టిగా వాన కురియుచుండ, భయంకరమైన తుపాను ప్రతివస్తువును తలక్రిందులు చేయుచుండ, డేరాగుడ్డ లెగిరిపోకుండ వాని కొనల నంటిన త్రాళ్లను గట్టిగా పట్టుకొని వ్రేలుచు, ఆత్మమహిమపై ఆధారపడి నిలిచియుండిన ఈధీరులను నిన్న మీరు చూచియుండినచో ఆదర్శనము మీ హృదయములకు శ్రేయస్కరమై యుండెడిది. వారివంటివారిని చూచుటకై ఎన్నివందల మైళ్లైనను నడచి పోదును. ఈశ్వరుడు వారి ననుగ్రహించు గాక.

చక్కని మీపల్లెజీవితము మీ కానందకరముగ నున్నదనుకొనుచున్నాను. క్షణమైనను వ్యాకులపడకుడు. నన్ను విచారించుకొనువా రున్నారు. లేకున్నచో నాకు కాల మాసన్నమైనదని గ్రహించి నిష్క్రమింతును.

"ప్రియా, పలువురు నీకు పలువస్తువులను సమర్పించు చుందురు. నేను నిఱుపేదను. కాని నాకు శరీరమును మనస్సును ఆత్మయు కలవు. వీనిని నీకు సమర్పించుచున్నాను. విశ్వనాథా, అనుగ్రహించి వీనిని స్వీకరింపుము. నిరాకరింపకుము." ఇట్లు నాప్రాణమును నాయాత్మను భగవంతునకు శాశ్వతముగ అర్పించి వైచితిని. ఒక్కమాట: ఇచ్చటివారి ప్రకృతిలో ఆర్ద్రత లేదు. ఆర్ద్రప్రకృతులు జగమున అత్యల్పసంఖ్యాకులే. ప్రియుడైన 'మాధవు'ని వీ రెఱుగరు. వీరు అటు ప్రతిభాపరులుగనైన నుందురు. ఇంద్రజాలమును విప్లవమును మంత్రవైద్యమును అనుసరించువారుగనైన నుందురు. "ప్రేమ", "బ్రతుకు", "స్వేచ్ఛ" అను శబ్దము లీ దేశమున వినబడునంతగా మఱెందును వినబడవు. కాని ఆశబ్దముల అర్థపరిజ్ఞానము ఈదేశమున కొఱవడినంతగా మఱెందును కొఱవడి యుండ లేదు. ఇచ్చట దైవ మనుటకు భయంకరుడు, రోగనివారకుడు, చలనస్వరూపి అను ఇత్యాదులు అర్థములు. భగవంతుడు వీరి ననుగ్రహించు గాక. రేయింబవళ్లు ఈచిలుకలు ప్రేమప్రేమప్రేమ అని పలుకుచుందును.

మీకు మంచి కలలును సదాశయములును కలుగుత. మీరు మంచివారు, ఉదారస్వభావులు. ఆత్మను అచిత్తుగా మార్పొందింపక, అనగా ఇచటివారు చేయునట్లు ఆత్మను అచిత్ స్థాయికి దింపక, మఱి జడపదార్థమును ఆత్మగా మార్చుకొనుడు. అనంతసౌందర్యశాంతివిశుద్ధినిలయమగు ఆధ్యాత్మికజగత్తును ప్రతి దినమును ఒక్కసారియైన సాక్షాత్కరించుకొని రాత్రింబవళ్లు ఆజగతిలో వసింప ప్రయత్నింపుడు. హేయమైనదానిని దేనిని గాని అన్వేషింపకుడు. కాలివ్రేళ్లతో సైతము దాని నంటకుడు. అహర్నిశలు మీఆత్మలు అచ్ఛిన్నసూత్రములవలె అధిరోహించి మీహృదయపీఠస్థితుడును ప్రాణనాథుడు నగు భగవంతుని చరణముల చేరును గాక, శరీరాదులైన తక్కిన వన్నియు తమగతిని తాము చూచుకొననిండు. ప్రాణము క్షణికము. చరచర సాగి

పోవు స్వప్నము. యౌవన సౌందర్యములు మాసిపోవును. "నీవు నా తండ్రివి, నా తల్లివి, నా పతివి, నా ప్రియవు, నా ప్రభువవు, నా దేవుడవు—నీవు తక్క నాకు మఱేమియు వలదు. నీవు తక్క నాకు మఱేమియు వలదు. నీవు తక్క నాకు మఱేమియు వలదు. నీవునాలో నున్నావు, నేను నీలో నున్నాను. నేను నీవు, నీవు నేను అని రేయింబవళ్లు వల్లింపుడు. ధనము పోవును, సౌందర్య మంత ర్ధాన మగును. ప్రాణ మెగిరిపోవును. శక్తి తెగిరిపోవును. కాని ప్రభువు నిత్యుడు. ప్రేమ నిత్యము. యంత్రమును సుస్థితిలో నుంచుట మేలగుచో ఆ దేహముతో బాధపడకుండునట్లు ఆత్మను నిలిపియుంచుట మఱింత మేలు. మీరు జడపదార్థములు కా రను టకు ఇదొక్కటే సూచన. జడముజోలికి పోకుడు.

ఈశ్వరునే అవలంబింపుడు. శరీరమునకు గాని మఱి దేనికి గాని ఏమి వాటిల్లిన నెవరికి లక్ష్యము ? పాపమునకు భయపడు చున్నప్పుడు "నా ప్రభూ నాప్రియా" అనుడు, మరణయాతన పడుచున్నప్పుడును "నాప్రభూ, నాప్రియా" అనుడు, సమస్తకష్ట పరంపరలు అనుభవించుచున్నప్పుడు "నాప్రభూ, నాప్రియా, నీ విం దున్నావు. నిన్ను నేను దర్శించుచున్నాను. నీవు నాతో నున్నావు. నీస్పర్శ తెలియుచున్నది. నేను నీవాడను. న న్నంగీ కరింపుము. నేను లోకమువాడను కాను. నీవాడను. కావున నన్ను పరిత్యజింపకుము" అని పలుకుడు. రత్నముల గనిని పరిత్య జించి గాజుపూసలకై దేవులాడకుడు. ఈ జీవిత మొక గొప్ప అవకాశము. ప్రాపంచిక సుఖముల కోరెదవా ? అతడు సమ స్తానందనిధానము. పరమోన్నతమైన దానిని కోరుడు. పరమో న్నతమైనదానిని లక్షింపుడు. పరమోన్నతమైనదానిని మీ రధిగమించి తీరుదురు.

సమస్తాశీస్సులతో.

భవదీయ
వివేకానంద



గ్రీనేకరులో శ్రీ వివేకానందస్వామి — (1894)

107

(హేలు సోదరీమణులకు)

గ్రీనేకరు,
ఆగస్టు 11, 1894.

ప్రియసోదరీమణులారా,

ఇన్నాళ్లును నేను గ్రీనేకరులోనే ఉండినాను. ఈప్రదేశము నాకు చాల ఆనందకరముగ నున్నది. ఇచటివా రందఱును నాయెడల చాల దయగలిగియుండినారు. కెనిల్వర్తుకు చెందిన ప్రాట్ సతి అను చికాగోమహిళ నాకు 500 డాలర్లు ఇయ్య గోరినది. ఆమెకు నాయం దంతాదరము పుట్టినది. కాని నేను ఆవిరాళమును నిరాకరించితిని. నాకు పైకము కావలసివచ్చినప్పుడు ఆమెకు కబురుచేయవలసినట్లు నాచేత వాగ్దానము చేయించు కొన్నది. కాని భగవంతుడు న న్నట్టి దశకు తేకుండవలెనని నా ఆశ. దేవుని సాహాయ్యమొక్కటే నాకు చాలును. మీయొద్ద నుండిగాని అమ్మయొద్దనుండి గాని నా కెట్టి వార్తయు తెలియరా లేదు. ధ్వనియంత్రము (ఫోనోగ్రాపు)నుగూర్చి ఇండియానుండి నా కే కబురును అంద లేదు.

నాయుత్తరములో మీకు కోపము పుట్టించు విషయ మేది యైన నుండె నేని, ప్రేమచేతనే అట్లు వ్రాసితినని మీకు తెలియు ననుకొందును. మీదయకు నేను కృతజ్ఞత తెల్పుట వ్యర్థము. భగవంతుడు మిమ్మనుగ్రహించుగాక. మీకును మీప్రేమపాత్రు లకును భగవంతుడు వరిష్ఠమంగళముల వర్షించు గాక. మీకుటుం బముపట్ల నాకృతజ్ఞత సదా ఉన్నది. అది మీకు తెలిసినదే. మీ అనుభవములోనిదే. మాటలలో తెలుపలేను. ప్లిమత్తులో కర్నలు హిగ్గిన్సను ఏర్పాటుచేసిన సభలందు ఆదివారమునా

దుపన్యసింపబోవుచున్నాను. కోరాస్టాహ్గాము తీసిన చెట్టు క్రింది జట్టు ఫోటోను ఇందుతో పంపుచున్నాను. అది చిత్తుప్రతి. (ప్రూఫు) మాత్రమే. వెలుపల పెట్టియుంచినచో మాసిపోవును. ఇంతకంటె మేలైన దెప్పుడు నాకు దొరకదు. కుమారిహేలకు నాహృదయపూర్వకప్రేమను కృతజ్ఞతను తెల్పుడు. నాయం దామె యెంతో దయజూపినది. ప్రస్తుతము నా కేమియు అక్కఱ లేదు. నా కేదేని కావలసివచ్చిన మీకు తెలిపికొనుట నాకానంద దాయకము. ప్లిమత్తునుండి చిక్కాగోకు పోవుదు నేమో అనుకొను చున్నాను. అచట నేనుండబోవునది రెండుదినములుమాత్రమే. మలిజాబును మీకు చిక్కాగోనుండి వ్రాసెదను. మీ రందఱు క్షేమముగ నున్నా రనుకొందును. అనుకొను టేమి, క్షేమము గనే మీ రున్నా రని నే నెఱుగుదును. పవిత్రచిత్తులగు ధర్మాత్ము లకు అసుఖ మెన్నడు నుండదు. నే నిచట నుండు కొన్నివారము లును నాకు చాల సుఖముగ గడవగలవు. తర్వాతి మకాము న్యూయార్కులో. న్యూయార్కు గొప్పచోటు, మంచిచోటు. వేఱు ఏనగరమువారిలోను కనిపింపని కార్యదీక్ష న్యూయార్కు ప్రజలలో గలదు. పాటర్సామరు సతి నుండి నా కొక లేఖ వచ్చినది. ఆగస్టులో తన్ను చూడు మని ఆజాబులో కోరి యున్నది. ఆమె పరమదయానుగ్రహాదిసంపన్న. ఇక నేను విశేషించి వ్రాయవలసిన దేమియు లేదు. నాన్యూయార్కు మిత్రుడు డాక్టరు జేన్సు అనెడి నైతికసాంస్కృతిక సంఘాధ్యక్షు డున్నాడు. ఆయన తన ఉపన్యాసకార్యక్రమమును ఆరంభించి నాడు. వినుటకు నేను పోవలెను. మాయిద్దఱి కెంతో సామరస్య మున్నది. మీరు సదా సుఖముగ నుందురు గాక.

సర్వదా మీశ్రేయముకోరు సోదరుడు
వివేకానంద

## 108

(కుమారి ఇసబెల్లా మెకండ్లీకి)

అన్నిస్క్వామ్,
ఆగస్టు 20, 1894.

ప్రియసోదరీ,

దయతో నీవు వ్రాసిన జాబు అన్నిస్క్వాములో అందినది. మరల బాగ్లీలతో బసచేయుచున్నాను. యథాప్రకారముగా వా రాదరించుచున్నారు. ప్రొఫెసరు రైటు ఇచట లేడు. మొన్ననే వచ్చినాడు. మేము కలిసి ఆనందముగా కాలము గడపితిమి. ఇవాన్‌స్టను వాడగు బ్రాడ్లీని ఇవాన్‌స్టనులో నీవు కలసికొంటివే అతడే ఇచట ఉన్నాడు. అతనివదినె (మఱదలు?) పెక్కుదినములు నన్ను కూర్చుండబెట్టి నా పటమును చిత్రించినది. నౌకాయానవినోదము కొంత యుండినది. ఒకనాటి సాయంకాలము పడవ తలక్రిందులై దుస్తులు మున్నగునన్నింటితో బాగుగా నీట మునిగితిని.

గ్రీనేకరులో కాలము నాకు చాల చాల హాయిగా గడచినది. అచటి ప్రజలు దయార్ద్రవసంపన్నులు. ఫెన్నీహార్లేయు శ్రీమతి మిల్సును ఈపాటికి తిరిగి యిల్లు చేరుకొని యుందు రనుకొనుచున్నాను.

ఇందుండి న్యూయార్కుకే తిరిగి పోదు నేమో. లేదా బోస్టనులో శ్రీమతి ఓల్బులునొద్దకు పోయెదను. నీవు కీర్తిశేషుడగు శ్రీఓల్బులును గుఱించి వినియుందువు. ఫిడేలువాద్యవిద్యలో ఈదేశమున అతడు గొప్పవాడు. అతనిసతి ఆమె, చాల ఆధ్యాత్మికపరత గలది. ఆమె కేంబ్రిజ్జిలో వసించుచుండును. ఆమె యింట నొక చక్కనిపెద్దగది యున్నది. అది పూర్తిగా కొయ్యసామానుతో చేయబడినగది. ఆకొయ్యసామాను దూరదేశమగు

భరతఖండము నుండి తెప్పింపబడినది. ఎప్పుడైనను సరే నన్ను తనయొద్దకు రమ్మని అగదిని నాయుపన్యాసములకు ఉపయోగించుకొమ్మని ఆమె కోరియున్నది. ఏకార్యక్రమమునకైనను సరే గొప్ప రంగము బోస్టను. కాని బోస్టనుప్రజలు ఏపనికైన ఎంత త్వరలో పూనుకొందురో అంతత్వరలోనే మానుకొందురుగూడ. న్యూయార్కు పౌరులు ఏపనినైన చేపట్టుటకు ఆలస్య మగును. కాని చే పట్టినప్పుడు అది భల్లూకపుపట్టు!

ఇంతకాలము నా యారోగ్యము చాల బాగుండినది. ముందుముందుగూడ నట్లే యుండు ననుకొందును. కూడబెట్టు కొన్న మొత్తమునుండి తీసి వెచ్చింపవలసిన ఆవశ్యకత నా కింకను కలుగ లేదు. నాహాయికి లోటు లేకున్నది. ధనార్జనప్రణాళికల నన్నిటి మానుకొంటిని. కూడును నీడయు నున్న నాకు చాలును. నా పని సాగుచుండును.

వేసవివిడిదిలో వాసము నీకు ఆహ్లాదకరముగ నున్న దను కొందును. కుమారివర్గాకును శ్రీఫ్రాంక్లాకును నా ప్రేమాభివందనముల నందజేయుము.

నానివాస - నిద్రా - ప్రసంగములను చెట్టునీడలో సాగించుచు కొన్నాళ్లపాటైనను నేను మరల స్వర్గలోకమునంబోలె నుండిన వైనమును నీకు క్రిందటి జాబులో వ్రాసియుండ నైతిని గాబోలు.

రాబోవు చలికాలములో న్యూయార్కును నాకార్యరంగముగ చేసికొందు నేమో. ఈవిషయము నిర్ధారితమైన పిదప నీకు వ్రాసెదను. ఈదేశముననే ఉందునా అను విషయమును నే నింకను గట్టిగ తీర్మానించుకొనలేదు. అట్టివిషయములలో ఒక తీర్మానమునకు రాలేదు. సమయమునకు వేచియుందును. మిమ్మంద అను జగదీశుడు సదా అనుగ్రహించు గాత మనుటే ప్రేమపూర్ణ డగు మీసోదరుని నిరంతరప్రార్థనము.

వివేకానంద

109

(శ్రీ అళసింగపెరుమాళుకు)

అమెరికా సంయుక్తరాష్ట్రములు,
ఆగష్టు 31, 1894.

ప్రియఅళసింగా,

మదరాసునుండి వచ్చిన ప్రకటనపత్రము నుదాహరించుచు బోస్టన్ట్రాన్స్క్రిప్టు పత్రికలో వెలువడిన సంపాదకీయ వ్యాసమును ఇప్పుడే చూచితిని. నా కింకను ఏమియు అంద లేదు. దానిని నీ విప్పటికే పంపి యుండిన అది త్వరలోనే నా కందును, అబ్బాయి, ఇంతవఱకు నీపనిని అద్భుతముగా నెఱవేర్చితివోయి, ధైర్యము కలతజెందిన నిమిషములో నే నేమేని వ్రాసిన లక్ష్యపెట్టకు. మాతృదేశమునకు 15000 మైళ్లదూరమున ఒంటరిగ నుండి ఒక్కొక్క అంగుళము ముందుకుసాగుటకును ఛాందసులగు క్రైస్తవుల ధాటి నెదిరించి పోరాడుచున్నప్పుడు అప్పుడప్పుడు ధైర్యము చలించుచుండును. నాధీరార్భకా, ఈవిషయాలను నీవు ఆలోచింపవలె. ఆలోచించి తుదవఱకు పాటుపడవలెను.

జి. జి. యొద్దనుండి ఒక చక్కనిజాబు వచ్చిన దని భట్టాచార్యునివలన వినియుందువు. అతని చిరునామాను కీకరబాకరగా వ్రాసియున్నాడు. దానిని చదువుట ఇంచుకైన సాధ్యము కాకున్నది. అందుచే ప్రత్యుత్తరమును అతనికే వ్రాయలేక పోతిని. కాని అతడు కోరినదంతయు చేసితిని. మైసూరుమహారాజాగారికి నాఫోటోగ్రాపును పంపుచు జాబు వ్రాసితిని. ఇప్పుడు ధ్వనియంత్రమును ఖేత్రీరాజుకు పంపితిని....

నన్నుగుఱించిన ఉదంతములు ప్రకటింపబడియుండు భారతదేశపత్రికలను సదా పంపుచుండుము. ఆపత్రికలందే వానిని చదువవలె నని నా కోరిక. తెలిసినదా? న న్నెంతో ఆదరించు

చుండిన శ్రీచారుచంద్రునిగుఱించిన సకలవృత్తాంతము నాకు తెలుపుము. అతనికి నాహృదయపూర్వక ధన్యవాదముల నందింపుము. మనలో మాట — దురదృష్టవశమున అతనిజ్ఞాపకము నాకు లేదు. వివరములను తెలిపెదవా ?

ఇచటి దివ్యజ్ఞానసమాజమువారికి ఇప్పుడు నేననిన ఇష్టమే. కాని వా రందఱును కలిసియు 650 గురే. విజ్ఞానవేత్తలైన క్రైస్తవు లున్నారు. వారి కందఱికిని నే ననిన ఇష్టమే. వారు సుమారు 10 లక్షలమంది. ఇరు సంఘములవారితోను కలిసి నేను పనిచేయుచుందును. కాని ఆరెంటిలో ఏసంఘములోను నేను చేరను. దేవు నను గ్రహముచే ఉభయులను సరియైన దారిలో రూపొందింతును. అరగొఱగ అర్థమైన సత్యములను వారు గొణుగుచుందురు. ఈయుత్తరము నీకు చేరునప్పటికి నరసింహునకు పైకము మున్నగునవి అందవచ్చు.

''పిల్లి'' (కాట్) వద్దనుండి నాకు జాబు వచ్చినది. అందలి అతని ప్రశ్నలకు జవాబులను వ్రాయవలె ననిన అందుకొక గ్రంథమే కావలయును. అందుచే నీద్వారా అతనికి నా ఆశీస్సులను అందజేయుచున్నాను. మా అభిప్రాయములు భేదిల్లుట ఉభయసమ్మతమే అనియు విభిన్నభావాల ఒద్దికను గుర్తింపుమనియు అతనికి జ్ఞప్తిపఱపుము. అత డే విషయములును నమ్మ ననుట ముఖ్యముకాదు. కార్యరంగమున కుఱుకవలెను.

బాలాజీకి జి. జి. కి., కిడికి, డాక్టరుకు మనమిత్రుల కందఱికి, దేశాభ్యుదయమునకై తమయభిప్రాయభేదముల నావలబెట్టిన ధీరోదార దేశభక్తమహాత్ములకు నా ప్రేమ నందజేయుము.

ఒకపత్రికను ప్రారంభించి దానికి నీవు కార్యదర్శివిగా నుండుము. పత్రికను ప్రారంభించుట మున్నగు పనికెం తగునో లెక్క వేయుము. ప్రారంభమున కనీస మెంత పైకము కావలెనో తెల్పుము. ఆసంస్థ పేరును చిరునామాను తెల్పుము.

పైకమును నేనే పంపెదను. అంతే కాదు. దానికి విరివిగ చందా లిచ్చు వారిని అమెరికాలో నేను సంపాదింతును. నీవు చేసినట్లే కల్కత్తావారినికూడ చేయు మనుము. ధర్మపాలుని చిరునామాను తెల్పుము. అతడు గొప్పవాడు, మంచివాడు. మనతో కలసి అతడు అత్యాశ్చర్యకరముగ పనిచేయును. సమితిని ఏర్పఱపుము. ఈ సకలోద్యమమును నీయధీనమం దుంచుకో వలెను, నాయకుడవుగ కాదు, సేవకుడవుగ. నాయకత్వ మించుకంత అగపడినను అది ఈర్ష్యను కలిగించి సర్వనాశనమునకు దారి తీయును. ఎఱుగుదువా?

అన్నిటికిని తథాస్తు అనుఛందుము. నామిత్రులనందఱిని కలిపియుంచుటకు ప్రయత్నింపుము. అంతే, తెలిసినదా. ఉత్సాహమును మెల్లగా కలిగింపుము. ఇప్పుడే ధనము గడించుకో వలసిన జరూరు లేని జి. జి. ప్రభృతులు ఇప్పుడు చేయుచున్న పనినే—ఆశయముల వెదజల్లు పనిని — చేయుచుందురు గాక. మైసూరులో జి. జి. చక్కగా పనిచేయుచున్నాడు. అదేమార్గము. కాలక్రమమున మైసూరు మన గొప్పదుర్గము కాగలదు.

ఇప్పుడు నాస్మృతులను ఒకగ్రంథముగా వ్రాయబోవుచున్నాను. రాబోవుచలికాలమందు ఈదేశమున సంఘముల నేర్పఱచుచు పర్యటించెదను. ఇదొక పెద్దకర్మక్షేత్రము. ఇచట చేసిన ప్రతిపనియు అందుకు ఇంగ్లండునుకూడ సిద్ధపఱచియుంచును. ధీరబాలకా, ఇంతవఱకు పనులను నీవు చాల చక్కగ నిర్వహించితివి. నిజము. నీకు సకలశక్తులును సిద్ధించుత.

నాయొద్ద నిప్పుడు తొమ్మిదివేలరూపాయ లున్నవి. అందు కొంత ఈనిర్మాణకార్యక్రమమునకై పంపెదను. మదరాసులో నీకు నెల కొకసారియో ఆఱునెలల కొకసారియో సంవత్సరమున కొకసారియో చేరునట్లు పైకమును పెక్కండ్రు పంపునట్లు నేను చేసెదను. ఇప్పుడు వలసిన పరికరములతో నీ వొక సమితిని

పత్రికను ప్రారంభింపుము. ఇది ఏకొందఱకో మాత్రమే తెలిసిన రహస్యముగా నుండ వలెను. ఇప్పుడే మైసూరు మున్నగుతావుల నుండి ధనమును సేకరించి దానితో మదరాసులో నొకదేవా లయము నిర్మింపవలెను. అందు ఒక గ్రంథాలయ ముండ వలెను. ఆఫీసుకు మతప్రచారకులగు సన్న్యాసులును యాదృచ్ఛికముగ వచ్చు వైరాగులును బసచేయుటకును గదు లుండవలెను. ఇట్లు మనము మెట్టుమెట్టుగ ముందుకు పోవలెను. నా ఉద్యమమునకు అమెరికా గొప్ప పంటభూమి. ఇచ్చట చేసిన ప్రతిపనియు ఇంగ్లం డులో నేను చేయబోవు పనికి దారిని సిద్ధపఱచును....

డబ్బుదాచుకొనుటగాని కడకు డబ్బును ముట్టుటగాని నాకు మిగుల కష్టమైన పని అని నీ వెఱుగుదువుకదా! అది విసుగుగొలు పుటే గాదు. నైచ్యమును ఆపాదించును. కావున కార్యనిర్వ హణభాగమును డబ్బుకు సంబంధించిన భాగమును చూచుకొను టకు నీ వొక సంఘము నేర్పాటుచేయవలెను. నాకు సంబంధించిన ధనవ్యవహారమును చూచుకొను మిత్రులు నా కిచట నున్నారు. తెలిసినదా? ఘోరధనవ్యవహారములపీడ వదలిపోవుట నా కెంతో విశ్రాంతికరముగ నుండును. కావున మీరు ఒద్దికలు కుదుర్చు కొని, ఒకసంఘముగనై నీవు కార్యదర్శివియు, కోశాధికారివియునై ఇచటి నామిత్రులతోను సానుభూతిపరులతోను నేరుగ లావాదే వీలు ఎంత త్వరగా ప్రారంభింతురో నీకును నాకునుగూడ అంత మేలు. త్వరగా అట్లు చేసి నాకు వ్రాయుము. నీవు స్థాపించు సమితిలో ఎవరికిని వినాయింపు లేకుండునట్లుగా దానికి పేరు పెట్టుము. ఇదే విధముగా సంఘస్థాపనాదులు చేయు డని మత మందలి నాసోదరులకును వ్రాయుదువు కదా......అళసింగా, ఘనకార్యములు నీచే నిర్వహింపబడ కాచుకొని యున్నవి. లేదా ఉచిత మని నీకు తోచినచో, నిజమునకు పనిని నీవే నిర్వహించు చున్నను హేమాహేమీలను పట్టి కార్యనిర్వాహకపరిషత్సభ్యుల

నుగా జేయుము. వారిపేళ్లవలన మనపనికి ఘనత గలుగును. నీకు కార్యభారము అధికముగ నుండి వ్యవధి యించుకేని లేకున్నచో కార్యనిర్వహణభాగమును జి. జి. చూచుకొనునుగాక. మఱొక్క-మాట. కాలక్రమమున కాలేజీనుండి నీకు విడుదల కలిగింప గల నని అనుకొనుచున్నాను. అప్పుడు నీవును నీకుటుంబమువారును పస్తుండక ఈపని నిర్వహణమునకై పూర్తిగా నిన్నర్పించుకోవచ్చు. కావున నా వత్సలారా, పనిచేయుడు, పనిచేయుడు, పనిలో ముదుగుభాగము సాఫీ చేయబడినది. మిట్టుపల్లములు లేక చదునైన బాటలో కార్యపురోగతి ఏడాదికేడాదికి మెఱుగుగా సాగును. నేను ఇండియాకు వచ్చువఱకు పనిని నీవు సాఫీగా సాగనిచ్చుచుండిన చాలును. తర్వాత అది వాయువేగమనోవేగములతో పురోగమించును. నీవు ఇప్పటి కింత సాధించినందుకు ఆనందింపుము. నిరుత్సాహము కల్గినప్పుడు గడచినసంవత్సరములోగా నెఱవేఱినపనులను నెమరుకు తెచ్చుకో. ఏమియు లేకుండినదశ నుండి ప్రారంభించితిమి. ఇపుడు యావత్ప్రపంచదృష్టిని మన యందు నిమగ్నమగునట్లు చేసితిమి. భారతదేశముమాత్రమే కాదు, వెలుపలిలోకమువారు సైతము మనవలన ఘనకార్యములు జరుగు నని నిరీక్షించుచున్నారు. పాదిరీలుగాని "మ—" గాని తెలివిమాలిన ఉద్యోగులుగాని ఎవ్వరును సత్యమును ప్రేమను ఆర్జవమును ప్రతిఘటింపజాలరు. మీలో ఆర్జవ మున్నదా? ప్రేమ ఉన్నదా? ప్రాణముమీదికి వచ్చినను నిస్స్వార్థుడవై యున్నావా? ఉన్నచో భయపడకుడు, మృత్యువునకైనను భయపడకుడు. వత్సలారా, పదండి ముందుకు. విశ్వమంతయు వెలుగును నిరీక్షించుచున్నది. ఆ వెలుగు భారతదేశమునమాత్రమే కలదు. ఆ వెలుగు అనగా గారడీఆటలు కావు. వట్టిమాటలు కావు. పారమార్థికధర్మోపదేశమహిమయే, ఆధ్యాత్మికపరతత్త్వోపదేశ మహిమయే. కావుననే బహుళవిపర్యయములగుండ మనజాతిని నేటివరకు భగవంతుడు కాపాడినాడు. ఇప్పుడు సమయము

వచ్చినది. ధీరవత్సలారా, ఘనకార్యములను నిర్వహించుటకై మీరు పుట్టితి రని విశ్వసింపుడు. కుక్కపిల్లల అఱపులకే కాదు. మింటినుండి రాలు పిడుగులకైనను సరే భయవశులు కాకుడు, లెండు, పాటుపడుడు.

సదా భవదీయప్రేమయుత,
వివేకానంద

## 110

(కుమారి మేరీ హేలుకు)

శ్రీమతి బాగ్లీసతి యింట,
అన్నిస్క్వాము,
ఆగస్టు 31, 1894.

ప్రియసోదరీ,

మదరాసువారు పంపిన లేఖ నిన్నటి బోస్టనుట్రాన్స్క్రిప్టులో ప్రచురింపబడినది. నీ కొక ప్రతిని పంపగోరుచున్నాను. చికాగో పత్రికలలో ఎందైన నీవు దానిని చూచియుండవచ్చు. నాకు చేరవలసిన ఉత్తరములు కొన్ని కుక్ అండ్ సన్స్ అను వారియొద్ద నున్నవని నా నమ్మకము. కనీసము మంగళవారము వఱకైనను నే నిచట నుందును. ఆనాడు అన్నిస్క్వాములో నిచట నే నుపన్యసింపబోవుచున్నాను.

దయచేసి కుక్స్ కంపెనీలో నాజాబు లున్న వేమో కనుగొని నాకు చేరునట్లు అన్నిస్క్వాముకు పంపుము.

కొంతకాలముగా నీవార్తలేవియు నాకు తెలిసినవి కావు. అమ్మచర్చికి నిన్ననే రెండు చిత్రములను పంపితిని. అవి నీకు

వచ్చుననుకొందును. భారతదేశమునుండి రావలసిన లేఖలను గూర్చి నాకు ఉబలాట మెక్కువగ నున్నది. అందఱకు నా ప్రేమ.

సదా భవదీయప్రియసోదరుడు
వివేకానంద

మఱిమాట : నీకు పంపవలసినది నాయొద్ద కొంతయున్నది. కాని నీయునికిపట్టు తెలియనందున పంపలేకపోయితిని.

వి.

## 111

(శ్రీ మన్మథనాథ భట్టాచార్యకు)*

అమెరికా,
సెప్టెంబరు 5, 1894.

ప్రియశ్రీభట్టాచార్య,

ప్రేమతో నీవు వ్రాసిన జాబు చదివి అత్యంతము ప్రీతుడనైతిని. నాకు సాధ్యమైనంతత్వరలో నేతయంత్రమునుగూర్చి విచారించి నీకు తెలిపెదను. ప్రస్తుతము నేను అన్నిస్క్వాములో విశ్రమించియున్నాను. కడలిగట్టున నిదొక పల్లె. నగరమునకు త్వరలోనే పోయి ఆయంత్రమువిషయము కనుగొందును. వేసవిలో ఈసముద్రతీరప్రాంతములలో ప్రజలు క్రిక్కిఱిసి యుందురు. కొందఱు సముద్రస్నానమునకై వత్తురు. కొందఱు విశ్రాంతికై వత్తురు. కొందఱు భర్తలను వెదకిపట్టుటకై వత్తురు.

ఈ దేశమున వినీతవర్తనమందు దృఢాభినివేశము కలదు. మహిళల సమక్షమునకు వచ్చినప్పుడు నీవు ఆపాదకంఠము కప్పు

* ఈయన స్వామిజీకి సతీర్థుడు. బాల్యమిత్రము, మద్రాసులో డిప్యూటీ అకౌంటెంటుజనరలుగా నుండెను. ఈజాబును ప్రచురణ కిచ్చినందులకు ఆయన కుమారునికి శ్రీమోహిత్ కుమారభట్టాచార్యకు కృతజ్ఞులము.

కొని యుండ వలెను. శరీరసహజవ్యాపారములనుగూర్చి పలుక నైన కూడదు. ఎవడైనను సింగారించుకొనుటకు ఎప్పుడు పోవునో వేఱెవరికిని తెలిసియుండదు. అంత మెలకువతో మెలగవలెను. ఈదేశమున చేతిరుమాలును ముక్కున కడ్డముపెట్టుకొని వేయి సార్లు తుమ్మినను తుమ్మ వచ్చు. అందు తప్పేమియు లేదు కాని త్రేపువిడుచుట మాత్రము మిక్కిలి అనాగరకము. ఒక్కొక్క ప్పుడు నడుమునకు పైభాగమంతయు అనాచ్ఛాదితముగ నుంచు కొనుటకు మహిళలు సిగ్గుచెందరు. వారు ధరించు రకపు పెద్ద మెడగల గౌన్లను నీవు చూచియుందువు. కాని పాదములకు జోళ్లు ధరించుకొనక నడచుట దిగంబరులుగ నుండునంతటి చెడు గుగా వారు చెప్పుదురు. మనము సదా ఆత్మనుగుఱించియే చెప్పు చుండునట్లు వారు దేహమునుగుఱించిమాత్రమే జాగ్రత్తవహించు చుందురు. దేహమును వారు శుభ్రపఱచుకొను సింగారించు కొను విధానముల కంతు లేదు. అట్లు శుభ్రపఱచుకొనని సింగా రించుకొనని మానవునకు ఇచట సంఘమున స్థానము లేదు.

పిడకలనిప్పులో వండుకొని నేలపై కూర్చుండి మనము భుజించుపద్ధతిని పందులతిండిగా వారు భావింతురు. "హిందువులకు ఏవగింపు లేదే, పందులవలె వారు ఆవుపేడను తిందురే" అని వా రందురు. ఆవుపేడ అను పదమే ఆంగ్లమున నిషిద్ధము. ఇక వారి పద్ధతి: ఎంతమందిఐనను నీరు త్రాగుటకు ఒక్కలోటానే ఉపయో గింతురు, దానిని కడుగవలయు నను తలంపే వారికి కలుగదు. వండుటకు ముందు వంటవస్తువులను కడుగవలె నను నియమమును వారు పాటింపనే పాటింపరు. కాని వంటకత్తెదుస్తునందు ఒక నల్లమచ్చ కనిపించినను ఆమెను వారు తఱిమివేయుదురు. మేజా లను కప్పియుంచు వస్త్రములు క్రొంగ్రొత్తవిగ నుండును. భూమం డలమున ఇచటి ప్రజలు అందఱికంటె నధికసంపన్నులు. వారి సుఖానుభవములును భోగములును వర్ణించుట కలవి గాదు.

రాజపుత్రస్థానమున ప్రజలు మహమ్మదీయుల భోజనపద్ధతి ననుకరింతురు. అది చాల వఱకు మంచి పద్ధతియే. వారు ఇంచుక యెత్తైన పీఠముపై కూర్చుండి భుజించు పళ్లెరములను తమకు ముందు ఇంచుక యెత్తైన బల్లలపై నుంచుకొందురు. పేడ అలది ముఱికినిండిన నేలపై అరటియాకులను పఱచుకొనుటకంటె ఈ యాచారము చాలమేలైనది. ఆ అరటియాకు చినుగునేని యెంత అపత్కారము! దుస్తులను గుఱించిన జ్ఞానమును ఆహారమును గుఱించిన జ్ఞానమును హిందువుల కంతగా లేదు. పైగా పంజాబు నందును, వాయవ్యరాష్ట్రములందును ఉన్న నాగరకతను మాత్రమే హిందూనాగరకతాశేష మని చెప్పవచ్చును.

కాళ్లకు చెప్పులు తొడుగుకొన్నచో మనమహిళలకు కులము చెడును. కాళ్లకు చెప్పులు తొడుగుకొనకున్నచో రాజపుత్రస్థానమహిళలకు కులము చెడును! "పాదరక్షలను సదా ధరించియుండవలెను" అనుట మనుధర్మశాస్త్రము. ప్రజలకు చక్కని జీవితస్థాయి యుండవలె ననుటను కా దనను. వారికి భోగములు లేకున్నను పరిశుభ్రతయు నీటును ఉండవలె నందును....మనము ఇంగ్లీషువారముగ నుండనేల? పాశ్చాత్య మండలములందలి మనసోదరుల ననుకరింతుమేని మన కిప్పటికిచాలును. భారతీయులు ఒకజట్టునకు పిమ్మట నొకజట్టుగా కొన్ని సంవత్సరములకాలము లోకమెల్ల సంచారములు చేసి మరలి వచ్చుచుందురేని ఆపర్యటనములే చాలును ఇరువదేండ్లలో భారతదేశవైఖరిని మార్చివేయుటకు. వే ఱేమియు చేయ నక్కఱ లేదు. కాని ఒకపల్లెప్రజలు పొరుగుపల్లెకు పోకుందురేని ఏదైనను ఎట్లు ఘటిల్లును? ఐనను క్రమక్రమముగా అన్నియు ఘటిల్లును. క్రమక్రమముగా గట్టిపట్టుగల బెంగాలీయువకులు దేశమును మేల్కొల్పుదురు. కాని మన్మథబాబూ, తొమ్మిదేండ్లపడుచులకు పెండ్లిచేయు ఈలజ్జాకరాచారమును మీరు విడిచిపెట్టవలెను. అన్నిపాపములకును ఇదే మూలము. అబ్బాయీ, అది మహాపాపము. బాల్య

వివాహములను నిరోధించుచట్టమును ప్రభుత్వమువారు ఏర్పఱుప గోరినప్పుడు మనవారు, పనికిమాలినమనవారు, ఎంత గోల పెట్టిరి! ఆఘోరవైపరీత్యమును ఆలోచింపుము. ఈదురాచారమును మనము మానుకోనప్పుడు ప్రభుత్వమువారు జోక్యము కలుగజేసి కొనుట సహజమే. వారు చేయగోరుచున్న దదే. లోకమంతయు మనలను ఛీకొట్టుచున్నారు. మీయిండ్ల తలుపులు మూసికొని మీ రుందురు. వెలుపలినుండి ప్రజలు మీపై ఉమ్మివేయు చుందురు. ఎంతవఱకు వారితో జగడమాడుటకు నాకు శక్య మగును? కన్నతల్లిదండ్రులుసైతము తమపదేండ్లపుత్రికను బలిసిన ముదిసిన భర్తకిచ్చి వివాహముచేయుటకు అనుమతింతురు. ఎంత భయంకరవిషయము! ఓదేవా, పాపము లేనిదే దండనముండునా? ఇదంతయు కర్మఫలము. మనది ఘోరపాపములు చేసినదేశము కాకున్న అది ఏడువందల సంవత్సరములకాలము ఇతరుల కాళ్ల చెప్పులదెబ్బలు తినుచు పడియుండునా?

మనదేశములో కూతుండ్రకు పెండ్లిండ్లు చేయుటకు వారి తల్లిదండ్రులు ఎన్నో ఇక్కట్టులు పడుచుందురు కదా. ఈదేశ మున కన్యల తలిదండ్రులకు కష్టము తక్కువే కాని కన్య లను భవించు ఇక్కట్టులు చాల నెక్కువ. పెనిమిటులను సంపాదించు కొనుట కన్యలపని. వారి అన్నివిషయములలోను వారితో నా కిప్పుడు సన్నిహితసంబంధము కలదు, మహిళలనడుమ నొక మహిళగా నున్న ట్లున్నాను. కావున వారి లీలను ప్రత్యక్షముగ జూచినాను, చూచుచున్నాను. విందులకు పోవుట నృత్యముల కేగుట పాటకచ్చేరీలకు హాజరగుట నీళ్లుకట్టుతావులకు పోవుట— ఇవన్నియు బాగున్నవి. కాని పోయినచోట నెల్ల పెనిమిటులను ఏమార్గమున సంపాదించుకొందమా అనియే ఈయువతులు కుట్రలు పన్నుచుందురు. వీరు యువకులను చుట్టవేసికొనుచుం దురు. యువకులు చాల మెలకువకలిగియుందురు. ఈకన్నెలతో సదా కూడుచుందురు, ఆడుచుందురు, కాని వారిపట్టున తాము

చిక్కవలసివచ్చినప్పుడు మాత్రము పరారి యగుచుందురు. యువకులు యువతులను తమకంటె పైమెట్టువారినిగా భావింతురు, వారి నాదరింతురు, వారికి దాస్యము చేయుదురు, కాని తమ్ము పట్టుకొనుటకు ఆకన్నెలు చేతులు చాచినతక్షణమే, అందక పరుగిడి పోవుదురు. ఈరీతిని ఎన్నిసార్లో ప్రయత్నింపగా భర్తను సంపాదించుకొను పనిలో కన్య ఎప్పుడో ఒకప్పుడు కృతార్థురాలగును. కన్యలు ధనవంతురాండ్రుగా నుందురేని యువకులు వారిసన్నిధిని విడువక ఆటలాడుచుందురు. కాని కష్టము పేదకన్నెలకేఎక్కువ. పేదదైనను కన్నెకు ఎక్కువసోయగ ముండినచో ఆమెకు పెండ్లి త్వరగ నగును. లేకున్న ఆమె బ్రతికినన్నినాళ్లు వేచియుండవలసినదే. మనదేశములో వలెనే ఇచ్చటను వధూవరుల పరస్పర ప్రేమఫలితముగ జరుగు పెండ్లి వేయింటి కొక్కటి యుండును. తక్కిన పెండ్లిం డ్లన్నియు ధనమూలకములే. పెండ్లాడుట, తర్వాత జగడమాడుట, పొమ్మనుట — విడాకులు. మనలో ఇది లేదు. ఉరివేసికొని చచ్చుటొక్కటే మనకున్న దారి. అన్ని దేశములలోను అంతే. ఈదేశమున కన్నెలు తమవిషయములలో తామే పెత్తనము వహింతురు. మనదేశమున వధూవరుల జీవితమును నాజూకుగ కనుబడునట్లుచేయుటకై తల్లిదండ్రులను తోడ్పఱచుకొందుము. ఇచ్చటను అచ్చటను పర్యవసాన మొక్కటే.

ఈ దినములలో అమెరికను కన్యలకు వివాహమాడుదమను వాంఛ లేదు. అంతర్యుద్ధకాలమున మగవారు అధికసంఖ్యాకులు చంపబడినందువ అన్నివిధములైన పనులను మహిళలు చేయ జొచ్చిరి. అప్పటినుండి తమకు సంక్రమించిన హక్కులను వదలుకొనుటకు వా రిష్టపడుట లేదు. వారు తమజీవికను తామే గడించుకొందురు. కావున "పెండ్లాడుట నిష్ప్రయోజనము, నిజమైన ప్రేమ పుట్టునేని అప్పుడు పెండ్లాడుదము, పుట్టకున్నచో మావ్యయములకు కావలసిన ధనమును మేమే సంపాదించు

కొందుము'' అని చెప్పుచున్నారు. తండ్రి కోటీశ్వరుడుగ నున్నను కుమారుడు పెండ్లాడుటకు ముందు తానును చాలినంతగ ధనమును గడింపవలసినదే. తండ్రి ఇచ్చు పైకముపై నాధారపడి ఎవడును పెండ్లి చేసికోరాదు. కన్నెలు కోరునదియు ఇప్పు డిదే. పెండ్లి అయినతక్షణమే పురుషుడు తనపుట్టింటికి పరాయివాడై పోవును. మహిళ పెండ్లి చేసికొన్నప్పుడు తనపుట్టింటికే భర్తను చేర్చు కొనును. మగవారు తమయిల్లాండ్ర తల్లిదండ్రులను దర్శించుటకు పదిసార్లు పోయివత్తురు. తమ్ము కన్నతల్లిదండ్రులయొద్దకు పోనే పోరు. కాని తమ అత్తలు సదా తమమెడలపైనే ఉందురేని అందుకును వా రెంతయు భయపడుచునే యుందురు.

ఈదేశమున సంపద్వాహినులు ప్రవహించుచుండును. సౌందర్యతరంగములు పొంగిపొర్లుచుండును. జ్ఞానపువెల్లిదము సర్వత్ర నున్నది. దేశమున ఆరోగ్యము చాల బాగున్నది. ఇహలోకభోగము లనుభవించు టెట్లో వీరికి తెలియును... యూరోపునందలి రాజకుటుంబముల వారికి పేదరికము కలిగి నప్పుడు వారు వివాహసంబంధములు చేసికొనుటకు ఇచ్చటికి వత్తురు. అమెరికనులలో సామాన్యులకు ఇది ఇష్టము లేదు. కాని మహిళలలో ధనవతులును సౌందర్యవతులును అగు కొందఱు బిరుదులకు బేలుపోవుదురు. ఐనను అమెరికనుమహిళలకు యూరోపులో వసించుట చాలకష్టము. ఈదేశమున పతులు తమసతులకు బానిసలు. యూరోపులో సతులే పతులకు బానిసలు. ఆ దాస్యము అమెరికనుమహిళలకు ఇష్టము లేదు. ఈదేశమున సతులు ఏమి చెప్పినను పతులు అందుకు ''ప్రాణప్రియా, తథాస్తు'' అనుచుండవలెను. అనకపోయిన ప్రజలయెదుట వధువులకు ముఖములు చెల్లవు.

అమెరికాలో మహిళలు మిక్కిలి భావోద్రేకపరతకల వారు. విపరీతాద్భుతవీరచరితు లనిన వారికి మక్కువ. నేను

ఒకవింతజాతి జంతువను. నాలో అట్టి చరితము లేనే లేదు. కావున వారికి నాయందు అట్టికామ మంకురించు ప్రసక్తి లేదు. నాయందు వారి కున్న భావము అధికగౌరవమే. నాయనా, అన్నా, తమ్ముడూ, అనియే వా రందఱిచేత నేను పిలిపించుకొందును. వేఱెట్టిభావముతోను వారిని నేను దరిజేరనీయను. క్రమక్రమముగ వారందఱును నిర్వక్రవర్తన లైరి....

ఈదేశమున మతాచార్యులకు......పాపులను నరకకూప మున పడద్రోయవలె నని ఉబలాటము. ఐనను వారిలో కొందఱు చాల మంచివారు....ఈదేశపుమహిళల మధ్య నాకధికప్రఖ్యాతి కలిగి యున్నది. అవివాహితలైన మహిళలలో వ్యభిచరణశీలము గల మహిళ ఒక్కతయైనను ఇంతవఱకు నాకు కనబడలేదు. వ్యభిచరణపరాయణత్వము భర్తృమతులలోను విగతభర్తృకల లోను కననగుచున్నది. పెండ్లికానిపడుచులకు మహోజ్జ్వల భవిష్యత్తున్నది. కావున చాలమంచివారుగ నున్నారు.

ముడుతలువడి ఎండుకొని పోయిన పండ్లవంటి బక్క చిక్కిన పాశ్చాత్యమహిళలు భారతదేశమున కననగుచుందురే, వా రందఱును ఆంగ్లస్త్రీలు. యూరోపియనుజాతులం దెల్ల ఆంగ్ల జాతి వికారమైనది. యూరోపులోని వరిష్ఠకుటుంబముల నెత్తుటి చాళ్లకు అమెరికాలో సమ్మేళనము కలిగినందున అమెరికనుమహి ళలు చాల అందగత్తెలు. వారు తమసౌందర్యమును ఎంతగా కాపాడుకొందురో! తన పదవయేటనుండి గంట కొక బిడ్డనుగా కనుచుండినచో, మగువకు చక్కదనము నిలుచునా? ఛీ, అన ర్థము! ఎంత ఘోరపాపము! మనదేశమహిళలలో అత్యంత సౌందర్యవతి ఇచ్చటివారితో పోల్చబడినప్పుడు నల్లగుడ్లగూబవలె కన్పించును. ఐనను పంజాబునందలి మహిళలలో చాల చక్కదన మున్న దని ఒప్పుకోవలసినదే. అమెరికనుమహిళలలో అత్యధిక విద్యావతులు పెక్కండ్రు. వారితోడి పోటీలో పండితమహా

మహోపాధ్యాయు లెందఱో శృంగభంగము నొందుచుందురు. ఎవరి యభిప్రాయమును వారికి లక్ష్యము లేదు. ఇక వారి సుగుణములు ; ఎంతదయ, తలంపులందును చర్యలందును ఎంత ఉదాత్తత, ఆలోచించి చూడు! ఈ దేశీయు డొకడు భారతదేశమునకు వచ్చునేని అచ్చట ఎవరును అతనిని తాకనైన తాకరు. మఱి నేను ఇచ్చట శ్రేష్ఠకుటుంబములలో వారి సొంతపుత్రుడను వలె స్వేచ్ఛ ననుభవించుచున్నాను. నేనొక పసిబాలునివలె నున్నాను. ఇచ్చటి మహిళలు నాకై వస్తువులు కొందురు. నా పనులకై పరుగు లెత్తుదురు. ఇదే ఉదాహరణము. ఆ యంత్రమును గూర్చిన వివరములకై ఇప్పుడే నేనొక యువతికి జాబు వ్రాసినాను. మహాజాగ్రత్తతో ఆమె దానిని సేకరించి నాకు పంపును. ఖేత్రీమహారాజావారికి ధ్వనియంత్రమొకటి పంపబడినది. దాని వ్యవహారమును సమస్తమును మహిళలు చాలచక్కగ నిర్వర్తించిరి. రామ! రామ! ఈభేదము స్వర్గనరకముల భేదమే. వారు సౌందర్యమున లక్ష్ములు, ప్రతిభావైదుష్యములందు సరస్వతులు. కేవలము పుస్తకములను చదివి ఇట్టి స్థాయిని సాధించుకొనుట శక్యము కాదు. మహిళలను కొందఱిని మగవారిని కొందఱిని లోకమెల్ల చుట్టి చూచి రం డని నీవు పంపగలవా? అట్లు చేసిననే మన దేశమునకు ప్రబోధము కలుగును. కేవల గ్రంథ పారాయణముచేత కలుగదు. ఇచ్చటి మగవారు ధనసంపాదనలో చాల తెలివి గలవారు. ఒరులకు దుమ్మైనను కంటబడని చోట వీరికి సొమ్ము ప్రత్యక్ష మగును.

ఎవరైనను భారతదేశమును విడిచి ఇతరదేశమును వచ్చి చూతురేని ఎంతో లాభపడును. వివిధదేశముల సంసర్గమునుండి తొలగియుండు టొక్కటే భారతదేశపతనమునకు కారణము. ఆంగ్లేయులు వచ్చినప్పటినుండి అన్యదేశములవారితో కలిసికొనునట్లు వారు మిమ్ము నెట్టుచున్నారు. మరల మీకు అభ్యుదయము కలుగుచున్న దనుట ప్రత్యక్షము. భారతదేశమునుండి

వెలుపలికి వచ్చు ప్రతిప్రాణియు భారతదేశమున కంతటికిని లాభమును చేకూర్చుచున్నాడు. ఏలయన అట్లు చేసిననే మీ దిగ్వలయము విస్తరిల్లును. ఈ అవకాశము భారతస్త్రీలకు బొత్తిగ లేనందున వారి కెట్టి పురోగతియు లేకపోయినది. కదలక నిలుచుండు మెట్టొకటి లేదు. ఊర్ధ్వగతినైన నొందవలెను, అధోగతియైన చెందవలెను, అంతరింపవలెను. వెలువడుట ముందుకేగుట వికాస మొందుట — ఇదే జీవితలక్షణము...సంకోచమునొందుట మరణము. ఒరులకు మన మేల మేలు చేయవలెను? చేసిననే జీవితము సిద్ధించును కాబట్టి. సొంతఆవరణమును దాటి మీరు వ్యాప్తినొందుదురు. జీవింతురు, వర్ధిల్లుదురు. సంకుచితత్వమంతయు ముడుచుకొనుటఅంతయు స్వార్థపరతఅంతయు నిదానముగ ఆత్మహానిని కలిగించునదే. ఒకదేశము సంకుచితత్వము చెందుట అను వినాశకరమగు తప్పిదము చేసినప్పుడు, జీవితమునకు వికాసము విచ్ఛిన్నమైనప్పుడు ఆదేశమునకు మరణము తప్పదు. అట్లే మహిళలును పురోగమింపవలెను. పురోగమింపకున్న మూర్ఖురాండ్రుగను నిరంకుశులగు తమభర్తల చేతులలో ఆత్మరహితలగు పనిముట్లుగను అగుదురు. నిరంకుశుడగు భర్తకును మూర్ఖురాలగు భార్యకును పుట్టుసంతతి బానిసలుగనుందురు. ఇదే నవ్యభారతదేశ చరిత్ర సర్వస్వము. అయ్యో, ఈదారుణ మృత్యువును ఖండించువా రెవరు? దేవుడు మనలను కాపాడుగాక. ఇదంతయు క్రమక్రమముగ నెఱవేఱును. వీధినడ్డముగ దాటువాడు మెల్లగను మెలకువతోను దాటవలెను. సన్నని మెత్తకు అతుకు కుట్టువారు మెలకువతో హెచ్చరికతో కుట్టవలెను. పర్వతమును దాటునప్పుడును అట్లే మెల్లగను మెలకువతోను దాటవలెను.

పత్రికలు సకాలమునకు వచ్చినవి. మాపు చెడక మంచి స్థితిలోనే ఉన్నవి. అందుంగూర్చి ఎట్టి చిక్కును కలుగలేదు.

పగవాని నోరు మూయించుట ఐనది. ఈవిషయమును ఆలోచించి చూడుము. నాదేశము వాడగు మజుందారు నన్ను దుష్టుడని చెప్పినను ఈదేశీయులు అతని మాటను లెక్కింపకున్నారు. వారు అపరిచితయువకుడనగు నన్ను వయసు వచ్చిన తమ కూతుండ్ర మధ్య మెలగ నిచ్చుచున్నారు. ఎంతటి ఉదారులు, కరుణాళువులు! నూఱుజన్మము లెత్తినను వారి ఋణమును నేను తీర్చుకొనలేను. అమెరికనుమహిళలకు నేను దత్తపుత్రునివలె నున్నాను. నిజముగ వారు నాకు తల్లులుగ నున్నారు. అన్ని విధములైన శ్రేయస్సులును వారికి కలుగకున్న వే ఱెవరికి కలుగును.

కొన్నాళ్లకు ముందు విజ్ఞానసంపద గల మహిళలును మగవారును పెక్కు నూర్లమంది గ్రీనేకరు అనుచోట సమావేశమైరి. అచట నేను దాదాపు రెండు నెలల కాల ముంటిని. ప్రతిదినము మనహిందూపద్ధతిలో నేను ఒకచెట్టుక్రింద కూర్చుందును. నా అనుచరులును శిష్యులును నాచుట్టును పచ్చికపై కూర్చుందురు. ప్రతిదినము ప్రొద్దునను వారికి నేను పాఠములు నేర్పుచుందును. ఎంత శ్రద్ధాళువులు వారు!

ఈదేశీయుల కందఱికిని నా పరిచయము కలదు. క్రైస్తవ మతాచార్యులు చాల మండిపడుచున్నారు. అందఱును కాదులే. ఈదేశమతాచార్యులలో చదువుకొన్నవారిలో నన్ననుసరించువారు అనేకులు కలరు. వారిలో అజ్ఞులును మూర్ఖులును దేనినిగాని అర్థముచేసికొనరు. చిక్కులుమాత్రము కల్పించుచుందురు. కల్పించుటచే హానిని తమకే గూర్చుకొనుచుందురు. మజుందారుకు ఈదేశమున జనప్రీతి ఏ లవలేశమో ఉండినది. నన్ను తూలనాడి అతడు ఆజనప్రీతిలో మూడువంతులను కోల్పోయినాడు. ఈదేశీయులు నన్ను (తమవానినిగ) స్వీకరించిరి. ఎవడేని నన్ను దూషించు నేని ఎల్లెడల నున్న మహిళలును అతనిని గర్జింతురు.

భారతదేశమునకు ఎప్పుడు మరలివత్తునో చెప్పలేను. పై శీతకాలమున వచ్చుటకు వీలగు నేమో! అక్కడికి వచ్చినను నేను అల్లాడవలసినదే. ఇక్కడను అదే చేయుచున్నాను.

ఇంతకంటె వ్రాయుట కేమియు లేదు. ఈలేఖను ప్రకటింపకు. తెలిసినదా- నానోటవెడలు ప్రతిమాట విషయమునను నేను జాగ్రత్త కలిగియుండవలెను. నేనిప్పుడు సమష్టివ్యక్తినైనాను. అందఱి కన్నులు నామీదనే, ముఖ్యముగ మతాచార్యుల కన్నులు.

భవదీయశ్రద్ధాయుత
వివేకానంద

## 112

(శ్రీలియోన్ లాండ్స్ బెర్గుకు)

హోటలు బెలవ్యూ, బోస్టను,
సెప్టెంబరు 13, 1894.

ప్రియ లియోన్,

గురువను కావున నీకు హిత ముపదేశించు నధికారము నాకున్నది. హిత ముపదేశించుచున్నందులకు నన్ను మన్నింపుము. నొక్కి చెప్పుచున్నాను. సొంతమునకు కొన్ని వస్త్రములు కొనుము. ఆవస్త్రములు లేకుండుట ఈదేశమున ఏపనిచేయుటకును అడ్డు దగులుచుండును. నీకు కొంత చెల్లుబడి ప్రారంభమైన తర్వాత ఇచ్ఛ వచ్చిన యుడుపులను ధరింప వచ్చు. ప్రజ లాక్షేపింపరు.

నీవు నాకు కృతజ్ఞతను తెలుపుకో నక్కఱ లేదు. ఇది నా కర్తవ్యము. గురువు మరణించునేని అతని శిష్యుడే అతనికి వారసు. సన్న్యసించుటకు ముందు ఆగురువు కొకపుత్రు డున్నా

డనుకొన్నను అత డతనికి వారసు కా డనుట హిందూధర్మ శాస్త్రము. ఇది వాస్తవమైన ఆధ్యాత్మిక బాంధవ్యము. తెలిసి నదా, మీ అమెరికనుట్ర్యూటరు చుట్టరికము కాదు.

విజయాశంసలతో ఆశీస్సులతో.

భవదీయుడు
వివేకానంద

## 113

(కుమారి మేరీ హేలుకు)

హోటలు బెలవ్యూ
బీకన్ స్ట్రీటు, బోస్టను,
సెప్టెంబరు 13, 1894.

ప్రియసోదరీ,

దయతో నీవు వ్రాసిన లేఖ ఈఉదయమే నా కందినది. సుమా రొక వారముదినములుగా నే నీ హోటలులో నున్నాను. బోస్టనులో నే నింకను కొంతకాల ముందును. నాయొద్ద కావలసి నన్ని — సులభముగా మోయలేనన్ని గౌను లిప్పటికేయున్నవి. అన్నిస్క్వాములో తడిసినప్పుడు నేను ధరించియుండినది, నీ వెక్కువగా కొనియాడు ఆనల్లని చక్కని సూటునే. ఏమైనను అది చెడిపో దని నాతలంపు. ప్రగాఢములైన నా పరబ్రహ్మను సంధానములు దానిలోనికి చొచ్చుకొని యున్నవి. వేసవి నీ కంత హాయిగా గడచినందులకు నాకు చాల సంతోషము. ఇక నా విషయము: నేను ఊరుద్రిమ్మరిగ నున్నాను. అబ్బ్యా వ్రాసిన టిబెట్టుపరివ్రాజక 'లామా'ల వర్ణనమును మొన్న చదివి ఎంతో వినోద మొందితిని. అది మాసోదరుల యథాతథమైన చిత్రణము. వారు వింత మానవు లని అత డన్నాడు. వారు తమ కిష్టమై నప్పుడు వత్తురు. పిలుపున్నను లేకపోయినను అందటిభోజన

పంక్తులలోను కూర్చుందురు. ఇష్టము వచ్చిన చోట నుందురు, ఇష్టము వచ్చినచోటికి పోవుదురు. వారెక్కని కొండ లేదు, దాటని నది లేదు, వారెఱుగని దేశము లేదు. గ్రహగోళము లను సదా చుట్టు త్రిప్పుచుండు శక్తిలో కొంతభాగమును దేవుడు వారిలో నుంచియున్నాడని ఆ రచయిత తలంపు. రచనలు చేయుచు త్రిమ్మరుద మను కోర్కె యిప్పుడీ పరివ్రాజక లామాను ఆవహించినది. కావున క్రిందికి వచ్చి ఒక అంగడిలో ప్రవేశించి అన్నిరకాల వ్రాతసామగ్రిని కొక్కివేసి మూసిపెట్టుకొనదగిన యొక చక్కని చేతిపెట్టెను కొన్నాను. సిరాపోసిపెట్టుకొనుట కందు కొయ్యబుడ్డి యున్నది. అభివృద్ధి సూచనలు ఇప్పటికి బాగున్నవి. ఇకముందును ఇట్లే యుండు ననుకొనుచున్నాను. కడచినమాసమున ఇండియానుండి చాలినన్ని జాబులు వచ్చినవి. నాపనినిగూర్చి నా దేశీయులు ధారాళముగ గావించిన ప్రశంసలకు ఎక్కువ ప్రీతుడ నైతిని. వారికి శుభసమృద్ధి కలుగత. ఇంత కంటె వ్రాయదగిన విశేషము లేవియు లేవు. ప్రొఫెసరు రైటును ఆయన భార్యయు పిల్లలును ఎప్పటివలెనే నాయెడ సద్భావము కలిగి యున్నారు. వారికి నాకృతజ్ఞతను తెల్పుటకు మాటలు సమర్థములు కావు.

ఇప్పటివఱకును నాకేదియు ప్రతికూలింప లేదు. తీవ్రమైన పడిసెపుబాధమాత్రము కలిగినది. ఇప్పు డది పోయిన దని అనుకొనుచున్నాను. నిద్రపట్టకుండురోగమునకు ఈసారి క్రైస్తవవైద్య విజ్ఞానము చెప్పు చికిత్సను పట్టించి చూచితిని. మంచిగుణ మిచ్చినది. మీ సుఖము గోరు

సదా భవదీయసోదరుడు

వివేకానంద

మఱిమాట : ఇప్పుడు నాకు కోటు అక్కఱలేదని దయ చేసి అమ్మకు తెలుపుము.

వి.

## 114

(కుమారి ఓల్బులుకు)

హోటల్ బెలవ్యూ
బీకన్ స్ట్రీటు, బోస్టను
సెప్టెంబరు 19, 1894.

ప్రియజననిసారా,

నిన్ను నేను మఱచిపో లేదు. నేను ఎన్నటికైన అంతటి కృతఘ్నుడ నౌదు నని తలపకు. నీ చిరునామాను నాకు నీవు తెలుప లేదు. ఐనను లాండ్స్‌బెర్గనుండి నిన్ను గుఱించినవార్తలు కుమారి ఫిలిఫ్స్‌ద్వారా నాకు తెలియుచునే యున్నవి. మదరాసు వారు నా కంపిన విన్నపమును ప్రశంసాపత్రమును చూచి యుందువు. లాండ్స్ బెర్గులో నీకు చేర్పవలసినవిగా కొన్నింటిని పంపియుంటిని.

హిందువు తనతల్లికి దేనినిగాని ఎప్పుడుగాని అప్పుగా నీయడు. పుత్రునినుండి దేనినైనను రాబట్టుకొను స్వామ్యము తల్లి కున్నది. అమ్మనుండి తనయునకును అంతే. తుచ్ఛమైన ఆకొన్ని డాలర్ల మొత్తమును నీవు నాకు మరల నీయసమకట్టుట నా మనసును మిగుల నొప్పించినది. నీకు నేను పడియున్న ఋణమును తీర్చుకొను శక్తి నా కెన్నటికిని కలుగ బోదు.

ప్రస్తుతము బోస్టనులో పలుతావులందు నే నుపన్యసించు చున్నాను. నా కిప్పుడు కావలసిన దే మనగా నిలుకడగకూర్చుండి నా ఆశయములను వ్రాసిపెట్టుటకు అనువైన ఒక చోటు. ఇప్పటికి నేను కావించిన ఉపన్యాసములు చాలును. రచనలు చేయుద మనుట ప్రస్తుతము నాకోరిక. అందుకు న్యూయార్కుకు పోవలసి యుండు ననుకొనుచున్నాను. గ్వేర్న్సేసతి నాయెడల ఎంతో దయగలిగియుండినది. నాకు సాయపడుట ఆమె కిప్పుడునూ

ఇష్టమే. ఆమెయొద్దకు పోయి కూర్చుండి గ్రంథరచనకు కడంగుద మనుకొనుచున్నాను.

భవదీయ ప్రేమపూర్ణ
వివేకానంద

మలిమాట : గ్వేర్న్సే కుటుంబమువారు పట్టణమునకు తిరిగి వచ్చినారో, ఇంకను ఫిష్‌స్కిల్లులోనే ఉన్నారో దయచేసి తెల్పుము.

వి.

## 115

(శ్రీ అళసింగపెరుమాళుకు)

అమెరికా సంయుక్తరాష్ట్రములు,
సెప్టెంబరు 21, 1894.

ప్రియఅళసింగా,

......ఒకచోటునుండి మఱొకచోటుకు నిరంతరము పర్యటించుచున్నాను. ఉపన్యాసములు చేయుట పాఠములు చెప్పుట మున్నగు పనులను నిర్విరామముగ చేయుచున్నాను.

నేను వ్రాయదలచిన గ్రంథమునకై ఒక్కబంతినైన వ్రాయ వలను పడ దాయెను. దానిని తొడంగుటకు వీలు కొంతకాలమునకు తర్వాత కలుగు నేమో. ఇచట విశాల దృక్పథము కలవారిలో కొందఱిని చక్కనిమిత్రులునుగ కావింప కొన్నాను. శ్రోత్రియులలో కూడ కొందఱిని మిత్రులనుగా చేసి కొంటిని. త్వరలోనే ఇండియాకు తిరిగి రాగల నని ఆసించు చున్నాను. పడినశ్రమ మితిమీఱిపోవుటచే నాకు దడ పుట్టు చున్నది. ఈదేశవాసమిక చాలును. లెక్కకు మిక్కిలి మైన

యుపన్యాసములు చేయుటచేతను సదా వేగిరపడుచుండినందునను నాకు ఈదడ కలిగినది. ఈ నిర్విరామ—నిరర్థక—ధనసంపాదక జీవితముపై నా కాదరము లేదు. కావున త్వరలోనే మరలి వత్తును. తెలిసినదా? ఇచటి ప్రజలలో నాయందు ప్రీతి గలవారి సంఖ్య నానాటికిని హెచ్చుచున్నది లెమ్ము. నన్ను శాశ్వతముగ ఈదేశముననే నిల్పుకొనుట వారికి ఇష్టము. కాని ఈపత్రికా ప్రశస్తులును జీవితములోని ఈబూటకములును - ఇక చాలు నని పించుచున్నవి. ఆజీవితముపై నా కాదరము ఇంచుకేనిలేదు...

మన ఉద్యమమునకు వలయు ధన మిచట లభించు ఆస పాటు లేదు. ఆసించుట వ్యర్థము. కేవలము సానుభూతిచే ఉప కారము చేయువారు ఏదేశమున గాని ఎక్కువమంది ఉండరు. క్రైస్తవదేశాలలో నిజముగ ధనమిచ్చు కొలదిమందియు మతా చార్యకైతవమునకును నరకభయమునకును లోనై యిచ్చు చుందురు. మా వంగభాషలో "ఆవును చంపు, దానితోలుతో చెప్పులజోడు కుట్టు, ఆజోడును బ్రాహ్మణునకు దాన మిమ్ము" అను నొక సామెత చెప్పిన రీతిగ.నున్న దిది. ఇక్కడను అంతే, ఎక్కడను అంతే. మనజాతివారితో పోల్చిచూచినచో పాశ్చా త్యులు పిసినారివారు. దానశీలములో ప్రపంచమున నందఱికంటె ఏషియావాసులే అధికులనుట నా గట్టి నమ్మకము. కాని వారు నిఱుపేదలు.

కొన్ని నెల లుంద మని న్యూయార్కుకు పోవుచున్నాను. ఈదేశమునకు ప్రతిభాకేంద్రమును కార్యనిర్వహణానుకూలరంగ మును మూలధనాగారమును ఆనగరమే! బోస్టనుకు బ్రాహ్మణ నగర మని పేరు. అమెరికాలో నాయెడల సానుభూతికలవారు లక్షలకొలదిగ నున్నారు......న్యూయార్కుపౌరులు మిక్కిలి అమాయికులు. నా కచట చాల పలుకుబడి కల కొందఱు మిత్రు లున్నారు. కావున అచటి పని యెంతవఱకు సాధించుకోవచ్చునో

చూచెదను. ఇంతకును ఈఉపన్యాసకార్యక్రమము నాకు విసుగు కలిగించుచున్నది. ఉన్నతాధ్యాత్మికతత్త్వమును పాశ్చాత్యులు గ్రహించుటకు చాల కాలము పట్టును. ఏది ఐనను వారికి పౌనులు షిల్లింగులు పెన్నీలే. ఏమతమైన కానిమ్ము, వారికి ధనమునో, ఆరోగ్యమునో, అందమునో, దీర్ఘాయుస్సునో కలిగించిననే దానిని వారు తండోపతండములుగ ఆశ్రయింతురేగాని, కలిగింపకున్న ఆశ్రయింపరు......

బాలాజీకి, జి. జి. కి మిత్రులందరికి నావరిష్ఠప్రేమ నందజేయుము.

భవదీయ నిత్యప్రేమయుత
వివేకానంద

## 116

(శ్రీ సింగారివేలు మొదలియారుకు)

అమెరికా సంయుక్తరాష్ట్రములు,
సెప్టెంబరు 21, 1894.

ప్రియకిడి,

నీ వింత తొందరగా సన్న్యసింప నిశ్చయించుకొన్నా వని విని మిగుల ఖిన్నుడనై యున్నాను. పండు పక్వమైనప్పుడు చెట్టు నుండి రాలును. కావున కాలమును నిరీక్షింపుము. తొందర పడకు. పైగా, తన అవివేకచేష్టలచే ఒరులను దుఃఖితులను జేయు నధికారము ఎవరికిని లేదు. వేచియుండుము, ఓర్చియుండుము. సకాలమున సమస్తమును సమకూడును.

ఆశీస్సులతో,

భవదీయుడు
వివేకానంద

**117**

(సోదర శిష్యులకు)

న్యూయార్కు,
సెప్టెంబరు 25, 1894.

నా ప్రియ—,

మీజాబులు కొన్ని చేరినవి. సంతోషము. శశి మున్నగు వారు కొంత సంచలనము కలిగించుచున్నారని తెలిసి పరమానందమును చెందితిని. మనము తప్పక కొంత సంచలనమును కలిగింపవలయును. అంతకు తక్కువ దేదియు కార్యసాధకముకాదు. సమస్తలోకమును మీరు ఉప్పూత లూగింతురు — గురుమహారాజుకుజై! మీకు తెలియును "శ్రేయాంసి బహువిఘ్నాని" "మంచిపనులకు గల్గు అడ్డులు పెక్కులు" వంపులు సరిచేయు దెబ్బలవంటివై గొప్ప శీలములను రూపొందించునవి అడ్డంకులే... పాదిరీలకును వారివంటి వారికిని ఈఊపుకు కదలకుండుట శక్యమా? ...విద్వాంసులు నెగ్గలేని పనిలో మూర్ఖుడు నెగ్గవలెనా? అబ్బాయిలారా, అది కాదు దారి. అందుంగూర్చి మీమనస్సును కుదుట పఱుచుకొండి. ప్రతిపనిని మెచ్చుకొనువారి వర్గ మొకటి యుండును. అందు రంధ్రాన్వేషణము చేయువర్గమును ఒకటియుండును. మీపనిని మీరు చేసికొనుచు పొండి. ఏపక్షమువారికి గాని జవాబు చెప్పవలసిన అక్కఱ మీ కే మున్నది? "సత్య మేవ జయతే నానృతం, సత్యేన పన్థా వితతో దేవయానః"—గెల్పొందునది సత్యమే, అసత్యము కాదు. సత్యముచేతనే దేవయాన మార్గము విస్తృత మగును."......

ఇచటి ప్రజలు వేసవిలో సముద్రతీరమునకు పోవుదురు. నేనును పోయితిని. పడవలలో దోనెలలో విలాససంచారములు

చేయుట అనిన వీరికి ఇంచుమించు ఒక వ్యసనమే. సంపన్నులలో పెద్దలకును పిన్నలకును ప్రతివానికి విలాససంచారోపయోగియగు చిన్న పడవ యుండును. వా రా పడవ లెక్కి సముద్రమున విహరించి ఇండ్లకు మరలి తర్వాత భుజింతురు, త్రాగుదురు, నర్తింతురు. పగ లనక రాత్రి యనక సంగీతము నిర్విరామముగ సాగుచుండును. ఇంటనుండినచో పియానోలు తలనొప్పి కలి గించును.

మీరు నా జాబుల నన్నిటిని "హేల్సు" అను విలాసము నకు పంపుచున్నారు కదా. ఆ హేల్సు దంపతులను గుఱించి కొంత మీకు తెల్పెదను. అతడును అతనిభార్యయు వృద్ధదంప తులు. వారికి కూతుండ్రిద్దఱు. మేనకోడండ్రు (సోదరపుత్రికలు?) ఇద్దఱు. కొడు కొక్కడు. కొడుకు విదేశములం దున్నాడు. అక్కడ జీవికను గడించుకొనుచున్నాడు. కూతుండ్రింట నున్నారు. ఈదేశములో చుట్టఱికములు సాగుట కూతుండ్ర ద్వారానే. పెండ్లి కాగానే కొడుకునకు పుట్టింటిసంబంధము ముగిసి పోవును. కాని కూతురి పెనిమిటి మామగారింటికి తఱచు వచ్చు చుండును—

"పుత్రుపెండ్లివఱకె పుత్రుడు పుత్రుడు
పుత్రి మాత్ర మెపుడు పుత్రియె సుడి"

అని వీ రనుచుందురు.

నలుగురును తరుణప్రాయ మందే యున్నారు. - ఇంకను పెండ్లి కాలేదు. ఇక్కడ పెండ్లి చాల చిక్కులతో కూడినది. పతి మనస్సునకు నచ్చినవాడుగ నుండవలె ననుట మొదటి విష యము. అతడు ధనవంతుడుగ నుండివలె ననుట రెండవది.... వీరు వివాహమును చేసికొనకయే ఉందురేమో. పైగా నాతోడి సంబంధముచే వీ రిప్పుడు వైరాగ్యపూర్ణులై యున్నారు. బ్రహ్మ మునుగూర్చిన నిర్విరామ ధ్యానములోనే ఉన్నారు.

కూతుంద్ర కిద్దఱికిని శిరోజములు పసిడివాయకలిగి యుండును. మేనకోడండ్రు (సోదరపుత్రికలు) ఇద్దఱును విసిలకుంతలలు. వారికి అన్నివృత్తులును తెలియును. మేనకోడండ్రకు (సోదరపుత్రికలకు?) అంత సంపద లేదు. పిల్లలకు వా రొక తోటబడిని నడపుచున్నారు. కాని కూతుండ్రు ధనమును సంపాదించుట లేదు. ఈదేశమున బాలికలు పెక్కండ్రు తమ జీవికను తాము గడించుకొందురు. ఒరులపై ఆధారపడియుండువారు లేనే లేరు. కోటీశ్వరుల పుత్రులు సైతము తమజీవికను తాము గడించుకొందురు. కాని వారు పెండ్లిండ్లు చేసికొని వేఱుకాపురములు చేయుచుందురు. కూతుండ్రు నన్ను సోదరా అని పిలుతురు. వారితల్లిని, నేను అమ్మా అని సంబోధింతును. నావస్తువులన్నియు వారింట నున్నవి. నే నెక్కడికి పోయినను నా వస్తువులను వారు చూచుకొనుచుందురు. ఇచ్చట బాలురు చాల చిఱుతప్రాయములోనే జీవిక నన్వేషించుచు పోవుదురు. బాలికలు విశ్వవిద్యాలయములలో చదువుచుందురు. కావున ఏసభలోగాని నూటికి తొంబదితొమ్మిదిమంది మహిళలే కనిపింతురు. వీరితో పోల్చి చూచిన బాలురకు స్థానమే లేదు.

ఈదేశమున భూతప్రేతములందు విశ్వాసము కలవారు చాలమంది ఉన్నారు. భూతమును తనమీదికి ఆవాహనచేసికొనువాడు మధ్యవర్తి. అత డొక తెరచాటునకు పోవును. అందుండి అన్ని వర్ణములుగల అన్ని పరిణామములు గల భూతములు వెలువడును. - కొన్నింటిని నేను చూచినాను. నాకంతయు బూటకమనిపించినది. కాని తుదినిర్ణయమునకు వచ్చుటకు ముందు మఱికొన్నింటిని పరీక్షించి చూతును. ఈభూతవిద్యానిష్ఠులలో పెక్కండ్రకు నాయందు గౌరవము కలదు. వారికి తర్వాతివారు క్రైస్తవ వైద్య విజ్ఞానవేత్తలు. ఈకాలమున అందఱికంటె వారికే పలుకుబడి యెక్కువగ నున్నది. సర్వత్ర వారే కననగుచుందురు. అతిత్వరగ వారు వ్యాప్తి చెందుచున్నారు, సనాతనక్రైస్తవులకు

కడుపుమంటను కలిగించుచున్నారు. వారు వేదాంతులు. అనగా అద్వైతసూత్రములను కొన్నిటిని గ్రహించి వారు వానిని బైబిలున కంటగట్టిరి. 'సోఽహం, సోహం' 'నే నతడను, నే నతడను' అని ఘోషించుచు మనోబలముచే వారు వ్యాధులను నయముచేయుచున్నారు. వారందఱును నన్నంతో కొని యాడుదురు.

ఇప్పు డీ దేశమున సనాతనవర్గమువారు సాయము కోరుచు ఆక్రందించుచున్నారు. "భూతపూజ"* ఎన్నడో గడచిపోయిన కాలమునకు చెందినది. నన్ను చూచి వారు మిక్కుటముగ భయపడి యున్నారు. "ఇ దేమి పీడ? మగవారును మహిళలును వేలకొలదిగ ఇతనిని వెన్నంటుచున్నారు. సనాతనక్రైస్తవ మతమును ఇతడు నిర్మూలింపనున్నాడు" — అని వారు గోల పెట్టుచున్నారు. సరి. దివిటీతో నిప్పు ముట్టించి ఐనది. గురు కృపచే పెద్దమంట ఆవిర్భవించినది. ఇక అది ఆఱదు. కాల క్రమమున ఈదురభిమానులకు ఊపిరాడని పరిస్థితి ఏర్పడును.

దివ్యజ్ఞానసమాజమువారికి అధికశక్తి లేదు. కాని వారును సనాతనవర్గమువారికి తీవ్రప్రతిస్పర్ధులై ఉన్నారు.

క్రైస్తవవైద్యవిజ్ఞానవేత్తలముఠా సరిగా మనకర్తా భజా† వర్గమువంటిది. " 'నాకు వ్యాధి లేదు' అనుము. వ్యాధి లేనివాడ వగుదువు. 'సోఽహం' 'నే నతడను అనుము' నీబంధము వీడి పోవును. నీవు స్వేచ్ఛగ సంచరింపవచ్చు"—ఇది వారి మతము. ఇది కేవలము ఐహికపరమైన దేశము. ఈక్రైస్తవదేశప్రజలు, మీరు రోగములను మాన్పి అద్భుతములను చూపి ధనమార్గము

* క్రైస్తవ సనాతనులు, హిందువులు మున్నగు అన్యమతములవారిని భూతారాధకులని పేర్కొనుచు ఏవగించుకొనుచుందురు.

† ఇ దొక క్షీణవైష్ణవమతశాఖ. వీరు భగవంతుని కర్త అని పేర్కొందురు. దైవప్రార్థనలచేతనే రోగములను మాన్పు నేర్పున ప్రసిద్ధులు.

లను తెలిసిచిననే మీారు బోధించు మతము నాదరింతురు. అన్య మేదియు వారి కర్థము కాదు. కాని ఇట్టివారు కానట్టివారును కొందఱున్నారు.

ఇచటివారికి నే నొక క్రొత్తరకపు మనుష్యుడనుగ కన బడితిని. సనాతనవర్గమువారు సైతము దిక్కుతోప కున్నారు. ప్రజ లిప్పుడు ఆదరముతో నన్నాశ్రయించుచున్నారు. అబ్బాయి, బ్రహ్మచర్యమును పవిత్రతను మించిన శక్తి వేఱొకటియున్నదా?

మదరాసునుండి వచ్చిన సన్మానపత్రమును ఇచ్చటిపత్రిక లన్నియు ప్రకటించినవి. అది సంచలనము కలిగించినది. ఆపత్ర మునకు జవాబు వ్రాయుచు నే నిప్పుడు తీఱిక లేకున్నాను. చౌకగా అగుచో నాప్రత్యుత్తరమును అచ్చువేయించి పంపెదను. అచ్చుపని గిరాకి యగుచో టైపుచేయించి నకలు పంపెదను. దానిని ఇండియనుమిఱ్ఱరు పత్రికలో ప్రకటించునట్లు చేయుడు. ఈదేశమున పెండ్లికాని బాలికలు మిగుల సుశీలలు. వారి కాత్మ గౌరవ మెక్కువ.... ఇచటి ప్రజలు విరోచనుని‡ సంతతివారు. దేహోపచారమే వారికి ఘనకార్యము. శరీరమును చికిలిచేసి కొందురు, శరీరమునకు వన్నెలు వేసికొందురు, వారిశ్రద్ధ అంతయు అందులోనే. గోళ్లు తీయుసాధనములు ఒకవేయి; శిరోజములు కత్తిరించు ఉపకరణములు ఒకపదివేలు. దుస్తుల రకాలను సుగంధవస్తువుల రకాలను సింగారింపు సామగ్రి రకాలను ఎవరు లెక్కింపగలరు?... వీరు చాల మంచివారు, దయగలవారు. సత్య పరులు. వీరిలో అన్నియు బాగున్నవి కాని భోగానుభవమే వీరికి దైవము. ధనము నదిగా ప్రవహించు దేశ మిది. ఆనదిలో పాండిత్యమే తరంగమాలిక. సౌందర్యమే చిట్టి అల. భోగాలలో మునిగి తేలుచున్న దేశ మిది.

‡ విరోచనుడు రాక్షసరాజు, భక్త ప్రహ్లాదుని తనయుడు, ఆత్మజ్ఞాన మునకై బ్రహ్మయొద్ద కేగి బ్రహ్మబోధల నపార్థముచేసికొని జడవాదిగ నయ్యెను. ఛాందోగ్యము - VIII.

"కాఙ్క్షన్తః కర్మణాం సిద్ధిం
యజన్త ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషేలోకే
సిద్ధి ర్భవతి కర్మజా"

కర్మల సిద్ధి కోరువారు ఇచట వేల్పుల నారాధింతురు. ఏలయన మనుష్యలోకమున కర్మప్రభవమగు సిద్ధి త్వరగకల్గును. (భగవద్గీత IV-12).

ఇచ్చట శక్తిబలముల మహాద్భుతవ్యక్తీకరణము కలదు!— ఏమి బలము! ఏమి కార్యతత్పరత! ఏమి పౌరుషము!—ఏనుగు లంతటి పెద్దగుఱ్ఱములు ఇండ్లయంతటి పెద్ద బండ్లను లాగు చుండును. ఇచట తక్కినవాని పరిమాణములు ఎంత అత్యధిక ముగ నుండు ననుటకు దీనిని మీరు మచ్చుతునుకగ గ్రహింప వచ్చు. మహాశక్తి ఇట రూపుదాల్చియున్నది....ఇచటి ప్రజల జీవితములో స్త్రీలవంతు చాల ప్రధానమైనది. స్త్రీల కిచట చాల గౌరవము. ఈరీతి ఆరాధనము ఇచ్చట సమగ్రత నందినది అనుటే ఇందుల సంక్షేపమును విస్తరమును. ఇక అసలు విషయమునకు వత్తము. ఈ దేశమహిళల చూచినప్పుడు ఆశ్చర్య ముచే నేను ఇంచుమించు పరవశుడ నగుచుందును. పసివానిని వెంటనిడుకొని పోయినట్లుగా వారు నన్ను అంగళ్లకు పిలుచు కొనిపోవుదురు. అన్ని చోట్లకును పిలుచుకొనిపోవుదురు. అన్ని రకాల పనులను చేయుదురు. అం దొక వీసమైనను నేను చేయ లేను. వారు సౌందర్యములో లక్ష్మిని బోలినవారు. సుగుణము లలో సరస్వతిని బోలినవారు. లోకజననియే వారిలో ప్రత్యక్ష రూపము దాల్చినది. వారి నారాధించువారికి అన్నివిషయములం దును పరిపూర్ణత సిద్ధించును. శివ శివా! మనలను మనుష్యులుగ పరిగణింపవలెనా? అట్టి తల్లులను దివ్యమాత్రవతారమూర్తులను ఒకవేయిమందిని మనదేశమున నేను మరణించులోగా ఉద్ధరింప

గలనేని శాంతితో మరణింతును. అపుడే తమపేరు కర్తాత మీా దేశీయులకు కల్గును.

ఇచటిస్త్రీలను చూచినపుడు నే నాశ్చర్యస్తబ్ధుడ నగు చున్నాను. జగన్మాతకు వారియెడల ఎంతకరుణ ! మహాశ్చర్యము కలిగించు వనితలు వీరు.' వీరితోడి పోటీలో మగవారు ఇంచు మించు పరాజితు లైనారు. మగవారిని వీరు మూలకు నెట్టివేయ నున్నారు. ఓ జగజ్జననీ, ఇంతకును కారణము నీ కరుణయే.... ఈస్త్రీపురుషభేదభావమును నిర్మూలించువఱకు నే నాగను. ఆత్మలో స్త్రీత్వపురుషత్వవిభేదము లున్నవా? ఈస్త్రీపురుషభేద భావము పోవలెను. అంతయును ఆత్మయే! దేహములమే మనము అను తలంపును దులిపివేసికొని లెండి. "అస్తి", "అస్తి" "ఉన్నది" "ఉన్నది" అని పలుకుడు. "ఉన్న" దను తలంపు లనే యిష్టపడుడు. "నాస్తి" "నాస్తి" "లేదు" "లేదు" అని మితిమీఱి చెప్పుచుండుటచే దేశ మంతయు నాశము నొందు చున్నది. "సోఽహమ్ సోఽహమ్ శివోఽహమ్" "నే నతడను నే నతడను, నేను శివుడను!" ఏమి సంకటము! ప్రతిఆత్మలోను అనంతశక్తి యున్నది. నాస్తి నాస్తి అనుచు మనము పిల్లులుగను కుక్కలుగను మాఱిపోవలెనా? నాస్తిత్వమును ప్రచారము చేయ ఎవడు సాహసించును? దుర్బలుడని శక్తిహీనుడని మీా రనున దెవరిని? "శివోఽహమ్ శివోఽహమ్" "నేను శివుడను, నేను శివుడను" ప్రజలు నాస్తిత్వాశయమును ప్రతిపాదించునప్పు డెల్ల నాకు నెత్తిమీాద పిడుగుపడిన ట్లుండును. ఈ రకపు నైచ్యాను సంధానము రోగ మనుటకు నామాంతరము. దానిని వినయ మందురా? అది మాఱురూపమున నున్న గర్వము. "న లిఙ్గమ్ ధర్మ కారణం, సమతా సర్వభూతేషు ఏత న్ముక్తస్య లక్షణమ్" "వెలిగుర్తులచేత ధర్మము గలుగదు. సర్వభూతములందును సమ త్వము అను ఇదియే ముక్తుని లక్షణము. 'అస్తి' 'అస్తి' 'సోఽహమ్' 'సోఽహమ్' "చిదానన్ద రూప శ్శివోఽహమ్

శివోఽహమ్'' ''నే నతడను, సచ్చిదానందుండ శంభుండ శివుడ''. ''నిర్గచ్ఛతి జగజ్జాలాత్ పంజరా దివ కేసరీ'' ''బోను నుండి సింహము వెలువడినట్లు ఈజగ త్తనెడి వలనుండి ఆత్మ వెలువడును.'' ''నాయ మాత్మా బలహీనేన లభ్యః'' ''బలహీనులు ఈయాత్మను పొందలేరు.'' కొండపైనుండి దొర్లిపడు పెద్ద మంచుగడ్డవలె మీరు లోకముపై బడుడు. మీబరువు క్రింద లోకము రెండుగా పగులనిండు. హర! హర! మహాదేవ! ''ఉద్ధరే దాత్మ నాత్మానమ్'' ''తన్ను తానే ఉద్ధరించుకొన వలెను''.

ఒరుల శ్రేయమునకై ఈ ప్రాణ మర్పింపబడు ఆదినము వచ్చునా? జగత్తు శిశుక్రీడ కాదు; ఎవరు ఒరులకై తమ హృద్రక్తముతో రాచబాటలు నిర్మింతురో వారే మహాత్ములు. అనాదికాలమునుండి యిది జరుగుచున్నది. తనమేనును వ్రాల్చి ఒకడు వంతెనకట్టును. సహస్రసంఖ్యాకులు ఇతరులు ఆవంతెన మీదుగ నదిని దాటుదురు. ''ఏవ మస్తు శివోఽహమ్ శివోఽహమ్'' ''అట్లగు గాక, అట్లగు గాక, నేను శివుడను, నేను శివుడను''....

మదరాసులో సంచలనము కలిగిన దనుట సువార్త.

ఏదే నొక పత్రికవంటిదానిని మీరు ప్రారంభింపబోవు చుంటిరి కదా! దానిని గుఱించి ఏమి? మనము అందఱితో కలియ వలయును. ఎవరినిగాని పరాయివానినిగా చేసికొనగూడదు. అధర్మ శక్తులకు ప్రతిమల్లముగా సర్వధర్మశక్తులును — ఇవే మనకు కావలసినవి. మీగురుదేవుని నమ్ము మని ప్రతివానిని నిర్బంధింప కుడు....మీరొక పత్రికను ముద్రింపవలెను. సగము బెంగాలీలో, సగము హిందీలో — శక్యమగునేని మఱొకటి ఇంగ్లీషులో.... లక్ష్యమేమియు లేక వట్టి త్రిప్పట పనికి రాదు. ఏదేశమునకు పోయినను అట నొక ప్రచారకేంద్రమును నెలకొల్పవలెను. అట్లు చేసిననే ప్రజలు — మార్పొంద నారంభింతురు. నేనొక

గ్రంథమును వ్రాయుచున్నాను. అది ముగియుటే తడవుగ పరుగున ఇంటికి వత్తును....పేరుప్రతిష్ఠలకై కాదు, లోకకల్యాణముకై యే శ్రీరామకృష్ణు డవతరించె ననుటను సదా జ్ఞప్తి యుంచుకొండి. దేనిని బోధించుట కాయన అవతరించెనో దానిని మాత్రమే ప్రచారము చేయుడు. ఆయన పేరు విషయమున మీకు శ్రద్ధ అక్కఱ లేదు. అది తనంతట వ్యాపించును. మీ గురువునే గురువుగా అంగీకరింపు డని మీ రొక్కొక్కరిని నిక్కచ్చి చేయుదు రేని, ఒక కక్షను ఏర్పఱచిన వా రగుదురు. అప్పు డంతయు నేల గూలును. కావున జాగ్రత్త. అందఱితోను మృదువుగ మాటాడుడు. కోపము చూపిన పని చెడును. లోకులు ఇష్టమువచ్చినట్లు మాటాడుచుందురు గాక! మీవిశ్వాసములను అంటిపట్టుకొనుడు. నిబ్బరముగ నుండుడు. విశ్వము మీకు పాదాక్రాంత మగును. వీనినినమ్మకుడు, వానిని నమ్మకుడు అని వారుచెప్పుచుందురు. నే నందును: "మీకు మీయందు మొదట విశ్వాసముండవలెను. అదే దారి. మిమ్ము మీరు విశ్వసింపుడు. సమస్త శక్తియు మీలో నున్నది. గుర్తింపుడు, దానిని వెలికి తెండు", "ఏపనినైనను చేయగలను" అనుడు. సర్పవిషమును సైతము, దృఢముగ కా దన గలవేని, నిర్వీర్య మగును. జాగ్రత్త! నాస్తి అనుట లేదు. నాస్తిత్వాశయములు పనికి రావు. "ఔను" "ఔను" "సోఽహమ్ సోఽహమ్" "నే నతడను, నే నతడను"

గీ॥ ఏల విలపింతు వో సఖా వెలికి తెమ్ము
సర్వశక్తిని నీలో నెసంగుదాని
మూడు లోకాలు నీపాదములకు మ్రొక్కు;
శక్తిగలయది ఆత్మయే, జడము కాదు*

* శ్లో॥ "కి న్నామ రోదిషి సఖే త్వయి సర్వశక్తి
రామన్త్రయస్వ భగవన్ భగదం స్వరూపమ్
త్రైలోక్య మేత దఖిలం తవపాదమూలే
ఆత్మైవ హి ప్రభవతే న జడః కదాచిత్"

భయ మెఱుగని బలముతో పాటువడవలెను. భయమేమి? మి మ్మడ్డగింపగలంత శక్తి యెవరి కున్నది ?

గీ॥ తారకావళిని నమలెదము త్రిభువన
ములను పెకలించి వైతుము బలిమిబట్టి
రామకృష్ణుని దాసుల మము నెఱుగవె *
భయమా ? ఎవరివలన భయము ? ఛీ!

గీ॥ దేహమే యాత్మ యను భ్రాంతి దివురువారు
''క్షీణులము దీనులము మేమిసీ''యటంచు
చెప్పుచుండుదు రదియె నాస్తికత చూవె
రామకృష్ణుని దాసవర్గమును చేరు
వీరులము, నిర్భయులమేము, భీతి లేని
స్థితిని జెందితి, మిదియె యాస్తికత యనగ.

మంజరి॥ సంసారసంగంబు సర్వంబు విడిచి
పరమామృతంబు నింపారంగ గ్రోలి
అన్ని కలహముల కాది హేతు వగు
స్వార్థానుధావనసక్తిని వీడి
పరమకల్యాణరూపంబైన గురుని
పాదాలయుగళిని భక్తి ధ్యానించి
మ్రొక్కుడి మాటికి మూడులోకాల
పిలుచుచున్నా మిందు పాలుగొం డనుచు.†

---

* కర్మ స్తారక చర్వణం
త్రిభువన ముత్పాటయామో బలాత్
కింభో న విజానా స్యస్మాన్
రామకృష్ణదాసా వయమ్.

† శ్లో॥ క్షీణా స్మ దీనాః సకరుణా జల్పన్తి మూఢాజనా
నా స్తిక్య న్త్విదన్తు అహహా దేహాత్మవా దాతురాః

గీ॥ నిగమజలధిని జిల్కి జనించె నేది
ఏది యాద్యంతములు లేక యెసగుచుండు
నెన్నడు గిరీశుడు నలువ మున్నుగాగ
సురలు తమబలంబుల దేన జొన్పినారొ –
భువినినారాయణులప్రాణపూర మెందు –
నిండుకొనియుండె నాసుధ నెల్ల రామ
కృష్ణదేవుడు తన మేన గీలుకొల్పె.*

ఆంగ్లవిద్య నభ్యసించిన యువజనులనడుమనే మన ఉద్యమమును కొనసాగింపవలెను. "త్యాగేనైకే అమృతత్వమానశుః" "అమృతత్వమును కొందఱు త్యాగముచేతనేబడసిరి." త్యాగము! త్యాగము! తక్కిన అన్నింటికంటె నెక్కువగా ప్రచారము చేయవలసినది దీనిని. ఐహికసంగము వదలుకొననివానికి ఆధ్యాత్మిక శక్తి యుండదు....

...ఎందు కంత బాధపడుచున్నారు? నాస్తి, నాస్తి అని తమ్ము తుడిచివేసికొనుచుండుటే అందుకు కారణము. మనోబలముచే వ్యాధిని నెట్టివేయు డని వారికి చెప్పుడు. ఒక గంటలో అది మాయ మగును. ఆత్మనైన నేను వ్యాధిగ్రస్తుడగుటయా! ఆతలంపును తఱిమివేయుడు. "నేను ఆత్మను, వ్యాధిపీడ నాకెట్లు

ప్రాప్తాః స్మ వీరా గతభయా అభయం ప్రతిష్ఠాం యదా
ఆస్తిక్య స్త్వద స్తు చినుమః రామకృష్ణదాసా వయమ్॥
శ్లో॥ పీత్వా పీత్వా పరమ మమృతం వీతసంసారరాగాః
హిత్వా హిత్వా సకలకలహప్రాపిణీం స్వార్థసిద్ధిం
ధ్యాత్వా ధ్యాత్వా గురువరపదం సర్వకల్యాణరూపం
నత్వా నత్వా సకలభువనం పాతు మామ న్త్రయామః॥

* శ్లో॥ ప్రాప్తం యద్వై త్వనాదినిధనం వేదోదధింమథిత్వా
దత్తం యస్య ప్రకరణే హరిహరబ్రహ్మాదిదేవైర్బలమ్
పూర్ణం యత్తు ప్రాణసారై ర్భౌమనారాయణానాం
రామకృష్ణ స్తనుం ధత్తే తత్పూర్ణపాత్ర మిదం భోః॥

కలుగును'' — అని ఒకసారి గంటసేపు ధ్యానింపు డని వారికి చెప్పుము. అంతయు మాయ మగును. మీరు అనంతశక్తియగు ఆత్మయే అని అందఱును తలంపుడు. అప్పు డెంతబలమువచ్చునో చూడుడు....స్వనై చ్యానుసంధానము! అదెందుకు? నేను సర్వ శక్తియు అంతరహితయునగు లోకజననికి బిడ్డను. నాకు వ్యాధి యేమి? భయ మేమి? లోటేమి? నా స్తిత్వాశయమును అంటు రోగమును తఱిమినట్లు తఱిమివేయుడు. అట్లుచేసిన అన్ని విధ ముల మీకు క్షేమము కలుగును. అసత్తు లేనేలేదు. అన్నియు ''అస్తియే, సత్తే'' నేనున్నాను. దేవుడున్నాడు. సమస్తమును నాయం దున్నది. ఆరోగ్యమును గాని పవిత్రతను గాని జ్ఞాన మును గాని నా కేది కావలసినను నేను ఆవిష్కరింపగలను నా బోధలను ఈవిదేశీయులు అర్థముచేసికొనగల్గుచున్నారు. నాస్తి త్వాశయముచే మీరు వ్యాధిపీడితులుగ నున్నారు. మీరు రుగ్ణు లని ఎవ డనును? మీకు రోగ మేమి? దానిని దూరముగ దులిపి వేయుడు. ''వీర్య మసి వీర్యం, బల మసి బలం, ఓజోఽసి ఓజో, సహోఽసి సహో మయి ధేహి'' ''నీవు వీర్యమవు నాకు వీర్య మిమ్ము, నీవుబలమవు, నాకు బలము నొసగుము, నీవు ఓజస్సువు, ఓజస్సును నాకు ప్రసాదింపుము, నీవు క్షాంతివి, క్షాంతిని నాకను గ్రహింపుము. ప్రతిదినము భగవంతు నారాధించునపుడు ఆసన ప్రతిష్ఠ చేయుచు ''ఆత్మాన మచ్ఛిద్రం భావయేత్'' తన్ను తాను నిరంధ్రునిగ భావింపవలెను — అందురే అందు కర్థ మేమి ''సమస్తము నాయందున్నది. సంకల్పమాత్రముచే నేను దానిని ఆవిష్కరింపగలను'' — అని అనుసంధింపుడు. ''ఆత్మ అనగా ఇట్టిది—ఆత్మ అనంతము. దానికి వ్యాధి ఎట్లు కల్గును'' అని వల్లించుచుండుడు. దినమునకు గంటసేపు వరుసగా కొన్నాళ్లు ఇట్లు వల్లించుచుండుడు. సకలవ్యాధులును చిక్కులును మాయమై పోవును.

సదా మీ
వివేకానంద

## 118

(ఇసబెల్మెకండ్లీకి)

బోస్టను,
సెప్టెంబరు 26, 1894.

ప్రియ సోదరీ,

ఇండియానుండి వచ్చిన టపాతోడి నీ జాబు ఇప్పుడే అందినది. పత్రికల ఉద్ధారములు కొన్ని ఇండియానుండి నాకు పంపబడినవి. వానిని నీవు చదివి భద్రపఱచుటకై నీకు మరల పంపుచున్నాను.

కడచిన కొలదిదినములుగా ఇండియాకు జాబులను నిర్విరామముగ వ్రాయుచున్నాను. మఱి కొన్ని దినములు బోస్టనులోనే ఉందును.

నీకు నా ప్రేమాశీస్సులు.

భవదీయ నిత్యప్రేమయుత
వివేకానంద

## 119

(శ్రీమతి ఓల్బులు సతికి)

బోస్టను,
సెప్టెంబరు 26, 1894.

ప్రియ బుల్సతికి,

దయతో నీవు వ్రాసిన రెండు జాబులును అందినవి. శనివారమునాడు నేను మరల మెల్రోజుకు పోయి సోమవారమువఱకు అచట నుందును. మంగళవారమునాడు మీచోటికి వచ్చెదను.

మీచోటు సరిగా ఎటువైపున్నదో మఱచిపోయినాను. దయతో తెల్పితివేని నీదయకు నాకృతజ్ఞతను మాటలలో తెలుపజాలను. ఏలయన నాకు కావలసినది అదే. వ్రాసికొనుటకు ఒకప్రశాంత ప్రదేశము. దయతో నీవు నాకు ఈయ నెంచినంత చోటుకంటె చాల తక్కువచోటే చాలును. నే నేదో ఒకమూలలో ఇమిడి చాల హాయిగా ఉండగలను.

హృదయపూర్వకముగ నీవాడైన
వివేకానంద

## 120

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
సెప్టెంబరు 27, 1894.

ప్రియ అళసింగా,

...కలకత్తాలో ప్రచురింపబడిన నా ఉపన్యాసాలవచన ములగ్రంథములో నా కనుదాకిన విషయము:—అచ్చువేసిన రీతిని బట్టి అందు కొన్ని రాజకీయాశయములవలె తోచును, నిజము నకు నేను రాజనీతికుశలుడను కాను. రాజనీతిరంగమున ఆందో ళన చేయువాడను కాను., ఆత్మ యొక్కటే నాకు లక్ష్యము. అది బాగున్నచో తక్కినది ప్రతిదియు తనంతట బాగుపడును.... నారచనలకు గాని ఉపన్యాసములకు గాని లేని రాజకీయప్రాముఖ్య మును ఆరోపింపకుడని కలకత్తావారిని హెచ్చరింపుము. ఏమి అర్థరహితప్రసంగము!...పూజ్యశ్రీ కాళీచరణబెనర్జీ క్రైస్తవమత ప్రచారకుల సమక్షమున ఉపన్యసించుచో నేను రాజకీయవర్గ ప్రతినిధి నని చెప్పె నట. అత డట్లు ఎల్లరసమక్షమున చెప్పి

యుండె నేని ఆమాటను రుజువుచేయుము. ఆరుజువును కల్కత్తా పత్రికలలో ప్రచురింపుము. రుజువుచేయలేకున్నచో ఆమాటను ఉపసంహరించుకొను'' మని ఎల్లరసమక్షముననే అతని నడుగుము. ఇది వారి జిత్తు! రుజుమార్గముననే క్రైస్తవ ప్రభుత్వముల గుణ దోషముల నెన్నుచు నేను కటువులైన మాటలను కొన్నిటి నంటిని. అంతే కాని రాజకీయములతో నా కేదో సంబంధ మున్న దని కాని రాజకీయములను నేను లక్షింతు నని కాని అట్టి దేదియు అందుకు అర్థము కాదు. కొందఱు ఆ నా యుపన్యా సములనుండి కొన్ని భాగములను తీసి అచ్చువేయించుట గొప్ప పని అనుకొని నన్నొకరాజకీయప్రచారకునిగ రుజువుచేయగోరుదు రేని ''నన్ను నామిత్రులనుండి కాపాడు'' దని వారిని వేడు కొందును....

...నన్ను గుఱించి దుష్ప్రచారములు చేయువారి కంద ఱికిని నా మౌనమే ప్రత్యుత్తర మని నామిత్రులకు చెప్పుము. దుష్ప్రచారకులతో మాటకు మాట అనుచుందుమేని, అది మన లను వారి మెట్టుకు దించును. సత్యము తన్ను తాను కాపాడుకో గల దనియు నాకై వా రెవరితోను పోరాడవలదనియు మన వారితో చెప్పుము. ఆ దుష్ప్రచారకులు నేర్చుకోవలసినది ఇంకను ఎంతో కలదు. వారు కేవలము పసివారు. వట్టిబాల కులు. నిండుగ పిచ్చికలలు తీయనికలలు కనుచున్నారు.

...ఈ బహిరంగజీవితముపట్లను ఈపత్రికాప్రకటనల పట్లను నాకు పూర్తిగా వెగటు కల్గినది. ప్రశాంత హిమాలయ ప్రాంతమునకు తిరిగి పోవలె నని తహతహపడుచున్నాను.

సదా భవదీయ ప్రేమపూర్ణ
వివేకానంద

## 121

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
సెప్టెంబరు 29, 1894.

ప్రియ అళసింగా,

ధీరనిస్స్వార్థులైన నావత్సలారా, పనులను మీరందఱును చక్కఁగ నిర్వర్తించితిరి. మిమ్ముగుఱించి నే నెంతయు గర్వపడు చున్నాను....విశ్వాసము గల్గియుండుము. నిరాశ చెందకు. ఇంత ఊపుతో ప్రారంభించిన తర్వాత ఆసపాటు వదలు కొందు వేని, నీవు అవివేకివి....

మన కార్యరంగము భారతదేశము. భారతీయులను మేలు కొల్పవలెను. విదేశీయుల ప్రశంసల విలువ యంతయు అందు లోనే ఉన్నది. అంతే....మన కొక దృఢమైన మూలస్థానము కావలెను. అచ్చటినుండి మనము వ్యాపింపవలెను....క్షణకాల మైనను గడగడలాడకు. అంతయు సరిపడిపోవును. లోకమును కదలించునది సంకల్పశక్తియే. నాయనా, యువకులు క్రైస్తవులుగ మాఱుచున్నందులకు నీవు దుఃఖింప నక్కఱ లేదు. ఇప్పు డున్న సంఘనిర్బంధములలో ముఖ్యముగ మదరాసులో వారు వేఱేమి చేయగలరు. వర్ధిల్లవలయునన్న అందులకు ఆవశ్యకమైనవానిలో మొట్టమొదటిది స్వేచ్ఛ. మీతండ్రితాతలు ఆత్మకు అన్ని స్వేచ్ఛల నొసంగిరి. ఆధ్యాత్మికధర్మము వర్ధిల్లినది. దేహమునకు వారు అన్నివిధములైన నిర్బంధములను కలిగించిరి. కావున సంఘము వర్ధిల్లలేదు. మనదేశపరిస్థితికి విరుద్ధమైన పరిస్థితి పాశ్చాత్యదేశములలో నున్నది. సంఘమున కన్నిస్వేచ్ఛలును కలవు. మతస్వేచ్ఛ లేదు. పాశ్చాత్యదేశమున మతమున కున్న సంకెలలును ప్రాచ్యదేశములలో సంఘమునకున్న సంకెలలును ఇప్పుడు రాలిపోవుచున్నవి.

ప్రాచ్యపాశ్చాత్యదేశములకు దేని పద్ధతి దాని కుండును. అనగా భారతదేశమున మతాధారమైన అంతర్ముఖవైఖరియు పాశ్చాత్యదేశములలో విజ్ఞానోచితమైన బహిర్ముఖవైఖరియు నుండును. సంఘాభివృద్ధిమూలముగనే ఆధ్యాత్మికతలోని ప్రతిలవలేశమునుకూడ పొందగోరుదురు పాశ్చాత్యులు. ఆధ్యాత్మికపరత మూలముగనే సంఘశక్తిలోని ప్రతిలవలేశమును పొందగోరుదురు ప్రాచ్యదేశీయులు. భారతదేశమున మతమును ముందుగా అణం పనిదే నూతనసంస్కర్తలకు సంస్కారమార్గ మేదియు కనిపింపక పోవుట కిదే కారణము. అణచుటకు వారు ప్రయత్నించిరి. భగ్నులైరి. ఏల? వారిలో తమమతమునైనను ఎప్పుడేని పరిశీలించుకొన్నవారు లేరు. అన్నిమతములకును తల్లిమతమైనదానిని అవగాహనచేసికొనుటకువలసిన తర్బీదునొందినవాడువారిలోనొక్కడైనను లేడు. నావాద మిది: హిందూసంఘమును పెంపొందించుటకు మతమును రూపుమాప వలసిన ఆవశ్యకత లేదు. ఆధ్యాత్మికధర్మమును సాంఘికవిషయములలో అన్వయింపజేయవలసినరీతిలో అన్వయింపజేయకపోవుటే ఇప్పటి సంఘదుఃస్థితికి కారణము గాని, మతమందులకుకారణము కాదు. ఈ నావాదమును, ఇందలి ఒక్కొక్క అక్షరమును మన సనాతనగ్రంథములను ప్రమాణీకరించుకొనినిరూపించుటకు నేను సిద్ధముగ నున్నాను. నేనుబోధించున దిదే. బ్రతికి నన్ని నాళ్లు దీనినే అమలుపఱచుటకు మనము పాటుపడవలయును. కాని అందు కెంతో కాలము పట్టును. పరిశోధనకు సుదీర్ఘ కాలము కావలయును. ఓర్పు వహింపుడు, పాటువడుడు. 'ఉద్ధరేదాత్మనాత్మానమ్' 'ఆత్మచేతనే ఆత్మ నుద్ధరించుకొండి'.

భవదీయ
వివేకానంద

మఱిమాట: ఇప్పటి హిందూసంఘము ఆత్మసాధకులను మాత్రమే గుఱిలో నుంచుకొని నిర్మితమైనది. ఆత్మసాధకులు

కానట్టి యితరులను అది తలమెత్తనీక అదిమి నెట్టివైచుచున్నది. ఏల? సంసారమును దానికిసంబంధించిన అసారవిషయములనుఒకింత అనుభవింపగోరువారు ఎచ్చటికి పోదురు! మనమతము ఎట్లు అన్ని మతములకును తనలోచోటిచ్చునో అట్లే మనసంఘమును అందఱి కిని చోటీయవలయును. మనమతయథార్థసూత్రములను మొదట అర్థముచేసికోవలెను. తర్వాత వానిని సంఘవిషయమున అన్వ యింపజేయవలెను. అట్లు ఈ ప్రణాళికను నిర్వర్తింపవలెను. నిదానముగనే అయినను తప్పక చేయవలసిన పని ఇదే.

వి.

## 122

(శ్రీ హరిదాస విహారీదాస దేశాయిగారికి)

చికాగో,
సెప్టెంబరు, 1894.

ప్రియ దివాన్జీ సాహెబు,

దయతో మీరు వ్రాసిన జాబు చేరి చాలదినములైనవి. కాని వ్రాయుటకు నాకు సమాచార మేమియు లేనందున జవా బుకు ఆలసించితిని.

జి. డబల్యూ, హేలుకు మీరు దయతో వ్రాసిన జాబు అత్యంతప్రీతికరముగ నున్నది. అంతమాత్రము వారికి నేను ఋణ పడియేయున్నాను. ఇన్నాళ్లును నేను ఈ దేశమంతటను పర్యటిం చుచు అన్ని విషయములను చూచుచుంటిని. తుదకు ఈతీర్మాన మునకు వచ్చితిని:—ప్రపంచమం దంతటను ఆధ్యాత్మికధర్మమును అవగాహనచేసికొను దేశ మొక్కటే. భారతదేశమే అది. హిందువులలో దోషము లుండు గాక. నీతిపరతలోను ఆధ్యా త్మికపరతలోను వారు తక్కిన అన్ని దేశములవారికంటెను చాల

పై మెట్టున నున్నారు. స్వార్థరహితులైన భారతమాతృపుత్రులు తగిన మెలకువ వహింపవలెను. ప్రయత్నింపవలెను. పాటుపడ వలెను. హిందువుల ప్రశాంతసుగుణములతో పాశ్చాత్యులకార్య పరకార్యసాధక సుగుణములను కొన్నిటిని కలుపుకొన్నచో, అప్పుడు ప్రపంచమున నున్న సకల ప్రజలకంటె చాల మేలైన యొకరకపు ప్రజ రూపొందును.

నే నెప్పుడు మరలి వత్తునో నాకు తెలియదు. కాని నా కీదేశమున చూచిన దింక చాలు నని తోచినందున త్వరలోనే యూరోపునకును అచ్చటినుండి భారతదేశమునకును రాగల నని అనుకొనుచున్నాను. మీకును మీసోదరులందఱికిని నావరిష్ఠ ప్రేమ, కృతజ్ఞత.

భవదీయ శ్రద్ధాయుత
వివేకానంద

## 123

(శ్రీ హరిదాస విహారదాస దేశాయిగారికి)

చికాగో,
సెప్టెంబరు, 1894.

ప్రియ దివాన్జీ సాహెబు,

నాసౌఖ్యారోగ్యములను అడిగి తెలిసికొనుటకై మీ రొక నిని పంపితిరే. అది చాల దయతో చేసినపని. కాని మీ పితృ శీలమునకు అది యెంతయు అనురూపమే. నే నిచ్చట క్షేమముగా నున్నాను. మీదయచే నా కిచట ఎట్టి లోటును లేదు. కొన్నా ళ్లలో మిమ్ము దర్శింపగల నని ఆసించుచున్నాను. తిరిగి వచ్చి నప్పుడు ప్రయాణపుఖర్చులకు నాకు ధన మేమియు కావలసి యుండదు. ఏ కార్యనిశ్శ్రేణియందైనను సరే అవరోహణము

చాల కష్టమే. ఆరోహణము అన్నిటికంటె కష్టము. ప్రపంచములో అన్ని విషయములలోను అంతే. మీకు నాహృదయపూర్వక ధన్యవాదములు.

భవదీయ విశ్వాసయుత
వివేకానంద

## 124

(శ్రీరామకృష్ణానందస్వామికి)

బాల్టిమోరు
అమెరికాసంయుక్తరాష్ట్రములు
అక్టోబరు 23, 1894.

ప్రియ—,

నీయుత్తర మందలి విషయములు చదివి ఆనందించితిని. లండనునుండి అక్షయకుమారఘోషు వ్రాసిన యొకజాబు కూడ నేడందినది. దానినుండికూడ కొన్ని సమాచారములు తెలిసికొంటిని.

ఇప్పుడు నీశక్తి సామర్థ్యములను నీవే గుర్తించితివి. ఇనుము కాగియున్నప్పుడే సమ్మెటతో కొట్టు. సోమరితనము పనికిరాదు. ఈర్ష్యాహంకారాలను మరల తలచూపనీయక నెట్టివేయవలెను. అద్భుతశక్తితో పూర్ణబలముతో పనిచేయుటకు కార్యరంగమునకు రమ్ము. శేషించినదానికి దారిని దేవుడు చూపును. ఉత్తుంగతరంగము సమస్తలోకమును ముంచివేయ నున్నది. పనిచేయవలెను, పనిచేయవలెను, పనిచేయవలెను—అనుటే నీ ఆదర్శముగ నుండనిమ్ము, మరేమియు నాకు కనిపించుట లేదు. ఇచటి కర్తవ్యమునకు అంతు లేదు — దేశమందంతటను సంచరించుచున్నాను. శక్తిబీజ మెందు నాటుకొనునో అది ఫలించితీరును. "అద్యవా అబ్దశతాన్తే వా"— 'నేడే కానీ నూఱేండ్లకు కానీ'.

ఎల్లరయెడ సానుభూతితో నీవు పాటుపడవలెను. అప్పుడే దానికి సత్వరఫలములు కలుగును....

లోకమునకు హితముచేయుటే మనలక్ష్యము కాని మన పేరులను ప్రోగించుకొనుట కాదు. సింహళములో నిరంజనుడు పాళీభాష నేర్చుకొని బౌద్ధగ్రంథముల నేల పఠింపరాదు! లక్ష్య రహితమైన వట్టి త్రిప్పట వలన ఏమి మేలు చేకుఱునో నాకు తెలియుట లేదు. సుగుణములు— సంపద— కామితములు— స్వాతంత్ర్యము — అను నివి ఈశ్వరుని రక్షణలోనికి వచ్చిన వారికి పాదాక్రాంతము లగును. 'మాభైః' 'మాభైః' 'భయ పడకు, భయపడకు' మెట్టుమెట్టుగా సమస్తమును సమకూడును. మిమ్మందఱను నేను కోరున దిది — స్వాతిశయమును కలహ ప్రీతిని ఈర్ష్యను — శాశ్వతముగ విడనాడుడు. భూమాతవలె సర్వంసహులై యుండ వలెను. అట్లు కాగల్గితి రేని ఈలోకము మీచరణముల నాశ్రయించియుండును....

ప్రయత్నించి వార్షికోత్సవమప్పటి విందులలో కడుపున కన్నమును కొంత తగ్గించి అందుకు బదులు మెదడుకు అన్నమును పెట్టుడు...

భవదీయప్రేమయుత
వివేకానంద

## 125

(వెహిమియా చాంద్‌కు)

వాషింగ్టన్
అక్టోబరు 23, 1894.

ప్రియ వెహిమియాచాంద్,

ఈదేశమున నాయాత్ర చాల బాగుగ సాగుచున్నది. ఈపాటి కిచ్చటి వారి సొంత గురువులలో నే నొకడ నైతిని. వీరి కందఱికిని నేను నచ్చితిని. నాబోధనలు నచ్చినవి... ప్రచారము

చేయుచు బోధించుచు ఒకచోటినుండి ఒకచోటికి సంచరించుట భారతదేశమున నావాడుకగా నుండెను కదా! ఇక్కడను అట్లే చేయుచున్నాను. వేలకొలదిగ ప్రజలు నా ఉపన్యాసములను విని నాఆశయములను చాల ఆదరముతో గ్రహించినారు. అన్ని దేశ ములందుకంటె వ్యయము చాల ఎక్కువగ నగు దేశమిదే. ఐనను పోయినచోటనెల్ల నాకు కావలసినవానిని దేవు డిచ్చుచున్నాడు.

నీకును అచట (రాజపుత్రస్థానమున లిమ్డిలో) నున్న నా మిత్రులందఱికిని నాప్రేమ.

భవదీయుడు

వివేకానంద

## 126

(ఇసబెల్ మెకండ్లీకి)

శ్రీమతి ఇ. టాటనుగారింట
1708 డబల్యూ 1 వీధి, వాషింగ్టన్
అక్టోబరు 26(?), 1894.

ప్రియసోదరీ,

చాలకాలము మౌనముగ నుంటిని. మన్నింపుము. కాని అమ్మచర్చికి కాలక్రమము తప్పక జాబులు వ్రాయుచునేయుంటిని. చల్లని చక్కనివాతావరణసుఖమును మీరందఱును అనుభవించు చుందు రని నా నమ్మకము. బాల్టిమోరును వాషింగ్టనును నాకు మిగుల భోగ్యములుగ నున్నవి. నేనిచటినుండి ఫిలడెల్ఫియాకు పోదును. కుమారి మేరీ ఫిలడెల్ఫియాలో నున్నదనుకొంటిని. కావున ఆమె చిరునామా నడిగితిని. కాని ఆమె ఫిలడెల్ఫియాకు సమీపమున మఱొకచోట నున్నది. నన్ను చూడ వచ్చు శ్రమ ఆమెకు కలిగించుట నా కిష్టము లేదు, అమ్మచర్చియు అట్లే చెప్పుచున్నది.

నేను బసచేయుచున్నది శ్రీమతి టాటనుసతిగారింట. కుమారి హౌకు ఈమె మేనగోడలు. (సోదరీపుత్రి?) ఇంకను వారమునకంటె ఎక్కువ దినములే ఆమెకతిథిగానుందును. కావున నీవు నాకు వ్రాయు జాబుల ఆమెయింటికే వ్రాయుచుండుము.

ఈచలికాలములో జనవరిలోగాని ఫిబ్రవరిలోగాని ఇంగ్లండుకు పోవలెనని ఉద్దేశించుచున్నాను. లండనులో నామిత్రు డొక మహిళయింట నున్నాడు. ఆమహిళ నన్ను "వచ్చి నా కతిథిగా నుండు" మని ఆహ్వానించుచు జాబు వ్రాసినది. ఇండియాకు తిరిగిరమ్మని అచటిమిత్రులు అనుదినము నిక్కచ్చిచేయుచున్నారు.

పిటు, వ్యంగ్యచిత్రము నీ కెట్లుండినది? దాని నెవ్వరికిని చూపకు. మనవారు అతని నారీతి చిత్రించుట చాలచెడ్డపని.

నీసమాచారము తెలిసికొనవలయునను తహతహ నాకు సదా ఉన్నది. నీవ్రాత మఱి కొంత స్పష్టముగా నుండునట్లు నీవిక కొంత మెలకువ వహింపుము. ఈసలహా చెప్పినందుకు నాపై కోపింపకుము.

సదాభవదీయ ప్రియసోదరుడు
వివేకానంద

## 127

(శ్రీమతి ఓల్బులు సతికి)

శ్రీమతి ఇ. టాటనుసతియింట
1708, 1 వీధి
వాషింగ్టన్ డి. సి.
అక్టోబరు 27, 1894.

ప్రేమాస్పద శ్రీమతి ఓల్బుల్,

ప్రొఫెసరికగ్గసుకు పరిచయపఱచుచు లేఖను పంపిన నీదయకు పెక్కు కృతజ్ఞతాభివందనములు. బాల్టిమోరులో నీచవర్గీయు

డగు నొక హోటలువాడు నన్నవమానించినందులకు నీవు చింత పడ నక్కఱలేదు. దోషము గ్రామనుసోదరులది. ఆక్రిందితరగతి హోటలుకు వారు నన్నేల తీసికొనిపోవలెను?

ఎల్లచోటులందు వలె అందును నా రక్షణకు అమెరికను స్త్రీలే వచ్చిరి. నాకు కాలము చాల హాయిగా గడచినది.

వాషింగ్టనులో నేను శ్రీమతి ఇ. టాటనుసతియింట అతిథిగా నున్నాను. ఆమె యిచట చాల పలుకుబడిగలది, వేదాంతవేత్త్రి. అంతేగాక ఆమె నా చికాగోమిత్రములలో నొకరికి మేనగోడలు. (సోదరపుత్రి?) కావున అంతయు చాల చక్కగ గడచిపోవుచున్నది. నేనిచట శ్రీ కాల్విల్లును కుమారియంగును కూడ కలిసికొన్నాను.

నీపట్ల సదానురాగకృతజ్ఞతలు గల—

భవదీయుడు
వివేకానంద

## 128

(శ్రీ ఆళసింగపెరుమాళుకు)

వాషింగ్టన్
అక్టోబరు 27, 1894.

ప్రియ ధన్య—,

......ఇండియాలో ఏమి చేయుచుండుట నావాడుకయో ఇక్కడను అదే చేయుచున్నాను — సదా దేవునిపై ఆధారపడి యుండుటయు భవిష్యత్తుకు వలసిన ఏర్పాట్లను చేసికొనకుండుటయు....పైగా నీవు జ్ఞాపకముంచుకొనవలసిన విషయ మిది— ఈదేశములో నే నెడతెంపు లేక పాటుపడవలసియున్నది. ఆశయములను గ్రంథరూపమున క్రోడీకరించుటకు నాకు వ్యవధి లేదు.

ఎడతెఱపిలేని ఈపరుగులచే నానాడులు అఱిగిపోయినవి. ఆశిథిలత అనుభవములో నాకు తెలియుచున్నది. నీవును, జి. జి. యు మదరాసు మిత్రులందఱును నిస్స్వార్థముగను వీరోచితముగను నాకై శ్రమపడితిరి. నాకృతజ్ఞతను మాటలలో తెలుపలేను. మీరు పడిన శ్రమయంతయు నన్ను ప్రకాశపఱచుటకు గాదు. మీశక్తి మీకు తెలియుటకే. నేను నిర్మాణకార్యకుశలుడను కాను. నాప్రకృతి, వైదుష్యధ్యానప్రవణము. ఇప్పటికి నేను చేసిన పని చాలు నని నా తలంపు. ఇక నాకు కావలసినవి— విశ్రాంతియు, నాగురుదేవునొద్దనుండి నాయొద్దకు వచ్చిన వారికి కొంత బోధ చేయుటయు. మీ రేమి చేయగలరో మీ కిప్పుడు తెలిసి పోయినది. ఏలయన సమస్తమును నిజముగ నిర్వహించినది. మదరాసు యువజనులైన మీరే. నేను అలంకారార్థమున్న బొమ్మను. త్యాగిని, సన్న్యాసిని. నాకు కావలసిన దొక్కటే. వితంతువుకన్నీటిని తుడువజాలని, దిక్కులేని బిడ్డనోటికి కబళ మన్నమును అందింపజాలని, దేవునందుగాని ధర్మమునందుగాని, నాకు నమ్మకము లేదు. సిద్ధాంతము లెంత గంభీరములైన కా వచ్చు. తత్త్వశాస్త్రము ఎంత చక్కగా అల్లబడినదైన కావచ్చు. సిద్ధాంతరూపముననే గ్రంథములరూపముననే అది కట్టువడి యున్నంతకాలము దానిని నేను మతధర్మ మనను. కన్నులు తలకు ముందువైపు నున్నవే కాని వెనుకవైపు లేవు. ముందుకు పదండి. దేనిని మీమత మని చెప్పుకొనుచు గర్వించుచున్నారో దానిని అమలులో పెట్టుడు. దేవుడు మి మ్మనుగ్రహించును.

నావంక చూడకుడు. మిమ్మే మీరు చూచుకొండి. ఉత్సాహము పుట్టించు అవకాశము నైనందుకు నేను సంతో షించుచున్నాను. ఈయుత్సాహమును వినియోగించుకొనుడు. అందు వెంట తేలిపొండి, సమస్తమును చక్కబడును. నాయనా, ప్రేమ యెన్నడును వమ్ము కాదోయి. నేడు కాని రేపుగాని యుగ ములు గడచినవెనుకగాని నిజము నెగ్గి తీరును. ప్రేమ గెల్వొంది

తీరును. తోడిమానవులపై నీకు ప్రేమయున్నదా? దేవు నన్వే షించుటకై ఎచటికి పోవలెను? ఈపేదలును ఈదుఃఖితులును ఈదుర్బలులును వీ రందఱును దైవములు కారా? ముందుగ వీరి నేల ఆరాధింపరాదు? గంగగట్టున బావిత్రవ్వ నేల? ప్రేమకు గల సర్వతోముఖమైన శక్తియందు నమ్మకము కల్గియుండుడు. పేరు ప్రతిష్ఠలనెడి పెలితళుకు లెవరికి లక్ష్యము? పత్రికాప్రకటనలపై నే నెన్నడును క న్నుంపను. నీకు ప్రేమ యున్నదా?—ఉన్నచో నీవు సర్వశక్తివి. నీలో సమగ్రనిస్స్వార్థత కలదా? ఉన్నచో నీవు అప్రధృష్యుడవు. శీలమే యెల్లెడల సాధకము. కడలిలోతు లలోనైనను సరే దేవుడు తనబిడ్డలను తానే కాపాడుకొనును. మీ దేశము వీరులను కాంక్షించుచున్నది.' వీరులరు కండి. భగ వంతుడు మి మ్మనుగ్రహించును.

అందఱును నన్ను భారతదేశమునకు తిరిగిరమ్మనువారే. నేను మరలివచ్చినయెడల ఇంతకంటె ఎక్కువ కార్యములు సాధింతు మని వారి తలంపు. మిత్రమా, వారు పొరపడు చున్నారు. ఇప్పటి యుత్సాహము ఇంచుకంత దేశభక్తిమాత్రమే. అంతకంటె అం దేమియును లేదు. ఈయుత్సాహము సత్యమును స్వచ్ఛమునగుచో మనకంటియెదుట అచిరకాలములోనూర్లకొలది వీరులు ముందుకుఱికి పనిని కొనసాగించుచుందురు. నిజమునకుసమస్త మును నిర్వహించినవారు మీరే అని తెలిసికొని కొనసాగింపుడు. న న్నెదురుచూడకుడు. అక్షయకుమారుపా లండనులోనున్నాడు. కుమారి మిల్లరునింటికి నన్ను రమ్మని అతడు లండనునుండి చక్కని ఆహ్వానము పంపినాడు. పై జనవరిలోగాని ఫిబ్రవరిలో గాని అచ్చటికి పోవుద మని అనుకొనుచున్నాను. రావలసిన దని భట్టాచార్య వ్రాయుచున్నాడు. గొప్పకార్యక్షేత్ర మిచ్చట నున్నది. ఈవర్గమువారితో గాని ఆవర్గమువారితో గాని నా కేమి పని? నేను భగవత్కింకరుడను. ఉన్నతాశయముల నన్నిటిని ప్రచారముచేయుటకు ఇంతకంటె మేలైన క్షేత్రము ప్రపంచమున

మతెచ్చటనున్నది? ఒకడు నాకు ప్రతికూలుడుగ నిలిచెనేని నూఱుగురు నాకు తోడ్పడుటకు సిద్ధులై యుండు దేశ మిది. మానవునిపట్ల మానవునకు సానుభూతిగల దేశ మిది. మహిళలు దేవతలుగ గౌరవింపబడు దేశ మిది. అంతయు అనుకూలముగ పరిణమించుచున్నప్పుడు తమపొగడ్తలను వినుటకు మూర్ఖులుసైతము నిలబడవచ్చు. పిఱికిపందలు సైతము వీరులవైఖరిని వహింపవచ్చు. కాని నిజమైన వీరుడు మౌనముతో పాటుపడును. ఒక్క బుద్ధుడు తన్ను తెల్పుకొన గల్గుటకుముందు ఎందఱు బుద్ధులు అస్తమింతురు? నాయనా, నాకు దేవునియందును విశ్వాసముకలదు. మానవునియందును విశ్వాసము కలదు. దీనసంరక్షణమున నాకు ప్రత్యయము కలదు. నేను నరకమునకు పోయినైనను ఇతరులను కాపాడవలె నను అధ్యవసాయము నాకు కలదు. పాశ్చాత్యులనందువా? వారు, సనాతనక్రైస్తవులు సైతము, నాకు అన్నము పెట్టిరి. నీడ నిచ్చిరి. మైత్రి ప్రసాదించిరి. రక్షణ మొసగిరి. వారి మతబోధకు లెవరైన భారతదేశమునకు వచ్చినయెడల మన ప్రజ ఏమి చేయుదురు? మీరు వారిని ముట్టనైన ముట్టరు. వారు "మ్లేచ్ఛులు!" ఏమానవునకు గాని ఏదేశమునకు గాని ఇతరులను ద్వేషించినచో మనుగడ లేదు నాయనా! ఏనాడు భారతీయులు మ్లేచ్ఛశబ్దమును సృజించిరో ఇతరులతోడి కలయికను మానుకొనిరో, ఆనాడే భారతదేశవినాశము నిశ్చితమైనది. ఆఆశయమును పెరుగనిచ్చు విషయములో జాగ్రత్త! వేదాంతమును గుఱించి లొడలొడ ప్రసంగించుట మంచిదే, కాని అందలి చిన్నసూత్రమునైన అనుష్ఠించు టెంత కష్టము!

ఆశీస్సులతో. సదాభవదీయుడు

వివేకానంద

మఱిపలుకు: "అధికారకాంక్ష" "ఈర్ష్య" అను ఈ రెంటిని గుఱించి అప్రమత్తుడవై ఉండుము. ఆత్మవిశ్వాసమును అనవరతము అలవఱచుకో. వి.

## 129

(శ్రీమతి జార్జి డబల్యూ హేల్‌సతికి)

1125 సెయింట్ పాల్ స్ట్రీటు
బాల్టిమోరు,
అక్టోబరు, 1894.

అమ్మా,

నేనిపుడున్న చోటు నీకు తెలిసినది కదా. భారత దేశమునుండి వచ్చిన తంతివార్త చికాగో ట్రిబ్యూనులో వెలువడినదే, మాచితివా? కల్కత్తానుండి వచ్చిన అభినందనపత్రము దానిలో ప్రకటింపబడినదా? ఇచ్చటినుండి వాషింగ్టనుకు పోవుదును. అక్కడనుండి ఫిలడల్ఫియాకును అటనుండి న్యూయార్కునకును పోయెదను. ఫిలడల్ఫియాలో కుమారి మేరీ చిరునామాను వ్రాసి పంపుము. పంపినచో నూయార్కుకు పోవు దారిలో అటు తొంగి చూడ వచ్చు. నీమనోవ్యాకులము తీరిపోయినదనుకొందును.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 130

(కుమారి మేరీ హేలుకు)

శ్రీమతి ఇ. టాటనుసతియింట
1703 మొదటి వీధి, వాషింగ్టన్
నవంబరు 1 (?), 1894.

ప్రియసోదరీ,

నీవు దయతో శ్రమకోర్చి వ్రాసిన రెండుజాబులు అందినవి. నేడు ఇచ్చట ఉపన్యసింపబోవుచున్నాను. రేపు బాల్టిమో

రులో ప్రసంగింతును. సోమవారమునాడు మరల బాల్టిమోరు లోనే ఉపన్యసింతును. మంగళవారము నాడు మరల వాషింగ్టనులో నుపన్యసింతును. కావున తదనంతరము ఫిలడల్ఫియాలో కొన్ని దినము లుందును. వాషింగ్టనునుండి బయలుదేఱుదిన మును నీకు వ్రాసెదను. ప్రొఫెసరురైటును చూచుటకై ఫిలడల్ఫియాలో కొన్నిదినములు మాత్ర ముందును. అటనుండి న్యూయార్కుకు పోదును. న్యూయార్కునకును బోస్టనుకును నడుమ కొంత కాలము నేను పరుగులెత్తవలెను. తర్వాత డిట్రాయిట్టుమీదుగ చికాగోకు పోయెదను. అందుండి "నిశ్శబ్దముగా...." సెనేటరు పామరు చెప్పునట్లు ఇంగ్లండుకు.

ధర్మ మను శబ్దమున కర్థము మతధర్మము. కల్కత్తా వారు పెట్రోను చాల అవమానించినందులకు నేను మిగుల చింతించుచున్నాను. నా కిచ్చట మంచిగౌరవము కలిగినది. చాల హాయిగ నున్నాను. ఈమధ్యకాలమున భారతదేశమునుండి కట్టలు కట్టలుగా వచ్చుచున్న పత్రికలవలన నాకు విసుగు కలుగు చున్న దనుటకంటె వేఱు విశేషము లేదు. ఒకబండెడు పత్రికలను అమ్మచర్చికిని ఒకబండెడు పత్రికలను శ్రీమతి స్వెర్నేసకికిని పంపి "వీరిపత్రికల నిక పంపవల"దని మా వారికి వ్రాయవలసివచ్చెను. భారతదేశమున నన్నుగూర్చి వ్రాసిన ప్రశస్తి ఇక చాలును. భారతదేశమంతటను ప్రతిపల్లెవారును నన్ను గుఱించి వినియున్నా రని అలసింగ వ్రాయుచున్నాడు. మొదటనుండిన ప్రశాంతి, మరల కల్లని రీతిగా పటాపంచలైనది. ఇంతవఱకు నా కెందును విశ్రాంతి లేదు. ఈ భారతదేశపత్రికలు నాప్రాణము తీయుట నిశ్చయము. ఈ ఈ దినము ఈ ఈ వస్తువులను తినెను. ఈవిధముగ తుమ్మెను — అను వివరములను నన్ను గుఱించి అవి ఇప్పుడు ప్రసంగించుచుండును. దేవుడు వారి ననుగ్రహించుగాక. ఇ దంతయు నా అవివేకమే. గుట్టుగా కొంత పైకమును గడించి వెడలిపోవుద మని నే నిచ్చటికి వచ్చితిని.

ఇది నిజము. కాని ఇప్పుడు వలలో చిక్కుకొంటిని. ఏకాంత జీవితము లేనే లేదు.

మీకు సకలశుభములు కోరుచుండు,

సదా భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 131

(శ్రీహరిదాస విహారీదాస దేశాయిగారికి)

చికాగో
నవంబరు 15, 1894 (3?).

ప్రియదివాన్జీ సాహెబు,

దయతో మీరు వ్రాసిన జాబు చేరినది. ఇక్కడనైతము నన్ను జ్ఞప్తియం దుంచుకొని యుండుట మీ కరుణావిశేషము. మీనారాయణహేమచంద్రుడు నా కగపడలేదు. అతడు అమెరికాలో లే డనుకొందును. వింతదృశ్యములను గంభీరదృశ్యములను నేను పెక్కింటిని చూచితిని. మీరు యూరోపుకు వచ్చు అవకాశము ఎంతేని యున్నందుకు సంతోషము. ఎట్లైనను సరే ఆ అవకాశమును దక్కించుకొనుడు. ప్రపంచమందలి ఇతరదేశములతో ఎడసియుండుటే మన పతనమునకు కారణము. ఇందుకు ప్రతిక్రియ ఒక్కటే. మరలి, తక్కినప్రపంచప్రవాహముతో కలిసికొనుటే. కదలికయే ప్రాణలక్షణము. అమెరికా దొడ్డ దేశము. పేదలకును మహిళలకును ఇది స్వర్గమే. ఇచట పేదవారు ఇంచుమించు లేనట్లే. ఇక మహిళలకు ఇచటనున్నంత స్వేచ్ఛయు విద్యయు సంస్కారమును వేఱు ఏదేశమునను లేదు. సంఘములో సర్వప్రాధాన్యమును వారిదే. ఇది గొప్పపాఠము. సన్న్యాసి తనసన్న్యాసిత్వమును లవమేని కోల్పోలేదు. తనజీవిత

రీతినైనను పోగొట్టుకొనలేదు. ఆగంతుకుల నత్యంత మాదరించు ట్టి ఈదేశమున ప్రతిగృహద్వారము నాకు తెఱవబడియే యుం ంను. భారతదేశములో నాకు దారిచూపెడి దేవుడు ఇచట దారి రూపడా ? చూపియే యున్నాడు.

సన్న్యాసికి అమెరికావాస మెందుకో మీకర్థముకాక ోవచ్చు. కాని అది ఆవశ్యక మాయెను. లోకము మిమ్ము ుర్తింపెట్టుటకు మీకుండు యోగ్యత మీ ఆధ్యాత్మికపరత యొక్కటే. భారతదేశ మంతరింపలే దని ఇతరదేశములవారికి తెలుపుటకు మన ఆధ్యాత్మికపరులలో చక్కని ఆదర్శభూతులైన వారిని విదేశములకు పంపుట ఆవశ్యకము.

మీరు మోటువారు కా రని చూపుటకైనను భారత దేశమునుండి ప్రతినిధులు కొందఱువెలుపలికివచ్చి భువి నున్న సకలదేశములకు పోవలెను. భారతదేశమున ఇంట నున్నప్పుడు దీని అక్కఱ మీకు గోచరింపకపోవచ్చు. కాని మీదేశశ్రేయము చాలవఱకు దీనిపైనే ఆధారపడియున్నది. జగమునకు హితము చేయవలె నను ఆశయము లేని సన్న్యాసి సన్న్యాసి కాడు, పశువే.

నేను దృశ్యములను జూతమని తిరుగువాడను కాను. సోమరినై త్రిమ్మరువాడను కాను. కాని, గుర్తింప గల్గువఱకు మీ రుందు రేని తప్పక గుర్తింతురు. గుర్తించి, మీరు జీవించి యున్నంతకాలము నన్ను దీవించుచుందురు.

(శ్రీద్వివేదిగారివ్యాసములు విశ్వమతమహాసభలో చదు వుట కలవికానంత దీర్ఘములై యున్నందున వానిని సంక్షేపింప వలసివచ్చెను.

విశ్వమతమహాసభలో నేనుపన్యసించితిని. నా ఉపన్యాస ఫలితమును మీకు స్పష్టపఱచుటకై, చేత సిద్ధముగ నున్న కొన్ని వార్తాపత్రికలనుండియు ఇతరపత్రికలనుండియు ఉదాహరింతును.

నేను గర్వింప నక్కఱ లేదు గాని నాయందు మీకు గల ప్రేమ చేత ఈ క్రింది విషయమును విస్రంభమున మీకు తెలుపవలసిన బాధ్యత నా కున్నది — అమెరికాప్రజలచిత్తములలో ఇంతగా స్థానము గడించిన హిందువు లేడు. నా అమెరికాయాత్రలో వేఱు ప్రయోజన మేదియు లేకపోయినను ఈప్రయోజనమైనకల్గినది. నాగరకతలో అగ్రశ్రేణిలోనున్న దేశాలవారుసైతము ఎవరి పాదములొద్ద కూర్చుండి నైతికాధ్యాత్మికధర్మములను నేర్వ వచ్చునో అట్టి మహాపురుషులు భారతదేశమున ఇప్పుడును జన్మించుచున్నా రని అమెరికనులకు తెలిసినది. హిందూదేశము తనసన్న్యాసిని ఇచటికి పంపినందులకు ఇంతమాత్రము ప్రయోజనము మీరు చాల దనుకొందురా? వీరచంద్ గాంధీగారినుండి వివరముల నెఱుగగలరు.

ఈ క్రిందివి పత్రికలనుండి యుద్ధారములు :—"పెక్కు ఉపన్యాసములు సంక్షిప్తములుగను ధాటీమండితములుగను ఉన్నను విశ్వమతమహాసభహృదయమును దాని అవధులను హిందూసన్న్యాసి చెప్పినంతచక్కగ వే ఱెవ్వరును చెప్పలేదు. ఆయన ఉపన్యాసమును సమగ్రముగ ఈ క్రింద పొందుపఱచుచున్నాను. కాని శ్రోతలపైని దాని ప్రభావమును కేవలము సూచించుటమాత్రమే నాకు శక్యము. వక్తృత్వాధికారము అతనికి దైవదత్తము. గంభీరశబ్దాలంకారయుతములైన అతని వాక్కులు ఆస్థతో పలుకబడినవి. ఆసక్తిగొలుపుటలో ఆపలుకుల కంటె, చక్కని పచ్చ కావివన్నెల పరిచ్ఛదము తోడి అతనిధీర ప్రతిభోజ్జ్వలముఖారవిందము తీసిపోవునది కాదు. (ఇచట ఉపన్యాసము సంపూర్ణముగ ఉదాహరింపబడినది.) "న్యూయార్కు క్రిటిక్కు".

"తనమతము మా కవగత మగువఱకు అతడు సమితులందును చర్చిలందును ప్రబోధము చేసెను....అతని సంస్కృ

తియు అతని వాగ్ధాటియు అతని మోహనమూర్తియు హిందూ నాగరకతను గుఱించిన నూతనపరిజ్ఞానమును మాకు కలిగించినది. ...అతని ప్రతిభోజ్జ్వలసుందరముఖమును గంభీరమధురకంఠమును ఎవనికైనను సరే మున్ముందుగనే అతనిపట్ల పక్షపాతము కలిగించును....జ్ఞాపిక లేవియు వ్రాసిపెట్టుకొనకే అత డుపన్యసించును. అత్యంతకళాకౌశలముతో, నచ్చజేయు ఆత్యంతికమైన ఆస్థతో ఆయన విషయములను తనసిద్ధాంతములను పొందుపఱుచును. వాగ్ధాటి తఱచు సమృద్ధోత్సాహప్రదమగు స్థాయి కెక్కుచుండును. (అదేపత్రికలో).

"విశ్వమతమహాసభలో వివేకానందు డగ్రగణ్యు డనుట నిస్సంశయము. అతనిప్రవచనములను విినిన వెనుక అట్టి విద్వజ్జన నిలయమగు భారతదేశమునకు మనక్రైస్తమతబోధకులను బంపు టెంతటి అవివేకమో గ్రహించితిని"—హెరాల్డు (ఈ దేశమున చాలగొప్పపత్రిక).

నన్ను గర్వి యని మీ రనుకొందు రేమో అని వెఱచి ఉదాహరించుటను ఇంతతో విరమించుచున్నాను. కాని ఇంచు మించు కూపస్థమండూకములై వెలుపలిప్రపంచ మెట్లు పురోగమించుచున్నదో గుర్తింపని మీకు ఇంతమాత్రము వ్రాయుట ఆవశ్యక మాయెను. మీరు అను నా మాటకు స్థూలముగా మన దేశము అని అర్థమే గాని, నా ఉదారసఖా, మీరు కారు.

భారతదేశమున నే నెట్టివాడనో ఇచ్చటను అట్టివాడనే. కాని ఉన్నతసంస్కృత సంపన్నమగు ఈ దేశమున గుణగ్రహణ మున్నది. మన అజ్ఞమూర్ఖులకు కలలోనైన లేని సానుభూతి యున్నది. అచ్చట సన్న్యాసులమైన మాకు పట్టెడన్నము పెట్టుటకు ఇష్టపడరు. ఇచ్చటి ప్రజలు ఒక్కొక్క ఉపన్యాసమునకు వేయేసి రూపాయ లిచ్చుటకు సంసిద్ధులైయుందురే గాక కావించిన బోధనలకు కలకాలము కృతజ్ఞులై యుందురు.

భారతదేశమున ఎప్పుడు గాని నాకు కలిగిన ప్రశంసకంటె హెచ్చుప్రశంస నాకు ఈక్రొత్తవారియొద్ద కలిగినది. నాకిష్ట మున్నచో జీవితకాలమంతయు అత్యంతభోగములతో ఇచ్చట గడపగలను. కాని నేను సన్న్యాసిని. "ఓ భారతభూమీ, నీలో దోసగు లున్నప్పటికి నాప్రేమ నీపైనే" కావున కొన్నినెలలకు పిమ్మట నేను మరలి వచ్చుచున్నాను. ఇంతకాలమును చేయు చున్నట్లే ఇకమీదను ప్రతినగరమందును అందలి ప్రజలకు గుణ గ్రహణమును కృతజ్ఞతయు లేకున్నప్పటికిని—ఆస్తిక్యబీజములను అభ్యుదయబీజములను చల్లుచుపోవుదును.

మనదేశీయుల యాచకత్వమును స్వార్థపరతను గుణ గ్రహణవిముఖతను అజ్ఞానమును కృతఘ్నతను అమెరికాదేశీ యులు అన్యమత ప్రతినిధినగు నాపట్ల జూపిన ఉపకారపరతతో అతిథిభక్తితో సానుభూతితో ఆదరముతో పోల్చిచూచు కొన్నప్పుడు నాస్వదేశము నా కవమానకరమై యున్నది. కావున దేశమునుండి వెలికి రండి. ఇతరులను చూడుడు. పోల్చు కొనుడు.

ఈపత్రికోద్గారములను చిత్తగించిన పిమ్మట మీరు సన్న్యాసిని అమెరికాకు పంపుట సార్థకమే అని తలంతురా?

దయచేసి దీనిని ప్రకటింప వలదు. హిందూదేశములో వలెనె ఇచ్చటను నాకు పేరుప్రశస్తులు అసహ్యములు.

నేను చేయుచున్నది దేవునిపని. ఆయన పిలుచుకొని పోవుచోట్లకెల్ల నేను పోవుచుందును. "మూకం కరోతివాచాలం" ఇత్యాది —మూగవానిని వాచాలునిగను కుంటి వానిని కొండను దాటువానినిగను చేయు భగవంతుడే నాకు తోడగును. మాన వులతోడ్పాటును నేను లక్ష్యపెట్టను. ఉచితమని యెంచునేని ఆసర్వేశ్వరుడు భారతదేశములోను అమెరికాలోను ఉత్తర ధ్రువమునందును నాకు తోడ్పడుటకు సిద్ధుడైయుండును. ఆయన

తోడ్పడకున్న వేఱెవ్వరును తోడ్పడసమర్థులు లేరు. సదా సర్వకాలము జగదీశునకు జయము.

ఆశీస్సులతో,

భవదీయ
వివేకానంద

## 132

(రాజా ప్యారీమోహన ముఖర్జీకి)

న్యూయార్కు
నవంబరు 18, 1894.

ప్రియమహాశయా,

ఇటీవల కల్కత్తాటౌనుహాలుసమావేశములో కావింపబడిన తీర్మానములును స్వనగరపౌరులు పంపిన ప్రశంసావాక్కులును నాకు అందినవి.

మహాశయా, నా అల్పసేవను మీరభినందించినందులకు నా అత్యంతహృదయపూర్వకమైన కృతజ్ఞతను స్వీకరింపుడు.

మానవుడుగాని దేశముగాని ఇతరమానవులతో ఇతరదేశములతో కలియక వేఱుగనుండినచో జీవింప శక్యముకా దనియు అహంకారముచేతనో పవిత్రతచేతనో అదొక పద్ధతి అనుతలంపుతోనో—అట్టి మిథ్యాభావములతో కేటాయింపుగ నుండ ప్రయత్నించినప్పుడెల్ల ప్రయత్నించినవారికి హాని కలిగెననియు నాగట్టి నమ్మకము.

భారతదేశపుటధోగతికిని పతనమునకును ఏకైకకారణము సంఘాచారభిత్తికను నిర్మించుకొనుటే అని నా యభిప్రాయము. ఇతరులయెడ ద్వేషమే ఆగోడకు పునాది. దేశమునకు చుట్టును

కట్టబడిన దా గోడ. చుట్టునున్న బౌద్ధదేశాలవారితో హిందువులను కలియనీయకుండవలె నను సంకల్పముచేతనే ప్రాచీనకాలమున ఆగోడ నిర్మింపబడినది.

ఒరులను ద్వేషించినవారికి అధఃపతనము తప్పదు. ఇది నైతికధర్మము. ప్రాచీనజాతులలో అగ్రగణ్యముగనుండిన జాతి ఇప్పుడు నానుడికి లక్ష్యమై అన్యదేశములచే ఏవగించుకొనబడుచున్నది. ప్రాచీన కుతార్కికులుగాని నవీన కుతార్కికులుగాని దీనికి ఏవేషమునైన ధరింపజేయుదురు గాక. ఇది తప్పని ఫలితము.

ఆధర్మమును కనుగొన్నవారు మనపూర్వులు. దానిని వివేచించినవారు మనపూర్వులు. దానిని ఉల్లంఘించినప్పుడు కలుగు దుష్ఫలితమునకు ఉదాహరణభూతులము మనమే.

ఇచ్చిపుచ్చుకొనుట ధర్మము. భారతదేశము మరల తానభివృద్ధి గాంచగోరునేని మఱుగున నున్న తన సంపదలను వెలికి తేవలెను. భువినున్న సకలదేశములవారికిని వానిని వెదజల్లవలెను. వానికి బదులుగ ఆదేశాలవారు ఏ మిత్తుగో దానిని స్వీకరింపవలెను. ఈయిచ్చిపుచ్చుకొనుటలు అనివార్యములైన ఆవశ్యకములు. వికాసమే జీవితము. సంకోచమే మరణము. ప్రేమయే జీవితము. ద్వేషమే మరణము. ఏనాడు అన్యజాతులవారిని మనము ద్వేషింప నారంభించితిమో ఆనాడు మనము మరణింప నారంభించినవారమే. మనము మరల వికాసము నొందవలెను. వికాసమే జీవితము. అది లేకున్న మన మరణమును ఏదియు అడ్డగింప జాలదు.

కావున భువిపై నుండు సకలజాతులవారితోను మనము కలియవలెను. గ్రుడ్డినమ్మకాలపుట్టలై స్వార్థపరులై కుడితితొట్టియొద్ద నున్న కక్కలక్ష్యమువంటి లక్ష్య మొక్కటే జీవితాదర్శముగ కల నూర్లకొలది మానవులకంటె విదేశములలో పర్యటింప

నేగెడు ప్రతిహిందువును తనదేశమునకు ఎక్కువ మేలును చేకూర్చుచున్నాడు. పాశ్చాత్యదేశాలవారు లేపిన మహాద్భుత దేశీయజీవితనిర్మాణములకు సుదృఢ స్తంభములు వారి శీలమే — అట్టి శీలవంతులను మన ముప్పతిల్ల చేయగల్గువఱకు వీరిమీాదను వారిమీాదను మండిపడుట వ్యర్థము.

ఇతరులకు స్వాతంత్ర్య మిచ్చుటకు సంసిద్ధుడు కానట్టి ఎవని కైనను సరే స్వాతంత్ర్యమున కర్హత యున్నదా? వ్యర్థకలహము లలో మనశక్తిని చెదరగొట్టుకొనుటకంటె ప్రశాంతముగను ధీరము గను కార్యనిర్వహణమునకు పూనుకొందముగాక. నిజముగ ఎవనికి దేనిని పొందుట కర్హత కలదో అతనిని దానిని పొందనీయక అడ్డు టకు సమర్థులు విశ్వమున లేనే లేరు. ఈదృఢవిశ్వాసము కల వారిలో నే నొకడను. మనప్రాచీనచరిత్ర గొప్పదే, సందేహము లేదు. కాని మనభవిష్యచ్చరిత్ర మఱింత గొప్పదిగ నుండు నని నాయథార్థవిశ్వాసము. పవిత్రతలో శాంతిలో దీక్షలో శంకరుడు మనల అప్రకంప్యులుగ నొనర్చు గాక.

భవదీయశ్రద్ధాయుత
వివేకానంద

## 133

(మదరాసు శిష్యులకు, శ్రీ అళసింగపెరుమాళుద్వారా)

న్యూయార్కు
నవంబరు 19, 1894.

నాధీరవత్సలారా,

సంస్థను పురోగమింపజేయుడు...ప్రేమ ఆర్జవము శాంతి— ఇవి తప్ప వేఱేదియు నక్కఱ లేదు. జీవిత మనగా అభివృద్ధియే, వికాసమే, ప్రేమయే—కాక మఱేమి. కావున సకలవిధప్రేమయే

జీవితము. అదొక్కటే జీవితధర్మము. అన్ని విధములైన స్వార్థపరతయును మరణమే. ఇది ఇప్పుడును సత్యమే, ఇక మీదను సత్యమే. ఇతరులకు మేలుచేయుటే జీవితము; మేలు చేయకుండుటే మరణము. మీరు చూచు నరపశువులలో నూటికి తొంబదిమంది చచ్చినవారే, పిశాచములే. ఏలయన నా వత్సలారా, ప్రేమగలవాడే బ్రతికియున్నవాడు. నా వత్స లారా, సానుభూతి కలిగియుండుడు, సానుభూతి కలిగియుండుడు. పేదలపట్ల అజ్ఞులపట్ల అధఃపతితులపట్ల అనుక్రోశము కల్గి యుండుడు. ఎంతటిఅనుక్రోశ మనగా మీ గుండె ఆగిపోవలెను. తల తిరుగ వలెను. వెఱ్ఱెత్తు నని మీకు తోపవలెను. తర్వాత మీహృదయపరీవాహమును భగవంతునిచరణములవంకకు కురి యింపుడు. అప్పుడు శక్తియు సహాయమును అజేయమైన బలమును కలుగును. పాటుపడుడు, పాటుపడుడు—కడచిన పదేండ్లుగా ఇదే నామంత్రము. పాటుపడు డని యిప్పుడును చెప్పుచున్నాను. అంతయు అంధకారమయముగ నున్నప్పుడు పాటుపడుడు అని చెప్పుచుండెడివాడను. వెలుతురులోనికి వచ్చుచున్నప్పుడుకూడ పాటుపడు డనియే చెప్పుచున్నాను. నా బిడ్డలారా, భయపడకుడు. నక్షత్రనిబిడమగు అనంతాకాశమనెడి పైకప్పు మిమ్ము చిదిమి వేయునేమో అని భయపడుచు పైకిచూడకుడు. వేచియుండుడు. కొన్నిగంటలలో ఆ దంతయు మీపాదములక్రింద చేరుకొనును. వేచియుండుడు, ధనము వ్యర్థము, పేరు వ్యర్థము, కీర్తి వ్యర్థము, పాండిత్యమును వ్యర్థమే. ప్రేమయే సాధకము. చిక్కులనెడి వజ్ర భిత్తికలగుండ దారిచేసికొని పోగలిగినది శీలమే.

మన కిప్పుడు స్పష్టముగ తెలియుచున్న విషయ మిది. స్వాతంత్ర్యము లేనిదే ఎట్టి అభివృద్ధియు నుండ జాలదు. మన పూర్వులు మతమునకు స్వాతంత్ర్య మిచ్చిరి. తత్ఫలితముగ మనకు మహాద్భుతమతధర్మము దక్కినది. వారే సంఘచరణము లకు బరువైన సంకెలలను తగిలించిరి. తత్ఫలితముగ మన

సంఘము భయంకరమును క్రూరమును ఐనది. పాశ్చాత్యదేశము లలో సంఘస్వాతంత్ర్యము సదా ఉండెను. వారిని చూడుడు. ఇక వారి మతమును చూడుడు.

అభివృద్ధిసాధకములలో ప్రథమగణ్యము స్వాతంత్ర్యమే. మానవునకు ఆలోచించుటకును మాటాడుటకును స్వాతంత్ర్యము తప్పక ఉండవలెను కదా. అట్లే భోజనము, దుస్తులు, పెండ్లి మున్నగు ప్రతివిషయములోను అతనికి స్వాతంత్ర్యము ఉండ వలెను, ఇతరుల నతడు బాధింపకుండు నంత వఱకు.

ఐహికపరమైన నాగరకతను నిందించుచు మనము తెలివి తక్కువగ మాటాడుచుందుము. ద్రాక్షపండ్లు పులుపు. ఆవెఱ్ఱి తలంపంతయు నిజమే, అని అనుకొందముగాక. భారతదేశమున కంతటికిని మహిళలును మగవారును కలిసి మొత్తమొక లక్ష మంది నిక్కముగ ఆధ్యాత్మికపరు లున్నారు. వీరి ఆధ్యాత్మిక సిద్ధికై ముప్పదికోట్లమంది ప్రజలు మృగప్రాయులై పస్తు చావవలసినదేనా? ఎవరైన నేల పస్తుండ వలెను? హిందువు లను జయించుట మహమ్మదీయుల కెట్లు శక్యమైనది? ఐహిక నాగరకత అన నేమో హిందువులకు తెలియనందున శక్యమైనది. గుడ్డలను దర్జీవానిచే కుట్టించుకొని ధరించుపద్ధతిని వారికి మహమ్మ దీయులు సైతము నేర్పిరి. అన్నములో వీధిమట్టి కలియకుండునట్లు శుచిగా నీటుగా భుజించు పద్ధతిని గూడ హిందువులు మహమ్మ దీయులయొద్ద నేర్చుకొనియుందురా! పేదలకు వృత్తిని కల్పించు టకు ఐహికనాగరకతయే గాక భోగములు సైతము ఆవశ్యక ములే. అన్నము! అన్నము! ఇచ్చట నాకు అన్నముపెట్ట లేని దేవుడు స్వర్గమున నిత్యానందము నిచ్చునన్నచో నేను నమ్మను. ఛీ! భారతదేశమును ఉద్ధరింప వలెను. పేదల కన్నము పెట్టవలెను. విద్యను వ్యాపింపజేయ వలెను. మతాచార్యకైతవమును తొలగింపవలెను. మతాచార్య

కైతవ ముండ రాదు. సాంఘికనిరంకుశపాలన ముండ రాదు. ఒక్కొక్కనికిని ఎక్కువ అన్నము ఎక్కువ అవకాశములు కావలెను. ఇంగ్లీషువారియొద్దనుండి ఎక్కువ అధికారమును సంపాదించుకొనుటకై అవివేకులైన మనయువకులు సమావేశములు జరుపుచుందురు. వారు నవ్విపోవుదురు. స్వాతంత్ర్య మిచ్చుటకు సంసిద్ధత లేని వానికి స్వాతంత్ర్య మనుభవించుటకు అర్హత లేదు. ఇంగ్లీషువారు సమస్తాధికారమును మీ కిత్తు రని అనుకొందము. ఆ అధికారములను చేజిక్కించుకొన్నవారు ఇతర ప్రజలకు వానిని దక్కనీయరు, వారి నణచిపెట్టెదరు. ఇతరులను బానిసలనుగా చేయుటకు అధికారము కోరువారు బానిసలే.

ఇప్పుడు మనమతధర్మముపై ఊనికనుంచి సంఘమునకు స్వేచ్ఛనిచ్చి దీనిని మెల్లగా అమలుకు తేవలెను. ప్రాతమతము నుండి మతాచార్యకైతవమును నిర్మూలింపుడు. అప్పుడు ప్రపంచమున కంతటికిని విశిష్టమతము సిద్ధించును. నేను చెప్పినది తెలిసినదా? భారతదేశపు ఆధ్యాత్మికపరతతోకూడిన యూరోపియను సంఘమువంటి సంఘమును మీరు ఏర్పఱుపగలరా? అది శక్యమే అనియు శక్యముకాక తప్ప దనియు నా నమ్మకము....మన గొప్పపన్నాగము: మధ్యభారతమున ఒక వలసను ప్రారంభింపవలెను. అచట స్వతంత్రముగ మీరు మీ ఆశయములను అనుసరించుటకు వీ లుండ వలెను. పులియబెట్టినకడుగునీ రించుక యుండిన అంతయును పులిసిపోవును. మధ్యకాలమున ఒక కేంద్ర సంఘమును ఏర్పఱుపుడు. అందుండి శాఖలు భారతదేశమంతటను అల్లుకొనిపోవుచుండవలెను. ఆధ్యాత్మికాధారములతో మాత్రమే ప్రస్తుత మారంభింపుడు. తీవ్రమైన సంఘసంస్కారమును ఇప్పుడు బోధింపకుడు, మూర్ఖమూఢవిశ్వాసములను ఆమోదింపకుడు; ప్రాచీనమహాపురుషులైన శంకర రామానుజ చైతన్య ప్రభృతులు విధించినట్లుగా సర్వము క్త్రీపునాదులపై సంఘమును మరల సంజీవనము చేయ ప్రయత్నింపుడు.

ఉత్సాహము కలిగియుండుడు. ఎల్లెడల వ్యాపింపుడు. పాటుపడుడు, పాటుపడుడు, మొనగాండ్రుగ నున్నప్పుడు సైతము సేవకులుగనే యుండుడు, స్వార్థరహితులుగ నుండుడు. చాటున నితరులపై కొండెములు చెప్పు మిత్రులమాటను ఎప్పుడును వినకుడు. అనంతమైన ఓరిమి కలిగియుండుడు. గెలుపు మీదే యగును....ఈవిషయమున మెలకువ కలిగియుండుడు: అమెరికా సంయుక్తరాష్ట్రవాసులు చెప్పునట్లు ఒరులపై అధికారము చూప ప్రయత్నింపకుడు. నాజాబులను నేను సదా మీకు వ్రాయుచుం డుటచే నాతక్కినమిత్రులకంటె మీరు ముఖ్యులని చూపుకొన ప్రయత్నింప నక్కఱలేదు. నీవట్టి అవివేకివిగ ఎప్పుడు నుండ వని నే నెఱుగుదును. ఐనను నిన్ను హెచ్చరించుట నావిధి యని నా అభిప్రాయము. సకలసంస్థలను కూలార్చున దిదే. పాటుపడుడు, పాటుపడుడు. ఏలయన జగద్ధితమునకై పాటుపడుటయే జీవితము.

వంచన యుండ కూడదు. మోస ముండ కూడదు. కృత్రిమ ముండ కూడదు — ఇదే నాకోరిక. నేను సదా దేవుని పైనే, పట్టపగలింటి వెలుగునుపోలిన సత్యముపైనే ఆధారపడి యుంటిని. పేరుపొందుటకు గాని కీర్తిగడించుటకు గాని లోక హితముచేయుటకే గాని కృత్రిమములు చేసి కళంకితచిత్తముతో మరణించుస్థితి నాకు కల్గకుండుగాక. అవినీతి ఇంచుకైన నుండ రాదు. నడవడిలో కళంకము ఉండనే కూడదు.

తడబా టుండ కూడదు. తెఱమఱుగు పోకిరితనము లుండ గూడదు. రహస్యవంచన లుండ కూడదు. దేనినిగాని మాటు మూలలలో చేయరాదు. గురుదేవునకు మనపై పక్షపాతములేదు. అంతకు వచ్చిన, గురుదేవుడే వలదు. నాధీరబాలులారా, ముందుకు పదండి. ధన ముండనీ లేకపోనీ! మనుష్యు లుండనీ లేకపోనీ! మీకు ప్రేమయున్నదా; మీకు దేవు డున్నాడా?

పదండి ముందుకు — విచ్ఛిన్నదుర్గముమీదికి, మి మ్మెదిరింప ఎవ్వరికిని శక్యము కాదు.

ఎంతటి బొంకు! నావిజయమునకు తాము దారిచూపితి మని దివ్యజ్ఞానసమాజమువారి పత్రికలు చెప్పుట! నిజమే! అప్పటమైన నిరర్థకప్రసంగము. దివ్యజ్ఞానసమాజమువారు దారి చేసిరి!!......

జాగ్రత్త! జాగ్రత్త! ఏ దేది అసత్యమో అందుంగూర్చి మెలకువగల్గియుండుడు. నిజమునే అంటిపట్టుకొనుడు. మనము గెల్తుము. నిదానముగ నైనను తప్పక గెల్తుము. నేను లేననుకొని పని సాగింపుడు. పని అంతయు మీలో ఒక్కొక్కనిమీదను ఆధారపడియున్న దనుకొని పనిని సాగింపుడు. ఏబదిశతాబ్దుల కాలము మీపై కనుపెట్టి యున్నది. భారతదేశభవిష్యత్తు మీపై ఆధారపడియున్నది. పనిని సాగించుచుండుడు. నేను వచ్చుటకు ఎప్పుడు వీ లగునో నాకు తెలియదు. కృషిచేయుటకు ఇ దొక గొప్ప క్షేత్రము. భారతీయులకు ప్రశంసించుట మాత్రమే చేత నవును. ఎందుకుగాని వా రొక్క కాసైన నీయరు. మధ్యాహ్న దరిద్రులైన వారికి కాసు లెక్కడివి? అంతే కాదు. లోకమునకు మేలు చేయు శక్తిని వారు కోల్పోయి రెండు శతాబ్దములో ఇంక నెక్కడుకాలమో గడచిపోయినది. దేశము, ప్రజ — అను ఆశయములను వా రిప్పు డిప్పుడే తెలిసికొనుచున్నారు. కాబట్టి నేను వారిని తప్పుపట్ట నక్కఱ లేదు. ఇంతకంటె విశేషములను పిమ్మట వ్రాసెదను.

ఆశీస్సులతో,

మీ
వివేకానంద

## 134

(శ్రీ అళసింగపెరుమాళుకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు
నవంబరు 30, 1894.

ప్రియఅళసింగా,

ఫోనోగ్రాఫు పెట్టియు జాబును భద్రముగ నీకు చేరినవని తెలిసి సంతోషించితిని. పత్రికాభాగములను ఇక నీవు పంప నక్కఱ లేదు. నన్ను ముంచివేయునంతగా అవి చేరియున్నవి. ఇక చాలును. ఇప్పుడు సంఘస్థాపన కార్యమునకు పో. న్యూయార్కులో నే నిప్పటికే ఒకసంఘమును స్థాపించి యున్నాను. ఉపాధ్యక్షుడు త్వరలోనే నీకు వ్రాయును. అతనితో జాబులు జవాబులు సాగించుచుండుము. తక్కినచోట్లలో కొన్ని సంఘములను త్వరలోనే ఏర్పఱుప గల నని నాఆశ. మనము మనశక్తులను కలిపి పొందిక ఏర్పఱుపవలెను. ఒక కక్షను ఏర్పఱచుటకు కాదు. మతధర్మసంబంధమైన విషయములలో కాదు. దాని లౌకికవ్యవహారాంశములో మాత్రమే. ఉద్ఘాతలూపుప్రచారమును చేయవలెను. మీరు కలిసి ఆలోచించి ప్రణాళికను ఏర్పఱచుకొనుడు.

శ్రీరామకృష్ణుని అద్భుతమునుగూర్చి ఇదేమి అర్థరహిత ప్రసంగము!...అద్భుతలీలలు నా కర్థము కావు, నే నెఱుగను. మధువును మందుగ చేయుట తప్ప శ్రీరామకృష్ణున కీ ప్రపంచమున వేఱు పని లేదా? అట్టి కల్కత్తాప్రజలబారినుండి దేవుడు నన్ను కాపాడును గాక! పనిచేయుటకు ఏమిసామగ్రి! శ్రీరామకృష్ణుడు ఏమిచేయుటకు ఏమిబోధించుటకు అవతరించనో చూపగోరి నిజమైన ఆయనచరిత్రమును వారు వ్రాయగల్గినచో వ్రాయనీ, లేకున్న ఆయన జీవితములను సుభాషితములను తాఱుమాఱు చేయకుందురుగాక. శ్రీరామకృష్ణునందు గారడీవిద్య తప్ప వేఱు

దేనినిగాని గుర్తింపని వీరు దేవునిగూర్చి తెలిసికొనగోరు చున్నారు!...కిడి ఇప్పుడు అతని ప్రేమ జ్ఞానము బోధనలు సర్వ మతసారసంగ్రహణము—మున్నగువానిని అనువదించును గాక. ఇదే విషయము. శ్రీరామకృష్ణుని జీవితము ఒక అసాధారణ జ్యోతి. దాని వెలుగున హిందూసిద్ధాంతసర్వస్వమును నిజముగ నర్థము చేసికొనుటకు శక్య మగును. శాస్త్రములు ప్రతిపాదించు సిద్ధాంతజ్ఞానమున కంతటికిని దృష్టాంతమూర్తి ఆయనే. ఋషులును అవతారమూర్తులును నిజముగ దేనిని బోధింపగోరిరో దానిని ఆయన తన జీవితమున ప్రదర్శించెను. గ్రంథములు సిద్ధాంతములు. ఆసిద్ధాంతములకుసిద్ధి ఆయనలోనే. మన దేశపు అయిదు వేలేండ్ల ఆధ్యాత్మికజీవితమును ఆయన ఏబదొక్క సంవత్సరములలో జీవించెను. భావితరములవారికి పరమాదర్శము కాదగిన స్థాయికి ఆయన తన్ను అధిరోహింప జేసికొనెను. వేదములను వ్యాఖ్యానించుటకును శాస్త్రములకు సామరస్యముకూర్చుటకును ఆయన బోధించిన అవస్థాసిద్ధాంతమే సాధకము. మనము ఇతరులను మననిచ్చుటె గాదు, వారిని కౌగిలించుకొనవలె ననియు, సత్యమే అన్నిమతములకు ఆధార మనియు, ఆసిద్ధాంతము తెలుపుచున్నది. ఈ పద్ధతిలో ఎల్లర డెందములలో బాగుగా హత్తుకొనునట్టియు మనోహరమైనట్టియు జీవితచరిత్రము వ్రాయవచ్చు. సరి, ప్రతిదియు తన కనుకూలమైన కాలమున ఘటిల్లును. స్త్రీ పురుషులనుగూర్చి అక్రమాశ్లీలవాక్యములను రానియకుము...ఏల యన అట్టివానిని చెప్పుట అసభ్యతాపరాకాష్ఠ యని అన్యదేశముల వారు తలంతురు. ఆంగ్లమున ఆయనజీవితచరిత్రమును విశ్వమందలి సకలప్రజలును చదువ నున్నారు. బెంగాలీభాషలో వ్రాయబడియుండు ఆయనజీవితచరిత్ర మొకటి ఇచటికి పంపబడినది, నేను చదివితిని. అం దట్టి అశ్లీలవాక్కులు నిండుగా నున్నవి...కావున జాగ్రత్త. అట్టి మాటలను మెలకువతో పరిహరింపుము. కలకత్తామిత్రులకు కాసంతైనసామర్థ్యములేదు, కాని

వారు తమప్రత్యేకతలను బల్లగ్రుద్ది చెప్పుకొనుచుందురు. హిత వాక్యమును చెవిని వేసికొననంతగా మిడిసిపడువారు వారు. ఈ యద్భుతమహాజనులతో ఏమి చేయుటో నాకు బోధపడుట లేదు. ఆప్రాంతమున నాకు ఆసపాటు అంతగా లేదు. ఈశ్వరసంకల్పము నెఱవేఱును. ఆబెంగాలీగ్రంథము నాకు కేవల మవమానకరముగ నున్నది. పరమహంస పల్కిన మాటలను పల్కినట్లే తాను వ్రాయుచున్నట్లును తాను నిజమునే వ్రాసిపెట్టువాడైనట్లును ఆ రచయిత తలంచెను కాబోలు. కాని స్త్రీలయెదుట రామకృష్ణుడు అట్టిమాటలను ఎప్పుడును వాడ డనెడి జ్ఞప్తి ఆ రచయితకు లేదు. మగవారును మహిళలును ఏకరీతిని తన గ్రంథమును చదువుదు రని ఇతని ప్రతీక్షణము! మూర్ఖులబారినుండి దేవుడు నన్ను కాపాడును గాక. పైగా వారిచాపల్యములు వారి కున్నవి. వారందఱు ఆయన నెఱుగుదు రట! వట్టికసుమాలపు ప్రసంగము! ...బిచ్చగాండ్రు దొరలను అనుకరించుట! మూర్ఖులు తామందఱును మతిమంతులమనుకొనుట! క్షుద్రులైనబానిసలు తాము ప్రభువుల మని అనుకొనుట! అది వారి దశ. ఏమి చేయవలెనో నే నెఱుగను. దేవుడు నన్ను కాపాడును గాక. నాకు గల ఆసపాటంతయు మదరాసుపైనే. మీపనిని ముందుకు సాగింపుడు. కల్కత్తావారిపై నాధారపడకుడు. వారిలో నొక్కడైనను బాగుపడునుగాతమనెడి ఆశతో వారి సంతోషమును చెడగొట్టకుండుడు. కాని మీపనిని స్వతంత్రముగ సాగించుచుండుడు. "వండినపిమ్మట భుజించుటకు పెక్కండ్రు వచ్చి కూర్చుందురు". మెలకువ వహింపుడు. పనిని సాగింపుడు.

ఆశీస్సులతో,

భవదీయ

వివేకానంద

## 135

(శ్రీసింగారవేలు మొదలియారుకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు
నవంబరు 30, 1894.

ప్రియకిడి,

...శ్రీరామకృష్ణునిగూర్చి అద్భుతకథలు ప్రకటింపబడి యున్నవి కదా. వానినుండియు వానినివ్రాసినవారినుండియు దూరముగ తొలగియుండుమని నీకు నా సలహా. అవి నిజములే, కాని మూర్ఖులు సమస్తమును తాఱుమాఱు చేయుదురని నానమ్మకము. బోధించుటకు బ్రహ్మాండమంతటి జ్ఞాన మాయనయొద్ద నుండగా అనావశ్యకములైన విషయములపై ఊనిక నుంచుట ఎందులకు? నిజమునకు అద్భుతలీలలు అనావశ్యకములే. అవి దేనినిగాని నిరూపింపవు. జడపదార్థము ఆత్మను నిరూపింపదు. లీల నెఱపుటకును దేవుని అస్తిత్వమునకును ఆత్మకును అమృతత్వమునకును ఏమి సంబంధము?...శ్రీరామకృష్ణుని బోధింపుడు. దేనితో మీదప్పిని తీర్చుకొంటిరో దానినే అందింపుడు....భక్తిని బోధింపుడు. వెట్టి వేదాంతముతో మీబుఱ్ఱను కలవరపెట్టుకొనకుడు. మీస్వమత దురభిమానముచే ఒరులను చీకాకుపఱుపకుడు...

సదా ఆశీస్సులతో,

భవదీయ
వివేకానంద

## 136

(డాక్టరు నంజుండరావుకు)

అమెరికా సంయుక్తరాష్ట్రములు
నవంబరు 30, 1894.

ప్రియప్రేమాస్పద,

నీ చక్కని జాబు నాకిప్పుడే అందినది. శ్రీరామకృష్ణుని నీ వర్థముచేసికొనగలిగినందులకు నాకు చాల సంతోషము. నీ

వైరాగ్యదార్ఢ్యమునకు నే నెంతో ఆనందించితిని. దేవుని చేరు కొనుటకు ముఖ్యావసరము వైరాగ్య మొక్కటే. నా అధికాసలు సదా మదరాసుపైనే ఉండెడివి. భారతదేశమును ముంచివేయు నట్టి ఆధ్యాత్మికతా ప్రళయతరంగము మదరాసునుండి వచ్చు ననియే ఇప్పటికిని నాదృఢవిశ్వాసము. నీసదుద్దేశములకు దేవుడు తోడ్పడుత అనుటే నే చెప్పగలది. కాని నాయనా, ఇందు చిక్కు లున్నవి. మొదటివిషయము : ఎవడుగాని తొందరపడకూడదు. రెండవవిషయము : నీతల్లిమనసును పత్నిమనసును నీ వించుక ఆదరింపవలెను. రామకృష్ణుని శిష్యులమైన మేము మాతల్లి దండ్రుల అభిప్రాయములను ఎల్లప్పుడును ఎక్కువ గౌరవించిన వారము కా మని నీ వనవచ్చు. నిజమే. అత్యధికత్యాగముచేతనే ఘనకార్యములు సిద్ధించు నని, తప్ప వని—నే నెఱుగుదును. తన సుతులలో మహోన్నతులును వరిష్ఠులును ఐనవారి త్యాగమును భారతమాత కాంక్షించుచున్న దని నిజముగ నే నెఱుగుదును. అట్టివారిలో ఒక్కడవు కాదగిన భాగ్యము నీ కున్న దని హృదయపూర్వకమైన నా నమ్మకము.

మహాత్ములు మహాత్యాగములు చేయుదురు. తత్ఫలిత మును మానవజాతి అంతయు అనుభవించును. ఇది ప్రపంచ చరిత్రమం దంతటను మీకు కననగుచుండు విషయము. సమస్త మును త్యజింపవలె ననెడి నీ యభిలాష నీమోక్షముకొఱకే యగుచో, అది గణనీయము కాదు. లోకక్షేమమునకై నీమోక్ష మునుసైతము వదలుకొనగోరుదువేని, అప్పుడు నీవు దేవుడవే. ఆవిషయ మాలోచింపుము. బ్రహ్మచారివిగ నుండుము. అనగా ఇంద్రియసుఖానుభవముల నన్నిటిని విడిచిపెట్టి కొంతకాలము నీతండ్రిగారింటనే ఉండుము. అదేనిను నాసలహా. ఇది "కుటిచక" దశ. లోకకల్యాణమునకై నీవు చేయబూనిన మహాత్యాగమునకు నీపత్ని ననుమతించునట్లు చేయ ప్రయత్నింపుము. నీలో జాజ్వల్య మానవిశ్వాసమును అన్నిటినిగెల్వగల ప్రేమయు సర్వశక్తిసమంచిత

మైన పవిత్రతయు ఉండునేని నీవు నెగ్గుదు వను విషయమున నాకు సందేహము లేదు. కర్మానుష్ఠానము ప్రథమదశ. కావున శ్రీరామ కృష్ణు నుపదేశములను ప్రచారము చేయుపనికి నీదేహమును ఆత్మను అర్పించుకొనుము. శ్రద్ధతో సంస్కృతమును చదువుము. భక్తిసాధనలు చేయుము. ఏలయన నీవు మానవజాతికి మహాచార్యుడవుగ కావలసియున్నది. "ఆత్మహత్య చేసికొనుటకు పేనా కత్తి చాలును. ఇతరులను చంపుటకు తుపాకులును పెద్దకత్తులును కావలెను" అని నా గురుదేవుడు చెప్పుచుండెడి వాడు. కాలము వచ్చినపుడు ఆయన పవిత్రనామమును ప్రచారముచేయుచు విశ్వసంచారము చేయు భాగ్యము నీకు కలుగును. నీ నిశ్చయము మంచిది, పవిత్రమైనది. భగవంతుడు నిన్ననుగ్రహించును. కాని తొందరపడకు. మొదట కర్మానుష్ఠానముచేతను భక్తిచేతను నిన్ను విశుద్ధునిగ చేసికో. భారతదేశము సుదీర్ఘకాలము కష్టములనుభవించినది. సనాతనధర్మము సుదీర్ఘకాలము కష్టములపాలైనది. కాని భగవంతుడు కరుణాపూర్ణుడు. తనబిడ్డలకు తోడ్పడుటకై ఆయన మరల అవతరించినాడు. అధఃపతితమైన భారతదేశమునకు మరల ఉన్నతిని చెందు అవకాశములు ప్రసాదింపబడినవి. శ్రీరామకృష్ణునిచరణసమాశ్రయణముచేతనే భారతదేశమునకు ఉన్నతి కలుగును. ఆయనజీవితమును ఉపదేశములును దశదిశల వ్యాపింపజేయబడవలెను. హిందూసంఘశరీరమున ప్రతిరోమకూపమునను వానిని చొప్పింపవలెను. ఆ పని నెవరు చేయుదురు? శ్రీరామకృష్ణధ్వజము నెత్తుకొని విశ్వమును విముక్తి నొందింప ముందుకురుకువా రెవరు? పేరును ప్రతిష్ఠను సంపదను భోగములను—అంతే కాదు, ఈలోకముపైని ఆలోకముపైని గల ప్రతికాంక్షను త్యజించియైనను దేశపతనమును అరికట్టువా రెవరు? ఏకొందఱు యువకులో ఈ అవకాశమున ముందుకురికిరి. తమ్ము త్యాగము చేసికొనిరి. వారు అల్పసంఖ్యాకులే. అట్టివారు మనకు కొన్ని వేలమంది కావలెను. అట్టివారు లభింతురు. అట్టి

వారిలో ఒకడుగా నగు సంకల్పమును నీకు దేవుడు కలిగించినాడు. అందుకు నాకు సంతోషము. ఎవనిని దేవు డెన్నుకొనునో వానిదే ఘనత. నీ నిశ్చయము మంచిది. నీకోరికలు ఉన్నతములు, అంధకారపంకమున దిగబడియున్న లక్షలాది ప్రజలను దేవుని వెలుగులోనికి తేవలెను. నీ లక్ష్యము విశ్వమునకంతటికిని పరమోదాత్తము.—

కాని నాయనా, ఇందు లోటులున్నవి. దేనిని గాని త్వరపడి చేయకూడదు. గెలుపొందవలయు ననిన అందుకు ముఖ్యావసరములు మూడు. పవిత్రత, శాంతి, దీక్ష: వీని కన్నిటికంటె ముఖ్యము ప్రేమ. కాలమంతయు నీదే. అసభ్యమైన తొందర ఎందుకు? నీలో పవిత్రతయు హృదయపూర్వకతయు ఉండిన సమస్తమును చక్కబడును. సంఘముపై విఱుచుకపడువారును పోయినచోటనెల్ల ఆధ్యాత్మికనూతనజీవితమును తేజమును కలిగించువారు నగు మీబోటివారు నూర్లకొలదిగ మనకు కావలసియున్నారు. దేవుడు నిన్ననుగ్రహించుత.

సమస్తాశీస్సులతో,

భవదీయ
వివేకానంద

## 137

(శ్రీ హరిదాస విహారీదాస దేశాయిగారికి)

541 డియర్ బారన్ అవెన్యూ
చికాగో
నవంబరు (?), 1894.

ప్రియదివాన్జీ,

మీజాబు నాకు అత్యంతిక ప్రీతిని కల్గించినది. ఎగతాళి మాటలు నా కర్థ మగును లెండి. కాని ఆమాటలకు బేలుపోవుటకు నేను శిశువను కాను. ఇప్పు డింకను కైకొనుడు.

పాశ్చాత్యులు కాంచిన విజయమందలి మర్మము వారి నిర్మాణశక్తి సంఘీభావశక్తి పరస్పరవిశ్వాస సహకార సాహాయ్యము లున్ననే అది శక్య మగును. వీరచంద్ గాంధీ ఇచట నున్నాడు. ఆయన జైనుడు. బొంబాయిలో మీకు బాగుగా పరిచితుడే. ఓర్వరాని ఇచ్చటి చలివాతావరణములో సైతము ఆయన శాకాహారమునే గాని మఱొక ఆహారమును తినడు. తన మతమును తనదేశీయులను రక్షించుకొనుటకు యావచ్ఛక్తితో పాటుపడును. అతనిపై ఈదేశప్రజలకు చాల ఇష్టము. కాని అతని నిచ్చటికి పంపినవా రేమి చేయుచున్నారు? అతనిని కులము నుండి వెలివేయప్రయత్నించుచున్నారు. బానిసలలోనే తప్పక ఉప్పతిల్లు దుర్గుణము అసూయ. వారిని అదిమి పెట్టునదియు అసూయయే.

ఇక్కడ......అనువా రున్నారు. వారిందఱును ఉపన్యాసములు చేసి అందుమూలమున ధనము గడింతమని ప్రయత్నించుచున్నారు. వారు కొంత పనిచేసినారు. కాని వారికంటె మెఱుగుగా నేను నెగ్గినాను — ఏల, వారు గెల్పొందుటకు నేనడ్డపడలేదు. అది ఈశ్వరసంకల్పము, కాని...అనువారుతప్ప...అనువారందఱును అతి భయంకరములైన అసత్యములను నన్నుగూర్చి నాపరోక్షమున కల్పించి ఈదేశమంతటను వ్యాపింపజేసినారు. అమెరికనులు ఎప్పుడుగాని అట్టినీచత్వమునకు పాలుపడరు.

...ఎవడైన ముందంజవేయ ప్రయత్నించునేని ఇచ్చట ప్రతివాడును అతనికి తోడ్పడుటకు సంసిద్ధుడై యుండును. భారత దేశమున ఏ (హిందూ) పత్రికయందైనను నన్ను ప్రశంసించుచు ఱేపు ఒక్కగీటు వ్రాసి చూడుము. మఱుదినమే అచ్చటివారందఱును నాకువిరోధు లగుదురు. ఏల? అది బానిసలస్వభావము. తమనడుమ తమసోదరులలో నొకడు రవంత తలపై కెత్తినను వారు చూచి ఓర్వలేరు...అట్టి చెత్తసరుకును ఈ స్వాతంత్ర్యసాభ్రాత్ర

స్వేచ్ఛాశిశువులతో సరిపోల్ప గోరుదురా? అమెరికాసంయుక్తరాష్ట్రములలో విముక్తినొందింపబడిన బానిసలు, నీగ్రోలు, ఉన్నారే, వారు మనప్రజలను చాలసన్నిహితముగ పోలియుందురు. దక్షిణ రాష్ట్రములలో వారు రెండు కోట్లమంది ఉండినారు. వారికి స్వాతంత్ర్య మిప్పుడే కలిగినది. శ్వేతజాతివారు పిడికెడుమంది. ఐన ప్పటికిని వారు నీగ్రోలను అణచిపెట్టియుండినారు. ఏల? చట్టము ప్రకారము వారికి అన్ని హక్కు లున్నను ఈ బానిసలవిముక్తికై సోదరులు రక్తముకార్చుచు పోరాడుకొనిరి. వారిలో ఉన్న దోషము ఇదే, అసూయయే. తనసోదరుని ఎవరైన పొగడినను తనసోదరుడు పురోగమించినను ఈ నీగ్రోలలో ఎవడుగాని చూచి ఓర్వలేడు. వెంటనే వాని నణచివైచుటకు వీరు తెల్లవారితో కలియుదురు. మీరు భారతదేశమునుండి వెలుపలికి వచ్చువఱకు ఇది మీకు బోధపడదు. ధనసంపదయు పదవియు గల్గియున్న వారు ప్రపంచమును అట్టిదారిపై దొర్ల జేయుట సరియే. కాని కోట్లకొలది అధఃపతితుల శ్రమజీవుల హృదయరక్తము నాలికించి తాను చదువులు చదివి భోగము లనుభవించుచు ఆపేదలను గూర్చి తలంపనైన తలంపకుండు వానిని ద్రోహి అని నేనందును. మీసంపన్నులు మీ ఉదాత్తపురుషులు మీమతాచార్యులు మీ ప్రభువులు పేదలను తమతలంపునకు ఎక్కడ తెచ్చుకొన్నారు? ఎప్పుడు తెచ్చుకొన్నారు? ఇంతకును ఆపేదలశ్రమయే వీరి అధికారమునకు జీవగఱ్ఱ.

కాని భగవంతు డుదారుడు. త్వరగనో నిదానముగనో ప్రతిక్రియ కల్గినది. ఎవరు పేదల జీవరక్తమును పీల్చుకొనుచుండిరో, పేదలను నాశనము చేసి తాము చదువులు చదివిరో పేదలపేదఱికముపైనే తమ అధికారమును నిర్మించుకొనిరో వారును, తమ వంతురాగా గడచిన వేయేండ్లుగా నూర్లకొలదిగ వేలకొలదిగ బానిసలుగ అమ్మివేయబడిరి. వారి పత్నులకును

పుత్రులకను మానభంగము కావింపబడినది. వారి ఆస్తులు దోచుకొనబడినవి. ఇదంతయు నిర్హేతుక మని తలంతువా ?

భారతదేశమున పేదప్రజలలో అధికసంఖ్యాకులు మహమ్మదీయులు. అట్లుండుటకు కారణమేమి? కత్తితో భయపెట్టి వారిని ఆమతములో కలుపుకొన్నా రని చెప్పుట అర్థము లేని మాట... జమీందార్ల బారినుండియు... మఠాచార్యుల బారినుండియు తప్పుకొని స్వతంత్రులగుటకు ప్రజలు తమంతటనే మహమ్మదీయులైరి. కావుననే బంగాళదేశమున రైతులలో హిందువుల సంఖ్యకంటె మహమ్మదీయుల సంఖ్య యెక్కువగా కననగుచున్నది. ఏలయన అచ్చట అందఱుజమీందారు లుండిరి. అధఃపతితులై త్రొక్కిళ్లకు లోనగుచున్న ఈలక్షలాది ప్రజలను ఉద్ధరింపవలెనని ఎవ రనుకొందురు? దేశ మనగా కొన్నివేలమంది విశ్వవిద్యాలయ పట్టభద్రులు మాత్రమే కాదు. దేశ మనగా సంపన్నులగు ఏకొందఱుమాత్రమో కాదు. మన కున్న అవకాశములు తక్కువ. నిజమే. కాని ముప్పదికోట్ల ప్రజలకు అన్నవస్త్రములిచ్చుటకు, భోగములను సైతము సమకూర్చుటకు చాలినంత మనకు కలదు. మనప్రజలలో నూటికి తొంబండుగురు విద్యావిహీనులు. వారి నిరక్షరాస్యతనుగూర్చి దేశభక్తు లనుకొనబడు మన బాబులలో తలంచుకొనువా రెవరు ?

ఇప్పుడు నా మాట వినుడు. ఇప్పుడును దేవు డున్నాడు. వేడుకప్రసంగము కాదు. మనజీవితములకు అతడే నియామకుడు. తమకు మం దిచ్చుటకు వచ్చినచేతినే కొఱుకజూచుట బానిసలైన దేశప్రజలకు తప్పనిసరి. నే నెఱుగుదును. ఐనను మంచివిషయములన్నింటియందును ఉదాత్తవిషయము లన్నింటియందును నిజమైన సానుభూతిగల కొందఱలో మీరొక్కరు. మీ యొక్కరినిగూర్చియైనను మానవు లని, సత్యపరు లని, ఉదాత్తశీలు రని, బుద్ధియందును హృదయమందును సమగ్రార్జవము కలవారని—నే నెఱు

గుదును. అట్టి మీరు నాతోకూడి "దయామయుడవైన ఓపరం జ్యోతీ, కమ్ముకొనియున్న కటికచీకటినడుమ మాకు ముందు నడుపుమా" అని ప్రార్థింపుడు.

వారిమాటలు నేను లక్ష్యపెట్టను. నాదేవునిపై నాకు ప్రేమ యున్నది. నామతముపై నాదేశముపై అన్నిటికంటె నెక్కువగ దరిద్రభిక్షుకుడ నగు నాపై నాకు ప్రేమ యున్నది. పేదలపట్ల అజ్ఞులపట్ల అధఃపతితులపట్ల నాకు ప్రేమ యున్నది. వారికొఱకై నే నెంతపరితపింతునో భగవంతు డెఱుగును. నాకు దారిని ఆయన చూపును. మానవుల దూషణభూషణలు నేనించుకేని సరకు చేయను. వారిలో అధికసంఖ్యాకులు అజ్ఞానులు. రోదపెట్టుశిశువులు. నిగూఢమైన సహానుభవప్రకృతిలోనికి ప్రేమమయమైన ఆత్మలోనికి వారు ప్రవేశ మందలేదు.

ఆ పరిజ్ఞానము శ్రీరామకృష్ణు నాశీర్వాదమున నేను పడసితిని. అందఱును నావంటిదరిద్రభిక్షుకులే నిండియుండు ఈ నా చిన్నజట్టుతో ఉద్యమము నిర్వహింప నేను ప్రయత్నించుచున్నాను. మావారిని మీరు చూచియున్నారుగా. కాని దేవుని పనులను నిర్వహించుచువచ్చినవా రందఱును పేదలే, నిమ్నులే. నాగురువునందు నాదైవమునందు నాయందు నాకు విశ్వాస ముండునట్లు మీరు నన్నాశీర్వదింపుడు.

ఏకైక మార్గము సహానుభూతియు ప్రేమయునే, ఏకైకారాధనము ప్రేమయే.

సర్వేశ్వరుడు మీకును మీవారికిని సదా సర్వదా తోడుగ నుండును గాక!

ప్రార్థనలతో ఆశీస్సులతో,

వివేకానంద

## 138

(కుమారి మేరీ హేలుకు)

168 బ్రాటిలు వీధి
కేంబ్రిడ్జ్,
డిసంబరు 8, 1894.

ప్రియసోదరీ,

మూడు దినములుగా నే నిచ్చట నున్నాను. హెన్రీసామ ర్స్టెట్టు ప్రభ్వీణి కావించిన చక్కని ఉపన్యాసమును వింటిని. ఇచ్చట నేను ప్రతిదినము ప్రొద్దునను వేదాంతము మున్నగు విషయములనుగూర్చి పాఠములు చెప్పుచుందును. పంపు మని అమ్మ ఓంపిలుకొద్ద నే నిచ్చి వచ్చిన "వేదాంతమతము" (వేదాన్తిసము) నీ కిప్పటికి చేరియుండును. మ ఱొ క నా డు స్పాల్డింగువారింట విందు భుజించుటకు పోయియుంటిని. వల దని నేను మాటిమాటికి మొత్తుకొన్నను వా రా దినము నన్ను అమెరికనుల గుణదోషములనుగూర్చి పరామర్శింపుమనిరి. నా మాటలు వారికి రుచింప లే దేమో. ఆపని ఎప్పుడును అసా ధ్య మే. అమ్మ చర్చిని గుఱించిన చికాగోలో నున్న కుటుంబ మునుగూర్చిన వా ర్త లేవి ? ఎంతో కాలముగా వారియొద్దనుండి నాకు జాబులు రాలేదు. నాకు వ్యవధి యుండియుండిన ఈవఱ కే నిన్ను చూచుటకు పట్టణములోనికి పరుగున వచ్చియుందును. దినమంతయు నాకు ఇంచుమించు ఎడతెంపులేని పనియే ఉన్నది. నిన్ను కలిసికొన నేమో అను దిగు లున్నది.

నీకు వ్యవధి యున్న చో జాబు వ్రాయుము. నిన్ను చూచు టకు లభించు ప్రథమావకాశమును దక్కించుకొందును. ఇక్కడ నే నుండునంతవఱకు అనగా ఈనెల 27, 28 తేదులవఱకు నాకు

తీరుబాటు మధ్యాహ్నానంతరవేళలోనే. ప్రొద్దుననుండి పండ్రెండు గంటలవఱకును ఒంటిగంటవఱకును పనిలో ఊపిరాడకుండును.

మీకందఱికి నాప్రేమ.

సదా మీప్రియసోదరుఁడు
వివేకానంద

## 139

(కుమారి మేరీ హేలుకు)

కేంబ్రిజ్,
డిసెంబరు 12, 1894.

ప్రియసోదరీ,

క్రిందటినీజాబునకు పిమ్మట నాకు నీయొద్దనుండి ఏమియు రాలేదు. పై మంగళవారము నేను న్యూయార్కుకు పోవుచున్నాను. ఈమధ్యకాలమున శ్రీమతి బుల్లునుండి జాబు నీకు చేరియుండవలెను. దానికి నీవు సమ్మతింపజాలనిచో, చాల సంతోషముతో ఏనాడైనను సరే నేను వత్తును. ఉపన్యాసములు ముగిసిపోయినందున నాకిప్పుడు తీఱికే, పై భానువారమునాడు తప్ప.

సదా భవదీయప్రేమయుత
వివేకానంద

## 140

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
డిసెంబరు 26, 1894.

ప్రియ ధన్య,

......క్రైస్తవమత ప్రచారపత్రికలలో సదా నన్ను గూర్చి ఖండనవాక్కులు వెలువడుచుండు నని వినుచున్నాను. కాని

లక్ష్యపెట్టి వానిని చదువను. భారతదేశములో కావింపబడిన ఖండనప్రసంగములలో వేనినైన నీ వికకు పంపుదువేని వానిని నేను "బుట్టదాఖలు" చేయవలసియుండును. మన పనికి కొంత ఆందోళన మావశ్యక మాయెను. చాలినంత ఆందోళన సాగినది. నన్ను గుఱించి ప్రజలు ఏ మన్నను సరే, తెగడినను పొగడినను నీ విక లక్ష్యపెట్టకు. నీపనిని నీవు కొనసాగించుచుండుము. "నహి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాతగచ్ఛతి" "నాయనా మంచిపని చేసినవా డెవ్వడును దుర్గతిని పొందడు." (భగవద్గీత VI.- 40) అను మాటను జ్ఞప్తియుంచుకొనుము.

ఇచ్చటి ప్రజలు ప్రతిదినమును నన్ను కొనియాడు చున్నారు. మనలో మాట! నీవు కలకాంచుచున్నంతకంటె ఎక్కువ మాటచెల్లుబడి నా కిచ్చట నున్నది. ఏదిగాని నిదానముగ సాగవలెను. పత్రికలలో వచ్చు దూషణభూషణలను నేను లక్ష్యపెట్ట నని నీ కింతకు పూర్వమే వ్రాసి యున్నాను. ఇప్పుడు మరల వ్రాయుచున్నాను. వానిని నేను నిప్పులో వేసితిని. నీవును అట్లే చేయుము. పత్రికలలోని నిరర్థకవాక్కులను విమర్శనలను ఇంచుకైన లక్ష్యపెట్టకు. ఆర్జవము కలిగియుండుము. నీ విధిని నిర్వర్తింపుము. అన్నియును చక్కబడును. నిజము నెగ్గి తీరవలెను...

మతప్రచారకుల దుష్ప్రచారములను నీవు కన్నెత్తియైన చూడరాదు....వానికి శ్రేష్ఠమైన ప్రత్యుత్తరము పరిపూర్ణ మౌనమే. ఆమౌనమునే నీవును పాటింపవలె నని నాకోరిక.... మీసంఘమునకు శ్రీసుబ్రహ్మణ్య అయ్యరుగారిని అధ్యక్షులనుగ చేయుము. నాకు తెలిసినంతవఱకు అత్యంతార్జవము అత్యంతౌదార్యము కలవారిలో ఆయన యొకడు. ఆయనలో ప్రతిభకును భావోద్రేకమునకును చక్కని పొందు కుదిరినది. నాపై నెక్కువగా నాధారపడక నీపనిని సాగింపుము. నీసొంతపనిచేసి

నట్లు చేయుము......నాసంగతియా, ఎప్పుడు మరలివత్తునో, నే నెఱుగను. నాపని ఇక్కడను భారతదేశమునను కూడ సాగుచున్నది......

మీకందఱికి నాప్రేమ. ఆశీస్సులతో—

సదా భవదీయ
**వివేకానంద**

## 141

(శ్రీమతి ఓల్బుల్ సతికి)

బ్రూక్లిను,
డిసంబరు 28, 1894.

ప్రియ శ్రీమతిబుల్,

నేను న్యూయార్కుకు క్షేమముగా చేరినాను. అక్కడ డిపోయొద్ద లాండ్సుబెర్గు నన్ను కలసికొన్నాడు. తత్క్షణమే బ్రూక్లినుకు బయలుదేఱితిని. సకాలమున చేరితిని.

సాయంకాలము మాకు హాయిగా గడిచినది. నైతిక సంస్కృతిసంఘసభ్యులగు మహాశయులు పెక్కండ్రు నన్ను చూడ వచ్చిరి.

పై భానువారము ఒక ఉపన్యాసము జరుగును. డాక్టరు జేన్సు ఎప్పటివలెనే చాల దయాసౌజన్యములు గలిగియుండెను. శ్రీహిగ్గిన్సు ఎప్పటివలెనే ఆచరణలో తత్పరత కలిగియున్నాడు. తక్కిన నగరములందు కననైనంతకంటె ఆధ్యాత్మికధర్మాభిరుచి న్యూయార్కునగరములో హెచ్చుగ కననగుచున్నది. ఇచ్చటను ఆ అభిరుచి మగవారియందున్నంతకంటె హెచ్చుగా మహిళలందున్నది. అట్లేల యున్నదో నే నెఱుగను...

శ్రీహిగ్గిన్సు నన్నుగూర్చి ప్రకటించిన చిన్న గ్రంథపు ప్రతి నొకదానిని ఇందువెంట పంపుచున్నాను. భవిష్యత్కాలములో అట్టి వింకను పంప గలుగుదు నని నా నమ్మకము.

కుమారి ఫార్మరుకును పవిత్రకుటుంబమువా రందఱికిని నాప్రేమ.

భవదీయభవ్య
వివేకానంద

## 142

(గోవిందసహాయికి)

జి. డబల్యూ హేలుగారింట,
చికాగో,
అమెరికాసంయుక్తరాష్ట్రములు

ప్రియగోవిందసహాయ్,

కల్కత్తాలో నున్న నా సోదరశిష్యులతో నీవు జాబులు జవాబు లేవేని జరుపుచున్నావా? ఐహికముగను, నైతికముగను ఆధ్యాత్మికముగను నీవు పురోగమించుచున్నావా?... ఇప్పటికి సంవత్సరమునకంటె ఎక్కువకాలముగా అమెరికాలో నేను హిందూధర్మమును బోధించుచున్నా నను విషయము నీవు విని యుందువు. నా కిక్కడ దినములు చాలబాగుగ గడచుచున్నవి. వీలైనంత తొందరగా చిత్తమువచ్చినంత తఱచుగా నాకు జాబులు వ్రాయుచుండుము.

భవదీయప్రేమపూర్ణ
వివేకానంద

## 143

(గోవిందసహాయికి)

అమెరికాసంయుక్తరాష్ట్రములు
1894.

ప్రియగోవిందసహాయ్,

......సత్యపరతయే పరిశుద్ధమైన పద్ధతి. ధర్మపరుడు తుదకు గెల్చితీరును......నాయనా, ఎంత కార్యవ్యగ్రుడనుగ నున్నను ఎంత దూరమున నున్నను ఎంతటి ఉన్నతపదవులలో నున్నవారితో కూడియున్నను నేను నామిత్రులలో ప్రతియొక్కరిని అత్యంతనిమ్నుని సైతము సదా స్మరించుచు దీవించుచు ప్రార్థించుచు నుందును. ఈవిషయము ఎల్లప్పుడును నీజ్ఞప్తియం దుండవలెను.

ఆశీస్సులతో,

భవదీయ
వివేకానంద

## 144

(ఆలంబజారు మఠముననున్న సోదరశిష్యులకు)

ఓమ్ నమో భగవతే శ్రీరామకృష్ణాయ

1894.

ప్రియులారా, ప్రేమాస్పదులారా,

మీజాబు నాకు అచ్చటి సకలవార్తలను అందించినది. బలరామ్బాబుపత్నికి కలిగిన బంధువియోగదుఃఖమును విని దుఃఖించితిని. ఈశ్వరసంకల్ప మట్లున్నది. ఇది కర్మభూమియే కాని భోగభూమి కాదు. ప్రతియొక్కడును తనపని ముగియగానే

స్వస్థానమునకు చేరిపోవుచుండును. కొందఱు ముందు పోవుదురు, కొందఱు తర్వాత పోవుదురు, అంతే, ఫకీరు పోయినాడు. సరి, అట్లున్నది ఈశ్వరసంకల్పము.

శ్రీరామకృష్ణుని మహోత్సవము అత్యంతవైభవముతో నెఱవేఱిన దనుట శుభవార్త. ఆయనపేరు ఎంతవ్యాపించిన అంత మేలు. కాని, తెలిసికొనవలసినవిషయ మొకటియున్నది. మహాయోగులు విశ్వమున అవతరించుట విశిష్టసందేశము లందించుటకే కాని వట్టి పేరుప్రతిష్ఠలకు కాదు. కాని వారి అనుచరులు గురువుల సందేశములను తుంగలో త్రొక్కి వారిపేర్లకై మాత్రము పోరాడుచుందురు. నిజమునకు ప్రపంచచరిత్ర ఇదే. ప్రజలు ఆయనపేరును అంగీకరింతురా, అంగీకరింపరా అను విషయమును నేను గణింపను. కాని ఆయన బోధనలను ఆయన జీవితచరిత్ర మును సందేశమును విశ్వమంతట వ్యాపింపజేయ తోడ్పడుటకై నాప్రాణము లర్పింప నేను సంసిద్ధుడను. అన్నిటికంటె నన్ను భయపెట్టునది పూజామందిరము. పూజామందిరము తనంతట చెడ్డది కాదు. కాని అదే సర్వస్వము అనుకొనెడి ప్రవణతయు మరల ప్రాతకాలపు వెట్టిని నెలకొల్పు ప్రవణతయు కొందఱిలో కలదు. నన్ను భయపెట్టుచున్నది ఆప్రవణతయే. ప్రాచీన నిస్సారక్రతుకలాపములలో వా రేల వ్యాపృతులగుచుందురో నే నెఱుగుదును. వారి ఆత్మ పనికై ఆత్రపడును. దారి లేనందున వారు తమశక్తిని గంటలు మ్రోగించుట మున్నగు పనులలో వ్యర్థ పుచ్చుచుందురు.

మీ కొక క్రొత్త ఆశయమును అందజేయుచున్నాను. దానిని మీరు అమలుపఱుపగలరేని అప్పుడు మీరు మానవు లనియు మీ రుపయోగపడువా రనియు నేను తెలిసికొందును. ...సక్రమమైన ప్రణాళిక నేర్పఱచుకొనుడు. కొన్ని కేమెరాలు కొన్ని దేశపటములు గోళములు కొన్ని రసాయనవస్తువులు—

మున్నగునవి కావలయును. అటుతర్వాత మీకు కావలసినది ఒక పెద్ద కటీరము. తర్వాత మీరు పేదలను బ్రతుకుదెరువులేని వారిని కొందఱిని సమావేశపఱపవలెను. ఇదంతయుచేసి వారికి జ్యోతిషము భూగోళము మున్నగు విషయములను నేర్పుటకై పటములను జూపుడు. తర్వాత శ్రీరామకృష్ణునిగూర్చి వారికి బోధింపుడు. వివిధ దేశములలోను జరిగిన జరుగుచున్న సంభవములనుగూర్చియు ఈప్రపంచస్వరూపమునుగూర్చియు ఇంకను ఇట్టి విషయములనుగూర్చియు వారికి కన్నులు దెఱవ ప్రయత్నింపుడు. పేదలును అజ్ఞానులును మీ కచ్చట గుంపులు గుంపులుగ నున్నారు. సాయంవేళలందుగాని మధ్యాహ్నములందుగాని ఎప్పుడుగాని వారికటీరములొద్దకు పొండి. ఇంటింటికిపొండి. వారికి కనువిప్పు కలిగింపుడు. పుస్తకములు మున్నగునవి పనికిరావు. నోటిపాఠముల మూలముగనే వారికి నేర్పుడు. మీ కేంద్రములను మెల్లగా విరివినొందింపుడు. ఇదంతయు మీరుచేయగలరా? లేక గంటలుమ్రోగించుటమాత్రమేనా?

మదరాసునుండి సోదరుడు తారకునిగూర్చి అన్ని విషయములును విన్నాను. వా రతనివిషయమున అత్యంతప్రీతులై యున్నారు. ప్రియసోదరా, తారకా, నీవు మదరాసుకు పోయి అచట కొన్నాళ్లుందువేని ఎంతో పని జరుగును. కాని పోవుటకు ముందు అచట మొదట ఈపనిని ప్రారంభింపుడు. భక్తమహిళలు వితంతువులను కొందఱి శిష్యురాండ్రనుగ మార్పలేరా? వారి బుఱ్ఱలలోనికి రవంత చదువును మీరు చొప్పింపలేరా? చొప్పించి ఇంటింటికి పోయి శ్రీరామకృష్ణునిగూర్చి బోధింపుడని ఆబోధనతోపాటు విద్యనుగూడ గఱపుడని వారిని పంపలేరా?...

రండి, ఈకార్యసాధనకు సర్వాత్మనా మీరు పూనుకొండి. నాయనా, రిత్తమాటలకాలము క్రతుకలాపములకాలము పోయినదోయి. ఇప్పుడు నీవు పాటుపడవలెను. బెంగాలీల ఆధ్యాత్మిక

ధర్మము అ దేపాటిదో నన్ను చూడనిండు. లాటూకు వెచ్చని దుస్తులు కావలయు నని నిరంజనుడు వ్రాయుచున్నాడు. ఇక్కడి ప్రజలు చలికాలమునకు కావలసిన కప్పడములను యూరోపు నుండియు భారతదేశమునుండియు దిగుమతిచేసికొందురు. ఉన్ని కప్పడము ఇప్పుడు నాకు లభింపగలధరలో నాలుగవవంతుధరకు కల్కత్తాలోనే మీకు దొరకును.... యూరపున కెప్పుడు పోవు దునో నే నెఱగను. నాకు సంబంధించిన ప్రతివిషయమును అనిశ్చితమే. ఈదేశములో ఎట్లో తోసుక పోవుచున్నాను, అంతే.

ఇది చాల తమాష దేశము. ఇప్పుడు వేసవి. బెంగాలులో ఏప్రిలునెలలో నుండునంతటి వేడిమి నేటి ప్రొద్దున ఇచట నుండినది. మఱి యిప్పుడో, అలహాబాదులో ఫిబ్రవరినెలలో నుండు నంతి చలిగా నున్నది. నాలుగుగంటలలోగా అంతటి మార్పు! ఈదేశములోని హోటళ్లనువర్ణించుట శక్యము గాదు. ఉదాహరణమునకు భోజనమునకు తీసికొనుపైకముగాక గది బాడిగకై మాత్రమే దినమునకు ఐదువేలరూపాయలవఱకు పెట్టించు హోట లొకటి న్యూయార్కులో నున్నది. భోగవిషయ ములో యూరపులోనైనను సరే, ఇట్టి దేశములేదు. ప్రపంచ మున అన్నిదేశములకంటె సంపదలో ఈదేశము హెచ్చు. ఇచ్చట ధనము నీళ్లవలె ప్రవహించుచుండును. నేను సాధారణ ముగా గొప్పవారిండ్లలో అతిథిగా నుందును. హోటళ్లలోనుండుట అరుదే. ఇచటి గొప్పవా రందఱును నన్ను బాగుగ నెఱిగి యున్నారు. ఈ దేశమునకంతటికిని ప్రస్తుతము నేను పరిచితుడనై యున్నాను. కావున ఎచటికి పోయినను వారు నన్ను అత్యం తాదరముతో తమయిండ్లలో సత్కరించుచున్నారు. చికాగోలో శ్రీ హెచ్ - గారియిల్లు నాబస. అతని భార్యను నేను "అమ్మ" యందును. ఆయనకూతుండ్రు నన్ను సోదరు డందురు. అంతటి పవిత్రమును కృపాసంపన్నమునగు కుటుంబమును నేను చూడనే

లేదు. అట్లుండకున్న, నాసోదరా, భగవంతుడు వారిపై తన అనుగ్రహమును అంతసమృద్ధిగ ఏల వర్షింపవలెను? అహా! వారి కరుణ ఎంత అద్భుతమైనది! ఫలానాచోట ఒకానొక పేదవాడు చిక్కులలో నున్నాడను వార్త యాదృచ్ఛికముగ వారిచెవిని బడినను అతకిని అన్నవస్త్రములిచ్చుటకును అతని కొక ఉద్యోగము సంపాదించిపెట్టుటకును వీరందఱును, మహిళలును, మగవారును అచ్చటికి పోవుదురు! మఱి మన మేమి చేయుదుము!

వేసవిలో వారు తమఇంటిపట్టులను వీడి విదేశములకైనను సముద్రతీరమునకైనను పోవుదురు. నేనును ఎచటికైనను పోవుదును. 'ఫలానాచోటి కని ఇంకను నేను నిశ్చయించుకోలేదు. ఇతరవిషయములలో వారు నీకు తెలిసియున్నట్లే ఇంగ్లీషువారి వంటివారే. పుస్తకములును అటువంటి ఇతరవస్తువులును వారి కున్నవి. కాని వెల చాల ఎక్కువ. ఆవస్తువులు అదే వెలకు కల్కత్తాలో అంతకంటె ఐదంతలు హెచ్చుగ లభించును. అనగా ఈప్రజలు విదేశవస్తువులను ఇచ్చటికి దిగుమతిచేయనీయరు. ఆవస్తువులమీద విపరీతముగ పన్ను వేయుదురు. తత్ఫలితముగ వాని ఖరీదులు విపరీతముగ పెరుగును. ఇంతే కాదు, గుడ్డలు మున్నగు వానిని ఉత్పత్తిచేయుట వీరిలో అంతవిశేషముగ లేదు. వీరు యంత్రములను పనిముట్లను తయారుచేయుదురు. గోధుమలు వరి ప్రత్తి మున్నగువానిని పండింతురు. అవి చాలవఱకు చౌకే.

మఱొక మాట. ఈదినములలో హిల్సా మత్స్యములు ఇచ్చట కొల్లగ నున్నవి. కడుపుబూరటిల్లునట్లు తిన్నను అంతయు జీర్ణ మగును. పెక్కురకముల పండ్లు గలవు. అరటిపండ్లు, నిమ్మపండ్లు, జామపండ్లు, ఆపిలపండ్లు, బాదముపండ్లు, ఎండుద్రాక్షపండ్లు, ద్రాక్షపండ్లు - కొల్లగ నున్నవి. ఇంతేగాక వేఱుపండ్లు పెక్కులు కాలిఫోర్నియానుండి వచ్చును. మామిళ్లుగాని, లీచీలుగాని అట్టిపండ్లేవియు లేవు. కాని అనాసపండ్లు సమృద్ధిగ నున్నవి.

ఇచ్చట ఒకరకమైన కాయగూర ఉన్నది. వండినప్పుడు దానిరుచి బెంగాలులోని నొటేకూరరుచివలెనే యుండును. 'అస్పరాగస్' అను మఱొకజాతిది ఉన్నది. అది మెత్తని డెంగో మూలికవలె నుండును. కాని దానితో మనచర్చరీ తయారుచేసికొనుటకు వీలుపడదు. కలాయిగాని వేఱు ఏకాయధాన్యములు గాని లేవు. అవి వీరికి తెలియనైన తెలియవు. అన్న మున్నది. రొట్టెయున్నది. రకరకాల మత్స్యములు మాంసములు పెక్కులున్నవి. భుజించుటకు వారు వండుకొను పదార్థముల జాబితా ఫ్రెంచివారి జాబితావంటిదిగ నుండును. పా లున్నవి. పెరుగు అరుదు. మజ్జిగ విరిగిననీళ్లు సమృద్ధిగ నున్నది. మీగడ నిత్యోపయోగములో నుండువస్తువు. టీలోను కాఫీలోను ఆమీగడ యున్నది. ఉడికిన పాలపై గట్టిగనుండు చెక్క కాదు, జ్ఞాపకముంచుకొనుడు. మీవెన్నయు ఉన్నది. మంచుగడ్డనీరును ఉన్నవి. వేసవిగాని చలికాలముగాని పగలు గాని రాత్రిగాని పడిసమున్నగాని జ్వరమువచ్చినగాని నీకు మంచుగడ్డనీరు కొల్లగ నుండును. వీరు వైజ్ఞానికులు. మంచుగడ్డనీటిచే జలుబు హెచ్చు నని చెప్పితి రేని వారు నవ్వుదురు. మీరెంత తిన్న అంత మంచిది. ఐస్క్రీము అన్నిరకాలరూపములలోను యథేష్టముగ నున్నది. నయాగరా జలపాతములను ఏడెనిమిదిపర్యాయములు చూచితిని. భగవంతుడు కొనియాడబడుగాక ! చాలగంభీరముగనే యున్నది. కాని మీరు విన్న వర్ణనలవలె లేవు. చలికాలమున ఒకనాడు ఉత్తర ధ్రువమండలమందలి జ్యోతి మాకు కనబడినది.

... కేవలము శిశుజల్పితము! అట్టిమాటలు వినుచుండుటకు ఈజన్మములో నాకెక్కువ వ్యవధి లేదు. పైజన్మమున వినగలిగి యుందు నేమో తెలిసికొనవలసినకాలముఇది. యోగిను పూర్తిగా ఈపాటికి కుదుటబడియుండు నని అనుకొనుచున్నాను. శారదుని పర్యటనోత్సాహము ఇంకను పోలే దని గ్రహించితిని. ఇప్పుడు కావలసినది అంగక్రమముతోడి నిర్మాణశక్తి. ఆనామాట అర్థ

మైనదా? ఆపాటి తెలివి మీయెవరిబుఱ్ఱలోనైన నున్నదా? మీకు అర్థమైయుండిన మీమనస్సులను పనిచేయనిండు. సోదరుడు తారకుడును శరత్తును హరియు దానిని చేయగల్గియుండురు......కు సొంతబుద్ధి చాల తక్కువ. కాని అతడు మంచిపనివాడు, పట్టుదలకలవాడు. ఆపనితనమును పట్టుదలయు చాల ఆవశ్యకములు. కొంతవఱకు నిర్వహింపగలవే... మనకు కొందఱు శిష్యు లుండవలెను. ఉత్సాహములుఱుకులెత్తు యువకులు, ధీమంతులు, ధీరులు మృత్యుగహ్వరములోనికి పరుగిడగలవారు, సముద్రమున కెదు రీద గలవారు, కావలెను, తెలిసినదా? నామాట లర్థమైనవా? అట్టివారు మగవారును మహిళలును నూర్లకొలదిగ కావలయును. అందుకై మాత్రమే మీశక్తికొలది ప్రయత్నింపుడు. ఇటునుండి అటునుండి ప్రజలను మనమతములోనికి మార్పుడు. వారిని పవిత్రతనలవఱచు మనయంత్రమున చొప్పింపుడు.

...పరమహంసదేవుడు నరేంద్రుని అట్లు పేర్కొనెడివాడు ఇట్లు పేర్కొనెడివాడు అను నిట్టి అన్నిరకాల వెఱ్ఱిప్రసంగములను ఇండియన్మిఱ్ఱరుపత్రికకు వ్రాసితిరే. ఏల వ్రాసితిరి? పరమహంసదేవునకు వేఱుపని లేనేలేనట్లు! అభిప్రాయములను కనుగొనుటయు రహస్యముల అమ్మెడిచాదస్తమును, అంతే! సన్న్యాసులు మీయొద్దకు తఱచు వచ్చుచుండుట చాల మేలు. గుప్తకు జాబులు వ్రాయుచున్నారా? ఆయనకు నాప్రేమ నందజేయుడు. ఆయనను శ్రద్ధతో చూచుకొనుడు. మెట్టుమెట్టుగా అన్నియు చక్కబడును. రాసులురాసులుగ జాబులు వ్రాయుటకు నాకు వ్యవధి చిక్కుటలేదు. ఉపన్యాసములు చేయుటమున్నగువానికి నేను ముందుగ తయారుచేసిపెట్టుకొనను. నేను వ్రాసినది ఇప్పటికొక్కటే. దానిని మీరు ముద్రించి ఐనది. తక్కినవెల్ల నోటికివచ్చినట్లు ఆశువుగ జేసిన ఉపన్యాసములే. గురుదేవుడు నాకు వెనుకనుండి తోడ్పడును. పేనాతోను కాగితములతోను నాకు పనియే లేదు. డిట్రాయిట్టులో నొకసారి నా

ఉపన్యాసము మూడుగంటలు చెల్లినది. ఒక్కొక్కప్పుడు ఈ బుఱ్ఱలో అంత సరకున్నది అను తలంపుగలిగినప్పుడు నేను చేసిన పనికి నేనే ఆశ్చర్యపడుచుందును. ఇచ్చటివారు నన్నొక గ్రంథమును రచింపు మనుచున్నారు. ఈసారి ఆమార్గాన కొంత చేయవలె నని నాకును తోచుచున్నది. కాని చిక్కు ఇది. ఈవ్రాతమున్నగు పనులుచేయుశ్రమకు ఎవరు పూనుకొందురు?...... మనము సంఘమును విద్యుద్దీపితముగ చేయవలెను. దేశమును విద్యుద్దీపితముగ చేయవలెను. వ్యర్థప్రసంగము శుష్కాచారములు పనికిరావు. ఆచారము లన్నియు గృహస్థులకై ఉద్దేశింపబడినవి. భావప్రవాహములను పంచుటయు ప్రచారము చేయుటయు మీపని. దానిని మీరు చేయగల్గిన, సరియే...

శీలమును రూపుదాల్పనిండు. తర్వాత నేను మీమధ్యనుందును. గుర్తించితిరా! మనకు మగవారును ఆడువారును కూడి రెండువేల సన్న్యాసులు కావలెను. అంతే కాదు. పదివేలమందియు ఇరువదివేలమందియు నైనను కావలసినదే. మనదాదులేమి చేయుచున్నారు? మనమతమును చేపట్టువారిని మనము ఎంతకైనను తెగించి సంపాదింపవలెను. పొండు. వారితో చెప్పుడు. మీరును సర్వాత్మనా ప్రయత్నింపుడు. గృహస్థశిష్యులు కారు జాగ్రత్త. మనకు సన్న్యాసులు కావలయును. మిలో ఒక్కొక్కరును ఒకనూఱుమందిచేత బోడికొట్టింపవలెను. చదువుకొన్నవారుగ యువకులుగ నుండవలెను. మూర్ఖులుగ కాదు. అప్పుడు మీరు వీరులు. మీ లోకసంక్షోభమును కలిగింపవలెను. స్తబ్ధవైఖరిని మానుకొండి. నడుముకట్టుడు, లెండు. కల్కత్తా మద్రాసులమధ్య మీరు విద్యుద్వేగమున చుట్టుతిరుగుచుండగా నన్ను చూడ నిండు. పలుచోట్లలో కేంద్రములు ప్రారంభింపుడు. జనులను మన గూడెములోనికి చేర్చుకొను పనిని సదా సాగించుచుండుడు. స్త్రీపురుషభేదమును చూడక, సన్న్యాసులు కాగోరినవారి నెల్ల సన్న్యాసులుగ చేయుడు. అప్పుడు నేను

మీ మధ్య నుండును. ఆధ్యాత్మిక బృహత్తరంగము ఒకటి వచ్చుచున్నది. భగవదనుగ్రహమున, అనుదాత్తుడుగ నున్నవాడు ఉదాత్తుడగును. అజ్ఞుడుగనున్నవాడు మహాపండితులకు తాను గురు వగును. "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరాన్నిబోధత" "లెండి, మేలుకొండి, లక్ష్యము చేరువఱకు ఆగకుడు" "నిత్యవికాసమే జీవితము. సంకోచము మరణమే". తన సుఖములను మాత్రము చూచుకొనుచు స్వార్థపరుడై సోమరిజీవితము గడపువానికి నరకములోనైతము చోటు లేదు. సకలప్రాణులపట్ల కృపకువశుడై, తనకు గల్గుదూషణలను లెక్కింపక వారిమేలుకై ఎవడు పాటుపడునో వాడే శ్రీరామకృష్ణుని శిశువు. "ఇతరే కృపణాః" "ఇతరులు కుత్సితులు" ఈగొప్ప ఆధ్యాత్మికావకాశమున ఎవడు లేచి ధీరహృదయముతో శ్రీరామకృష్ణుని సందేశమును ప్రచారముచేయుచు ఇంటింటికిని ఊరూరికిని సంచరించునో వాడే నాసోదరుడు, శ్రీరామకృష్ణునిపుత్రుడు. ఇదే పరీక్ష. శ్రీరామకృష్ణునిబిడ్డయైనవాడు స్వలాభమునన్వేషింపడు. "ప్రాణాత్యయేపి పరకల్యాణచికీర్షవః" "తమప్రాణములు పోయినను సరే వారు ఇతరులకు మేలు చేయగోరుదురు. ఎవరు తమసుఖములనే చూచుకొనుచు సోమరులుగ బ్రతుక గోరుచు తమకోరికలకై సర్వమును త్యజింప సిద్ధపడుదురో వారు మనవారు కానే కారు. వ్యవధియుండగనే వారు తమమూటముల్లెలతో తొలగిపోవుదురు గాక. శ్రీరామకృష్ణుని శీలమును శ్రీరామకృష్ణుని బోధలను శ్రీరామకృష్ణుని మతమును వ్యాపింపజేయుడు. పారమార్థికమైన ఏకైకసాధన ఇదే. ఏకైకపూజ ఇదే. నిజముగ ఇదే ప్రాపకము, ఇదే ప్రాప్యము. లెండి, లెండి. పెనుకెరటము వచ్చుచున్నది. పదండి ముందుకు. ఆయనదృష్టిలో మహిళలును మగవారును, చండాలునివఱకు అందఱును పవిత్రులే. పదండి ముందుకు, పదండి ముందుకు. పేరును గాని కీర్తిని గాని ముక్తిని గాని భక్తిని గాని చూచుకొనుటకు వ్యవధి లేదు. వీనిని తర్వాత ఎప్పుడైన

చూచుకొందము లెండి. ఈజన్మమున మనము గురుదేవుని ఉదాత్తశీలమును ఉత్కృష్టజీవితమును అనంతాత్మను నిరవధికముగ వ్యాపింపజేయుదము గాక. ఇదొక్కటే కర్తవ్యము. వేఱేదియు కాదు. గురుదేవుని నామము పర్వినచోట నెల్ల క్రిమి సైతము దివ్యతనందగలదు. అంతే కాదు, వాస్తవముగ దివ్యత నిప్పుడే అందుచున్నది. మీకు కన్నులున్నవే, కనబడుట లేదా? ఇది శిశుక్రీడయా? వెఱ్ఱిమాటయా? బండతనమా? "ఉత్తిష్ఠత జాగ్రత", "లెండి, మేలుకొండి" మహాదేవుడు! మనప్రాపుగ ఆయన ఉన్నాడు. ఇంతకంటె నేను వ్రాయలేను — ముందుకు పదండి. మీ కింతమాత్రము చెప్పుదును. ఈజాబును చదివినవానికెల్ల, నాకున్న ఉత్సాహము కల్గును. విశ్వాసము కలిగి యుండుడు, ముందుకు పదండి! మహాదేవుడు! అందఱును కొట్టుకొనిపోవుదురు. జాగ్రత్త. ఆయన వచ్చుచున్నాడు. ఆయన సేవ చేయుటకు ఎవడు సంసిద్ధుడగునో — ఆయనసేవ కాదు, ఆయన బిడ్డల సేవ — పేదలకు, పతితులకు, పాపులకు, బాధితులకు క్రిమి వఱకు అందఱికిని చేయుసేవ — ఆసేవచేయుటకు ఎవడు సంసిద్ధుడగునో అతనిలో గురుదేవుడు తన్ను ఆవిష్కరించుకొనును. సాక్షాత్సరస్వతీదేవియే వారిజిహ్వలగుండ మాటాడును. శక్తిస్వరూపిణి యగు జగజ్జనని వారిహృదయసింహాసనములను అధిష్ఠించును. నాస్తికులును విశ్వాసరహితులును సారహీనులును వేషధారులును — వీరందఱును తమ్ము రామకృష్ణీయుల మని చెప్పుకొను టెందుకు?...

భవదీయప్రేమయుత
వివేకానంద

మఱిమాట:...అంగక్రమముతో నిర్మించుటయనగా పనిని పంచుటయే. ఎవనివంతును వాడు చేయును. అన్నిటిని కలిపికైకొన్నప్పుడు సామరస్యలక్ష్యము కననగును......

**145**

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

జార్జిడబల్యూ హేలుగారింట
541, డియర్బారన్ అవెన్యూ, చికాగో,
1894

ప్రియ—,

నీజాబు చూచుకొని చాల సంతోషించితిని. ము...రు చేయుచున్న పనులను విని ఎంతో విషాదము చెందితిని. ఎల్లర యెదుట తన్ను ముందుకు త్రోసికొనుటకు ప్రయత్నించువాడు సదా యిట్లే ప్రవర్తించును. విశేషించి నా తప్పేమియు లేదు. ము...రు పదేండ్లక్రిందట ఇచటికి వచ్చినాడు, కీర్తిగౌరవములు గడించినాడు. ఇప్పుడు నేను వన్నెకెక్కుచున్నాను. గురుదేవుని సంకల్ప మట్లున్నది. నే నేమి చేయుదును? ఇందుకు ము...రు బాధపడుట అతనిపిల్లతరహా. లక్ష్యపెట్టకు. "ఉపేక్షితవ్యం తద్వచనం భవత్సదృశానాం మహాత్మనామ్, అపి కీటదంశనభీరుకా వయమ్, రామకృష్ణతనయా, స్తద్ధృదయ రుధిరపోషితాః?" "అలోకసామాన్య మచిన్త్యహేతుకం ద్విషన్తి మన్దాశ్చరితం మహాత్మనామ్". ఇత్యాదీని సంస్మృత్య క్షన్తవ్యో౽యం జాల్మః. [మీవంటి మహాత్ములు అలక్ష్యపెట్టదగినది. శ్రీరామకృష్ణుని గుండెనెత్తుటిచేత పోషింపబడిన శ్రీరామకృష్ణపుత్రుల మగు మనము పురుగుకాటుకు భయపడుదుమా? "లోకసామాన్యము కానట్టిదియు హేతువూహించుటకు శక్యము కానట్టిదియు నగు మహాత్ముల చరితములను మందాత్ములు నిందించుచుందురు—" అను (కాళిదాసాదుల) వచనములను స్మరించి ఆమూఢుని క్షమించుట తగును.] అంతఃపరిశీలనశక్తిని ఈదేశీయులలో మేలుకొల్పుదమని సర్వేశ్వరుడు సంకల్పించినాడు. సర్వేశ్వరుని పురోగతిని అడ్డగించుశక్తి ఎవరికైన నున్నదా?. పేరు నాకక్కఱ లేదు.

రూపములేని ఒకవాక్కుగా నుండ మని నా కోరిక. ఎవరేని నన్ను కాపాడవలె నని (నాపక్షమును సమర్థింపవలె నని) నేను కోరను. ''కోహం తత్పాదప్రసరం ప్రతిరోద్ధుం సమర్థయితుం వా, కే వాన్యే. తథాపి మమ హృదయకృతజ్ఞతా తాన్ప్రతి''. ''అతనిపురోగతిని సాగనిచ్చుటకు గాని ఆగనిచ్చుటకు గాని నే నెవడను? ఇతరులైనను ఎవరు? ఐనను వారికి నాహృదయపూర్వకమైన కృతజ్ఞత'' ''యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే'' — నైషః ప్రాప్తవాన్ తత్పదవీ మితి మత్వా కరుణాదృష్ట్యా ద్రష్టవ్యోయ మితి — ''ఏఆత్మ తత్త్వమందు నెలకొన్నవాడు ఎంత దుఃఖము వచ్చినను వి కా ర ము చెందడో'' (గీత VI-22) ఆదశను ఇతడు ఇంకను చేరలేడు. చేరకుండుటను తలపోసి అతనికై జాలిగొనుడు. భగవత్సంకల్పానుసారము పేరు ప్రతిష్ఠలమీాది కోరిక నాహృదయములోనికి ఇంతవఱకును ప్రవేశింప లేదు. ఎప్పటికిని ప్రవేశింప బో దని ధైర్యముగ చెప్పుదును. నేనొకపనిముట్టు, పనిముట్టు నుపయోగించుకొనువాడు దేవుడు. ఈదూరదేశమున వేలకొలది ప్రజల హృదయములలో ఆధ్యాత్మికజ్ఞానమును భగవంతుడు ఈపనిముట్టుద్వారా ప్రబోధించుచున్నాడు. ఇచ్చట మగవారును మహిళలును వేలకొలదిగ నన్ను ప్రేమింతురు, గౌరవింతురు. ''మూకం కరోతి వాచాలం పఙ్గుం లఙ్ఘయతే గిరిమ్''. ''మూగవానిని వాచాలుగాగ జేయు, కుంటివానిని దాటించు కొండలెల్ల'' భగవంతునను గ్రహము నా కాశ్చర్యకరముగ నున్నది. ఏనగరమునకు నేను పోయినను అది కోలాహలసంకుల మగును. హైందవఝంఝామారుత మని వారు నాకు పేరుపెట్టినారు. ఇది దేవునిసంకల్ప మనుటను జ్ఞాపకముంచుకో. నే నొక నిరాకారవాణిని.

ఇంగ్లండునకో మఱొకభవ్యప్రదేశమునకో నేను పోవలెనా అను విషయము దేవున కెఱుక. అన్ని యేర్పాట్లను ఆయనే చేయును. ఇక్కడ ఒకచుట్ట వెల ఒకరూపాయి. బండిలో

ఎక్కటివేని మూడురూపాయలు చెల్లింపవలెను. ఒక కోటు ఖరీదు నూఱురూపాయలు. హోటలు ఖర్చులు దినమునకు తొమ్మిది రూపాయ లగును. అన్నిటిని దేవుడే సరఫరా చేయుచున్నాడు. ... దేవుడు స్తుతింపబడుత. నే నేమియు నెఱుగను. "సత్యమేవ జయతే నానృతమ్. సత్యేన పన్థా వితతో దేవయానః" "జయము సత్యమునకే కాని అసత్యమునకు కాదు. దేవయానమార్గము సత్యముగుండనే సాగును." మీరు నిర్భయులై యుండవలెను. భయపడువాడును తన్ను తాను కాపాడుకొనువాడును పిఱికిపంద. నన్ను సమర్థించుటకు మనవారిలో నొక్కడును ముందునకురాకుండును గాక. అప్పుడప్పుడు మదరాసు రాజపుతానాలవార్తలన్నియు నా కందుచుండును...... పదునాల్గువేలమైళ్లదూరము నుండి చూడగల కన్ను లున్నవి. నిజమే. ఇప్పటికి శాంతము కల్గియుండుడు. భగవంతుడు సంకల్పించినంతవఱకు సకాలమునకు అంతయు బయటపడును. దేవునిమాటలలో నొక్కటైనను అసత్యము కాదు. సోదరా, కుక్కల పిల్లుల జగడమునకు మానవులు దుఃఖింతురా? కావున సామాన్యమానవుల ఈర్ష్యయు అసూయయు మోచేతిపోటుపులును నీమనస్సులో పట్టుకొనరాదు. తెరపైకి పోవుచున్న దనియు సూర్యు డుదయించుచున్నా డనియు కడచిన ఆఱునెలలుగ నేను చెప్పుచున్నాను. ఔను. తెర పైకి పోవుచున్నది. కొంతకొంతగ పోవుచున్నది. మెల్లగనైనను తప్పక పోవుచున్నది. కాలము వచ్చిన మీకే తెలియగలదు. ఆయన ఎఱుగును. మనసులో నున్నదానిని మానవుడు చెప్ప లేడు. ఇవి వ్రాయవలసినవిషయములు కావు....ఎప్పుడుగాని చుక్కానును నీపట్టునుండి తప్పిపోనీయకు. గట్టిగ పట్టుకొనుము. మనము ఓడను బాగుగానే నడపుచున్నాము. దానిని గూర్చి భ్రమచెందుటలేదు. కాని అవతలిగట్టు చేరుటకు కొంతకాలము పట్టును. అంతే. సోదరా, నాయకత్వము పుట్టుకతో వచ్చునే గాని తయారుచేయుటకు శక్య మగునా? తెలిసినదా? నాయకత్వ

మును నిర్వహించుట చాలకష్టము. దాసదాసుడుగ నుండవలెను' వేయి అభిప్రాయములకు అవకాశ మొసగవలెను. అసూయ గాని స్వార్థపరత గాని జాడగానైన నుండరాదు. అప్పుడు నీవు నాయకుడ వగుదువు. నాయకత్వమునకు ప్రథమసాధకము జన్మము; రెండవసాధకము నిస్స్వార్థపరత. నాయకు డనగా అట్టివాడు. అతడు వలను చక్కగా పఱచును. చక్కగానే చుట్టిపెట్టును. "వయ మనుసరామః, వయ మనుసారమః, ప్రీతిః పరమసాధనం." "మే మనుసరింతుము, మే మనుసరింతుము, ప్రీతియే పరమసాధనము." తుట్టతుదకు ప్రేమ గెల్పొందును. తహాతహా పనికిరాదు. వేచి యుండుము; వేచియుండుము. ఓర్పు విజయమును తప్పక కలిగించును......

సోదరా, మీకు చెప్పుచున్నాను. అన్నిటిని ఇప్పుడు సాగుచున్నట్లే సాగనిండు. ఏ ఆచారము గాని అనివార్యమైనదిగ కానీయక జాగ్రత్తవహింపుము — విభేదముల మఱుగున అభేదము—విశ్వజనీనత ఇంచుకేని చెడకుండ చూచుకో. ఆ ఒక్కదానికై, విశ్వజనీనతకై, కావలసివచ్చుచో సమస్తమును త్యజింపవలెను. నేను బ్రతికియున్నను మరణించినను భారతదేశమునకు మరలివచ్చినను రాకున్నను దీనిని ప్రత్యేకముగ జ్ఞప్తియుంచుకొనుము: మనము ఆచరించునదియు ప్రచారముచేయునదియు విశ్వజనీనతను. అన్నిటిపట్ల సహనముమాత్రమే కాదు, పరిపూర్ణమైన అంగీకారము, ఇతరుల హక్కులలో, అన్నిటికంటె చిన్న హక్కుల నైనను ఎట్లు త్రొక్కిపెట్టెదవో, జాగ్రత్తగ నుండుము. పెద్దనావలు పెక్కులు ఈసుడిగుండమున మునిగిపోయినవి. మనము చూపవలసినది అసహనరహితమగు పరిపూర్ణభక్తి యనుటను జ్ఞప్తియుంచుకొనుము. భగవదనుగ్రహముచే సమస్తమును బాగుపడును....ప్రతివాడును నాయకుడుగ నుండ గోరును. నాయకత్వము పుట్టుకచేత కలుగవలె నను విషయమును తెలిసికొనలేకపోవుటే ఈదుండగములకెల్ల కారణము.

మన తల్లు లందఱును ఆరోగ్యానందములు కలిగియున్నా రనుకొందును. గార్గ్యా ఎక్కడ నున్నది? పురికొల్పు ఉదాత్త శక్తిగల అట్టి తల్లులు మన కొక వేయిమంది కావలెను.... మన కన్నియు కావలెను. మన దేవునందు మనకు గల నమ్మకమే అందఱికి నుండవలె ననుట ఎంతమాత్రమును ఆవశ్యకము కాదు. అధర్మశక్తులకు ప్రతిమల్లముగ ధర్మశక్తులకు ఐకమత్యము కలిగించుటే మనకోరిక. తమసన్న్యాసాశ్రమముకారణముగా అహంకరించుట అనునదే సన్న్యాసుల నావరించియుండు పాపము. ప్రథమ దశలలో దాని యుపయోగము దాని కుండవచ్చును. కాని వారికి సమగ్రాభివృద్ధి కలిగినప్పుడు వారి కిక నది అక్కఱ లేదు. గృహస్థులపట్ల సన్న్యాసులపట్ల భేదదృష్టి యుండకూడదు. భేదదృష్టి లేనివాడు మాత్రమే నిజమైన సన్న్యాసి.

...చేతపైసాలేని బాలు రొకపిడికెడు మంది ప్రారంభించిన ఉద్యమమును ఇంత వేగముతో పురోగమించుచున్న దనగా, అది భగవత్సంకల్పమా? బూటకమా! అగునేని అందఱును— అసూయలను పక్షపాతములను విడిచిపెట్టి కర్తవ్యనిర్వహణమున ఏకీభవింతురు గాక! కక్షల కలహములద్వారా విశ్వమంతటికి నొక్కమతమును నెలకొల్పుట శక్యము కాదు.

గొప్పవాడ నగుద మని కోరినంత మాత్రముచేత ఎవడును గొప్పవాడు కాడు. ఉన్నతిని దేవు డెవనికి కలిగించునో వా డున్నతు డగును. పతనమును దేవు డెవనికి కలిగించునో వాడు పతనము చెందును. ఈవిషయమును అందఱును ఒక్కదినము ఒక్కక్షణకాలము అర్థముచేసికొందు రేని చిక్కంతయు నసిపోవును. కాని వ్రేలయినను కదలింపగల శక్తిలేక, 'ఎవరిని గాని నేను — ఉన్నతి నొందనీయను' — అని చెప్పు రిక్తమైన ఆ అహంకారము ఎంత పరిహాసాస్పదము! ఆ అసూయయు కర్తవ్యనిర్వహణమున ఆ అనైకమత్యమును బానిసదేశాలకు ఎంతయు ప్రకృతిసిద్ధములే. కాని దానిని దులిపివేసికొనుటకు

మనము ప్రయత్నింపవలెను. భీకరాసూయ మన లక్షణము.... మఱికొన్ని దేశములను చూచితివేని నీ కిందు నమ్మకముకల్గును. ఈ గుణమున మనకు తోడైన వారు పురవాసిహక్కులను బడసి ఈదేశమున నున్న నీగ్రోలు. వారిలో ఒక్కనికి అభ్యున్నతికలిగె నేని తక్కిన అందఱును అతనికి ప్రతిపక్షు లగుదురు. తెల్లవారితో కలిసి అతనిని మట్టుపెట్టుటకు ప్రయత్నింతురు....

ఎంతత్యాగమైనను చేసి ఎంతమూల్యమైనను చెల్లించి ఎంత వ్యయమునకైనను ఓర్చి — మనము ఆగుణమును మనలోనికి ఎప్పుడుగాని ప్రాకనీయకుండవలెను. మనము పదుగురమూ ఇద్ద ఱమూ అను విషయమును లక్ష్యపెట్టకు. ఉన్న కొద్దిమందియు స్వచ్ఛశీలురుగ నుండవలెను...."భక్తుల యోగక్షేమములను వహింతు నని తాను చేసిన వాగ్దానమును దేవుడు నెఱవేర్చునేని అప్పుడు తండ్రి నడుగుట మంచిది కాదు" దేవుడు తప్పక అట్లు చేయును. కావున మీమనసులను నిబ్బరపఱచుకొండి....రాజ పుతానాలో పంజాబులో సంయుక్తరాష్ట్రములలో మద్రాసులో ఇంక నట్టి ఇతరరాష్ట్రములలో మనము ఆయనపేరును వ్యాపింప జేయవలయును. ఔను, రాజపుతానాలోనే "అప్యసుప్రణయినాం రఘోఃకులే న వ్యహన్యత కదాచిదర్థితా" 'రఘువునింట ప్రాణము నిమ్మని కోరినవారి కోరికయైనను ఎన్నడును భంగ మొందలేదు' అని చెప్పగలవారు ఇప్పటికిని ఉన్నారు.

పక్షి ఎగిరి పోయిపోయి ఒకఉన్నతినిచేరినప్పుడు అందుండి అది క్రిందిభూమివైపు అత్యంతశాంతముతో వీక్షించును. ఆస్థా యిని మీరందుకొన్నారా! అందుకొననివానికి ఒరులకుపదేశించు నర్హత లేదు. మీకాలుసేతులను సడలించుకొండి. ప్రవాహము వెంబడి తేలిపొండి. గమ్యమును తప్పక చేరుకొందురు!

ఇచ్చట క్రమక్రమముగ చలి తగ్గుచున్నది. ఇంచుమించు చలికాలము పూర్తిగా గడపివేసితిని, ఇచ్చట చలికాలములో

శరీరమంతటను విద్యుచ్ఛక్తి ప్రసరించును, చేతులు ఆడించి నప్పుడు ఒక "తాకు" (షాక్) కలిగిన ట్లగును. వెంటనే శబ్దము వినవగును. వ్రేలుతగిలిన చో గాలి వెలుగును. చలివిషయమై నీకు ఇంతకుమునుపే వ్రాసితిని. ఈదేశమం దంతటను పర్యటించు చున్నాను. కాని చికాగో నా "మఠము". పర్యటనల కనంతరము అచటికే చేరుకొనుచుందును. నే నిపుడు తూర్పునకు బయలుదేఱు చున్నాను. నాక ఏ ఒడ్డు చేరుకొనునో భగవంతు డెఱుగును....

దశు ప్రేమ నీపై నట్లే యున్నదా? నీయొద్ద కాతడు తఱచు వచ్చుచుండునా? భవనాథు డెట్లున్నాడు? ఆత డేమి చేయుచున్నాడు? అతనిని నీవు చూచుచుందువా? అతనిని గౌరవ దృష్టితో చూతువా? ఔను, సోదరా, సన్న్యాసికిని గృహస్థు నకును భేదము మిథ్య. "మూకం కరోతి వాచాలం" "మూగ వానిని వాచాలుగాగ జేయు" ఇత్యాది. ఒక ప్రత్యేకవ్యక్తిలో ఏ మున్నదో నిర్ణయించుట కష్టము. శ్రీరామకృష్ణుడు అతనిని గుఱించి గొప్పగా చెప్పియున్నాడు. మనగౌరవము నందుట కాత డర్హుడు. ఇంతయనుభూతికి తర్వాత సైతము నీకు విశ్వాసము పుట్టకున్న — ఛీ! నీపై నతనికి ప్రేమయున్నదా? హృదయ పూర్వకములైన నా ఆదరానురాగములను అతని కందింపుము. కాళీకృష్ణబాబుకు నాప్రేమ. అతడు మహోదారుడు. రామలా లెట్లున్నాడు? అతని కించుక శ్రద్ధయు, భక్తియు కల్గినవా? అత నికి నాసానురాగాభినందనములు! సన్న్యాలకు తనయంత్ర ముతో కాలము సుఖముగా గడచిపోవుచున్న దనుకొందును. ఓపికపట్టు మని అతనితో చెప్పుము. యంత్రముపని సక్రమముగా సాగిపోవును.

మీ కందఱకు నా హృదయపూర్వకమైన ప్రేమ.

సదా భవదీయప్రేమయుత
వివేకానంద

## 146

(శ్రీ అఖండానందస్వామికి)

ఓమ్ నమోభగవతే శ్రీరామకృష్ణాయ

—1894.

ప్రియ అఖండానందా,

నీజాబు నందుకొని మిగుల సంతోషించితిని. ఖేత్రిలో నుండుటవలన నీయారోగ్యము విశేషముగ తిన్నబడిన దని తెలిసి పరమానందభరితుడ నైతిని.

సోదరుడు తారకుడు మదరాసులో చాలపనిచేసినాడు. చాలప్రియవార్త, నిజము. అతనిని చాల మెచ్చుకొనుచు మదరాసువా రన్నమాట విన్నాను.

రాజపుత్రస్థానమున వేర్వేఱుతావులలోవసించు ఠాకూరులందు ఆధ్యాత్మికపరతను వదాన్యతను పెంపొందింప ప్రయత్నింపుము. మనము నడుముకట్టి పనిచేయవలెను. ఊరక కూర్చుంటిమేని ఆపని నెఱవేఱదు. అప్పు డప్పుడు మల్సిసారుకు ఆల్సిసారుకు అచ్చట నున్న తక్కిన "సారు" లకు ప్రయాణము చేయు చుండుము. సంస్కృతమును ఆంగ్లమును జాగ్రత్తగా నేర్చుకొనుము. గుణనిధి పంజాబులో నున్నా డనుకొందును. నాప్రత్యేక ప్రేమను తెల్పి అతనిని ఖేత్రికి గొనిరమ్ము. అతనియొద్ద సంస్కృతమును నీవు నేర్చుకొనుము. అతనికి నీవు ఇంగ్లీషు నేర్పుము. ఏవిధముగా నైనను అతని చిరునామాను తెల్పుము...

ఖేత్రీపట్టణములో పేదవారును ఇతరనిమ్నకుటుంబముల వారును ఉండు వీధులలో ఇంటింటికి పోయి మతమును బోధింపుము. భూగోళశాస్త్రము వంటి విషయములను వారికి పాఠము చెప్పుము. పేదల కించుకేని మేలు చేయజాలక, సోమరితనముతో చతికలబడి రాజభోజనము చేయుచు "శ్రీరామకృష్ణా, ఓప్రభూ," అను చుండిన లాభము లేదు. అప్పుడప్పుడు ఇతరగ్రామములకు పోయి జీవితకళలను మతమును ప్రజలకు బోధింపుము. కర్మము,

తర్వాత భక్తి, జ్ఞానము. తొలుత కర్మము నాచరింపుము. చిత్తశుద్ధి కల్గును. అట్లు కానిచో అగ్నిలో గాక బూడిదలో చేసిన హోమమువలె అంతయు వ్యర్థమగును. గుణనిధి రాగానే రాజపుత్రస్థానమున పేదవారును దిక్కులేనివారు నుండు ప్రతిపల్లెలోను ఇంటింటికి పోయి చూడు. నీవు తిను ఆహారము ప్రజలకిష్టము కాదేని దానిని తక్షణమే పరిత్యజింపుము. పరహితాచరణ జీవితమునకై గడ్డి తిన్నను మేలే. భోగానుభవమునకు కాదు కాషాయాంబరధారణము! అది వీరోచితకర్తవ్యపతాక! నీశరీరమును నీమనస్సును నీవాక్కును జగద్ధితమునకై సమర్పింపుము. "మాతృదేవో భవ" "తల్లిని దైవముగ ఆరాధింపుము" "పితృదేవో భవ" "తండ్రిని దైవముగ ఆరాధింపుము" అను వాక్యములు నీవు చదివినవే. "దరిద్రదేవో భవ" "దరిద్రుని దైవముగ ఆరాధింపుము" "మూర్ఖదేవో భవ" "మూర్ఖుని దైవముగ ఆరాధింపుము" అని నేనందును. పేదలు నిరక్షరాస్యులు అజ్ఞులు బాధితులు— వీరే నీ దైవము లగుదురు గాక. వీరిసేవయే మహోన్నతధర్మ మని తెలిసికొనుము.

ఆశీస్సులతో,

సదా భవదీయ
వివేకానంద

## 147

(శ్రీ అళసింగపెరుమాళుకు)

541, డియర్బారన్ అవెన్యూ,
చికాగో,
—1894.

ప్రియ అళసింగా,

నీయుత్తరము ఇప్పుడే అందినది.... నేను పంపిన పత్రికాఖండములను ప్రచురింపు మంటినే అది పొరపాటు. నేను చేసిన

పెద్ద తప్పులలో ఇదొకటి. ఆక్షణమున నుండిన దుర్బలతకు ఇది సూచనము. రెండు మూడేండ్లు ఉపన్యాసములు చేసి ఈదేశములో ధనము గడింపవచ్చు. కొంత ప్రయత్నించితిని. నాకృషి ప్రజాప్రశంస నధికముగా పడసినది. ఐనప్పటికిని అది నాప్రకృతికి పూర్తిగ విరుద్ధముగను నీతిని చెడగొట్టునదిగను ఉన్నది...

భారతీయపత్రికలను గుఱించి అందలి విమర్శలనుగుఱించి నీవు వ్రాసినదానిని చదివితిని. అవి సహజములే. ప్రతి బానిస జాతికిని ప్రధానదోషము ఈర్ష్య. దాస్యమును పుట్టించునదియు స్థిరపరచునదియు ఈ ఈర్ష్యయు ఈఅనైకమత్యమునే. ఇండియా నుండి వెలుపలికి వచ్చినగాని ఇందలి సత్యము నీయనుభవమునకు రాదు. పాశ్చాత్యుల విజయమునకు కీలకము వారిసంఘీభావ శక్తియే. అందుకు మూలము వారి పరస్పరగుణగ్రహణమును పరస్పరవిశ్వాసమును. దేశమున దౌర్బల్యమును భయమును హెచ్చు కొలది ఈదోషము మఱింత ప్రస్ఫుట మగుచుండును....కాని నాయనా, బానిసజాతినుండి ఏదియో యూడిపడు నని యెదురు చూడ రాదు. ఈవిషయమున ఆసపాటు ఇంచుమించు లేనే లేదనుట నిస్సంశయము. కాని దీనిని మీఅందఱియెదుట పెట్టనిండు. ఈసమూహము నిర్జీవము. నైతికాభిలాషలకు భావికాలసాధ్యములకు వలసిన చైతన్యము ఇంచుమించు లేనే లేని సమూహము; తమకు మేలుచేయబూనువారిమీదికే విఱుచుకపడువారి సమూహమిది. ఈముద్దలోనికి మీరు ప్రాణము పోయగలరా? ఎదురు తిరిగి తన్ను నటువంటి శిశువు గొంతులో మందు పోయ బూనుకొను వైద్యునిస్థానమును మీ రధిష్ఠింప గలరా?...విదేశములలో నున్నప్పుడు అమెరికనులు కాని యూరపియనులు గాని తమతమ దేశములవారికి సదా సాయము చేసికొనుచుందురు....మీకున్న అధికారము పాటుపడుటకే కాని ఫలములకు కాదని మరల నొకసారి జ్ఞాపకము చేయనిమ్ము. కొండవలె నిలబడుము. నిజము

సదా నెగ్గి తీరును. శ్రీరామకృష్ణుని బిడ్డలు స్వరూపానుగుణముగ ప్రవర్తింతురేని అంతయు బాగుపడును. ఫలము కంటపడువఱకు మనము జీవింపకపో వచ్చు. కాని మనమిప్పుడు జీవించియున్నా మనుట ఎంత నిజమో, నేడు గాకున్న రేపు ఫలము గల్గి తీరు ననుట అంత నిజము. దేశీయుల రక్తనాళములలో నూతనశక్తిని రేపగల అపూర్వమైన వైద్యుతికానలము నేడు భారతదేశమునకు అవసరము. ఈపని ఇంతకు మునుపును ఇకమీదనుగూడ మెల్లగా జరుగునదే. కర్తవ్యము నిర్వర్తించి సంతృప్తినందుము. అన్నిటి కంటె ముఖ్యముగ మీస్వరూపానుగుణముగ ప్రవర్తింపవలె. పవిత్రుడవుగ నుండుము. స్థిరుడవుగ నుండుము. ఆర్జవసంపన్ను డవుగ నుండుము. అన్నియును చక్కబడును. శ్రీరామకృష్ణుని అంతేవాసులలో గోచరించున దేమైన నున్న అది ఆత్యంతికమైన వారి త్రికరణశుద్ధియే. అట్టివారిని నూర్గురను తయారుచేసి భారత దేశమందు నిలుపజాలితినేని కృతకృత్యుడనైనట్లే. సంతోష ముతో ప్రాణములు విడువవచ్చు. ఆయన, భగవంతుడు అందఱి కంటె నెక్కువగ తెలిసినవాడు. అజ్ఞానులు అర్థరహితముగ ప్రలా పింతురు గాక. సాయమును మనము అర్థించుటయు లేదు, నిరా కరించుటయు లేదు. మనము పరాత్పరుని సేవకులము. క్షుద్రుల అల్పయత్నములు మనకు అలక్ష్యములు; పదండి ముందుకు! శీల మును నిర్మించుకొనుటకు యుగములకొలది పాటుపడవలెను. అధైర్యపడకుడు. సత్యమైన మాట ఒక్కటైనను దానికి నేసి ఎప్పుడును లేదు. యుగములతరబడి అది మంటలో మఱుగుపడి యుండవచ్చు కాని వెంటనే కాని అనంతరకాలమున కాని అది తన్ను చూపుకొని తీరును. సత్యము అవినాశ్యము. ధర్మము అవినాశ్యము. విశుద్ధి అవినాశ్యము. మతాంతరములకు మాఱిన వారి గుంపులు నాకక్కఱ లేదు. సరియైన వాని నొక్కని నిండు. నాయనా, పట్టువిడువకు. సాయమర్థించుచు, ఎవరిని కాని లక్ష్య పెట్టకు. మానవసహాయులందఱికంటె భగవంతుడు ఇంతంతనరా

నంత అధికుడు కదా. శుచివై యుండుము. భగవంతుని విశ్వసింపుము. సదా భగవంతునిపైనే ఆధారపడియుండుము. ఉంటేవేని నీవు సరియైనదారిలో నున్నట్లు. నీకు ప్రతికూలముగ నేదియు నెగ్గ జాలదు.

"దయామయా, జ్యోతిస్వరూపా, దారిచూపుమా—" అని ప్రార్థింతము గాక. చీకటిగుండ నొక కిరణము వెలువడును. నీకు దారి చూపుటకు ఒక చేయి చాపబడును. నేను సదా మీకై ప్రార్థింతును. మీరు నాకై ప్రార్థింపవలెను. పేదతికమునకు మతాచార్యకైతవమునకు నిరంకుశపాలనకు గుఱియై త్రొక్కబడుచున్న కోట్లకొలది భారతీయులకై మనలో ఒక్కొక్కర మును అహోరాత్రములు ప్రార్థింతముగాక. వారికై అహోరాత్రములు ప్రార్థింపుడు. ఉన్నతులకును సంపన్నులకును ధర్మబోధ చేయుటయందు నాకున్న శ్రద్ధకంటె ఇట్టివారికి ధర్మబోధచేయుట యందు నా కెక్కువ లక్ష్యము. నేను వేదాంతిని కాను, తార్కికుడను కాను, యోగిని కాను, కాని నేను పేదవాడను. పేదలపై నాకు ప్రీతి. ఈదేశమున పేదలను ఏమని పేర్కొనుచున్నారో వారిపై సానుభూతికలవా రెందఱో చూచుచున్నాను.

ఇండియాలోని పరిస్థితి ఇక్కడిపరిస్థితికంటె ఎంత అపారముగ భిన్నమైనది! దారిద్ర్యాజ్ఞాననిమగ్నులైన ఇరువదికోట్ల మహిళలకయ్యు మగవారికయ్యు "అయ్యో" అనువా రెవరు? విముక్తిమార్గ మేది? వారికై "అయ్యో పాపము" అనుకొనువా రెవరు? వారికి వెలుగుగాని విద్యగాని లభింపదు. వెలుగును వారియొద్దకు తెచ్చువా రెవరు? వారికి విద్యను గఱపుచు ఇంటింటికి ఎవరు పర్యటింతురు? ఈప్రజలే మీకు దైవములుగ నుండనిండు. వారిని తలంపుడు. వారికై పాటుపడుడు. నిరంతరము వారికై ప్రార్థింపుడు. భగవంతుడు మీకు దారిని చూపగలడు. పేదలకై ఎవని హృదయము రక్తమును కార్చునో అతనిని నేను మహాత్ముడందును. అట్లు కాకున్న అతడు దురాత్ముడే. వారిశ్రేయస్సుకై

మనము మనసంకల్పములను ఒక్కటిగా చేసికొని నిరంతరము ప్రార్థింతము గాక. ఎవరికిని తెలియకే ఎవరిచేతను అయ్యో పాపము అనిపించుకొనకే, ఏడ్చువా రెవ్వరును లేకే, దేనినిగాని సాధించుకొనకయే—మనము మరణింపవచ్చు. కాని ఒక్కతలం పైనను రిత్తపోదు. అది వెంటనేగాని అనంతరకాలమునగాని ఫలించును. మాటపిగులనంతగా నాహృదయము భావప్రపూర్ణమై యున్నది. అది మీకు తెలియును. మీరు దానినూహింపగలరు. కోట్లకొలది ప్రజలు ఆకలితో అజ్ఞానముతో జీవించుచున్నంత వఱకు, వారి శ్రమ ఫలితముగా విద్య గడించి వారి నించుకేని లక్ష్యపెట్టనట్టి ప్రతియొక్కనిని నేను ద్రోహి అందును. పేదలను పీడించి తమసకలధనమునుగడించి నిగనిగనియుడుపులతో నిక్కుచు సంచరించువారిని ఆకలితో మలమలమాడుచు అడవిమనుష్యుల కంటెఇంచుకేని మేలైనదశలో లేనటువంటి ఇరువదికోట్లప్రజలకు ఎట్టిఉపకారమును చేయకుండునంతవఱకు దౌర్భాగ్యు లందును. సోదరులారా, మనము పేదలము. మనము అకించనులము. కాని పరాత్పరునికి ఉపకరణములుగ నుండినవారు సదా అట్టివారే. భగవంతుడు మిమ్మెల్లర ననుగ్రహించును గాక.

సమస్త ప్రేమతో,

వివేకానంద

## 148

(ధర్మపాలునికి)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
1894.

ప్రియ ధర్మపాలా,

కల్కత్తాలోని నీచిరునామాను నేను మఱచిపోయితిని. కావున ఈ జాబును మఠమునకు వ్రాయుచున్నాను. కల్కత్తాలో

నీవు కావించిన ఉపన్యాసములను గూర్చి వానిమహాద్భుతఫలితము లనుగూర్చి నేను విన్నాను. ఇచట పదవినుండి విరమించుకొన్న క్రైస్తవమతప్రచారకు డొకడు సోదరా అని సంబోధించుచు నా కొక జాబువ్రాసి అందుకు సంక్షిప్తముగ నేనుపల్కిన ప్రత్యుత్తరమును ప్రకటింతునని చాల తొందరపడి ఆడంబరము కావించెను. కాని అట్టివారిని గూర్చి ఇచ్చటి ప్రజ లేమనుకొందురో నీ వెఱుగుదువు. ఆమతప్రచారకుడే నాతో మైత్రి నెరప వలదని చెప్పుటకై నామిత్రులలో కొందఱియొద్దకు రహస్యముగ నేగెను. ప్రజలందఱు అతనిని ఏవగించుకొనిరి లెమ్ము. మతప్రచారకుడు అట్టికృత్రిమమునకు పూనుకొన్నప్పుడు అతనినడవడికి నేను మిక్కిలి ఆశ్చర్యపడితిని. ప్రతిదేశములోను ప్రతిమతములోను అట్టి కృత్రిమములు మిక్కుటముగ నుండుట దురదృష్టము. క్రిందటి చలికాలమున, చలిగాలి చాలదుర్భరముగనున్నను నే నీ దేశమున ఎంతో పర్యటనము గావించితిని. అది భయంకరముగ నుండు ననుకొంటిని గాని నాకది అంతభయంకరముగ లేనే లేదు. స్వేచ్ఛామతసంఘాధ్యక్షుడగు కర్నలు నెగ్గిన్సను నీ జ్ఞాపకములో నున్నాడు కదా ? ఆయన చాల ఆదరముతో నిన్ను గూర్చి అడుగుచుండును. నేను మొన్న ఇంగ్లండులో ఆక్స్ఫర్డువాడగు డాక్టరు కార్పెంటరును కలసికొంటిని. ప్లిమత్తులో నతడు బౌద్ధమందలి నీతిశాస్త్రమునుగుఱించి ఒక ఉపన్యాసము కావించెను. ఆఉపన్యాసము చాల సానుభూతి సంపన్నముగను పాండిత్యమండితముగను ఉండినది. నిన్నుగూర్చి నీపత్రికనుగూర్చి ఆయన విచారించినాడు. ఉదాత్తమైన నీ కార్యము నెగ్గు నని నా ఆశ. బహుజనహితమునకయ్యు బహుజనసుఖమునకయ్యు అవతరించిన వాని కనుఋపుడైన కింకరుడవు నీవు.

...భారతదేశములో బోధింపబడు క్రైస్తవమతము ఇందు కనబడుచున్న క్రైస్తవమతమునకంటె పూర్తిగా భిన్నమైనది. ధర్మపాలా, ఈదేశములో ఎపిస్కోపల్ ప్రెస్బిటేరియన్ చర్చిలకు

సంబంధించిన క్రైస్తవమతాచార్యులలో 'నాకు మిత్రులు కల రని విన్నప్పుడు నీ వాశ్చర్యపడుదువు. ఈ క్రైస్తవమతాచార్యులు విశాలదృక్పథము కలవారు. నీ మతములో నీ వెంత ఋజువుగ ఎంత ఉదారుడవుగ ఎంతధారాళతకలవాడవుగనున్నావో వారును తమ మతమున అంత ఋజువుగ అంత ఉదారులుగ అంత ధారాళతకలవారుగ నుందువారే. వాస్తవమైన ఆధ్యాత్మికపరత కల వాడు సర్వత్ర విశాలదృష్టికలవాడే. అట్లుండు మని అతని ప్రేమయే అతనిని నిర్బంధించును. ఎవరికి మత మొక వ్యాపారమో, వారు మతములోకూడ లౌకిక కలహాస్పర్థ స్వార్థవిధానములను జొనిపి వానినిర్బంధముచే తాము సంకుచితచిత్తులుగను తుంటరులుగను నగుదురు.

సదా సోదరప్రేమయుత భవదీయ
వివేకానంద

## 149

(శ్రీ అళసింగపెరుమాళుకు)

అమెరికా సంయుక్తరాష్ట్రములు,
1894.

ప్రియఅళసింగా,

ప్రాతకథ విను. సోమరిత్రిమ్మరి యొకడు వీథిలో తచ్చాడుచు ఒకయింటివాకిట కూర్చున్న వృద్ధునిగని ఒకానొకచోటును గూర్చి "అ దెక్కడ" అని అతని నడుగుటకై నిలిచెను. "ఆచోటు ఎంత దూరమున నున్నది" యని యడిగెను. వృద్ధు డూరకుండెను. ఆసోమరి అదే ప్రశ్నను పలుసా ర్లడిగెను. అడిగినను జవాబు లేదు. విసుగెత్తి అతడు వెడలిపోవుద మని తిరిగెను. అప్పు డా వృద్ధుడు లేచి "ఆగ్రామ మిచ్చటికి మైలుదూరమున

నున్నది'' అనెను. ఆసోమరి ''ఏమీ! ఇంతకుముందు నే నడిగి నప్పుడు నీ వేల మాటాడలేదు?'' అని అడిగెను. ''అప్పుడు నీ వంతగా ఆగిపోయి, ముందుకు సాగువిషయమున అక్కఱతే లేకుంటివి. ఇప్పుడు నీకు చురుకుపుట్టి వెడలిపోవుచున్నావు. కావున నాయొద్ద ప్రత్యుత్తరము పడయు హక్కు నీకు కలిగినది.'' అని వృద్ధుడు చెప్పెను.

నాయనా, ఈకథ జ్ఞప్తియం దుంచుకొందువా? పనికి నడుముకట్టు, తక్కినది సిద్ధించును. ''అనన్యులై నన్ను చింతించుచు ఏజనులు పర్యుపాసింతురో నిత్యాభియుక్తులైనట్టి వారి యోగక్షేమ (భార) మును నేను వహింతును.'' (గీత IX-22) ఇది కల గాదు.

...ప్రస్తుతకాలమున కర్మముఅనగా ''ఉపదేశ'' ''సేవా'' మార్గమున నుండవలెను. సమావేశమునకు ఒకచోటును ఎన్నుకో. అక్కడ మీరందఱు ప్రతివారము సమావిష్టులై పూజను సవ్యాఖ్యానములైన ఉపనిషత్తులపారాయణమును చేయుడు. ఇట్లు మెల్లగా నేర్చుకొనుచు పాటుపడుచు ముందుకు పొండి. చక్రమునకు భుజములను పూంతురేని సమస్తమును మీకు సిద్ధించును....

ఇప్పుడు పనికి నడుముకట్టు. జి. జి. ప్రకృతి భావోద్రేకపరము. నీకు సమబుద్ధి యున్నది. కావున కలిసి పనిచేయుడు. మునుగుడు. ఇది కేవలము ప్రారంభమే. ప్రతిదేశమును తన్ను తానే కాపాడుకొనవలెను. హిందూధర్మపునరుద్ధరణమునకు మనము అమెరికానుండి లభించు ధనముపై ఆధారపడియుండ కూడదు. ఏలన అది భ్రాంతి. కేంద్ర మొకటి యుండుట గొప్ప విషయము. మదరాసువంటి యొక మహాపట్టణములో అట్టి చోటును సంపాదించుటకు ప్రయత్నింపుము. అందుండి అన్ని వైపులకు ప్రాణశక్తిని ప్రసరింపజేయుచుండుడు. మెల్లగ ప్రారంభింపుడు. కొందఱుగృహస్థప్రచారకులతో ప్రారంభింపుడు. క్రమ

ముగా తమ యావజ్జీవితములను ఈపని కర్పించునట్టి ఇతరులును వత్తురు. శాసకుడవుగ నుండ జూడకుము. చక్కగ సేవింప నెవడు సమర్థుడో శ్రేష్ఠశాసకుడును అతడే. మరణము మూడి నను సత్యపరులుగ నుండుడు. మనకు కావలసినది పని. మనకు ధన మక్కఱలేదు. పేరుప్రతిష్ఠ లక్కఱ లేదు...ధీరులుగ నుం డుడు....ఈయుద్యమమునకు ధనము ప్రోగుచేయువిషయమున మదరాసుప్రజలకు ఆసక్తి కల్గింప ప్రయత్నింపుము. తర్వాత ప్రారంభింపుము....సమగ్రనిస్స్వార్థతకలవాడవుగ నుండుము. నీకు విజయముతప్పక చేకూరును....పనిలో స్వాతంత్ర్యమును కోల్పో వక యే, నీకు పై వారుగ నుండువారి నెల్లవిధముల గౌరవింపుము. సామరస్యముతో పాటుపడుడు....తమపనిని సాధించుటకై అవ శ్యక మగుచో చిచ్చులోనికైన నుఱుకుటకు నాబిడ్డలు సంసిద్ధులై యుండవలెను. ఇప్పుడు పనిచేయుడు! పనిచేయుడు! పనిచేయుడు! తర్వాత మనము ఆగి మన జ్ఞాపికలను పోల్చిచూచుకొందము. శాంతి, దీక్ష, పవిత్రత కలిగియుండుడు.

హిందూమతమును గూర్చి ఇప్పుడే నేను ఏగ్రంథమును వ్రాయుట లేదు. నాభావములను ఊరక వ్రాసియుంచుకొను చున్నాను. వానిని ప్రకటింతునో ప్రకటింపనో ఎఱుగను, పుస్తక ములలో ఏ మున్నది? ప్రపంచములో వెఱ్ఱివిషయములు ఇప్పటికే నిండుగ నున్నవి. వేదాంతమార్గమున మీ రొకపత్రికను ప్రారం భింప గల్గినచో అది మనలక్ష్యమును కొనసాగించును. నిశ్చయ యుతులరై యుండుడు. ఇతరుల గుణదోషముల నెన్నకుడు. మీ సందేశము నిండు. మీరు బోధింపవలసినదానిని బోధింపుడు. అంతటితో ఆపుడు. తక్కినది భగవంతున కెఱుక....

వార్తాపత్రికలను ఇక నాకు పంపకుడు. ఏలయన నన్ను గూర్చిన క్రైస్తవప్రచారకుల విమర్శలను నేను లక్ష్యపెట్టను. అందుకే ఇచ్చటి ప్రజలకు నాయం దధికగౌరవము.

...నిజముగ మీరు నాబిడ్డ లగుచో దేనికిని భయపడరు. ఎక్కడను ఆగరు. సింహములవలె నుందురు. మీరు భారతదేశ మును యావత్ప్రపంచమును మేలుకొల్పవలెను. పిఱికితనము కూడదు. "కా"దన్న మాటను నేను చెవిలో వేసికొనను. తెలిసినదా! ప్రాణముపోయినను సత్యపరులుగ నుండుడు...... ఇందలి కీలకము గురుభక్తి. ప్రాణమర్పించి యైనను గురునందు భక్తి నెఱపుట! అట్టిభక్తి మీ కున్నదా? ఉన్న దని నేను నా హృదయపూర్వకముగ నమ్ముచున్నాను. మీయందలి నా విశ్వా సము మీ రెఱుగుదురు. కావున పనికి నడుముకట్టుడు. మీరు తప్పక గెల్పొందవలెను. నాప్రార్థనలు నాఆశీస్సులు అడుగడుగు నను మిమ్ము వెన్నంటి యుండును. సామరస్యముతో పాటు పడుడు. అందఱియెడను శాంతి వహించి యుండుడు. అందఱికి నా ప్రేమ కలదు. మీపై కన్నుంచి యున్నాను. పదండి, ముం దుకు పదండి. ఇది కేవలము ప్రారంభమే. ఇచ్చట నేను చేయు చిన్న పని భారతదేశమున బ్రహ్మాండముగ ప్రతిధ్వనించును. తెలిసినదా! కాబట్టి నేను తొందరపడి అక్కడికి మరలి రాను. ఇచ్చట శాశ్వతమైన పనిని దేనినైన చేయవలె నని నాసంక ల్పము. అందుకై రాత్రింబగళ్లు పాటుపడుచున్నాను. అమెరికను ప్రజలవిశ్వాసమును నానాటికి హెచ్చుగ గడించుచున్నాను.... మీ డెందములను మీఆశలను ఈవిశ్వమంత విశాలములైనవిగ చేసికొనుడు. సంస్కృతమును చదువుడు. ముఖ్యముగ వేదాంత సూత్రములమీది మూడుభాష్యములను చదువుడు. సంసిద్ధులరై యుండుడు. ఏలయన రాగలకాలమునకు పెక్కు ప్రణాళికలు నా కడ నున్నవి. ఆకర్షకవక్తలుగ నగుటకు ప్రయత్నింపుడు. ప్రజల విద్యుదుత్తేజితుల నొనర్పుడు. విశ్వాసమున్న మీకు సమస్తమును సమకూడును. అట్లని కిడితో చెప్పుము. నిజమునకు అచ్చటనున్న నా బిడ్డలందఱితో చెప్పుము. కాలము వచ్చినప్పుడు వారు ఘన కార్యము లొనర్తురు. వానిని కనిన లోకు లాశ్చర్యపడుదురు.

ధైర్యము వహించి పాటుపడుము. నీవు చేసిన దానిలో కొంత భాగము నాకు చూపు. ఒకగుడిని ముద్రణాలయమును పత్రికను వాసగృహమును నాకు చూపుము. మదరాసులో నాకొకవాస స్థానమును ఏర్పఱుపలేవేని నే నెచ్చటికి వత్తును ? ప్రజలను విద్యుదుత్తేజితుల నొనర్పుము. ధనము గడింపుము, బోధింపుము, నీవు నియమించుకొన్న పనిలో సత్యపరుడవుగ నుండుము. ఇప్పటి వఱకు నీలో మంచి అభివృద్ధి సూచనలు కననగుచున్నవి. ఇట్లే సాగిపో.' ఇంకనింకను పై మెట్లను సాధింపుము.

...ప్రజలతో పోరాడకు. ఎవనినిగాని పగవానినిగా చేసి కొనకు. జాకును జానును క్రైస్తవులుగ మాఱినచో మనము దాని నేల లక్ష్యపెట్టవలెను ?...వారికి సరిపడిన ఏమతమునైనను వారనుసరింతురు గాక ! కలహములలో నీవు కాలుంచు టెందులకు? ప్రతియొక్కని భిన్నాభిప్రాయములకును ఓర్చుకో. శాంతియు, దీక్షయు, పవిత్రతయు విజయ మొందును.

భవదీయ
వివేకానంద

## 150

(శ్రీ ఖేత్రీమహారాజావారికి)

అమెరికా,
1894.

..."ఇంటిని గృహ మనరు. ఇల్లాలిని గృహ మందురు (న గృహం గృహ మి త్యాహుః గృహిణీ గృహ ముచ్యతే)" అనినా డొక గీర్వాణకవి. ఆమాట ఎంత సత్యము ! ఎండనుండి చలినుండి వాననుండి నిన్ను కాపాడు నింటి విలువను దాని ఆధార స్తంభములనుబట్టి—అవి అత్యంతరమణీయములైన కొరిన్తియను

స్తంభములైనను సరే — నిర్ణయింప రాదు. ఇంటికి నిజమైన ప్రాపును నిజమైన ఉత్సాహ స్తంభమును కేంద్రస్థానీయురాలును అగు ఇల్లాలినిబట్టి నిర్ణయింపవలెను. ఆప్రమాణమునుబట్టి చూతు మేని అమెరికను గృహము ప్రపంచములో ఏగృహమునకును తీసిపోదు.

స్వేచ్ఛ విశృంఖలత్వముగ పరిణమించిన దనియు, ఆడు తనము లేని ఆడువారు తమ స్వాతంత్ర్యోన్మాద వర్తనములో కుటుంబజీవితసుఖశాంతులను తమకాళ్లక్రొక్కిళ్లక్రింద నలిపివైచు చున్నా రనియు, అటువంటి వెఱ్ఱికథల నెన్నిటినో అమెరికను కుటుంబములనుగూర్చి నేను వినియున్నాను. అమెరికను కుటుంబ ములనుగూర్చియు అమెరికను మహిళలనుగూర్చియు ఒక సంవ త్సరకాలపు అనుభవము కలిగిన పిమ్మట ఆమునుపటి నిర్ణయములు ఎంత అసత్యములో అసంగతములో స్పష్టముగ తెలిసినది! అమెరి కను మహిళలు! వారికి నాకృతజ్ఞతాఋణమును తీర్చుకొనుటకు నూఱుజన్మములైనను చాలవు. మీకు నాకృతజ్ఞతను తెలుపగల మాటలు నాయొద్ద లేవు. ప్రాచ్యదేశీయులకృతజ్ఞతాప్రగాఢ తను తెలుపగలది ప్రాచ్యదేశీయుల అతిశయోక్త్యలంకార మొక్కటే.

—"హిందూమహాసముద్రమే సిరాబుడ్డిగను మహోన్నత పర్వతమగు హిమాలయమే కలముగను, భూమియే పత్రముగను కాలుడే రచయితగను ఐనప్పటికిని నీ పట్ల నాకృతజ్ఞతను మాట లలో తెల్పజాలను."*

క్రిందటి సంవత్సరము వేసవిలో నే నీ దేశమునకువచ్చితిని. అప్పుడు నేను దూరదేశమునుండి వచ్చినవాడను. వీధిద్రిమ్మరినైన మతబోధకుడను. యోగ్యతలుగా గణింపబడుటకు నాకు పేరులేదు, కీర్తి లేదు, విత్తము లేదు, విద్య లేదు, మిత్రులు లేరు, తోడు

* శివమహిమ్న స్తోత్రమున 32-వ శ్లోకమునకు ఛాయ.

లేదు, ఇంచుమించు దిక్కులేని దశలో నుంటిని. అమెరికను మహిళలు నాయందు నెయ్యము దాల్చి నీడ నిచ్చి అన్నము పెట్టి తమ యిండ్లకు చేర్చుకొని వారిసొంత కుమారునివలెను సొంత సోదరుని వలెను నన్నాదరించిరి. "అపాయకరుడగు ఈమతహీనుని పరిత్యజింపుడు" అని వారిమతగురువులే వారిని ప్రోత్సహింపప్రయత్నించుచుండిరి. "ఈవిదేశీయుడు అపత్కరమగు శీలముకలవాడుగ నుండ వచ్చు. అజ్ఞాతుడగు ఇతని పక్ష మవలంబింపకుడు" అని వారి వరిష్ఠమిత్రులు వారికి ప్రతిదినమును చెప్పుచుండిరి. ఐనను వారు నాసఖులుగనే ఉండిరి. ఆత్మను శీలమును ఇతరుల కంటె మిన్నగ గుర్తింపగలవారు వారు. ఏలయన స్వచ్ఛమైన అద్దములో కదా ప్రతిబింబము కనపడునది.

ఎన్ని చక్కనికుటుంబములను నేను చూచితిని! అనిర్వచనీయమైన శీలవిశుద్ధియు తమశిశువులపట్ల నిస్స్వార్థప్రేమయుగల తల్లులను ఎందఱను నేను చూచితిని! అధిక సంస్కృతియు విద్యయు మహోన్నతమైన పారమార్థికపరతయు కలిగి డయానా గుడిపై నున్న మంచుకడ్డీనిపోలిన స్వచ్ఛతగల కన్నెలను కూతుంద్రను ఎంతమందిని చూచితిని! అప్పటికి, స్త్రీలుగా రూపొందిన ఆకాశగమన సామర్థ్యములేని – దేవదూతలతో మాత్రమే నిండి యున్నదా అమెరికా? ప్రతిచోటను మంచియు ఉండును. చదుగును ఉండును. నిజమే. కాని ఒకదేశపు విలువను దుర్జను లనబరగు అందలి అసమర్థులను బట్టి నిర్ణయింపరాదు. ఏలయన వారు వెనుకజిక్కియుండు చీడపురుగులు. దేశపు విలువను అందలి మంచివారిని ఉదాత్తులను పవిత్రులను బట్టి నిర్ణయింపవలెను. దేశ జీవితవాహిని స్పష్టముగను ప్రబలముగను ప్రవహించుచుండుటను వారు సూచింతురు. పక్వముగాక పెరుగక పురుగులు తిన్న ఆపిలుపండ్లు ఒక్కొక్కప్పుడు లెక్కకు మిక్కిలిగ నేలపై రాలి కనిపించినను ఆపిలుచెట్టు విలువను దాని పండ్లరుచిని వీనిని బట్టి నీవు నిర్ణయింతువా? చక్కగా ఎదిగి బాగుగా పండిన పండు

ఒక్కటి ఉండునేని ఆపిలు చెట్టునకుగల శక్తులను అవకాశములను ప్రయోజనమును ఆ పండొక్కటే సూచించును గాని పిందెదశను దాటలేని కాయలు నూర్లకొలదిగ నున్నను అవి సూచింపజాలవు.

ఇక ఆధునిక కాలపు అమెరికను మహిళలు—వారి విశాలోదారచిత్తములను నేను కొనియాడుదును. విశాలోదారచిత్తులగు మగవారినికూడ పెక్కండ్రను ఈ దేశములో చూచి యున్నాను. వారిలో కొందఱు చాలసంకుచితదృష్టిగల చర్చిలకు చెందినవారు. కాని ఉన్న భేద మిది. మగవారు విశాలహృదయులు కావలె నన్నచో మతమును పారమార్థికపరతను పోగొట్టుకొనవలసియుండును. మహిళలు తమమతములో లవలేశమునైనను కోల్పోక ఎల్లెడలనుండు మంచివిషయము లన్నింటియందును సానుభూతి చెందు హృదయవైశాల్యము నొందగలరు. కావలసినది ఔననుటయే కాని కాదనుట కాదనియు, కూడికయే కాని తీసివేత కాదనియు...' వారు తమ మనఃప్రబోధముచేతనే యెఱుగుదురు. ప్రతివిషయములోను ఔననెడిభాగమును వాస్తవమైన భాగమును భద్రపఱుపబడు ననియు, ప్రకృతిలో ఆత్మనిర్మాణశక్తులగు వానిని కూడబెట్టుటయే ప్రపంచమునందలి "వ్యతిరిక్త" "సంహారక" భాగములను రూపుమాపు ననియు వారు దినదినమును గుర్తెఱుగుచున్నారు.

చికాగోలో జఱుప బడిన ఆవిశ్వవిపణి (వరల్డుఫేర్) ఎంతటి అద్భుతమైనది! భూమండలమందలి ప్రతిమూలలోని వారును తమ మతాశయములను ప్రకటించిన — మహాద్భుతమైన ఆవిశ్వమత మహాసభ! డాక్టరు బర్రోసుగారి (శ్రీ) బానీగారి-కృపచే నాఆశయములను ఆసభ కెదుట పెట్టుటకు నాకును అనుమతి కలిగినది. (శ్రీ) బానీ అంతటి మహాద్భుతపురుషుడు. ఆమహత్తర కార్యక్రమమును పన్నాగించి అత్యంత విజయముతో నెఱవేర్చిన ఆప్రతిభను ఆలోచింపుడు. అన్ని మతాలవారు సమావేశమైన ఆసద

స్సుకు అధ్యక్షత వహించిన శ్రీ బాసీ న్యాయవాదియే కాని మతాచార్యుడు కాడు. మాధుర్యము, పాండిత్యము, శాంతి గల అతని ఆత్మ అంతయు ఉజ్జ్వలములైన అతనికన్నులగుండ తన్ను తెలుపుకొనుచుండినది......

భవదీయ
వివేకానంద

## 151

(శ్రీ శివానందస్వామికి)

అమెరికా సంయుక్తరాష్ట్రములు,
1894.

ప్రియ శివానందా,

నీజాబు నా కిప్పుడే అందినది. ఈపాటికి నా తక్కినజాబులు నీకు చేరియుండును. అమెరికాకు నిక నెవ్వరిని పంప నక్కఱలేదను సంగతి నీకు తెలిసియుండును. ఎందులో గాని మితిమీఱుట చెఱుపు. వార్తాపత్రికల యందలి ప్రకటనలమూలముగా నాకు జనప్రీతి గల్గినది. సందేహము లేదు. కాని దాని ప్రభావము ఇక్కడకంటె ఇండియాలో హెచ్చుగ నున్నది. ఇక్కడ నిరంతర ప్రశస్తి పైతరగతులప్రజల చిత్తములలో వెగటును పుట్టించును. కావున చాలును. ఈసమావేశముల మార్గముననే ఇండియాలో మిమ్ము అంగక్రమముతోడి యొకసంస్థగా ఏర్పఱచుకొన ప్రయత్నింపుడు. ఈదేశమునకు ఇక మీ రేమియు పంప నక్కఱలేదు. ఇక పైకము విషయము — మాతృశ్రీ*కి ఒకయింటిని మొదట నిర్మింపవలె నని నేను నిశ్చయించుకొంటిని. ఏల యన ఇల్లు మొదట కావలసినది మహిళలకే....అమ్మ కొఱ కొక చోటేర్పఱచు

* శ్రీ శారదామణీదేవి.

టకు ఇంచుమించు 7,000 రూపాయలు పంపగలను. మొదట చోటు సంపాదింపబడినచో ఇక వేఱేదియు నాకు లక్ష్యము లేదు. నేను ఈ దేశమును విడిచివచ్చినపిమ్మటకూడ ఇక్కడినుండి నాకు ప్రతిసంవత్సరము 1,600 రూపాయలు వచ్చుచుండు నని నా నమ్మకము. ఆమొత్తమునునేను ఆమహిళల శరణాలయపోషణకు ఇచ్చివేసెదను. అది వర్ధిల్లుచుండగలదు. ఒకచోటును సంపాదింపుమని నీకు ఇంతకుమునుపే వ్రాసియున్నాను....

దీనికిని ముందే నేను ఇండియాకు మరలి వచ్చియుందును. కాని ఇండియాలో ధనము లేదు. రామకృష్ణపరమహంసయందు గౌరవము గలవారు వేలకొలదిగ నున్నారు గాని దమ్మిడీనైనను ఇచ్చువాడు ఒక్కడును లేడు. అట్టిది ఇండియా....ఈలోగా ఏమైనను సరే, ఒద్దిక గల్గి యుండుడు. ప్రపంచము మనుష్యుల నాదరించునేగాని సిద్ధాంతముల నాదరింపదు. తమకు నచ్చినవాడు ఎంతటి వెఱ్ఱిప్రసంగము చేయుచుండినను లోకు లోపికతో వినుచుందురు. తమ కిష్టపడని వాని మాటలను వారు వినరు. ఈవిషయమును మనసులో పెట్టుకొని ఇందుకు తగినట్లు మీప్రవర్తనను దిద్దుకొండి. అన్నియు చక్కబడును. భవిష్యత్కాలమున ప్రభువుగా కావలెనని కోరువాడేని ఇప్పుడు సేవకుడవుగనుండుము. ఇదే నిజమైన మర్మము. మీమాటలు కటువులుగ నుండినను మీప్రేమ తెలియ నగుచునే యుండును. ప్రేమ ఎటువంటి భాషలో పొదుగ బడియున్నను మానవులు దానిని తమ సహజావబోధముచే గుర్తింపగలరు. †

నాప్రియసోదరా, పరమహంస శ్రీరామకృష్ణుడు భగవంతు నవతారమే. ఆవిషయమున నా కించుకయు సందేహము లేదు. కాని ఆయన బోధనలను ప్రజలు తమంతట కనుగొనుటకు

---

† ఈరెండు "పేరా"లను వాల్గవ పేరాలో రెండవసగమును మూలములో కలదు.

మీ రవకాశ మీయవలెను. ఈవిషయములను వారి నెత్తిని మీరు రుద్ద కూడదు. ఇ దొక్కటే నా ఆక్షేపణ.

ప్రజలను తమయభిప్రాయములను తెలుపనిండు. మన మెందుకు అడ్డగింపవలెను? పరమహంస శ్రీరామకృష్ణుని ముందుగా పరిశోధింపకుండిన వేదముల ఉపనిషత్తుల భాగవతాదిపురాణముల పరమార్థమును ఎవడును ఎప్పుడును అర్థము చేసికొనలేడు. భారతీయాధ్యాత్మిక సారస్వతమంతటిపై తనవెలుగును పాఱించు అనంత శక్తివంతమైన ప్రదీపము ఆయన జీవితము. వేదములకును వాని లక్ష్యమునకును ఆయన సజీవమైన యొక వ్యాఖ్యానము. భారత దేశపు ఆధ్యాత్మికజీవితసర్వస్వమును ఆయన తన ఏకైకజన్మములో జీవించెను.

శ్రీకృష్ణభగవానుడు అవతరించెనో లేదో నిజముగ మనకు తెలియదు; బుద్ధ – చైతన్యులవంటి అవతారములు విసుగుకలిగించును. అన్నిటికంటె కడపటిదియు పరిపూర్ణమైనదియు పరమహంస రామకృష్ణునవతారము. జ్ఞానము భక్తి త్యాగము ఔదార్యము మానవసేవాభిరతి —— ఇన్నియు కలిసి రామకృష్ణునిలో రూపుదాల్చినవి. కావున ఆయనకు సాటి ఎం దున్నాడు ? ఆయనను తెలిసికొనలేని వాని జన్మము వ్యర్థమే. జీవితకాలమునను అనంతరమును ఆయనకు నేను సేవకుడను. ఇదే నా మహాభాగ్యము. అన్ని వేదములకంటెను వేదాంతములకంటెను నే నెక్కువగ ఆదరించునది ఆయన నోట వెలువడిన మాట, అ దొక్కటైనను సరే. 'తస్యదాసదాసదాసోహం' అతనికి నేను దాసదాస దాసుడను. కాని సంకుచితదురభిమానము ఆయన సిద్ధాంతములకు విరుద్ధము. అది నాకు చిరాకు కలిగించును. ఆయనపేరు విస్మృతిలో మునిగిపోయినను పోవును గాక. ఆయన ఉపదేశములు సఫలము లగును గాక! ఎందుకు? ఆయన, కీర్తికి దాసుడా? నిరక్షరాస్యులగు కొందఱు బెస్తలు జీససుక్రైస్తును దేవు డనిరి.

చదువుకొన్నవారు ఆయనను చంపివేసిరి. బుద్ధుని జీవితకాలమున కొందఱు వైశ్యులును గొల్లలును అతనిని గౌరవించిరి. కాని శ్రీరామకృష్ణుని, ఆయనజీవిత కాలములో,- పందొమ్మిదవ శతాబ్ద చరమభాగమున - విశ్వకళాపరిషత్పట్టభద్రులన దైత్య దానవులు దేవుడని ఆరాధించిరి.... వారిని (కృష్ణ బుద్ధ క్రైస్తు ప్రభృతులను) గూర్చి ఏవో కొన్నివిషయములు మాత్రమే గ్రంథములలో వ్రాసిపెట్టబడియున్నవి. "ఎవనితో గూడి మనము గృహవాసము చేయ లేదో వాడే అద్భుత గృహస్థుడుగ నుండవలెను"- అని బెంగాలి నానుడి కలదు. మఱి శ్రీరామకృష్ణుని సన్నిధానములో మనము రాత్రింబగళ్లు కలిసియుంటిమి. అయినను వారందఱికంటె ఈయన ఎంతో అధికుడైన మహాపురుషుడను అభిప్రాయము మన కున్నది. ఈవిషయమును మీరు అర్థముచేసికొ గలరా ?

మాతృశ్రీ జీవితమునకు గల అద్భుతప్రాముఖ్యమును మీ రింకను అర్థము చేసికొలేదు. మీలో ఒక్కడైనను అర్థము చేసికొలేదు. కాని క్రమక్రమముగా మీ కది తెలియును. "శక్తి" లేనిదే విశ్వమునకు పునఃసృష్టి లేదు. మనదేశము అన్ని దేశములకంటె దుర్బలతమముగ నుండుటకును వెనుకబడియుండుటకును కారణ మేమి ? భారతీయులు శక్తిని నిరాదరించుటే అందుకు కారణము. భారతదేశమున ఆ అద్భుతశక్తిని సంజీవనము చేయుటకు లోకజనని అవతరించియున్నది. ఆమెను కేంద్రముగ చేసికొని మైత్రేయివంటివారు గార్గివంటివారు మరల ఈభువి నవతరింతురు. ప్రియసోదరా, ఇది నీ కిప్పుడు ఇంచుకే అర్థ మగును. కాని క్రమక్రమముగ ఇది యంతయు నీకు బోధపడగలదు. కావున ఆమె మఠము నాకు మొదట కావలసినది?.... శక్తికృప లేక దేనినిగాని సాధింపలేము. అమెరికాలోను యూరపునందును నా కగపడుచున్న దేమి ? శక్తిపూజయే. కాని వారు ఇంద్రియ ప్రీణనమార్గమున తమకు తెలియకే శక్తి నారాధించుచున్నారు.

ఇక పవిత్రతతో సాత్త్వికభావముతో శక్తిని తల్లిగా భావించి ఆరాధించువారికి ఎంత శ్రేయస్సు కల్గునో ఆలోచింపుము. నానాటికి నాకు విషయములు మఱింత స్పష్టముగా తెలియుచున్నవి. నా అంతర్దృష్టి ఇంక నింకను వికసించుచున్నది. కావున మనము మొదట అమ్మకు మఠమును నిర్మింపవలెను. అమ్మకు అమ్మకూతుం డ్రకు అగ్రతాంబూలము. నాయనకు నాయనగారి కొడుకులకు అనంతరతాంబూలము. ఇది అర్థమైనదా!... నావఱకు నాకు తండ్రి యనుగ్రహమున కంటె తల్లియనుగ్రహము లక్షమడుగు లెక్కువ విలువ గలిగినది. తల్లికృప తల్లిదీవెనలు ఇవన్నియు నా కత్యంత ముఖ్యములు....నన్ను మన్నింపుము. తల్లివిషయములో నేను ఇంచుక చెడ్డపట్టుదల కలవాడను. అమ్మ ఆజ్ఞాపించిన చాలును. ఆమెపరివారమగు రాక్షసులు ఏపనినైనను చేయగలరు. సోదరా, అమెరికాకు బయలుదేఱుటకు ముందు "నన్నాశీర్వదింపు" మని అమ్మకు జాబు వ్రాసితిని. ఆమె ఆశీర్వాదము అందినది. ఒక్కదుముకున సముద్రమును దాటి వచ్చితిని. గుర్తించితివా? అమ్మమఠమునకు ధనము ప్రోగుచేయుటకే నేను ఈదుస్సహశీతకాలమున పెక్కు చిక్కు లెదుర్కొనుచు ఒక చోటునుండి ఒకచోటుకు పర్యటించుచు ఉపన్యాసములు చేయుచున్నాను....నిరంజనుడు కత్తిదూసి మాటాడుస్వభావము కలవాడు కాని అమ్మయందు అతనికున్న ఆత్యంతికభక్తిని బట్టి అతని వెఱ్ఱుల నన్నిటిని నేను సులభముగనే ఓర్చుకోగలను. అత డిప్పుడు అత్యద్భుతమైన పనిని చేయుచున్నాడు. నేను సంగతుల నన్నిటిని బాగుగ తెలిసికొనుచు యున్నాను. మదరాసువారితో సహకరించుటలో నీవును చాల మంచిపనియే చేసితివి. ప్రియసోదరా, నీయొద్దనుండి నేను ఎంతో పని నిరీక్షించుచున్నాను. కలిసి పనిచేయుటకు నీ వందఱిని అంగక్రమముతో కూడిన సంస్థగా చేయవలెను. అమ్మకు నీవు ఒకచోటును సంపాదించిన వెంటనే నేను సూటిగ ఇండియాకు వత్తును. అది విశాలమైన చోటుగ

నుండ వలెను. మొదట నొక మట్టికట్టడముతో ప్రారంభింతము. కాలక్రమమున మంచిభవనమును నిర్మింతును భయపడకు.

మలేరియాకు ముఖ్యకారణము నీళ్లలో నున్నది. నీటిని వడియగట్టుసాధనములను రెంటినో మూటినో నీ వేల నిర్మింప రాదు? నీటిని మొదట కాచి తర్వాత వడియగట్టిన అపాయ ముండదు....దయచేసి పాశ్చరువారి "సూక్ష్మక్రిములను అడ్డగించు వడియగట్టుసాధనముల"ను పెద్దవానిని రెండింటిని కొనుము. వంటకు త్రాగుటకుకూడ ఆనీటినే వాడుడు. ఇక మలేరియాను గూర్చి మీ రెప్పుడును వినవే వినరు....పదండి ముందుకు పదండి; పాటుపడుడు, పాటుపడుడు, పాటుపడుడు. ఇది కేవలము ప్రారంభమే.

సదా భవదీయ
వివేకానంద

## 152

ఓమ్ నమో భగవతే రామకృష్ణాయ

1894.

ప్రియ ప్రేమాస్పద....

సరి, ఇండియాలో ఏదేని మతము మిగిలియున్న దనియా మీ యభిప్రాయము? జ్ఞానమార్గము, భక్తిమార్గము, యోగ మార్గము – అన్నియు పోయినవి. ఇప్పుడు మిగిలియుండునది "నన్నంటకు" మను మతమే. "నన్నంటకు! నన్నంటకు!" లోక మంతయు అపరిశుద్ధము, నే నొక్కడనే పవిత్రుడను. భాస్వర బ్రహ్మజ్ఞానమను. బలే! మహాదేవ! ఈదినములలో బ్రహ్మము హృదయాంతరములలో లేదు. మహోన్నతదివ్యధామమున లేదు. ఏప్రాణులందును లేదు. వంటపాత్రయందు మాత్రమే దేవు

దున్నాడు. పూర్వకాలమున "త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయన్తః" "ముల్లోకాలవారిని ఉపకారపరంపరలచే సంతుష్టులనుగా జేయుట" ఉదాత్తచిత్తుల లక్షణముగ నుండెడిది. ఇప్పుడు వారి లక్షణము — నేను పవిత్రుడను, విశ్వ మెల్ల అపవిత్రము. పొండి, డబ్బు తెండి, నా పాదములొద్ద పెట్టుడు. ఇచ్చటి నామత బోధలను ముగించి మరలి ర మ్మని నాకు జాబు వ్రాయుచున్న వివేకితో — ఈదేశమే నాకు ఎక్కువ సొంత మని చెప్పుము. హిందూస్థానములో ఏ మున్నది? పారమార్థికపరతను గ్రహించువా రెవరు? పాండిత్యము గ్రహించువా రెవరు?

ఇంటికి మరలుట! ఎక్కడ నున్నదిఇల్లు? మోక్షము నాకు లక్ష్యము కాదు. భక్తి నాకు లక్ష్యము కాదు. నేను లక్షనరకములకైనను పోవుదును. "వసంతవ ల్లోకహితం చరన్తః" "వసంతమువలె (నిశ్శబ్దముగ) లోకమునకు మేలు చేయుట"— ఇదే నామతము. సోమరులతో కఠినహృదయులతో క్రూరులతో స్వార్థపరులతో ఎట్టి సంబంధము కలిగియుండుటయు నా కిష్టము లేదు. ఈమహోపకారకార్యక్రమమున సహకరించు మహాభాగ్యము కలవా రందఱును సహకరింపవచ్చు.

...దయచేసి నా ప్రేమ నందఱికిని అందజేయుడు. ప్రతివాని తోడ్పాటును నా కవసరము. ధనమువలన లాభము లేదు. పేరువలన కీర్తివలన పాండిత్యమువలన లాభము లేదు. కష్టము లనెడి వజ్రభిత్తికలగుండ దారిచేసికొని పోగలది శీల మొక్కటే. దీనిని మనసులో నుంచుకొండి.

భవదీయ నిత్యప్రేమయుత
వివేకానంద

153.

నమో భగవతే శ్రీరామకృష్ణాయ

(సోదరశిష్యులకు)

1894.

ప్రియ సోదరులారా,

ఇంతకు పూర్వము నేను మీకు వ్రాసిన జాబు వ్యవధి లేనందున చాల అసమగ్రముగ నుండినది. రాఖాలును హరియు లక్నోనుండి వ్రాసిన యొకజాబులో హిందూవార్తాపత్రికలు నన్ను ప్రశంసించుచున్న వనియు శ్రీరామకృష్ణుని జయంతిమహోత్సవ మప్పుడు ఇరువదివేల ప్రజలకు అన్నసంతర్పణ గావింపబడినందులకు వారు చాల సంతోషపడి రనియు తెల్పియున్నారు. బ్రాహ్మ సమాజమువారును క్రైస్తవమతప్రచారకులును నిరంతరము నన్ను ఎదిరించుచుండకున్న, నే నింకను ఎంతో పని సాధింపగలిగియుందును. భారతదేశమందలి హిందువులును నా కేమియు తోడ్పడిన' వారు కారు. నేను చెప్ప నెంచిన దేమనగా — కల్కత్తాలోను మదరాసులోను హిందువు లొక సభ కూడి నేను తమప్రతినిధి ననియు నన్ను దయతో ఆదరించినందుకు అమెరికాప్రజలపట్ల తాము కృతజ్ఞుల మనియు నొకప్రతిపాదనమును చేసి అందజేసి యుండిన పనులు ప్రశంసార్హముగ పురోగమించి యుండును. కాని సంవత్సరము దాటిపోయినది. ఇంతవఱ కేమియు చేయ లేదు. నేను బెంగాలీలమీాద ఎప్పుడును ఆధారపడలేదు లెండి. కాని మదరాసువారును ఏమియు చేయలేక పోయిరి.

మనదేశమునకు ఆసపాటు లేనే లేదు. ఎవని బుఱ్ఱలోగాని స్వతంత్రమైన భావ మొక్కటైన పుట్టదే! రామకృష్ణపరమహంస అటువంటివాడు ఇటువంటివాడు — కట్టుకథలు — తలయు

తోకయు లేని కథలు. హాదైవమా! సామాన్యులకంటె ఏదో యొకమార్గమున మీరు పైవారని చూపగల పనిని దేనినిగాని చేయరా? — వెఱ్ఱివారుగనే ఉన్నారు.... ఈనాడు ఒకగంటను పెట్టుకొని యుందురు. రేపు దానితో నొక కొమ్మను చేర్తురు. దానికి మఱునాడు ఒకచామరమును చేర్తురు. లేదా, ఈదినము ఒకమంచమును తీసికొనివత్తురు. రేపు దానికోళ్లకు వెండిరేకులు కప్పుదురు. ప్రజలు పరమాన్నమునకు అవకాశము సంపాదింతురు. మీరు రెండువేల పిచ్చిపిచ్చి కథలను అల్లిపెట్టుదురు— అనగా బాహ్యకర్మలపటాటోపము తప్ప వేఱేమియు లేదు. ఇంగ్లీషుభాషలో దీనిని ఇమ్బెసిలిటీ (బుద్ధిమాంద్యము) అందురు. ఇట్టి అల్పవిషయములు మాత్రమే ఎవరి బుఱ్ఱలలో నుండునో వారిని మందబుద్ధు లందురు; గంటను కుడివైపు ప్రయోగింపవలెనా? ఎడమవైపు ప్రయోగింపవలెనా? గంధపుబొట్టును నెత్తిని పెట్టుకొనవలయునా? వేఱెటనైన పెట్టుకొనవలయునా? దీపసమర్పణమును రెండుసార్లు చేయవలయునా? నాలుగుసార్లు చేయవలయునా?— అను ఇట్టి ప్రశ్నలతో అహోరాత్రములు చీకాకుపడుస్వభావము కలవారు కేవలము దౌర్భాగ్యు లనిపించుకొనుటకు తగుదురు. అట్టి అభిప్రాయ ముండుటచేతనే మనము భాగ్యమునకు బాహ్యులమైతిమి. తన్నులకు త్రొక్కుళ్లకు లోనైతిమి. పాశ్చాత్యదేశాల ప్రజలో— ప్రపంచమంతటికి ప్రభువులుగ నైరి.... సోమరితనమునకును త్యాగమునకు హస్తిమశకాంతరము.

మీకు శ్రేయస్సు కల్గవలె నని కోరుదురేని ఈ క్రతుకలాపాలను త్రోసిరాజనుడు. సజీవుడై యున్న దేవుని దివ్యత్వముగల మానవుని మానవరూపముగ నున్న ప్రతిప్రాణిని, దేవునిసమష్టి వ్యష్టిరూపములను రెంటిని ఆరాధింపుడు. దేవునిసమష్టిరూపమనగా ఈవిశ్వమే. దీని నారాధించుట యనగా సేవచేయుటయే. సేవ యనగా పనియే గాని క్రతుకలాపములో మునిగి తేలుచుండుట గాదు. పని యనగా — అన్నపుపళ్లెరమును దేవున కెదుట

పదినిమిషములు పెట్టవలెనా అరగంటసేపు పెట్టవలెనా అను నిట్టి తర్కము గాదు. దానిని వెఱ్ఱియందురు. వారణాసిలోగాని బృందావనములోగాని గుడితలుపులను దిన మంతయు మూయుచు తెఱచుచు ఆడుకొనుటకు మాత్రమే లక్షలకొలది రూపాయలు వ్యయింపబడినవి. దేవున కిప్పుడు అలంకార మగుచున్నది. దేవున కిప్పుడు ఆరగింపు జరుగుచున్నది. దేవు డిప్పుడు మఱొకపనిలో వ్యగ్రుడై ఉన్నాడు. ఏపనియో మన మెఱుగము.... ఇ దంతయు సజీవుడైన దేవుడు విద్యలేకయు తిండిలేకయు మరణించుచున్న ప్పుడే! బొంబాయిలోని వణిక్కులు నల్లులకు ఆసుపత్రులు కట్టు చున్నారు. మానవులు చచ్చుచున్నను వారికి వీ రేమియు చేయరు! మనదేశమున నున్న అంటువ్యాధి ఇదే అనియు ఉన్మత్త శరణాలయములు సర్వత్ర వ్యాపించుచున్న వనియు ఈసరళమైన విషయమును అర్థము చేసికొనుటకు మీకు బుఱ్ఱలు లేవు. మీలో కొందఱుచిచ్చువలె వ్యాపింపుడు. దేవుని ఈ "విశ్వ" రూపారా ధనమును ప్రచారము చేయుడు. మనదేశమున ఇంతకు ముం దెప్పుడును పూనుకొనబడని పని ఇది. ప్రజలతో కలహములు కూడదు. మనము అందఱితో మైత్రిగలిగి యుండవలెను....

ఆశయములను వ్యాపింపజేయుడు. ఊరూరికి పొండి. ఇంటింటికి పొండి. అప్పుడే నిజమైన పని నిర్వర్తిత మగును. అట్లు కాక పాన్పుపై ఉదాశీనులమై పరుండి అప్పుడప్పుడు గంటను ప్రయోగించుచుంటిమేని అ దొకరకపు వ్యాధి, అంతే....స్వతంత్రు లుగ నుండుడు. స్వతంత్రముగ గుణదోషముల నిర్ణయించుటను అలవఱచుకొనుడు. గంటకు పిడి ఇంత పొడుగుండవలయు నని ఫలానా తంత్రమున ఫలానాప్రకరణమున విహితమై యున్నచో అది నా కెందుకు? ఈశ్వరుని సంకల్పముచే మీనోళ్లనుండియే లక్షలకొలది వేదములును తంత్రములును పురాణములును వెలు వడగలవు.... దానిని మీరు అమలులో చూపగలరేని భారత దేశములో ఒక్కసంవత్సరములో మూడునాలుగులక్షల శిష్యు

లను తయారుచేయగల్గినచో అప్పుడే నాకు కొంత ఆసపా టుండును....

మఱొక్క మాట. తలగొఱిగించుకొని సోదరుడగు తారకు నితో బొంబాయినుండి రామేశ్వరమునకు పోయిన బాలుని మీా రెఱుగుదురు కదా? ఆ బాలుడు "నేను పరమహంస శ్రీరామ కృష్ణుని శిష్యుడ" నని చెప్పుకొనుచున్నాడు. సోదరుడు తారకుడు అతనికి మంత్రోపదేశము చేయును గాక!...శ్రీరామకృష్ణుని జీవిత కాలములో ఈ బాలు డాయనను ఎప్పుడును కలిసికొనియుండ లేదు. అయినను శిష్యు డట. ఏమి అవివేకము! అవిచ్ఛిన్నమైన గురుపరంపర లేనిదే ఏమియు సాధ్యము కాదు. ఇదేమి శిశు క్రీడయా? ఎట్టి సంబంధమును లేకుండగనే "నేను శిష్యుడను" అని చెప్పుటయా? జాల్మడు! ఆపిల్లవాడు సరియైనదారిలో నడచు టకు నిరాకరించునేని అతనిని తఱిమి వేయుడు. గురుపరంపర యుండవలయును. శక్తి గురువునుండి శిష్యునకు ఆశిష్యుని నుండి అతనిశిష్యునకు—ఈరీతి సంక్రమించుచు పోవలెను. ఇట్టి పరంపర లేనిదే ఏమియు శక్యముకాదు. అత డిక్కడికి వచ్చి రామకృష్ణ శిష్యుడ నని ఘోషించుచున్నాడు. ఇ దేమి వికటహాస్యమా? ఎవడో ఒకడు నాకు సోదరశిష్యుడ నని చెప్పుకొనుచున్నా డని జగ్మోహన్ నాకు తెలిపియుండినాడు. అతడు ఆ బాలుడే ఐయుండు నని నా అనుమానము. సోదరశిష్యుడనని చెప్పుకొనుట! శిష్యుడ నని చెప్పుకొనుటకు అతనికి అవమానము కావున. సరాసరి గురువు గనే కాగోరుచున్నాడని నేను బల్లగ్రుద్ది చెప్పగలను. వ్యవ స్థితమైయున్న క్రమమును అతడు అనుసరింపడేని అతనిని తఱుమ గొట్టుడు.

"తులసీ" "సుబోధు"ల మనసులు క్షోభిల్లుచున్న వట. అనగా చేయుటకు వారికి పని యేమియు లే దని అర్థము.... ఊరూరికి పొండి. మానవకోటికి విశ్వమునకంతటికి మంచి చేయుడు. ఇతరులకు మోక్షమును కొనిపెట్టుటకై మీారు నరక

ములకు పొండి. నాది అనుకొనదగిన ముక్తి భువిని లేదు. మిమ్ము గూర్చే మీరు ఆలోచించునపుడు మీకు క్షోభము తప్పదు. అబ్బాయి, శాంతి నీ కెందు కోయి, నీవు సర్వమును పరిత్యజించిన వాడవు. రమ్ము, నీవు ఇప్పుడు శాంత్యాసను ముక్త్యాసను గూడ దూరముగ పరిత్యజింపవలసిన వంతు వచ్చినది. నాకముగాని నర కముగాని భక్తిగాని ముక్తిగాని ఇంచుకయు వ్యధ చెందకు. దేనిని లక్ష్యపెట్టకు. కాని నాయనా, ఇంటింటికి పోయి భగవన్నామమును ప్రచారము చేయుము. ఎవడుగాని ఇతరులకు శ్రేయ మొనగూర్చుట చేతనే తాను శ్రేయ మొందును. ఇతరులను భక్తిముక్తుల ప్రాపింపజేయుటచేతనే తానును వానిని అధిగమించును. దానిని చేపట్టుడు. అందుకై మిమ్ము మీరు మఱచిపొండి. ఆఆశయముతో వెఱ్ఱెత్తినవారు కండి. శ్రీరామకృష్ణుడు మి మ్మెట్లు ప్రేమించుచుం డెనో మిమ్ము నే నెట్లు ప్రేమించుచున్నానో, రండి, మీరును లోక మును అట్లే ప్రేమింతురు గాని. అందఱిని ఒక్కటిగ కూర్చుడు. గుణనిధి ఎక్కడ నున్నాడు? అతనిని నీవు నీతో ఉంచుకోవలె. అతనికి నాఅనంతప్రేమ. గుప్త ఎక్కడ? ఇష్టపడునేని అతనిని చేరనిండు. నామాటగా అతనిని పిలువుడు. ఈక్రింది కొన్ని విష యాలను జ్ఞప్తియుంచుకొండి.

(1) మనము సన్న్యాసులము, భక్తిని, ముక్తిని, భుక్తిని— అన్నిటిని పరిత్యజించినవారము.

(2) లోకులలో ప్రతిఒక్కనికి, చాల అధఃపతితునకు సైతము, పరమశ్రేయ మొనర్చుట మనవ్రతము. అట్లు చేయుట వలన, నాకము గలుగనిండు నరకమే కల్గనిండు, తలయొగ్గుడు.

(3) లోకకల్యాణమునకై యే పరమహంస శ్రీరామ కృష్ణుడు అవతరించినాడు. ఆయనను మీరు మీయిష్టప్రకారము మానవు డనుడు దేవు డనుడు అవతారమూర్తి యనుడు! ఎవని జ్ఞానమునకు తగినంతగా వాడు ఆయనను తలదాల్చును గాక.

(4) ఎవడు ఆయనకు మ్రొక్కునో అతడు తక్షణమే అప్పటమైన బంగారముగ మార్పొందును. నాయనలారా, మీకు శక్య మగుచో ఈసందేశమును గొని ఇంటింటికి పొండి, మీ అశాంతి అంతరించును. ఎప్పుడుగాని భయపడకుడు. భయమున కవకాశ మేదీ? దేనినిగాని లెక్కింపకుండుట మీజీవితములో నొక యంశము. ఇంతకాలమును మీరు ఆయన పేరును మీ శీలమును నలువంకల వ్యాపింపజేసితిరి, సరి, మంచిదే, ఆప్రచారమునే ఇప్పుడు పొందికయైన మార్గమున చేయుడు. ప్రభువు మీ వెంబడే ఉన్నాడు, ధైర్యమువహింపుడు.

నేను బ్రతికియున్నను మరణించినను భారతదేశమునకు నేను మరల వచ్చినను రాకున్నను మీరు ప్రేమను, నిరవధిక ప్రేమను వ్యాపింపజేయుచు పొండి. శ—ను కూడ ఈపనికి పూన్పుడు. కాని ఒరులను నిర్జింపవలె ననిన ఆయుధములు కావలె నను విషయమును జ్ఞప్తియుంచుకొండి. "సన్నిమిత్తే వరం త్యాగో వినాశే నియతే సతి"

"మరణ మది తప్పనప్పుడు మంచికొఱకు
జీవితార్పణచేయుట శ్రేయముసుడి"

భవదీయప్రేమయుత
వివేకానంద

## 154

(కుమారి మేరీ హేలుకు)

కేంబ్రిజ్,
డిసంబర్, 1894.

ప్రియసోదరీ,

నీజాబు నా కిప్పుడే చేరెనది. మీసంఘనియమములకు ప్రతికూలము కాకున్నచో శ్రీమతి ఒల్బుల్సుతిని, కుమారి ఫార్మ

రును, చికాగోనుండి వచ్చిన శరీరవ్యాయామశాస్త్రవేత్త్రియగు శ్రీమతి ఆడమ్సుసతిని దర్శించుట కేల రావు ? ఏనాడైనను సరే వారు నీ కట కన్పింతురు.

సదా ప్రేమయుత భవదీయ
వివేకానంద

## 155

(శ్రీమతి ఓల్బుల్సతికి)

541, డియర్బారన్ అవెన్యూ, చికాగో,
జనవరి 3, 1895.

ప్రియ శ్రీమతి బుల్సతికి,

క్రిందటి ఆదివారమునాడు నేను బ్రూక్లినులో ఉపన్యసించితిని. సాయంకాలము నే నక్కడికి చేరుకొనగనే శ్రీమతి హిగ్గిన్సుసతి ఒకచిన్నవిందు చేసినది. ఎథికల్‌సొసైటి సభ్యులలో ప్రముఖులు కొందఱు వచ్చిరి. వారిలో డాక్టరు జైన్ (జేన్స్) కూడ నుండెను. అట్టి ప్రాచ్యమతవిషయములు బ్రూక్లిను ప్రజలకు రుచింప వని వారిలో కొందఱు అభిప్రాయపడిరి.

కాని ఈశ్వరానుగ్రహమున నాటి ఉపన్యాసము అత్యంత జయప్రదముగ నెఱవేఱినది బ్రూక్లినులోని విజ్ఞులు దాదాపు ఎనిమిదివందలమంది హాజరై యుండిరి. ఈయుపన్యాసము జయప్రదముగ నుండబో దని మొదట తలచినవారే ఇప్పుడు బ్రూక్లినులో వరుసగా ఉపన్యాసములను ఏర్పాటుచేయుటకు ప్రయత్నించుచున్నారు. న్యూయార్కులోని నా ఉపన్యాసప్రణాళిక ఇంచుమించు సిద్ధమై యున్నది. కాని కుమారి థర్స్బీ న్యూయార్కునకు వచ్చువఱకు తేదీలను నిర్ణయించుట నా కిష్టము లేదు. కుమారి ఫిలిప్సు కుమారిథర్స్బీకి మిత్రము. ఆమెయే ఈ

న్యూయార్కు ప్రణాళికను ఏర్పాటుచేయుచున్నది. న్యూయార్కులో దేనినైనను సిద్ధపఱుపవలె ననిన ఆమె అనుకొన్నచో కుమారి థర్స్బీతో కలిసి ఆమె పనిచేయును.

హేలుకుటుంబమువారికి నేను చాల ఋణపడియున్నాను. సంవత్సరాదినాడు అటు పోడచూపి వారి కించుక ఆశ్చర్యము కలిగింత మని అనుకొంటిని. ఇచ్చట నేను క్రొత్తగౌనును సంపాదించుటకు ప్రయత్నించుచున్నాను. ప్రాతగౌను ఇచ్చట నున్నది. కాని ఉతికి ఉతికి చాల ముడుచుకొనిపోయియున్నది, సదస్సులో ధరించుటకు తగనిదై యున్నది. కావలసిన రకముదే చికాగోలో లభించు ననెడి ఇంచుమించు గట్టి నమ్మకము నాకున్నది.

ఈపాటికి మీనాయనగారికి ఆరోగ్యము బాగై యుండు నని అనుకొనుచున్నాను.

కుమారి ఫార్మరుకు గిబ్బన్సుదంపతులకు పవిత్రకుటుంబమునకు చేరిన తక్కినవారికి నాప్రేమ.

సదా భవదీయప్రేమయుత
వివేకానంద

మలిమాట : కుమారి కూరింగు నాకు బ్రూక్లినులో కనబడినది. ఆమె యెప్పటివలెనే దయచూపినది. త్వరలో ఆమెకు నీవు జాబువ్రాయుదువేని నాప్రేమ నందింపుము.

## 156

(శ్రీ జి. జి. నరసింహాచార్యులకు)

చికాగో,
జనవరి 11, 1895.

ప్రియ జి. జి.,

నీజా బిప్పుడే చేరినది.... తక్కినమతములకంటె క్రైస్తవ మతమే మేలైనది అని రుజువుచేయుటకే విశ్వమతమహాసభ

ఏర్పాటుచేయబడినది. ఐనను హిందువులవేదాంతమతము తన స్థానమును దక్కించుకొనగల్గినది. డాక్టరు బట్లోసును ఆవర్గము నకు చేరినవారును తమ సనాతనాచారములందు చాల పట్టుదల గలవారు. నేను వారిసాయమును అపేక్షింపబోను.…భగవంతుడు ఈ దేశమున నా కెందఱినో మిత్రులను పంపియున్నాడు. వారి సంఖ్య సదా వర్ధిల్లుచున్నది. నన్ను హింసింపప్రయత్నించినవారిని భగవంతు డనుగ్రహించును గాక!.…నే నిన్నాళ్ళును బోస్టను కును న్యూయార్కునకును మధ్య సదా పరుగులెత్తుచుంటిని. ఈ దేశమున కివి రెండును పెద్ద కేంద్రములు. ఈ దేశమునకు బోస్టను బుద్ధి స్థానీయ మనియు న్యూయార్కు ధనాగారస్థానీయ మనియు చెప్ప వచ్చు. రెండుచోట్లలోను నాకు గల్గిన విజయము అసాధా రణమైనదే. వార్తాపత్రికల నివేదికలను నేను లక్ష్యపెట్టుట లేదు. కాబట్టి ఆనివేదికలలో కొన్నింటిని నేను మీకు పంపుదు నని మీరు నిరీక్షింపరాదు. ప్రారంభములో కొంత సద్దుచేయుట ఆవశ్యకమై యుండెను. ఆసద్దు మనకు కావలసినంతకంటె హెచ్చు గనే కావింపబడినది.

నేను మణి అయ్యరుకు జాబువ్రాసియున్నాను. నీకు నా సలహాలను ఇంతకు మునుపే ఇచ్చియున్నాను. మీ రేమి చేయ గలరో నా కిప్పుడు చూపుడు. అవివేకప్రసంగ మిప్పుడు పనికి రాదు. అసలుపని కావలెను. హిందువులు తమమాటలకు ఆధార ముగా నిజమైన పని చేయవలెను. చేయ లేకపోయిన వారికి ఎందుకును అర్హత లేదు, అంతే. మీభ్రాంతులకు మీకు అమెరి కనులు ధన మీయబోవుట లేదు, వా రేల యీయ వలెను? ఇక నేనా, పరమార్థమును బోధింపవలె నని నాకోరిక, ఇక్కడనే గాని వేఱొక్కడ గాని.

మిమ్ముగుఱించిగాని నన్నుగుఱించిగాని అనుకూలముగ గాని ప్రతికూలముగగాని ప్రజ లేమి చెప్పినను వారి మాటల

నికమీఁద లక్ష్యపెట్టకుఁడు. పనిని సాగింపుఁడు. సింహములుగ నుండుఁడు. దేవుఁడు మిమ్మనుగ్రహించును. నేను బ్రతికినన్నినాళ్లు నిర్విరామముగ పాటుపడెదను. మరణించిన పిమ్మటకూడ జగద్ధితమునకై నేను పాటుపడెదను. అసత్యమునకంటె సత్యము ఇంతంతనరానంత సారవత్తరమైనది. సౌజన్యమును అట్టిదే. ఈ గుణములు మీకున్నచో అవి తమఘనతచే తామే దారి జేసికొనును.

థియాసఫిస్టులతో నాకు సంబంధము లేదు. జడ్జి నాకు తోడ్పడును—ఛీ!.... మానవులలో అత్యుత్తములకు పెక్కండ్రకు నాయం దక్కఱ గలదు. నీ వీవిషయమును తెలిసికొని దేవుని నమ్మియుండుము. ఈదేశమున నేను మెల్లగా పత్రికా ప్రకటనలన్నియు కలిగింపగలంతకంటె ఎక్కువమాట చెల్లుబడి కలవాడ నగుచున్నాను. క్రైస్తవసనాతనులు దానిని అనుభవమున చూచుచున్నారు. కాని దానిని మాప లేకున్నారు. అది శీలశక్తి. పవిత్రతాశక్తి, సత్యశక్తి, పురుషశక్తి. ఇవి నాకున్నంతవఱకు మీరు నెమ్మదిగ నుండవచ్చు. ఎవఁడు గాని నాతలవెంట్రుకనైనను కదలింపలేఁడు. వారు ప్రయత్నింతురేని భంగ మొందుదురు, అని దేవుఁడు చెప్పుచున్నాఁడు.... గ్రంథములు సిద్ధాంతములు ఇకచాలు. ప్రజలడెందముల నట్టూఁత లూపుటకు ఏకైకమును మహోన్నతము నగు మార్గము "జీవితమే". పురుషుని ఆకర్షకశక్తి అందిమిడి యున్నది.... ఈశ్వరుఁడు నాకు నానాటికిని మఱింతగాఢమైన అంతర్దృష్టిని ప్రసాదించుచున్నాఁడు. పాటుపడుఁడు, పాటుపడుఁడు, పాటుపడుఁడు.... అవివేకప్రసంగములకు స్వస్తి చెప్పుఁడు. భగవంతునిగూర్చిప్రసంగించుచుండుఁడు. జీవితము క్షణభంగురము. వక్రోక్తులకు మిథ్యాలాపములకు వ్యవధి లేదు. ప్రతిదేశమును తన్ను తానే కాపాడుకోవలె నను విషయమును మీరు సదా జ్ఞప్తియందుంచుకోవలెను. అట్లే ప్రతిమానవుఁడును తన్ను తానే కాచుకోవలెను. అన్యులసాయమునకై అఱ్ఱులు చాపకుఁడు. ఇక్కడ కష్టపడి పనిచేసి నేను అక్కడ నీపనికి అప్పుడప్పుడు కొంతపైకమును

పంపగల్గియుందును. కాని అది ఆపాటిదే. అందుకే, నీవు కాచుకొని యుండవలసియున్న పనిని ఆపివేయుటే మేలు. పైగా నా ఆశయములకు ఇదొక గొప్ప రంగము అను విషయమును గుర్తింపుము. భగవంతునిపై ప్రేమ గలవారు ఎవరైనను సరే—వారికి నేను సదా సేవచేయుదును. వారు హిందువులా మహమ్మదీయులా క్రైస్తవులా అను విషయమును నేను లక్ష్యపెట్టను.

…నిశ్శబ్దముగ ప్రశాంతముగ పనిచేయుట నా కిష్టము, దేవుడు సదా నావెంబడే ఉన్నాడు. మీ కిష్టమున్న అత్యంతార్జవముతోను పరిపూర్ణ నిస్స్వార్థతతోను అన్నిటికంటె నెక్కువగా సమగ్రపవిత్రతతోను నన్ననుసరింపుడు. మీకు నా ఆశీర్వచనములు. ఈ క్షణికజీవితములో పరస్పరప్రశంసలను చెల్లించుటకు వ్యవధిలేదు. ముందు యుద్ధము ముగియనిండు. తర్వాత మనము మన జ్ఞాపికలను పోల్చిచూచుకోవచ్చు. మనసార ఒకరి నొకరు ప్రశంసించుకోవచ్చును. ఇప్పుడు మాటాడకుడు. పని పని పని! భారతదేశమున శాశ్వతముగ నుండునట్లు మీరు చేసిన దేదియు నా కగపడలేదు. మీరు నెలకొల్పిన కేంద్రమేదియు నా కగపడుట లేదు. మీరు నిర్మించిన గుడిగాని మండపముగాని నా కగపడుట లేదు. మీతో ఎవరును కలిసివచ్చుట నా కగపడుట లేదు. ఉన్న దెల్ల అధికప్రసంగము, ప్రసంగము, ప్రసంగము! మేము గొప్పవారము, మేము గొప్పవారము. వెఱ్ఱి! మనము దుర్బలులము. అంతే. పేరుకై కీర్తికై ఉబలాటపడుట మున్నగు బూటకములన్నియు నా కెందుకు? అది నా కేమి లక్ష్యము? నూర్లకొలది ప్రజలు భగవత్ప్రియులు కాగా చూడవలెననుట నాకోరిక. వా రేరీ? వారు నాకు కావలెను. వారిని నేను చూడవలెను. వారిని మీరు వెదకి పట్టవలెను. మీరు నాకిచ్చునవి పేరును కీర్తియునే. పేరుకును కీర్తికిని స్వస్తి చెప్పుడు. పాటుపడుడు ధీరులారా, పాటుపడుడు. నా ఉత్సాహమును మీ రింకను అందుకోలేదు.

నన్ను మీ రర్థము చేసికొనలేదు. సోమరితనము సుఖానుభవ ములు అనెడి పాతదారులలోనే మీరు పరువులెత్తుచుందురు. సోమరితనము వదలిపోవలెను. సుఖానుభవము లెవ్వియు ఇప్పు డును వలదు, ఇకమీదను వలదు. నిప్పులోని కుఱుకుడు. ప్రజ లను దేవునొద్దకు తెండి.

నాఉత్సాహమును మీ రందుకొనవలె నని, ప్రగాఢార్జవ సంపన్నులై మీ రుండవలె నని, రణరంగమున మీరు వీరమరణ మొందవలె నని సదా ప్రార్థించుచుండు,

వివేకానంద

మఱిమాట : ఎల్లన్న పుల్లన్న దద్దన్న మనలనుగూర్చి చెప్పు అనుకూలప్రతికూలవాక్కులను నమ్మవల దని, వారి సమస్తశక్తిని పనిలో కేంద్రీకరింపవలసిన దని, అళసింగతో కిడితో డాక్టరు బాలాజితో ఇతరులందఱితో చెప్పుము.

## 157

(శ్రీ అళసింగపెరుమాళుకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
జనవరి 12, 1895.

ప్రియ అళసింగా,

పత్రికలను కరపత్రములను నాకిక పంప వల దని పెక్కు సార్లునేను నీకు వ్రాసియున్నప్పటికిని వానిని నీ వింకను పంపుచునే యుండుట నాకు విచారకరముగ నున్నది. వానిని చదువుటకు వానిని గమనించుటకు నాకు వ్యవధి లేదు. దయచేసి వాని నిక పంపకు. క్రైస్తవమతప్రచారకులు గాని థియాసఫిస్టులుగాని నన్ను గుఱించి ఏమి చెప్పినను నేను లక్ష్యపెట్టను. వారి కిచ్చ వచ్చినట్లు

చేయనీ. వారిపై మనము కన్నుంచితిమేని అదే వారికి ప్రాముఖ్యము నిచ్చును. అదియును గాక క్రైస్తవమతప్రచారకులు తిట్టుదురే గాని వాదింప రనుట నీకు తెలిసిన విషయమే.

పేరునుగాని కీర్తిని గాని అట్టి బూటకమును దేనినిగాని నేను లక్ష్యపెట్ట నని నీ విప్పుడు తెలిసికో. ఇక నెప్పటికిని నీ కది తెలిసియుండునుగాక! లోకక్షేమమునకై నా ఆశయములను బోధింపవలె నని నా కోరిక. నీవు చాల పనిచేసితివి. కాని ఇప్పుడు జరిగినంతమట్టుకు అది నాకు పేరు ప్రతిష్ఠలను మాత్రము కలిగించినది, లోకుల మెప్పును గడించుటకై వ్యయించివేయ తగినంత తక్కువది కాదు నా జీవితపువిలువ. దానివిలువ అంత కెంతో హెచ్చు. అట్టి పిచ్చిపనులకు నాకు వ్యవధి లేదు. భారతదేశమున ఆశయప్రచారమునకు గాని సాంగోపాంగమైన యొకవ్యవస్థ నేర్పఱచుటకు గాని నీవు చేసినదే మున్నది? ఏమియు లేదు, లేనేలేదు!

హిందువులకు పరస్పరసహకారమును అన్యోన్యగుణగ్రహణమును నేర్పునట్టి సంస్థ యొకటి యెంతయు ఆవశ్యకము. ఇచ్చట నేను చేయుచుండు పనినిగూర్చిన అభినందనమును తెల్పుటకు కల్కత్తాలో ఏర్పాటైన సమావేశమునకు ఐదులక్షల ప్రజలు వచ్చిరి – తక్కినచోట్లలోను ఆసమావేశాలకు ప్రజలు నూర్లకొలదిగ వచ్చిరి. సరియే, మంచిదే. కాని వారిలో ఒక్కొక్కనిని ఒక్క అణా ఇమ్మని అడుగుదువేని వా రిత్తురా? శిశూచిత పరాధీనతయే మన శీలసర్వస్వము. అన్నమును నోటి కందింతుమేని మెక్కుటకు వా రందఱునుసిద్ధులే. అన్నమును గొంతులో క్రుక్కు మని కోరువారును కొంద ఱున్నారు.... మిమ్ము మీరుద్ధరించుకొనజాలరేని, జీవించియుండుటకు మీ కర్హత లేదు....

సామాన్యజనులలో విద్యను వ్యాపింపజేయవలె ననెడి నా పన్నాగమును ప్రస్తుతమునకు మానుకొన్నాను. మెట్టుమెట్టుగా

అది సిద్ధించును. నా కిప్పుడు కావలసిన దేమనగా, ఉత్సాహ సంభరితులైన ప్రచారకుల జట్టు. మద్రాసులో మన కొక కాలేజీ ఉండ వలెను. మతముల పోలికలను చీలికలను సంస్కృతభాషను వివిధవేదాంతమతములను కొన్ని యూరపియను భాషలను అచట నేర్పవలెను. మన కొక ముద్రణాలయ ముండ వలెను. ఆంగ్ల మందును దేశభాషలందును పత్రికలను ముద్రింపవలెను. ఇది చేసిన నీవు కొంత సాధించినట్లుగా నేననుకొందును. పాటుపడు టకు సిద్ధముగ నున్నామని దేశీయులను చూపనిండు. ఇటువంటి ఏ పనినిగాని భారతదేశమున చేయుట నీకు శక్యము కానిచో నన్ను నాకే విడిచిపెట్టుము. నే నొసంగ వలసిన సందేశమున్నది. దాని నర్థముచేసికొనగలవారికి, అమలుపఱుపగలవారికి న న్నుపదేశింపనీ. సందేశమును ప్రతిగ్రహించువారు ఎవరైనను నాకేమి? "నాతండ్రి సంకల్పమును ఎవడు నెఱవేర్చునో వాడు నావాడు"...

నాపేరునకు ప్రాధాన్య మొసంగరాదు. నాకు కావలసినది నాఆశయములకు అమలుజరుగుట. సకలప్రవక్తల శిష్యులును గురుదేవుని ఆశయములను గురుదేవుని వ్యక్తిని విడదీయరాని విధముగా కలిపివేయుచుందురు. తుదకు గురుదేవునివ్యక్తికై ఆయన ఆశయములను చంపుచుందురు. ఇట్లు జరుగనీయక శ్రీ రామకృష్ణుని శిష్యులు జాగ్రత్త వహింపవలెను. ఆశయమునకై పాటుపడుడు, వ్యక్తికై కాదు. దేవుడు మి మ్మనుగ్రహించుత.

ఆశీస్సులతో,

సదా భవదీయ

వివేకానంద

## 158

(శ్రీ త్రిగుణాతీతానందస్వామికి)

268 పడమర, 39, న్యూయార్కు,
జనవరి 17, 1895.

ప్రియ శారదా,

నీవు వ్రాసిన రెండుజాబులును రామ్దయాళ్బాబు వ్రాసిన రెండు జాబులును చేరినవి. సరకుల బిల్లు చేరినది. కాని సరకులు చేరుటకు చాలకాలము పట్టును. సరకులు సకాలమునకు రవాణా యగునట్లు ఏర్పాట్లు చేయకున్న అవి చేరుటకు ఇంచుమించు ఆఱు మాసములు పట్టును. రుద్రాక్షమాలలను దర్భచాపలను పంపినా నని హరమోహనుడు జాబు వ్రాసి నాలుగునెలలైనవి. అవి యెక్కడున్నవో, ఆవార్త సైతము తెలియదు. ఏమి జరుగు ననగా సామానులు ఇంగ్లండుకు చేరినపుడు ఇక్కడ ఉన్న ఆకంపెని ఏజెంటు నాకు తెలుపును. తర్వాత ఇంచుమించొక నెలలోపుగా సామానులు వచ్చును. మీసరకులరవాణాబిల్లు నాకు చేరి మూడు నెలలైనవి. నోటీసుజాడయైనను లేదు. ఖేత్రీ మహారాజాగారు పంపిన సరకులుమాత్రము త్వరగా చేరినవి. అందుకై ఆయన చాల డబ్బును ఖర్చుపెట్టుచుండును. ఐనను భూగోళమునకు ఈవలిచివరయైన ఈ పాతాళలోకమునకు సామానులు తప్పిపోక చేరుచున్న వనుట అభినందనార్హవిషయమే. సామానులు నాకు చేరిన తక్షణమే నీకు తెల్పెదను. ఇప్పుడు కనీసము మూడునెలలవఱకైనను ఊరకుండుము!...

పత్రికను ప్రారంభించుపనికి నీవు పూనుకొనుటకు అనుకూలమైన కాల మిదే. రామ్దయాల్బాబు ఎవరిని గుఱించి చెప్పుచున్నాడో అతడు సమర్థుడే కావచ్చు. కాని ఎవరినిగాని అమెరికాలో నాతో నుంచుకొనదగిన పరిస్థితిలో నేను లేనని రామ్ద

యాల్బాబుతో చెప్పుము.... టిబెట్టును గూర్చిన నీ వ్యాస మే మైనది? మిఱ్ఱరు పత్రికలో అది ప్రకటింపబడినప్పుడు నా కొక ప్రతిని పంపుము. రావోయి, రా, ఇదిగో నీవు చేయవలసినపని:— ఆపత్రికను నడపుచుండుము. దానిని ప్రజల కంటగట్టుము. వారు దానికి చందాలు కట్టునట్లు చేయుము. భయపడకు. సంకుచిత హృదయులనుండి ఏమి పని నెఱవేఱు నని నీవు నిరీక్షింతువు? వారిచే నెఱవేఱుపని ప్రపంచములో లేనే లేదు. సముద్రమును దాటవలె ననిన నీకు ఇనుమువంటి సంకల్ప ముండ వలెను. కొండ లలో చొచ్చుకొనిపోగల్గిన బలము నీ కుండవలెను. పై చలికాల మప్పటికి నేను వత్తును. మనము జగమును (ఉత్సాహ)వహ్నితో మండింతము. ఇష్టమున్న వారు వచ్చి మనతో కలిసి ధన్యు లగు దురు గాక. రానివారు కలకాలము వెనుకబడియుందురు. పడి యుండనీ. మీరు నడుముకట్టి సంసిద్ధులరై యుండ వలెను.... దేనినిగాని ఎప్పుడుగాని లక్ష్యపెట్టకుడు. సరస్వతీదేవి మీజిహ్వల పైని మీహస్తములందు అధివసించును. అనంతశక్తియగు సర్వే శ్వరుడు మీహృదయపీఠము నధిష్ఠించియుండును. విశ్వమును ఆశ్చర్య స్తబ్ధముగ నొనర్చు పనులను మీరు కావింతురు. మఱొక మాట. నాయనా, నీ పేరును మఱికొంత చిన్నదిగా చేసికొన లేవా? ఎంత పొడుగైన పేరు! ఒకగ్రంథమునే నింపుటకు చాలి నంత పొడుగుగల పేరు! సరి, భగవన్నామము మృత్యువును పాఱద్రోలు నని ప్రజలు చెప్పగా నీవు వినుచుందువు. అట్లు మృత్యువును నెట్టివేయగలది "హరి" అనెడి సరళనామము కాదు, జ్ఞాపక ముంచుకో. మఱివేవి అనగా "అఘభగనరకవినా శన" "త్రిపురమదభంజన" "అశేష నిశ్శేష కల్యాణకర"— అను నిత్యాది శ్రావ్యగంభీరనామములే. ఇవి మృత్యుదేవతను సపరివారముగ పాఱద్రోలును. నీపేరును ఇంచుక సరళముగ చేసికొంటివేని బాగుండదా? కానీ ఇప్పటికే ఆపేరు విదేశములకు వ్యాపించినందున కాలాతీతమైన దేమో అని భయపడుచున్నాను.

నామాట నమ్ము—నీపేరు* విశ్వమోహనము, మృత్యునిరా సకము.

భవదీయప్రేమయుత
వివేకానంద

మఱిమాట : బంగాళమును, బంగాళమునుమాత్రమే కాదు, భారతదేశమునంతటిని గడగడలాడింపుడు. వివిధప్రదేశములలో కేంద్రములు ప్రారంభింపుడు.

భాగవతము నాకు చేరినది. నిజముగ చాల చక్కని ముద్రణము. కాని ఈ దేశప్రజలకు సంస్కృతమును చదువుట యందు అభిరుచి ఇంచుకేని లేదు. కావున అది అమ్ముడు పోవు ఆసపాటు చాల తక్కువే. ఇంగ్లండులో ఇంచుక అమ్ముడు పోవ వచ్చు. ఏలయన సంస్కృతమును చదువుటలో అభిరుచికలవారు అచ్చట చాలమంది యున్నారు. ఆసంపుటసంపాదకునకు నాప్రత్యే కాభినందనములను అందింపుము. ఉదాత్తమైన ఆయన ఉద్య మము సమగ్రవిజయవంత మగు నని ఆశించుచున్నాను. ఆయన పుస్తకమును ఇచ్చట వెలపుచ్చుటకు నాచేతనైనంతవఱకు నేను ప్రయత్నించెదను. అతనిపుస్తకాలవెలపట్టికను నేను వివిధప్రాంత ములకు పంపియున్నాను. పెసరపప్పు మినుపపప్పు మున్నగు సరకు లలో అమెరికాయందును ఇంగ్లండునందును మంచి లాభకరమైన వ్యాపారమును ప్రారంభింప వీలగు నని రామ్దయాల్బాబుతో చెప్పుము. సరిగా రుచిమాపుదుమేని పప్పుచారు మంచివ్యాప్తి లోనికి వచ్చును. దానిని మొత్తముగ సంగ్రహించిపెట్టుటకు ఒక అంగడిని పెట్టవలెను. చిన్నచిన్నపొట్లములుగ తయారుచేయ వలెను. వండవలసినవిధానమును ఆపొట్లముమీదనే ముద్రించి

* శ్రీ త్రిగుణాతీతస్వామికి వ్రాయబడిన జాబిది. ఆయన పూర్తిపేరు శ్రీ త్రిగుణాతీతానందస్వామి. దానిని గూర్చి ఇక్కడ స్వామిజీ పరిహాసము చేయుచున్నారు.

పెట్ట వలెను. అట్టి పొట్లములను ఇంటింటికి పంపుదుమేని అధిక సంఖ్యాకులు కొనుదురు. అట్లే 'బర్ఫా (పప్పుఉండ)లు బాగుగా అమ్ముడుపోవును. ధైర్యోత్సాహములు మనకు కావలయును. సోమరిజీవితములను నడపినచో ఏమియు సాధింపబడదు. ఎవరైన ఒకకంపెనీని ఏర్పఱచి ఇండియానరకులను ఇక్కడికిని ఇంగ్లండునకును ఎగుమతిచేసిన మంచి వ్యాపారము సాగును. కాని మనవారి జట్టు సోమరుల జట్టు....

## 159

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

1895.

ప్రియ రాఖాల్,

ఇప్పుడు నాయొద్ద వార్తాపత్రికలు మున్నగునవి రాసులు రాసులుగ నున్నవి. కావున ఇక మీద మీరు ఏపత్రికలను పంపనక్కఱలేదు. ప్రస్తుతము ఉద్యమము భారతదేశమునట్టుకే ఉండనీ...

ప్రతిదినము ఒక ఉద్రేకమును లేపినందువలన ఎక్కువ ప్రయోజన ముండదు. కాని ప్రస్తుతము దేశమంతట హెచ్చియున్న ఈ సంచలనమును మీ రుపయోగించుకొనుడు. అన్ని దెసలకును వ్యాపింపుడు. అనగా వివిధప్రదేశములలో శాఖలను ప్రారంభించుటకు ప్రయత్నింపు డన్న మాట. సారములేని సద్దుమాత్రముగ దాని నుండనీయకుడు. మీరు మదరాసువారితో కలిసి వివిధప్రాంతములలో సంఘములు మున్నగువానిని స్థాపింపవలెను. పత్రికను ప్రారంభింప నున్నా రని వినియుంటినే, దానిని గూర్చి ఏమి? దానిని నడపుటకు మీ రెందుకు జంకుచున్నారు?... రండి, వీరులరై ఏమేని చేయుడు. సోదరా, ముక్తి నీకు కలు

కున్న నేమి ? కొన్ని పర్యాయములు నీవు నరకమును అనుభవిం
చిన నేమి ?

మనసి వచసి కాయే పుణ్యపీయూషపూర్ణా
స్త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయన్తః।
పరగుణపరమాణూన్ పర్వతీకృత్య నిత్యం
నిజహృది వికసన్తః సన్తి సన్తః కియన్తః॥

"తలంపులందును మాటలందును చేతలందును పుణ్యామృత
పూర్ణులై ముల్లోకముల వారిని ఉపకారపరంపరలచే సంప్రీతి
నొందించుచు పరులందు పరమాణువంత మంచిగుణమున్నను
దానిని పర్వతమంతటిగుణముగా గ్రహించుచు హృదయవికాస
మొందు సత్పురుషులు కొందఱున్నారు" అనెడి (భర్తృహరి)
సుభాషిత మసత్యమా ?

నీకు ముక్తి కలుగకున్న నేమి ? ఏమి శిశుజల్పిత మిది !
రామరామ! దృఢముగ "నిర్వీర్యము" అందు మేని సర్పవిషము
సైతము నిర్వీర్య మగు నని చెప్పుదురు. అది నిజము కాదా ?
"నే నజ్ఞుడను" "నే నకించనుడను" అని చెప్పుకొను ఈ విపరీత
వినయ మేమిటి ? నేను చెప్పుచున్నాను — ఇది కపటవినయము,
కపటత్యాగము. ఈస్వదైన్యానుసంధానప్రవణతను దులిపివేసి
కొనుము. "నేను తెలియనివాడ నగుచో భువి నిక తెలిసినవా
డెవడు!" ఇప్పుడు నీకు తెలియదందువేని, ఇన్నాళ్లును ఏమిచేయు
చుంటివి? ఇవి నాస్తికుని మాటలు. ఊర్ధ్రిమ్మరియగు దౌర్భా
గ్యుని వినయము. మనము అన్నిటిని చేయగలము. అన్నిటిని
చేయుదుము! సారహీనులు వారుండుమూలలనుండి పిల్లులవలె
కూయుచుందురుగాక, చాలినంత అదృష్టము కలవా రందఱు వీర
మార్గమున మనతో నేకీభవింతురు. ఒకయోగి "మంచిది,
ఇంతవఱకు నీకు కల్గిన ప్రఖ్యాపనము చాలును. ఇంటికి మరలి
రమ్ము" అని వ్రాయుచున్నాడు. ఒకగృహమును నిర్మించి నన్ను

పిలుచునేని అప్పుడు నే నతని నొక మనుష్యుడందును. అట్టి విష యములలో పదేండ్ల అనుభవము నావివేకమును పెంపొందించినది. నే నిక మాటలకు మోసపోను. మనసున ధైర్యమును హృదయ మున ప్రేమయు కలవారుమాత్రము నాతో వత్తురు గాక. ఇతరు లెవ్వరును నా కక్కఱలేదు. జననికృపచే అసహాయముగ నేను ఇపుడొకలక్ష కధికారినై యున్నాను. ఇరువదిలక్షల కధికారిని కాగలను... నేను భారత దేశమునకు మరలివత్తు నను నిశ్చయము లేదు. ఇక్కడ ఊరులు ద్రిమ్మరుచున్నాను. అక్కడికి వచ్చినను నేను అట్టి త్రిప్పటబ్రతుకే బ్రతుకవలసియుండును. కాని ఇక్కడ చుట్టునుండు వా రందఱును విద్వాంసులు. అక్కడ చుట్టునుండు వారు మూర్ఖులు. ఇక్కడికిని అక్కడికిని గల భేదము ఉత్తర ధ్రువమునకును దక్షిణధ్రువమునకును ఉన్నంత. ఈదేశ ప్రజలు ప్రణాళికలు నిర్మింతురు, పనులు నిర్వహింతురు. మన ఉద్యమము లన్నియు సోమరితనము, ఈర్ష్య మున్నగువానిచే హతములై నేలపా లగును. సోమరితనమునకు వైరాగ్య మని తప్పుపేరు పెట్టుదుము.'......'అను ఆయన అప్పుడప్పుడు నాకు పెద్దజాబులు వ్రాయుచుండును. అందులో సగము నేను చదువ లేని జిలుగుగా నుండును. అట్లుండుట నాకు మేలే. అందలి వార్తలలో చాలవఱకు ఈక్రిందిరీతి నుండును — ఫలానాచోట, ఫలానావారు నన్ను దూషించుచుండినారు. ఆదూషణను సహింప లేక ఇతడు అతనితో జగడమాడినాడు—ఇత్యాది. దయతో నా పక్షమును సమర్థించినందుకు అతనికి నాపరశ్శతధన్యవాదములు. కాని వారును వీరును నన్నుగూర్చి చెప్పుచుండుమాటలను విన నీయక తీవ్రముగ నన్ను అడ్డగించున దిది — "స్వల్పశ్చ కాలో బహవ శ్చ విఘ్నాః" "కాలము స్వల్పము అడ్డంకులుపెక్కులు."

సాంగోపాంగనిర్మాణముగల సంఘ మొకటి కావలెను. ఇంటిపనులను శశిని చూచుకొననిమ్ము. డబ్బు లావాదేవులును అంగడిపనులును సన్యాలు పర్యవేక్షణలో నుండనిమ్ము. శరత్తు

కార్యదర్శిపనిని — అనగా జాబులు జవాబులు నడపుటను నిర్వ హింపనిమ్ము. శాశ్వతమైన కేంద్రమును ఏర్పఱుపుడు. ఇప్పుడు మీరు చేయుచుండు ఆకస్మికప్రయత్నాలు ఉపయోగపడవు. నేను చెప్పదలంచినది నీ కర్థమైనదా? నాయొద్ద వార్తాపత్రికల పెద్ద మోపొకటియున్నది. మీ రిప్పు డొక్క-పనిని చేయవలె నని నా కోరిక. ఒకమరమును నిర్మింపగలరేని మిమ్ము వీరు లందును. లేకున్న మీ రేమియును .కారు. పనిచేయునప్పుడు మీరు మద రాసుప్రజలతో సలహాపడుడు. వారికి కార్యనిర్వహణశక్తి ఎక్కు-వ. ఈసంవత్సరపు శ్రీరామకృష్ణోత్సవమును గ్రంథముల కెక్కు-నంత వైభవముతో జరుపుడు. అన్నదాన ప్రచారము ఎంత తగ్గిన అంత మేలు. చేతులమీదుగ అందించు రీతిగా ప్రసా దమును పంచిపెట్టితిరేని చాలును.…

నేను ఇంగ్లీషులో శ్రీరామకృష్ణునిజీవితమును మిక్కి-లి సంక్షేపించి వ్రాయబోవుచున్నాను. దానిని మీ కంపెదను. దానిని అచ్చువేయింపుడు. బెంగాలీలోనికి అనువదింపుడు. ఉత్సవ మప్పుడు దానిని అమ్ముడు. ఉచితముగ పంచిపెట్టిన పుస్తకాలను ప్రజలు చదువరు. పేరుకు ఏదో కొంత వెలను నిర్ణయింపుడు. ఉత్సవమును మహావైభవముతో జరుపుడు.

పనిని చక్క-గా నిర్వహించుటకు మీకు సర్వతోముఖమైన ప్రజ్ఞ యుండవలెను. మీరు పోవుపల్లెలలోను పట్టణములలోను శ్రీరామకృష్ణునందు భక్తిగలప్రజలు కొందఱు కనిపించిన ప్రతి చోటను ఒకసంఘమును ప్రారంభింపుడు. మీరు అన్నిగ్రామము లలో సంచరించినది నిష్ప్రయోజనముగానా? హరిసభలను అట్టి ఇతరసంఘములను మనము మెల్లగా మనలోనికి ఆకర్షించుకో వలెను. సరి, సమస్తమును మీకు నేను చెప్పలేను. నావంటి రాక్షసుని మఱొకని నేను సంపాదింపగల్గిన! – సమయము వచ్చి నప్పుడు సర్వేశ్వరుడు నాకు సమస్తమును సమకూర్చును.…శక్తి

గలవాడు శక్తిని పనిలో చూప వలెను. మీభక్తిముక్తిభావాలను పాఱద్రోలుడు. లోకమున నున్న మార్గ మొక్కటే. "పరోప కారాయ సతాం హి జీవితమ్, పరార్థే ప్రాజ్ఞ ఉత్సృజేత్" పరుల కుపకరించుటకే సజ్జనులు జీవించియుందురు. ప్రాజ్ఞుడు పరార్థము తన్ను అర్పించుకొనవలెను." నీకు హితముచేయుట చేతనే నేను నాకు హితము చేకూర్చుకోగలను. వేఱుదారి లేదు. లేనే లేదు.....నీవు దేవుడవు. నేను దేవుడను. జీవుడు దేవుడే. మానవకోటిలో మూర్తిభవించిన ఈదేవుడే లోకమున సమస్త మును చేయుచున్నాడు. ఊర్ధ్వమున ఎచ్చటనో ఆసీనుడై మఱొక్క దేవు డున్నాడా? కావున పనికి పూనుకొనుడు.

శశి (సన్యలు) వ్రాసిన పుస్తకమును బిమల నాకు పంపి నది.......ఆగ్రంథమును చదివి బిమల తెలిసికొన్న విషయము: ప్రపంచప్రజలందఱు అపవిత్రులు. రవంత ఆధ్యాత్మికపరతకైనను అర్హత లేనివారినిగ వారిని వారి ప్రకృతియే త్రోసివేసినది. భారతదేశమున ఒకపిడికెడు మంది బ్రాహ్మణులకు మాత్రమే ఆధ్యాత్మికపరతకు సర్వాధికార మున్నది. ఆపిడికెడుమందిలో, చెప్పవలయునన్న, ఈశశి (సన్యలు) సూర్యుడు; ఈ బిమల చంద్రుడు. భేష్! నిజమునకు ఎంత ప్రభావపూర్ణమైన మతము. ముఖ్యముగ బెంగాలులో అట్టి మతము అమలుకు వచ్చుట చాల సులభము. అంతకంటె సులభతరమైన మార్గము లేదు. అన్ని తపస్సుల అన్ని ఆధ్యాత్మికసాధనల నిజము నంతటిని సూత్రప్రాయ ముగ చెప్పవలె ననిన — నేను పరిశుద్ధుడను. తక్కిన వారంద ఱును అపవిత్రులు. ఈమతము మృగోచితము, రాక్షసోచితము, నరకసదృశము. అమెరికనులకు ఆధ్యాత్మికధర్మార్హత లేదేని ఆధ్యాత్మికధర్మమును ఇచ్చట ప్రచారముచేయుట కూడ దేని, ఇక వారి సాయ మపేక్షించు టెందుకు?...అట్టి వ్యాధిని ఏమందు కుదుర్పగలదు? మంచిది. శశిని (సన్యలును) మలబారునకు

పొమ్మను. అక్కడి రాజు తనప్రజల భూమిని లాగుకొని దానిని బ్రాహ్మణులచరణముల కర్పించినాడు. ప్రతిగ్రామములోను పెద్ద మఠము లున్నవి. ఆమఠములలో సమృద్ధముగ విందులుపెట్టి ధన బహుమానములనుగూడ ఇచ్చుచుందురు....ఏదే నొక పనిగల్గి నప్పుడు బ్రాహ్మణేతరుని స్పృశించినను ఆపనిపూర్తికాగానే స్నానము చేసినచో అస్పర్శదోష ముండదు. బ్రాహ్మణేతరుల వర్గమంతయు అపవిత్రమైనది. వేఱు సమయములలో వారి నంట రాదు. బైరాగులును సన్న్యాసులును ఒకానొకరకపు బ్రాహ్మణు లును దేశమునకు వినాశమును గూర్చిరి. సదా చౌర్యదార్జన్య ములపైనే మన సుంచుకొని వీరు పైకి మతగురువులుగా అభిన యించుచుందురు. ప్రజలర్పించు విరాళములను కైకొనుచునే "నన్నంటకుడు" అని అఱచుచుందురు. ఇక వారు ఎంత గొప్ప పనులను చేయుచు వచ్చిరి!—"ఉర్లగడ్డకు వంకాయకు పరస్పర స్పర్శగల్గిన ఇక నెన్నాళ్ళకీజగమునకు ప్రళయముగలుగును! "మట్టి అలదుకొని పండ్రెండుసార్లు తమ చేతులను ఎవరు కడుగు కొనరో వారి వంశపూర్వులలో నరకమున పదునాల్గుతరముల వారు పడుదురా ఇరువదినాల్గు తరములవారుపడుదురా? ప్రజలలో నాల్గవ వంతువారు పస్తుచచ్చుచుండగా గడచిన రెండువేలేం డ్లుగా ఇట్టి సూక్ష్మసమస్యలకు వారు శాస్త్రీయపరిష్కారములను కనుగొనుచుండినారు. ఎనిమిదేండ్ల పిల్లను ముప్పదేండ్లవాని కిచ్చి పెండ్లిచేయుచున్నారు. ఆపెండ్లికి కన్యతల్లిదండ్రులు సంతోషించు చున్నారు. ఎవడేని దీని నాక్షేపించునేని "మనమతసంప్రదాయ ములు తలక్రిందులు చేయబడుచున్నవే" అని వాదింతురు. యౌవనమైనను వచ్చుటకు ముందే తమబాలికలు తల్లు లగు టను చూడ గోరుచు అందుకు శాస్త్రీయసమాధానములు చెప్పు వీరి ఆస్తిక్యము అదెట్టిదో? అనేకులు ఈదురాచారబాధ్యతను మహమ్మదీయుల కంటగట్టుదురు. నిజముగ నింద్యులు వారే! గృహ్యసూత్రములను పూర్తిగ చదువుడు. కన్యకు వివాహార్హ

వయస్సు ఏ మని చెప్పబడియున్నదో చూడుడు....కన్యకు చాల పసిప్రాయమందే పెండ్లిచేసి వేయవలె నని అందు స్పష్టముగ చెప్పబడియున్నది. గృహ్యాసూత్రగ్రంథమంతయు దీనినే విధించు చున్నది. ఇక వైదికాశ్వమేధయజ్ఞసందర్భములో ఇంతకన్నను నిహీనకృత్యములు చేయుదురు. బ్రాహ్మణము లన్నియు వానిని చెప్పుచున్నవి. వ్యాఖ్యాత లందఱు అవి నిజములే అని అంగీక రించుచున్నారు. నీవెట్లు కా దన గలవు ?

వీని నన్నిటిని పేర్కొనుటచే నేను చెప్పనెంచినదిది:— ప్రాచీనకాలములో పెక్కు సదాచారము లుండినవి. దురాచా రములును ఉండినవి. సదాచారములను ఉంచుకోవలెను. కాని భవిష్యద్భారతము ప్రాచీన భారతమునకంటె చాలగొప్పదిగ నుండవలెను. శ్రీరామకృష్ణు డవతరించినదినమే నవ్యభారతాభి వృద్ధికిని స్వర్ణయుగమునకును ప్రారంభదినము. ఈస్వర్ణయుగ మును తెచ్చుటకు నిమిత్తభూతులు కావలసినవారు మీరు. హృదయమున ఈదృఢవిశ్వాసముతో పనికి నడుముకట్టుడు.

శ్రీరామకృష్ణుని అవతారమూర్తి అని చెప్పుచునే నిస్సం కోచముగ మీ అజ్ఞానమును సాకుగా చెప్పుదురేని "మీరు ఆమూలాగ్రము వంచకులు అని నే నందును. పరమహంస శ్రీ రామకృష్ణుడు సత్య మగు నేని మీరును సత్యమే. కాని ఆనిజ మును మీరు చూపవలెను.... మీఅందఱిలో అత్యంతికమైన శక్తి యున్నది. నాస్తికునిలో కశ్మలము తప్ప వేఱేమియు లేదు. విశ్వాస మున్నవారు వీరులు. అత్యంతికమైన శక్తిని వా రావిష్క రింతురు. వారియెదుట ఈసంసారము కొట్టుకొనిపోవును. "పేదల పట్ల ఉపకారసానుభూతులు" "జీవుడు దేవుడే. నరుడు నారా యణుడే." "ఆత్మకు స్త్రీపురుషభేదము గాని బ్రహ్మక్షత్రియాది వర్ణవిభేదముగాని, ఎట్టి విభేద మును లేదు" "బ్రహ్మాదిస్తంబ పర్యంతము సమస్తమును నారాయణుడే" క్రిమిలో ఆవిష్కృతి

తక్కువ. స్త్రష్టలో ఆవిష్కృతి ఎక్కువ. ఏప్రాణియైనను లోని దివ్యతను వెలువరించుకొన తోడ్పడు ప్రతిపనియు ధర్మమే. అందుకు ప్రతికూలమైన ప్రతిపనియు అధర్మమే.

మనలోని దివ్యతను ఆవిష్కరింప జేసికొనవలె ననిన అందు కేకైకమార్గము దివ్యతనావిష్కరించుకొనుటకు ఇతరులకు తోడ్పడుటే.

ప్రకృతిలో వైషమ్య ముండునేని అవకాశము లందఱికిని సమానముగ నుండవలయును. అవకాశములు కొందఱి కెక్కువగను కొందఱికి తక్కువగను ఉండవలయునేని బలవంతులకంటె దుర్బలులకు అవకాశముల నెక్కువగ నీయవలెను.

విద్య చండాలునకు కావలసియున్నంతగా బ్రాహ్మణున కక్కఱ లేదు. బ్రాహ్మణకుమారునకు ఒక్కగురువు కావలసి యున్న చండాలకుమారునకు పదుగురు గురువులు కావలెను. అనగా ప్రకృతిచేత ఎవరికి పుట్టినప్పటినుండి చుఱుకైన బుద్ధి లేదో వారికి ఎక్కువసాయము సమకూర్పవలెను. జలనిధికి జలదానము చేయువాడు వెఱ్ఱివాడు! పేదలు, నిమ్నులు, అజ్ఞులు — వీరే మీకు దైవము లగుదురు గాక.

మీయెదుట భయంకరమైన గొయ్యి ఉన్నది. జాగ్రత్త పెక్కండ్రు అందు బడి చచ్చుచుందురు. గొయ్యి అనగా ఇది!— హిందువుల ఇప్పటి మతము వేదములలో లేదు. పురాణములలో లేదు. భక్తిలో లేదు. ముక్తిలో లేదు. మతము వంటకుండలో చొచ్చుకొన్నది. హిందువుల ఇప్పటి మతము జ్ఞానమార్గమును కాదు హేతువాదమును కాదు. అది ''నన్నంటకు'' మనెడి మతము. ''నన్నంటకు'' ''నన్నంటకు''—ఇదే వారి మతసర్వస్వము. ''నన్నంటకు'' మనెడి ఈఘోరాధర్మమున మీ జీవితములను కోల్పోకుండునట్లు చూచుకొనుడు. ''ఆత్మవత్సర్వ భూతేషు'' ''తన్నుచూచుకొన్నట్లే ఎల్లరను చూడవలెను.''

అను ఉపదేశము గ్రంథములలోమాత్రమేనా ఉండవలసినది? ఆకలిచే నకనకలాడుచున్నవానికి ఒకరొట్టెముక్క నీయ లేని వానికి వారు మోక్షము నెట్లు ప్రసాదింతురు. ఇతరుల నిశ్శ్వాసము తమ్ము సోకినంతనే అపవిత్రులగువారు ఇతరుల నెట్లు పవిత్రీకరింప గలరు? "నన్నంటకు" మనెడి ఈమతము ఒకవిధమైన మానసికవ్యాధి. జాగ్రత్త. అన్నివిధములైన వికాసము, జీవితము. అన్నివిధములైన హ్రాసమును మరణము. అన్నివిధములైన ప్రేమయు వికాసమే. అన్నివిధములైన స్వార్థపరతయు హ్రాసమే. కావున ప్రేమయే జీవితమునకు ఏకైకధర్మము. ప్రేమగలవాడు ప్రాణముగలవాడు. స్వార్థపరుడు మరణావస్థలో నున్నవాడే. కావున బ్రతికియుండుటకు శ్వాసపీల్చుకొనురీతి ప్రేమకొఱకే ప్రేమింపుడు. ఏలయన జీవితమున ఏకైకనియమము, ధర్మము—ప్రేమయే. స్వార్థరహితప్రేమ, స్వార్థరహితకర్మాచరణము మున్నగువాని మర్మ మిదే.... నీకు శక్యమగునేని ఏదో యొక మార్గమున శశికి (సన్న్యాసికి) తోడ్పడ ప్రయత్నింపుము. అతడు చాలమంచివాడు, సాత్త్వికుడు. కాని అతనిహృదయము సంకుచితము. ఇతరుల దుఃఖమునకు సానుభూతి గల్గియుండు ప్రాప్తి అందఱికి నుండదు. శివశివా, అన్నిఅవతారములకంటెను చైతన్యదేవునవతారము గొప్పది. కాని ఆయనలోను జ్ఞానము రవంత తక్కువే. జ్ఞానము, భక్తి, ప్రేమ — అనంతజ్ఞానము, అనంత ప్రేమ, అనంతకర్మాచరణము అనంతజీవకారుణ్యము—ఇవి ఉండునది రామకృష్ణావతారముననే. ఇంకను నీ వాయనను అర్థము చేసికొనలేకున్నావు. "శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్." "పరమాత్మను గుఱించి వినియు ఎవ్వరును తెలిసికొనలేకున్నారు." సమస్తహిందూజాతియు యుగములకొలదిగ దేనిని భావించుచుండెనో దానినాయన ఒక్కజీవితములో ఇముడ్చుకొనెను. అన్నిదేశముల వేదములకును ఆయనచరిత్రము సజీవవ్యాఖ్యానము. ప్రజలు ఆయనను గుఱించి మెట్టుమెట్టుగ తెలిసికొందురు. నా

ప్రాతసాంకేతికసూక్తి "దారిచేసికొని వెలుగు జేర పురోగమింపుడు. పదంపి ముందుకు".

సేవాసక్త భవదీయ
వివేకానంద

## 160

(శ్రీమతి ఓల్బుల్సుతికి తండ్రిమరణించినప్పుడు వ్రాసినజాబు)

బ్రూక్లిన్,
జనవరి 20, 1895.

ధీర మాతా,*

...నీతండ్రిగారు జీర్ణదేహమును త్యజింతు రని నామనసు నాకు ముందే చెప్పియుండినది. జీవితసంగీతమును చెడగొట్టగల మాయాతరంగము ఒకరిపై పడ నున్నప్పుడు వారికి జాబు వ్రాయుట నా వాడుక కాదు. జీవితములో ఇవి గొప్ప మలుపు ఘట్టములు. నీవు తొణకకున్నా వని నే నెఱుగుదును. సముద్రపు పై భాగమున అలలు లేచుచు పడుచునుండును. కాని నిశితముగ పరికించువానికి (జ్ఞాన) తేజఃపుత్రునకు ఒక్కొక్కసారి "పాటు" కలిగినప్పుడును లోతు మఱింతగా స్పష్ట మగును. అడుగున నున్న మౌక్తికములును ప్రవాళములును కననగును. రాక పోకలు వట్టి మాయ. ఎప్పుడుగాని ఆత్మకు రాకయు లేదు. పోకయు లేదు. విశ్వమంతయు ఆత్మలోనే యుండగా ఇక ఆయాత్మ పోవు టెక్కడికి? కాల మంతయు ఆత్మయందే యుం డగా చొచ్చుటకును వెలువడుటకును కాల మేది?

భూమి తాను పరిభ్రమించుచు సూర్యుడు కదలుచున్నట్లు భ్రాంతిని కలిగించును. కాని సూర్యునకు కదలిక లేదు. అట్లే

---

* శ్రీమతిఓల్బుల్సుతిని స్వామిజీ ఇట్లు పిలుచుటవాడుక.

ప్రకృతి, మాయ, కదలుచుండును, మాఱుచుండును. ఒకటి తర్వాత నొకటిగా తెఱలు తెఱచుకొనుచుండును. ఈబృహద్గ్రంథమున ఒకటివెంబడినొకటిగా పుటలు తిరుగుచుండును. కాని సాక్షిగ నుండు ఆత్మజ్ఞానమును పానముచేయుచుండును. ఆత్మకు కదలిక లేదు, మార్పు లేదు. చన్న, ఉన్న, రానున్న సకలాత్మలకును కాలము వర్తమానమే. భౌతికోపమానము చెప్పవలయు నన్న — అన్నియు క్షేత్రగణితమందలి చుక్కలలో నిలబడియున్నవి. దేశము అనెడి ఆశయము ఆత్మయందు స్ఫురించును కావున ఇంతకు ముందును ఇప్పుడును ఇకమీాదను మనవిగా నుండునవి భూతభవిష్యద్వర్తమానకాలములలో మనతో నుండునవే. వానిలో మన మున్నాము. మనలో అవి యున్నవి.




ఈగళ్లను చూడుము. వీనిలో ప్రతిదియు వేతైనను, అన్నియు అఆయొద్ద వేఱుపఱుపరాక కలసియున్నవి. అక్కడ అవి ఒక్కటే. ప్రతిది ప్రత్యేకము. ఐనను అన్నియు అఆ అనెడి ఇరుసునొద్ద ఒక్కటే. ఆయిరుసు నుండి ఒక్కటియు తప్పించుకొని పోజాలదు. పరిధి ఎంతవిచ్ఛిన్నముగ నున్నను ఇరుసునొద్ద నిలబడితిమేని వీనిలో ఏగదిలోనికైనను మనము ప్రవేశింపవచ్చు. ఈయిరుసే భగవంతుడు. అచ్చట ఆయనతో మనకు ఐక్యము. అన్నియు అన్నిటియందు నున్నవి. అన్నియు దేవునం దున్నవి.

చంద్రబింబమున కడ్డముగ మేఘము తాను కదలుచు చంద్రుడు కదలుచున్నట్లుగా మనకు భ్రాంతిని కలిగించును. అట్లే ప్రకృతి, దేహము భౌతికపదార్థము తాను కదలుచు, ఆత్మ కదలుచున్నట్లుగ భ్రాంతి కలిగించును. ఇట్లు తుదకు మనము ఒకవిషయమును గ్రహింతుము. ప్రతిజాతికి చెందిన మనుష్యులకును, వారు గొప్పవారు కాని తక్కువవారుకాని, మరణించిన

వారి సాన్నిధ్యము తమచుట్టును ఇంకను ఉన్నట్లు అనుభూతమగు చుండును. బుద్ధిమార్గమునను ఇది నిజమే.

ప్రతిఆత్మయు ఒక నక్షత్రము. అన్ని నక్షత్రములును భగవంతు డనెడి ఆ అనంతనీలనభమున నిత్యాకాశమున పొందుపడి యున్నవి. అందఱిమూలమును తత్త్వమును యథార్థవ్యక్తిత్వమును ప్రతియొక్కని మూలమును తత్త్వమును యథార్థవ్యక్తిత్వమును ఉండున దచ్చటనే. మనదృక్పథమును దాటి చనిన ఈనక్షత్రములను కొన్నింటిని వెదకుటతో ఆరంభమైన ఆధ్యాత్మికధర్మము ఈ అన్నింటిని మనలనుగూడ ఆభగవంతునియందే ఉండగా గుర్తించుటలో పర్యవసించినది. కావున రహస్యమంతయు ఇదే. మీ నాయన తాను ధరించియుండిన జీర్ణవస్త్రమును విడిచిపెట్టెను. తననిత్యస్థానమున నిల్చియున్నాడు. ఈ లోకములోగాని మఱొక లోకములోగాని ఆయన మరల నట్టి దుస్తులను ఆవిష్కరించునా? పూర్తిగ తెలిసి అత డావిష్కరించువఱకు అత డట్లు చేయకుండుగాత మని హృదయపూర్వకమైన నాప్రార్థన. ఎవడుగాని తన పురాకృతముల అదృష్టశక్తిచే ఎక్కడికిని లాగబడకుండు గాత మని నాప్రార్థన. అందఱు ముక్తులగుదురు గాక. అనగా అందఱును తాము ముక్తులమే అని గ్రహింతురుగాక అని నాప్రార్థన. వారు మరల కలలు కందురేనియు అవి శాంత్యానందస్వప్నములుగ నుండవలయును నని మనము ప్రార్థింతముగాత.

భవదీయేత్యాది
వివేకానంద

## 161

(శ్రీమతి బుల్లికి)

న్యూయార్కు,
జనవరి 24, 1895.

ప్రియ శ్రీమతి బుల్సని,

స్టర్డీకి నీవు వ్రాసిన జాబు నాకు పంపబడినది. ఆజాబును నీవువ్రాయుట నిపరమకృపావిలసితము. ఈసంవత్సరము నేను నిర్వహించుచున్న పని మితిమీఱిన దేమో అని నాకు దిగులు కలుగుచున్నది.. దానివలని గాసి నాకు తెలియవగుచున్నది. విశ్రాంతి నా కెంతయు ఆవశ్యకమై యున్నది. కావున నీవు చెప్పినట్లు బోస్టనుపనికి మార్చిమాసాంతమున పూనుకొనుట చాల బాగుండును. ఏప్రిలు నెలముగియునప్పటికి నేను ఇంగ్లండునకు బయలుదేఱుదును.

కాట్స్కిల్సు ప్రాంతమున పెద్దపెద్ద భూభాగములు చాల కొంచెపువెలకు కొనుటకు వీలగును. 200 డాలర్లకు లభించు 101 యకరములనేల ఒకటి యున్నది. పైకము నాచేత సిద్ధముగ నున్నది. కాని నేలను నాపేరట కొనుటకు వీలు కాదు. ఈదేశములో నాకు నిండునమ్మకమున్న మిత్రమవు నీ వొక్కతెవే. నీవు అంగీకరింతువేని ఆభూమిని నీపేరట కొనెదను. విద్యార్థులు వేసవిలో అచ్చటికి పోవుదురు. ధ్యానసాధనకై అచ్చట కుటీరములను తమయిచ్చవచ్చినట్లు నిర్మించుకొందురు. తర్వాత విరాళములను వసూలుచేయగలిగినచో వారు ఏదో ఒక కట్టడమును కట్టవచ్చును. నీ విప్పుడే రాజాలనందుకు నేను చింతిలుచున్నాను. ఈనెలకు తుదిభానువారోపన్యాసము రేపే. పై నెల తొలి భానువారమునాడు బ్రూక్లినులో నొక ఉపన్యాస మున్నది. మిగిలినవి

మూడుపన్యాసములు న్యూయార్కులో. ఇంతటితో ఈసంవత్స రపున్యూయార్కు ఉపన్యాసకార్యక్రమమును ముగింతును.

నాచేతనైనంత పాటుపడితిని. అందు సత్యబీజ మేమేని యున్న అది అంకురించును. కాబట్టి దేనినిగూర్చియు నాకు చింత లేదు. ఉపన్యాసకార్యక్రమముచేతను తరగతులలో పాఠములు చెప్పుటచేతను నాకును విసుగు కలుగుచున్నది. ఇంగ్లండులో కొన్ని నెలలు పనిచేసి, తర్వాత భారతదేశమునకు మరలుదును. అచ్చట కొన్ని యేండ్లకాలమైనను లేదా ఇక నెల్లప్పటికైనను పూర్తిగా మఱుగుపడియుందును. నేను సోమరిస్వామిగ ఉండిన వాడను కాననెడి ఆత్మసంతృప్తి నాకు కలదు. నాయొద్ద ఒక నోటుబుక్కు ఉన్నది. నాతోబాటు అదియు ప్రపంచమంతయు పర్యటించినది. ఏడేండ్లక్రింద అందు వ్రాసిపెట్టిన ఈక్రింది మాటలు ఈనాడు నా కనుదాకినవి — "ఇప్పు డొక మూలను వెదకుకొనవలెను. అచ్చట మేను వ్రాల్చి మరణింపవలెను!" కాని ఈకర్మమంతయు నుండెనే. దానిని నేను నిర్వహించితినని అనుకొనుచున్నాను. ఈఉపదేశకార్యమునుండియు ఈసుకృత బంధములను పెంపొందచేసికొనుటనుండియు నన్ను దేవుడు విము క్తునిగ నొనర్చు నని ఆశించుచున్నాను.

"ఉన్న దాత్మ యొక్కటే యనియు వేఱేదియు లేదనియు తెలిసికొన్న పిమ్మట నీ విక నెవరికై ఎందుకై శ్రమలపాల్పడ దవు?" మాయచేతనే ఈసత్కర్మాచరణాదికమంతయు నాబుద్ధి లోనికి వచ్చినది. ఇప్పు డది నన్ను వీడుచున్నది. హృదయము నకు పవిత్రత కల్గించి జ్ఞానప్రాప్తికి దాని నర్హముగ చేయుటే తప్ప వేఱు ప్రయోజనము కర్మాచరణమునకు లే దను నా నమ్మ కము ఇంకనింకను గట్టిపడుచున్నది. ఈప్రపంచము దాని మంచి చెడుగులతో వివిధరూపములలో సాగుచుండును. ఈ మంచిచెడు గులు క్రొత్తస్థానముల నాక్రమించుచు క్రొత్తపేర్లు పెట్టుకొనుచు

నుండును, అంతే. శాంతికై నిత్యాత్మబద్ధిశ్రాంతికై నాఆత్మ తహతహపడుచున్నది.

"ఏకాకివిగ బ్రతుకుము, ఏకాకివిగ బ్రతుకుము" ఏకాకిగ నుండునతనికి ఎప్పుడుగాని ఎవరితోగాని సంఘర్షణము కలుగదు. అతనివలన ఇతరులకు గాని ఇతరులవలన అతనికిగాని సంక్షోభముండదు. నాజీర్ణవస్త్రములు, నాగుండుకొట్టించుకొన్నతల, చెట్లనీడలో నానిద్ర నాభిక్షాన్నము—ఇవి మరల ఎన్నడు లభించునో అనినేను ఉబలాటపడుచున్నాను, ఉబలాటపడుచున్నాను! భరతఖండమున ఎన్నిదోషములైన నుండుగాక. ఆత్మవిముక్తిని భగవత్సాక్షాత్కారమును సిద్ధింపజేయుచో టదొక్కటే. పాశ్చాత్యదేశములందలి ఈపరిభవమంతయు కేవలము దంభము. ఆత్మకు ఇది కేవలము కారాగారము. జగన్మిథ్యాత్వము ఇంతకంటె చులుకుగా నాజీవితమున మఱెప్పుడును నాఅనుభవమునకు రాలేదు. అందఱికిని దేవుడు బంధవిముక్తి కల్గించుగాక. అందఱును మాయను తరింతురు గాక—అని సదా ప్రార్థించు,

వివేకానంద

## 162

(కుమారి ఇసబెల్ మెకండ్లీకి)

528, 5-వ ఆవెన్యూ,
న్యూయార్కు,
జనవరి 24, 1895.

ప్రియకుమారి బెల్,

నీవు క్షేమముగ నున్నావని అనుకొనుచున్నాను.

క్రిందటిసారి నేను కావించిన ఉపన్యాసమును మగవారు ఎక్కువగా ప్రశంసింప లేదు. కాని మహిళలు ఆయుపన్యాస

మును అమితముగ పొగడినారు. ఈ బ్రూక్లిను నగరము మహిళల హక్కులను ప్రతిఘటించు ఉద్యమముల కన్నిటికిని కేంద్రస్థాన మని నీ వెఱుగుదువు. కావుననే మహిళలకు అన్నిటికిని యోగ్యత కల దని నేను చెప్పినప్పుడు అచ్చటి మగవారికి అది రుచింపనే లేదు. రుచింపకపోయిన పోనిమ్ము. మహిళలు పరమానంద భరిత లైరి.

నాకు మరల కొంచెము జలుబు చేసి యున్నది. గెరెన్సి కుటుంబమువారియొద్దకు నేను పోబోవుచున్నాను. ఆనగరమున దిగువవైపు నాకొక గది యున్నది. నాతరగతులను నడుపుట మున్నగు పనులకై నేను పెక్కు గంటలకాలము అచ్చట నుందును. అమ్మచర్చికి ఈలోగా ఆరోగ్యము సరిపడవలయునే! రమ్యమైన ఈఋతువులో మీరందఱును చాలహాయి ననుభ వించుచుందురు. ఈసారి నీవు శ్రీమతి ఆడమ్స్‌సతిని చూచి నప్పుడు కొండంత నాప్రేమను నమస్కారమును ఆమెకు అందజేయుదువుగాక.

నాజాబులను యథాప్రకారము గెరెన్సేకుటుంబపు చిరు నామాకు పంపుచుందువుగాత.

నాప్రేమ అందఱకును చెందును గాక.

సదా నీప్రియసోదరుడు
వివేకానంద

## 163

(కుమారి మేరీ హేలుకు)

54 పడమర 33-వ వీథి,
న్యూయార్కు,
ఫిబ్రవరి 1, 1895.

ప్రియసోదరీ,

నీ రమణీయ లేఖ ఇప్పుడే చేరినది....సరి, కర్మకొఱకే కర్మము ననుష్ఠించునట్లు నిర్బంధింపబడుట ఒక్కొక్కప్పుడు మంచిశిక్షణమే. తన కర్మఫలమును తాను అనుభవించుటకు కూడ ప్రాప్తి లేకుండునంతకు దానిని కొనిపోవచ్చు....నీవిమర్శము నా కెంతయు సంతోషకరముగనుండినది. అందుకై నేను విచార పడనే లేదు. మొన్న కుమారి థర్స్బీయింట నొక ప్రెస్బిటేరి యనుతో నాకు ఉద్రిక్తవాదము సంభవించినది. అతనికెప్పటి వలెనే చాల ఉడుకెక్కినది. ఆగ్రహపూరితుడైనాడు. దూషింప నారంభించినాడు. ఇందుకై శ్రీమతి బుల్సతి నన్ను తర్వాత తీవ్రముగ మందలించినది. ఏలయన ఇట్టివి నాపనికి విఘ్నము లగును. నీవును అట్లే అభిప్రాయపడుచున్న ట్లున్నావు.

నీవు దానిని గూర్చి ఇప్పుడే వ్రాసినందుకు నాకు సంతోషము. ఏలయన దీనిని గూర్చి ఇప్పుడే నేను ఎక్కువగ ఆలోచించుచుంటిని. మొదటి విషయము — ఇటువంటివానికి నేను ఎంతమాత్రము చింతింపను. నేను చింతింపనందుకు నీవు విసుగు కొనవచ్చు. ఐహికముగ అభివృద్ధి నొందుటకు "ఇచ్చకముగా" నుండుట ఎంత సాధకమో నేను పూర్తిగా నెఱుగుదును. ఇచ్చకముగ నుండుటకు చేయవలసినదానినెల్ల నేను చేయుదును. కాని సత్యమునకు మిక్కిలి వెలితి ఏర్పడు సందర్భమైనచో అప్పుడు నేను ఇచ్చకములను మానుకొందును. నైచ్యానుసంధానము నాకు

సమ్మతము కాదు. సమదర్శిత్వము నాకభిమతము. సామాన్య మానవునకు సంఘమే దైవము. ఆదైవాజ్ఞను తలదాల్చుట అతని విధి. కాని జ్ఞానులు అట్లెన్నటికిని చేయరు. ఇది సనాతనధర్మము. సామాన్యమానవులకు అన్ని మేళ్లను కలిగించునది సంఘము. కావున సామాన్యమానవుడు పరిసరములను సంఘాభిప్రాయమును అనుసరించి ప్రవర్తించును, సంఘము ప్రసాదించు మేళ్లను బడయును. జ్ఞాని ఒంటరిగ నిలుచును, సంఘమును తనవంక కాకర్షించుకొనును. లొంగివర్తించువాని దారి పువ్వులుపఱచిన దారిగ నుండును. లొంగనివారి దారి ముండ్లదారిగ నుండును. కాని సంఘోపాసకులు క్షణములో నిశ్శేషముగ రూపుమాసిపోదురు. సత్యోపాసకులు శాశ్వతజీవులై మనుదురు.

తినివేయు స్వభావము గల్గి అనంతశక్తివంతమైన పదార్థముతో నేను సత్యమును పోల్తును. అది అడుగిడినచోటనెల్ల కాల్చివైచుచు దారిచేసికొనును. మృదుపదార్థములలో దానికి దారి తక్షణమే ఏర్పడును. గట్టిరాతిలోనైనచో దారి మెల్లగ నేర్పడును. దారి గల్గియే తీరును. విధినిర్ణయము విధినిర్ణయమే. సోదరీ, నన్ను ఇచ్చకాలమారిగ మార్చుకోలేనందుకు అసత్యముల కెల్ల లొంగుచు నేనుండలేనందుకు ఎంతో చింతిలుచున్నాను. కాని నేనుండలేను. ఉండలేనందుకై బ్రతికినంతకాలము బాధలు పడినాను. కాని ఉండలేను. మరల మరల ప్రయత్నించితిని. కాని ఉండ లేను. తుదకు వదలుకొంటిని. భగవంతుడు పరముడు. ఆయన నన్నొక వంచకునిగా కానీయడు. ఇప్పుడు లోపలనున్నది వెలికి వచ్చును గాక. అందఱికిని ఇచ్చకముగ నుండు మార్గమును నేను కనుగొనలేనైతిని. నా యథార్థశీలానుగుణముగ ఉండక నాకు తప్పదు. "ప్రాయము, సౌందర్యము మాయ మగును. జీవితము సంపద మాయమగును. పేరుప్రతిష్ఠలు మాయమగును. కొండలుసహితము శిథిలమై దుమార మగును. కూర్మియు నెయ్యమును మాయమగును. సత్య మొక్కటే శాశ్వతముగ నిల్చును"

సత్యాధిష్ఠాతవైన ఓదేవా, నీ వొక్కడవే నాకు మార్గదర్శకుడవుగ నుండుము. నాకు వయసైనది. ఇప్పుడు నేను పాలుగను తేనెగను మార్పొంద లేను. నేనిప్పు డెట్టివాడనో అట్టివానినిగనే నన్నుండనిమ్ము. "భయము లేక, బేరమాడుబుద్ధి లేక, మిత్రునిగాని శత్రునిగాని లక్ష్యపెట్టక, ఓసన్న్యాసీ సత్యమునే అవలంబించి యుండుము. ఇహపరములను, భోగములతోడి అసారములైన వానితోడి భవిష్యత్తునంతటిని—ఈక్షణముననే విడనాడుము. ఓ సత్యమా, నీవే నాకు మార్గదర్శకముగ నుండుము" — సంపదలందు, కీర్తిప్రతిష్ఠలందు, సుఖానుభవములందు, సోదరీ—నాకు ఆశ లేదు. అవి నాకు మట్టితో సమానము. నేను నా సోదరులకు తోడ్పడ గోరితిని. ధనముగడించు ప్రజ్ఞ నాకు లేదు. దేవు డను గ్రహించును గాక. లోపలినుండి విననగు సత్యవాణిని తలదాల్పక చుట్టునుండు లౌకికపువెఱ్ఱులను నే నేల అనుసరింపవలెను? సోదరీ, మనస్సు ఇంకను దుర్బలముగనే యున్నది. ఒక్కొక్కప్పు డది యంత్రప్రేరితమువలె ఐహికసాహాయ్యమును అవలంబించును. కాని నాకు భయము లేదు. నామతము ప్రకారము అన్ని పాపములకంటె అధికమైన పాపము భయమే.

ప్రెసిబిటేరియను మతాచార్యునితో జరిగిన కడపటిజగడము, తర్వాత శ్రీమతి బుల్లతితో చిరము సాగిన కలహము— ఇవి సన్న్యాసులకు మనువు కావించిన బోధను మఱెంత స్పష్టపఱచినవి. "ఏకాకివిగ జీవింపుము ఏకాకిగ సంచరింపుము" అన్నాడు మనువు. అన్నిమైత్రులును అన్నిప్రేమలును పరిమితములే. బలాత్కరించునట్టి స్వభావము లేని మైత్రి ముఖ్యముగా మహిళలమైత్రి ఎన్నడును లేదు. ఓమహర్షులారా, మీరు చెప్పినది సరి. అస్వతంత్రులు సత్యదేవతను సేవింపజాలరు. ఓనా ఆత్మా, నెమ్మదిగ నుండుము. ఒంటరిగ నుండుము. దేవుడు నీతో నున్నాడు. బ్రతుకు బూటకము. మరణము మాయ. ఇదంతయు అసత్తు. దేవు డొక్కడే సత్తు. ఓనా ఆత్మా, భయపడకు. ఓనాఆత్మా, ఒంటరి

విగ నుండుము. సోదరీ, దారి సుదీర్ఘము. కాల మల్పము. సాయంవేళ సమీపించుచున్నది. నేను తొందరగ ఇంటికిపో వలెను. నా నడుచుమర్యాదలకు సమగ్రత కల్గించుటకు నాకువ్యవధి లేదు. నాసందేశము నందించుటకు నాకు అవకాశము లభింప కున్నది. నీవు మంచిదానవు. ఎంతో కరుణగలదానవు. నీకై నేను ఏమైనను చేయుదును. కోపింపకు, మీరందఱు కేవలము పసివా రని నా కర్థ మైనది.

ఓనా ఆత్మా, ఇక కలలు గనకు, ఇక కలలు గనకు. ఒక్క మాటలో చెప్పి వేసెదను: నే నందింపవలసిన సందేశ మొకటి కలదు. లోకులతో ఇచ్చకగముగ నుండుటకు నాకు వ్యవధి లేదు. ఇచ్చకముగ నుంద మని చేయు ప్రతిప్రయత్నముచేతను వంచ కుడ నగుదును. ఎముక లేని చేపబ్రతుకు బ్రతుకుచు నా దేశమున గాని విదేశమున గాని మతిమాలినలోకుల ప్రతినిర్బంధమునకును లొంగుచుండుటకంటె నేను వేయిచావులనైన చత్తును. శ్రీమతి బుల్లతి అనుకొనినట్లు నీవునునాసొంతమున కేదో అక్కఱయున్నట్లు అనుకొంటివేని అది పొరపాటు. ముమ్మాటికిని పొరపాటు. ఇహ పరములందు సొంతమునకు నాకెట్టి అక్కఱయు లేదు. నాకొక సందేశమున్నది. దానిని నాసొంతపద్ధతిలో అందింతును. నాసం దేశమునకు నేను హిందుత్వమునుగాని క్రైస్తవత్వమును గాని ప్రపంచములో ఏ'త్వ'మును గాని కలిగింపను. దానిని నాపద్ధతి నొందింతును, అంతే. ముక్తియే నామతము. దాని నణచుటకు ప్రయత్నించు దానినెల్ల నేను పోరియో పాఱియో తప్పించుకొం దును. ఛీ! మతాచార్యులను నేను సమాధానపఱుపప్రయత్నించు టయా సోదరీ, దాని నపార్థముచేసికొనకు. మీరు పసివారు. పసివారు బోధనలకు తలయొగ్గకతప్పదు. యుక్తిని అయుక్తిగను మర్త్యుని అమర్త్యునిగను ఈలోకమును శూన్యముగను జీవుని దేవునిగను చేయు ఊటజలమును మీ రింకను త్రాగలేదు. మీ చేతనైనచో ఈలోక మనెడి వెఱ్ఱివలనుండి వెలికి రండి. అప్పుడు

నచో అన్నిటిని చెడగొట్టినవాడ వగుదువు. గురువును దేవునిగా ఆరాధించు నాశయము వంగదేశమునకు వెలుపల ఎచ్చటను కానరాదు. ఏల యన ఇతరప్రజలు ఆలక్ష్యమును అందుకొనుటకు ఇంకను సంసిద్ధులు కాలేదు...

అమ్మకై కొంత భూమిని కొనుపనిలో నేను సగ్గినప్పుడు కృతజ్ఞతాఋణమునుండి విముక్తినొందినవానినిగా నన్ను గూర్చి తలంతును. అటుపిమ్మట దేనినిగాని లక్ష్యపెట్టను.

మిక్కుటమైన ఈచలికాలమున నేను అర్ధరాత్రులందు కొండలమీదుగను మంచుబండలమీదుగను పర్యటించి కొంత ధనమును వసూలుచేసితిని. అమ్మ కొక భూమిని సంపాదించి నప్పుడు నాకు మనశ్శాంతి కలుగును.

ఇకమీద, పైన తెల్పబడిన విలాసమునకే నాజాబులను పంపుచుండుము. ఇప్పటినుండి అదే నా శాశ్వతస్థానముగ నుండ గలదు.

యోగవాశిష్ఠరామాయణమున కొక ఆంగ్లానువాదమును నాకు పంపుటకు ప్రయత్నింపుము.

ఇంతకు ముందు నే నడిగియుండిన పుస్తకములను, అనగా నారద శాండిల్యసూత్రగ్రంథములను మఱవకుము.

"ఆశాహి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖమ్"
"ఆశయేగదా పరమదుఃఖము. ఆశను మానుకొనుటే పరమ సుఖము."

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 165

(కుమారి మేరీ హేలుకు)

228, పడమర, 39-వ వీథి,
న్యూయార్కు
ఫిబ్రవరి 10, 1895.

ప్రియసోదరీ,

నాజాబు నీకింకను చేరలేదని తెలిసి ఆశ్చర్యపడినాను. నీజాబు చేరినవెంటనే నేను వ్రాసితిని. న్యూయార్కులో నేను కావించిన మూడుపన్యాసాలు గల చిన్నపుస్తకప్రతులను కొన్నింటిని ఆజాబుతో నీకు పంపియుంటిని. ఈ భానువారోపన్యాసములను ఇప్పుడు షార్టుహాండులో వ్రాసిపెట్టి అచ్చువేయుచున్నారు. అందులో మూడుపన్యాసములు రెండుచిన్నపుస్తకములుగా నైనవి. వాని ప్రతులను పెక్కింటిని నేను నీకు పంపియుంటిని. న్యూయార్కులో నేనిక రెండువారము లుందును. తర్వాత డిట్రాయిట్టుకు పోవుదును. ఒకటిరెండువారము లుండుటకై మరల బోస్టనుకు వత్తును.

నిర్విరామముగ పాటుపడుటచే ఈసంవత్సరము నా ఆరోగ్యము చాలదెబ్బతిని యున్నది. నేను చాల దుర్బలుడనుగ నున్నాను. ఈచలికాలములో ఒక్కరాత్రియైనను నాకు మంచి నిద్ర లేదు. నేను మితిమీఱి పాటుపడుచున్నా ననుట నిజమే. కాని ఇంగ్లండులో ఒకపెద్దపని నాకై వేచియున్నది.

ఆపనిని నేను నిర్వహింపవలసియున్నది. అటుపిమ్మట ఇండియాకు వత్తమనియు శేషించిన జీవితకాలమంతయు విశ్రాంతి నొందుద మనియు ఆసించుచున్నాను. జగద్ధితమునకై కనీసము

నాచేతనైనదానినైనను చేయ ప్రయత్నించితిని. ఫలితమును దేవునకు విడిచితిని.

ఇప్పుడు నేను విశ్రాంతికై తహతహపడుచున్నాను. భారతీయులు నన్ను వదలుకొందు రనియు నాకు కొంత విశ్రాంతి కలుగు ననియు నా ఆశ. కొన్నియేండ్లపాటు నోరు తెఱవకుండ మనియు మూగవాడనుగ నుంద మనియు నే నెంతో ఆసించుచున్నాను.

ఈలోకపు పెనగులాటలకు పోరాటములకు సృజింపబడిన వాడను కాను నేను. విశ్రాంతిగొనుచు కలలు గనుచుండు ప్రకృతి నాది. పుట్టుకచేతనే ఆదర్శవాదిని. స్వప్నజగత్తులో మాత్రమే నేను జీవింపగలను. వాస్తవసంభవస్పృక్కైతము నా కలలను భంగపఱచి నన్ను సుఖహీనునిగ జేయును. నీ సంకల్పము నెఱవేఱును!

అప్పచల్లెంద్రడకు మీకు నలుగురికిని నేను సదా కృతజ్ఞుడను. ఈదేశమున నా కున్న దెల్ల మీరు నా కిచ్చినదే. మీరు సదా సుఖులరై ధన్యులరై యుందురుగాక. నే నెచ్చట నున్నను గాఢకృతజ్ఞతతో హృదయపూర్వకప్రేమతో సదా మిమ్ము స్మరించుచుండెదను. జీవితమంతయు స్వప్నపరంపర లే —. తెలిసియేకలలు గనుచుంద మని నా ఆశ. అంతే. అందఱికిని సోదరి జోసఫైనుకును నాప్రేమ.

సదా ప్రేమయుత భవదీయసోదరుడు

వివేకానంద

166

(శ్రీమతి బుల్సతికి)

54 పడమర, 33-వ వీథి,
న్యూయార్కు
ఫిబ్రవరి 14, 1895.

ప్రియ శ్రీమతి బుల్సతి,

తల్లివలె నీవు చెప్పిన సలహాకు హృదయపూర్వకమైన నా కృతజ్ఞతను స్వీకరింపుము. నాజీవితకాలమునందు ఆసలహాను నెఱవేర్పగలిగియుందు నని నా ఆశ.

నాకును నాపనికిని ఇప్పటికి నీవు చేసినసాయమునకే నాకృతజ్ఞతను మాటలలో ఎట్లు తెల్పగలను? ఈసంవత్సరము మఱికొంత నాకు తోడ్పడుటకు నీవు ముందంజవేయుచున్నందుకు నా శాశ్వత కృతజ్ఞతను ఎట్లు మాటలలో ఇముడ్పగలను? కానీ ఈసంవత్సరము నీసాయమును గ్రీనేకరులో కుమారిఫార్మరు చేయుచుండు పనికి మరల్పవలయునని హృదయపూర్వకమైన నాఅభిప్రాయము. ఎన్నోశతాబ్దులుగ వేచియున్న భారతదేశము వేచియేయుండగలదు. జరూరైన పనిని ముందు నెఱవేర్పవలెను.

ధర్మకార్యముకొఱకైనను సరే ధనమును వసూలు చేయుట సన్న్యాసికి మంచిపని కాదని మనువు నభిప్రాయము. ఆసనాతనమహర్షి అభిప్రాయము సరియైనదే అని నేను గుర్తింపనారంభించితిని. "ఆశయే కదా పరమదుఃఖము. నైరాశ్యమే పరమసుఖము". అదొక మతివిభ్రమమును పోలియున్నది. అందుండి నేను బయటపడుచున్నాను. దీనిని చేయుట, దానిని చేయుట అను శిశూచితాశయములలో నే నుంటిని.

"ఆశను పూర్తిగా విడనాడుము. శాంతి గల్గియుండుము. శత్రువులుగాని మిత్రులుగాని లేక ఏకాకివిగ నుండుము. శత్రువు

లును మిత్రులును లేక ఖేదమోదములు లేక ఆశాసూయలు లేక ఏప్రాణులను హింసింపక, ఏప్రాణుల హింసకును హేతుభూతులము గాక — ఇట్లు మనము కొండనుండి కొండకు పల్లెనుండి పల్లెకు దేవునినామము ప్రచారము చేయుచు పర్యటింతము."

"పై తరగతులవారినుండి గాని క్రిందితరగతులవారినుండి గాని, అధికులనుండి గాని అల్పులనుండిగాని సాయ మపేక్షింపకు, దేనినిగాని కోరకు. మాయమై పోవునట్టి ఈసర్వదిగ్దర్శనచిత్ర మును సాక్షివై చూచుచు దానిని పోనిమ్ము".

నన్ను ఈదేశమునకు రప్పించుటకు ఈవెఱ్ఱికోరికలు ఆవ శ్యకములుగ నుండు నేమో. ఈఅనుభవమునకు సాధన్యతను భగవంతునకు తెల్పుకొనుచున్నాను.

ఇప్పుడు నేను చాల హాయిగ నున్నాను. నేను లాండ్స్ బర్గ కలిసి బార్లీతోడి కాదా, వేఱుకాయధాన్యములతోడి కొంత అన్నమును వండుకొని నిశ్శబ్దముగ భుజింతుము. ఏదో వ్రాసికొను చుందుము. చదువుకొనుచుందుము. జిజ్ఞాసువులై చూడవచ్చిన పేదల నాదరించుచుందుము. ఇట్లు ఇంతకుమునుపటికంటె ఇప్పు డెక్కువ సన్న్యాసినై ఉన్నా నని నాకు తోచుచున్నది.

"సంపదకల్గియున్నప్పుడు దారిద్ర్య మెక్కడ దాపురిం చునో అను భయ ముండును. జ్ఞానము కల్గియున్నప్పుడు అజ్ఞా నము వచ్చిపడు నేమో అను భయ ముండును. చక్కదనము కలిగియున్నప్పుడు వార్ధక్యము కల్గు నేమో అను భయముండును. కీర్తి కల్గియున్నప్పుడు నిందకుల వలని భయ ముండును. విజయము గాంచినప్పుడు ఇతరుల అసూయవలని భయ ముండును. దేహాము నకు సహితము మృత్యుభయము కలదు. లోకమున సర్వమును భయాన్వితమే. వైరాగ్య మొక్కటే భయము లేనిది." *

---

* భర్తృహరి - వైరాగ్యశతకము - 31.

మొన్న నేను కుమారి కార్బినును చూచుటకు పోయియుంటిని. కుమారి ఫార్మరును కుమారి థర్స్బీయుకూడ అక్కడనుండిరి. అరగంట మాకు చాల ఆనందముగ గడచినది. పైభానువారమునుండి ఆమెయింట నేను కొన్ని తరగతులు జరుపవలెనని ఆమె కోరుచున్నది.

ఇట్టి వానిని నేనిప్పుడు కోరుచుండుట లేదు. అవి వచ్చెనా, దేవునకు ధన్యవాదములు. అవి రాకున్నచో, దేవునకు మఱిన్ని ధన్యవాదములు.

వెండియు నానిత్యకృతజ్ఞతను స్వీకరింపుము.

శ్రద్ధాయుత భవదీయపుత్ర
వివేకానంద

## 167

(శ్రీ అళసింగపెరుమాళుకు)

19 పడమర 38-వ వీథి,
న్యూయార్కు
1895.

ప్రియఅళసింగా,

సంఘసంస్కారమనుదానియందు జోక్యము కలుగజేసికొనకుము. ఏలయన ముందుగ ఆధ్యాత్మికసంస్కారము లేనిదే వేఱు ఏసంస్కారమును శక్యము గాదు. నేను సంఘసంస్కారమును గోరుదు నని నీ కెవరు చెప్పిరి? నేను సంఘసంస్కారాభిలాషిని గాను. దేవునిగూర్చి బోధింపుము. అంధవిశ్వాసములను గూర్చియు ఆహారప్రకారములనుగూర్చియు మంచిమాటను చెప్పకుము, చెడ్డమాటను చెప్పకుము. ధైర్యము వీడకుము. గురువునందు విశ్వాసమును కోల్పోవకుము. దేవునందలి విశ్వాసమును పోగొట్టు

కొనకుము. ఈమూఢును నీకున్నంతవఱకు నాయనా, ఏదియు నీకు కీడు చేయజాలదు. నాబలము నానాటికి హెచ్చుచున్నది. పని సాగింపుడు. నాధీర వత్సలారా.

ఆశీస్సులతో,

సదా భవదీయ
వివేకానంద

## 168

(ఇసబెల్మెకండ్లీకి)

54 పడమర, 33,
న్యూయార్కు
ఫిబ్రవరి 25, 1895.

ప్రియ సోదరీ, *

నీకు వ్యాధివచ్చినందుకు నేను చింతించుచున్నాను. నేను పరోక్షముననుండియే నీకు చికిత్సచేసెదను. కాని వ్యాధిగ్రస్త వైనట్లు నీవు ఒప్పుకొంటివే అది నామనోబలములో సగమును లాగివేసినది.

వ్యాధినుండి విముక్తురాల వైతివి. అది శుభమే. శుభముగ పర్యవసించున దెల్ల శుభమే.

గ్రంథములు మంచిస్థితిలో వచ్చిచేరినవి. అందుకు పెక్కు కృతజ్ఞతాభివందనములు.

సదా భవదీయప్రియసోదరుడు
వివేకానంద

---

* వీరు క్రైస్తవ విజ్ఞానసంప్రదాయమునకు చేరినవారు. ఆసంప్రదాయము వారి వ్రతము వ్యాధివచ్చినదని ఒప్పుకొనకుండుట. దానిని స్వామి ఇట వేడుకగ ఎత్తిపొడుచుచున్నాడు.

## 169

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
మార్చి 6, 1895.

ప్రియ అళసింగా,

...యాంకీలు మతవిషయమున కార్యపరులని క్షణమైనను భావింపకు. అందు కార్యపరులు హిందువులుమాత్రమే. డబ్బు జేరుకొనుటే యాంకీల ధోరణి. కావున ఇచ్చటినుండి నేను తర లిన తక్షణమే అంతయు మాయమై పోవును. కాబట్టి బయలు దేఱుటకు ముందు మనస్థానము నిట గట్టిపఱచుకొనవలె ననుట నా కోరిక. ప్రతిపనిని త్రుణ్ణముగ చేయవలెను. శ్రీరామకృష్ణుని గూర్చి ప్రచారము చేయవలె నని నీవు పట్టుపట్టగూడదు. ఆయన ఆశయములను మొదట ప్రచారము చేయుము. లోకులకు మోజు మొదట వ్యక్తియందే. తర్వాతనే ఆశయమందు. అయినప్పటికిని ...మొట్టమొదట పెద్దప్రణాళికలకు పూనుకొనకు. మెల్లగా ఆరం భింపుము. నీస్థానమును గట్టిపఱచుకొనుము. మెట్టుమెట్టుగ పైకి పొమ్ము.

•

...నాధీరవత్సలారా, పనిని సాగింపుడు. ఒకనాటికి వెలు గును చూచి తీరుదుము.

సామరస్యము శాంతి!...అన్నిటిని మెల్లగ పెంపొందనీ. రోమునగరనిర్మాణము ఒక్కదినములో ముగిసినదా? అందఱిపై కంటె ఎంతో హెచ్చుగా మనము ఆసలుపెట్టుకొనుచుండిన వారిలో ఒకరైన మైసూరుమహారాజు గతించినారు. సరి, భగ

వంతుడు పరముడు. మనఉద్యమమునకు తోడ్పడుటకు ఆయన ఇతరులను పంపగలడు.

నీకు శక్యమైనచో కొన్నిదర్భాసనములను పంపుము.

ఆశీస్సులతో,

సదా భవదీయ
వివేకానంద

## 170

(శ్రీమతి బుల్సతికి)

54 పడమర 33-వ వీథి,
న్యూయార్కు
మార్చి 21, 1895.

ప్రియ శ్రీమతి బుల్సతి,

రమాబాయివర్గమువారు నన్నుగూర్చి వ్యాపింపజేయుచున్న నిందలను విని నేనాశ్చర్యచకితుడనైతిని. మానవుడు ఎట్లు ప్రవర్తించినను అతనినిగూర్చి అత్యంతనీచముగ మిథ్యానిందలను కల్పించువారు ఎల్లప్పుడును ఉందురు. ఓబుల్సతీ, నీ కర్థమగుటలేదా? నాకు ప్రతికూలములైన అట్టి ప్రచారములు చికాగోలో ప్రతిదినమును సాగుచుండినవి.

ఈమహిళలు, ప్రాయికముగ క్రైస్తవులం దందఱిలో అత్యంతక్రైస్తవులు...మిద్దెకు క్రింది గదులలో షుమారు నూర్గురు కూర్చుండుటకు చోటున్నది. ఆగదులలో ఉపన్యాసమున కింతయని ధనము పుచ్చుకొని వరుసగా కొన్నిఉపన్యాసములు కావింపబోవుచున్నాను. ఆరాబడి, వ్యయముల కగును. పైకమును భారతదేశమునకు పంపవలెనని నేను చాల తొందరపడుటలేదు. వేచియుందును. కుమారిఫార్మరు నీతో నున్నదా? శ్రీమతి

పకృతి చికాగోలో నున్నదా? జోసఫైన్లాక్కను నీవు చూచితివా? కుమారి హామ్లిన్ నాయందు చాల దయగలిగి యున్నది. నాకు సాయముగ తనచేతనైనదెల్ల చేయుచున్నది.

హిందువు క్రైస్తవుడు మున్నగు నీపేర్లు మానవుల సౌభ్రాత్రమునకు గొప్ప అడ్డంకులుగ నున్న వని నాగురుదేవుడు చెప్పుచుండెడివాడు. మనము మొదట ఈఅడ్డంకులను పడగొట్టుటకు ప్రయత్నింపవలెను. వాని మంగళకరశక్తు లన్నియు పోయినవి. ఇప్పుడవి కేవలము హానికరశక్తులుగా నున్నవి. వానికై తవమునకు మఱుగున శ్రేష్ఠులుగూడ రక్కసులవలె ప్రవర్తింతురు. సరి, మనము కష్టపడి పనిచేయవలయును, తప్పక నెగ్గవలయును.

అందుకే ఒక కేంద్రము కావలయు నని నే నంతగా కోరుచుండినది. సంస్థ అనగానే దానిదోషములు దానికుండును, సందేహము లేదు. కాని అది లేనిదే వేఱేమియు చేయలేము. సంఘమునకు ఇచ్ఛకముగ నుండుచునే ఘనకార్యములు చేయుటలో నెగ్గినవా డక్కడను ఎప్పుడును లేడను నీయభిప్రాయమునుండి నేను భేదిల్లవలసియుండును. మానవుడు తన అంతఃప్రబోధానుసారము పనిచేయవలెను. అది సాధువును ధర్మమును అగునేని పనిచేసినవారు మరణించినతరువాత కొన్నిశతాబ్దములకు సంఘము దాని కనుకూలముగ తిరిగితీరును. దేహములతో హృదయములతో ఆత్మలతో మనము పనిలోనికి ఉఱుకవలయును. ఒకలక్ష్యమునకై ఏకైకలక్ష్యమునకై తక్కిన సమస్తమును వదలుకొనుటకు సంసిద్ధులమగువఱకు మనకు వెలుతురు ఎన్నటికిని అగపడనే అగపడదు.

మానవతతికి తోడ్పడగోరినవారు తమసుఖదుఃఖములను పేరుప్రతిష్ఠలను అన్నివిధములైన అక్కఱలను చేర్చి ఒకమూటగా గట్టి సముద్రములో పాఱవేసి తర్వాత దేవునొద్దకు రావలెను. మనగురువులందఱును చెప్పినదియు చేసినదియు ఇదే.

క్రిందటి శనివారము కుమారి కార్బినునింటికి పోయియుంటిని. తరగతులను జరుపుటకై వచ్చుట ఇకమీద నాకు శక్యము కాదని ఆమెతో చెప్పితిని. ధనికులు ఏదేని గొప్పపనిని నిర్వహించి రనుట ప్రపంచచరిత్రలో ఎన్నడైన కలదా? ఎప్పటికిగాని ప్రజ్ఞయు ప్రేమయు సాధకము లగును గాని ధనము సాధకము కాదు.

నాలక్ష్యము! దానితోడిదే నాజీవితమంతయు. సాయమునకు ఆశ్రయించుట దేవునినొక్కనినే గాని వేఱెవ్వరిని కాదు! ఇదే విజయరహస్యము. ఇందులో నీవు నాతో ఏకాభిప్రాయురాల వని నాగట్టినమ్మకము. శ్రీమతి థర్స్బీకిని, శ్రీమతి ఆడమ్సుకును నాప్రేమ.

కృతజ్ఞతాప్రేమయుత సదా భవదీయ
వివేకానంద

## 171

(ఇసబెల్మెకండ్లీకి)

54 పడమర 33-వ వీధి,
మార్చి 27, 1895.

ప్రియ సోదరీ,

దయతో నీవు వ్రాసిన జాబు నాకనిర్వాచ్యమైన సంతోషమును కలిగించినది. దానిని ఆమూలాగ్రము చాల సులభముగ నేను చదువగల్గితిని. తుదకు కావివస్త్రను నిర్ణయించుకొంటిని. ఒకకోటును సంపాదించితిని. కాని వేసవి సరకు ఏదియు ఇప్పటికింకను సంపాదింపలేకున్నాను. నీకేదేని లభించిన దయతో నాకు తెల్పుము. దానిని నేను ఇచ్చట న్యూయార్కులో కుట్టించు

కొందును. మీ అద్భుతమైన డియర్బారన్ అవెన్యూలోని అనర్హుడైన దర్జీవాడు ఒకసన్న్యాసికి సైతము అందుబాటు కానివాడు.

సోదరిలాక్ నాకు పెద్దజాబు వ్రాసినది. నాజవాబుకు అగు విలంబమునకు ఆశ్చర్యపడుచున్న దేమో! ఉత్సాహముచే ఆమె స్వాధీనము తప్పవచ్చు. కావున నేను వేచియున్నాను. అంతే కాదు. ఏమిజవాబు వ్రాయవలెనో నేనెఱుగను. దయచేసి నామాటగా ఆమెకు చెప్పుము. ఏదే నొకస్థలమును ఇప్పుడే నిర్ణయించుట అసాధ్యమని. శ్రీమతి పీక్సతి ఉదాత్తురాలే, గొప్పదే. ఎంతయు ఆధ్యాత్మికపరతకలదే. కాని లౌకికవిషయములలో నా అంత తెలివిగలదే. నానాటికి నేను మఱింత తెలివిగలవాడ నగుచున్నాను. వాషింగ్టనులో ఆమెకస్పష్టపరిచితు డొక డున్నాడు. అత డామెకు ఒక వేసవివిడిదిని ఈయజూపెను.

ఆమె మోసపోదని ఎవ రెఱుగుదురు? మోసగించుటలో ఇది మహాద్భుతమైన దేశము. నూటికి 99·9 మందికి ఇతరుల నుపయోగించుకొనునపుడు నిగూఢమైన ఉద్దేశ్యము ఏదో యొకటి యుండును. ఎవడు గాని క్షణకాలము కన్నులు మూసికొన్నను అతడు కొల్లబోవును. సోదరిజోసఫైనులో పొంగిపొర్లిన ఉత్సాహము కలదు. శ్రీమతి పీక్సతి మంచిది, సరళస్వభావ. ఒక్క అడుగు ముందుకు పెట్టవలె నన్నను నేను నాచుట్టుపట్లను పరికింతును. ఇక్కడి ప్రజలు నన్నంత బాగుగ ఉపయోగించుకొన్నారు. అంతయు సరిపడును. సోదరి జోసఫైనును ఇంచుక ఓర్పుగలిగి యుండు మనుము.

వృద్ధునిగృహజీవితమును సాగించుటకంటె పిల్లలతో బడిని సాగించుటే మేలని ప్రతిదినమును నాకు తోచుచుండును. నేను గట్టిగా ఎఱుగుదును. నీవు శ్రీమతి బుల్సతిని జూచితివి. ఆమె శాంతమృదుత్వములను చూచి నీవు తప్పక మిక్కిలి ఆశ్చర్యపడి యుందువు. అప్పుడప్పుడు శ్రీమతి ఆడమ్సుసతిని చూచుచుందువా? ఆమె పారములచే శ్రీమతి బుల్సతి ఎంతో లాభపడినది.

నేనును కొన్నిటిని గ్రహించితిని గాని అవి ఉపయోగపడలేదు. ముందువైపు సదా వర్ధిల్లుచుండు భారము నన్ను శ్రీమతి ఆడమ్సు కోరినట్లు ముందుకు వంగనీయ కున్నది. నడచునప్పుడు ముందు నకు వంగ ప్రయత్నించితినేని భారకేంద్రము కడుపునపైకివచ్చును. కావున నేను ముందుకు మొగ్గలు వేయుచు పోవుచుందును.

కోటీశ్వరుడెవడును వచ్చుట లేదా? కొన్ని లక్షలైనను లేవా? చింతిలుచున్నాను. మిక్కిలి చింతిలుచున్నాను. చేతనైనంత ప్రయత్నము చేయుచున్నాను. ఏమి చేయగలను? నాతర గతులనిండుగ నుండువారు మహిళలు. నీవు స్త్రీని వివాహమాడ జాలవుకదా? సరి, ఓర్పుకలిగియుండుము. నేను మెలకువతో చూచుచుందును. అవకాశమును జారిపోనీయను. నీ కొక్కరును లభింపకున్న, అందుకు కారణము నేనైనను సోమరిగానుండుట కాదు.

జీవితము ప్రాతదారులలోనే సాగుచుండును. సదా ఉపన్య సించుటచేతను వాగుచుండుటచేతను నా కప్పుడప్పుడు విసుగుకలు గుచుండును. దినములతరబడి మౌనముగనుందమని కోరుచుందును.

మిక్కిలి మేలైన కలలు నాకు కలుగుచుండవలె నని కోరుచు, (సుఖమున క దొక్కటే దారి).

సదా భవదీయప్రియసోదర
వివేకానంద

## 172

(శ్రీ అళసింగపెరుమాళుకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు
ఏప్రిల్ 4, 1895.

ప్రియఅళసింగా,

నీజాబిప్పుడే చేరినది. నాకు హానిచేయుటకు ఎవరైన ప్రయత్నించుచున్నా రని నీవు భయపడ నక్కఱలేదు. దేవుడు నాకు రక్షకుడుగ నున్నంతవఱకు నేను అవిజేయుడను. అమెరి

కాను గూర్చిన నీయూహలు మిక్కిలి అస్పష్టములు....ఇది పెద్ద దేశము. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు ఆధ్యాత్మికవిషయిక శ్రద్ధ లేదు....క్రైస్తవమతము కేవలము దేశభక్తివంటిదిగా నిలిచి యున్నది. అంత కంటె హెచ్చు ఏమియు లేదు....ఇప్పుడు నాయనా, ధైర్యము కోల్పోకు....''వేదాంతసూత్రముల''ను వానిపై అన్నిమతాలవారు వ్రాసిన భాష్యములను నాకుపంపుము. ...నేను దేవునిచేతులలో ఉన్నాను. ఇండియాకు మరలి వచ్చుట వలన ఉపయోగ మే మున్నది? నా ఆశయములను భారతదేశము వ్యాప్తిచేయజాలదు. ఈదేశము నా ఆశయములను ఆదరించు చున్నది. భగవదాదేశము నాకందినప్పుడు నేను మరలివత్తును. ఈమధ్యకాలమున మీరందఱును నెమ్మదితో ఓర్పుతో పనిని నిర్వహించుచుండుడు. ఎవడేని నన్నాక్షేపించినచో అతనిని మీరు కేవలము ఉపేక్షింపుడు. మీ రొక సంఘమును ప్రారంభింపవలె నని అక్కడ ప్రజలకు వేదవేదాంతములు సవ్యాఖ్యానములుగ కఱపబడవలె నని నాయభిప్రాయము. ప్రకృతమునకు పనిని ఈ మార్గమున సాగింపుడు....''మనము దుర్బలులము'' అని మీ రనుకొన్నప్పుడెల్ల మీకే గాక మన ఉద్యమమునకే హానికూర్చిన వా రగుదురు. అనంతవిశ్వాసమును బలమును మాత్రమే విజయ మున కమోఘసాధనములు.

సంతోషముతో నుండుడు....మీ లక్ష్యమును అంటిపట్టు కొనియే యుండుడు....అన్నిటికంటె ముఖ్యమైన దిది. మీరు ఇతరులకు మార్గదర్శకులగుటకును వారిపై అధికారముచెల్లించుట కును ఎప్పుడును ప్రయత్నింపకుడు. అమెరికనులు చెప్పునట్లు ఒరు లపై మీరు 'బాస్' చేయకూడదు. అందఱికిని భృత్యులుగ నుండుడు.

ఆశీస్సులతో,

సదా భవదీయ
వివేకానంద

## 173

(శ్రీ ఫ్రాన్సిసు లెగ్గెట్టుకు)

ఏప్రిల్ 10, 1895.

ప్రియ మిత్రమా,

మీపల్లెవిడిదికి దయతో నన్ను ఆహ్వానించినందుకు నా కృతజ్ఞతను మాటలలో చెప్పజాలను. నేనిప్పు డొక చిక్కులో ఉన్నాను. రేపువచ్చుట నా కసాధ్యము. 40 పడమర 9-వ వీథిలో కుమారి ఆండ్రూసునింట రేపు నేను తరగతి నడప వలసి యున్నది. కుమారి మెక్లీడు రేపటి తరగతిని ఆపిపెట్టవచ్చునని మొదట చెప్పినది. రేపు వారిగోష్ఠిలో కలసికొనవచ్చును గదా అని నేను చాల సంతోషముతో నుంటిని. కాని కుమారిమెక్లీడు పొరబడినట్లుగా నా కిప్పుడు తెలిసినది. కుమారి ఆండ్రూసు రేపటి తరగతిని ఆపిపెట్టుట తనకు సర్వథా అశక్య మనియు హాజరగు ఏబది అఱువది మంది సభ్యులకు తరగతి ఆపిపెట్టబడినట్లు తెలివిడి అందజేయుట సైతమశక్య మనియు చెప్పుటకు నాయొద్దకు వచ్చినది.

కావున రాలేకపోయినందుకు నేను నిజముగ చింతిలు చున్నాను. దయతోడి మీ ఆహ్వానమును అనివార్యపరిస్థితులచే వినియోగించుకొనలేక పోయితినే గాని ఇష్టములేనందుచేత గాదని కుమారి మెక్లీడును శ్రీమతి స్టర్గిసుసతియు గ్రహింతురని నాఆశ.

ఎల్లుండిగాని ఈవారములో మీ కనుకూలమైన ఏదినమైన గాని వచ్చుట నాకు అత్యంతసంతోషకరము.

సదా భవదీయశ్రద్ధాయుత
వివేకానంద

## 174

(శ్రీమతి బుల్సతికి)

54 పడమర 33-వ వీథి,
న్యూయార్కు
ఏప్రిల్ 11, 1895.

ప్రియ శ్రీమతి బుల్సతికి,

శ్రీలెగ్గెట్టును చూచి ఆయనతో కొన్నాళ్లుండ మని రేపు నేను గ్రామమునకు పోవుచున్నాను. ఇంచుక క్రొత్త వాతావరణము నాకు మేలు చేయునని నా ఆశ.

ఈయింటినుండి మాఱుప్రయత్నము ప్రకృతమునకు మానుకొంటిని. ఏల యన ధనము విపరీతముగ ఖర్చగును. పైగా ఇప్పుడే మాఱుట మంచిది కాదు. అందుకు మెల్లగా ప్రయత్నము చేయుచున్నాను.

...శ్రీఖేత్రీ మహారాజుగారియొద్దనుండి వచ్చిన జాబును నీ కిందువెంట పంపుచున్నాను. కుష్ఠవ్యాధికి వాడబడు గర్జన తైలమును గూర్చిన చీటినిగూడ పంపుచున్నాను. కుమారి హామ్లిను నాకు చాలతోడ్పడుచున్నది. ఆమెకు నేను మిక్కిలి కృతజ్ఞుడనై యున్నాను. ఆమెకు చాల దయకలదు. హృదయపూర్వకతయు కల దని నా నమ్మకము. "సరియైన రీతి మనుష్యులతో" నాకు పరిచయము కలిగింపవలె ననుట ఆమె కోరిక. ఇది "నిన్ను నీవు దిటవుపఱచుకో" అను దాని రెండవముద్రణమే కాబోలు నని నా భయము. భగవంతుడు ఎవరిని పంపునో వారు మాత్రమే సరియైన రీతి మనుష్యులు. నాజీవితానుభవములో నేను గ్రహించిన దది. సాయముచేయువారును చేయసామర్థ్యముగల వారును వారు మాత్రమే. ఇక తక్కినవారా, వారిని మొత్తముగను వారిబారినుండి నన్నును దేవుడు కాపాడును గాక.

నేను సొంతముగ ఒకబసను సంపాదించుట సెఱవేఱ దనియు మహిళ లెవ్వరును ఇచ్చటికి రా రనియు నామిత్రులలో ప్రతియొక్కఁడును తలంచిరి. ముఖ్యముగ కుమారి హాల్మిను "తానును" "తన సరియైనరీతిప్రజలును" చాల పైమెట్టున నున్నవా రనియు పేదగృహమున ఒంటరిగ నుండు ఒకానొకని యొద్దకు వారు రా రనియు అతని ప్రసంగములు విన రనియు తలంచుచుండెను. కాని "ఆ సరి యైన రీతిమనుష్యులును" వారితో ఆమెయు రాత్రింబగళ్లు వచ్చుచునే యుండిరి. ఓ ప్రభూ, నీయందును నీదయయందును మానవునకు విశ్వాసము కుదురుట ఎంతకష్టము! శివశివా! సరియైన రీతి యెక్కఁడ నున్నది? సరి కాని రీతి యెక్కఁడ నున్నది? అమ్మా, అంతయు అతడే. పులిలో నున్నది, గొఱ్ఱెలోనున్నది, పవిత్రులలో నున్నది పాపిలోనున్నది, అతడే. శారీరకముగ మానసికముగ ఆధ్యాత్మికముగ నే నతనిని శరణుపొందితిని. నా జీవితకాలమంతయు నన్ను తనచేతులమీద మోసికొని వచ్చుచుండిన ఆదేవుడు ఇప్పుడు నన్ను విడిచిపెట్టునా? భగవంతుడే కనికరింపకుండునేని సముద్రములో నొక చుక్క నీ రుండదు. అత్యగాధారణ్యములో ఒక్కరెమ్మయు నుండదు. కుబేరునింట అన్నముక్క మెతుకైననుండదు. ఆయనసంకల్పించు నేని ఎడారిలో నదు లుప్పతిల్లును. కుచేలుడు కుబేరు డగును. పిచ్చుకలు వ్రాలుటసైతము అతడు కనగలడు. అమ్మా, ఇవి కేవలము మాటలా? వాస్తవమగు యథార్థాక్షరమగుజీవితమా?

ఈ "సరియైన రీతి సమర్పించుటల"కు ఇక ఆపుదల. నీవే నాధర్మమవు, నీవే నాఅధర్మమవు, నా శివుడవు. ప్రభూ, శిశువుగ నున్ననాటినుండి నేను నిన్ను శరణుజొచ్చియున్నాను. ఉష్ణమండలమునగాని ధ్రువమండలములందుగాని పర్వతాగ్రములందుగాని మహార్ణవాగాధములందుగాని నీవు నాకు తోడుగ నుందువు. నానివాసము, జీవితమున నాకు మార్గదర్శకుడు, నాశరణము, నా మిత్రము, నాగురువు, నాదేవుడు—యథార్థమైననాఆత్మ నీవే. నీవు

నన్నెన్నడును విడనాడవు—ఎన్నడును. నాకు గట్టిగ తెలియును. ఒంటరిగాడనై చిక్కుల నెదుర్కొనుచు ఒక్కొక్కప్పుడు నా దేవా, నేను దుర్బలుడ నగుచుందును. మానవుల సాయము నొంద తలంతును. ఈదుర్బలతలనుండి దేవా, నన్ను సదా కాపాడుచుండుము. నిన్నే తప్ప వేరెవ్వరిని తోడ్పడు డని నేను యాచింపకుందును గాక. ఒక లోకసుజనుని నమ్మినేని వాని నా సుజనుడు ఎన్నడును విడువడు. ద్రోహము చేయడు. సుజనుల కెల్ల తండ్రివియు నాజీవితమంతయు నీకొక్కనికే తప్ప వేరెవ్వరికిని నేను సేవకుడను కా నని ఎఱిగినవాడవును అగు నీవు నన్ను విడనాడుదువా? పాపపంకమున నన్ను పడనిత్తువా? ఇతరుల వంచనకు నన్ను గుఱి చేయుదువా?

అమ్మా, ఆయన న న్నెన్నడును విడువడు. అది నాగట్టి నమ్మకము.

సదా విధేయభవదీయతనయ
వివేకానంద

## 175

(శ్రీరామకృష్ణానందస్వామికి)

అమెరికాసంయుక్తరాష్ట్రములు
ఏప్రిలు 11, 1895.

నా ప్రియశశి,

...వ్యాధినుండి తేఱుకొంటివని వ్రాసితివి. కాని ఇకమీద నీవు చాలజాగ్రత్తకలిగి యుండవలెను. అకాలభోజనములు అపథ్యభోజనములు, దుర్గంధభూయిష్ఠములగు స్థలములలో వసించుట — ఇవి పోయిన వ్యాధిని మరల రప్పింపవచ్చు. అప్పుడు. మన్నెజ్వరపుపట్టునుండి విడుపొందుట కష్టము కావచ్చు. మొట్ట

మొదట నీవు చుట్టును తోట గల చిన్న యింటిని బాడిగకు తీసి కొనవలయును. అట్టిఇల్లు నీకు ముప్పది నలువది రూపాయలకు దొరకవచ్చు. రెండవ విషయము:—వంటకు త్రాగుటకు ఉపయోగించు నీటినివడియబోయవలెను. వడియగట్టుటకు వెదురుతో చేయబడిన సాధనము పెద్దది చాలును. అన్నిరకముల వ్యాధికిని నీరే కారణము. నీటిలోనుండు రోగక్రిములే రోగములకు కారణములు. అంతేకాని నీటిమురికియు తేటదనమును కాదు. నీటిని కాచి వడియగట్టవలెను. మీరందఱును మొట్టమొదట మీఆరోగ్యమును గూర్చి జాగ్రత్తవహింపవలెను. ఒక వంటవాడు, ఒక పనివాడు, పరిశుభ్రములైన పాన్పులు, సకాలభోజనము — ఇవి యెంతయు ఆవశ్యకములు. దయచేసి ఈ సలహాలన్నియు సమగ్రముగ జరుగునట్లు చూడుము,...నీఉద్యమముల విజయము పూర్తిగా మీపరస్పరానురాగములపై ఆధారపడియుండును. ద్వేషము, అసూయ, దురహంకారము అను నివి ప్రధానములై యున్నంతవఱకు భవిష్యత్కాలమున మంచి కలుగదు....కాళీ వ్రాసిన చిన్నపుస్తకములో అతిశయోక్తు లేవియు లేవు. దాని నతడు చాల చక్కగా వ్రాసియున్నాడు. చాటున ఇతరులను దూషించుట పాప మని తెలిసికొనుము. దానిని నీవు పూర్తిగా మానుకొనవలయును. మనసునకు పెక్కు విషయములు స్ఫురింపవచ్చు. కాని వానిని నీవు బయటికి చెప్పుటకు ప్రయత్నించినపుడు నీ మనస్సు గోరంతలను క్రమక్రమముగా కొండంతలనుగ చేయును. నీవు మన్నించుచు మఱచి పోవుచు నుందువేని అన్నియు సమసి పోవును. శ్రీరామకృష్ణుని జయంతిమహోత్సవము అత్యంత వైభవముతో జరుపబడిన దనుట శుభవార్త. పైసంవత్సరము లక్షమంది ప్రజలు సమావేశమగునట్లు నీవు ప్రయత్నింపవలెను. మీఅందఱిశక్తిసామర్థ్యములను కలుపుకొని ఒకపత్రికను ప్రారంభింపుడు. బిడియము ఇక పనికి రాదు....అనంతసౌంతియు, అనంతశక్తియు ఆధారముగ గలవాడు మాత్రమే విజయ మొం

దును. చదువునందు నీవు ప్రత్యేకశ్రద్ధ వహింపవలెను. తెలిసినదా? మూర్ఖులను పెక్కండ్రను గుమిగూర్పరాదు. అల్పసంఖ్యాకులైనను యథార్థమానవులను నీ వొక్కటిగా చేర్చిన నేను సంతోషింతును. ఒక్కడైనను నోరుతెఱచి మాటాడుట నాచెవిని బడలేదే? ఏల? ఉత్సవమప్పుడు నీవు తియ్యనిబండములను పంచిపెట్టితివి. కొన్నిజట్లవారు, చాలవఱకు సోమరులు, కొన్ని పాటలు పాడిరి. నిజమే, కాని ఆధ్యాత్మికాహారము నీవేమి వడ్డించితివో నాచెవికిరాలేదే? దేనినిగాని ప్రశంసింపకుండు, ఎందుకుగాని ఆశ్చర్యపడకుండు, ఆవైఖరి తొలగకుండునంతవఱకు నీ వేమియు చేయలేవు. మీ కెవరికిని ధైర్య ముండదు. వదరుబోతులు ఎల్లప్పుడును పిఱికిపందలు.

ప్రతియొక్కనిని సానుభూతితో చేరదీయుము, అతనికి శ్రీరామకృష్ణునిలో నమ్మక ముండనీ లేకపోనీ. ఎవడైన మీతో రిత్తజగడమునకు వచ్చునేని మర్యాదగా ఆవలికి తొలగిపొండి... అన్నివర్గముల ప్రజలయందును మీసానుభూతి తప్పక కననగుచుండవలెను. మూలభూతములైన ఈ సుగుణరాజములు నీలో కననైనపుడే అత్యంతశక్తితో నీవు పాటుపడగలిగి యుందువు. అట్లు కాకున్నచో వట్టిగురునామజపము పనికిరాదు. ఐనను ఈ సంవత్సరము మహోత్సవము అధికవిజయవంతముగనే జరిగిన దనుటకు సందేహములేదు. అందుకై నీవు ప్రత్యేకముగ అభినందనార్హుడవు. కాని నీవు ముందంజ వేయవలెను. గుర్తించితివా? శరత్తు ఏమి చేయుచున్నాడు? ఏమియు తెలియదు ఏమియు తెలియదు అనియే చెప్పుచుండువేని ఎన్నటికిని ఏమియు నీవు తెలిసికొనజాలవు....మనకు కావలసినది ఉదాత్తధోరణికలది. అది పండితులబుద్ధి కెక్కను. కేవలము పాటకులజట్లను తయారుచేయుట మున్నగునవి పనికిరావు. ఈయుత్సవము గురుదేవుని జ్ఞప్తికి తెచ్చునదగుటే కాక, ఆయనసిద్ధాంతముల గాఢప్రచారమునకు కేంద్రసంఘమును అగును....సమస్తమును సకాలమున

సమకూడును. కాని అప్పుడప్పుడు నేను దెబ్బతిన్న కుక్కవలె చిందులుత్రొక్కుదును. చిఱచిఱలాడుదును. పదండి ముందుకు, పదండి పైకి—ఇదే నా సనాతనసాంకేతికసూక్తి. నేను క్షేమముగ నున్నాను. త్వరపడి భారతదేశమునకు మరలివచ్చిన, ఏ ఉపయోగము నుండదు. మీశక్తుల నన్నిటిని ముందుకు రప్పించుకొండి. హృదయపూర్వకముగ పారమార్థికముగ కార్యమునకు పూనుకొండి. అది నిజమైన వీరలక్షణము.

భవదీయప్రేమయుత
వివేకానంద

## 176

(శ్రీ ఇ. టి. స్టర్డీకి)

54 పడమర 33 వ వీథి
న్యూయార్కు,
ఏప్రిలు 24, 1895.

ప్రియ మిత్రమా,

ఇటీవల పాశ్చాత్యజగమున ఆకస్మికవ్యాప్తిగాంచిన గూఢమతాశయముల మొత్తమునకు మఱుగున కొంత సత్యమున్నను అది ప్రాయికముగా అనర్థములును ఉన్మాదసంజాతములునగు ఉద్దేశములతో నిండియున్నదని నేను చక్కగా నెఱుగుదును. కావున భారతదేశమందేమి ఇతరదేశములందేమి ఈమతవైఖరులతో నేనట్టి సంబంధమును ఎప్పుడును పెట్టుకొనలేదు. నిగూఢమతవాదులవర్గము నాపట్ల అధికానుకూలురుగ లేరు....

ప్రాచ్యమందేమి పాశ్చాత్యమందేమి భూతోపాసననుండియు అట్టి మూఢవిశ్వాసములనుండియు మానవతతిని కాపాడగలదియు మానవుని శీలమునకే బలమును ధోరణిని ఇచ్చునదియు

అద్వైతసిద్ధాంత మొక్కటే అనెడి నీ యభిప్రాయముతో నేను పూర్తిగా నేకీభవింతును. దీని ఆవశ్యకత పాశ్చాత్యమునకున్నంత భారతదేశమునకును కలదు. లేదా దాని యావశ్యకత భారత దేశమునకు ఇంకను ఎక్కువే. ఐనను అది పర్వతారోహణము వలె కష్టమైనపని. ఏలయన మనము మొదట అభిరుచిని పుట్టింప వలెను. తర్వాత బోధింపవలెను. కడపట సమగ్రభవనమును నిర్మింప పూనుకొనవలెను.

పరిపూర్ణమైన మనఃపూర్వకత పవిత్రత అతిమానుషమైన ప్రతిభ అన్నిటిని లోబఱచుకొనగల సంకల్పము—ఇవి గలవారు ఒకపిడికెడుమంది పాటువడనిమ్ము. ప్రపంచమంతయు తలక్రిందు లగును. క్రిందటి సంవత్సరము నే నీదేశమున ఉపన్యాసకార్య క్రమమును ఎంతో కావించితిని. పెల్లుగా అభినందనములను గడిం చితిని. కాని నేను నాకొఱకే శ్రమపడుచున్నా నని కనుగొంటిని. ఓర్పుతో శీలమును రూపొందించుకొనుటయు, పరమార్థమును సాక్షాత్కరించుకొనుటయు ప్రగాఢసాధనలుచేయుటయు— ఇవే భవిష్యన్మానవచరిత్రలో ఫలితము లీనును. కావున ఈసంవత్స రము నేను పనిని మగవారియు మగువలయు చిన్న జట్టును అనుష్ఠానవేదాంతసిద్ధిమార్గమున తర్ఫీదుచేయు ఈ మార్గమున సాగింత మనుకొనుచున్నాను- ఎంతవఱకు నెగ్గుదునో నేనెఱుగను. మానవతతికి శ్రేయముగూర్పగోరువానికి తన సొంతదేశమున కంటెను వర్గమునకంటెను పాశ్చాత్యజగము మంచిరంగము. పత్రి కనుగూర్చిన నీ ఆశయము నాకు పూర్తిగా సమ్మతమే. కాని ఈపనులు చేయుటకు వాణిజ్యచాతుర్యము నాకు లేదు. నేను పాఠము చెప్పగలను, మతబోధ చేయగలను, అప్పుడప్పుడు రచ నలు సాగింపగలను. ఐనను సత్యమునందు నాకు గాఢవిశ్వాస మున్నది. సాయమును, కలిసిపనిచేయువారిని భగవంతుడు నాకు పంపును. నాపవిత్రత పరిపూర్ణమైనదై యుండవలెను. నా ఆస్థ

పరిపూర్ణమైనదై యుండవలెను. నానిస్స్వార్థత పరిపూర్ణమైనదై యుండవలెను, అంతే.

"జయించునది సత్యమే కాని అనృతము కాదు. దేవుని చేరుకొనుదారి సత్యముగుండనే సాగును." (అథర్వవేదము) లోకమునకై తనసంకుచితాత్మను పరిత్యజించినవానికి విశ్వమంతయు సొంత మగును.... నేను ఇంగ్లండునకు వచ్చుట మిక్కిలి సందిగ్ధముగ నున్నది. అక్కడ నాకు తెలిసినవా రెవ్వరును లేరు. ఇక్కడ నేను కొంతపనిని నిర్వహించుచున్నాను. దేవునకు నచ్చినప్పుడు ఆయనే దారి చూపగలడు.

## 177

(శ్రీ ఇ. టి. స్టర్డీకి)

19 పడమర 38 వ వీథి
న్యూయార్కు

ప్రియ మిత్రమా,

క్రిందటిసారి నీవు వ్రాసినజాబు సక్రమముగ అందినది. ఈ ఆగస్టుమాసాంత్యమప్పటికి యూరోపునకు వచ్చుటకు ముందుగనే ఏర్పాటుచేసికొనియున్న నేను నీ ఆహ్వానమును దేవుని ఆహ్వానముగ గణించుచున్నాను.

"జయించునది సత్య మొక్కటే అనృతము కాదు. దేవయానము సత్యముగుండనే సాగును." సత్యవ్యాప్తికి కొంత అసత్యపుచక్కెరపూత తోడ్పడు నని తలంచువారు పొరపడుచున్నారు. ఒకచుక్క విషము మొత్తమునంతటిని విషముగ చేయునని సుదీర్ఘ కాలమునకు వారు గుర్తింతురు. పవిత్రతయు సాహసమును కల మానవుడు అన్నిటిని సాధించును. దేవుడు నిన్ను సదా మాయనుండి భ్రాంతినుండి కాపాడును గాక. నీతో కలిసి

కృషిసల్పుటకునేను సదా సంసిద్ధుడనే. మొదట మనము మన శ్రేయమును కోరువారముగనున్నచో మనకు శ్రేయాభిలాషులను నూర్లకొలదిగ దేవుడంపగలడు.

"ఆత్మైవ ఆత్మనో బన్ధుః."

యూరపు సదా సంఘశక్తికి ఉత్పత్తిస్థానముగ నుండినది. ఆసియా ఆధ్యాత్మికశక్తికి ఉత్పత్తిస్థానముగ నుండినది. భేదిల్లు పాళ్లలో ఈ రెండు శక్తుల మేళనకథయే ప్రపంచచరిత్రమంతయు. మానవచరిత్రలో ఒకనూతనాధ్యాయము నిదానముగ నారంభమగుచున్నది. సర్వత్ర దీని సూచన లున్నవి. క్రొత్తప్రణాళికలు నూర్లకొలదిగ రూపొందుచుండును, రూపుమాసిపోవుచుండును. సారము గలది మాత్రమే నిల్చును. ఏది సత్యమో ఏది శివమో అది కాక సారము కలది వేఱేది?

భవదీయేత్యాది
వివేకానంద

## 178

(శ్రీమతి బుల్బతికి)

54 పడమర 33 వ వీథి
న్యూయార్కు,
ఏప్రిలు 25, 1895.

ప్రియ శ్రీమతి బుల్బతి,

కుమారి ఫార్మరునొద్దనుండి—శార్బర్హాసుప్రసంగములకై నూఱుడాలర్ల కొక "చెక్కు"ను దయయొలుకు ఒకజాబును మొన్ననాకు చేరినవి. పై శనివారము ఆమె న్యూయార్కునకు వచ్చుచున్నది. ప్రకటనపత్రికలలో నాపేరును చేర్పవలదని ఆమెతో చెప్పెదనులే. అంతే కాదు, ఇప్పుడు నేను గ్రీనేకరుకు

పోవుటకు వీలు కాదు. థౌసండైలెండ్లు ఎక్కడనున్నను అక్కడికి పోవుద మని నేను ఏర్పాట్లుచేసికొంటిని. నావిద్యార్థినులలో నొకతెయగు కుమారి డచ్చరుకు అచట నొక కుటీరము కలదు. శాంతికి విశ్రాంతికి ఏకాంతమునకు మేము కొందఱ మచ్చట నుందుము. ఆతరగతులలో నున్నవారిలో నుండి యోగులను కొందఱిని తయారుచేయవలె నని నాకోరిక. గ్రీనేకరువంటి పనుల త్రొక్కట గలచోటు అందుకు తగనే తగదు. ఆమఱొకటి కేటా యింపుగా నున్నది. వింతలను చూచుకుతూహలముకలవా రెవ్వ రును అచ్చటికి వచ్చుటకు సాహసింపరు.

జ్ఞానయోగము కఱపబడు తరగతికి వచ్చు 130 మంది వ్యక్తుల పేళ్లను కుమారిహామ్లిను వ్రాసిపెట్టియున్నందుకు నాకు చాల సంతోషము. బుధవారపు యోగకక్ష్యలకు వచ్చువారు మఱి 50 మంది ఎక్కువగా కలరు. సోమవారకక్ష్యలకు వచ్చు వారును సుమారు 50 మంది హెచ్చుగా నున్నారు. శ్రీలాండ్సు బర్గు అందఱిపేళ్లను వ్రాసిపెట్టియున్నాడు. పేళ్లున్నను లేక పోయినను, ఎట్లును వారు వత్తురు....వారు రాకున్న ఇతరులు వత్తురు. ఇట్లు ఇది సాగుచునే యుండును — భగవంతునకు నుతులు.

పేళ్లు వ్రాసికొనుటయు వారికి తెలివిడులు అందిం చుటయు పెద్దపనియే, సందేహములేదు. ఆపనిని నాకై చేసిపెట్టు చున్నందుకు వారిద్దఱికిని నేను చాల కృతజ్ఞుడను. అయినను ఇతరులపై ఆధారపడియుండుట సోమరితనమే, అవినీతియే అని నాకు స్పష్టముగ తోచుచున్నది. సోమరితనము వలన ఎప్పుడును చెడుగే కలుగుచుండును. కాబట్టి ఇకమీాద ఆఅన్నిపనులను నేనే చేసికొందును.

కుమారిహామ్లిను చెప్పు "సరియైనరీతివ్యక్తుల"ను ఎవరి నైనను చేర్చుకొనుట నాకు చాలసంతోషమే. కాని నాదురదృష్ట

వశమున ఇంతవఱకు ఒక్కరును రాలేదు. "ఇంచుకయు సరికాని రీతి" ప్రజలలోనుండి "సరియైనరీతి" ప్రజలను రూపొందించుట సదా ఉపాధ్యాయుని కర్తవ్యము. ఆయువతి, కుమారిహామ్లిను, నాకు ఎంతో సాయముచేసినది. ఎంతో ప్రోత్సాహము కూర్చినది. న్యూయార్కులోని "సరియైనరీతి" ప్రజలకు నన్ను పరిచయపఱచినది. ఈ మున్నగు పనులలో ఆమె నాకు చేసినసాయముల కన్నిటికి ఆమెకు నే నెంతో కృతజ్ఞుడను. ఐనను నా చిన్నపనులను నేనే సొంతముగ చేసికొనుట మేలని అనుకొనుచున్నాను...

కుమారి హామ్లినును గూర్చి నీ కంత గొప్ప అభిప్రాయమున్నందుకు నాకు చాలసంతోషము. ఆమకు సాయము కావలసియున్నది. కావున నీ వామెకు సాయపడుదు వని విని నేను సంతోషించుచున్నాను. ఐనను అమ్మా, శ్రీరామకృష్ణుని కృపచే ఏమానవునిగాని చూచినవెంటనే అత డేపాటివాడై నదియు నా అంతఃప్రబోధము ఇంచుకయు పొరపాటులేక నాకు తెల్పుచుండును దాని ఫలిత మిది: నా విషయములను గూర్చి నీ యిష్టప్రకారము ఏమైనను చేయవచ్చు. నే నించుకయు గొణగను. దయ్యములను పిశాచములను లెక్కింపక, కుమారి ఫార్మరుచెప్పు సలహాను అవలంబించుట నాకు చాల సంతోషము. దయ్యములకు మఱుగున ఉత్కటప్రేమహృదయము నాకు కననగుచున్నది. కొని యాడదగిన ఆశ అనెడి ఒకసన్నని పొర దానిని కప్పియున్నది— కొన్ని సంవత్సరములలో అదియు తప్పక అంతర్ధానమగును. అప్పుడప్పుడు నాపనులలో లాండ్సుబర్గు కోతిరీతిగా జోక్యము కల్పించుకొనుటకును నే నైనను అనుమతింతును. కాని ఇక్కడ దానికొక ఆపుదలను ఏర్పఱచుచున్నాను. వీరు కాక ఇతరులవలన గలుగు సాయము నాకు భయంకరము. నేను చెప్పగల్గిన దంతే. నీవు నాకు చేసిన సాయముచేతనే గాక నాఅంతఃప్రబోధముచేత(దానిని నేను నాగురుదేవుడు చేయు ప్రబోధ మందును.)నిన్ను నా తల్లిగా భావింతును. నీవు ఏసలహా చెప్పినను దానిని సదా పాటింతును,

కాని అది వ్యక్తికిసంబంధించినంతవఱకే. ఒకమార్గము నీ వెన్నుకొన్నప్పుడు నాస్వేచ్ఛను నేను వినియోగించుకొనుటకు నీ అనుమతిని కోరుదును, అంతే.

ఆంగ్లమహాశయుని జాబును ఇందులో పంపుచున్నాను. హిందూస్థానీ మాటలకు వివరణముగా మార్జినులో నేను కొన్ని జ్ఞాపికలు వ్రాసిపెట్టియున్నాను.

విధేయుడైన నీ తనయుడు
వివేకానంద

## 179

(శ్రీసింగారవేలు మొదలియారుకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు
మే 2, 1895.

ప్రియ సి,

సన్న్యసింపవలయు నని తీర్మానించుకొన్నా వన్న మాట. నీకోరికయందు నాకు సానుభూతి కలదు. ఆత్మత్యాగమునంతటిఉన్నతాశయము లేదు. కాని నీపై నాధారపడియుండువారిమేలుకై నీప్రియాభిలాషను మానుకొనుట సామాన్యమైన త్యాగము కా దను విషయమును నీవు మఱవరాదు. శ్రీరామకృష్ణుని స్వచ్ఛజీవితమును ఉపదేశములను అనుసరింపుము. నీకుటుంబసుఖమును విచారించుకొనుము. నీవిధిని నీవు నిర్వర్తింపుము. శేషించిన దానిని దేవునకు విడిచిపెట్టుము.

'వీడు' 'వాడు' అని గాని 'ఆర్యుడు' 'మ్లేచ్ఛుడు' అని గాని 'బ్రాహ్మణుడు' 'చండాలుడు' అని గాని 'పురుషుడు' 'స్త్రీ' అని యైన గాని భేదమును ప్రేమ పాటింపదు. యావద్విశ్వమును

సొంతకుటుంబముగ చేయునది ప్రేమ. యథార్థమైన పురోగతి మెల్లగ సాగును. కాని తప్పక సాగును. భారతదేశమున సామాన్యప్రజానీకమును సముద్ధరించుట అనెడి ఏకైక కర్తవ్యమునకు తమహృదయములను ఆత్మలను అంకితమొనర్పగల యువకులమధ్య పాటుపడుము. వారిని మేలుకొలుపుము. వారి నొక్కటిగ కూర్పుము. త్యాగోత్సాహమును వారిలో రగుల్కొల్పుము. దానికి పూర్తిగా ఆధారభూతులు భారతయువజనులే.

విధేయత అను సుగుణమును అలవఱచుకొనుము. కాని నీసొంతవిశ్వాసమును వదలుకొనరాదు. పైవారికి విధేయులముగ నుండకున్న కేంద్రీకరణము సాధ్యము కాదు. వ్యష్టిశక్తుల కేంద్రీకరణము లేనిదే ఏ ఘనకార్యమును నెగ్గింపజాలము. కల్కత్తామఠము ముఖ్యకేంద్రము. ఇతరశాఖలసభ్యులు కలిసి పనిచేయవలెను. ఆకేంద్రనియమములకు కట్టువడి పనిచేయవలెను.

ఈర్ష్యాహంకారముల విడిచిపెట్టుము. పరార్థము ఐకమత్యముతో పాటుపడుటను నేర్చుకొనుడు. ఇదే మన దేశమున కిప్పటి గొప్ప అక్కఱ.

ఆశీస్సులతో,

భవదీయ
వివేకానంద

## 180

(హేలు అక్కచెల్లెండ్రకు)

న్యూయార్కు
మే 5, 1895.

ప్రియ శిశువులారా,

నేను నిరీక్షించుచుండినది సంభవించినది. ప్రొఫెసరు మాక్సుముల్లరు హిందూమతమునుగూర్చిన తనరచన లన్నిటిలో

తుదిఘట్టమున అవమానకరమైన ఒకమాటను చేర్చుచుండును. ఐనను సమగ్రసత్యమును సుదీర్ఘకాలమునకు ఆయన గుర్తించి తీరు నని నే నెల్లప్పుడును అనుకొనుచుంటిని. నీకు వీలైనంత త్వరగా, ఆయనపుస్తకములలో అన్నిటికంటెకడపటిదైన "వేదాన్తిసము" అనుదాని ప్రతిని సంపాదింపుము. పునరవతారాది సిద్ధాంతములతో సహా ఆయన కది సమగ్రముగా గ్రహింపబడిన దని నీ కందు కననగును.

ఇన్నాళ్లను నీకు నేను చెప్పుచుండిన దానిలో ఒక భాగమే అది. కావున దాని నర్థము చేసికొనుట నీకు కష్టముగ నుండదు లే.

అందులో పెక్కు అంశములలో నాచికాగో ఉపన్యాసముల తోడి పోలికలు నీకగపడును.

ఆవృద్ధుడు తుదకు నిజమును గుర్తించినందుకు నాకు సంతోషము. ఏలయన ఈకాలపు విజ్ఞానశాస్త్రమునకును పరిశోధనల కును చలింపని ఆధ్యాత్మికధర్మము కావలె ననిన అందు కదొక్కటే దారి.

టాడ్ రచించిన "రాజాస్థాన్" గ్రంథముతో మీరు వినోదించుచున్నా రనుకొందును.

సర్వప్రేమతో,

భవదీయ సోదరుడు
వివేకానంద

మలిమాట : కుమారి మేరి బోస్టనుకు వచ్చు టెప్పుడు?

వి.

## 181

(శ్రీ అళసింగపెరుమాళుకు)

అమెరికా సంయుక్తరాష్ట్రములు,
మే 6, 1895.

ప్రియ అళసింగా,

నీవు క్రిందటి సారి వ్రాసిన జాబును రామానుజాచార్యుల భాష్యప్రథమసంపుటమును నేటి ప్రొద్దున నాకు చేరినవి. కొన్నాళ్లకు ముందు నీవు వ్రాసిన మఱొకజాబును చేరినది. శ్రీమణి అయ్యరుగారొద్దనుండియు నా కొక జాబు వచ్చినది. నేను క్షేమముగా నున్నాను. పురోగమనము మునుపటివేగముతోనే సాగుచున్నది. శ్రీలందు మహాశయుని ఉపన్యాసములనుగూర్చి ప్రస్తావించితివి. అత డెవడో ఎక్కడ నున్నాడో నే నెఱుగను. చర్చిలలో ఉపన్యసించువారిలో నత డొకడుగ నుండవచ్చును. పెద్ద సదస్సులలో నుపన్యసించువా డైయుండిన మే మతనిగూర్చి వినియే యుందుము. తన ప్రసంగములను పత్రికలలో ప్రచురించుకొని ఆపత్రికలను భారతదేశమునకు పంపుచున్నాడు కాబోలు. అక్కడి మతప్రచారకులు దానిమూలముగ బంగారముపండించుకొనుచుండ వచ్చు. సరి, మీజాబుల ధోరణినిబట్టి నే నూహించిన దిది: "మీపక్షమును కాపాడుకొండి" అనునాహ్వానము ఇచటిప్రజలయొద్ద నుండి రాదు. వచ్చునెడల ప్రతిదినమును నేను శతసంఖ్యాకులతో ఇచట పోరాడవలసియుండును. ఏలయన భారతదేశప్రశంస ఇచ్చట వాతావరణమున నున్నది. డాక్టరు బర్రోసుతో సహా సనాతనక్రైస్తవులును, ఇతరులందఱును నిప్పును చల్లార్చుటకు మిక్కిలి పెనగులాడుచున్నారు. రెండవ విషయము: భారతదేశమునకు ప్రతికూలముగా సనాతనక్రైస్తవులు కావించు ఒక్కొక్కఉపన్యాసములోను నాదూషణము ఎంతో ఉండక తప్పదు. సనాతనవర్గీయులగు మహిళలును మగవారును నన్ను

గూర్చి కల్పించు కల్పనలకథలను కొన్నింటిని విన్నచో నీవు ఆశ్చర్యపడుదువు. క్రూరులును పిఱికిపందలును స్వార్థపరులు నగు ఈ స్త్రీపురుషుల ప్రతిఘటనలకు ఎదురొడ్డి సన్న్యాసియైనవాడు తన పక్షమును తాను కాచుకొనుచు పోవలెననియా నీఅభిప్రాయము? మంచి మాటచెల్లుబడిగల మిత్రులు కొందఱున్నారు నా కిచ్చట. వీ రప్పుడప్పుడు వారిని నోరు మూయించుచుందురు. అంతే కాక హిందువులందఱు నిద్రపోవుచుండగా హిందూసిద్ధాంతమును సమర్థించుటకు నా శక్తులను నేను వ్యర్థపఱుపనేల? ముప్పదికోట్ల సంఖ్యగల మీరు, ముఖ్యముగా మీలో పాండిత్యాదిగర్వముకల వారు, అచట నేమి చేయుచున్నారు? పరబోధకు మతబోధకు నన్ను వదలిపెట్టి ఈపోరాటమునకు మీ రేల పూనుకొనరు? నే నిక్కడ క్రొత్తప్రజలనడుమ అహోరాత్రములు శ్రమపడుచున్నాను......భారతదేశము ఏమి సాయ మంపుచున్నది? హిందూదేశీయులకంటె దేశభక్తిహీనులు ప్రపంచములో ఎటనైన కననైరా? చక్కగా చదువుకొన్న పటిష్ఠులగు మనుష్యులను ఒకపండ్రెండుమందిని యూరపునకును అమెరికాకును పంపి కొన్ని సంవత్సరముల కాలము వారిచేత నచ్చట మతబోధ చేయించుచు వారిని పోషించుచుండ గలరేని నైతికముగను రాజకీయముగను భారతదేశమునకు మీరెంతో సేవ చేసినవా రగుదురు. నైతికముగ భారతదేశముపట్ల సానుభూతిగల ప్రతియొక్కడును రాజకీయముగ మిత్రు డగును. మీ దేశీయులందఱును సగము దిగంబరులుగనుండు మోటువా రనియు, కొరడాదెబ్బలతో నాగరకత నేర్పబడదగినవా రనియు-పాశ్చాత్యులలో పెక్కండ్ర అభిప్రాయము. పిఱికిపందలైన మీరు ముప్పదికోట్లమంది మతప్రచారకులకు లోబడిపోయి, బదులుగా నొక్కమాటనైనను చెప్పసాహసింపలేరేని, దూరదేశమున నున్న ఒంటరిగాడు ఏమి చేయగలడు? ఇంతవఱకు నేను చేసినదానికి సైతము మీ కర్హత లేదు.

మీ "బదులు" వ్యాసములను అమెరికాపత్రికల కేల పంపరు? పంపుట కే మడ్డము? భౌతికముగ నైతికముగ ఆధ్యాత్మికముగ పిటికిపందలు మీజాతివా రందఱును. మీరు జంతువులరు. ఇప్పుడు మీకు పట్టియుండు గతికి తగినవారు. మీయెదుట నుండు లక్ష్యములు రెండే—కామినియును కాంచనమును. సాహేబులను చూచియు మతప్రచారకులనుసైతము చూచియు మీ రేమో గడగడలాడిపోవుచు ఒకసన్న్యాసిని సదా పోరాడుచు జీవింపు మని ముందుకు త్రోయగో రెదరా? మీరు ఘనకార్యములు సాధింతురు! భళీ! మీలో కొందఱు హిందూధర్మసమర్థక వ్యాసమును చక్కగ వ్రాసి బోస్టనులోని అరేనాపబ్లిషింగ్ కంపెనీ వారికి ఏల పంప రాదు? అరేనా అన్న దొక పత్రిక. మీవ్యాసమును ఆపత్రికవారు సంతోషముతో ప్రచురించుటే కాదు, మీకు పుష్కలముగ ధనమునుగూడ నీయవచ్చు. అంత వఱ కది ముగియును. అవివేకిగ నుంద మను మరులు నీకు కల్గి నప్పు డెల్ల ఈవిషయమును స్మరింపుము. ఇప్పటివఱకు పాశ్చాత్య దేశములకు వచ్చిన హిందూపలుగాకి ఒక్కొక్కడును పొగడ్తనో ధనమునో గడించుకోర్కతో తఱచు తనదేశమును తనమతమును నిందించుచు వచ్చినా డను విషయమును జ్ఞప్తియుంచుకొనుడు. నేను పేరుప్రతిష్ఠలు గడించుటకై ఇచ్చటికి రాలేదను విషయము నీవెఱిగినదే. ఆపేరుప్రతిష్ఠలు తాముగా నాపై వచ్చి పడినవి. నేను భారతదేశమునకు ఏల మరలిరావలెను? నా కెవరు తోడ్పడుదురు....మీరు శిశువులు. మీ రేమిపల్కుచుందు నదియు మీ రెఱుగరు. మతప్రచారమునకై సర్వసంగపరిత్యాగము చేయు మనుష్యులు మదరాసులో ఎక్కడ నున్నారు? ఐహికపరతయు భగవత్సాక్షాత్కారమును ఒండొంటి కంటవు. స్వదేశపక్షమును సమర్థించి మాటాడసాహసించినవాడను నే నొక్కడనే. హిందువునోటనుండి వా రెన్నడును నిరీక్షింపని ఆశయములను వారికి నేను తెల్పితిని. నాకు విరోధులు పెక్కం

డ్రున్నారు. కాని నేను మీవలె పిఱికిపందనుగా ఎన్నడునుండను. దేశమున నాకు మిత్రులును వేలకొలదిగ నున్నారు.

మృత్యుగహ్వారములోనికైనను నా వెంబడివచ్చువారు నూర్లకొలదిగ నున్నారు. ఏటేట వారిసంఖ్య హెచ్చుచుండును. నేను జీవించియుండి వారితో కలిసి పనిచేసితినేని నాజీవితమతా దర్శములు నెఱవేఱును. గుర్తించితివా?

అమెరికాలో నిర్మింపబడనుండిన 'టెంపుల్ యూని వర్సల్' 'విశ్వైకదేవాలయము'ను గూర్చిన వార్తలు నాకిప్పు డెక్కువగా వినవచ్చుట లేదు. ఐనను అమెరికనుజీవితమునకు అసలు కేంద్రస్థానమగు న్యూయార్కులో నాకు తిరమైన పునాది ఏర్పడినది. కావున నాపని సాగుచుండగలదు. నాశిష్యులలో పెక్కండ్రకు యోగమందును భక్తియందును జ్ఞానమందును తర్బీదుపూర్తిచేయుటకై వారిని నేనొక వేసవివిడిదికి పిలుచుకొని పోవుచున్నాను. తర్బీదు పూర్తియైన పిదప వారు పనిని కొనసా గింపతోడ్పడగల్గియుందురు. ఇప్పుడు నావత్సలారా, పనిచేయు టకు పొండి.

ఒకనెలదినములలో పత్రికకు కొంతపైకము పంపగలిగి యుందును. హిందుబిచ్చగాండ్రయొద్ద బిచ్చమడుగుచు పోవకుము. దానిని పూర్తిగా నాబుద్ధితోను నాకుడిచేతితోను నేనే చేసి కొందును. ఇక్కడకాని భారతదేశమునకాని నాకెవరిసాయమును అక్కఱలేదు.... 'శ్రీరామకృష్ణావతార' మనుటను మిక్కుట ముగ ఊనకుము.

నేను కనుగొన్నదానిని నీకిప్పుడు చెప్పెదను. వేదాంతము లోనే, దాని ద్వైతము విశిష్టాద్వైతము అద్వైతము అను మూడు దశలలోనే సమస్తమతమును ఇమిడియున్నది. ఈ దశ లొకదాని తర్వాత నొకటిగ వచ్చును. మానవుని పారమార్థికాభివృద్ధిలో ఈమూడును దశలు. ఇందొక్కొక్కటియు అవశ్యకమే. మత

మున సారాంశ మిది: భారతదేశమందలి వివిధసాంఘికాచార ములలోను మతములలోను అన్వితమైన వేదాంతమే హిందూ మతము. యూరోపులోని జాతివర్గాల ఆశయములకు అన్వితమై నప్పుడు ద్వైత మనెడి ఆప్రథమదశయే క్రైస్తవమత మైనది; అదే సెమిటిక్కుల కన్వితమైనప్పుడు మహమ్మదీయమత మైనది. యోగదర్శనరూపమున అన్వయించినప్పు డద్వైతమే బౌద్ధాది మతములుగనైనది. కావున మతమనుట కర్థము వేదాంతము. వివిధదేశముల వివిధావశ్యకతలను పరిసరములను ఇతరపరిస్థితులను బట్టి వేదాంతము నన్వయింపజేయుక్రమములు భేదిల్లుచుండక తప్పదు. తత్త్వశాస్త్ర మొక్కటే ఐనను శైవశాక్తాదులు తమ తమప్రత్యేకాచారములకును అభిప్రాయములకును దానిని అన్వ యింపజేసికొనుచుందు రని నీకు స్పష్ట మగును. క్రతుకలాపాచార ములను దూరముగ నుంచి, ద్వైతా ద్వైత విశిష్టాద్వైతములను మూడిటినిగూర్చియు వానిసామరస్యమును ప్రదర్శించుచు వ్యాస ములను పరంపరగా నీ పత్రికలో వ్రాయుచుండుము. అనగా తత్త్వశాస్త్రమును అందు ఆధ్యాత్మికాంశమును బోధింపుము. దానిని ప్రజలను వారి ఆచారములకనుగుణమగునట్లు చేసికొన నిమ్ము. ఈవిషయముపై నే నొకపుస్తకము వ్రాయ కోరు చున్నాను. అందుకే మూడుభాష్యముల నడిగితిని. కాని రామా నుజభాష్యమున నొకసంపుటము మాత్రమే నా కిప్పటికి చేరినది.

అమెరికను థియాసఫిస్టులు ఇతర థియాసఫిస్టులనుండి చీలి పోయి, ఇప్పుడు భారతదేశీయులను ద్వేషించుచున్నారు. పాపము, అనుశోచనీయులు! ఇంగ్లండు వాడగు స్టర్డీ ఇటీవల భారతదేశము నకు వచ్చియుండి, నా సోదరుడగు శివానందుని కలసికొన్నా డట. స్టర్డీ న న్నిప్పు డింగ్లండుకు రమ్మని జాబు వ్రాసినాడు. నే నతని కొక చక్కని జాబు వ్రాసినాను. బాబు అక్షయకుమార్ఘోషును గూర్చిన వార్త లేమి? అతనియొద్దనుండి నాకెట్టి వార్తలును విన

వచ్చుట లేదు. మత ప్రచారకులకును ఇతరులకును తగిన శాస్తి చేయుము. మనలో మిగుల బలిష్ఠులగు కొందఱను తర్ఫీదు చేయుము, భారతదేశమున ఇప్పటి మతపునరుద్ధరణమునుగూర్చి చక్కనిదియు పటువైనదియు మంచిధోరణిగలదియునుగ ఒక వ్యాసము వ్రాసి దానిని అమెరికనుపత్రికలలో కొన్నిటికి పంపుము. ఆపత్రికలలో ఒకటిరెండుమాత్రమే నాకు పరిచితములు. నేనంతగా రచయితను గా నని నీ వెఱుగుదువు. ఇంటింటికి పోయి యాచించు వాడుకయు నాకు లేదు. అవి అవి తమంతట రానిమ్మని నెమ్మదిగ కూర్చుందును......నేను లౌకికవంచకుడనై యుండినచో నా వత్సలారా, ఇట నొక సంస్థ నేర్పఱచుటలో ఎంతో మెఱుగుగా నెగ్గియుందును. అక్కటా! ఇక్కడ నున్న పారమార్థికపరతయంతయు అదే. కాంచనము + కీర్తి = మతాచార్యుడు. కామిని + కాంచనము = లౌకికమానవుడు. లోకమును లక్ష్యపెట్టక, హృదయపూర్వకముగ భగవంతునందు విశ్వాసముగల ఒక క్రొత్తమానవసంస్థను ఇచ్చట నేను సృజింపవలసియున్నది. ఆనిర్మాణము నిదానముగా, చాల నిదానముగనే ఉండితీరును. ఈమధ్యకాలమున నీవు నీపనిని సాగించుచుండుము. నేను నా నౌకను సూటిగా ముందుకు నడపుదును. పత్రికకు లక్ష్యరహితమైన ఉరవడి కూడదు, దానికి నిలుకడయు నెమ్మదియు ఉదాత్తధోరణియు అవసరములు......చక్కగా నిలుకడగా రచనలు చేయగలవారిని కొందఱిని సంపాదింపుము....పరిపూర్ణ నిస్స్వార్థతయు నిలుకడయు గలిగి పనిని సాగింపుము. మనము ఘనకార్యముల సాధింతుము. భయపడకు....మ ఱొక్క మాట. అందఱికిని సేవకుడవుగ నుండుము. ఇతరులపై అధికారము చెలాయించుటకు ఇంచుకేని ప్రయత్నింపకుము. ఆప్రయత్నము అసూయను రెచ్చకొట్టి అన్నిటిని కూలార్చును....పని కానీ; ఇప్పటికి నీవు చేసిన పని చాల బాగున్నది. సాయమునకై మనము వేచియుండము. పనిని మనమే నెగ్గింతము. నాయనా, ఓర్పు విశ్వా

సము గల్గి నీపై నీ వాధారపడియుండుము. నీ యితరమిత్రులను శత్రువులనుగా చేసికొనకు. అందఱితో ఒద్దికగా నుండుము. అందఱికిని నా నిత్యప్రేమ. ఆశీస్సులతో,

సదా భవదీయ
వివేకానంద

మఱిమాట : ముందునిలిచి "నేను నాయకుడను" అందువేని, నీకు తోడ్పడుట కెవ్వరును రారు. నగ్గోరుదువేని ముందు 'అహ'మును చంపుకో.

## 182

(శ్రీమతి బుల్లతికి)

54 పడమర, 33 న్యూయార్కు,
మే 7, 1895.

ప్రియ శ్రీమతి బుల్లతికి,

...భారతదేశమునుండి నాకొక పత్రిక వచ్చినది. భారతదేశీయు లందించిన ధన్యవాదములకు డాక్టరు బర్రోసుగారి సంక్షిప్తప్రత్యుత్తరమందు ప్రకటింపపడియున్నది. కుమారి థర్స్బీ దానిని నీ కంపును. నిన్న భారతదేశమునుండి నాకు మఱొక జాబుకూడ చేరినది. అమెరికనులకు ధన్యవాదములందించుటకును నా కొక అభినందనపత్ర మంపుటకును మదరాసులో ఒక సభ సమావేశమైనదని ఆసభాధ్యక్షుడు వ్రాసిన జాబు అది....ఆయన మద్రాసు పౌర ప్రముఖుడు, ఉన్నతన్యాయస్థానమున న్యాయమూర్తి. భారతదేశమున అది చాల ఉన్నత పదవి.

న్యూయార్కులో మాక్మోరియలుభవనము పై అంతస్తున ఇక రెండు బహిరంగోపన్యాసముల కావింపబోవుచున్నాను.

అందు మొదటి ఉపన్యాసము మతవిద్య (సైన్సు ఆఫ్ రిలిజను)ను గూర్చి, పై సోమవారమునాడు. యోగమున 'ఏది ఎందుకో' వివరించు నుపన్యాసము తర్వాతిది...... భారతదేశార్థికపరిస్థితిని దెల్పు గ్రంథమును కుమారి హామ్లిను నీ కంపినదా? నీ సోదరుడు దానిని చదువవలెననియు, భారతదేశమున ఆంగ్లపరిపాలనాఫలితముల సొంతముగ కనుగొనవలె ననియు నా యాశ.

సదాకృతజ్ఞ భవదీయతనయ
వివేకానంద

## 183

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

న్యూయార్కు,
మే 14, 1895.

ప్రియ అళసింగా,

...న్యూయార్కుపై నా కిప్పుడు పట్టు చిక్కి యున్నది. నే నీదేశమును వదలి వచ్చిన తర్వాత ఇచ్చట పనినికొనసాగించుచుండగల పనివాండ్ర శాశ్వతవర్గము నొకదాని నేర్పఱుపగల నని నానమ్మకము. నాయనా, ఈపత్రికాప్రకటనము లన్నియు బూటకము, తెలిసికొంటివా? నేను అవలి కేగునప్పుడు ఇటనొక శాశ్వత ప్రయోజనమును నిల్పి పేగగల్గియుండవలెను. దేవునను గ్రహముచే అది అత్యచిరకాలముననే ఈడేఱ నున్నది....విశ్వమున గల సమస్తసంపదకంటెను 'మానవుల' విలువయే హెచ్చు.

నన్ను గూర్చి నీవు వగవ నక్కఱలేదు. ప్రభువు నన్ను సదా కాపాడుచున్నాడు. నే నీదేశమునకు వచ్చుటయు పడిన పాట్లన్నియు వ్యర్థము కారాదు.

భగవంతుడు కరుణాసముద్రుడు. తమకు వీలైన ఏదో ఒక మార్గమున నాకు హాని చేయ ప్రయత్నించువారు చాలమంది

కలరు. తుదవఱకు నన్ను స్నేహించుచుండువారును చాలమంది కలరు. అనంతక్షాంతి, అనంతవిశుద్ధి, అనంతదీక్ష — ఇది ధర్మోద్యమమున విజయమందుటకు కీలకము.

ఆశీస్సులతో,

సదా భవదీయ
వివేకానంద

## 184

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

కుమారి ఫిలిప్సు నింట
19 పడమర 38 వ వీథి, న్యూయార్కు,
మే 28, 1895.

ప్రియ అళసింగా,

ఇవిగో నూఱు డాలర్లు (ఆంగ్లమానమున పౌ 20-8-7 లు) పంపుచున్నాను. నీ పత్రికను తొడంగుట కీ మొత్తము కొంత వఱకు తోడ్పడు ననుకొందును. అచిరకాలములో మఱికొంత సాధింపగల నని నాయాశ.

ఆశీస్సులతో,

సదా భవదీయ
వివేకానంద

మలిమాట: పైనిచూపిన చిరునామాకు తత్క్షణమే జవాబు వ్రాయుము. ఇక మీదట న్యూయార్కే నాకు ముఖ్యస్థానము. తుదకీదేశమున నేను ఒకపాటి సాధింపగల్గితిని.

వి.

## 185

(శ్రీమతి బుల్సతికి)

54 పడమర, 33 వ వీథి, న్యూయార్కు,
మే 1895, గురువారము.

ప్రియ శ్రీమతి బుల్సతి,

తరగతులు సాగిపోవుచున్నవి. తరగతికి చాలమంది వచ్చు చున్నను, బాడిగకు సరిపోవునంతైనను వరుమానము లేదని చెప్పుటకు విచారించుచున్నాను. ఈ వారము దినములు చూచెదను, తర్వాత మానుకొందును.

నేను ఈవేసవిలో, థౌసండై లెండ్సులో నాశిష్యురాండ్రలో ఒకతెయగు కుమారి డచరునింటికి పోవుచున్నాను. భారతదేశము నుండి వివిధవేదాంతగ్రంథములు నా కిటకు పంపబడుచున్నవి. థౌసండై లెండ్సులో నుండగా అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత ములనెడి మూడుదశలతోకూడిన వేదాంతమునుగూర్చి ఇంగ్లీషు భాషలో నొకగ్రంథమును రచింత మని నిరీక్షించుచున్నాను. అటు తర్వాత గ్రీనేకరుకు నాప్రయాణము జరుగవచ్చు. అక్కడ ఈవేసవిలో నేను ఉపన్యాసములు చేయవలెనని కుమారి ఫార్మరు కోరుచున్నది.

అమృతత్వమునుగూర్చి ప్రెస్సు అసోసియేషను వారికి ఒక వ్యాసమును వ్రాసి ఇత్తు నని వాగ్దానము చేసి యుంటిని. దానిని వ్రాయుచున్నాను. తీఱిక లేకున్నాను.

భవదీయ
వివేకానంద

## 186

(శ్రీ ఆళసింగ పెరుమాళుకు)

1895.

ప్రియ అళసింగా,

మనకు సంస్థ లేదు. సంస్థను నిర్మింత మను కోరికయు లేదు. తనకు నచ్చిన దానిని బోధించుటకు స్వాతంత్ర్యమును ప్రచారముచేయుటకు స్వేచ్ఛయు మగువకు గాని, మగవానికి గాని ప్రతియొక్కరికిని ఉండవలెను.

నీలో ఉత్సాహము ఉండినచో ఎప్పుడుగాని ఇతరుల నాక్షింప లేక పోవు......వారిపద్ధతి మనపద్ధతిగ నెప్పుడు నుండ జాలదు. అందులకు సులభగ్రాహ్యమగు కారణము ఇది : వారి సంఘము సాంగోపాంగనిర్మాణము కలది. మనది అట్టిది కాదు.

వ్యష్టిపరత నా లక్ష్యము. వ్యక్తులను తర్ఫీదు చేయుట కంటె పైలక్ష్యము నాకు లేదు. నాకు తెలిసినది స్వల్పము. ఆ స్వల్పమును దాచుకొనక ఉపదేశింతును. నాకు తెలియని చోట తెలియ దని ఒప్పుకొందును. థియాసఫిస్టులు కాని, క్రైస్తవులు కాని, మహమ్మదీయులు కాని ప్రపంచమున వేఱెవరయిన కాని ప్రజలకు తోడ్పడుచుండ చూతునేని అప్పుడు సంతోషించునంతగా వేఱెప్పుడును సంతోషింపను. నేను సన్న్యాసిని. కావున ప్రపంచములో అందఱికిని నన్ను బంటుగా తలంచుకొందునే కాని దొరనని భావింపను......ప్రజలు నన్ను ఇష్టపడుదురేని వారి ప్రీతికి స్వాగతమే. నన్ను ద్వేషింతురేని ఆద్వేషమునకును స్వాగతమే.

ఎవనిపనిని వాడే చేసికొనవలెను. తన్ను తానే కాపాడుకోవలెను. నేనెవరిసాయమును కోరను. ఎవరి సాయమును నిరాకరింపను. లోకములో సాయమునురాబట్టుకొనుటకు నాకెట్టి హక్కును లేదు. ఇంతకుముందుగాని, ఇకమీదగాని ఇతరుల

తోడ్పాటు నాకున్నచో అది నాపట్ల వారి కనికరమే గాని నాహక్కు కాదు. కావున వారికి నేను సదా కృతజ్ఞుడను.

నేను సన్న్యాసము స్వీకరించినప్పుడు తెలిసియే స్వీకరించితిని. ఈదేహము పస్తుచావవలసియుండునని నే నెఱుగుదును. అందు కేమి? నేను బిచ్చగాడను. పేదలు నామిత్రులు. పేదలు నాకు ప్రియులు. పేదఱికమే నా కపేక్షితము. అప్పుడప్పుడు పస్తుండవలసివచ్చుట నాకు సంతోషమే. ఎవరిసాయమును నేను కోరను. కోరి ఏమి ప్రయోజనము? సత్యము తన్ను తాను వ్యాపింపచేసికొనును. నేను సహకరింపనందుచేత అది సమసిపోదు. "సుఖాసుఖములందును, జయాపజయములందును సమదృష్టికలవాడవై పోరు సాగింపుము". (గీత). నిత్యమైన ప్రేమయే, ద్వేషాసూయలగంధమైనను లేకుండుటే అమోఘ జయసాధకము. నెగ్గున దదే. వే ఱేదియు కాదు......

భవదీయ
వివేకానంద

## 187

54 పడమర, 33 న్యూయార్కు,
మే, 1895.

ప్రియ—,

నీకు నేను జాబు వ్రాసినప్పటినుండి నావిద్యార్థులు సహకరించుచు నన్ను పరివేష్టించినారు. తరగతు లిక చక్కగాసాగును. సందేహము లేదు.

పాఠము చెప్పుట నాజీవితములో నొక భాగమైపోయినది. ఆహారమును, ఊపిరియు ఎంత ఆవశ్యకములో అదియు నంత ఆవశ్యకముగ నేర్పడినది.

భవదీయ
వివేకానంద

మఱిమాట : బార్డర్లాండు అను ఆంగ్లపత్రికలో —— ను గూర్చి ఎంతో చూచితిని —— భారతదేశమున మంచి పనిచేయు చున్నాడు. హిందువులు తమ హిందూమతమును బాగుగ గ్రహించునట్లు చేయుచున్నాడు......——రచనలలో ఎట్టి పాండిత్యమును నాకు కనిపించుటలేదు......ఎట్టి ఆధ్యాత్మికపరతయు కనిపించుట లేదు. అయినను లోకహితము చేయ గోరినవారికెల్ల మేలు కల్గుత.

ఈలోకులను మోసగించుట వంచకులకు ఎంత సులభము! నాగరికతపుట్టిననాటినుండి పాపము! తత్పరతగల మానవులతలలపై ఎంతటి మోసము ఘనీభవించి యున్నది.

## 188

(శ్రీమతి బుల్లతికి)

పెర్సి, న్యూహాంప్షైరు,
జూను 7, 1895.

ప్రియ శ్రీమతి బుల్లతికి,

తుదకు శ్రీ లెగ్గెట్టుతో ఇక్కడ నున్నాను. ఇంతవఱకు నేను చూచిన అత్యంత రమణీయప్రదేశములలో ఇ దొక్కటి. ఒకసరస్సు, చుట్టును కొండలు, వానిపై పెద్ద అడవి, అందు మేమే తప్ప వేఱెవరును లేరు. ఈసన్నివేశమును మనసుకు తెచ్చుకొని చూడుము. అంతచక్కగ, అంత ప్రశాంతముగ, అంత విశ్రాంతికరముగ నున్నది! నగరముల గలభా అనుభవించిన పిమ్మట ఇటువంటి చోట నున్నప్పుడు నాకెంతసంతోషముగ నుండునో నీ వూహించుకోవచ్చు.

ఇచ్చట నుండుటచే నా ఆయుస్సు క్రొత్తగ వర్ధిల్లినది. అడవికి ఒంటరిగ పోవుదును. నాభగవద్గీతను పారాయణము చేయు

చుండును. చాలహాయిగా నున్నాను. ఇక పదిదినములలో ఇట నుండి తరలి థౌసండ్ఐలెండ్స్పార్కుకు పోవుదును. అక్కడ నేను అన్నిగంటలును ధ్యానించుచు ఏకాంతముగ నుందును. దాని భావన సైతము ఉదాత్తతను కలిగించుచున్నది.

వివేకానంద

## 189

(కుమారి జోసఫైన్ మెక్లీడుకు)

21 పడమర, 34 వ వీథి,
న్యూయార్కు,
జూను, 1895.

ప్రియ జో,

అనుభవములు నీచుట్టును రవంత ఘనీభవించుచున్నవి. అవి ఇంకను పెక్కు తెరలను లేవనెత్త గల వని నాగట్టినమ్మకము.

నీధ్వనియంత్రము (ఫోనోగ్రాపు)నుగూర్చి శ్రీలెగ్గెట్టు నాకు తెలిపినాడు. ఎవరిధ్వనియంత్రముగుండనైనను వానితో మాటాడుద మని కొన్ని గొట్టములను తెమ్మని నే నతనిని కోరితిని. ఆగొట్టములను జోకు పంపు మంటిని. అందు కతడు "నే నెప్పుడు గాని జో ఏమిచేయుమన్నను చేయుచుందును" అని చెప్పి తానొక దానిని కొనగల నని జవాబు వ్రాసినాడు. అతని ప్రకృతిలో అంత కవిత్వము నిగూఢముగ నున్నందుకు నాకు సంతోషము.

వైద్యుడు నన్ను పర్యవేక్షింపవలెననియు నా కారోగ్యము కలిగింపవలెననియు కోరుచున్నందున నేను ఈదినము గ్వెర్న్సేలతో నుంద మని పోవుచున్నాను...... డాక్టరుగ్వెర్న్సే పెక్కు ఇతరవిషయములను పరిశీలించి నా నాడిని పట్టి చూచుచుండెను.

అప్పుడు తటాలున లాండ్స్‌బర్గు లోనికి వచ్చెను. రావలదని వారిచే నిషేధింపబడినవా డతడు. వచ్చి నన్ను చూచినవెంటనే అతడు వెనుదిరిగి పోయెను. డాక్టరు గ్వెర్న్సే పక్కన నవ్వి "ఈ సమయమున వచ్చినందుకు అతనికి నేను ధన మిచ్చియుందును. ఏల యన అతడు వచ్చినప్పుడు నీవ్యాధిని నేను మఱింత నిశ్చితముగ గుర్తింపగలిగియుందును!" అని చెప్పెను. నాడి, అంతకు మునుపు సక్రమముగనే యుండెను. కాని లాండ్స్‌బర్గు కంటబడగనే భావోద్రేకముచే అది ఇంచుమించు ఆగిపోయెను. నిజముగ నది కేవలము నాడీదౌర్బల్యమే. డాక్టరు హెల్మరు నొద్దనే వైద్యమును చేయించుకొనుచుండు మనియు అతడు నాకు గట్టిగా సలహా చెప్పినాడు. హెల్మరు నాకు బ్రహ్మాండమైన హితమును కావింపగలడని అతని తలంపు. నా కిప్పుడు కావలసిన దదే. అత డౌదార్యముకలవాడే కదా.

ఈదినము నగరమున "పవిత్రగోవు"ను చూచుట సమకూడు నని తలంచుచున్నాను. నేను న్యూయార్కులో మఱి కొన్ని దినము లుందును. నాలుగువారములపాటు ప్రతివారమును మూడేసిపర్యాయములును తర్వాత మఱి నాల్గువారములపాటు వారమునకు రెండేసి పర్యాయములు నేను చికిత్స చేయించుకొనవలె నని హెల్మరు కోరిక. నేను బోస్టనుకు పోవునెడల అచట నొక మంచి నిష్ణాతయొద్దకు నన్ను పొమ్మనుచున్నాడు. ఈవిషయమునుగూర్చి తాను ఆనిష్ణాతకు ముందుగ చెప్పునట.

లాండ్స్‌బర్గుతో కొన్ని సాదరోక్తులు పల్కి అతనిచికాకును పోగొట్టుటకై నేను మిద్దెమీాద నున్న అమ్మ గ్వెర్న్సే యొద్దకు పోయితిని.

సదా భవదీయ భగవద్గత
వివేకానంద

## 190

(కుమారి మేరీ హేలుకు)

దేవదారుపత్రముపై వ్రాయబడినది

పెర్సీ, ఎన్. హెచ్.
జూను 17, 1890.

ప్రియ సోదరీ,

న్యూయార్కులో ఫౌసండైలండుపార్కులో కుమారి డచరుగృహమునకు రేపే పోవుచున్నాను. ఇప్పుడు నీవుండున దెక్కడ? ఈ వేసవిలో మీ రందఱు ఎచ్చట నుందురు? ఆగస్టులో యూరపునకు పోవు అవకాశము నాకున్నది. పోవుటకు ముందు నిన్ను చూడ వచ్చెదను. కావున నాకు జాబు వ్రాయుము. భారత దేశమునుండి రావలసిన గ్రంథములను జాబులను నిరీక్షించు చున్నాను. వానిని దయచేసి "కుమారి ఫిలిప్సు గృహము, 19 పడమర, 38 వ వీథి, న్యూయార్కు" అను విలాసమునకు పంపుము. భారతదేశమున పవిత్రగ్రంథములన్నియు వ్రాయబడు చెట్టుపట్ట ఇది. కావున సంస్కృతమున వ్రాయు చున్నాను. ఉమాపతిః త్వాం సదా రక్షతు (ఉమాపతి నిన్ను సదా రక్షించును గాక).

మీరు అందఱును సదా ధన్యులుగనుందురు గాత.

వివేకానంద

## 191

(శ్రీ ఫ్రాన్సిసు లెగ్గెట్టునకు)

కుమారి డచరు గృహము,
థౌసండైలెండుపార్కు, న్యూయార్కు,
జూను 18, 1895.

ప్రియ మిత్రమా,

శ్రీమతి స్టర్గిసు వెడలిపోవుటకు ముందు దినమే ఆమెయొద్ద నుండి ఒకజాబును 50 డాలర్లకు "చెక్కు"ను నాకు చేరినవి. చేరిన గుర్తుచీటీ (అక్నాలజ్మెంటు) మఱునాడే ఆమె కందించుట అసాధ్యము. కాబట్టి నాధన్యవాదములను అక్నాలజ్మెంటును నీ వామెకు ఈసారివ్రాయు జాబులో దయచేసి అందింపవలసిన దని నిన్ను ప్రార్థించుటకు ఈఅవకాశమును వినియోగించుకొను చున్నాను.

హిందువుల ప్రాతసామెత చెప్పినట్లు "స్వర్గమునకు పోయి నను దంచు పని రోకలికి తప్పదు" అనుటే కాని ఇక్కడమాకు కాలము సుఖముగగడుచుచున్నది. ఏమైన నేమి? మిక్కిలిగ పాటుపడుట నాకు తప్పదు. ఆగస్టునెల ప్రారంభములో నేను చికాగోకు పోవుచున్నాను. నీవు బయలుదేఱున దెప్పుడు?

ఇక్కడ మన మిత్రులందఱు నీకు తమ అభివందనముల నందించుచున్నారు. నీకు అన్నిసుఖములు ఆనందము ఆరోగ్యము ఉన్న వని నమ్ముచు, ఉండవలె నని ప్రార్థించుచు నున్న,

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 192

(శ్రీ సింగారవేలు మొదలియారుకు)

19 పడమర, 33 వ వీథి,
న్యూయార్కు,
జూను 22, 1895.

ప్రియ కిడి,

నీ కొక్క గీటు వ్రాయుటకుబదులు పూర్తిజాబునే వ్రాసెదను. నీవు పురోగమించుచున్నందుకు నాకు సంతోషము. నేను భారతదేశమునకు మరలి రానని నీవు తలంచుట పొరపాటు. త్వరలోనే వచ్చుచున్నాను. నెగ్గలేని వారికి నే నిచ్చుట లేదు. ఇక్కడ నేను విత్తు నాటితిని. అది వృక్షము కాగలదు. తప్పదు. మిక్కిలి తొందరగా దానిని విడిచి పెట్టితినేని దాని పెరుగుదలకు భంగము కలుగునేమో అని మాత్రము దిగులుపడుచున్నాను.

నాయనా, పని సాగింపుము. రోమునగరనిర్మాణము ఒక్కదినములో పూర్తి కాలేదు. దేవుడే నాకు మార్గదర్శకుడు. కాబట్టి తుదకు అన్నియు సరిపడును.

నీయెడ నానిత్యప్రేమతో,

భవదీయ శ్రద్ధాయుత
వివేకానంద

## 193

(శ్రీమతి బుల్నతికి)

54 పడమర, 33 వ వీథి,
న్యూయార్కు,
జూను, 1895.

ప్రియ శ్రీమతి బుల్నతికి,

నే నిప్పుడే ఇల్లు చేరితిని. ఈప్రయాణము నాకు మేలు చేసినది. దేశము, కొండప్రదేశములు ముఖ్యముగా న్యూయార్కు

రాష్ట్రిములో శ్రీలెగ్గెట్టుగారి పల్లెవిడిది నాకు భోగ్యములుగ నుండినవి. పాపము లాండ్స్‌బర్గు ఈయింటినుండి వెడలిపోయి నాడు. ఎవరికిని తనచిరునామా నైనను తెలుపలేదు. ఎక్కడికి పోయినప్పటికిని లాండ్స్‌బర్గును దేవు డనుగ్రహించు గాక. ఈ జన్మములో త్రికరణశుద్ధిగల కొందఱిని కలసికొను భాగ్యము నాకు కలిగినది. వారిలో ఆయన ఒకడు.

అన్నియు మంచికొఱకే. సంయోగము లెల్ల వియోగాంత ములే. ఒంటరిగ పాటువడు సామర్థ్యము నాకు పరిపూర్ణముగ కల దని నా నమ్మకము. నరులసాయ మొంత తగ్గిన నారాయణుని సాయ మంత హెచ్చును. లండనునుండి ఒక ఆంగ్లమహాశయుడు వ్రాసిన జాబు నా కిప్పుడే చేరినది. అతడు భారతదేశమున హిమాలయములలో నాసోదరులలో ఇద్దఱితో వసించియుండిన వాడు. ఆయన నన్ను లండనుకు రమ్మనుచున్నాడు.

భవదీయ
వివేకానంద

## 194

(కుమారి మేరీ హేలుపు)

54 పడమర, 33 వ వీథి,
న్యూయార్కు,
జూను 22, 1895.

ప్రియ సోదరీ,

ఇండియానుండి వచ్చిన జాబులును పుస్తకాలకట్టయు నాకు భద్రముగా చేరినవి. శ్రీసాము వచ్చినా డని విని నేను చాల సంతోషించితిని. ఆయన "విధవలవిషయమున చక్కని హెచ్చరిక కల్గియున్నా" డనియే నానమ్మకము. ఒకనాడు

శ్రీసాముగారి మిత్రునొకనిని వీథిలో కలసికొంటిని. అత డొక ఆంగ్లమహాశయుడు. అతనిపేరు "ని" వర్ణముతో ముగియును. అతడు చాలమంచివాడు. ఓహియోలో నొకచోట సాము ఉన్న యింటనే తానును వసించుచుంటి నని అతడు చెప్పెను.

ఇంచుమించు ప్రాతపద్ధతిలోనే నేను పురోగమించు చున్నాను. చేతనైనప్పుడు మాటాడుచున్నాను. అనివార్యమైన ప్పుడు మౌనమువహించుచున్నాను. ఈ వేసవిలో గ్రీనేకరుకు నాప్రయాణము జరుగునా అను విషయము నేను ఎఱుగను. మొన్న కుమారి ఫార్మరును చూచితిని. ఆమె వెడలిపోవుతొంద రలో నున్నందున ఆమెతో చాలపరిమితముగనే సంభాషించితిని. ఆమె మిక్కిలి ఉదార మహిళ.

క్రైస్తవవిజ్ఞానపాఠములలో నీపురోగతి ఎట్లున్నది? నీవు గ్రీనేకరుకు పోవుదువని నే ననుకొనుచున్నాను. అనేకములైన ఆపాఠములే కాక నీ కక్కడ భూతవైద్యులు జోస్యులు సాము ద్రికవేత్తలు బల్లలనుబోర్లించు గారడీవాండ్రు మున్నగువారు కననగుదురు. కుమారిఫార్మరు సధ్యక్షతలో నీ కచ్చట సర్వరోగ నివారణములును అన్నితత్త్వములును లభించును.

లాండ్స్బర్గు మఱొకచోట వసింప వెడలిపోయినాడు. కావున నేను ఒంటరిని మిగిలితిని. చాలవఱకు గింజలు పండ్లు పాలు—అనునవే నాఆహారము. ఆఆహారము నాకు చాలరుచిగను ఆరోగ్యకరముగను ఉన్నది. ఈవేసవిలో నాబరువు ముప్పది నలువది పౌన్లవఱకు తగ్గవచ్చు నని నా ఆశ. నాపరిమాణమునకు అది బాగుండును. నడచుటలో శ్రీమతి ఆడముసతి నేర్పిన పాఠ ముల నన్నిటిని మఱచిపోయితినేమో అని నాభయము. మరల ఆమె న్యూయార్కుకు వచ్చినప్పుడు ఆపాఠములను పునఃప్రారం భము కావింపవలసియుండును. బోస్టనునుండి ఇండియాకు బయలు దేఱినగాంధి ఇంగ్లండునకు పోయియున్నాడని తలంచుచున్నాను.

అతని "సఖి"యైన హావర్డు సతిని ఇప్పటి ఆమె వియోగ దీనదశను తెలిసికొన గోరుచున్నాను. కంబళ్లు అట్లాంటిక్కు సముద్రమున మునిగిపోక ఎట్టకేలకు వచ్చుచున్నవను వార్త విని చాలసంతోషించుచున్నాను.

ఈసంవత్సరము నేను తలఎత్తలేనైతిని. ఉపన్యాసపర్యటనములు కావింపనైతిని. ద్వైతము విశిష్టాద్వైతము అద్వైతము అను మూడు శాఖలవారి వేదాంతసూత్రభాష్యములు ఇండియా నుండి నాకు పంపబడుచున్నవి. అవి భద్రముగ చేరు నను కొనుచున్నాను. అప్పుడు నిజముగ అవి నాబుద్ధికి విం దగును. ఈవేసవిలో వేదాంతసిద్ధాంతమును గూర్చి ఒకగ్రంథమును వ్రాయవలయు నని నా సంకల్పము. ఈప్రపంచ మెల్లప్పుడును మంచి చెడుగుల సుఖదుఃఖముల సమ్మిశ్రముగనే యుండును. ఈ చక్ర మెప్పుడును పైకిని క్రిందికిని చుట్టుచునే యుండును. రూపుదాల్చుటయు రూపుమాయుటయు అనివార్యమైన నియతి. దానిని తరించుటకు పాటుపడువారు ధన్యులు. సరి, బిడ్డలందఱు క్షేమముగ నున్నందుకు సంతోషము. కాని ఈచలికాలములో సైతము ఎవరును పట్టుచిక్కకున్నందులకు చింతిలుచున్నాను. రానురాను ప్రతిచలికాలమందును అవకాశములు తగ్గిపోవుచున్నవి. ఇక్కడ నాబసకు సమీపముననే ఉన్నది—వాల్డార్ఫుహోటలు. పట్టభద్రులయ్యు పైసాలేని యూరోపియనులకు అది కూడలిస్థలము. సంపన్నులైన అమెరికను యువతులు వెల యిచ్చి కొనుటకై వారు ప్రదర్శింపబడుచోటు అది. సరకు సమృద్ధిగ నున్నది. పెక్కురకములు కలిగి యున్నది. ఎన్నుకొనుట కవకాశము నీ కెంతైన కలదు. ఆంగ్లభాష మాటాడని వా రున్నారు! ఎవరికిని అర్థము కాని జల్పితములను పల్కువా రున్నారు. ఇంగ్లీషు చక్కగా మాటాడువా రున్నారు. కాని మూగవారి కున్నంత అవకాశము వారికి లేదు. సరళాంగ్లభాషను ధాటీయుక్తముగ మాటాడువారు చాలినంత పరాయివారు కా రని ఆమహిళల యభిప్రాయము.

ఒకహాస్యగ్రంథమున ఒకానొకఘట్టమున చదివియుంటిని:- ఒక అమెరికను నౌక సముద్రమున మునిగిపోవుచుండినది. అందలి మనుష్యులకు జీవితనిరాశ కలిగినది. అంత్యకాలనిర్వృతికై ఏదే నొక పూజాక్రియను జరిపింపవలె నని కోరిరి. ఆనౌకలో జోషు మామ యుండెను. ఆయన ప్రసిబిటేరియనుచర్చిలో ప్రముఖ పదవియం దుండువాడు. ఆయనను వారు "జోషుమామా, ఏదే నొక పూజాక్రియను చేయుమా. సంఘాతముగ మేము మరణింప నున్నాము." అని ప్రార్థించిరి. జోసఫుమామ తన టోపీని చేతికి తీసికొని ఆచోటనే కానుకలను వసూలు చేసినాడు!

అదే అతనికి తెలిసిన మత మంతయు. అట్టివారిలో అధిక సంఖ్యాకుల లక్షణము ఇంచుమించు అదే. (వారికి ఇప్పటికి తెలిసి యున్న మతమును ఇక నెప్పటికైనను వారు తెలిసికొనగల మత మును ధనమును వసూలుచేయుటయే. దేవుడు వారి ననుగ్రహిం చును గాక. ప్రస్తుతమునకు సెలవు. నాకు చాల ఆకలిగనున్నది. ఏదేని కొంత భుజింత మని పోవుచున్నాను.

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 195

(కుమారి మేరీ హేలుకు)

కుమారి డచరు గృహము,
థౌసండైలండ్పార్కు, న్యూయార్కు,
జూను 26, 1895.

ప్రియ సోదరీ,

ఇండియాతపాలు చేరినందుకు పెక్కుధన్యవాదములు. అందువలన ఎన్నియో శుభవార్తలు అందినవి. ప్రొఫెసరు మాక్సు

ముల్లరుగారి 'ఆత్మనిత్యత్వ'మునుగూర్చిన వ్యాసములు నేను అమ్మ చర్చికి పంపియుంటిని. వానిని నీవు ఇపుడు చదివి యనుభవించు చుందు వని తలంచుచున్నాను. ఆవృద్ధుడు వేదాంతమును, అస్థి పంజరముతో సహా సమస్తమును గ్రహించినాడు, ధైర్యముతో వెలువడినాడు. ఔషధములు చేరిన వను వార్త తెలిసి నేను చాల సంతోషించుచున్నాను. సుంక మేమైన చెల్లింపవలసివచ్చెనా? చెల్లింపవలసియున్న నేను చెల్లించెదను. నేనే చెల్లింపవలెననుట నాపట్టుదల. శ్రీమహారాజునొద్ద నుండి మఱొక పెద్దకట్ట రాను న్నది. అందులో శాలువలు సరిగ వేసిన పట్టువస్త్రములు ఆట వస్తువులు నుండును. వానిని వివిధమిత్రులకు బహూకరింపవలెనని నా కోరిక. ఐనను మఱికొన్ని నెలలకే గాని అవి మనకు చేరవు.—అని నా గట్టి నమ్మకము.

భారతదేశమునుండి వచ్చు జాబులను నీవును చూచితివి కదా. నన్ను అచ్చటికి రమ్మని ఆజాబులలో మరలమరల వ్రాయ బడియున్నది. !వారు నిరాశపా లగుచున్నారు. నేను యూరపు నకు పోవుదునేని న్యూయార్కు వాసియగు శ్రీఫ్రాన్సిసులెగ్గెట్టు గారి అతిథిగా పోవుదును. ఆయన ఆఱువారాలపాటు జర్మనీయం దంతటను ఇంగ్లండునందును ఫ్రాన్సునందును స్విట్జర్లండునందును పర్యటించును. అక్కడినుండి నేను భారతదేశమునకు పోవుదును. లేదా అమెరికాకే మరలినను మరలుదును. ఇచ్చట నేను విత్తన మును నాటితిని. అది వర్ధిల్లవలె నని నాకోరిక. ఈచలికాల ములో న్యూయార్కులో సాగింపబడినపని మహోజ్జ్వల మైనది. తటాలున నేను ఇండియాకు పోయితినేని ఆపని చెడి పోవచ్చు. కాబట్టి నేను త్వరలో ఇండియాకు పోవుదుననుట యూహింకాదు.

థౌసండైలండ్లలో ఈసారి నేను వచ్చియున్నప్పుడు గుర్తింప దగిన సంభవములు ఏమియు లేవు. ప్రకృతిదృశ్యము అత్యంత

రమణీయముగ నున్నది. దేవునిగూర్చియు ఆత్మనుగూర్చియు సంతోషముగ ముచ్చటించు మిత్రులు కొందఱున్నారు. ఫలములను తినుచున్నాను, పాలుత్రాగుచున్నాను. వారు భారతదేశము నుండి దయతో పంపిన వేదాంతశాస్త్రవిషయికములగు బృహద్గీర్వాణగ్రంథములను చదువుచున్నాను — ఇట్లిట్లు సాగుచున్నది కాలము.

చికాగోకు పోవుదునేని కనీసము ఆఱువారములలోపుగానో మఱికొంత ఎక్కువకాలములోపుగానో వచ్చుట నాకు శక్యము కాదు. "జేబి" నాకై తనపన్నకములలో దేనినిగానిమార్చుకో నక్కఱలేదు. ఎట్లో ఒకట్లు బయలుదేఱిపోవులోగా మిమ్మంద ఱను చూతును.

మదరాసుకు నేను వ్రాసిన ప్రత్యుత్తరమునుగూర్చి నీ వెంతో గడబిడ చేసితివే కాని అచ్చట దానివలన మహాద్భుత ఫలితములు కలిగినవి. మదరాసుక్రైస్తవకళాశాల మాజీ అధ్యక్షుడగు శ్రీమిల్లరు కావించిన కడపటి యుపన్యాసములలో ఒక దానిలో నా ఆశయములలో చాలభాగము ఇమిడియున్నది. దేవునిగూర్చిన జీవునిగూర్చిన హిందువుల ఆశయములు పాశ్చాత్యదేశములవారికి ఇప్పు డావశ్యకములై యున్న వని తెల్పుచు మిల్లరుగా రా ఉపన్యాసములో మా యువకులను పాశ్చాత్యదేశములకు పోయి మతబోధకావింపు డని కోరి యున్నాడు. మతప్రచారకసంస్థలమధ్య ఇందువలన ఎంతో కోలాహలము సహజముగ నేకల్గినది. 'అరేనా'పత్రికలో ప్రచురింపబడు దానినిగూర్చి నీ వేమో సూచింతివికాని అందించుకేని నేను చూచినవాడను కాను. న్యూయార్కులో మహిళలు నన్నుగూర్చి ఏమియు గడబిడ చేయలేదు. నీమిత్రము భావసృష్టి చేసి యుండవలెను. అధికారము చెలాయించురీతివారు కానే కారు వారు. నాయనపోపును అమ్మచర్చియుకూడ యూరపునకు వత్తు

రని నాయూహ. జీవితములో దేశాటనము వరిష్ఠాంశము. నన్నొక చోట సుదీర్ఘ కాల ముంచిన నాప్రాణములు పోవునని నాభయము. యాత్రికులజీవితమును బోలినది వే ఱొకటి లేదు.

చుట్టునున్న నీడలు ఘనీభవించుకొలది, పరమావధులు సమీపించుకొలది జీవితముస్వప్నమను పరమార్థము మానవునకు మఱింతగ అర్థ మగుచుండును. ప్రతియొక్కరికి అది దుర్గ్రహ ముగనుండుట మనకు స్పష్టము కాజొచ్చును. ఏలయన వారు అర్థములేనిదాని యర్థమును గ్రహించుటకే ప్రయత్నించిరి. స్వప్నమునుండి పరమార్థమును బడయుదు మనుట హితోచితో త్సాహము. "ప్రతిదియు క్షణభంగురము, ప్రతిదియు పరిణామ శీలము" దీని నెఱిగి జ్ఞాని సర్వసంగముల విడిచి ఖేదమోదముల పరిత్యజించి ఈ సమస్తమునకును సాక్షిభూతుడుగ నుండును.

"ఎవరిమనస్సు సామ్యమందు స్థిరపడినదో వారు ఈజన్మ మందే మోక్షమునొందినవారు. పరబ్రహ్మము ఏకమును నిర్దో షము నగుటవలన సమదృష్టికలవారు పరబ్రహ్మమందే ఉందురు"—గీత (V-19) కామము అజ్ఞానము వైషమ్యము ఇవి దాస్యత్రిపుటి. బ్రతికియుంద మను సంకల్పమును విడనాడుట, జ్ఞానము సమదృష్టి—ఇవి మోక్షత్రిపుటి.

విశ్వమునకు లక్ష్యము విముక్తియే.

"ప్రేమ కాదు, ద్వేషముకాదు, ఖేదముకాదు, మోదము కాదు, మరణము కాదు. జీవితము కాదు, ధర్మము కాదు, అధ ర్మము కాదు; ఇది కాదు ఇది కాదు ఇది కాదు."

సదా భవదీయ
వివేకానంద

## 196

(కుమారి మేరీ హేలుకు)

కుమారి డచరునింట,
థౌసండైలండుపార్కు,
న్యూయార్కు.

ప్రియ సోదరీ,

ఇండియాతపాలును చేర్చినందుకు పెక్కుధన్యవాదములు. నాయందలి నాకృతజ్ఞతను మాటలలో తెలుపజాలను. అమ్మ చర్చికి నేను పంపిన మాక్సుముల్లరుగారి "ఆత్మనిత్యత్వము" ను గూర్చిన వ్యాసములో, నీ విప్పటికే చదివియుందువు. ఈజన్మమున మన మెవరిని ప్రేమింతుమో పూర్వజన్మముననను వారినే ప్రేమించి యుండవలెను అని ఆయన ఆవ్యాసములో తెల్పియున్నాడు. కాబట్టి గడచిన జన్మములలో ఒకదానిలో నేను "పవిత్రకుటుంబము" నకు చెందినవాడనుగ నుండియుండవలెను. ఇండియానుండి వచ్చు కొన్ని గ్రంథములకై నిరీక్షించుచున్నాను. అవి వచ్చియుండు నని అనుకొనుచున్నాను. వచ్చియున్నచో దయచేసి వానిని ఇచ్చటికి పంపెదవా? తపాలురుసుము ఏ మేని చెల్లింపవలసియుండిన నాకు తెలియవచ్చులే తడవుగ నే నంపెదను. కంబళముల మీాది సుంకమునుగూర్చి నీ వేమియు వ్రాయవైతివి. ఖేత్రీనుండి మఱొక పెద్దకట్ట రానున్నది. అందులో శాలువలు కంబళములు సరిగపట్టువస్త్రములు తక్కిన ఆటవస్తువులునుండును. బొంబాయిలో నున్న అమెరికనుప్రతినిధిద్వారా సుంకము నచ్చటనే చెల్లించుటకు వీలైనచో చెల్లింపుడని వారికి వ్రాసియున్నాను. వారు చెల్లింపకున్న ఇచ్చట నేను చెల్లింపవలసియుండును. మఱి కొన్ని నెలలకే గాని అవి చేర వని నాతలంపు.

గ్రంథములనుగూర్చియే నాఆత్రము. అవి చేరిన వెంటనే దయ చేసి పంపుమా.

అమ్మకు నాయన పోపునకు అక్కచెల్లెండ్రందరికి నాప్రేమ. ఈచోటు నాకు చాలభోగ్యముగ నున్నది. చాలమితముగ భుజించుచున్నాను. ఎక్కువగ ధ్యానించుచున్నాను. సంభాషించుచున్నాను. చదువుకొనుచున్నాను. నాఆత్మను అద్భుతప్రశాంతి ఆవరించుచున్నది. ప్రతిదినమును నా కెట్టికర్తవ్యమును లేదని తోచుచున్నది. నేను సదా నిత్యవిశ్రాంతిలో శాంతిలోనున్నాను. అతడు కర్త. మనము కేవలము ఉపకరణములము. అతని నామమునకు జయము! కామినీ కాంచనము కీర్తికాంక్ష అనెడి ముత్తెఆగుల బంధము తాత్కాలికముగ నాయొద్దనుండి తొలగినట్లనిపించుచున్నది. "అన్నిభేదములును నాయొద్దనుండి రాలిపోయినవి. సకల సుకృత దుష్కృతములు సర్వభ్రాంతులు అజ్ఞానములు మాయమైనవి. గుణాతీతమార్గమున సంచరించుచున్నాను" అని ఇండియాలో నుండగా అప్పుడప్పుడు అనుకొనుచుండెడివాడను. ఇక్కడ సైతము మరల అట్లనుకొనుచున్నాను. నేను పాటించుటకు, ఉల్లంఘించుటకు నియమ మేమున్నది? ఆయెత్తునుండి చూచినప్పుడు ఈజగత్తు మురికినీటిగుంటగ కననగును. హరిః ఓమ్ తత్ సత్ - ఉన్నదతడే వేఱేదియు లేదు. నీలో నేను, నాలో నీవు, ఓదేవా నీవే నాకు సదా శరణ్యుడ వగుదువు గాక. శాంతి శ్శాంతి శ్శాంతిః.

సదా ప్రేమాశీస్సులతో,

భవదీయసోదరుడు
వివేకానంద

## 197

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

1895.

ప్రియ శశి,—

... శారదుడు చేయుచున్న పని నాకు పూర్తిగా సమ్మతమే. కాని "పరమహంస శ్రీరామకృష్ణుడు అవతారపురుషుడు" అను నటువంటి విషయములను ప్రచారము చేయ నక్కఱ లేదు. ఆయన లోకమునకు మేలుచేయుటకు వచ్చెనే కాని తనపేరున "భేరీమ్రోగించుకొనుట"కు రాలేదు. ఈవిషయమును మీరు సదా జ్ఞప్తియందుంచుకొనవలయును. శిష్యులు తమగురుదేవుని పేరు నిల్పుటయందు పూర్తిజాగ్రత్తను వహింతురు. ఆయన ఉపదేశములను త్రోసిరాజనుచుందురు. దీనిఫలితము కక్షలేర్పడుటలు ఇత్యాది. "చారు"ను గూర్చి అళసింగ వ్రాయుచున్నాడు. కాని అతడు నాకు జ్ఞప్తికివచ్చుటలేదు. అతనినిగూర్చిన సకలవివరములు వ్రాయుము. అతనికి నాధన్యవాదముల నందింపుము. అన్నిటిని గుఱించి వివరముగ వ్రాయుము. వ్యర్థప్రసంగమున గడపుటకు నాకు వ్యవధి లేదు....క్రతుకలాపాలను విడుచుటకు ప్రయత్నింపుము. అవి సన్న్యాసులకై ఉద్దేశింపబడినవి కావు. జ్ఞానముదయింపకుండునంతవఱకే కర్మానుష్ఠానావశ్యకత....నేను వేఱేమి చేసినను కక్షలతో వర్గములతో కూపస్థ మండూకములతో నాకెట్టి జోలియు లేదు....కక్షల నేర్పఱచుచు అదేసమయమున పరమహంస శ్రీరామకృష్ణుని విశాలాశయములను ప్రచారము చేయుట పొసగదు.:.....నా కర్థమగు కార్యక్రమ మొక్కటే, ఇతరులకు మేలుచేయుట. తక్కిన దెల్ల పాపకృత్యమే. కావున నేను బుద్ధదేవునకు సాష్టాంగముగ మ్రొక్కుదును....నేను వేదాంతిని, సచ్చిదానందమే నా దైవము. గంభీరమైన నాఆత్మస్వరూ

పము తప్ప వేఱొక దేవుడు నాకు కనిపించుట లేదు. అవతార పురుషులు అనగా బ్రహ్మత్వమునొందినవారు, జీవన్ముక్తులు. అవతారమూర్తులలో ఏప్రత్యేకతయు నాకు కన్పించుట లేదు. బ్రహ్మాది స్తంబపర్యంతము సకలజీవులకును కాలక్రమమున జీవన్ముక్తదశ సిద్ధించును. ఆదశనందుటకు అందఱికిని తోడ్పడుట మాత్రమే మనవిధి. ఈతోడ్పాటుకే ధర్మ మని పేరు. తక్కిన దెల్ల అధర్మము. ఇదొక్కటే కర్మము. తక్కినది పాపాచరణము. వేఱేదియు నాకు కనిపించుట లేదు. వైదికతాంత్రిక ప్రముఖములైన ఇతరవిధకర్మలకు ఫలితము లుండ వచ్చు. కాని వానికి పూనుకొనుట జీవితమును కేవలము వ్యర్థపఱచుటే. ఏలయన కర్మానుష్ఠానమునకు లక్ష్యమైన విశుద్ధి లోకసేవగుండ మాత్రమే పడయుటకు శక్యమగును. యజ్ఞయాగాదులవంటి కర్మలవలన భోగానుభవములు సిద్ధింపవచ్చును. కాని చిత్తశుద్ధి నొందుట అసాధ్యము......సకలజీవులలో నున్న ఆత్మయందు సమస్తమును ఇప్పటికే ఉన్నది. ఉద్యమించువాడు ఇప్పుడును ముక్తుడే, ఇకముందును ముక్తుడే. "నేను బద్ధుడ" నని చెప్పువాడు బద్ధుడుగనే యుండును. "నేను నీచుడను, నిమ్నుడను" అను తలంపే పాప మనియు అజ్ఞాన మనియు నా యభిప్రాయము. "నాయ మాత్మా బలహీనేన లభ్యః" "ఈఆత్మ బలహీనునకు లభ్యము కాదు". "అస్తి బ్రహ్మ వదసి చే దస్తి, నాస్తి బ్రహ్మవదసి చేన్నాస్త్యేవ భవిష్యతి" "బ్రహ్మమున్న దందువేని ఉన్నది. బ్రహ్మము లే దందువేని లేకయే పోవును." సదా తన్ను దుర్బలునిగ తలంచుకొనువాడు ఎన్నటికిని బలవంతుడు కాడు. తాను సింహమ నని తెలిసినవాడు బోనునుండి సింహము వెలికుఱుకునట్లు ఐహికమాయాజాలమునుండి వెలికుఱుకును. "నిర్గచ్ఛతి జగజ్జాలాత్ పంజరాదివ కేసరీ" మఱొక సంగతి. పరమహంస శ్రీరామకృష్ణుడు ఎట్టినూతనసత్యమును గాని బోధించుటకు అవతరింపలేదు. సనా

తనసత్యములను వెలుగులోనికి తెచ్చుటకే ఆయన అవతారము. అనగా సనాతనభారతీయాధ్యాత్మికభావతతి ఆయనలో మూర్తీభవించినది. శాస్త్రములనిజమైన అర్థమును ప్రాచీనశాస్త్రముల పదకమును అవధులను నా కర్థమగునట్లు చేసినది ఆయనజీవితమే.

ఈ దేశమున పాదిరీలును ఇతరులును నా కెక్కువ అపకారములు చేయలేక పోయిరి. దేవు నను గ్రహముచే ఇక్కడి ప్రజలకు నే నత్యంతప్రీతిపాత్రుడ నైతిని. ఏదేనొక వర్గమువారి అభిప్రాయములచే వారు మోసపోరు. వారిలో స్వార్థపరత లేదు. నా ఆశయములను వారు గుర్తించినరీతిగా నాదేశీయులు గుర్తింపలేక పోయిరి. నేను చెప్పనెంచిన దే మనగా—పనిని నిర్వహింపవలసి వచ్చినప్పుడు వారు అసూయను "మాకున్నది మాకు చాలులే" అను నట్టి ఆశయములను విడిచిపెట్టుదురు. ఒకసమర్థుడు చూపిన దారిలో అందఱును ఒద్దికకలిగి పాటుపడుదురు. ఆగుణమే వారిని గొప్పవారినిగ జేసినది. ఐనను వారందఱును ధనదేవతోపాసకులు. అన్నిటికంటె అగ్రస్థానము ధనమునకు. ఆర్థికవిషయములలో మనదేశీయులు చాలఉదారులు. ఈప్రజ లట్టివారు కారు. ప్రతియింటి కొక లోభి యున్నాడు. లోభ మిచ్చట ఇంచుమించొకపారమార్థికధర్మమే. కాని ఏదేని దుష్కృత్యము చేసినప్పుడు వారు పురోహితుల చేతులలో చిక్కుకొందురు. ధన మిచ్చి స్వర్గయానమును కొనుదురు. ఈవిషయములు, ఈమతాచార్యకైతవము ప్రతిదేశములోను ఇట్లే యుండును. నేను ఇండియాకు మరలివచ్చు టెప్పుడో, వత్తునో రానో—అనుటనుగూర్చి నే నేమియు చెప్పజాలను. ఇక్కడ గడపుచున్నట్లుగా అక్కడ గూడ నేను పరివ్రాజకజీవితమును గడపవలసియే యుండును. కాని ఇక్కడ వేలకొలది ప్రజలు నా ఉపన్యాసములను వినుచున్నారు, గ్రహించుచున్నారు, లాభపడుచున్నారు. ఈమాటను ఇండియాను గుఱించి నీవు చెప్పగలవా?...శారదుడు చేయుచున్న పని నాకు పూర్తిగా సమ్మతమే. అతని కొక వేయి ధన్యవాదములు.

...మదరాసునందును బొంబాయియందును నాప్రీతికి పాత్రులగు జనులు గుంపులుగుంపులుగ నున్నారు. వారు పండితులు, సమస్తమును అర్థముచేసికొందురు. అంతే కాదు. వారు దయార్ద్రహృదయులు. కావున లోకసేవోత్సాహమును ఆమోదింపగలరు....పుస్తకములనుగాని అట్టివేఱుదేనినిగాని నేను ముద్రింపలేదు. ఉపన్యాసములు కావించుచు పర్యటించుచున్నాను, అంతే. ...వెనుదిరిగి నా గతజీవితమును చూచుకొన్నప్పుడు నాకు పశ్చాత్తాపము కల్గుట లేదు. దేశములు చుట్టితిని, ప్రజలకు ఎంతస్వల్పముగనైనను ఏదో కొంత బోధించితిని. అందుకు బదులుగ వారి అన్నములో పాల్గొంటిని. నే నే పనియు చేయ లే దనియు ప్రజలను వంచించుచు ఉదరపోషణ కావించుకొనుచుంటి ననియు నాకు తోచియుండిన, ఈనాడు ఆత్మహత్య చేసికొనియుందును. తోడి జీవులకు బోధించు నర్హత తమకు లే దని తలంచువారు గురువుల వేషము వేసికొని ప్రజలను వంచించి జీవిక గడింప నేల? అట్లు చేయుట ఘోరపాపము కదా?...

భవదీయేత్యాది
వివేకానంద

## 198

(శ్రీ అళసింగ పెరుమాళుకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
జూలై 1, 1895.

ప్రియ అళసింగ,

......నామాట విను, అళసింగా, మిమ్ము మీరు కాపాడుకోవలె. పసిపిల్లలవలె మీ రేల ప్రవర్తించుచున్నారు? ఎవరైన

మీ మతమును ఖండించినపుడు మీ రేల మీమతమును సమర్థింప లేకున్నారు? నావిషయమున నీవు భయపడ నక్కఱ లేదు. ఇక్కడ నాకు శత్రువులకంటె మిత్రులే ఎక్కువ. ఈదేశప్రజలలో మూడవవంతువారు క్రైస్తవులు. చదువుకొన్నవారిలో అత్యల్పసంఖ్యాకులుమాత్రమే పాదిరీలను లక్ష్యపెట్టుదురు. ఏ విషయమునైనను పాదిరీలు ద్వేషింతురేని ఆద్వేషమే చదువుకొన్న వారికి ఆవిషయమందు ప్రీతిని కలిగించుచున్నది. ఇప్పు డిచ్చట వారికి మాటచెల్లుబడి తక్కువ. అది నానాటి కింకను తగ్గుచున్నది. వారి ప్రతిఘటనలు నిన్ను నొప్పించినప్పుడు ముంగోపముగల బాలునివలె ప్రవర్తించు టెందుకు? నాకు తెలుపు టెందుకు?... పిఱికితనము సుగుణము కాదు.

ఇచ్చట నేను గౌరవార్హులైన అనుచరులను ఇప్పటికే సంపాదించియున్నాను. పై సంవత్సరము కార్యక్రమనిర్వహణకు తగినట్లు వారితో ఒకసంస్థను ఏర్పఱచెదను. తర్వాత పని సాగి పోవుచుండును. నేను ఇండియాకు వచ్చివేసితినేని ఇచ్చట నాపక్షమవలంబించుటే కాక ఇండియాలో సైతము నాకు తోడ్పడగల మిత్రు లిట నున్నారు. కావున నీవు భయపడ నక్కఱ లేదు. పాదిరీలయెత్తుగడలకు ప్రతిమల్లముగా ఏమియుచేయలేక చిందులు త్రొక్కుచు మీ రాక్రందించుచున్నంతకాలము మిమ్ము చూచి నేను నవ్వెదను. మీరు చిన్న ఆటబొమ్మలు. అంతే......, పెద్దపిల్లలకు "స్వామి" ఏమి చేయగలడు?

నాయనా, నేను రావలసియుండు ననియు మిమ్ము మనుష్యులనుగా తయారుచేయవలసియుండు ననియు నేనెఱుగుదును. ఇండియాలో నున్న ప్రజ లందఱు స్త్రీలు, నపుంసకులు అని నే నెఱుగుదును. కావున చిరచిరలాడకు. అక్కడ పని సాగించుటకు నేను ఉపకరణములను తెచ్చుకొనవలసియుండును. నేను నన్ను దుర్బలులచేతులలో ఉంచుకోను. నీవు విషాదము చెంద

నక్కఱ లేదు. నీకు సాధ్యమైనంతే నీవు చేయుము. ఆమూలా గ్రము నేను అసహాయుడనుగ పాటుపడవలసియుండును.......
"ఈయాత్మ పిఱికిపందలకు లభ్యముకాదు." నాకై నీవు భయ పడ నక్కఱ లేదు. నా వెంబడి దేవు డున్నాడు. మిమ్ము మాత్రమే మీరు కాపాడుకొండి. కాపాడుకొనగల మని నాకు చూపుడు. నేను సంతుష్టుడ నయ్యెదను. ఎవరో నన్ను గూర్చి చెప్పుమాటలను నా కందించి విసిగింపకుడు. ఎవడో అవివేకి నన్ను గూర్చి కావించిన గుణదోషనిర్ణయమును వినుటకై నేను వేచి యుండ లేదు. ఓ శిశువులారా, అధికక్షాంతిచేతను అధికధైర్యము చేతను మహోద్యమములచేతను మహాఫలములు సాధింపబడు చుండును.......కిడి మనస్సు అప్పుడప్పుడు మొగ్గలువైచుచుండు నని నా దిగులు.......

ఘనకార్యములను ధీరులు చేయుదురే కాని భీరువులు చేయరు. ఓవిశ్వాసహీనులారా, నేను ఈశ్వరాధీనుడ నని మరల చెప్పనక్కఱలేకుండ తెలిసికొనుడు. ఈశ్వరుని సేవకుడనుగను విశుద్ధుడనుగను నేనున్నంతకాలము నా వెంద్రుకనైనను తాకుట శక్యము కాదు.... దేశప్రజలకు మీ రేమైన (సేవ) చేయుడు. అప్పుడు వారు మీకు తోడ్పడుదురు. అప్పుడు దేశప్రజలు మీ తోడివారుగ నుందురు. ధీరులుగ నుండుడు, ధీరులుగ నుండుడు, మానవుడు మరణించున దొక్కమారే. నాశిష్యులు పిఱికిపంద లుగ నుండ రాదు.

సదా భవదీయప్రేమయుత
వివేకానంద

## 199

(శ్రీమతి బెట్టి స్టర్గిసునకు)

రిమార్కి డచరు గృహము,
థౌసండైలెండ్పార్కు,
జూలై, 189౦.

ప్రియ జననీ,

ఈపాటికి నీవు న్యూయార్కులో నుందు వనియు, ఇప్పు డచ్చట వేడిమి చాల నెక్కువగ నుండ దనియు నానమ్మకము.

ఇక్కడ మాకు కాలము చాలగొప్పగ గడచుచున్నది. మేరీలూయీా నిన్న వచ్చినది. కావున ఇప్పటికి వచ్చిన వారంద ఱితో కలిసి మేము సరిగా ఏడుగురము.

జగతిలో నున్న నిద్రయంతయు నన్ను పైకొన్నది. పగటి వేళ కనీసము రెండుగంటలైనను నిద్రింతును. రాత్రులు పూర్తిగా మొద్దునిద్ర పోవుచున్నాను. న్యూయార్కులో నిదురయే లేకుండి నందుకు ఇది ప్రతిక్రియ అని తలంతును. పఠనరచనాకార్యము లనుగూడ కొంత చేయుచున్నాను. తొలిభోజనము ముగిసిన వెంటనే ప్రతిదినము ప్రభాతకాలమున తరగతికి పాఠము చెప్పు దును. శాకాహారనియమములను తు. చ. తప్పక భోజనపదార్థ ములు తయారుచేయబడుచున్నవి. నేను చాలవఱకు ఉపవాస ములు చేయుచున్నాను.

ఇచటినుండి బయలుదేఱులోగా నామేనిక్రొవ్వులో పెక్కు పౌండ్లు కరగిపోవలె నని దృఢనిశ్చయము కలిగియున్నాను. ఇది మెథడిస్టు లుండు చోటు. తమ మజిలీసమావేశమును వారు ఆగస్టునెలలో జరుపుకొందురు. చోటు చాల రమణీయముగ నున్నది. కాని ఈఋతువులో ఇచ్చట ప్రజలత్రొక్కట ఏర్పడు నని నా దిగులు.

కుమారి జోజోకు ఈగకాటుపుండు ఈపాటికి పూర్తిగా మానియుండు నని నా నమ్మకము....ఎక్కడున్న దమ్మా? ఈసారి నీ వామెకు వ్రాయు జాబులో నావరిష్ఠాభినందనములను దయచేసి అందింపుము.

ఫెర్సీలో ఆనందముగ గడచిన కాలమును నేను సదా స్మరించుచుందును. ఆవిందుభోజనమునకు నాకృతజ్ఞతాభివందనములను శ్రీలెగ్గెట్టుకు సదా చెల్లించుచుందును. నా కాయనతోకూడి యూరోపునకు పోవుటకు వీలగును. ఈసారి నీవు కలసికొనినపుడు నానిత్యప్రేమను కృతజ్ఞతను దయచేసి ఆయనకు అందింపుము. అతనివంటి వారి ప్రేమచే లోకము సదా మేలొందుచుందును.

నీసఖియగు శ్రీమతి దోరా (పొడుగైన జర్మను పేరుగల మహిళ)తో గూడి యున్నావా? ఆమె ఉదారాత్మురాలు, అప్పటమైన మహాత్మురాలు, నాప్రేమాదరములను దయచేసి ఆమె కందింపుము.

నే నిప్పుడు నిద్రతో సోమరితనముతో కూడిన యొక సుఖస్థితియం దున్నాను. అట్టిస్థితియందు నాకు అప్రీతియు కననగుటలేదు. మేరీలూయీ న్యూయార్కునుండి తనకు ప్రీతిపాత్రమైన ఒక చిన్నతాబేలును తెచ్చినది. ఇక్కడికి రాగానే ఆతాబేలు తనకు సహజమైన మూలద్రవ్యము నడుమ తాను కుదురుకొన్నది. కావున అది పట్టుదలతో దొర్లుచు ప్రాకుచు మేరీలూయీ ప్రేమ లాలనములకు మిక్కిలి దూరమైపోయినది. ఆమె మొదట కొంత విషాదము చెందినది, కాని మేము స్వేచ్ఛనుగూర్చి చాల తీవ్రముగ బోధించునప్పటికి ఆమె త్వరగా దారికి రావలసివచ్చినది.

నిన్ను నీ వారిని భగవంతుడు సదా అనుగ్రహించును గాక అని నిరంతరము ప్రార్థించు,

వివేకానంద

మఱిమాట: జోజో దేవదారుపత్ర పుస్తకమును పంపలేదు. నేను పంపినపుస్తకమును స్వీకరించి శ్రీమతి బుల్సతి చాల సంతోషించినది.

ఇండియానుండి నాకు చాలచక్కని జాబులు పెక్కు చేరినవి. అక్కడ అంతయు బాగున్నది. ఆవలిశిశువులకు, విదేశములం దున్న నిజమైన అమాయికులకు నాప్రేమ నందింపుము.

వి.

## 200

(శ్రీ ఫ్రాన్సిసు లెగ్గెట్టుకు)

కుమారి డచరు గృహము,
థౌసండైలండ్పార్కు, న్యూయార్కు,
జూలై 7, 1895.

ప్రియ మిత్రమా,

న్యూయార్కులో నీవు మిక్కిలి సుఖానుభవపరుడవుగ నుండుట నాకు తెలియుచున్నది. కావున ఒకజాబువ్రాసి నీమనః పరిభ్రమమునకు విచ్ఛేదము కల్గించుచున్నందుకు నన్ను మన్నింపుము.

కుమారి మెక్లీడునొద్ద నుండియు శ్రీమతి స్టర్గిసునొద్ద నుండియు నాకు రెండు చక్కని జాబులు వచ్చినవి. వానితోబాటు వారు చక్కని దేవదారుపత్ర గ్రంథములను రెంటిని పంపినారు. ఆగ్రంథములను నేను సంస్కృతమూలశ్లోకములతో వాని అనువాదములతో నింపినాను. అవి నేటి తపాలులో రవాణా యగును.

శ్రీమతి దోరా* మాహాత్మ్యమార్గమున కొన్ని అద్భుత ప్రదర్శనములను కావించుచున్నదని వింటిని.

* దోరారోస్ట్రీస్బర్గరు అనునది పూర్తిపేరు. ఆమె యొక రహస్యజ్ఞానవేత్త్రి. కుమారి మెక్లీడును, శ్రీమతి స్టర్గిసును శ్రీ వివేకానందస్వామికి పరిచయపఱచిన దీమెయే.

ఫెర్సీనుండి వచ్చినప్పటినుండి నే నెదురుచూడని చోట్లనుండి నన్ను లండనుకు రమ్మను ఆహ్వానములు నాకందినవి. ఆప్రయాణమును నేను గొప్ప ఆశలతో ప్రతీక్షించుచున్నాను.

లండనులో పనిచేయు ఈయవకాశమును పోగొట్టుకొనుట నా కిష్టము లేదు. కావున నీ యాహ్వానమును లండనునుండి వచ్చిన ఆహ్వానమును కలిసి 'పని నింకను సాగింపు' మని దేవుడంపిన పిలుపు అని నే నెఱుగుదును.

ఈనెలయంతయు నే నిచ్చటనే యుందును. ఆగస్టునెలలో ఎప్పుడో ఒకప్పుడు కొన్నాళ్లపాటు నేను చికాగోకు పోవలసి యుందును, అంతే.

నాయనా, లెగ్గెట్టూ, చిరచిరలాడకు. నిరీక్షణమునకు, నిజముగ ప్రేమలో నున్న ఇది శ్రేష్ఠసమయము.

దేవుడు నిన్ను సదా అనుగ్రహించును గాక. సర్వసుఖములు నీకు సదా కల్గును గాక. కలుగుటకు నీకు సమృద్ధమైన అర్హత కలదు.

సదా భవదీయప్రేమానురాగయుత
వివేకానంద

## 201

(కుమారి ఆల్బర్టా స్టర్గిసుకు)

19 పడమర, 38, న్యూయార్కు,
జూలై 8, 1895.

ప్రియ ఆల్బర్టా,

ఇప్పుడు నీ సంగీతపాఠములలో నిమగ్నురాలవై యుందువని నా నమ్మకము. ఈపాటికి స్వరగ్రామమును గూర్చిన సకల

విషయములను నీవు కనుగొనియుందు వని అనుకొనుచున్నాను. ఈసారి మనము కలసికొనినపుడు స్వరగ్రామమునుగూర్చి నీయొద్ద నొకపాఠము నేర్చుకొందునేని ఎంతయు సంతోషింతును.

ఫెర్సీలో శ్రీలెగ్గట్టుగోష్ఠిలో మాకు కాలము బ్రహ్మానందమయముగ గడచినది. యోగి కదా ఆయన!

హాలిస్టరుకూడ జర్మనీలో ఎక్కువ ఆనందము అనుభవించుచున్న దని నావిశ్వాసము. జర్మనుమాటలను ముఖ్యముగా Sch, Tz, Tsz మున్నగు మధురాక్షరములతో ఆరంభమగు వానిని ఉచ్చరింపబూనుకొని మీలో ఎవ్వరును నాల్కలను నొప్పించుకొనలే దని తలంచుచున్నాను.

నావలోనుండి నీవు మీఅమ్మకు వ్రాసిన జాబును చదివితిని. పై సెప్టెంబరు నెలలో నాయూరపుప్రయాణము చాలవఱకు నెఱవేఱవచ్చు. ఇంతవఱకు నేను యూరపుకు ఎప్పుడును పోలేదు. ఇంతకును యూరపు అమెరికాసంయుక్తరాష్ట్రములకంటె చాల భిన్నముగ నుండదు. ఇప్పటికి నాకు ఈదేశాచారవ్యవహారములు చక్కగా అలవడియున్నవి.

ఫెర్సీలోనుండగా పడవనడపుపనిని విశేషముగ సాగించితిమి. ఆవిద్యలో ఒకటిరెండువిషయములు నేను నేర్చుకొంటిని. మేనత్త (పినతల్లి?) జోజో తనయందలి మాధుర్యముచే కష్టపడవలసివచ్చెను. ఏలయన ఈగలును దోమలును క్షణకాలమైనను ఆమెను విడువకుండినవి. అవి నన్ను చాలదూరముగ నుంచినవి. ఏల యన ఆఈగలు దినశుద్ధిని మిక్కిలి పాటించు సనాతనాచారదీక్షగలవి, క్రైస్తవేతరుని తాకవు. అంతేకాదు, ఫెర్సీలోనుండగా నే నెక్కువగా పాటలుపాడుచుండెడివాడను. ఆపాట వానిని తప్పక బెదరగొట్టియుండును. మే ముండిన చోట చాలచక్కని దేవదారువృక్షములుండినవి. ప్రాచీనకాలమున మాదేశీయులు చేయుచుండినట్లుగా ఆచెట్టుపట్టలతో గ్రంథములను తయారుచేయుద మను

ఆశయము నాకు కల్గినది. మీఅమ్మకును మేనత్తకును (పినతల్లికిని?) సంస్కృతమున శ్లోకములు వ్రాసితిని.

ఆల్బెర్టా, అతిశీఘ్రకాలములోనే నీవు మహావిదుషీమణివి కానున్నావని నా నమ్మకము.

మీ ఉభయులకును ప్రేమాశీస్సులతో,

సదా భవదీయప్రేమయుత
వివేకానందస్వామి

## 202

(ఖేత్రీమహారాజుకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
జూలై 9, 1895.

......నేను ఇండియాకు వచ్చుటకు సంబంధించిన పరిస్థితి ఇట్లున్నది:— దేవరవారికి బాగుగా తెలియును కదా, నేను పట్టినపట్టు విడుచువాడను కా నని. ఈదేశమున నేను విత్తనము నాటితిని. అది ఇప్పటికే అంకురించినది. అచిరకాలములోనే ఈ మొలక వృక్ష మగు నని నాప్రత్యాశ. కొన్నివందలమంది అనుచరు లున్నారు నాకు. పెక్కండ్రు సన్న్యాసులను తయారుచేసి, పనిని వారి కప్పగించి తర్వాత నేను ఇండియాకు వత్తును. క్రైస్తవ మతప్రచారకుల ప్రతిఘటనము హెచ్చుకొలది వారి దేశమున నొక శాశ్వతచిహ్నమును నెలకొల్పవలె నను నానిశ్చయమును హెచ్చుచున్నది.... లండనులో ఇప్పటికే నాకు కొందఱు మిత్రు లున్నారు. ఆగస్టుమాసాంత్యమప్పటికి నే నక్కడికి పోవుదును. ...ఏదో ఒక విధమున ఈచలికాలములో కొంత లండనులోను కొంతన్యూయార్కులోను గడపి తీరవలెను. అటుపిమ్మట ఇండియాకు వచ్చుటకు నాకు తెఱపి కల్గును. దేవు డనుగ్రహించునేని

ఈచలికాలము దాటగనే ఇచ్చటి పనిని కొనసాగింపగలంతమంది మనుష్యులు ఏర్పడుదురు. ప్రతికార్యక్రమమును హేళన ప్రతిఘటనము అంగీకారము అను మూడు మెట్లమీదుగ నడువవలసియుండును. దీర్ఘదర్శియైన ప్రతివాదును తప్పక అపార్థముచేసికొనబడును. కాబట్టి ప్రతిఘటనమును పీడనమును రావలసినవే. నాకుస్థైర్యమును పవిత్రతయు దేవునందు ప్రగాఢభక్తియు నుండవలయునే కాని, ఇవన్నియు మటుమాయ మగును.

వివేకానంద

## 203

(శ్రీమతి విల్లియమ్సుస్టర్గిసుకు)

థౌసండైలండ్పార్కు,
ఆగస్టు (జూలై?) 29, 1895.

ప్రియజననీ,

నీకు మహోజ్జ్వలదశ కల్గుగాత. ఈజాబు నిను చేరునప్పుడు నీవు పరిపూర్ణారోగ్యవతివిగ నుందు వని నా నమ్మకము. నీవు 50 డాలర్లు పంపినందుకు పెక్కు ధన్యవాదములు. అది ఎంతో ఉపయోగపడినది.

ఇక్కడ మాకు కాలము మహానందముతో గడచినది. ఇచ్చట మాతో నుండుటకై ఇద్దఱుమహిళలు డిట్రాయిట్టునుండి ఇంతదూరము వచ్చిరి. వా రత్యంతసౌజన్యపావిత్ర్యసంపన్నలు. నేను థౌసండైలండ్లనుండి డిట్రాయిట్టుకును అక్కడినుండి చికాగోకును పోవుచున్నాను.

న్యూయార్కులో మన "తరగతి" కార్యము సాగిపోవుచున్నది. నే నచ్చట లేకున్నను వారు దానిని ధీరముగ నిర్వహించిరి.

మఱొక్కమాట. డిట్రాయిట్టునుండి వచ్చిన మహిళ లిద్దఱును తరగతిలో నుండిరి. దురదృష్టవశమున పిశాచములకును ఆ తెగవారగు ఇతరవ్యక్తులకును వారు మిక్కుటముగ భయపడిరి. వారికి నేర్పబడినపాఠము — ఉడుకుచున్న మద్యములో ఇంచుకంత —ఇంచుకంతమాత్రమే—ఉప్పును వేయవలెను. దానిలో నల్లనిపదార్థము కరగి అడుగునకు దిగునని అది అపవిత్రతకు సూచన. ఆఅపవిత్రత పిశాచములున్న వనుటకు సూచన. ఐనను ఈమహిళల కిద్దఱికిని గల పిశాచభీతి ఉత్కటకోటికము. ఈ పిశాచములు ఎల్లెడల నున్న వట. వీనితో విశ్వము నిండియున్న దట. నాయన లెగ్గెట్టునుండి ఈనాటివఱకు నాకు ఎట్టి వార్తయురాలేదు. కాబట్టి ఆయన నీవియోగముచే మిక్కిలి విషణ్ణుడుగ నుండియుండవలెను. సరి, దుఃఖమును దాని దారిని పోనిచ్చుట శ్రేయము. కావున ఆయన నిక విసిగింపను.

మేనత్త (పినతల్లి?) జోజోకు సముద్రమార్గమున మహా కష్టములు కలిగియుండవలెను. శుభముగ పర్యవసించున దెల్ల శుభమే.

జర్మనీవాసము పిల్లలకు * చాలభోగ్యముగ నుండియుండవలెను. వారికి సమృద్ధమైన నాప్రేమ.

ఇచ్చటి మే మందఱము మా ప్రేమను నీ కందించుచున్నాము. ఇక రాగల పెక్కుతరములవారికి నాజీవిత మొక దివ్యజ్యోతిగ నుండును గాక అని నా కోరిక.

నీ కుమారుడు
వివేకానంద

* జర్మనీలో చదువుచున్న హారిస్టను, ఆల్బెర్టును.

ఈచలికాలము దాటగనే ఇచ్చటి పనిని కొనసాగింపగలంతమంది మనుష్యులు ఏర్పడుదురు. ప్రతికార్యక్రమమును హేళన ప్రతిఘటనము అంగీకారము అను మూడు మెట్లమీదుగ నడువవలసి యుండును. దీర్ఘదర్శియైన ప్రతివాడును తప్పక అపార్థముచేసికొనబడును. కాబట్టి ప్రతిఘటనమును పీడనమును రావలసినవే. నాకుస్థైర్యమును పవిత్రతయు దేవునందు ప్రగాఢభక్తియు నుండవలయునే కాని, ఇవన్నియు మటుమాయ మగును.

వివేకానంద

## 203

(శ్రీమతి విల్లియమ్సుస్టర్గిసుకు)

థౌసండైలండ్పార్కు,
ఆగస్టు (జూలై?) 29, 1895.

ప్రియజననీ,

నీకు మహోజ్జ్వలదశ కల్గుగాత. ఈజాబు నిను చేరునప్పుడు నీవు పరిపూర్ణారోగ్యవతివిగ నుందు వని నా నమ్మకము. నీవు 50 డాలర్లు పంపినందుకు పెక్కు ధన్యవాదములు. అది ఎంతో ఉపయోగపడినది.

ఇక్కడ మాకు కాలము మహానందముతో గడచినది. ఇచ్చట మాతో నుండుటకై ఇద్దఱుమహిళలు డిట్రాయిట్టునుండి ఇంతదూరము వచ్చిరి. వా రత్యంతసౌజన్యపావిత్ర్యసంపన్నలు. నేను థౌసండైలండ్లనుండి డిట్రాయిట్టుకును అక్కడినుండి చికాగోకును పోవుచున్నాను.

న్యూయార్కులో మన "తరగతి" కార్యము సాగిపోవుచున్నది. నే నచ్చట లేకున్నను వారు దానిని ధీరముగ నిర్వహించిరి.

మఱొక్కమాట. డిట్రాయిట్టునుండి వచ్చిన మహిళ లిద్ద ఱును తరగతిలో నుండిరి. దురదృష్టవశమున పిశాచములకును ఆతెగవారగు ఇతరవ్యక్తులకును వారు మిక్కుటముగ భయపడిరి. వారికి నేర్పబడినపారము — ఉడుకుచున్న మద్యములో ఇంచు కంత —ఇంచుకంతమాత్రమే—ఉప్పును వేయవలెను. దానిలో నల్లనిపదార్థము కరగి అడుగునకు దిగునని అది అపవిత్రతకు సూచన. ఆఅపవిత్రత పిశాచములున్న వనుటకు సూచన. ఐనను ఈమహిళల కిద్దఱికిని గల పిశాచభీతి ఉత్కటకోటికము. ఈ పిశా చములు ఎల్లెడల నున్న వట. వీనితో విశ్వము నిండియున్న దట. నాయన లెగ్గెట్టునుండి ఈనాటివఱకు నాకు ఎట్టి వార్తయు రాలేదు. కాబట్టి ఆయన నీవియోగముచే మిక్కిలి విషణ్ణుడుగ నుండియుండ వలెను. సరి, దుఃఖమును దాని దారిని పోనిచ్చుట శ్రేయము. కావున ఆయన నిక విసిగింపను.

మేనత్త (పినతల్లి?) జోజోకు సముద్రమార్గమున మహా కష్టములు కలిగియుండవలెను. శుభముగ పర్యవసించున దెల్ల శుభమే.

జర్మనీవాసము పిల్లలకు * చాలభోగ్యముగ నుండియుండ వలెను. వారికి సమృద్ధమైన నాప్రేమ.

ఇచ్చటి మే మందఱము మా ప్రేమను నీ కందించు చున్నాము. ఇక రాగల పెక్కుతరములవారికి నాజీవిత మొక దివ్యజ్యోతిగ నుండును గాక అని నా కోరిక.

నీ కుమారుడు

వివేకానంద

---

* జర్మనీలో చదువుచున్న హారిష్టరు, ఆల్బెర్టును.

## 204

(శ్రీ అళసింగపెరుమాళుకు)

19 పడమర 38 వ వీథి,
న్యూయార్కు,
జూలై 30, 1895.

ప్రియ అళసింగా,

నీవు చేసిన పని సరి. పేరును నీతివాక్యము*ను చక్కగ కుదిరినవి. వట్టి సంఘసంస్కారమునుగూర్చి బుద్ధిని కలవరపఱచు కొనకుము. మొదట ఆధ్యాత్మికసంస్కారము లేనిదే సంఘ సంస్కారము పొసగదు. నేను సంఘసంస్కారాభిలాషి నని నీ కెవరు చెప్పిరి? సంఘసంస్కారమును నేను కోరలేదే! భగవన్నామ మును ప్రచారము చేయుము. అంధవిశ్వాసములను గూర్చియు సంఘదోషములనుగూర్చియు సాధకముగగాని బాధకముగగాని ప్రసంగింపకుము. మీపత్రికకు నే నంపిన తొలి రచనము విరజ గీతి.† ఉత్సాహమును కోల్పోవకుము. నీ గురువునందలి విశ్వాస మును కోల్పోవకుము. దేవునందలి నమ్మకమును విడువకుము. వత్సలారా, ఎంతకాలము మీ మనస్సులో ఉత్సాహమును గురునందును దేవునందును నమ్మికయు ఉండునో, అంతకాలము

---

* స్వామీజీ ప్రోత్సాహఫలముగ ఇప్పుడు (14-9-1895) మదరాసు నుండి బ్రహ్మవాదిన్ అను ఆంగ్లపత్రిక వెలువడినది. అది మొదట పక్షపత్రికగ నుండినది. తర్వాత మాసపత్రికగ నైనది. అందులోని నీతివాక్యము 'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి.' దానిని గూర్చి స్వామి వ్రాయుచున్నారు. ఈపత్రిక 1914 లో ఆగిపోయినది.

† దీని కాంగ్లమున 'సాంగ్ ఆఫ్ ది సన్న్యాసిన్' అని పేరు. 28-9-1895 తేదీనాడు బ్రహ్మవాదిను పత్రిక ప్రథమసంపుట ద్వితీయసంచి కలో ఇది ప్రప్రథమముగ ప్రచురింపబడినది.

మిమ్మేదియు అణచిపెట్ట జాలదు. నేను ప్రతిదినమును హృదయమున శక్తివికాసము ననుభవించుచున్నాను. ధీరులైన వత్సలారా, పనిని సాగించుచుండుడు.

నిత్యాశీస్సులతో,

వివేకానంద

205

(శ్రీ ఫ్రాన్సిసు లెగ్గెట్టుకు)

కుమారి డచరు గృహమున,
థౌసండైలెండ్పార్కు,
న్యూయార్కు,
జూలై 31, 1895.

ప్రియ మిత్రమా,

దీనికి ముందు నీ కొక జాబు వ్రాసియుంటిని. కాని దానిని తపాలులో జాగ్రత్తగా వేయలేదేమో అను అనుమానముచేత మఱొకజాబు వ్రాయుచున్నాను.

14-వ తేదీలోగా నకాలమునకు చేరెదను. ఎట్లైనను 11 వ తేదీలోగా నేను న్యూయార్కుకు రావలెను. కావున సంసిద్ధుల మగుటకు చాలినంత కాల ముండును.

నీతో కలిసి నేను పారిసుకు వచ్చెదను. అచటికి నీతో వచ్చుటలో నా ముఖ్యోద్దేశము వివాహితునిగ నిన్ను చూడవలెననుటే. సంచారమునకై నీవు దూర మేగినప్పుడు నేను లండనుకు పోవుదును. అంతే.

నీయెడలను నీవారియెడలను నా నిత్యప్రేమాశీస్సులను మరల మరల తెల్పుట అనావశ్యకము.

సదా భవదీయపుత్ర
వివేకానంద

## 206

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

19 పడమర 38 వ వీథి,
న్యూయార్కు,
ఆగస్టు 2, 1895.

ప్రియ మిత్రమా,

దయతో నీవు వ్రాసిన లేఖ నేను నా కందినది. నే నొక మిత్రునితో కలిసి మొదట పారిసుకు పోవుచున్నాను. యూరపునకు ఆగస్టు 17-వ తేదీనాడు పయనమయ్యెదను. నామిత్రుని వివాహమును చూచుటకై పారిసులో నొక్కవారము దినములు మాత్ర ముండి పిదప లండనుకు పోయెదను.

సంస్థా నిర్మాణమును గుఱించిన నీసలహా నిక్కముగ చాల బాగున్నది. దాని ప్రకారము నడచుటకు ప్రయత్నించుచున్నాను.

ఇచట నాకు బలవంతులైన మిత్రులు కొంద ఱున్నారు. కాని దురదృష్టవశమున వారిలో ననేకులు దరిద్రులు. కాబట్టి ఇచటి పని మెల్లగా నడవక తప్పదు. అంతేకాదు ఇక్కడిపని కొంత రూపొందవలె ననిన మఱికొన్ని మాసముల కృషి అవసరమై యున్నది. కావున నేను ఈచలికాలప్రారంభమున న్యూయార్కునకు రావలసియుండును. వేసవిలో లండనుకు మరలి పోదును. ఇప్పటికి నాకు తెలిసినంతవఱకు లండనులో నేను కొన్ని వారములు మాత్రమే యుండగలను. కాని భగవంతుడు సంకల్పించినచో ఆస్వల్పకాలము ఘనతరారంభములకు పునాది కావచ్చు. ఇంగ్లండునకు నేను ఎప్పుడు చేరుదు ననుటను నీకు పారిసు నుండి తంతిమూలముగ తెలియజేసెదను.

న్యూయార్కులో కొందఱు థియాసఫిస్టులు (దివ్యజ్ఞాన సమాజమువారు) నాతరగతులకు వచ్చిరి. వేదాంతమహిమ మనుష్యులకు గోచరించిన తక్షణమే వారి నుండి యక్షిణీమంత్రములన్నియు రాలిపోవును. ఇది యెల్లప్పుడు ఏకరీతిగనుండు నాయనుభవము. మానవతతికి పైమెట్టుదృశ్యములు గోచరింపనారంభించినప్పుడెల్ల క్రిందిమెట్టుదృశ్యము తనంతట మాయమైపోవును. ప్రజలసంఖ్యకు విలువ లేనే లేదు. పామరులగుంపు నూఱేండ్లలో సాధింపగలంతకంటె ఎక్కువగా హృదయపూర్ణతయు ఆర్జవమును శక్తియు గల కొందఱు ఒక్కసంవత్సరములో సాధింపగలరు. ఒక వస్తువులో నిప్పు ఉండినచో అది ఆవస్తువును సమీపించు ఇతరములకు తప్పక అంటుకొనును. ఇది నియమము. కాబట్టి మనము వేడిమిని పారమార్థికోత్సాహమును ప్రేమను ఆర్జవమును అభివృద్ధిలో నుంచుకొనియుండగలంతకాలము జయము మనదే. నా జీవితములో ఒడుదుడుకులు అతిమాత్రముగ నున్నను నిత్యసూక్తుల నిజము నాకు సదా కననగుచునే యుండినది. "జయించునది సత్యమే గాని అనృతముకాదు. దేవయానము సత్యముగుండనే సాగును."

నీలోని సత్తు నీకు సదా అమోఘమైన మార్గదర్శకముగనుండు గాక. ఆసత్తు శీఘ్రముగ విముక్తిని తాను ప్రాపించి ఇతరులు ప్రాపించుటకును తోడ్పడును గాక.

సదా భవదీయసదంతర్గత
వివేకానంద

## 207

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

19 పడమర 33 వ వీథి,
న్యూయార్కు,
1895.

ఆత్మీయ బ్రహ్మానందా,

.........శ్రీమాతృదేవికి నాబహుళ సాష్టాంగ నమస్కారములను తెలుపుము....అతని జాబును విప్పుట మంచిపని కాదు. ఇంటిలో కూర్చుండి ఇతరుల జాబులను చదువుచుండుట నే నెఱింగినవిషయమే. ఇది శోచనీయమైన పని....శివశివ!

నే నిప్పుడు న్యూయార్కునగరములో నున్నాను. వేసవి వేండ్రము కల్కత్తాలో నున్నట్లే ఈనగరమునను నుండును. సదా చెమట కాఱుచుండును. లేశమైనను గాలి లేదు. రెండు నెలలు ఉత్తరసీమకు పోయియుంటిని. అచ్చట మంచి చలి. ఈజాబునకు జవాబును "అక్షయ ఘోష్ ములాల్, యువాన్ డాఫ్ భవనము, రీజంటు వీథి, కేంబ్రిజ్, ఇంగ్లండు" అను విలాసమునకు వ్రాయుము. ఈజాబు నీకు చేరునప్పటికే నేను ఇంగ్లండుకు పోయియుందును.

ఇట్లు
నరేంద్ర

## 208

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

19 పడమర 38 వ వీథి,
న్యూయార్కు,
ఆగస్టు 9, 1895.

ప్రియ మిత్రమా,

...నా అభిప్రాయములలో కొన్నిటిని తెలుపప్రయత్నించుట నాధర్మము. మానవ సంఘములో అప్పుడప్పుడు మతకల్లో

లములు సంభవించుచుండు ననియు అట్టి కాలపరిస్థితి ప్రస్తుతము విద్వల్లోకమును ఆవరించుచున్న దనియు నేను పరిపూర్ణముగ నమ్ముచున్నాను. పైగా ప్రతికల్లోలమును పెక్కుచిన్నబుడగలుగ చీలినట్లు కనిపించినను తుదకు న వన్నియు ఒక్కటీరువే. ఆసాదృశ్యము వాని వెనుక నున్న కారణము (లు) ఏకరూపములే అనుటను సూచించును. తర్కశీలురగు మానవులను నానాటికి ఎక్కువగా తనపట్టున చిక్కించుకొనుచున్న ఇప్పటి మతకల్లోలములో ఈలక్షణ మున్నది:— ఏయేచిన్నభావావర్తములుగ అది చీలియున్నదో అన్నియు 'ఏకైకమైన సత్తు గోచరించుటయు దాని నన్వేషించుటయు' అను ఒక్కలక్ష్యమునే ఘోషించుచున్నవి.— భౌతికనైతికపారమార్థికరంగములలో నిత్యాద్వైతాశయమునకు అందించు సదా ప్రవర్ధమానమగు సూక్తియొకటి వాతావరణమున నున్నది. కావున ఇప్పటి సకలోద్యమములును తెలిసియో తెలియకయో పరమోదాత్తమైన అద్వైతవేదాంతమునే సూచించుచున్నవని తలంపవచ్చు.

సదా కననగు మతలోకవిషయము: ఏదేనొక యుగమున కలహించుచుండు వివిధభావఖండములలో ఒక్కబుడగమాత్రమే శేషించును. తక్కినవెల్ల వర్ధిల్లినను ఇందులో కరిగిపోయి దీని నొక్క బృహత్తరంగముగ చేయును. ఆ తరంగము అనివార్యవేగముతో సంఘమును ముంచివైచును.

నాకు తెలిసిన దేశములగు ఇండియాలోను అమెరికాలోను ఇంగ్లండులోను ఇట్టివి నూర్లకొలదిగ ఇప్పుడు పోరాడుచున్నవి. ఇండియాలో ద్వైతసిద్ధాంతములు ఇప్పటికే తగ్గుమొగమై యున్నవి. అద్వైతమొక్కటే ప్రబలమైన చెల్లుబడి కలిగియున్నది. అమెరికాలో అనేకోద్యమములు ప్రాధాన్యమునకై పెనగులాడుచున్నవి. ఇంచుమించు ఇవన్నియు అద్వైతాశయమును ప్రతిపాదించునవే. అన్నిటి కన్న వేగముగ వ్యాప్తి

చెందుచుండు ఉద్యమములపరంపర ఇతరములకంటె అద్వైత మునకే ఎక్కువ సన్నిహితములుగ నున్నవి. నాకు స్పష్టముగ గోచరించుచున్న దొక టుండు నేని, అది ఇది: వీనిలో ఒక్కటి నిలిచియుండును. తక్కినదెల్ల అందు లీనమైపోవును. అదే భవిష్యత్తుకు శక్తి అగును. అది ఏదైయుండును?

చరిత్రను అవలోకించితివేని బలిష్ఠమైన భాగ మేదో అది నిలుచు నని మనకు స్పష్ట మగును. మఱి బలము నొసగునది శీలము కానిచో వే ఱేది? తర్కశీలురగు మానవుల భవిష్యన్మతము అద్వైతమే. అందుకు సందేహము లేదు. అన్ని వర్గముల లోను ఏవర్గమువారు తమజీవితములో శీలము నత్యధికముగ చూపగలరో ఆవర్గమే జయమొందును. వా రెంత దూరమున నుండువారైన నగుదురు గాక.

నాసాంతమునకు గలిగిన ఒకచిన్న అనుభవమును వినుము. మాగురుదేవుడు మహాసమాధి నొందినప్పుడు నిర్ధనులమును అప్రసిద్ధులమును అగు' యువకులము పన్నిద్దఱ ముంటిమి. మాకు ప్రతిపక్షులుగ శక్తివంతములైన నూఱుసంస్థలవారు మమ్ము ఆదిలోనే అణచివేయుటకై ప్రబలప్రయత్నములు చేయుచుండిరి. కాని 'దేనిని గాని మాటతో పోనీయక అనుష్ఠానమున నెలకొల్పుకొనవలె నను కోరికయు అందులకై బ్రతికినన్ని నాళ్లు ప్రయత్నించుదీక్షయు' అను నొక గొప్పవరము శ్రీరామకృష్ణుడు మా కిచ్చియున్నాడు. ఈనాడు భారతదేశము మాగురుదేవుని అర్థము చేసికొన్నది. ఆరాధించుచున్నది. ఆయన బోధించినసత్యములు దావాగ్నిజ్వాలలవలె వ్యాపించుచున్నవి. పదేండ్లకు మునుపు ఆయన జయంతి మహోత్సవమునకు ఒకవందమంది నైనను నేను సమావేశపఱుప జాలకుంటిని. క్రిందటి సంవత్సరము ఆఉత్సవము నకు ఏబదివేలమంది ప్రజలు సమావేశమైరి.

పవిత్రత, సాధుజీవితమును జీవించుట, ఒక్కమాటలో చెప్ప వలె ననిన "అనుభూతి" యే నెగ్గునది. సంఖ్యాలుగాని

శక్తులుగాని సంపదలుగాని చమువులుగాని వాగ్ధాటిగాని మతేది గాని నెగ్గదు. ప్రతిదేశములోను అనంతతత్త్వమును అందుకొన్న వారు, స్వాత్మను పూర్ణముగ బ్రహ్మమునందు ఐక్యమొనర్చు కొన్నవారు, సంపదలనుగాని శక్తులనుగాని పేరుప్రతిష్ఠలనుగాని లక్ష్యపెట్టనివారు – అగు అటువంటి పురుషసింహులు ఒక పంద్రెండుగురున్న చాలును. వారు విశ్వమును ఉజ్జీవితలూగింప గలరు.

ఇదే రహస్యము. యోగశాస్త్రపితయగు పతంజలి "అతి మానుషశక్తుల నన్నింటిని త్యజించినప్పుడు మానవుడు ధర్మమేఘ మును ప్రాపించును" అన్నాడు. అతడు దేవుని దర్శించును. తాను దేవుడుగ నగును. అట్లగుటకు ఇతరులకు తోడ్పడును. నేను బోధింపవలసిన దెల్ల ఇంతే. సిద్ధాంతములకు ఇప్పటికి కావించిన వివరణము చాలును. గ్రంథముల కేమి, కోట్ల కొలదిగ నున్నవి! ఆచరణము ఇంచుకైన ఏదీ!

సంఘములును సంస్థలునా, అవి తమంతట ఉప్పతిల్లును. అసూయకు ఆస్పదమే లేనిచోట అసూయ యుండ గలదా? మన లను హింసింపగోరువారు కోట్లకొలదిగ నున్నారు. కాని సత్యము మనయొద్ద నున్న దనుటకు అత్యమోఘమైన సాక్ష్య మదే కదా. నాకు ప్రతిఘటనము ఎంత ఉండిన నాశక్తి అంతగా సదా ప్రకట మగుచుండినది. రాజాధిరాజులు నన్ను తటిమియున్నారు. ఆరా ధించియున్నారు. పురోహితులును సామాన్యమానవులును ఏక రీతిగ నన్ను దూషించియున్నారు. దూషించిన నేమి? వారి నందఱిని దీవింపుము. వారు నిజముగ నా ఆత్మయే. నాశక్తిని ఇంకనింకను పైపైకి ఎగురునట్లు చేయు జోరుటీగగా ప్రవర్తించి వారు నాకు సాయమునేకదా కావించిరి?

...నే నొక గొప్ప మర్మమును కనుగొంటిని. మతమును గూర్చి నోరు పాఱవేసికొనువారి వలన నా కెట్టి భయమును లేదు.

సాక్షాత్కారసిద్ధి గన్న మహాత్ములు ఎవరిని ద్వేషింపరు. వాచాలురను వాగనిమ్ము, వారి కంతకంటె నేమియు తెలియదు. కామినీ కాంచనములును పేరుప్రతిష్ఠలును వారికి కావలసినంత వారికుండనిమ్ము. మనము సాక్షాత్కారమునే, బ్రహ్మరుుగ నగుటనే బ్రహ్మముగనుండుటనే అవలంబించియుందము. బ్రతికినంతకాలము జన్మజన్మమందును మనము సత్యావలంబకులముగ నుందము గాక. ఇతరుల మాటలను మనము ఇంచుకేని లక్ష్యపెట్టకుందుము గాక. యావజ్జీవము సల్పిన కృషికి ఫలముగ ఒక్కజీవుడు, ఒక్కజీవుడే అయినను ఐహికబంధముల తెంచుకొని విముక్తినందునేని మనము మనవిధిని నెఱవేర్చినవారమే. హరిః ఓమ్!

...ఇక నొక్క మాట. ఇండియా నాకు ప్రియమే. సందేహము లేదు. ఐనను నాదృష్టి నానాటికి మఱింత విశదమగుచున్నది. మాకు ఇండియా యేమి, ఇంగ్లండువేమి, అమెరికా యేమి! ఏ దేవుని అజ్ఞానులు జీవు డందురో ఆదేవుని కింకరులము మేము. వేరులొద్దపోసిన నీరు వృక్షమున కంతటికిని చెందదా?

సాంఘికరాజకీయాధ్యాత్మికసుస్థితికి ఆధార మొక్కటే—నేనును నాసోదరుడును ఒక్కరమే అను జ్ఞానము.; ఇది విశ్వజనీనమగు సత్యము. సకలదేశములకిదే సత్యము. ఒక్కమాట విను. ప్రాచ్యదేశీయులు ఈయాశయమును ప్రతిపాదించుటతోను వ్యష్టిసిద్ధులను కొన్నింటిని కలిగించుటతోను ఇంచుమించు అలసిపోయినారు. కావున వారికంటె ఎక్కువ శీఘ్రముగ పాశ్చాత్యులు దీనిని సాధింతురు.

ఇతరులపై అధికారము చెలాయింత మను కోరికయు యశఃకీర్తికాంక్షయు లేక పాటుపడుదము గాక. కామక్రోధలోభము లనెడి మూడుబంధముల నుండి విడివడిన వారముగ నుందము గాక. సత్యము మనయొద్దనే యున్నది.

సదా భవదీయ భగవద్గత
వివేకానంద

## 209

(శ్రీ అళసింగపెరుమాళుకు)

అమెరికా సంయుక్తరాష్ట్రములు'
ఆగస్టు, 1895.

ప్రియ అళసింగా,

ఈజాబు నీకు చేరునప్పటికి నేను పారీసులో నుందును.... ఈసంవత్సరము నేను చాలపని చేసితిని. పై సంవత్సరము ఇంకను ఎక్కువ పని చేయుదు నని నమ్ముచున్నాను. క్రైస్తవమత ప్రచారకులనుగూర్చి వ్యథచెందకుము. ఆర్భాటములు చేయుట వారి కెంతయు సహజమే. తన అన్నము క్షీణించుచున్నప్పుడు ఎవడు ఆర్భాటము చేయకుండును? గడచిన రెండేండ్లలో మతప్రచారకుల ఆర్థికస్థితిలో చాల లోటు కలిగినది. అది ఇంకను వృద్ధియగుచున్నది. ఐనను క్రైస్తవమతప్రచారకులకు నేను అన్నివిధముల విజయమునే కోరుదును. నాయనా, దేవునందును గురువునందును ప్రేమయు పరమార్థమునందు విశ్వాసమును నీకున్నంతవఱకు ఏదియు నిన్ను బాధింపజాలదు. కాని వీనిలో దేనిని కోల్పోవుటయు ఆపత్కరమే. నీవు బాగుగానే చెప్పితివి. నాఆశయములు ఇండియాలో నెగ్గినంతకంటె ఎక్కువగా పాశ్చాత్యదేశములలో నెగ్గగలవు....ఎప్పుడుగాని ఇండియా నాకు చేసిన సాయముకంటె ఎక్కువసాయము నేను ఇండియాకు చేసి యున్నాను....సత్యమందు నాకు విశ్వాసము కలదు. ఎచ్చటికి పోయినను కార్యసహాయులను నాకు వందలకొలదిగ భగవంతు డంపుచుండును. వారు ...శిష్యులవంటి వారును కారు. వారు తమగురువునకై ప్రాణము లర్పింప సంసిద్ధులుగ నున్నారు. సత్యమే నాదైవము. విశ్వమే నా దేశము. విధ్యుక్తధర్మమందు నాకు నమ్మకము లేదు. ఆపీడ సంసారులకే గాని సన్న్యాసులకు కాదు. విధ్యుక్తధర్మము అను

నది బూటకము. నేను ముక్తుడను, నాబంధములు విచ్ఛిన్నము లైనవి. ఈదేహము ఎచ్చటికి పోయిన నేమి పోకున్న నేమి? నా కదేమి లక్ష్యము? ఆదినుండి ఇప్పటివఱకు నీవు నాకు బాగుగ తోడ్పడితివి. సర్వేశ్వరుడు నిన్ను సన్మానించును. అమెరికాలో గాని ఇండియాలోగాని ప్రశంసకై నేను దేవులాడలేదు. అట్టి బుద్బుదములను నేను అన్వేషింపను. దేవునిబిడ్డనగు నేను ఉపదేశింపవలసిన సత్య మొకటి కలదు. ఆసత్యమును నా కిచ్చిన వాడే భువిగల వరిష్ఠులనుండియు శ్రేష్ఠులనుండియు సహాయుల నేటి నాయొద్దకు పంపును. పాశ్చాత్యదేశములలో భగవంతు డిక కొన్నిసంవత్సరములలో ఏమి చేయునో ఓ హిందువులారా, మీరు చూతురు. మీరు ప్రాచీనకాలపు యూదులను బోలిన వారు. తానును తినక ఇతరులను తిననీయక కడితితొట్టియొద్ద నుండు కుక్కలవంటివారు. మీకు మతము లేదు. వంటయిల్లే మీవేల్పు. వంటపాత్రలే మీవేదము....మీరు కొందఱు ధీర బాలురు....వత్సలారా, పట్టువిడువకుడు. నా బిడ్డలలో పిఱికి పంద లుండరు......ఘనకార్యములు ఎప్పుడుగాని అడ్డంకులు లేక నెఱవేఱునా? కాలము, ఓర్పు అమోఘసంకల్పము — ఇవి చూపవలయును. నీహృదయమును ఉప్పొంగించు విషయములను నీకు నేను చెప్పియుండగలను. కాని చెప్పను. నాకు కావలసినది కంప మెఱుగని ఇనుపగుండెలును సంకల్పములును. పట్టువిడువకుడు. దేవుడు మి మ్మనుగ్రహించుత.

ఆశీస్సులతో,

సదా భవదీయ
వివేకానంద

## 210

(శ్రీమతి బుల్ తికి)

థౌసండ్ ఐలండు పార్కు,
ఆగస్టు, 1895.

ప్రియ శ్రీమతి బుల్ తి,

...ఇదిగో శ్రీ స్టర్డీగారియొద్దనుండి మఱొక్కజాబు వచ్చినది. దానిని నీకు పంపుచున్నాను. ప్రణాళిక లన్నియు ఎట్లు సిద్ధపడుచున్నవో చూడుము. ఇదియు శ్రీ లెగ్గెట్టుగారి ఆహ్వానము దేవునిపిలుపు అని నీకు తోచలేదా? అది నాకట్లే తోచినది. నేను దానిని అనుసరించుచున్నాను. ఆగస్టుమాసాంత్యమప్పటికి నేను లెగ్గెట్టుతో కలిసి పారీసుకు పోవుదును. అక్కడి నుండి లండనుకు పోవుదును.

నాసోదరులకును మాఉద్యమమునకును ఏ ఇంచుకంతసాయపడ శక్యమగునో ఆసాయమును మాత్రమే నీయొద్ద నేను కోరునది. నాప్రజలకై నేను నిర్వహింపవలసిన పనిని ఒకింత చక్కగనే నిర్వహించితిని. నాకు ఈదేహము నిచ్చిన ప్రపంచమునకును ఆశయము లిచ్చిన దేశమునకును నన్ను తమలో ఒకనిగ నుండనిచ్చు చున్న మానవకోటికిని — ఇప్పుడు సేవచేయ వలసియున్నది.

నాకు వయస్సు హెచ్చుకొలది హిందువుల ఆశయమునకు అంతరార్థమైన—"సకలజీవులలో మానవుడు వరిష్ఠుడు" అనునది మఱింత స్పష్ట మగుచున్నది. మహమ్మదీయులు చెప్పునదియు నదియే. అల్లా దేవదూతలను ఆదామునకు మ్రొక్కుడనికోరెను. ఇబ్లిసు మ్రొక్క లేదు. కావున అతడు సైతానుగ నయ్యెను. స్వర్గాదిలోకము లన్నిటికంటె పైది ఈభూలోకమే. విశ్వమున ఇది అన్నిటిని మించిన పాఠశాల. అంగారకగ్రహమందుగాని గురు

గ్రహమందుగాని ఉన్న ప్రాణులు మనకంటె ఉన్నతులు కారు. ఏలన వారు మనతో వార్తలను అందించిపుచ్చుకొనజాలరు. ఉన్నత ప్రాణులు అని పేర్కొనబడువారు మృతులుమాత్రమే. వీరు దేహాంతరమునుదాల్చిన మానవులే. అది సూక్ష్మదేహ మనుట నిజమే గాని, అయినను హస్తపాదాదిసంయుతమైనమానవదేహమే. వారు ఈభూలోకమందే పూర్తిగ అదృశ్యులుకాక వేఱొకఆకాశమున నుందురు. వారును ఆలోచింతురు, వారికిని చైతన్య మున్నది. తక్కిన ప్రతిది గూడ మనకున్నట్లే వారి కున్నది. కావున వారును మానవులే. వేల్పులును మానవులే దేవదూతలును మానవులే. దేవుడుగ నగువాడు మానవు డొక్కడే. తక్కిన వా రందఱును దేవుడుగ కావలె నన్న మరల మానవులుగ కావలెను....

భవదీయేత్యాది
వివేకానంద

## 211

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

న్యూయార్కు,
1895.

ఇక్కడి పని మహోజ్జ్వలముగ సాగిపోవుచున్నది. ఇక్కడికి వచ్చి చేరినప్పటినుండి నేను రెండు తరగతులలో ఎడతెంపు లేక పనిచేయుచుంటిని. ఒకవారము దినముల విరామమునకై రేపే నేను శ్రీలెగ్గెట్టుతో కలిసి నగరమునుండి వెలికిపోవుచున్నాను. మీవారిలో సంగీతమున అత్యంతనైపుణ్యము గలవారిలో నొక్కతెయగు మాడెమ్ ఆంటీయొనెట్ స్టెర్లింగు నీకు పరిచితురాలేనా? (నా) పనిలో ఆమెకు అత్యంతాసక్తి కలదు.

పనిలో లౌకికవ్యవహారభాగమునంతటిని ఒకపరిషత్తున కప్పగించి అజంజాటము లేవియు లేకున్నాను. సంస్థానిర్మాణమున నాకు సహజాభిరుచి లేదు. అది నన్ను ఇంచుమించు తుత్తునియలు చేసివైచును.

..."నారదసూత్రముల"ను గూర్చి ఏమి? ఆపుస్తకమునకు ఇక్కడ మంచిఅమ్మక ముండు నని నాదృఢవిశ్వాసము. నేనిప్పుడు యోగసూత్రములను చేబూనియున్నాను. అందులో ఒకదానివెంట నొకదానినిగ తీసికొని వానితోగూడ సకలవ్యాఖ్యానములను పఠించెదను. ఈప్రసంగములు వ్రాసిపెట్టబడుచున్నవి. పూర్తియైనప్పుడు ఇది పతంజలిగ్రంథమునకు అత్యంతసమగ్రవివరణముతోడి ఆంగ్లానువాద మగును. అది చాల పెద్దపుస్తకమే అగును.

ట్రుబ్నరు అంగడిలో కూర్మపురాణముద్రితప్రతులు ఉన్నవని నాతలంపు. వ్యాఖ్యాత విజ్ఞానభిక్షువు ఆగ్రంథమునుండియే ఉదాహరణములను పరంపరగ నిచ్చుచుండును. స్వయముగ నేను ఆపుస్తకమును ఎప్పుడును చూచియుండలేదు. దయచేసి అవకాశముకలుగజేసికొని పోయి ఆగ్రంథములో యోగమునుగూర్చి చెప్పుప్రకరణములు కొన్ని యున్న వేమో చూచెదవా? ఉన్నయెడల దయచేసి నాకొక ప్రతిని పంపుదువా? హఠయోగప్రదీపిక ప్రతిని, శివసంహితప్రతిని, యోగవిషయిక గ్రంథాంతరమేదియున్నను దానిప్రతినికూడ పంపెదవా? అన్నియు మూలగ్రంథములే సుమా. అవి నాకు చేరిన వెంటనే వానిమూల్యమును నీకు నే నంపెదను. జాన్ డేవీస్ ముద్రించిన ఈశ్వరకృష్ణుని సాంఖ్యకారికలప్రతికూడ పంపుము. ఇండియాజాబులతోపాటు నీజాబును ఇప్పుడే చేరినది......సిద్ధముగ నుండు ఒక్క మనుష్యుడు జబ్బునపడియున్నాడు. ఇప్పటికిప్పుడు రమ్మన్న తాము రాజాల మనుచున్నారు ఇతరులు. ఇంతవఱకు నది దురదృష్టముగ

కనిపించుచున్నది. వారు రాలేనందుకు నేను విచారించుచున్నాను. ఏమి చేయుటకు సాధ్యమగును? ఇండియాలో పనులు మెల్లగ సాగును.

బద్ధదశలో జీవుని పరిపూర్ణత అతనిలో నణగియుండునని రామానుజుని సిద్ధాంతము. ఆపరిపూర్ణత మరల వికసించినపుడు జీవుడు ముక్తుడగును. ఈసంకోచవికాసములు మిథ్య లనియు పారమార్థికముగ సంకోచముగాని వికాసము గాని లేదనియు అద్వైతి తెల్పును. ఉభయక్రమములును మాయయే.

పారమార్థికముగ ఆత్మ జ్ఞాత కాదు అనుట మొదటి విషయము. సచ్చిదానంద మనునది దాదాపు సరిపడు నిర్వచనము. నేతినేతి అనునది సారభూతమైన నిర్వచనము. ఈసంకల్పాశయమును స్కోపెన్హోరు బౌద్ధులనుండి గ్రహించినాడు. మనము చెప్పు వాసన లేదా తృష్ణ (పాళీలో తన్హా) అనుటలో కూడ అది యున్నది. సకలావిష్కారములకును అది కారణ మనియు దానికవి కార్యము లనియు కూడ మనము అంగీకరింతుము. ఐనను కారణమైనందుచేత అది బ్రహ్మముతోను మాయతోను సంకీర్ణమైనదిగ నుండవలెను. జ్ఞానముకూడ యౌగికవస్తువే కావున అదియు స్వయముగ బ్రహ్మము కాజాలదు. కాని జ్ఞాతాజ్ఞాత వాసనకంటె అది పైది. బ్రహ్మమునకు అత్యంతసన్నిహితమైనటు వంటిది. బ్రహ్మము మొదటసంకీర్ణజ్ఞానముగ నగును. రెండవ మెట్టున సంకీర్ణసంకల్పముగ నగును. మొలకలకు చైతన్యము లేదనియు ఎంతైనప్పటికిని అవి నిశ్చేతనసంకల్పములే యనియు చెప్పుదు రేని అందులకు జవాబు: నిశ్చేతనమగు ఆమొలక సంకల్పము సైతము చైతన్యము దాల్చు ఒకరూపమే. ఆచైతన్యము మొలకది కాదు, జగముది. దానిని సాంఖ్యసిద్ధాంతము మహత్తు అనును. బౌద్ధులు అన్నింటి నిగ్గు సంకల్ప మందురే అది అసమగ్రము. ఏలన (1) సంకల్పమే యౌగికవస్తువు (2) చైతన్యము

(జ్ఞానము) అనునది మొదటి యౌగికవస్తువు. కావున సంకల్పము నకు మునుపటి దగును. క్రియయే జ్ఞానము. మొదట క్రియ, పిమ్మట ప్రతిక్రియ. మనస్సు ఎప్పుడు చూచునో ఆవీక్షణ ప్రతిఫలముగ అప్పు డది సంకల్పించును. సంకల్పము మనసులో నున్నది. కాబట్టి సంకల్పమే సర్వమూల మనుట అసంగతము. డ్యూసెన్ను డార్వినువర్గమువారిచేత మోసపోవుచున్నాడు.

కాని, వికాసమును మఱింత కచ్చితమైనదగు భౌతిక శాస్త్రానుసారము తేవలెను. ప్రతివికాసమునకు ముందు సంకోచము ఉండి యుండవలె నని భౌతికశాస్త్రము చూపెట్టగలదు. కావున వాసనావికాసమునకు ముందు మహత్తత్వ సంకోచము ఉండి యుండవలెను.




జ్ఞానములేనిదే సంకల్పము లేదు. కోరదగినదానిని మన మెఱుగకున్నచో మనము కోరుట ఎట్లు పొసగును?

జ్ఞానమునుగూడ స్మృతిలోనున్నది, స్మృతికడుగున నున్నది అని విభజించిన వెంటనే పైకి కనిపించు చిక్కు మాయమగును. అట్లు ఏల చేయరాదు? సంకల్పమును అట్లు వివరింపగలిగినప్పుడు దానికి మూలమైనదానిని అట్లు ఏల వివరింపరాదు?

వివేకానంద

## 212

(సోదరశిష్యులకు)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
189౨.

నా ప్రియ—,

సన్న్యాలు పంపిన గ్రంథములు వచ్చి చేరినవి. ఈ విషయమును జెప్ప మఱచితిని. దయచేసి మీ రీ సంగతి నతనికి తెలుపుడు.

మీకందఱికిని కొన్ని విషయములను వ్రాయనిందు:—

(1) సకలపాపములకును ముఖ్యకారణము పక్షపాత మని తెలిసికొనుడు. అనగా ఒకనిమీదకంటె మఱొకనిమీద ఎక్కువ ప్రేమ చూపితిరేని భవిష్యత్కాలమున చిక్కులుగల్గుటకు ఇప్పుడే విత్తనములు నాటుచుంటి మని గట్టిగ నమ్ముడు.

(2) తనసోదరులను గూర్చి కొండెములు చెప్పుటకు ఎవ డేని మీయొద్దకు వచ్చునేని, వినక పూర్తిగా పెడమొగము పెట్టుడు. వినుటగూడ మహాపాపమే. భవిష్యత్క్లేశముల బీజ మందు కలదు.

(3) పైగా ప్రతియొక్కని లోపములను సహింపుడు. కోట్లకొలది అపరాధములను మన్నింపుడు. నిస్స్వార్థబుద్ధితో మీ రందఱిని ప్రేమింతురేని క్రమక్రమముగ అందఱును ఒకరినొకరు ప్రేమింప జొత్తురు. ఒకనిక్షేమము తక్కినవారిక్షేమముపై ఆధార పడియున్న దని వారు సమగ్రముగ గుర్తించిన తక్షణమే వారిలో ప్రతియొక్కడును అసూయను విడనాడును. కలిసిపనిచేయు స్వభావము మనదేశీయులశీలములో లేనే లేదు. కావున అట్టి యుత్సాహమును పుట్టించుటకు అత్యంతజాగ్రత్తతో మీరు ప్రయత్నింప

వలెను, ఓపికతో వేచియుండవలెను. నిజము చెప్పుచున్నాను, మీలో ఎట్టి ఎక్కువతక్కువభేదములును నాకంటికి కనిపించుట లేదు. అక్కఱ కలిగినప్పుడు పరమోన్నతతేజమును ఆవిష్కరించుశక్తి ప్రతియొక్కనిలోను కలదు. నాకు కనిపించుచున్నది. ఉదాహరణమునకు శశి తనతావుననే సదా సర్వకాలము ఎట్లు అంటిపెట్టుకొనియున్నాడో చూడుడు. అతని కార్యదీక్ష ఒక గొప్ప పునాది. కాళియు యోగినును పురసాధనమావేశమును ఎంతజయప్రదముగ నిర్వహించిరో చూడుడు. నిజమున కది అతి ముఖ్యమైన కార్యము.

సింహళమందును ఇతరప్రదేశములందును నిరంజనుడు ఎంతో పనిని నిర్వహించినాడు. శారదుడు ఎంతదూరము పర్యటించినాడు, భవిష్యన్మహాకార్యములకు బీజములు చల్లినాడు! హరికి గల అద్భుతవైరాగ్యమును నిశ్చలప్రతిభను శాంతిని తలంచినప్పుడెల్ల నాలో నొక క్రొత్తబలము వచ్చి చేరుచుండును. తులసిలో గుప్తలో బాబురాములో శరత్తులో వేయేల, మీలో ఒక్కొక్కనియందును అత్యధికశక్తి కలదు. శ్రీరామకృష్ణుడు రత్నవిద్యానిష్ణాత. అను విషయమున మీకింకను సందేహ ముండునేని మీకును వెఱ్ఱివానికిని భేద మేమి? చూడుడు. ఈదేశమున నూర్లకొలది మగవారును మగువలును మన ప్రభువును అవతారవరిష్ఠునిగా ఆరాధింప నారంభించుచున్నారు. నిలుకడ! ప్రతి మహాకార్యమును మెల్లగనే నిర్వహింపబడును....

చుక్కాని అతని చేతనున్నది. భయ మేల? మీరందఱు అనంతశక్తియుతులరు. అహంకారాశయములను క్షుద్రాసూయలను దూరముగ నెట్టివేయుటకు మీ కెంతసేపుపట్టును! అట్టి ప్రవణత కల్గిన తక్షణమే మిమ్ము భగవంతున కర్పించుకొనుడు. మీ మనశ్శరీరములను దేవుని పనికి అంకిత మొనర్చుకొనుడు. అన్ని చిక్కులును పునరావృత్తిరహితముగ సమసిపోవును.

మీ రిప్పు డున్న యింటిలో చాలినంత చోటుండదు. విశాలమైన భవనము కావలయును. అనగా మీరు ఒక్కగది లోనే క్రిక్కిఱిసి యుండ నక్కఱ లేదు. శక్యమగు నేని ఒక్క గదిలో ఇద్దఱికంటె నెక్కువమంది వసింప నక్కఱలేకుండవలెను. గ్రంథములను ఉంచుకొనుటకు ఒక పెద్దకూట ముండవలెను.

ప్రతిదినముప్రొద్దున పవిత్రగ్రంథపారాయణము కొంత జరుగవలయును. ఆకార్యక్రమమును కాళియు ఇతరులును వంతుల ప్రకారము పర్యవేక్షింపవచ్చును. సాయంకాలములందు మఱొక తరగతి (క్లాసు) జరుపబడవలెను. ధ్యానాభ్యాసము కొంతయు సంకీర్తనాదులును జరుగవలెను. పనిని మీరు విభజించుకొని ఒక దినము యోగమునకును ఒకదినము భక్తికిని ఒకదినము జ్ఞానము నకును ఈరీతిగా కేటాయించిపెట్టుకొనవచ్చును. కార్యక్రమ మీ రీతిగా నిశ్చయింతురేని చాలబాగుండును. వెలుపలి ప్రజలుకూడ సాయంకక్ష్య (క్లాసు) లలో కలిసికొనవచ్చును. ప్రతిభానువారము నాడును ప్రొద్దున 10 గంటలుమొదలుకొని రాత్రివఱకును తరగతులును సంకీర్తనాదులును ఎడతెంపులేనివరుసలో సాగుచుండ వలెను. అది పురజనులకొఱకు. మీరు శ్రమపడి ఈరకపు కార్య క్రమమును కొంతకాలము సాగింతురేని క్రమక్రమముగ అది నిర్విఘ్నముగను సులభముగను పరిణమించును. కూటములో, పొగ త్రాగకూడదు. పొగత్రాగుటకై మఱొకచోటును కేటాయించి పెట్టవలయును. మీరు శ్రమపడి, మెట్టుమెట్టుగా ఇటువంటి పరిస్థితిని కలిగింపగలరేని ఎంతో ముందంజవేసినట్లు నేను తలంతును.

హరమోహనుడు ప్రకటించుటకై ప్రయత్నించుచుండిన ఆపత్రికసంగతి ఏ మయ్యెను ? మీరొకపత్రికను ప్రారంభింపగల రేని, నిజముగ చాల బాగుండును.

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 213

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

అమెరికా సంయుక్తరాష్ట్రములు,
1895.

ప్రియ రాఖాల్,

నీ జాబిప్పుడే చేరినది, చదివి ఆనందించితిని. ఇండియాలో ఏపనియైనను నెఱవేఱినను నెఱవేఱకపోయినను లెక్క లేదు. నిజమైన పని ఇచ్చట నున్నది. ఎవరినిగాని నేనిచ్చటికి రమ్మని కోరను. ఇండియాకు మరలి వచ్చినవెంటనే కొందఱిని నేను తర్ఫీదుచేసెదను. తర్వాత వారికి పాశ్చాత్యదేశములందు అపాయమేమియు నుండదు. ఔను. నేను వ్రాసినది గుణనిధిని గుఱించియే. హరిసింగునకును ఇతరులకును నాప్రత్యేకప్రేమాశీస్సులను అందింపుము. కలహములందును వివాదములందును ఎప్పుడును పాల్గొనకుము. ఖేత్రీమహారాజును అణచిపెట్టగలశక్తి భువియందెవ్వరికి కలదు? — లోకజనని అతనిఅండలో నున్నది! కాళీ వ్రాసిన జాబుకూడ నాకు చేరినది. కాశ్మీరములో నొక కేంద్రమును ప్రారంభించుట మీకు శక్యమగునేని, నిజముగ చాల బాగుండును. మీకు శక్యమైన ప్రతిచోటను కేంద్రమును ప్రారంభింపుడు....ఇక్కడను ఇంగ్లండునందును నేను గట్టిపునాదులను వైచితిని. దానిని కదల్పగల శక్తి ఎవరికిని లేదు. న్యూయార్కు ఈసంవత్సరము సంక్షోభమునకు లోనై యున్నది. లండను నగరమునకు వంతు పైసంవత్సరము వచ్చును. మహామహావారు లోబడిపోవుదురు. మీక్షుద్రు లెవరికి లెక్క? నడుము బిగింపుడు. పనికి పూనుకొనుడు. మీరు మనవిజయఘోషలతో లోకమును గడగడలాడింపవలెను. నాయనా, ఇది ప్రారంభదశయే. మన దేశమున 'మానవులు' ఉన్నా రని నీవు తలంతువా? మనదేశము

మృతజనుల అస్థికల నిలయము! జనసామాన్యమునకు మీరు విద్య గఱపగలేని కొంత ఆసపాటు కలదు. జ్ఞానబలమును మించిన బలము కలదా? మీరు వారికి విద్యగఱపగలరా? ధనికులు ఎవ రైనను సాయపడిన దేశమును పేర్కొనుడు? అన్ని దేశములలోను సకలఘనకార్యములను నిర్వహించువారు మధ్యతరగతులవారే. ధనముగడించుటకు ఎంతకాలము పట్టును? "మానవులు" ఏరీ? మానవు లెవ్వరైన మనదేశమున నున్నారా? మనదేశజనులు బాలకులు. బాలకులతో ప్రవర్తించినట్లే వారితో ప్రవర్తింప వలెను.... కాలి కూలిపోయినభవనశేషములవలె, ఒకకొన్ని మత వేదాంతగ్రంథములు మిగిలి యున్నవి. వానిని మీవెంట గొని త్వరగా ఈదేశమునకు రండు....

ఎప్పుడుగాని భయపడకుడు. లోకజనని నాకు తోడ్పడు చున్నది! విన్నచో మీరు ఆశ్చర్యస్తబ్ధులు అగు నంతటిపని ఈ సంవత్సరము నిర్వర్తింపబడనున్నది.

భయ మేమి! ఎవరిని చూచి భయము! మీగుండెలను దిటవుపఱచుకొని కార్యనిర్వాహణమునకు పూనుకొనుడు.

భవదీయ ప్రేమయుత
వివేకానంద

మఱిమాట : బెంగాలీభాషలో నొకపత్రికను ప్రారంభింతు నని శారదుడు చెప్పుచున్నాడు. మీ యావచ్ఛక్తితో దానికి తోడ్పడుడు. అది చెడ్డతలంపు కాదు. ఎవనిఉద్యమమునైనను సరే మీరు నిరుత్సాహపఱుపగూడదు. తప్పు లెన్ను పనిని పూర్తిగ విడిచిపెట్టుము. లోకులు చేయు చున్న పను లన్నియు మంచివని నీకు తోచుచున్నంతకాలము వారికందఱికి తోడ్పడుము. కొన్ని సందర్భములలో వారు తప్పటడుగు వేసినట్లుతోచినచో వారి తప్పులను వారికి మృదురీతిలో చూపుము. అన్ని చిలుకప

లకును మూలకారణము ఒక రొకరి తప్పు లెన్నుటే. సంస్థల పతనమునకు మూలకారణ మదే....

## 214

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

అమెరికాసంయుక్తరాష్ట్రములు,
1895.

నాప్రియ శశి,

నీజాబొకటి నాకు నిన్న చేరినది. దానిలో వార్తలు చాల తక్కువ. ఏ వివరములును లేవు. నా ఆరోగ్య మిప్పుడు చాల బాగున్నది. దేవునను గ్రహముచే ఈసంవత్సరపు ఉత్కటశీతవాతమునకు నేను అప్రధృష్యుడనై యున్నాను. ఔరా, చలి ఎంత విపరీతముగ నున్నది! కాని ఈప్రజలు తమశాస్త్రవిజ్ఞానముచే అన్నిటినిఅణచిపెట్టగలరు. ప్రతియింటికిని ఒకనేలమాళిగయున్నది. అందులో నొకపెద్దగ్రాగుబాన యున్నది. అందుండి రాత్రింబగళ్లు ఆవిరి ప్రతిగదిగుండను ప్రవహింపజేయబడుచుండును. అది అన్ని గదులకును వెచ్చదనము కలిగించును. ఇందులో నొక్కలోప మున్నది. ఇంటికి లోపల వేసవికాలముగ నుండగా వెలుపల ఉష్ణము సున్నకంటె ముప్పదినలువదిడిగ్రీలు తక్కువగ నుండును! చలికాలమున యూరోపువాతావరణము ఇచ్చటి వాతావరణమునకంటె వెచ్చగ నుండును. కావున ఈదేశమందలి సంపన్నులలో అధికసంఖ్యాకులు చలికాలమున అక్కడికి పోవుచుందురు.

ఇప్పుడు నీకు కొన్ని ఉపదేశములను చేయనిమ్ము. ఈజాబు నీకొఱకే ఉద్దేశింపబడినది. దయచేసి దినమున కొకసారి ఈఉపదేశములను చదివి వీనిప్రకారము ప్రవర్తింపుము. శారదుని

జాబు నాకు చేరినది. అతడు మంచిపని చేయుచున్నాడు. కాని మన కిప్పుడు కావలసినది సంస్థ. అతనికి, సోదరుడు తారకునికి, ఇతరులకు దయచేసి నా ప్రత్యేక ప్రేమాశీస్సుల నందింపుము. నిర్మాణసామర్థ్యము నీలో కలదు. దానిని దేవుడు నాకు తెలియ జేసినాడు. కాని నీలో ఆశక్తి ఇంకను సమగ్రపరిణతి నందలేదు. ఈకొన్ని ఉపదేశములను నీకు నేను చేయుటకు కారణము అదే. దేవు నను గ్రహమున నీలోని ఆశక్తి అచిరకాలములోనే సమగ్ర పరణతి నందును. నీ నిబ్బరమును నీవెప్పుడును కోల్పోవు! అదే ఇందుకు సాక్ష్యము. కాని ఆనిబ్బరము గాఢముగను విరివిగలది గను నుండవలెను.

(1) ఈలోకమున నున్న తాపత్రయము ప్రకృతిసిద్ధము కానందున దానిని తొలగింప వీ లగు నని సకలశాస్త్రములు అభిప్రాయపడుచున్నవి.

(2) బుద్ధావతారమున భగవంతుడు జాతు లేర్పడుటకు ఆధిభౌతికతాపమే కారణ మని చెప్పియున్నాడు. అనగా జన్మము చేతగాని విద్యచేతగాని సంపదచేతగాని ఏర్పడుచుబడు ప్రతిజాతి భేదమును ఈతాపమునకు మూలమైయున్నది. ఆత్మకు వర్ణభేదము గాని ఆశ్రమభేదముగాని స్త్రీపుంవిభేదముగాని వేఱెట్టిభేదముగాని లేదు. అడుసుచేత అడుసును కడిగివేయ లేము. అట్లే భేదభావ ములచే ఐక్యమును సాధింపలేము.

(3) కృష్ణావతారమున భగవంతుడు అవిద్యయే అన్ని దుఃఖములకు మూల మనియు నిస్స్వార్థకర్మానుష్ఠానముచేత చిత్త శుద్ధి కలుగుననియు కాని "కర్మ ఎట్టిది అను నీ యంశమందు బుద్ధిమంతులుకూడ మోహము చెందుదురు" (భగవద్గీత IV-16) అనియు చెప్పియున్నాడు.

(4) మన ఆధ్యాత్మికపరతను పెంపొందించు కర్మయే కర్మ. ఐహికపరతను వర్ధిల్లచేయునదంతయు అకర్మయే.

(5) కావున మానవుని దేశకాలాభిరుచుల కనుగుణముగ కర్మాకర్మలను క్రమబద్ధములుగ నొనర్పవలెను.

(6) యజ్ఞయాగాదులవంటి కర్మలు ప్రాచీనకాలమునకు తగియుండినవి. ఈకాలమున కవి తగినవి కావు.

(7) శ్రీరామకృష్ణు డవతరించినదినమే సత్యయుగమునకు ప్రారంభదినము!

(8) ఈఅవతారములో నాస్తికాశయములు....జ్ఞానఖడ్గముచే రూపుమాపబడును. భక్తిప్రేమలచే సకలలోకమును ఒక్కటిగా చేయబడును. పైగా ఈఅవతారములో రజస్సు (కీర్తియశఃకాంక్ష మున్నగునవి) బొత్తిగా లేనే లేవు. అనగా గురుదేవుని బోధనల ననుసరించువాడు ధన్యుడు. గురుదేవు నతడు అంగీకరింపకున్నను పరవా లేదు.

(9) ప్రాచీనకాలమునగాని నవీనకాలమునగాని వివిధ కక్షల నేర్పఱచినవారు తప్పేమియు చేయలేదు. వారు చేసినపని బాగున్నది. కాని వారు ఇంకను మేలైన పని చేయవలెను. సాధువు — శ్రేయము — శ్రేష్ఠము.

(10) కావున వా రిప్పు డున్న మెట్టునుండి వారి నందఱిని మనము పై కెక్కింపవలెను. అనగా వా రెన్నుకొన్న దారిని తారుమారుచేయకయే వారిని మనము ఇంకనింకను ఉన్నతలక్ష్యములను అధిగమింపజేయవలెను. ఇప్పు డున్న సాంఘికపరిస్థితులు బాగున్నవి. కాని అవి ఇంకను శ్రేయములుగను శ్రేష్ఠములుగను కావలెను.

(11) మహిళలపరిస్థితిని బాగుపఱచిననే తప్ప లోకక్షేమప్రాప్తికి అవకాశము లేదు. ఒక్కరెక్కతో ఎగురుట పక్షికి సాధ్యము కాదు.

(12) శ్రీరామకృష్ణుడు ఒక మహిళను తన కాచార్యగా స్వీకరించుటకును సాధనలకాలమున స్త్రీవేషమును తాల్చుటకును

స్త్రీచిత్తవృత్తిని ఆవహిల్ల చేసికొనుటకును, మహిళలందఱును లోకజననిప్రతిరూపములు, మాతృత్వమహితలు అని ఆయన ఉపదేశించుటకును — ఇదే కారణము.

(13) మహిళల మఠమును ముందు స్థాపింప నేను ప్రయత్నించుటకును ఇదే కారణము. ఈమఠమునుండి గార్గివంటి మహిళలును, మైత్రేయివంటి మహిళలును, గార్గికంటెను మైత్రేయికంటెను అధిక విద్యావతులును ఉద్భవిల్ల గలరు....

(14) ఏఘనకార్యముగాని మోసముచే సాధింపజాలము. ప్రేమయు సత్యాభిరతియు అత్యధికశక్తియు — ఇవే సర్వకార్యసాధకములు. "తత్ కురు పౌరుషమ్" "కావున పౌరుషము నెఱపుము."

(15) ఎవరితోగాని వాదింపవలసిన కలహింపవలసిన అక్కఱ లేదు. మీసందేశమును అందింపుడు. ఇతరులను వారి ఆశయములకు విడిచి పెట్టుడు. "సత్యమేవ జయతే నానృతమ్" "గెల్చునది సత్యమే గాని అసత్యము గాదు". "తదా కిం వివాదేన" "అప్పుడు వివాద మెందుకు?"

......గాంభీర్యమును శిశుసహజమైన అమాయికతను మేళవింపుడు. అందఱితో సామరస్యము కలిగి జీవింపుడు. అహంకారాశయములను పూర్తిగా విడిచిపెట్టుడు. వర్గీయభావముల నుంచుకొనకుడు. వ్యర్థవాక్కలహము మహాపాపము.

......నా...ఘోషు నన్ను జీసుక్రీస్తుతోను అట్టివారితోను తులదూచినాడని శారదుని జాబువలన నాకు తెలిసినది. అట్టి మాటలు నిరాక్షేపముగ సాగవచ్చు. కాని అట్టి వ్యాఖ్యలను అచ్చువేయించి ఇక్కడికి పంపితిరేని నేను అవమానముపాలు కావచ్చు. అనగా ఎవరి భావస్వేచ్ఛనైనను అరికట్టుట నాకిష్టము లేదు. నేను మతప్రచారకుడనా? ఆకాగితములను కాళీ ఈదేశమునకు ఇప్పటికి పంపియుండకున్న, ఇకపంప వలదని చెప్పుము"

సన్మానపత్రముమాత్రము చాలును. సభాకార్యక్రమము నాకక్కఱ లేదు. ఇప్పు డీ దేశమున పూజ్యులైన మగువలకును, మగవారికిని పెక్కండ్రకు నాయం దాదరము కలదు. క్రైస్తవమత ప్రచారకులును అట్టి ఇతరులును న న్నణచిపెట్టుటకు వారిచేత నైనంతవఱకు ప్రయత్నించిరి. ప్రయత్నము వ్యర్థముకాగా ఇప్పుడు శాంతించియున్నారు. ప్రతి ఉద్యమమును అనేకవిఘ్నములగుండ సాగవలసియుండును. శాంతమైనమార్గము ననుసరించిననే సత్యము విజయ మొందును. ఒకానొకహడ్సను నాకు ప్రతికూలముగ చెప్పిన మాటలకు బదులు చెప్పవలసిన ఆవశ్యకత నాకు లేదు. ఏల యన (1) అది అనావశ్యకము. (2) బదులుచెప్పితినేని నన్ను నేను హడ్సనువంటివారిస్థాయికి దింపుకొన్నవాడ నగుదును. నీ కేమి వెఱ్ఱియా? ఒకానొక హడ్సనుతో నే నిచ్చటనుండి పోరాడవల యునా? దేవు ననుగ్రహముచే, తాహత్తున హడ్సనుకంటె పెక్కు మెట్లు పైనున్నవారు ఆదరముతో నామాట విందురు. దయచేసి పత్రికలను నాకికమీద పంపకుడు. అదంతయు ఇండియాలో సాగుచుండ నిమ్ము. దానివలన నెట్టిహానియు లేదు. భగవత్కార్య మున కొకప్పుడు అట్టి పత్రికాప్రకటనము ఆవశ్యకముగనుండెను. ఆపని ముగిసినపిమ్మట అట్టి ప్రకటన మిక నక్కఱ లేదు.... పేరు ప్రతిష్ఠల నంటియున్న దోషములలో నొకటి ఇది: దేనినిగాని సొంతముగను ఏకాంతముగను ఉంచుకొనుట అశక్యమగును,... ఏఉద్యమమునైనను ప్రారంభించుటకు ముందు శ్రీరామకృష్ణుని ప్రార్థింపుము. ఆయన నీకు మంచిదారిని చూపును. మొదట మనకు విశాలమైన భూఖండము కావలెను. తర్వాత భవనము మున్నగునవెల్ల వచ్చును. మనమఠము తన్ను తాను మెల్లగ పెంపొందించుకొనును. దానినిగూర్చి ఖేదము చెందకు....

కాళియు, ఇతరులందఱును మంచికృషి చేసినారు. నా ప్రేమను పరిపూర్ణమంగళాశంసలను అందఱికినందింపుము. మదరాసు వారితో కలిసికట్టుగా పనిసాగింపుము. మీలో నెవరైన నొకరు

అప్పుడప్పుడు అక్కడికి పోవుచుండును గాక. అధికారవాంఛను యశఃకీర్తికాంక్షను ఎల్లప్పటికిని విడిచిపెట్టుము. నేను భువిపై నుండగా శ్రీరామకృష్ణుడు నాగుండ పనిచేయుచుండును. ఇందు మీకు నమ్మకమున్నంతవఱకు మీా కెట్టి అశుభభీతియు లేదు.

అక్షయుడు పంపిన రామకృష్ణపుంథి అను వంగభాషాపద్య కావ్యము చాల బాగున్నది. కాని ప్రారంభములో శక్తిస్తోత్రము లేదు. అది పెద్ద లోపము. ద్వితీయముద్రణములో ఈలోపమును సరిచేయుమని అతనితో చెప్పుము. మన మిప్పుడు లోకుల చూపుల కెట్టయెదుట నున్నా మనియు మనము చేయు ప్రతిపనిని పల్కు ప్రతిమాటను ప్రజలు కనుపెట్టి యున్నా రనియు సదా జ్ఞప్తియం దుంచుకొనుము. ఆజ్ఞాపకముతో, పాటుపడుము.

...మఠమునకు చోటును వెదకుచుండుము......అది కల్కత్తాకు ఇంచుక దూరములో నున్న, పరవా లేదు. మనము మనమఠమును నిర్మించిన ప్రతిచోటను ఒకసంక్షోభమును కలిగింతము. మహిమచక్రవర్తివార్త తెలియవచ్చినందుకు చాల సంతోషము. ఆండీసు గయాక్షేత్రముగా పరిణమించిన దన్నమాట! తెలిసినది. అత డెక్కడ నున్నాడు? అతనికిని శ్రీవిజయగోస్వామికిని మనయితరమిత్రులకును నాహృదయపూర్వకాభినందనములను దయచేసి అందింపుము....శత్రువును కొట్టవలయునని కత్తియు డాలును ఆవశ్యకములు. కావునజాగ్రత్తగా సంస్కృతాంగ్లభాషలను నేర్చుకొనుము. అభేదానందుని ఆంగ్లము నానాటికిని మఱింత అందమైన దగుచున్నది. కాని శారదుని ఆంగ్లము క్షీణించుచున్నది. అలంకారప్రచురమైన శైలిని మానుకొమ్మని శారదునితో చెప్పుము. పరాయిభాషలో అలంకారప్రచురమైన శైలిలో వ్రాయుట మిక్కిలి కష్టము. నాతరఫున అతని కొక లక్షప్రశంసలను దయచేసి అందింపుము. నిజముగ నతడు వీరుడు. ...శబాష్, వత్సలారా, చాల చక్కగ చేసిరి. మీా రందఱును

చాలచక్కగ చేసితిరి. ప్రారంభము అత్యద్భుతముగ నున్నది. ఈమార్గముననే ముందుకు పొండి. ఈర్ష్యాసర్పము ప్రకోపింప కుండునేని భయమే లేదు. "మాభైః" భయపడకుడు. "మద్భక్తానాం చ యే భక్తా స్తే మే భక్తతమా మతాః" "నాభక్తుల కెవరు భక్తులో వారు భక్తతము లని నాయభిప్రాయము." మీ రందఱును ఇంచుకగంభీరమైన నడవడి కలిగియుండుడు. హిందూ మతమును గూర్చి నే నెట్టి గ్రంథమును ఇప్పుడు వ్రాయుట లేదు. కాని నాఆశయములను వ్రాసిపెట్టుచున్నాను. ప్రతిమతమును ఏకైకసత్యమునే ప్రకటించు భాష. మనము ప్రతియొక్కనితోను వానిభాషలో మాటాడవలెను. శా— దీనిని గ్రహించినావు. సరియే. హిందూమతమునుగూర్చి పర్యాలోకించుటకు కావలసి నంత కాలము ముం దున్నది. నేను హిందూమతమునుగూర్చి ప్రసంగించు చున్నచో ఈదేశప్రజలు మిక్కిలి ఆకృష్టు లగుదు రని నీ అభిప్రాయమా? — ఆశయములలో సంకుచితత్వమను పే రున్నప్పటికిని అది వారిని భయపెట్టి పాఱద్రోలును. శ్రీరామ కృష్ణుడు బోధించిన ధర్మమే పరమార్థము. హిందువులు దానిని హిందూమత మందురు గాక. ఇతరులు దానికి తమకు నచ్చిన పేర్లు పెట్టుకొందురు గాక. మీ ముందడుగుమాత్రము మెల్లగా సాగవలెను. "శనైః పన్థాః" "పయనము మెల్లగా సాగవల యును." క్రొత్తగా వచ్చి చేరినవా డగు దిననాథుకు నా ఆశీస్సు లందింపుము. వ్రాయుటకు నాకు వ్యవధి లేనే లేదు. ఎల్లప్పుడును ఉపన్యాసము, ఉపన్యాసము, ఉపన్యాసము! పవిత్రత, శాంతి, దీక్ష.... శ్రీరామకృష్ణునుపదేశములను ప్రస్తుత మాదరించు చుండు పెక్కండ్రు ప్రజలను మీకు కొంత ఆర్థికసాహాయ్యము చేయుడని మీ రడుగవలయును. వారు మీకు తోడ్పడకున్న మత పోషణము ఎట్లు సాధ్య మగును? అందఱికి ఈవిషయమును స్పష్ట పఱచుటకు నీవు సిగ్గుపడ కూడదు. నేను త్వరపడి ఈదేశము నుండి వచ్చివేయుట వలన ఏ లాభమును లేదు. మొదటి విషయ

మిది: మన మిచ్చట చేయు ఇంచుకంత చప్పుడు ఆదేశమున మహాధ్వనిగ మాఱుమ్రోగును. అదియునుగాక ఈదేశప్రజలకు అపారసంపద లున్నవి. ధన మిచ్చుటకు చాలినంత ధైర్యమున్నది. మనదేశప్రజలకా, ధనమును లేదు, ధైర్యము లేశమైనను లేదు.

నీకన్నివిషయములును క్రమక్రమముగ బోధపడును. శ్రీరామకృష్ణుడు భారతదేశమునకు మాత్రమేనా రక్షకుడు? ఈసంకుచిత భావమే భారతదేశవినాశమునకు కారణము. దానిని నిర్మూలింపకుండునంతవఱకు భారతదేశమునకు క్షేమము అసాధ్యము. నాయొద్ద ధనముండినచో మీలో ఒక్కొక్కనిని ప్రపంచమంతట పర్యటించి రమ్మని పంపియుందును. మానవుడు తన చిన్నమూల నుండి వెలికిరాకున్నచో అతనిహృదయమున ఎట్టి ఉదారాశయమును నెలకొనజాలదు. కాలము వచ్చినప్పుడు దానినిజ మెఱుగబడును. ప్రతిఘనకార్యమును మెల్లగానే సిద్ధించును. ఈశ్వరుని సంకల్ప మట్టిది......

దక్షునిగుఱించియు హరీశునిగుఱించియు మీలో ఒక్కరైనను వ్రాయరైతిరే ఏల? వారిజాడలను మీరు కనుపెట్టియున్నారా అను విషయము తెలిసినచో సంతోషింతును. గంగాజలశుద్ధివంటి శుద్ధి సన్న్యాలుచిత్తమునకు ఇంకను కలుగ లేదు. అదే అతని మనోవ్యధకు కారణము. నిస్స్వార్థత అతనిమనస్సునకింకను పట్టుపడలేదు. కాని కాలక్రమమున పట్టుపడగలదు. ఉన్న యించుకంత వక్రతను విడిచిపెట్టి ఋజుత్వ మలవఱచుకొనునేని అతని కెట్టి దుఃఖము నుండదు. రాఖాలుకును హరికిని నా ప్రత్యేకప్రేమాభినందనములు. వారివిషయమున అధికజాగ్రత్త వహింపుము....రాఖాలు శ్రీరామకృష్ణునికి ప్రత్యేకప్రేమభాజనము విషయమును ఎప్పుడును విస్మరింపకుము. దేనికిని భయపడకుము. ప్రభుకృప మనకున్నంతకాలము మనల నణంపగలశక్తి భువి నెవ్వరి కున్నది? నీవు కొనయూపిరిలోనున్నప్పటికిని భయ

పడకు. ఏక కాలమున సింహధైర్యమును పుష్పసౌకుమార్యమును గలిగి పాటుపడుము. ఈసారి శ్రీరామకృష్ణుని జయంతిమహోత్సవము అత్యంతవైభవముతో జరుగనిమ్ము. అన్నసంతర్పణ చాల సామాన్యరీతిలో జరుగనీ. సమావేశమైనవారికి ప్రసాదమునుఅప్పటి కప్పుడు చిన్నదొన్నెలలో పెట్టి పంచిపెట్టుడు. అంతమాత్రము చాలును. శ్రీరామకృష్ణుని జీవితచరిత్ర పారాయణము కావింప బడవలయును. వేదములు వేదాంతము అను గ్రంథములవంటి గ్రంథములను ఒకచోట నుంచి వానికెదుట హారతిగావింపుము. ప్రాతరీతి ఆహ్వానలేఖలను పంపుటను మానుము. "ఆమన్త్రయే భవన్తం సాశీర్వాదం భగవతో రామకృష్ణస్య బహుమాన పురస్సరఞ్చ" "భగవంతుడగు శ్రీరామకృష్ణుని ఆశీస్సులతో మా బహుమానముతోను మిమ్ము ఆహ్వానించుచున్నాము" అను రీతిగ నొకపంక్తి వ్రాసి "శ్రీరామకృష్ణుని జయంతిమహోత్సవ వ్యయములకును మఠపోషణమునకును తమసాహాయ్యము మాకు కావలయును తమ కిష్టమేని దయచేసి విరాళమును ఫలానా విలాసమునకు ఫలానా వారికి పంపుదురు గాత" ఇత్యాదిగను వ్రాయవలెను. ఆంగ్లభాషలో ఒకపుటను చేర్పుము. "ప్రభు రామకృష్ణుడు" అను మాట కఠముగ లేదు. ఆమాటను మీరు విడిచి పెట్టవలెను. ఆంగ్లాక్షరములతో "భగవాన్" అను పదము వ్రాసి, ఒకటిరెండు ఇంగ్లీషుపంక్తుల నిట్లు చేర్పుము. పత్ర మీ విధమున నుండవలెను :

(భగవాన్ శ్రీరామకృష్ణుని వార్షికోత్సవము)

అయ్యా,

భగవాన్ శ్రీ రామకృష్ణపరమహంస...............వ వార్షికోత్సవమును నిర్వహించుతఱి విశేషానందముతో మిమ్మాహ్వానించుచున్నాము. ఈమహోత్సవమునునెఱపుటకును, ఆలంబాజారు మఠమును పరిపోషించుటకును ధనము అనివార్యముగ అక్కఱయై

యున్నది. ఈ కార్యక్రమము తమసానుభూతి నందుట కర్హమని తమ రెంతురేని, తమ విరాళమును విశేషకృతజ్ఞతతో నందు కొందుము.

ఇట్లు,
విధేయులు
(నామము)

వలసినదానికంటె అధికధనము నీకు లభించుచో, అందు కొంత వెచ్చించి తరువాతివ్యయమునకై శేషించిన దానిని భద్రపఱుపుము. ప్రభు ప్రసాద మీాయ వలె నను మిషతో, విసుగుపుట్టువఱకు ప్రతివారిని తడయ నిచ్చి రుచికాని వెగటు ఆహారమును వారికి పెట్టవలదు. వడబోయుటకై రెండుసాధనము లను తయారొనరించి, వడబోయబడిన నీటిని వంటకును, తాగు టకును వినియోగింపుము. వడబోయుటకు మున్ను నీటినికాచుము. ఇట్లొనరించితివేని నీ విక మన్నెపుజ్వర మెట్టిదో వినకుందువు. ప్రతివాని ఆరోగ్యముపై నిశితదృష్టి సారింపుము. నీవు నేలపై పరుండుట మానగలిగితివేని, అందుకువలసిన పైకమును సేకరింప గలిగితివేని, మేలే యగును. మురికిబట్టలు రోగమునకు ప్రధాన కారణములు....ప్రసాదనైవేద్యము మా టందువా, అందుల కించుక పాయసము చాలును. గురుదేవున కదియే మిగుల ప్రీతి గలిగించెడిది. ప్రార్థనాగారము పలువుర కభ్యుదయము కలిగించు ననుట నిక్కము. రాజసికతామసికాహారమును భుజింపరాదు సుమీా. కర్మకాండ నించుక సడలించి, గీతను, ఉపనిషత్తులను, తదితరగ్రంథములను పఠించుచుండుము. నామనసులోని భావ మిది:— ప్రాపంచికేచ్ఛకు మనసున చోటీయక ఆధ్యాత్మిక చింతకు చోటిమ్ము.... శ్రీరామకృష్ణపరమహంస ఈవ్యక్తి కొఱ కును, ఆవ్యక్తికొఱకును అవతరించెనా లేక సమస్తప్రపంచము కొఱకు అవతరించెనా? రెండవయుద్దేశమునకై ఆయన అవతరిం చెనని పలికితివేని వసుంధరయంతయు ఆయన నవగాహ మొన

రించుకొనగలతీఱున, ఆయనను జగత్తిమ్రోల నిలుపుము. ఆయన జీవితమునుగుఱించి ఎవ్వరైన వ్రాసిన గ్రంథములో నీ వేకీభవింప నక్కఱలేదు. ఈరీతి గ్రంథములు మనపేళ్లతో రానంతవఱకు భయము లేదు......ఎల్లరతో 'సరి సరి' యని తెలిపి నీ తెన్నును బట్టియే నీవు నడువుము.''......

...దయతో మనకు సాహాయ్యము సలిపినందులకు మహేంద్రబాబుకు సహస్రధన్యవాదములను సమర్పించుచున్నాను. ఆతడు మహోదారుడైన మహనీయుడు.

...ఇక సన్న్యాసులు విషయమందువా, తనకర్తవ్యము తాను శ్రద్ధతో నిర్వహించుచున్నయెడల ఆతడు సర్వోత్కృష్టమైన అభ్యుదయము నందగలడు. శ్రీరామకృష్ణునిబిడ్డలను సేవించుటే ఆతని కర్తవ్యము....తారకసోదరుడు మిగుల చక్కనిపని చేయుచున్నాడు. సెబాస్! బాగు! బాగు! మనకు వలసినదే అది. ఉల్కా సముదాయమువలె కాంతులను వెదజల్లుచు వారు శోభిల్లుచుందురు గాక! గంగాధరు డేమి చేయుచున్నాడు? రాజపుత్ర స్థానములోని జమీందారులు కొందఱు వానిని మిగుల ప్రేమింతురు. భిక్షాపాత్రమునొడ్డి వారియొద్దనుండి ఆతడు కొంత విత్తమును పడయునుగాక; అట్లు చేయగలిగినయెడల, ఆతడు మనుష్యుడందును....

అక్షయుడు రచించిన గ్రంథమును ఇపుడే నేను పఠించితిని. పరమానందముతో ఆంతరంగికముగ వానిని కవుంగిలించుకొంటినని వానితో తెలుపుము. వాని రచనద్వారా శ్రీరామకృష్ణుడు ఆత్మప్రకాశ మొనరించుకొనుచున్నాడు. అక్షయుడు ధన్యుడు. తనగ్రంథాంశముల నాతడు ఎల్లర సమక్షమందు పఠించునుగాక! ఉత్సవసమయములో మహోత్సాహముతో నెల్లరసమక్షమున నాతడు దానిని కంఠమెత్తి చదువును గాక! గ్రంథము మిగులపెద్దదియైనచో అందుండి కొన్ని భాగములనే ఆతడు పఠించును గాక! అందు ఔచిత్యవిరుద్ధమైన ఒక్కమాటనైన నేను చూడ లేదు.

వానిపుస్తకము చదివినపుడు నేనందిన ఆనందానుభూతిని మాటలతో తెలుపలేను. ఈగ్రంథమునకు విస్తృతవిక్రయముకలుగునట్లు మీరందఱు ప్రయత్నింపుడు. అక్షయుడు పల్లెపల్లెలందు సంచరించి ప్రబోధప్రచారములు సలుపును గాక! అక్షయుడే దొడ్డపని చేసినాడు! అతడు తనకర్తవ్యమును తాను నిర్వహించుచున్నాడు. గ్రామగ్రామములందు పరిభ్రమణ మొనరించి ఎల్లరకు(?) శ్రీరామకృష్ణుని బోధనలను వెదజల్లుడు. ఇంతకంటె మహత్తర కార్యము మఱొకటి కలదా? అక్షయునిగ్రంథమును, అక్షయుడును జనసామాన్యమందు ఒక యద్భుతభావవిద్యుత్ప్రభావమును సృజింపజాలుగాక! ప్రియసోదరా, అక్షయా, నిన్ను హృదయపూర్వకముగా ఆశీర్వదించుచున్నాను. ప్రభువు నీ నాల్కపై నధివసించును గాక! ఆయన బోధనలను ఇంటింట ప్రచార మొనరింతువు గాక! నీవు సన్న్యాసివి కానక్కఱలేదు....వంగరాష్ట్ర జనతాసమక్షమున నుపదేశపరంపరను వెలువరించుటకై నిర్ణీతుడైన భావికాలదూత అక్షయుడని వచింతును. అక్షయుని వేయి కండ్లతో చూచి, వానిని సంరక్షించుచుండుము. ఆతని భక్తి శ్రద్ధలు సఫలములైనవి.

ఈదిగువ వివరించిన కొలది విషయములను గ్రంథతృతీయ భాగములో చేర్పుమని అక్షయునితో తెలుపుము:

## మతప్రచారము

(1) వేదములను, వేదాంతమును, తక్కిన అవతారములను ఈవరలో చేసినదానిని, శ్రీరామకృష్ణుడు తనజీవితమందు ఆచరించెను.

(2) ఆయన జీవితప్రభావమును గ్రహింపక, ఎవ్వరును, వేదములను, వేదాంతమును, అవతారములను మతేయాధ్యాత్మిక విషయములను గ్రహింపజాలరు. ఏలయన, ఆయనయే వ్యాఖ్యానము.

(3) ఆయన అవతరించిన నాటినుండి, సత్యయుగమారంభ మైనది. ఇకముందు వివిధభేదములు కడముట్టును. చండాలుని వఱకు ఎల్లరకు దైవీప్రణయమున పాలుండును. స్త్రీపురుషు లందు గల వ్యత్యాసములను, ధనవంతులకును నిరుపేదలకును గల భేదములను విద్వాంసులకును, విద్యాగంధము నెఱుగనివారికిని గల తేడాలను, బ్రాహ్మణులకును చండాలురకును గల వ్యత్యాసము లను సమగ్రముగ తొలగించుటకే ఆయన జీవించినది. ఆయన శాంతిదూత. హిందూమహమ్మదీయులనడుమను, హిందూక్రైస్త వులనడుమను గల వ్యత్యాసములు విస్మృతిలో మునిగిపోయెను. ఈవిభేదములనుగుఱించి ఈవరలో పొరపొచ్చెములు చెలరేగు చుండెడివి. అవి కడచినయుగమునకు సంబంధించినవి. ఈసత్య యుగమున శ్రీరామకృష్ణుని ప్రణయప్రవాహము ఎల్లవిభేదము లను ముంచివేసినది. ఇపు డెల్లరును ఏకైకస్నేహసూత్రమున గ్రుచ్చబడియున్నారు.

ఈయూహలను తన నైసర్గికశైలిలో విపులీకరించి పూర్వోక్తగ్రంథములో చేర్చుమని అతనితో తెలుపుము.

ఎవరెవరు (పురుషులుగాని స్త్రీలుగాని) శ్రీరామకృష్ణు నారాధింతురో వా రెట్టి నికృష్టస్థితిలో నున్నను, మహోత్కృష్ట స్థితి లోనికి పరివర్తన మందెదరు. గమనార్హమైన మఱొకవిషయ మిది : భగవంతుడు మాతృదేవి యను భావము పరమహంస అవతారమందు ప్రసిద్ధమై యుండెను, ఆయన స్త్రీవలె దుస్తులు ధరించువాడు—ఆయన మనమాతృదేవి యని చెప్పవచ్చు. అట్లే స్త్రీలందఱు దేవీస్వరూపు లని మనము భావింపవలెను. భారతదేశ ములో రెండు ఘోరదోషము లున్నవి. అవి యివి:— ఆడువారిని అణగద్రొక్కుట, జాతిభేదములను పురస్కరించుకొని నిరుపేదలను గుండజేసి వదలుట. ఆయన స్త్రీజనసంరక్షకుడు, పతితపావనుడు, సామాన్యప్రజారక్షకుడు, అధికులను అల్పులను ఉద్ధరించుటకై ముందంజవేసిన బద్ధదీక్షితుడు. పరమహంసపూజను ప్రతిగృహ

మందును—అది బ్రాహ్మణగృహము కావచ్చును, చండాలసదనము కావచ్చును, పురుషు లుండుచోటు కావచ్చును, స్త్రీలగీమే కావచ్చును—అక్షయుడు ప్రవేశపెట్టు గాక! ఆయన నారాధించుట కెల్లరకును హక్కు కలదు. భక్తిశ్రద్ధలతో వారినిపూజించువారు, సదా ధన్యజీవు లయ్యెదరు.

ఈధోరణిలో వ్రాయు మని వానితో తెలుపుము. మఱి దేనిని లెక్కచేయ వల దని వానితో చెప్పుము—ప్రభువు ఆతని చెంత నుండును.

భవదీయ ప్రేమయుత
వివేకానంద

మఱిమాట : నారదసూత్రములు, శాండిల్యసూత్రములు, కలకత్తాలో అనువదింపబడిన యోగవాసిష్ఠము : ఈగ్రంథముల ఒక్కొక్కప్రతిని పంపు మని సన్న్యాలుతో వచింపుము, పైగ్రంథములలో కడపటిదాని బెంగాలీసంపుటము గాక ఆంగ్లానువాదము నాకు అక్కఱ యున్నది.

## 215

(శ్రీ ఇ. టి. స్టర్డికి)

ఓంతత్ సత్

హోటలాక్కాంటినెంటలు,
3 రూ. కాస్టిగ్లియన్, పారిస్,
ఆగస్టు 26, 1895.

ప్రియ మిత్రమా,

మొన్నటిదినమున నేనిచట జేరితిని. ఇచట రాబోవు వారమున వివాహితుడు గానున్న ఒక అమెరికను మిత్రునకు నతిథిగా నేనిచటికి వచ్చితిని.

ఈశుభకార్యము జరుగువఱకు ఆతనితో నేనిందే వసింప వలెను. పిదప లండనుకు వచ్చుటకు నాకు తెఱపి గల్గును.

నిన్ను గలసికొను సంతోషసంభరితముహూర్తమునకై ఆతురముతో ఎదురుచూచుచున్నాను.

భవదీయ సదంతర్గత
వివేకానంద

## 216

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

19 పడమర 38 వ వీథి,
న్యూయార్కు,
ఆగస్టు (?) 1895.

ప్రియ రాఖాల్,

...నే నిపుడు న్యూయార్కు నగరములో నున్నాను. సరిగ కలకత్తాలోవలె ఈ నగరము వేసవిలో మిగుల నుష్ణముగా నుండును. చెమట మిక్కుటముగా పట్టును. ఇంచుకంతైన గాలి యుండదు. ఉత్తరసీమలో రెండు నెలలు పర్యటించినాను. ఈలేఖ అందినవెంటనే ప్రత్యుత్తరము నింగ్లండువిలాసమునకు వ్రాయుము. ఈజాబు నీకుచేరకమున్నే నే నింగ్లండుకు తరలెదను.

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 217

(శ్రీ ఇ. టి. స్టర్డీకి)

కుమారి మెక్లియడునింట,
హోటల్ హోలెండెరూడిలాపెయ్, పారిస్,
సెప్టెంబరు 5, 1895.

ధన్య ప్రియమిత్రమా,

నీవు చూపిన కారుణ్యమునకు కృతజ్ఞతను మాటలతో చెప్పుట సాధ్యము గాదు. కావున దానిని తెలుపజాలను....

కుమారి ముల్లరు నాకు ఆదరభరితమైన ఆహ్వానమును పంపినది. ఆమెగృహము మీయింటికి సమీపమందుండుటవలన, తొలుత నామె తావుకు పోయి, ఒం దొకటిరెండు దినము లుండి పిదప నీకడకు వచ్చుట మే లని ఊహించుచున్నాను.

కొలదిదినములు నాశరీర మనారోగ్యస్థితిలో నుండెను. కావున నీకు జాబు వ్రాయుట కాలసించితిని.

అచిరములో మనహృదయములను, శిరములను గలుపుకొను భాగ్యము లభించు ననుకొనుచున్నాను.

ప్రేమయందు నీవాడనుగను, భగవద్గతత్వమునందు నిన్నెడబాయనివాడనుగను ఉందును.

వివేకానంద

## 218

(శ్రీ అళసింగపెరుమాళుకు)

పారిసు,
సెప్టెంబరు 9, 1895.

ప్రియ అళసింగా,

క్రైస్తవమతబోధకుల అర్థరహితప్రలాపములను నీవంతగా పాటించినందులకు నేనాశ్చర్యపడుచున్నాను....హిందువుల యా

హారవిధానమునే 'తు' 'చ' తప్పక నేనవలంబింపవలె నని భారత దేశప్రజలు చెప్పుచో నాకొఱకొక హిందూవంటవానిని, వానిని పోషించుటకు వలసిన ధనమును పంపు డని వారితో తెలుపుము. ఆవంతసాహాయ్యము సలుపని వారు ఈరీతిగా ఆధిపత్యము మా పుట చూచినపుడు నాకు నవ్వు పుట్టుచున్నది. సన్న్యాసి పాటింప వలసిన విధులు పవిత్రత, దారిద్ర్యావలంబనము. వీనిని నే నుల్లం ఘించినట్లు క్రైస్తవమతబోధకులు తెలుపుచో వారు భయంకరు లైన అనృతవాదు లని తెలుపుము. నాలో తాను చూచిన పాడు నడతయేమో తెలుపు మని నన్నుగుఱించిన ఈదుష్టప్రలాపమును తనచెవుల కందించిన దుష్టు లెవ్వరో వివరింపుమని, ఈవిషయము తనకు సరియైన మార్గమున విశ్వసనీయులవలన తెలిసెనో లేదో నీకు స్పష్టముగ వ్రాయు మని—క్రైస్తవమతబోధకుడైన హ్యూ మకు వ్రాసి తెలిసికొనుము. ఇట్లొనరించినయెడల సత్యము యావత్తు స్పష్టముగ వ్యక్త మగును.

నా విషయమిది : నే నెవ్వరి ముదలను శిరసా వహించి, ఎవ్వరివాక్కులనైన వేదవాక్కులను భావముతో పాటించువాడను గాను. నాజీవిత మేమో నే నెఱుగుదును. నాలో మిగుల నుత్కటమైన దేశాభిమానము లేదు. నేను సమస్తవసుంధరకు ఎట్లు చెందితినో, భారత దేశమునకును అట్లే చెందితిని. ఇందు ప్రవంచనప్రలాప మేమియు లేదు. నాకు సాధ్యమైన సాహాయ్య మును మీకు సలిపితిని. ఇపుడు మీ కాళ్లపై మీరు నిలువ వలెను. ఏదేశమునకైన నాపై ప్రత్యేకాధికార మేమి కలదు? నే నేజాతికైన బానిసనా? విశ్వాసరహితులైన నాస్తికులైనమీరు, ఈరీతి అవినీతిప్రసంగములోని కిక దిగకుడు.

నేను కష్టపడి పని చేసి నాచేతి కందిన పైకమును యా వత్తు కలకత్తా మదరాసులకు పంపితిని. ఇంత చేసినపిదప నే నీరీతి మూర్ఖప్రలాపమును సహింపవలెనా? మీరు సిగ్గుపడుచుండుట

లేదా? వారికి నే నే రీతున నైన ఋణపడియున్నానా? వారి పొగడ్త గ్రుడ్డిగవ్వ విలువ చేయునా? వారి తెగడ్తకు అడలుదునా? అబ్బాయి, నావ్యక్తిత్వము నాదియే! నీవైనను నన్నర్థము చేసి కొనలేవు. నీపని నీవు చేయుము. చేయజాలక పోతివేని చేతులు ముడుచుకొనుము; వ్యర్థమైన నీ యాధిపత్యమును నాపై ప్రయోగింపకుము. మనుష్యశక్తికంటె ఘనతరమైన శక్తిని నే నవలోకించుచున్నాను. ఇదిట్టి దని నీ వూహించినను ఊహింపుము. నాకెవ్వరి తోడ్పాటు అవసరము లేదు. నాసమస్త జీవితమందు నే నొరులకే సాహాయ్యము సలుపుచున్నాను. తమదేశమున ప్రభవించిన మహావ్యక్తులలో అగ్రగణ్యుడైన శ్రీరామకృష్ణపరమహంసకార్యమునకై వారు కొన్ని రూకలనైన సంగ్రహింప జాలరైరి; కాని కానిమాటలు పల్కుచు, ఎవ్వనికై వా రేరీతి సాయమును సలుప లేదో, ఎవ్వడు తమకై శక్తివంచనలేక కృషి సలిపెనో వానికి జక్కట్లు దిద్దుటకై పూనుకొనుచున్నారు.

జాత్యహంకారపూరితులై, మూఢాచారబద్ధులై, దయారహితులై, వంచకులై, నాస్తికులై, భీరువులై విజృంభించు హిందూవిద్వాంసులలో మని, మడియుటకై నేను పుట్టితిననుకొనుచున్నావా? పిఱికితనము నాకు రోత పుట్టించును. భీరువులతో నా కెట్టి జోక్యము ఉండదు. అర్థరహితమైన రాజకీయములపొంతకు నేను పోవువాడను గాను, ఎట్టి రాజకీయములు నాకు రుచి పుట్టింపవు. భగవంతుడు, సత్యము—మాత్రము జగతిలో నేనెఱిగిన రాజకీయములు—తక్కినవి వ్యర్థములు. రేపు నేను లండను పోవుచున్నాను.

ఆశీస్సులతో,

భవదీయ
వివేకానంద

## 219

(శ్రీ అఖండానందస్వామికి)

శ్రీ ఇ. టి. స్టర్డీగారింట,
హైవ్యూ ఇత్యాది,
1895.

ప్రియ అఖండానందా,

నీ లేఖాంశములను చూచి సంతోషించితిని. నీయుద్దేశము దొడ్డదే కాని మనజాతికి నిర్మాణవ్యవస్థ, కార్యనిర్వహణనైపుణ్యము అవగతములు కావు. ఈలోపమువల్లనే సర్వవిధములైన విపత్తులు దాపురించుచున్నవి. ఒక్కత్రాటిపైని వాని ఏకైక లక్ష్యసిద్ధికై ముందంజవేయుట మనకు గిట్టని పని. నిర్మాణకార్యక్రమవ్యవస్థకు ప్రపథమమున కావలసినది విధేయత. మనసు కుదిరినపు డొకపని చేబూని, కొంతసేపైన పిదప దానికి దిగదుడుపంటివేని, ఇట్టిపని వ్యర్థమేయగును. అచలపరిశ్రమ, పట్టుదల మనకు మిక్కిలి అక్కరైనవి. సక్రమముగ ఉత్తరప్రత్యుత్తరములను జరపుచుండుము. అనగా: మాసమున కొక పర్యాయము లేక రెండుపర్యాయములు నియమానుసారముగ నాకు జాబులు వ్రాయుచు, నీ వేమి పనిచేయుచున్నావో, ఆపనివలన చేకుఱిన ప్రయోజన మెట్టిదో నాకు తెలుపుచుండుము. ఆంగ్లగీర్వాణ భాషలందు అభిజ్ఞుడైన సన్న్యాసి యొక డిచట (ఇంగ్లండులో) అవసరమై యున్నాడు. అచిరములో నేను మరల అమెరికాకు పోయెదను. నేను లేనపు డాత డిందు కార్యక్రమమును నిర్వహించుచుండవలెను. శరత్తును శశియునను నిరువురుతక్క ఈపని చేయగలవా రెవ్వరు నా కగపడుచుండుట లేదు. శరత్తుకు పైకము పంపి, సత్వరమే పయనమై రమ్మని వానికి వ్రాసితిని, ఓడనెక్కుటకై బొంబాయిలో వానికి సాహాయ్యము సలుపు వ్యవ

స్థను ఆనగరమునందలి తన ఏజెంటుద్వారా చేయు మని నేను రాజాజీకి వ్రాసితిని. పెసరపప్పు, కందిపప్పు, మినపపప్పు, ఇంచుక మెంతులు ఒకసంచిలో కట్టి శరత్తుద్వారా పంపుము. ఈవిషయమై వ్రాయుట మఱచితిని. వీనిని పంపుటకై దయతో నీవు శ్రమదీసికొందు వని నమ్ముచున్నాను. పండితనారాయణదాసుకును, శంకర్లాలుకును, ఒర్ఘాజీకిని, డాక్టరుకును, ఎల్లరకును నా శుభాకాంక్షలు తెలుపుము. గోపీకన్నులకై వలసినమందు ఇందు లభించునని తలంతువా ? — ప్రతిప్రదేశమందును నిర్ణీతములైన ఔషధములు లభించును. ఇవి కోరగానివి; మోసముతో కూడినవి. వానికిని, తక్కినబాలురకును నా యాశీస్సులను తెలుపుము. యజ్ఞేశ్వరుడు మీరట్టులో నొక సంఘమును స్థాపించి, మనతో గలసి పనిచేయవలె నని ఉద్దేశించుచున్నాడు. అత డొకపత్రికను కూడ నడపుచున్నాడు. కాళీ నచటికి పంపుము. ఆతడు మీరట్టులో నొక కేంద్రమును స్థాపించునుగాక! సాధ్య మగుచో ఆతడు పత్రికను హిందీలో ప్రకటించును గాక! అపుడపుడు నే నించుక సాహాయ్యము సలుపుచుందును. కాళీ మీరట్టుకుపోయి సరిగ నచటి పరిస్థితులెట్లు నడచుచున్నవో ఆతడు తెలిపినతోడనే కొంత పైకము పంపెదను. అజ్మీరులో నొక కేంద్రమును నెలకొలుపుటకై ప్రయత్నింపుము....అగ్నిహోత్రపండితుడు సహారన్పూరులో నొకసంఘమును స్థాపించినాడు. అచటివారు నాకొక లేఖ వ్రాసిరి. •ారితో నుత్తరప్రత్యుత్తరములు జరపుచుండుము. వారితో సఖ్యమును నెఱపుచుండుము. నడుముగట్టి కృషిసలుపుము! కృషిసలుపుము! ఈరీతిగా కేంద్రములను నెలకొలుపుచుండుము. ఇట్టి కేంద్రము లీవరలోనే కలకత్తా మదరాసులందు స్థాపింపబడినవి. మీరట్టు అజ్మీరులలో నీవు నూతనకేంద్రములను నెలకొలుపుట మేలు. ఈవిధముగా వేర్వేఱు తావులందు అల్లనల్లన కేంద్రములను నిలుపుచుండుము. ఇచటికి నాకు వచ్చు జాబు లన్నియు ఈదిగువ విలాసమునకు పంపెదవు గాక!

శ్రీ ఇ. టి. స్టర్డీగారింట
హైవ్యూ, కేవర్షాము,
రీడింగ్, ఇంగ్లండు.

అమెరికాకు వ్రాయు జాబులను ఈ క్రింది చిరునామాకు పంపెదవుగాక !

కుమారి ఫిలిప్సు నింట
19 పడమర 38 వ వీధి,
న్యూయార్కు.

అల్లనల్లన సమస్తప్రపంచమందును మనము విస్తరిల్ల వలెను. తొలుదొలుత ఆవశ్యకమైనది విధేయత. అగ్నికుండములో లంఘించుటకు నీవు సంసిద్ధుడవై యుండవలెను—అపుడే కర్తవ్యపాలన మగును....రాజపుత్రస్థానములో వివిధగ్రామములందు అట్టిసంఘములను స్థాపింపుము. అచట నీకొక సూచన కలదు.

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 220

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

శ్రీ ఇ. టి. స్టర్డీగారింట,
రీడింగు, కేవర్షాము, ఇంగ్లండు,
1895.

ప్రియ రాఖాల్,

నీయుత్తరము లందినవి. ఆనందించితిని. మీ రందఱు వ్రాయు జాబులలో ముఖ్యముగా నీవు వ్రాయు లేఖలలో రెండు లోపము లున్నవి. కొన్ని ముఖ్యవిషయములకు నేను ప్రత్యుత్తరముల నర్థించినపుడు, కొలది విషయములకు మాత్రము నాకు జవాబులు వచ్చుచుండును. ఈప్రత్యుత్తరము వచ్చుటకు సయి

తము విశేషాలస్యము జరుగుచున్నది.... రేయింబవళ్లు నేను పని చేయుచున్నాను. అంతియు గాక స్థానాస్థానములందు నేను సదా సంచరించుచున్నాను....ఈ దేశములందు ప్రజలు విశేషైశ్వర్య సంపన్నులు, శృంగారజీవితమున కలవడినవారు, మేలివైఖరులం దారితేఱినవారు. ఎవనిశరీరము మీదనైనను ఒక ముఱికిమచ్చ అగపడెనేని ఎవ్వరును వానిని తాకరు....నేనిందుడగనే మనలో నెవ్వడైన వచ్చు నని ఆశపడితిని; కాని యేదియు స్థిరము కాలేదు....వ్యవహారము వ్యవహారమే! అనగా ఏకర్తవ్యము నైనను నీవు చప్పుచప్పున సకాలమున నిర్వహింపవలెను. నీళ్లు నమలుచు పనులను విలంబనములోనికి నెట్టివేయుట తగదు. రాబోవు వారాంతమున నేను అమెరికాకుపోయెదను. కావున అందుండి వచ్చువానిని కలిసికొను అవకాశము నాకు కలుగబోదు... ఈదేశములలో ఘనపాండితి నందిన విద్వాంసు లున్నారు. ఇట్టి వారిని శిష్యులుగనొనరించుట పరిహాసమా? మీ రింకను శిశువులు మాత్రమే!—శిశువులవలె మీరు ప్రసంగించుచుందురు. ఇంచుక సంస్కృతమును బోధించి నేను లేని సమయమున కొంత అనువాదమునలుపుట కొకవ్యక్తి అవసరమై యున్నాడు. అంతియె. ఈసీమలను గిరీశబాబు ఏల సందర్శింపడు? అత డట్లొనరించుట మేలే యగును. ఇంగ్లండు, అమెరికాలను చూచి తిరిగి వెళ్లుటకు ఆతనికి మూడు వేలరూకలు వ్యయమగును. మనప్రజ లీదేశములకు ఎంద తెందఱు రాగలిగిన అంత మేలు. దొరటోపీలుధరించి, ఆంగ్లేయులవలె వేషములు వేసి, దొరలవలె నటించువారిని చూచినపుడు, నాకు తీవ్రమైన యాతన కలుగుచుండును.

ఈమహాశయులు చిమ్నాబూజువలె నల్లనై, ఐరోపీయుల మని చెప్పుకొనుచుందురు.— పెద్దమనుష్యులవలె వీరు స్వదేశ వస్త్రముల నేల ధరింపరు?— అట్లొనరింపక భయంకరములైన తమ స్వరూపములను వీరు మఱింత భయంకరము లొనరింతురు. హాతవిధీ! ఇ దేమి ఘోరకలి! ...... ఇందు, మనదేశమందు

వలె, ఉపన్యాసములు కావించుటకై సొంతఖర్చును తాను భరింప వలెను. విశేషకాలముండి, కొంతకీర్తి సంపాదించినవాడు తన వెచ్చమునకు వలసిన విత్తమును సంపాదింపగలడు....నిరంతరము సంచారముచేయుచు, ఉపన్యసించుచుండుటవలన నా యారోగ్యము విశేషముగ శిథిలమైనది. అనిద్రవ్యాధి తక్కినబాధలు నన్ను పీడించుచున్నవి. ఒంటరినై నేను పరిశ్రమచేయుచున్నాను. నాదేశవాసులపై ఆధారపడుట నిష్ప్రయోజనము. వంగరాష్ట్రములో ఈవరలో నొక్కపైసనైనను నాచేతులందు పెట్టలేదు. నాకు సాహాయ్యము సలుపుటకై ఎవ్వరును ముందంజ వేయలేదు. ఈప్రపంచమున ప్రతిమనుజుడు తోడ్పాటు నర్థించును. నీవు సాహాయ్యము సలిపినకొలది, ఆతడు మఱింత సాయము నపేక్షించుచుండును. మఱి నీవు తోడ్పడజాలకపోతివేని, నిన్నాతడు వంచకుడ వని పేర్కొనును....నే నాతనిని ప్రేమింతును — విశ్వసింతును....ప్రభుకటాక్షమున ఆతడు గోగరహితు డగును. వాని బాధ్యతను యావత్తు నేను వహింతును......

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 221

(శ్రీ రామకృష్ణానందస్వామికి)

శ్రీ ఇ. టి. స్టర్డీగారింట,
హైవ్యూ, కేవర్షాము,
రీడింగ్, ఇంగ్లండు,
1895.

ప్రియ శశి,

నేను నాకు రాఖాల్ జాబు అందినది — అను నాతడు మూత్రవ్యాధివలన బాధపడినందులకు చాల చింతించుచున్నాను. అజీర్ణమువలన అది అంకురించియుండును. గోపాల్ ఋణములు

తీర్చివేయబడినవి. ఇక సన్న్యాసాశ్రమమున ప్రవేశింపు మని వానికి సలహా చెప్పుము. ప్రాపంచికబుద్ధిని బాగుగ తొలగించుట చాలకష్టము.... అతడు మఠములో ప్రవేశించి, పని చేయునుగాక! ప్రాకృతప్రాపంచికవ్యవహారములందు దీర్ఘకాలము తవుల్కొనుట వలన మనసున విశృంఖలభావములువిజృంభింపవచ్చును. సన్న్యాస దీక్ష నాతడు స్వీకరింప నొల్లకుండుచో, అతడు దూరముగనిలుచు గాక! నీటిలోను, నేలమీదను సంచరించు జీవులబోలు వారిని సగము సన్న్యాసులై, సగము గృహస్థులగువారిని నే నొల్లను. హరిమోహనుడు లార్డ్ రామకృష్ణపరమహంస అను మాటను సృజించినాడా! అతడుద్దేశించిన అర్థ మేమి? ఇంగ్లీషులార్డా లేక డ్యూకా ప్రత్యేకరాష్ట్రాధికారియా? ప్రజలు తమచిత్తమువచ్చిన తీరున ఏమనుకొనినను అనుకొందురు గాక! వారి నుడువులకు చెవు లొగ్గ వల దని రాఖాలుతో తెలుపుము. "దుర్విమర్శచేయు వారిని పురుగులను చూచినట్లు చూడ నగును" అని శ్రీరామ కృష్ణుడు తెలుపుచుండువాడు. నీవు తెలుపు దానికిని, చేయు దానికిని నడుమ నెట్టి యాఘాతము నుండ రాదు సుమీ! ప్రపంచ మును దరి రానీయకుము. నేను శుద్ధశ్రోత్రియహిందువుడనా? పౌరాణికహిందువుడనా? ప్రాచీనసాంఘికాచారముల కంజలి ఘటించువాడనా? ఇట్టివాడ నని నే నెన్నడు తెలిసికొనలేదు. ప్రజలలో నొక తరహావారికి ప్రీతి కలిగించుటకై నీ వేమియు తెలుప నక్కఱ లేదు.—అను వారు మన కనుకూలముగా గాని, ప్రతికూలముగా గాని ఏమి తెలిపినను నీవు లక్ష్యము చేయ నక్కఱ లేదు....

ఏ దేశమున ఆరోగ్యసూత్రములు పదదళితములైనవో, ఏ దేశ మే మహనీయుని జన్మవలన కడుంగడు పునీతమైనదో ఆయనకు వా రించుకంతైన సేవ చేయ జాలక పోయిరి, అయినను వారు పెద్దకబురులు చెప్పుచుందురు. సోదరా, ఇట్టి వ్యక్తులు ఏమి తెలిపిన నేమి? వారిమాటలవలన ఘటిల్లు ప్రయోజన మేమి?

నీకర్తవ్యముపై చూపు నిలిపి దానిని నీవు నిర్వహించుచునే యుండవలెను. ప్రశంసకై ప్రజలపై దృష్టి నిలుప నేల? ఈశ్వరునిపై దృష్టి సారింప వలెను. నిఘంటువుతోడ్పాటు పడసి గీతను, ఉపనిషత్తులను, వీని వ్యాఖ్యానములను శరత్తు వారికి బోధింప సమర్థుడని విశ్వసించుచున్నాను. ఇట్లు చేయనిచో ప్రయోజనమేమి కలదు? మీవైరాగ్యము కొఱగానిదా? రిక్తవైరాగ్యపు దినములు కడచిపోయినవి. అబ్బాయీ, ప్రతివ్యక్తి శ్రీరామకృష్ణపరమహంస కాలేడు. శరత్తు తనకర్తవ్యము నీపాటి కారంభించియుండును. పంచదశి, బహుళవ్యాఖ్యానములు కల భగవద్గీత, వారణాసిలో ప్రకటింపబడిన నారదసూత్రములు, శాండిల్యసూత్రములు, లభించుచో పంచదశి భాషాంతరీకరణము (ఇది వ్యర్థమైనది గాక చక్కనై యుండవలెను) శ్రీశంకరభాష్యమునకు కాశీవర వేదాంతవాగీశుడు కావించిన అనువాదము. ఈ గ్రంథముల ఒక్కొక ప్రతిని పంపుము. అలహాబాదువాసియైన శ్రీశవసుచే అనువదింపబడిన (ఆంగ్లమున లేక వంగభాషయందు అనువదింపబడిన) పాణినిసూత్రములు లేక కాశికవృత్తి లేక ఫణిభాష్యము. ఈ గ్రంథముల ఒక్కొక ప్రతిని పంపుము.—వాచస్పత్యనిఘంటుప్రతిని పంపు డని—వారితో చెప్పుము. పెద్దకబురులు చెప్పువారి కది మంచిపరీక్ష యగును. ఇంగ్లండులో మతోద్యమములు మందగతిని నడచును. ఇచటివారు రెండుతీరులవారు. వీరు నాస్తికులైన నయ్యెదరు. లేక అంధవిశ్వాసమున నల్లాడుచుండువారైన గావచ్చును. ఈ రెండవతెగవారి కించుక బాహ్యమతావలంబనము కలదు. "దేశభక్తియే మా మతమని" వారందురు.

పుస్తకములను అమెరికాలోని ఈచిరునామాకు పంపుము:- కుమారి మేరీఫిలిప్సుగృహము, 19 పడమర 38 వ వీథి, న్యూయార్కు, అమెరికాసంయుక్తరాష్ట్రములు. ఇది నా అమెరికా చిరునామా. నాగ్రంథములు మున్నగువాని నచటికి పంపుము. నాలేఖ నీకందినవెంటనే శరత్తు బయలుదేఱుచో, వానిని కలిసి

కొనుఅవకాశము నాకు కలుగును. లేకున్న సాధ్యము కాదు. కర్తవ్యము, కర్తవ్యమే — యిది శిశుక్రీడ కాదు. స్టర్డీ వానిని కలసికొని, వానియునికికి వలసిన వ్యవస్థ చేయును. ఇంచుక లోతును పరిశీలించుటకే ఈ పర్యాయము నేను ఇంగ్లండుకు వచ్చి నాను. రాబోవు వేసవిలో కొంతసంచలనము కలిగించుటకై నేను ప్రయత్నము సలిపెదను. తరువాతి శీతకాలములో నేను ఇండియాకు పోయెదను....మనకర్తవ్యములో . అభిలాషగల వారితో సకాలమున ఉత్తరప్రత్యుత్తరములు సలుపుచుండుము. ఇట్లొనరించుట వలన వారిశ్రద్ధ నవనవోన్మేషమై యుండును. వంగరాష్ట్రమందంతటను కేంద్రములను స్థాపించుటకై ప్రయత్నింపుము....ప్రస్తుతము నీదృష్టిలో .నుండ వలసిన విషయము లివి. తరువాత నేను వ్రాయుజాబులో మఱికొన్ని వివరము లెఱిగింతును. స్టర్డీ చాలమంచివాడు; పట్టుదలగలవేదాంతి. సంస్కృతములో ఇంచుక జ్ఞానము గల వాడు. ఈదేశములలో విశేష పరిశ్రమ చేసిన యనంతరము నీ వించుక పనిచేయగలవు. ప్రయోజన మంతగా గోచరింపని క్లిష్టకర్తవ్యము. అంతియ గాక నీ కాళ్లపై నీవు నిలిచి పనిమీది ప్రీతిని పురస్కరించుకొని నడుము గట్టవలెను. ఉపన్యాసములకును ఆరీతి కార్యక్రమములకును ఆంగ్లేయు లొకచిల్లిగవ్వనైన వెచ్చింపరు. నీయుపన్యాసములు వినుటకై వారు దయచేయుచో, మనదేశములో వలె నీజన్మ నక్షత్రమునకు ప్రణతులు సమర్పింపుము. ఈ విషయ మిటుండ నిచటి సామాన్యప్రజలు నే నెవడనో యెఱుగరు. ఈవిషయ మిట్లుండ, భగవంతునిగుఱించి, ఆధ్యాత్మికవిషయములనుగుఱించి వారికి బోధింప సమకట్టితి వేని, వారు దూరముగ తొలగెదరు. ఈతడు మఱియొక క్రైస్తవబోధకు డేమో యని వారు తలంతురు. నీవు ఓరిమితో బహుళవైజ్ఞానికవిషయములను సంగ్రహింప వలెను. ఋగ్వేదమునుండి అప్రశస్తిలేని పురాణములవఱకు, తాంత్రికవిషయములవఱకు సమస్తగ్రంథములను నెమకి, సృష్టి.

విశ్వప్రళయము, మానవజాతి, స్వర్గము, నరకము, ఆత్మ, చైతన్యము, మేదస్సు, ఇంద్రియములు, ముక్తి, పునర్జన్మ మున్నగు బహుళ నైతికమానసికతాత్త్వికాంశముల పఠించి, ప్రవచనము సలుపవలెను. బాలక్రీడ పనికి రాదు, నిక్కంపు వైదుష్యవ్యక్తీకరణ మవసరమై యున్నది. విషయపరంపరను సంగ్రహించుట మిక్కిలి ముఖ్యమైన కర్తవ్యము. మీ యెల్లరకు నా ప్రేమలు.

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 222

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

1895.

ప్రియ రాఖాల్,

...ఇండియాకు తిరిగి రమ్మని నీవు తెలిపిన హితము నిక్కముగ సరియైనదే. ఈ దేశమున విత్తనము నాటబడినది. ఆకస్మికముగ నేనిందుండి నిష్క్రమించిన యెడల ఇది నాశనమై పోవచ్చును. కావున నేను కొంతకాల మిందు వేచియుండవలెను. ఇందుండి సమస్తవిషయములను సక్రమముగ చక్కబెట్టవచ్చును. ప్రతివారు నన్ను భారతదేశమునకు తరలి రమ్మని కోరుచున్నారు. ఈ వేడికోలు మంచిదే యగును. కాని యొరులపై నాధారపడుట సముచితకార్యము కాదని యెఱుగవా? బుద్ధిమంతుడు తన కాళ్లపై తాను నిలిచి కర్తవ్యమునకు కడంగవలెను. సమస్త కార్యములు అల్లనల్లన సాధింపబడును. స్థలము సంపాదించు విషయమును విస్మరింపకుము. మనకు విశాలమైన నేల అవసరమై యున్నది.—దీనిధర పదిమొదలు ఇరువదివేల రూకలవఱకు ఉండవచ్చును. అది గంగాతీరమున నుండవలెను సుమీ! నాచేతిలోని

మూలధనము కొంచెమేయైనను, నేను మిగుల సాహసము గల వాడను. భూమిని చేకొనుటకై శ్రద్ధవహింపుము. మనమిపుడు మూడు కేంద్రములను నెలకొలుపవలెను. ఒకటి న్యూయార్కులో, వేఱొకటి కలకత్తాలో, మూడవది మదరాసులో తలసూపవలెను. తదనంతరము ఈశ్వరేచ్ఛను పురస్కరించుకొని, క్రమాభివృద్ధి నంద వలెను.... ఆరోగ్యవిషయమున ప్రత్యేకశ్రద్ధ వహింప వలెను. తక్కిన యావత్తు విషయములు దాని తరువాతనే గణనీయములు....

సోదరుడు తారకునికి పరిభ్రమణ మనిన అత్యంతప్రియము. ఈయుద్దేశము దొడ్డదే. కాని యీదేశములందు మసలుట 'అమ్మక్క' కాదు. ఇచట విశేషధనమును వ్యయ మొనరింప వలెను. ఒకమతబోధకు డిచట దినములు కడపవలె ననిన నెలకు అర్ధమపక్షము వేయిరూకలనైనను ఆతడు వెచ్చించి తీరవలెను. సోదరుడు తారకుడు చొరవ గల వ్యక్తి. సమస్తము చేకూర్చు వాడు భగవంతుడు. నిక్కమే! ఆతడు తనయాంగ్లభాషాపరిజ్ఞానము నించుకవృద్ధిచేసికొనవలెను. విద్వాంసులైన ఇచటి క్రైస్తవమతబోధకుల దవడలనుండి మన మాహారము నూడబెఱుకు కొనవలెను. వైదుష్యశక్తి వలన వీరి నధఃకరించు సత్తువ మన కుండవలె నని తెలుపుట నాయుద్దేశము. లేకున్న 'ఉఫ్' అని మనలను వీ రూది వేయవచ్చును. సాధువు లెవ్వరో, సన్న్యాసు లెవ్వరో, వైరాగ్య మన నేమో వా రెఱుగరు—విస్తృత వైదుష్యము, వచఃకౌశలము, అద్భుతక్రియాశక్తి— ఇవి మాత్రము వారి కవగతములు. ఈవిషయ మిట్లుండ సమస్తదేశము నెరసులు నెమకుటకై గ్రుక్కిళ్లుమ్రింగును. క్రైస్తవమతబోధకులు రేయింబవళ్లు దౌర్జన్యమువలనను లేకప్రవంచనమువలనను, నిన్నణగ ద్రొక్కవలె నని ప్రయత్నింతురు. ఈయడ్డంకులను నెట్టివేసియే నీవు మతప్రబోధమునకు గడంగవలెను. మాతృదేవీకటాక్షము వలన సమస్తకార్యములు సుసాధ్యము లగును. నాయుద్దేశ

మే మో హృదయమును విప్పి చెప్పుచున్నాను. పంజాబు మదరాసు లలో సోదరుడు తారకుడు కొన్ని సంఘములను నెలకొలుపుట పాడి. మీరు నిర్మాణక్రియాదక్షులు కండు. ఇది సర్వోత్కృష్ట కర్తవ్య మగును. నూతనపథాన్వేషణ మొనరించుట దొడ్డ విషయమే. దానిని విశాల మొనరించి, చదునుచేయుట సామాన్య విషయము కా దని గుర్తింపుడు. గురుదేవుని ఆశయబీజములను నేను నాటిన తావులందు వసించి, అవి మొక్క లగుటకు మీరు కృషిసలిపి, కృతకృత్యు లయ్యెద రేని, నేను చేసిన కర్తవ్యము కంటె ఘనతరకార్యమును మీరు సాధింపగల్గుదురు. చేతికందిన వస్తువును చక్కబెట్టలేనివారు. ముందెన్నడో తలయెత్తువాని నెట్లు చేపట్టి నెగ్గ గలరు ? ఇంచుమించు తయారైనవంటకములో రవంత ఉప్పుకలుపుట మీకు చేతకానిపనియగుచో, సమస్తవ్యంజనములను ఆది మొదలు తుదవఱకు సమకూర్తు రని నే నెట్లు నమ్మగలను? పైని తెలిపిన పనికి సోదరుడు తారకుడు కడంగలేక పోవుచో, అల్మోడాలో ఆత డొక హిమాలయమఠమును నెల కొలుపును గాక! ఆమఠమం దాత డొక గ్రంథాలయమును చేర్ప వచ్చును. ఆత డి ట్లొనరించుచో మన తీరిక సమయమును కొంత ఆచల్లనిప్రదేశమందు గడపి సాధన చేయ వచ్చును. నాసలహా ఇట్లుండ మీరు మీ మీ మనసులకు వచ్చురీతిని ప్రత్యేకక్రియా నిర్వహణ మొనరించుచో నా యంకిలి ఏమియు నుండదని నమ్ముడు.

శివా నః సన్తు పన్థానః—మీదారులుమంగళకరములగును గాక! ఇంచుక వేచియుండుమని వానితో తెలుపుము. త్వరపడిన యెడల, చేకుఱు ప్రయోజన మేమి? మీ రందఱు సమస్తప్రపంచ మందును సంచరించితీరవలెను. ధైర్యమువహింపుడు. సోదరుని తారకుని అంతరంగమున అద్భుతక్రియాశక్తికలదు. కావున వాని వలన విశేషకార్యము నివ్వటిలునని నే నపేక్షించుచున్నాను.…

శ్రీరామకృష్ణుడు సిద్ధిపొందినపిదప చింపిరిగుడ్డలు కట్టికొను కొఱ గాని బుడుతలను చూచినట్లు మనలను చూచి ఎల్లరు నెట్లు

పరిత్యజించిరో యెఱుగుదువు గదా! ఆయక్కఱ వేళలో బలరామ్బసు, సురేశ్బాబు, మాస్టరు (మహాశయుడు) చునిబాబు వంటి యే కొలదిమంది మిత్రులుమాత్రమే మన యండనుండిరి. ...వారొసగిన ఊతోడ్పాటుకు మన మెన్నడు మనఋణమును దీర్పజాలము.... తా నడల వల దనియు ప్రభుసంరక్షణమునందువా రెన్నడు వెఱపునకు గుండెయందు నెడ మీయరాదనియు చునిబాబుతో ప్రత్యేకముగా తెలుపుము. ప్రభువిభూతి అనంతమైనది—నేనెంతవాడను? మాభైః మాభైః—భయపడవలదు. మీ విశ్వాసము సడలకుండు గాక.... ఎవడు ఈశ్వరాధీనమందున్నాడో, వాని నెట్టి విపత్తైన నేమి చేయగలదు?

సదా భవదీయ

వివేకానంద

## 223

(శ్రీమతి బుల్సతికి)

శ్రీ ఇ. టి. స్టర్డీగారింట,
హైవ్యూ, కేవర్షాము, రీడింగ్,
ఇంగ్లండు,
సెప్టెంబరు 17, 1895.

బుల్సతి సెముఖమునకు,

శక్తిసమన్వితులై, మేధావులై శ్రేష్ఠస్థాయినలంకరించిన కొందఱు వ్యక్తులను ఇంగ్లండులో మనవర్గమున చేర్చుకొనవలెనని నేనును, స్టర్డీయు మిగుల మక్కువపడుచున్నాము. వీరితో ఒకసంఘమును ఏర్పాటుచేయుట మాయుద్దేశము. కాబట్టి మేము మెల్లగానే అడుగువేయవలెను. క్రమము దప్పిన ఊహాలలో కొట్టుకొనిపోకుండ తొలుతనుండి మనము జాగ్రత్తపడవలెను.

అమెరికాలోకూడ నే నీ విధానమునే అవలంబించుచున్నా నని నీవు గ్రహింపగలవు. స్టర్డీకొంత కాలము ఇండియాలో సన్న్యాసుల సాహచర్యమును పడసి, వారి జీవితరీతుల 'ననుసరించుచు వసించెను. అతడు విశేషశక్తిగలవాడు, విద్వాంసుడు. సంస్కృతమున ఘనపాండితి నందినవాడు....ఇంతదనుక విషయములు ప్రశంసనీయములే! పవిత్రత, పట్టుదల, క్రియాశక్తి: నా కివి మిక్కిలి అక్కఱైయున్నవి. ఈరీతి వ్యక్తులు ఆఱుగురు నా కిందు లభించిరేని, నా కార్యక్రమము కొనసాగును. ఇట్టి వారు లభించు నవకాశము నాకెంతేని కలదు.

వివేకానంద

## 224

(కుమారి జోసఫైన్ మెక్లియడుకు)

శ్రీ ఇ. టి. స్టర్డీగారింట,
హైవ్యూ, కేవర్షాము, రీడింగ్, ఇంగ్లండు,
సెప్టెంబరు, 1895.

సోదరీమణి జోజోకు,

నీకు సత్వరమే జాబువ్రాయజాలకపోయినందులకు క్షమింపవేడుచున్నాను. నేను లండనులో సుఖముగ జేరితిని. నామిత్రుని కనుగొనజాలితిని. అతనిగృహములో ఖులాసాగా నున్నాను. అది చక్కనియిల్లు. అతని యిల్లాలు నిక్కముగ దేవతాస్త్రీయందును. అతనిజీవితము భారతభావమయమైనది. చాలకాలమాతడు భారతదేశములో వసించినాడు. సన్న్యాసులతోమసలి, వారిచ్చుభోజనమును భుజించి, వారియలవాట్ల నవలంబించినాడు. కావున వాని గృహమున నేను మిగుల సుఖముగనున్నానని నీవు గ్రహింపగలవు. ఇండియాలో సైన్యాధ్యక్షులుగానుండి, ఉద్యోగమును విరమించి వచ్చినవారు పలువురిందున్నారు. నాయెడల వారు ఆదరానురాగములుచూపుచున్నారు. నల్లనివారందఱు

నీగ్రోలేయని అమెరికావారు తలంతురు. ఇది వారి యద్భుత పరిజ్ఞానము. ఇట్టి జ్ఞాన మిందులేదు. నేను వీధిలోనడచుతటి నన్నెవ్వరు తేఱిచూడరు.

ఇండియాకు అవ్వల మఱెందైన నున్నప్పటికంటె నాకిందు విశేష సుఖము కలుగుచున్నది. ఆంగ్లేయులు మమ్మెఱుగుదురు. మేమువారినెఱుగుదుము. ఇచ్చటి విద్యాసభ్యతాస్థాయి మిగుల నున్నతమైనది.— దానివలన మహత్తరపరివర్తన మందు పొడసూపినది. పెక్కుతరముల విద్యవలన చేకుఱు ఫలమిది.

పరస్పరానురాగబద్ధమైన "శకుంతములు" తిరిగివచ్చినవా? వారిని, వారియాత్మీయులను సదా సర్వేశుడు ప్రోచుగాక! ఆల్బెర్టా హోలిస్టరు శిశువులు ఎట్లున్నారు? నీకును, వారికిని నావాత్సల్యశరధిని ప్రసాదించుచున్నాను.

నామిత్రుడు సంస్కృతములో దొడ్డ పండితుడగుట వలన శంకరభాష్యముమున్నగు మహాగ్రంథములందు వ్యాసంగము సలుపుచున్నాము. ప్రియసోదరీ, ఇచట తత్త్వశాస్త్ర, మతశాస్త్రముల గోష్ఠికాక మఱేమియులేదు. లండనులో అక్టోబరు మాసమున తరగతులను నిర్వహించుటకై ప్రయత్నములు సలుపుచున్నాను.

వాత్సల్యభరితాశీర్వాదములతో,

వివేకానంద

## 225

(శ్రీమతి బుల్బతికి)

రీడింగ్, ఇంగ్లండు.
సెప్టెంబరు 24, 189౬.

ప్రియ శ్రీమతి బుల్బతి,

దృష్టి నాకర్షించు నట్టి కర్తవ్యమును నే నింకను చేయజాలనైతిని. సంస్కృతమును నేర్చుకొనుటకై స్టర్డీకి, కొంత

సాహాయ్యము సలుపుచుంటిని అంతయే... నేను అమెరికాలో లేనపుడు తనకు సాహాయ్యము సలుపుటకై భారతదేశమందలి మాసన్న్యాసివర్గమునుండి ఒక్కరిని రప్పింపవలసిన దని స్టర్డీ వ్రాయుచున్నాడు. అట్టివానిని పంపవలసిన దని నేను ఇండియాకు వ్రాసితిని.…ఇంతదనుక కార్యక్రమము సక్రమముగానే నడచు చున్నది. తదుపరితరంగమునకై వేచియున్నాను. "వచ్చుదానిని విడనాడకుము, రానిదానిని వెదకకుము — భగవంతుడు ప్రసాదించుదానికై వేచియుండుము" ఈమాటలు నా కాదర్శములై యుండు నానుడులు.…

వ్రాతలో నావేగముమందము; కాని నాహృదయము కృతజ్ఞతతో నిండియున్నది.

శుభాకాంక్షలతో,

భవదీయ
వివేకానంద

## 226

(శ్రీమతి ఫ్రాన్సిసు హెచ్ లెగ్గెట్టుసతికి)

శ్రీ ఇ. టి. స్టర్డీగారింట,
హైవ్యూ, కేవర్షాము,
రీడింగు, ఇంగ్లండు.
అక్టోబరు 1895.

ప్రియ జననీ,

నీకుమారుని నీవు మఱచి పోలేదు కదా? ఇప్పు డెక్కడ నున్నావు? టాంటేయు పిల్లలును? మీగుడిలోనున్న మనపూజారి యోగీంద్రునిగూర్చిన వార్త యేమి? జోజో అంతత్వరలో నిర్యాణము నొందబోదు. కాని ఆమెగంభీరమౌనము గొప్పసమాధి వలె నున్నది.

ప్రయాణములో నున్నావా? ఇంగ్లండు నాకు చాలభోగ్య ముగ నున్నది. భుజించుటకును పొగత్రాగుటకును ఇంచుకంత అవకాశమునుండనిచ్చి నేను నామిత్రునితో "తత్త్వశాస్త్రమే" ఆహారముగ జీవించుచున్నాను. వానినుండి మాకు ద్వైతమును అద్వైతమును తక్కినవన్నియు—ఇవితప్ప వేఱేదియు లభించుట లేదు.

హాలిస్టరు పొడుగైన చల్లడములు తొడుగుకొనుచు పురుషవతంసుడై యుండు ననుకొనుచున్నాను. ఆల్బెర్టా జర్మను భాష చదువుచున్నది.

ఇచ్చట ఆంగ్లేయులు చాలమైత్రి చూపుచున్నారు. ఆంగ్లో యిండియనులను కొందఱిని తప్ప, వారు నల్లవారిని ద్వేషింపనే ద్వేషింపరు. వీథులలో నన్ను జూచి వారు ఎగతాళి చేయుట సైతము లేదు. ఒక్కొక్కప్పుడు నామోము తెల్లనిదిగ మాఱె నేమో అని అబ్బురపడుచుందును. కాని అద్దము చూచిన నిజము తెలియుచుండును. ఐనప్పటికిని ఇచ్చట వారు ఎంతో మైత్రి చూపుచున్నారు.

మఱొకమాట. ఇండియాపై ప్రేమగల ఇంగ్లీషుమహిళ లును మహాజనులును హిందువులకంటె హిందువులుగ నున్నారు. 'నే నిచ్చట సమృద్ధములైన కూరగాయలను పూర్తి భారతీయ పద్ధతిలో వండించుకొనుచున్నాను' అను వార్త నీ కాశ్చర్యము కలిగించును. ఆంగ్లేయుడు ఏవిషయమును చేపట్టినను దాని అగా ధములలోనికి ప్రవేశించును. నిన్న ప్రొఫెసరు ఫ్రేజరు అను నొక ఆయనను కలిసికొంటిని. ఆయన ఇచ్చట గొప్పఅధికారి. ఆయన జీవితకాలములో సగము భారతదేశమున గడచినది. ప్రాచీ నాశయములమధ్యను జ్ఞానమునందును ఆయనజీవితము చాల ఎక్కువగా గడిచినందున భారతీయేతరమైన దేనినిగాని ఆయన లక్ష్యపెట్టుట లేదు. సంఘుసమస్యకు హిందువుల వర్ణవ్యవస్థ

ఏకైకపరిష్కార మను నభిప్రాయము గల్గి తర్కశీలురగు ఆంగ్ల మహాజనులును మహిళలును పెక్కుం డ్రున్నా రను మాట విందు వేని ఆశ్చర్యపడుదువు. వారి బుద్ధులలో ఆఆశయమున్నప్పుడు ప్రజాసామ్యవాదులను (సోషలిస్టులను) ప్రజాస్వామ్యవాదులను (సోషల్ డెమోక్రాట్సును) వా రెంతగా ఏవగించుకొందురో నీవు ఊహింపవచ్చు. అంతే కాదు, భారతీయాశయములలో అత్యం తాసక్తి మగవారికే, వారిలోను మహోన్నతవిద్యావంతుల కే; ఆయాసక్తి గలమహిళలు చాలతక్కువ. మహిళారంగము అమెరి కాలో కంటె ఇక్కడ మిక్కిలి సంకుచితము. ఇప్పటివఱకు నా కిక్కడ సమస్తమును చాలబాగుగ సాగిపోవుచున్నది. ఇంకను అభివృద్ధులు కల్గినచో నీకు తెల్పెదను.

నాయనకు రాజమాతకు జోజోకు (బిరుసు లేదు) పిల్లలకు నా ప్రేమ.

ప్రేమాశీస్సులతో,

సదా భవదీయ
వివేకానంద

## 227

(సోదరి నివేదితకు)

రీడింగు, ఇంగ్లండు,
అక్టోబరు 4, 1895.

ప్రియ సోదరీ,

పోరాటములును తప్పులను దిద్దుటయు కలిసినపుడు జీవన మగును— ...పలువిధానుభూతులవలన గ్రహింపబడునదే జీవన రహస్యము. భోగించుట జీవించుట కాదు. కాని జరుగున దిది! ఏముహూర్తమున మనము యథార్థశిక్షణము నంద ముదలిడు దుమో ఆముహూర్తమందే మనకు పరలోకమునుండి ఆహ్వానము

వచ్చును. మనమృత్యువు తర్వాత అస్తిత్వము కల దనుట కిది యొక ప్రబలతార్కాణ మని అనేకుల యభిప్రాయము. అన్ని స్థలములలో కార్యక్రమము ఒక ఝంఝూవాతూలమునకు గతి యగుట మేలు. అందువలన గాలికి పవిత్రతగలుగును. విషయములు సుస్పష్టములగును. అవి సమగ్రమైన ఆకళింత కందును. వాని నిహితార్థమును గ్రహింపజాలుదుము. నూతనోత్సాహముతో నపుడు కర్తవ్యము నారంభింపగల్గుదుము. అపుడది వజ్రదృఢభిత్తిపై సుప్రతిష్ఠిత మగును....

నీకు నాశుభాకాంక్షలు.

వివేకానంద

## 228

రీడింగు, ఇంగ్లండు,
అక్టోబరు 4, 1895.

ప్రియ—,

...పవిత్రతయు, శాంతమును, పట్టుదలతో కూడినపరిశ్రమయు సమస్తావరోధములను అతిక్రమింపజాలును. ఘనకార్యములన్నియును తప్పక మెల్లగనే సాగును....

వాత్సల్యయుత భవదీయ
వివేకానంద

## 229

(శ్రీ బ్రహ్మానందస్వామికి)

శ్రీ ఇ. టి. స్టర్డీగారింట,
హైవ్యూ, కేవర్షాము, రీడింగు,
అక్టోబరు 4, 1895.

నాప్రియ రాఖాల్,

నేనిపుడు ఇంగ్లండులో నున్నా.నని నీ వెఱుగుదువు. నేనిచట ఒకనెలదినము లుండి, అమెరికాకు తిరిగి పోయెదను.

రాబోవు వేసవిలో నేను తిరిగి ఇంగ్లండుకు వత్తును. ప్రస్తుతము ఇంగ్లండులో అంతగా ఆశింపదగినది లేదు. కాని భగవంతుడు సర్వశక్తిసమన్వితుడుకదా! ఓపికపట్టి చూతము గాక!...

—ఆత డిపుడు వచ్చుటకు వీలు లేదు. విషయ మిది! ధనము స్టర్డీకి చెందినది. ఆతనిమనసుకు నచ్చినవ్యక్తినే మనము రప్పింపవలెను. స్టర్డీ నాయొద్ద ఉపదేశము నందినాడు. అతడు యోగ్యుడు, కార్యసాధనతత్పరతగలవాడు.

ప్రప్రథమమున ఆంగ్లసంస్కృతములందు సమగ్రపాండితి నందిన వ్యక్తి యొకడు మన కక్కఱతైయున్నాడు.—అను నతడు ఇచటికి వచ్చినయెడల, ఆంగ్లమును నేర్చుకొనగల్గును. కాని ఇచటికి వచ్చి నేర్చుకొనవలసినవారిని ఇచటి కాహ్వానించుట కిపుడు సాధ్యము కాదు. అప్పుడే బోధింపగల్గియుండువారే మన కిప్పుడు కావలెను. ఆవచ్చువారు నన్ను అనుకూలపరిస్థితులందును, ప్రతికూలపరిస్థితులందును, కలిమి లేములందును పరిత్యజింప రాదు.... మిగులవిశ్వసనీయులే అవసరమైయున్నారు. పునాదిపడిన పిదప రావలె నను నుద్దేశము గలవాడు వచ్చుగాక! వచ్చి చప్పుడు చేయు గాక! అడల నక్కఱ లేదు.—అను నాతడు. ధ్వనిప్రభావమునకు లొంగి, కొఱగాని ఆ అయ్యలవర్గమున చేర కుండుటకు వలసిన జ్ఞానము గలవాడవుట కెట్టి ఋజువు లభింప లేదు. శ్రీరామకృష్ణపరమహంస సత్యసంధీ ప్తవ్యక్తి కా డని ఒప్పుకొనినను ఆయన నాశ్రయించుట పొరపాటే యని యొప్పు కొనినను, ఇపుడు చేయదగిన దేమి? అవలంబించినస్థితినుండి నిష్కృతినందు టెట్లు? ఒకజీవితము వ్యర్థమైపోయిన నేమి? ఒకడు తనమాటలను తానే యుపసంహరించుకొనవలెనా? ఒకర్తుకకు పంద్రెండుగురు భర్త లుండుట పొసగునా? మీలో నెవ్వరైన, మీకు నచ్చిన ఏవర్గమందైన ప్రవేశింపవచ్చును. నా కభ్యంత రము లేదు. ఇంచుకైన అభ్యంతరము లేదు. కాని యీజగతి

యందు విపులపర్యటన మొనరించి నేను గ్రహించిన విషయమిది: ఆయనవర్గమందు తక్క, మఱెందును భావాచరణములందు పొత్తులేదు.— ఊహనుబట్టి నడత సాగుట లేదు. ఆయన వర్గమునకు చెందినవారియెడల నేను మిగుల ననురక్తుడనై యుందును. వారిని సర్వవిధముల విశ్వసింతును. ఈవిషయమున నే నవలంబింపవలసిన వెరవు మఱేదియు లేదు. పక్షపాతి నని నీ వనినను అనవచ్చును. కాని త్రికరణశుద్ధిగా నేను నమ్మినదానిని, ముక్తకంఠముతో వ్యక్తపఱచుచున్నాను. శ్రీరామకృష్ణు నాశ్రయించినవ్యక్తి యరకాలున ముల్లుగ్రుచ్చుకొనినను, నాయెముకలందు దారుణయాతనకలుగును. ఎల్లరను ప్రేమించువాడను నేను. నే నేశాఖను అంటిపెట్టుకొనియుండువాడను గాను. నాది హ్రస్వదృష్టి కాదు. ఇందు నాకు నేనే సాటి. కాని కొంత మూఢభక్తి కల దనిన యెడల, నీవు నన్ను మన్నింతువు — గాక!... ఆయన పేరెత్తకున్న యెడల, మ ఱవరి మాట పురశ్చరణ మొనరింతును? రాబోవుజన్మమున ఒకపెద్దగురువును అన్వేషించుటకై కావలసినంత కాలము కలదు.... కాని యీజన్మమందు చదు వెఱుగని ఆబ్రాహ్మణుడే నా యీశరీరమును శాశ్వతముగ కొనివైచినాడు.

నామనసులోని మాటను నీకు విప్పిచెప్పితిని. ఆగ్రహింపవలదని వేడుచున్నాను. ఆయనకు నీవు బానిసగా నున్నంతకాలము నీకు నేను బానిసను — వెంట్రుకవెడల్పు అవ్వలికి నడలితివేని, మన మిరువురము సమానులమే అని యందుము. నీవు వీక్షించు సమస్తశాఖలు, సమస్తసంఘములు, ఇవియు అవియు నన నేల నెల్లవర్గములు, దేశమందును, అవ్వలను గలవానిని సోదరా, — అన్నిటిని ఆయన మ్రింగివైచినారు. "మయై వైతే నిహతాః పూర్వ మేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" "మున్నె వీరు నాచే సంహరింపబడిరి. ఓ అర్జునా, నాచేతిలో నీవు నిమిత్తమాత్రుడవుగ నుండుము." నేడుగాకున్న రేపు అవి యన్నియు

నీ శరీరమున లీనమై పోవును. ఓవిశ్వాసరహితుడా, ఆయనకటా క్షమువలన "బ్రహ్మాణ్డంగోష్పాదయతే" "సమస్తబ్రహ్మాండము గోష్పాద మగును." ద్రోహులు కాకుండుడు. ఈపాపమునకు ప్రాయశ్చిత్తము లేదు. పేరుప్రతిష్ఠలు, సత్కార్యములు — యజ్జుహోషి యత్తపస్యసి యదశ్నాసి ఇత్యాది నీవుచేయు యజ్ఞములు, నీవుచేయు తపసు, నీవు భుజించు ఆహారము" అన్నిటిని ఆయనచరణసరోజములకు సమర్పింపుము. జగతిలో మనకు కావలసిన దేమి? ఆయన మన కాశ్రయ మిచ్చినాడు. మన కిక కావలసిన దేమి? భక్తికి ప్రతిఫలము భక్తియే!— ఇక మ తేమి కావలెను? సోదరా, ఎవరు మనకు అన్నము తినిపించి, బట్ట కట్టించి, విజ్ఞానప్రజ్ఞానములు ప్రసాదించి, ఆత్మచక్షువులను తెఱచి మనలను మనుష్యులను చేసిరో, ఎవరియందు రాత్రింబవళ్లు మనము ప్రత్యక్షభగవంతుని విలోకించితిమో — ఆయనపట్ల మనము ద్రోహులమై ప్రవర్తింపవలెనా? ఇట్టి ప్రభుకారుణ్యమును మీరు మఱచుచున్నారు. శ్రీకృష్ణ - బుద్ధ - జీససుజీవితములు ప్రాచీనచారిత్రకాంశములు. వీని చారిత్రకసత్యమును గుఱించిన సంశయములు కలవు. మీరు శ్రీరామకృష్ణునిజీవితమహిమను ప్రత్యక్షముగ వీక్షించినను, ఒకొ్కకపుడు ఉన్మత్తులగుచున్నారు. ఛీ! అనదను. నేను చెప్పగలిగినది లేదు. మన దేశమందును, ఇతరదేశములందును నాస్తికులు, హృదయరహితులు సయితము ఆయనచిత్రపటమును పూజించుచున్నారు. ఇకమీరో! అవిశ్వాసముతో నల్లాడుచున్నారు. తనకై ఆయన మీవంటి వారి నసంఖ్యాకుల నొకశ్వాసలో సృజింపగలడు. ఆయనచరణధూళిని దీసికొను భాగ్యము చేకఱినందులకు మీజన్మ ధన్య మైనది. మీవంశము ధన్యమైనది; మీదేశము ధన్యమైనది. నే నొనరింపగల దేమి? ఆయన నిశ్చయముగ మనలను సంరక్షించుచున్నారు.— నానేత్రముల ముందల నే నీదృశ్యము నవలోకించుచున్నాను. అప్సరసల సౌందర్యముబోలు

సౌందర్యము, లక్షలాది రూకల ప్రోవులు నన్నాకర్షింప లేక, కేవలము శూన్యములట్లు నాకట్టెదుట గోచరించుట నాశక్తివలన నని తలంచుచున్నారా? అట్లూహించుచుంటి రేని మీరు పిచ్చివా రని వచింతును. నన్ను పరిరక్షించుచున్నది ఆయన కాదా? ఆయనలో విశ్వాసము లేనివాడు, ఆయనయెడల భక్తి, శ్రద్ధలు చూపనివాడు సమస్తమును గోల్పోయినవాడని ముక్తకంఠముతో తెలుపుచున్నాను.

•

తనయిక్కట్టులనుగుఱించి వ్రాయుచు, అచిరములో తానున్నయింటిని ఖాళీచేయవలసివచ్చుచున్న దని హరమోహ నుడు తెలుపుచున్నాడు. కొన్ని 'ఉపన్యాసముల' నాత డర్థించి నాడు. ప్రస్తుత మట్టి వేమియు నాయొద్ద లేవు. కాని నాచేతిలో నించుకపైక మున్నది. ఇది వానికి పంపెదను. కావున ఆత డడల నక్కఱ లేదు. తక్షణమే వానికి దానిని పంపియుందును. ఈ వరలోపంపిన పైకము వాని కంద లేదు. కాబట్టి ఈపర్యాయము దానిని పంపుట కించుక ఆలస్య మగుచున్నది. అంతే కాదు ఏ చిరునామాకు పైకమును పంపవలెనో యెఱుగను. మదరాసు వాసులు పత్రికను నెలకొలుప లేకపోయిరి. హిందూజాతియందు కార్యతత్పరత పూర్తిగా లోపించినట్లగపడుచున్నది. నీవే కార్యము నైనను చేయుదునని వాగ్దానముచేసితి వేని, నిర్ణీతసమయమున నీవు దానిని తప్పక చేసితీరవలెను. అట్లొనరింప వేని, ప్రజలకు నీయందు విశ్వాస ముండదు. ధనవ్యవహారములలో సత్వరప్రత్యుత్తర మక్కఱయై యున్నది......మాస్టరు మహాశయు డిష్టపడుచో కలకత్తాలో నాకు ప్రతినిధిగా నుండు మని ఆయనను కోరుము. ఆయన యెడల నాకు విశేషవిశ్వాస మున్నది. ఈరీతి కార్యక్రమముల నాయన బాగుగ నెఱుగును. తెలివిమాలిన కుఱ్ఱమూక కివి చేత కాదు. ఒక కేంద్రమును నిర్ణయింపు మనియు, గంటగంటకు మాఱని చిరునామా అవసరమనియు, కలకత్తాకు నేను వ్రాయు

జాబు లచటికే పోవలసియుండు ననియు వానితో చెప్పుము.... వ్యవహారము వ్యవహారమే!...

భవదీయేత్యాది
వివేకానంద

## 230

(శ్రీమతి బుల్సతికి)

రీడింగు,
అక్టోబరు 6, 1895.

ప్రియ శ్రీమతి బుల్సతి,

...భక్తినిగుఱించిన ఒకచిన్న గ్రంథమును స్టర్డీతో గలసి విపులవ్యాఖ్యానములతో అనువదించుచున్నాను. ఇది అచిరములో ప్రచురింపబడును. ఈనెలలో నేను లండనులో రెండు ఉపన్యాసములను, మెయిడెన్హెడ్‌లో ఒక యుపన్యాసమును కావింపవలెను. తదుపరి కొన్ని తరగతులను నిర్వహించుటకును, అగాధోపన్యాసములను కావించుటకును ఈకార్యక్రమము నాంది కాగలదు. విశేషధ్వనిచేయుట మా కిష్టము లేదు. నిశ్శబ్దముగ కర్తవ్యమును నిర్వహించుటే మాలక్ష్యము. ...

అత్యంత శుభాకాంక్షలతో,

భవదీయ
వివేకానంద

## 231

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

హైవ్యూ, కేవర్షాము,
రీడింగు, ఇంగ్లండు,
అక్టోబరు, 1895.

ప్రియ జోజో,

నీయొద్దనుండి జాబువచ్చినందుల కానందించుచున్నాను. నీవు నన్ను మఱచితి వనుకొంటిని.

లండనులోను, లండనుపరిసరప్రదేశములందును కొన్ని యుపన్యాసములు కావింతును. వానిలో నొకటి బహిరంగోపన్యాసము. ప్రిన్సెస్‌హాలులో ఈనెల 22 వ తేదీనాడు 8 30 గంటలప్పుడు జరుగును.

వచ్చి ఒకతరగతినేర్పాటుచేయుటకై ప్రయత్నింపుము. ఇచట నే నింకను అంతగా జెప్పదగిన దేదియు చేయనే లేదు. క్రియారంభ మెన్నడు మెల్లగనే జరుగును గదా! అమెరికాయందు న్యూయార్కులోని ఇంచుకంతపని చేయుటకై రెండుసంవత్సరముల కాలముపట్టెను.

అందఱికిని నిమ్ర.

సదా భవదీయ
వివేకానంద

## 232

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

హైవ్యూ, కేవర్షాము,
రీడింగు, ఇంగ్లండు,
అక్టోబరు 20, 1895.

ప్రియ జోజో,

లెగ్గెట్టుకుటుంబమును లండనుకు ఆహ్వానించుటకై ఈజాబు వ్రాయుచున్నాను. ఒకవిధముగ ఇది నాసొంతసీమ. కావున నీకు ప్రథమాహ్వానమును పంపుచున్నాను. రాబోవు మంగళవారము నాడు 22 వ తేదీ ఎనిమిదియునరగంటలవేళ ప్రిన్సెసుహాలులో నీ స్వాగతమును స్వీకరింతును.

మంగళవారమువఱకు నాకు తీఱిక లేకుండును. నిన్ను చూచుటకై వచ్చుటకు నా కవకాశము చిక్కదు. ఆనాడు కడ

చినపిదప మ ఱేదినమందైన వత్తును. మంగళవారము నాడే వచ్చుటకు సాధ్య మగు నేమో ప్రయత్నింతును.

నిత్యప్రేమాశీస్సులతో,

భవదీయ
వివేకానంద

## 233

(శ్రీ అళసింగపెరుమాళుకు)

లండను,
అక్టోబరు 24, 1895.

ప్రియ అళసింగా,

...ప్రథమోపన్యాసము కావించితిని. "స్టాండర్డు" అను పత్రికలో ప్రకటింపబడిన సదభిప్రాయమునుబట్టి అది విజయవంతమైన ఉపన్యాస మని తెల్ల మగును. "స్టాండర్డు" అను పత్రిక "కన్సర్వేటివు" వర్గపు పత్రికలలో విశేషప్రజామోదముబడసిన వానిలో నొకటి. నేను లండనులో నెలదినము లుండి పిదప అమెరికాకు పోయిరాబోవు వేసవిలో తిరిగివత్తును. ఇంగ్లండులో, వి త్తనము చక్కగ నాటుకొనిన దని నీవు గ్రహింపగలవు....

ధైర్యముతో కర్తవ్యమును నిర్వహింపుము. శాంతము, సక్రమకృషి లక్ష్యసిద్ధికై తోడ్పడుసాధనములు. పని సాగించుచుండుము. శాంతము, పవిత్రత, ధైర్యసాహసములు, క్రమగత కర్తవ్యనిర్వహణము: ఈగుణగుణములను విస్మరింపకుము. నీవు నిర్మలచిత్తుడవై యున్నంత కాలము, నీ యుదారాశయములను మన్నించునంతకాలము నీ కపజయము కలుగదు — జగజ్జనని నిన్ను పరిత్యజింపదు.

సర్వాశీర్వాదములు నీకే దక్కును.

ప్రేమయుత భవదీయు
వివేకానంద

## 234

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

౬0 ఓక్లే వీథి, ఛెల్సీ,
అక్టోబరు 31, 189౬.

ప్రియ జోజో,

శుక్రవారమునాడు మధ్యాహ్నభోజనమునకు వచ్చి, ఆల్బెమార్లెలో శ్రీకాయిట్టును చూతునేని నాకు అత్యంతానందమగును.

లండనులో వసించు ఇరువురు అమెరికా మహిళలు నెట్టిరుసతి, నెట్టిరుకుమారి అనువారు కడచినరాత్రి తరగతికి వచ్చిరి—వీరు తల్లిబిడ్డలు, ఈయుద్యమముపట్ల వారు విశేషసానుభూతి జూపిరి. ఛామియరు గృహమందలి తరగతి ముగిసినది. రాబోవు శనివారము రాత్రినుండి నాబసయందే తరగతుల నారంభింతును. ఈ తరగతులు నిర్వహించుటకై ఒకటిరెండుపెద్దగదులు నాకు లభించు నని నమ్ముచున్నాను—మోన్క్యూర్కాన్వే నైతిక సంఘమునుండి నా కాహ్వానము వచ్చినది. అచట నేను 10 వ తేదీనా డుపన్యసింతును. రాబోవు మంగళవారమునాడు నేను బల్బోసంఘములో నుపన్యసింతును. ఈశ్వరుడు తోడ్పడును. శనివారము నాడు నేను నీవెంబడి రాగల నని చెప్పలేను. ఎట్లైనను ఆతావున నీవు సుఖముగ కాలక్షేపము చేయగలవు. స్టర్డీ దంపతులు మిగుల యోగ్యులు.

ప్రేమాశీస్సులతో,

వివేకానంద

మలిమాట: నాకై కొన్ని కాయగూరలను వేవర్తకుని ద్వారానైనను తెప్పింపుము. అన్నముపై నామనసు అంతగా వ్రాలుట లేదు. రొట్టెయైనను చాలును. నేనిప్పుడు భీకర శాకాహారినైతిని.

వి.

## 235

(శ్రీ ఇ. టి. స్టర్డీకి)

80 ఓక్లే వీథి, చెల్సీ,
అక్టోబరు 31, 1895.
సాయంకాలం 5 గంటలు.

ప్రియ మిత్రమా,

ఇంతకుమున్నె ఇరువురు యువకులు సిల్వర్లాక్ అను నాతనిను అతనిస్నేహితుడును నిష్క్రమించిరి. కుమారి ముల్లరు కూడ నేటి యపరాహ్ణమున వచ్చి, ఈ యిరువురు యువకులు ప్రవేశించుటకు మున్నె తరలిపోయినది.

ఈయిరువురిలో నొకడు ఇంజనీరు, రెండవవాడు ధాన్యపు వ్యాపారమున నున్నాడు. ఆధునిక తత్త్వశాస్త్ర భౌతికశాస్త్రములను వారు విశేషముగా పఠించిరి. వీనిలోని ఆధునికసిద్ధాంతములకును ప్రాచీనహిందుశాస్త్రసూత్రములకును గల సామ్యము నవలోకించి వారు మిగుల నాశ్చర్యాన్వితులైరి. ఇరువురు మిగుల యోగ్యులు, మేధావులు; విద్వాంసులు. వారిలో నొకడు క్రైస్తవ మతసంస్థనుండి వెలుపలకు వచ్చినాడు. తానుకూడ నిట్లొనరింప దగునా తగదా యని ఆతడు నా సలహా కోరినాడు. వీరిని కలిసికొనిన పిదప రెండు ముఖ్యాంశములు నామనసున పొడకట్టినవి. మొదటి విషయ మిది: మనచేతిలోని గ్రంథమును సత్వరమే ముగించివేయవలెను. అట్లొనరించితిమేని, ఇంచుకంతైన రహస్య సిద్ధాంతాన్వేషణమునకు గడంగక తాత్త్వికమతాభిరుచి గల వ్యక్తులహృదయములను స్పృశింపగలము. నామతమునకు సంబంధించిన కర్మకాండ యేమో తెలిసికొనవలె నని వారు మక్కువపడుచున్నారు. దీని కెఱిగి నేను కన్నులు తెఱచితిని. సాధారణ ప్రపంచము కొండొకస్థూలస్వరూపమును కాంక్షించును. నిక్కముగా సర్వసామాన్యదృష్టిలో చిహ్నములందును, ప్రతీకములందును స్థూలవ్యక్తీకరణమునందిన తత్త్వశాస్త్రమే మతము.

కర్మకాండయొకటి మిక్కిలి ఆవశ్యకము. దీనితో చర్చిని బోలు నొకసంస్థ అవసరమైనది. సాధ్యమైనంతత్వరలో మనము కొంత కర్మకాండను నిర్ణయింపవలెను. నీవు శనివారము ప్రాతః కాలమున గాని, అంతకుమున్నుగాని వచ్చితివేని, మన మిరువురము గలసి ఏషియాటిక్సొసైటీ లైబ్రరీకి పోవుదము. అట్లు కానిచో నాకొఱకై నీవు హేమాద్రికోశ మను గ్రంథమును సంపాదింపుము. అందు మనకు కావలసిన సామగ్రి లభించును. నీవు వచ్చునపుడు దయతో ఉపనిషత్తులను గొని రమ్ము. మానవుని పుట్టుకనుండి మరణమువఱకు విస్తరిల్లియుండు తాత్త్విక మతాంశములను పురస్కరించుకొని మన మొక మహత్తరప్రబోధ వ్యవస్థను నిర్ణయింతము. బిగువు లేని వట్టి తాత్త్వికవ్యవస్థ ప్రజల దృష్టిని చూఱగొన లేదు.

మనము తరగతులను ముగింపక మున్ను, ఇట్టిగ్రంథమును తయారొనరించి, దాని పురస్కరించుకొని, ప్రజాళిమ్రోల ఒకటి రెండు ప్రబోధవ్యవస్థలు కొనసాగించి దానిని ప్రచురింపగల్గితి మేని, కృతకృత్యులము కాగలము. వారొక మతసంఘమును నిర్మాణము చేయవలె నని ఉద్దేశించుచున్నారు; కర్మకాండ, ఆచారవ్యవహారము కావలె ననుచున్నారు.___ అను నాతడు పాశ్చాత్యులపై నెట్టి ప్రభావమును ప్రసరింపజేయుట కసమర్థుడగుట కొక హేతువు ఈయక్కఱ నెఱుగకుండుట. వాని యపజయమునకు ఇంకను కారణములు కలవు.

పూర్వోక్తమైన నైతికసంఘము (ఎథికల్ సొసైటి) తన యాహ్వానమును నేను మన్నించినందులకు ధన్యవాదము లర్పించుచు మఱియొక లేఖ వ్రాసినది. తమ సంస్థకు సంబంధించిన పత్రముల ప్రతిని కూడ పంపిరి. పదినిమిషములు తమసమక్షమున చదువుటకై ఒకగ్రంథమును గొనిరా వలసిన దని వారు నాకు

వ్రాసిరి. నీతో నీవు ఒకగీతానువాదమును, బౌద్ధజాతకకథల అనువాదమును గొని వత్తువా ?

తొలుత నిన్ను చూడక ఈవిషయమున నే నేమియు జేయను.

ప్రేమాశీస్సులతో,

వివేకానంద

## 236

(శ్రీ అభేదానందస్వామికి)

శ్రీ ఇ. టి. స్టర్డీగారింట,
హైవ్యూ, కేవర్షాము,
రీడింగు, ఇంగ్లండు,
అక్టోబరు, 1895.

ప్రియ కాళి,

ఇంతకు మున్ను నేను వ్రాసినజాబు నీ కందియుండును. నాలేఖల నన్నిటిని పైని తెలిపిన చిరునామాకు పంపుచుండుము. స్టర్డీ తారకసోదరునకు పరిచితుడు. మే మిరువురము ఇంగ్లండులో కొంతసంచలనము బుట్టింప నుద్దేశించుటచే ఆతడు నన్ను తన తావునకు గొనివచ్చినాడు. ఈవత్సరమున నవంబరులో నేను అమెరికాకు పోయెదను. కావున సంస్కృతాంగ్లములలో పాండితి గల వ్యక్తి నా కిపుడు మిక్కిలి అక్కరయై యున్నాడు. ముఖ్యముగా ఇంగ్లీషులో నాతడు విశేషపరిజ్ఞానము గలిగియుండవలెను. శశిగాని, శారదుడు గాని, నీవు గాని వచ్చుట మేలు. నీ కిపుడు సంపూర్ణముగా ఆరోగ్యము కలిగినచో బాగు; నీవే రావచ్చును. లేకున్న శరత్తును పంపుము. నే నిచట విడుచు భక్తులకు బోధిచుట, వారిచే వేదాంతమును చదివించుట, ఆంగ్లములోని కించుక

అనువాదము చేయుట, అపు డపుడు ఉపన్యాసములు కావించుట, ఇచట చేయవలసిన పను లివి. "క్రియ ఆధ్యాత్మికదృష్టిమ్రోల మబ్బు కా వచ్చును" ఎక్సు—అనునాతడు రావలె నని మిక్కిలి మక్కువ పడుచున్నాడు. కాని గట్టిపునాదిపడిననే కాని లేనిచో సమస్తము పడిపో వచ్చును. ఈలేఖతో నీకొక చెక్కు పంపుచున్నాను. ఎవరు వచ్చిన నేమి, బట్టలను అవసరమైన వస్తువులను కొనుము. మాస్టరుమహాశయుడు మహేంద్రబాబు పేరిట చెక్కును పంపెదను. గంగాధరునకు చెందిన టిబెట్టుఅంగరక మరములో నున్నది. ఈరీతి అంగరకను కాషాయవర్ణపువస్త్రముతో కుట్టింపుము. మెడపట్టీ ఇంచుక ఎత్తుగ నుండునట్లు కుట్టింపుము— అనగా అది కంఠమును కప్పున ట్లుండవలెను.... ముఖ్యముగా నీకొక ఉన్నికోటు వస్త్రములపై తొడుగుకొనుటకై అవసరమై యుండును. ఏలయన ఇచట చలి అధికము. ఓడపై పయనించు నపుడు ఈరీతి కోటును నీవు ధరింపవేని, నీవు విశేషముగ బాధ పడెదవు....నే నొక రెండవతరగతిటిక్కెట్టును పంపుచున్నాను. ఏలయన మొదటితరగతి రెండవతరగతి శయ్యావ్యవస్థలకు చెప్ప దగినంత వ్యత్యాసము లేదు. శశిని పంపుటకే నిశ్చయించితివేని, ఓడలో వానికి శాకాహార మి మ్మని ముందుగనే ఓడవంటగదిలోని పరిచారకునకు కబురు పంపుము.

బొంబాయికి పోయి, కింగ్, కింగ్ అండు కో (ఫోర్టు బొంబాయి) అను కంపెనీవారిని చూచి, నీవు స్టర్డీకి చెందినవాడవని చెప్పుము. వారు ఇంగ్లండుకు పోవుటకై నీ కొక టిక్కెట్టు ఇత్తురు. తగు సదుపాయములు సమకూర్పవలసినదిగా తెలుపుచు ఆకంపెనీ కిందుండి లేఖ యొకటి వ్రాయుదురు. నీరాకకు టిక్కెట్టు కొనిపెట్టు పనిని తనబొంబాయిప్రతినిధి ద్వారా చేయింపు డని నేను ఖేత్రిమహారాజునకు జాబు వ్రాయుచున్నాను. ఈనూట యేబదిరూకలు నీప్రయాణసన్నాహమునకు చాలక పోవుచో కావలసిన తక్కిన పైకమును రాఖాలునొద్దనుండి కైకొనుము.

ఆపైకమును నేను వానికి తరువాత పంపెదను. చునిబాబుకు నేను పంపిన పైకమునకు, వానికడనుండి తిరుగురసీదు రాలేదు. సాధ్యమైనంతత్వరలో బయలుదేఱిరమ్ము, మహేంద్రబాబు నాకలకత్తా ప్రతినిధి యని ఆతనితో చెప్పుము. నీ తరఫున తాను కలకత్తా వ్యవహారముల నన్నిటిని చక్కబెట్టుటకై సంసిద్ధుడై యున్నట్లు స్టర్డీకి తరువాతి టపాలో జాబు వ్రాయు మని వానితో చెప్పుము, ఇంగ్లండులో స్టర్డీ నా కార్యదర్శి; కలకత్తాలో మహేంద్రబాబు కార్యదర్శి; అళసింగుడు మదరాసులో కార్యదర్శి; వీ రిట్లు నాకు తోడుపడుచున్నారు. ఈవిషయము మదరాసులోని వారికి కూడ తెలుపుము. మనమందఱము నడుముగట్టనిచో ఏపనియైన జరుగునా? చుఱుకుతనమును వహింపుడు. "ధైర్యవంతులను, శక్తివంతులను అదృష్టము వలచును" వెనుకకు తిరిగిచూడవలదు. —ముందుకుజూచి అంజ వేయుడు. అనంతక్రియాశక్తి అనంతమైన ఉత్సాహము, అనంతమైన సాహసము, అనంతమైన శాంతము. ఇవి ఉన్నపుడే ఘనకార్యములు నిర్వర్తిలును. సమస్త ప్రపంచమును మనము జాజ్వల్యమాన మొనరింపవలెను.

స్టీమరు బయలుదేఱునాడు, ఇంగ్లండు కే నౌకలో నీవు వచ్చుచున్నావో తెలుపుచు స్టర్డీ కొక జాబు వ్రాయుము. అట్లు తెలుపవేని, లండను చేరినంతనే నీవు పెక్కు చిక్కులలో పడ వచ్చును. సరాసరిగా లండనుకు వచ్చు నౌకలోనే ప్రవేశింపుము. ఇట్లొనరించితివేని ప్రయాణము కొలది దినములు ఆలస్యమైనను టిక్కెట్టు సొమ్ము తగ్గును. ప్రస్తుతము మనకు చాలినంత ధనము లేదు. కాలక్రమమున మనము మతప్రచారకులను పలువురను ప్రపంచమందలి సర్వసీమలకు పంపగల్గుదుము.

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 237

(శ్రీ ఇ. టి. స్టర్డీకి)

80 ఓక్లె వీథి, చెల్సి,
నవంబరు 1, 1895.

ప్రియ మిత్రమా,

బల్లెరెను (?) సొసైటీ టిక్కెట్ల సంఖ్య 35.

విషయ మిది: "భారతీయతత్త్వశాస్త్రము, పాశ్చాత్య సంఘము"—అధ్యక్షుని పేరు తెలుపబడ లేదు.

వానిని పంపు మని నీవు కోరకపోవుటచే, నేను పంపుట లేదు.

నీ లేఖలు సకాలమున కందినవి.

భవదీయ సదంతర్గత
వివేకానంద

## 238

(శ్రీ ఇ. టి. స్టర్డీకి)

నవంబరు 2, 1895.

ప్రియ మిత్రమా,

నీవు తెలిపినది సత్య మని నాయభిప్రాయము. మన ప్రణాళిక ననుసరించి మనము పనిచేయుదము. కార్యక్రమములు సమధికవృద్ధి నందును గాక.

ఉపన్యాసమునకు సంబంధించిన జ్ఞాపికను పంపుచున్నాను.

అసాధారణమైన అవరోధము తలసూపకున్న నేను ఆదివారమునాడు వత్తును.

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 239

(శ్రీ అఖండానందస్వామి)

లండను,
నవంబరు 13, 1895.

ప్రియ అఖండానందా,

నీయుత్తరమందుకొని చాలఆనందించితిని. నీవు మంచిపని చేయుచున్నావు. ఆర్ — అనునాతడు మహోదారుడు, మహావదాన్యుడు. అట్లని, మనము చిత్తము వచ్చినట్లు ఆతనియౌదార్యమును వినియోగించుకొనరాదు. శ్రీమాన్ — అనునాతడు ధనమును ప్రోగుచేయుట దొడ్డక్రియయే యగును; కాని నాయనా, ఇది విడ్డూరపుప్రపంచమని గుర్తింపుము. భువనాధినాథులగు బ్రహ్మవిష్ణులకు సయితము కామినీకాంచనముల పిడికిళ్లనుండి విడివడుటమిగుల కష్టముగానుండును. విత్తమునకు సంబంధించిన ఆవంత జోక్య మెందున్నదో, అచట అపోహ తలయెత్తుటకు చాలఅవకాశమున్నది. కాబట్టి మఠముపక్షమున విత్తమును ప్రోగుచేయుపనికెవ్వరును చేయిజేసికొనకుందురుగాక! ...నాపేరుతోగాని లేక మనపేరుతోగాని మఠసంస్థాపనమునకుగాని లేక యీరీతి మఱేదేని ఆధ్యాత్మికక్రియకుగాని గృహస్థుడెవ్వడైన డబ్బు ప్రోగొనరించుటకై పూనుకొనని నీవెన్నడైన వింటివేని, ఆతనిని నమ్మక వానికి చేయూతనీయకుండుట నీప్రథమ కర్తవ్యమైయుండవలెను. నిరుపేదలైనగృహస్థుల నీ కర్తవ్యమున ఎంతమాత్రమును నమ్మరాదు. ఇట్టిగృహస్థులు తమయిబ్బందులను తొలగించుకొనుటకై పెక్కు పన్నాగములను పన్నుచుందురు. కావున విశ్వసనీయుడైన భక్తుడుగాని, హృదయముగల గృహస్థుడుగాని ధనవంతులై మఠమును స్థాపింపవలెననిగాని వారెట్టి సత్కార్యమునకు గడంగవలెననిగాని ఉద్దేశించుచో లేక

సంచితమైనవిత్తము విశ్వాసపాత్రుడును, ధనవంతుడునైన గృహస్థునిహస్తమున చేర్పబడుచో మేలేయగును. లేకున్నచో నిట్టి పనులందు చేతులుజొనుపకుము. ఇట్టి క్రియలకు చేయిజేసికొనవలదని ఇతరులను వారింపుము. నీవు బాలకుడవు మాత్రమే! సువర్ణ వాగుర మెట్టిదో యెఱుగవు. పరమనైష్ఠికుని సయితము పరిస్థితు లొక్కొకపుడు ప్రపంచకునిగా మార్చివేయును. ప్రపంచ మందలి రీతి యిది....

ఒకేత్రాటిపై నిలిచి, సంయుక్తముగ నడుముగట్టి క్రియకు గడంగుట మన ప్రకృతికి ప్రతికూలమైనపని. మనదారుణదుఃస్థితి కిది మూలకారణము. ఒరుల ముదల నౌదలదాల్చు నాతడే యొరుల నాజ్ఞాపింపవలెనో యెఱుగగలడు. విధేయతను తొలుత నేర్చుకొనుము. ప్రబలస్వాతంత్ర్యేచ్ఛగల పాశ్చాత్యులందు విధేయతయను దొడ్డగుణముకూడ మిగుల ప్రబలమై యున్నది. ఎవరికివారే అధికులమని ఊహించువారము మనము. —ఈయహంభావము ఎట్టి కర్తవ్యనిర్వహణమునకును పనికివచ్చునది కాదు. సాహసోపేత క్రియాశక్తి, అవధులెఱుగని ధైర్యశౌర్యములు, అద్భుతమైన ఆంతరంగిక బలము, సమగ్రమైన అడకువ—వీనివలననే వ్యక్తిగత పునరుద్ధరణము, జాతీయపురోభివృద్ధి సుసాధ్యములగును. ఈ గురుగుణములు మనలో శుద్ధ పూజ్యము.

నీవు కొనసాగించుచున్నట్లుగా కర్తవ్యమును నిర్వహింపుము. కాని పతనముదెస ప్రత్యేకశ్రద్ధవహింపవలెను సుమీ! జె—బాబు నా కడకొక హిందీపత్రికను పంపినాడు. ఆల్వారు వాసియైన పండిత ఆర్ — అను నాతడు నాచికాగో యుపన్యాసానువాదము నిందు ప్రకటించినాడు. ఆయిరువురకు నాధన్యవాదములను తెలిపి, వారికి నేను ప్రత్యేకముగ ఋణపడి యున్నానని చెప్పుము.

ఇపుడు నీతో ప్రత్యేకించి కొంత చెప్పచున్నాను. రాజపుత్రస్థానములో ఒక కేంద్రమును నెలకొల్పుటకై ప్రత్యేకశ్రద్ధవహింపుము. జయపూరును అజ్మీరును పోలు కేంద్రమై అదియుండవలెను. ఆల్వారు ఖేత్రీలవంటి స్థలములందు శాఖలు నెల కొనవలెను. నీవు ఎల్లరతో సమరసభావముతో మెలగవలెను. ఎవరితోను మనకు పొరపొచ్చెములు చెల్లవు. పండిత నారాయణ దాసుకు నాగాఢానురాగపరిష్వంగము నందింపుము—, ఆతడు విశేషోత్సాహముగలవ్యక్తి; శక్తిసమన్వితుడు. సకాలమున కార్యతత్పరతను ప్రదర్శింపగల సమర్థుడు. `మ — కును — జీకిని నా ప్రేమాకాంక్షలను తెలుపుము. ఒక మతసమితియో అట్టి మఱొకటో అజ్మీరులో తలసూపినదనివిన్నాను.— అదేమో తెలిసికొనుము. దానిని గుఱించిన సమస్తవివరములను తెలిసి కొన గోరుచున్నాను.

మ—బాబు తాను, మఱికొందఱు నాకు జాబులు వ్రాసినట్లు లిఖించినాడు. కాని, యింతవఱకు నాకెట్టి లేఖ అంద లేదు.…మఠములనుగాని, కేంద్రములనుగాని, అట్టి సంస్థలను మఱి వేనినిగాని కలకత్తాలో స్థాపించినందువలన ప్రయోజనములేదు. వానికి తగినతావు వారణాసి. వీనిబోలు ఎన్నెన్నో ప్రణాళి కలు నామనసులోనున్నవి. కాని వీనిసంస్థాపనము ధనముపై ఆధారపడియున్నది. ఆప్రణాళిక లేవియో మీరు క్రమక్రమముగ నెఱుగగలరు. మనయుద్యమము ఇంగ్లండులో క్రమాభివృద్ధి నందుచున్నదని పత్రికలవలన నీ వె ఱి గి యే యుం దు వు. ఏయుద్యమమైనను ఈదేశములో కొంతపురోభివృద్ధినందవలెననిన కొంత సమయముపట్టును. కాని ఉత్సాహవంతుడైన ఆంగ్లే యుడు ఏదేని యుద్యమమునకు బుజమొడ్డినయెడల, దానిని సడల నీయడు. అమెరికనులు చురుకుతనము గలవారు; కాని వారు నిప్పుమీది గడ్డిపరకను బోలువారు. వారి యుత్సాహము నిముసములో చల్లారును. రామకృష్ణపరమహంస అవతారపురుషు

డని, ఇంకను ఏమేమో అని ప్రజలు మోల ప్రచారము చేయకుము —అన్న తావున నా అనుయాయులు కొందఱుకలరు. వారి నొక కంట జూచుచుండుము....నీకనంతశక్తి చేకుఱును—అడల వలదు. పవిత్రచిత్తుడవుకమ్ము. హృదయమున విశ్వాసప్రదీపమును వెలుగ నిమ్ము. అడకువతో మెలగుము.

బాలురవివాహములు కూడదని బోధింపుము. శాస్త్రము లేవియు అట్టివానిని శాసింప లేదు, మఱి అనుమతింప లేదు; బాలికలకు పిన్నవయసు పెండ్లిండ్లనుగుఱించి ప్రస్తుత మేమియు పలుకకుము. మగపిల్లల పెళ్లిళ్లను నిరోధించితివేని, ఆడుపిల్లల పరిణయములు తమంతదామే నిలిచిపోవును. బాలికలు తమకు తామే యొండొరులతో ముడిపెట్టుకొనరుకదా! అచ్యుతానందుడను సన్న్యాసి యొకడు లాహోరులోని ఆర్యసమాజమున వసించు చుండెను. ఆతడిపు డెందున్నాడో తెలుపుమని ఆ సమాజకార్య దర్శికి వ్రాయుము. ఆవ్యక్తిని గుఱించి ప్రత్యేకమైనవాకబు చేయుము....—భయపడకుము.

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 240

(శ్రీ అళసింగపెరుమాళుకు)

లండను,
నవంబరు 18, 1895.

ప్రియ అళసింగా,

ఇంగ్లండులో నాకార్యక్రమమునిజముగ మహోజ్జ్వలముగ నడచుచున్నది. దీనినిచూచినపుడునాకేఆశ్చర్యముకలుగుచున్నది. ఆంగ్లేయులు విశేషముగా పత్రికాప్రచురణమునకై కడంగరు.

కాని, వారు మానముగా పని చేయుదురు. అమెరికాలోకంటె ఇంగ్లండులో ఎక్కువపని జరుగునని నాకు చాలనమ్మకము కలదు. నావాక్కులు వినుటకై ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చుచున్నారు. తరగతులందు కూర్చుండుటకై ఎల్లరకు తావుచిక్కుట లేదు. కావున వారు నేలపై చతికిలపడుచున్నారు. వీరిలో స్త్రీలును గలరు. భారతవియత్తలముక్రింద, బహుశాఖోపశాఖా సమన్వితవటవృక్షముదిగువ తాముపవసించుచున్నట్లు భావన చేయుడని నేను వారితో తెలుపుచుందును. ఈయూహ వారికి మిక్కిలి నచ్చినది. ఇంమండి నేను రాబోవువారమున నిష్క్రమింపవలెను. అందులకు వారు మిగుల దుఃఖపడుచున్నారు. నేనింతత్వరలో నింమండి కదలితినేని ఇచటిపనికి కొంత చెఱుపుఘటిల్లునని కొందఱనుచున్నారు. నేనట్లు యోచింపను. నేను మనుష్యులపైగాని మఱి యైహికపరికరములపైగాని ఆధారపడువాడనుగాను. నేను కేవలము భగవంతునిపై ఆధారపడుచున్నాను. నన్ను నిమిత్తమాత్రునిగ జేసికొని ఆయనయే పని సాగించుచుండును.

...వంచకుడవుగాక, పిఱికివాడవుగాక, ఎల్లరను సంతోషపెట్టుము. పవిత్రహృదయముతో, దృఢచిత్తముతో నియాశయములను నిలుపుకొనుము. నీమార్గమున నేడన్ని యడ్డంకులు నిలిచినను, కాలక్రమమున ప్రపంచము నీనుడువులకు నీవలొగ్గి తీరును.......

"మరణించుటకు సయితము నాకు వేళలేదు" అని బంగాలీలనుచుందురు. నేను కర్తవ్యము సలుపుచుందును; కర్తవ్యము సలుపుచుందును: కర్తవ్యము సలుపుచుందును. నాయాహారమును నేను సంపాదించుకొందును. నా దేశమునకు సాహాయ్యము సలిపెదను; ఒంటరినై నాధర్మమును నేను నిర్వహించుచున్నాను. ఇందుకై శత్రువులనుండియు, మిత్రులనుండియు సయితము మర్వ్యమర్శ బహూకృతిగా నాకు లభించుచున్నది. కానిమ్ము, మీరం

దఱు బిడ్డలు. తలయొగ్గి నేను సమస్తముసహింపవలెను. కలకత్తా నుండి సన్న్యాసినొక్కరుని పంపుడని అచటి మిత్రులకు వ్రాసితిని. ఆతడురాగానే లండనులోని కార్యక్రమమును వాని కప్పగింతును. ఈరీతిమఱొకవ్యక్తి—'నావాడు' అనదగినవ్యక్తి — అమెరికాలో సేవసలుపుటకై అక్కటై యున్నాడు. సమస్తాధ్యాత్మికాభివృద్ధికి గురుభక్తి మూలబంధము.

...నిరంతరపరిశ్రమ నిక్కముగ నాకు విశేషాయాసము గలిగించుచున్నది. నేను కష్టపడినట్లు మఱొక హిందువు కష్టపడి యుండినచో, ఆతడు చచ్చెడివాడే.......విశేషవిశ్రాంతికై భారత దేశమునకురావలెనని మక్కువపడుచున్నాను.

ప్రేమాశీస్సులతో,

సదా భవదీయ
వివేకానంద

## 241

(శ్రీమతి బుల్ని౯కి)

లండను,
నవంబరు 21, 1895.

ప్రియ శ్రీమతి బుల్ని౯,

ఈనెల 27 వ తేదీనాడు, రాబోవుబుధవారమున బ్రిటానియా అను నౌకలో నేను ప్రయాణము సలిపెదను. ఇచట నేను నిర్వహించిన కర్తవ్యము మిగులసంతృప్తికరముగా నున్నది. రాబోవు వేసవికాలములో నిచట మహోజ్జ్వల కార్యక్రమము జరుగునని దృఢముగ నమ్ముచున్నాను.

భవదీయ ప్రేమయుత
వివేకానంద

## 242

(శ్రీ ఇ. టి. స్టర్డీకి)

ఆర్. ఎం. ఎస్. "బ్రిటానిక్"

ప్రియ ధన్య,

ఇంతవఱకు ఓడప్రయాణము చక్కగ నడచినది. నౌకలోని ప్రత్యేకోద్యోగి (ప్రయాణికుల సౌకర్యములను గమనించు ఉద్యోగి) నాయెడల ప్రత్యేకదయజూపి నాకై ప్రత్యేకమైనగది యిచ్చినాడు. ఆహారమునుగుఱించి మాత్రము పెద్ద చిక్కు ఏర్పడినది. అన్ని వేళలందు మాంసము ప్రత్యక్షమగుచున్నది. నేడు నాకు శాకాహారమిత్తుమని వారు వాగ్దానముచేసిరి.

ఓడకిపుడు లంగరు వేయబడినది. మంచు దట్టమైయుండుట వలన నౌక ముందుకు పోజాలకున్నది. కావున ఈతఱుణమును చేజిక్కించుకొని, కొన్ని జాబులను వ్రాయుచున్నాను.

ఈమంచు మిగుల విడ్డూరమైనది, ప్రమోదముచేకూర్చు సూర్యకాంతి విస్తారముగనున్నను, దట్టమైనమంచును చొచ్చుకొని పోవుట కష్టమగుచున్నది. నా పక్షమున చంటిబిడ్డను ముద్దాడుము, నీకు స్టర్డీసతికిని నా వాత్సల్యభరితాశీర్వాదములు.

భవదీయుడు
వివేకానంద

మఱిమాట : ముల్లరుకుమారికి నావాత్సల్యమునందింపుము. రాత్రివేళ ధరించు అంగీని అవెన్యూరోడ్డులో మఱచితిని, నాట్రంకుపెట్టె ఓడకొట్టరువునుండి వచ్చువఱకు అంగీ లేక ఉండవలెను.

## 243

(ఆల్బెర్టాకు)

ఆర్. ఎం. ఎస్. "బ్రిటానిక్"
గురువారము—ఉదయము,
డిసెంబరు 5, 1895.

ప్రియ ఆల్బెర్టా,

మిగుల సుందరమైన నీ లేఖ కడచిన సాయంకాలమున అందినది. నన్ను జ్ఞాపకముంచుకొని నీకారుణ్యమును వ్యక్తీకరించితివి. అచిరములో నేను "దివ్యమిథునమును" చూచుటకై పోయెదను. లెగ్గెట్టు ఒకయోగి — ఇట్లని నీతో నేనీవరలో తెలిపితిని. నీతల్లి రాజ్ఞిగనే పుట్టినది. పరిపూర్ణముగ నామె రాణి యనియే చెప్పనగును—ఆమెహృదయము యోగినీహృదయము.

నీవు ఆల్ప్సు పర్వతములలోని హాయి ననుభవించుచున్నందుల కానందించుచున్నాను. వానిదృశ్యము మిగుల మనోహరమై ఆశ్చర్యకరమైనది. ఇట్టి రమణీయదృశ్యములందే మనుష్యాత్మ మోక్షమును కాంక్షించును. ఒకజాతి ఆధ్యాత్మికముగ నిప్పచ్చరమునే అనుభవించుచున్నను, అది శారీరకస్వాతంత్ర్యమును వాంఛించును. ఒక స్విస్ యువకుని నేను లండనులో కలసికొంటిని. ఆతడు నాతరగతులకు హాజరగుచుండువాడు. లండనులో నాకు విశేషజయలాభముకలిగినది. ధ్వనితో ప్రతిధ్వనించు నగరము నాకు నచ్చకపోయినను అందలిప్రజలు నాకు విశేషపరితోషము గలిగించిరి. ఆల్బర్టా, మీదేశములో ప్రప్రథమమున వేదాంత సిద్ధాంతములను మూర్ఖులైన కొందఱు దాంభికులు ప్రవేశపెట్టిరి. వీరివలన నిలిచిన ఇక్కట్టులను నెట్టివేసియే ఒకడు తనమార్గమును కనుగొనవలెను. అమెరికాలో ఉన్నతస్థాయిలోనున్న కొలది

మంది పురుషులును, స్త్రీలును మాత్రమే నాతరగతులకు హాజ రగుచుండుట విలోకించియుందువు. అమెరికాలోని ఉన్నతవర్గ వ్యక్తులు ధనికులగుటవలన, యూరపియనుల ననుకరించుచు, హాయిగ జీవితమును గడపుటకై తమ విత్తమును వారు వ్యయ మొనరించుటకై కాలమెల్ల వినియోగింతురు. ఇంగ్లండులో పరిస్థితి వేఱైయున్నది. మేలిపండితులు వేదాంతసిద్ధాంతములను దేశమందు ప్రవేశపెట్టిరి. ఇంగ్లండులో ఉన్నత వర్గస్థులలోననేకులు భావుకులు. కావున నాకార్యక్రమమునకై అనుకూలమైన పూర్వ వ్యవస్థ నిర్ణయమై యుండుటెఱిగి నీవాశ్చర్యపడెదవు. అమెరి కాలో కంటె ఇంగ్లండులో నా కార్యక్రమము ప్రజాహృదయము లను ఘనతరప్రభావముతో చూఱగొనునని నేను దృఢముగ విను చున్నాను. ఆంగ్లజాతికి అత్యద్భుతమైన పట్టుదల కలదు.—ఇది వారి నైసర్గికజాతీయలక్షణము. దీనినెఱిగి వారిలో నెలకొను క్రియాప్రణాళిక ఎట్లు ఫలోన్ముఖమగునో నీవే యోచింపుము. ఈవరలో ఇంగ్లండును గుఱించి నాకుండిన అభిప్రాయమును సత్య సందీపిత ప్రత్యక్షపరిశీలనమువలన విశేషముగ మార్పుచెందినది. ఇట్లని ఆనందముతో నేనంగీకరించుచున్నాను. జర్మనిలో నింత కంటె మహత్తరముగ కార్యక్రమమును నెఱపగలమని నేను దృఢముగ విశ్వసించుచున్నాను. రాబోవు గ్రీష్మఋతువున నేను ఇంగ్లండుకు తిరిగివత్తును. నేను వచ్చులోపల నాకార్యక్రమమును మిగుల చాకచక్యముగలవారు నిర్వహింతురు. కుమారి జోజో అమెరికాలో నాయెడల నెట్టిపవిత్రము, కారుణ్యాబంధురము, ప్రేమ బంధురమునగు చెలికారమును చూపుచుండెడిదో, ఇచటగూడ అట్టినేస్తమును చూపుచున్నది. మీకుటుంబమునకు నేను మిగుల ఋణపడియున్నాను. హాలిస్టరుకును, నీకును వాత్సల్యాబంధు రాశీస్సులను ప్రసాదించుచున్నాను. మంచువలన నౌకకు లంగరు వేయబడినది—కావున నది నిలిచియున్నది. ఓడలో ప్రయాణికుల సౌకర్యములను గనుపెట్టు ఉద్యోగి దయతో నాకై ప్రత్యేకమైన

నొకగది నేర్పాటుచేసినాడు. ప్రతిహిందువు ఒక రాజని ఇచటి వారూహించి, వారిని విశేషముగ గౌరవింతురు.

ఈరాజుచేతిలో గ్రుడ్డిగవ్వైన లేదని వారు తెలిసికొనిన తక్షణమే వారిభ్రమ పటాపంచ లగుట తథ్యము!

వాత్సల్యభరితాశీర్వాదములతో,

వివేకానంద

## 244

(శ్రీమతి బుల్సితికి)

228 పడమర 39-వ వీథి,
న్యూయార్కు,
డిసెంబరు 8, 1895.

ప్రియ శ్రీమతి బుల్సితికి,

నీవు దయతోపంపిన యాహ్వానపత్రము అందినది. ఇందుకు ధన్యవాదములను సమర్పించుచున్నాను. పదిదినములుమిగులవిసుగు పుట్టించుప్రయాణము సలిపినతరువాత కడచిన శుక్రవారమునాడు చేరితిని. సముద్రమున తీవ్రసంక్షోభము విజృంభించినది. నాజీవితములో మొదటిపర్యాయము కడలితెవులు నన్ను పీడించినది...... ఇంగ్లండులో; శక్తిసమన్వితులైన కొందఱు మిత్రుల యధీనమున కార్యక్రమమును విడిచివచ్చితిని. రాబోవు వేసవిలో నేనచటికి తిరిగిపోవువఱకు వారాపనిని చక్కబెట్టుచుందురు. ఇచటి కర్తవ్యమునుగుఱించి ఎట్టిప్రణాళికలును స్థిరపడలేదు. ఇంతలో నొకపర్యాయము డిట్రాయిట్టు చికాగోలకు చన్పునపోయి న్యూయార్కునకు తిరిగి రావలెనని ఉద్దేశించుచున్నాను. బహిరంగోపన్యాసముల వ్యవస బారుగ వదలివేయవలెనని ఉద్దేశించుచున్నాను. బహిరం

గోపన్యాసములవలనగాని, ప్రత్యేకముగ జరగు తరగతులవలన గాని ధనమును చేపట్టుట నాకిష్టములేదు. ఇది దొడ్డపని యగును. కాలక్రమమున ఈరీతి ధనసంపాదనమువలన చెఱుపు ఘటిల్లును, చెడ్డయొరవడి కిది దారితీయును.

ఇంగ్లండులో ఈనియమము ననుసరించి పనిచేసితిని. కొందఱు తమంతదామే ముక్తహస్తములతో పైకమీయ నుంకించినను, నేను స్వీకరింపలేదు. స్టర్డీ ధనవంతుడగుటవలన, విశాల గృహములందు జరగిన ఉపన్యాసములకైన వ్యయమును విశేషముగ తానే భరించినాడు.— మిగిలిన వెచ్చమును నేను భరించినాను. ఈవిధానము చక్కగ సాగిపోయినది. మతవిషయములందు సయితము. (ఈయుపమ చెవికి కటువుగాసోకవచ్చును) విపణివీథులందు వస్తువులను విపరీతముగా చేర్పరాదు. అక్కఱను బట్టియే, పదార్థసంచయముండవలెను గదా! ప్రజలలో నా యుపన్యాసములను వినవలెనను కౌతుక ముదయించుచో, వానికి తగు వ్యవస్థ వారే చేయుదురు. ఈ విషయములను గుఱించి నే నంతగా పట్టించుకొనదలచుటలేదు. ఆడమ్సుసతితోను, లాక్కుమారితోను సంప్రతించినపిదప చికాగోలో కొన్నియుపన్యాసములను సాగించుట సుసాధ్యమని తలంతువేని నాకు వ్రాయుము. పైకమునకు సంబంధించిన ప్రశ్నకు తావే యుండరాదు.

వేర్వేఱు తావులందు, స్వతంత్రవర్గములు ఏర్పాటగుట మేలని నాతలంపు. తమబుద్ధిననుసరించి ఆవర్గములవారు శక్తి వంచన లేక కృషిసలిపెదరు గాక! నామాటందువా, ఏ కార్యక్రమవ్యవస్థయందుగాని తవుల్కొనుట నాయభిమతము కాదు. నీశారీరక మానసికారోగ్యము చక్కగా నున్నదని విశ్వసించుచున్నాను.

భవదీయ భగవద్గత
వివేకానంద

## 245

(శ్రీ ఇ. టి. స్టర్డీకి)

228 పడమర 39 వ వీథి,
న్యూయార్కు,
డిసెంబరు 8, 1895.

ప్రియ మిత్రమా,

సంక్షోభముతో విజృంభించు సముద్రముపై పదిదినముల నౌకాప్రయాణముసాగించి నేను న్యూయార్కును సుఖముగా చేరితిని. పైని తెలిపిన తావులో నామిత్రులు నాకై కొన్ని గదులను అద్దెకుదీసికొనిరి. నేను దానియందే వసించుచున్నాను. అచిర కాలములో తరగతులను ఆరంభింతును. ఇంతలోథి—— అనువారు మిగులనడలి నాకునెగ్గుచేయుటకై శక్తివంచనలేక ప్రయత్నించు చున్నారు. కాని వారును వారి అనుయాయులును ఏమియు చేయజాలక కొఱగానివారై యున్నారు.

లెగ్గెట్టుసతిని, ఇతరమిత్రులను చూచుటకై పోతిని. ఎప్పటి వలె నుత్సాహవంతులై, నాయెడల ఆదరానుగములను చూపు చున్నారు.

ఇచటికి రానున్నసన్న్యాసిని గుఱించి ఇండియానుండివార్త లేమైన వచ్చినవా ?

ఇచట జరుగు కార్యక్రమమునుగుఱించిన వివరణములను నీకు తరువాత తెలిపెదను.

కుమారి ముల్లరుకును, స్టర్డీ సతికిని తక్కినమిత్రులందఱికిని నాశుభాకాంక్షలను తెలిపి, నాపక్షమున శిశువును ముద్దాడుము.

సదా భవదీయ సదంతర్గత
వివేకానంద

## 246

(కుమారి జోసెఫైన్ మెక్లియడుకు)

228 పడమర 39 వ వీధి,
న్యూయార్కు,
డిసెంబరు 8, 1895.

ప్రియ జోజో,

పదిదినములు కష్టభూయిష్ఠమైన నౌకాప్రయాణముసలిపి న్యూయార్కు చేరుకొంటిని. దినములకొలది నాకు అత్యంతము విసుగుగా నుండినది.

యూరపులో పరిశుభ్రమై, సుందరమైన నగరములను చూచిన తర్వాత న్యూయార్కు మిగుల నపరిశుభ్రమై, రోత పుట్టించుచున్నది. రాబోవు సోమవారమునాడు ఇచటిపని ఆరంభించుచున్నాను. నీ మాటలు సురక్షితముగా ఆ దేవతాదంపతుల కందింపబడినవి. ఆవ్యక్తు లిరువురను ఆల్బెర్టా అట్లు పేర్కొను చుండును గదా! యథాప్రకారముగా వారు దయచూపుచున్నారు. సాలొమన్ దంపతులను ఇతరమిత్రులను చూచితిని. వీకస్ సతిని, గెర్న్ససతిని యాదృచ్ఛికముగా కలసికొన్నాను. రోథిన్బర్గరు సతిని గురించిన వార్తలేమియు తెలియరాలేదు. ఈక్రిస్మసులో "స్వర్గకుంతముల" తో కలసి రిడ్జ్లికి పోవుచున్నాను. నీ వందుండవలెనని సదా వాంఛించుచుందును.

ఇసబెల్లా సతి సందర్శనము లభించినదా? ఇతర మిత్రులకు నీకును శుభాకాంక్షపరంపరను తెలుపు చున్నాను.

చిన్నిజాబును వ్రాసినందులకు మన్నింపుము. ఇక ముందు దీర్ఘ లేఖలను వ్రాయుచుందును.

సదా భవదీయ భగవదంతర్గత
వివేకానంద

**247**

(శ్రీమతి బుల్బతికి)

228 పడమర 39 వ వీథి,
న్యూయార్కు,
డిసెంబరు 10, 1895.

ప్రియ శ్రీమతి బుల్బతి,

...కార్యదర్శిజాబు నాకందినది. మీ వేడికోలునుమన్నించి హార్వర్డు ఫిలసాఫికల్ క్లబ్ (తాత్త్వికసంస్థ)లో ఆనందముతో నుపన్యసింతును. నాపూనికలో తలసూపిన ఇబ్బంది నుల్లేఖించుచున్నాను. దీక్షతో నిపుడు గ్రంథరచన సాగించుచున్నాను. నేను పోయినతరువాత నాకార్యక్రమమునకు విశేషించి దోహదములుకాజాలు కొన్ని పాఠ్యగ్రంథములను వ్రాయుచున్నాను. వీని నచిరకాలములో ముగింపవలెనని ఉద్దేశించుచున్నాను. నేను నిష్క్రమించుటకుమున్ను నాలుగు చిన్నగ్రంథములను మిగుల త్వరగ పూర్తిచేయుట నాయుద్దేశము.

ఈ నెలలో నాలుగు ఆదివారములందు జరుగవలసిన ఉపన్యాసములనుగుఱించిన ప్రకటనలు వెలువడినవి. ఫిబ్రవరి మొదటివారములో బ్రూక్లినులో జరుగవలసిన ఉపన్యాసములు డాక్టరు జోన్సు ప్రభృతులచే నేర్పాటు చేయబడుచున్నవి.

వరిష్ఠాశంసలతో,

భవదీయ
వివేకానంద

# 248

(శ్రీ ఇ. టి. స్టర్డీకి)

228 పడమర 39 వ వీథి,
న్యూయార్కు,
డిసెంబరు 16, 1895.

ప్రియ ధన్య,

నీయుత్తరములన్నియు నేఁడొక్క టపాలులోనే వచ్చినవి. కుమారి ముల్లరుకూడ ఒక లేఖవ్రాసినది. శ్రీ కృష్ణానందస్వామి ఇంగ్లండుకువచ్చుచున్నాడని ఆమె ''ఇండియన్మిర్రరు'' అను పత్రికలో చదివినది. ఈవార్త నిజమేని నాకు లభింపగలవారిలో శ్రీకృష్ణానందస్వామి మిగుల సమర్థుడు.

ఇచట నేను వారమున కాఱుతరగతులను నిర్వహించితిని. ఇవి కాక ప్రశ్నలకు సంబంధించిన తరగతి ఒకటి కలదు. ఒక్కొకతరగతికి 70 నుండి 120 వఱకు శ్రోతలు హాజరగుచుండిరి. ఇవికాక ప్రతి ఆదివారము ఎల్లరకై ఒకబహిరంగోపన్యాసము చేయుచున్నాను. కడచినమాసమున నా యుపన్యాసము లొక చిన్నహాలులో జరిగినవి. అందు సుమారు 600 శ్రోతలు హాజరగుచుండిరి. కాని నియమానుసారముగ 900 మందిశ్రోతలు హాజరగుచుందురు. 300 మంది నిలిచియుందురు. చోటులేక 300 మంది హాలునుండి పోవుచుందురు. ఈవారము పెద్ద హాలు లభించినది. అందు 1200 మంది శ్రోతలు కూర్చుండుటకు వీలుండును.

ఈయుపన్యాసములకు హాజరగుటకై ఎట్టిపైకము ఈయనక్కఱలేదు. కాని అద్దెకై కొంతపైకము ప్రోగుచేయబడును. ఈవారములో పత్రికలు నాకార్యక్రమమునుగుఱించి విపుల ప్రక

టనలుచేయసాగినవి. న్యూయార్కులో నే నీవత్సరమున విశేష సంచలనమును పుట్టింపగలిగితిని. నే నిచట వేసవిలోనుండి, ఒక వేసవివిడిది నెలకొలుపజాలితినేని, ఇచటి కర్తవ్యము సుస్థిర మూలబంధముపై నిలిచినదని చెప్పనొప్పును. కాని, మే మాసమున నేను ఇంగ్లండుకు రావలసివచ్చుచుండుటచే, ఇచటిపని అసంపూర్ణముగనే నిలిచియుండును కాని, కృష్ణానందుడు ఇంగ్లండులో సమర్థతతో పనిసాగించుచున్నచో, ఈవేసవి నేను లండనులో నుండకపోయినను, అచటికార్యక్రమమున కెట్టి చెఱుపు ఘటిల్లకుండుచో, నేనిందే గ్రీష్మఋతువున నిలిచి పని కొనసాగింతును.

నిరంతర పరిశ్రమవలన నాయారోగ్యము శిథిల మగుచున్నది. నాకు కొంత విశ్రాంతి అవసరమైయున్నది. మే మీ పాశ్చాత్యపద్ధతులకు, ముఖ్యముగా నిర్ణీతసమయమున కార్యములను నిర్వహించుటకు, అలవాటుపడినవారముగాము. ఈయావిషయములనన్నిటిని నిర్ణయించుభారము నీపై వదలితిని. ఇచట "బ్రహ్మవాదిను" పత్రిక సంతృప్తికరముగ నడచుచున్నది. భక్తిని గుఱించి వ్యాసములను వ్రాయుట కారంభించితిని. నా కార్యక్రమమును గుఱించిన మాసనివేదికను వారికి పంపెదను. కుమారి ముల్లరు అమెరికాకు రావలెనని మక్కువపడుచున్నది. ఆమె వచ్చునోరాదో చెప్పజాలను. నా ఆదివారోపన్యాసములను ప్రకటింపవలెనని ఇచటి మిత్రులుకొందఱు ఉబలాటపడుచున్నారు. మొదటి యుపన్యాసప్రతులను కొన్నిటిని నీకడకు పంపితిని. తరువాతి రెండు ఉపన్యాసముల ప్రతులను కొన్నింటిని రాబోవు టపాలో పంపెదను. అవి నీకు నచ్చుచో, నీకు మఱికొన్ని పంపుమని వారికి సలహాచెప్పెదను. ఇంగ్లండులో ఐదువందల ప్రతులు విక్రయమగునట్లు చూడగలవా? ఇట్లొనరించితివేని తక్కిన వాని ప్రచురణములో వారు విశేషప్రోత్సాహమునందగలరు.

రాబోవు మాసమున నేను డిట్రాయిట్టుకు పోయెదను. అందుండి బోస్టనుకు పోయెదను. తరువాత హార్వర్డు విశ్వవిద్యాలయమున కరిగెదను. అటుపిమ్మట కొంత విశ్రాంతిపడసెదను. నేను లేక పోయినను, కృష్ణానందునివలన నచటి పనులు కొనసాగుచుండుచో, తదనంతరమే నేను ఇంగ్లండుకు వత్తును.

ప్రేమాశీస్సులతో,

సదా భవదీయ
వివేకానంద

## 249

(శ్రీ అళసింగపెరుమాళుకు)

228 పడమర 39 వ వీథి,
న్యూయార్కు,
డిసెంబరు 20, 1895.

ప్రియ అళసింగా,

...ఓర్పు గలిగియుండుడు. ప్రాణమునకైనను తెగించి విశ్వాసపూర్ణులరై యుండుడు. మీలో మీరు పోరాడుకొనకుడు. ఆర్థికవ్యవహారములలో పరిపూర్ణవిశుద్ధి కలిగియుండుడు... ఇంకను ఘనకార్యములను మనము చేయనున్నాము....మీకు విశ్వాసమును సత్యపరత్వమును భక్తియు నున్నంతకాలము సమస్తమును మేలొందును.

...సూక్తములను అనువదించు నప్పుడు ప్రాచ్యభాషాధ్యేతల నించుకైన లక్ష్యపెట్టకుడు. భాష్యకారులపట్ల ప్రత్యేకశ్రద్ధ చూపుడు. ప్రాచ్యభాషాధ్యేతలకు శాస్త్రమం దొక్క అక్షరమైనను అర్థము కాదు. మతవేదాంతపరిజ్ఞానభాగ్యము శుష్కభాషాతత్త్వశాస్త్రజ్ఞులకు లేదు.........ఇందుల కుదాహర

ణము:—ఋగ్వేదమందలి "ఆనీదవాతమ్" అనుమాట "ఊపిరి పీల్చుకొనకయే అతడు జీవించియుండెను" అని అనువదింపబడినది. నిజమున కిది ప్రధానప్రాణమునుగూర్చి చెప్పుచోటు. అవాతం అనుటకు కదలనిది అని వ్యుత్పత్త్యర్థము. కల్పమునకు ముందు (విశ్వశక్తి యగు) ప్రాణము ఉండు దశను ఇది వర్ణించుచున్నది. భాష్యకారులవాక్యములను తిలకింపుడు. వివరించునప్పుడు యూరోపియను పండితు లనబడు వారిని అనుసరింపకుడు. మన ఋషులనే అనుసరింపుడు. ఏమి తెలియును ఆపండితులకు?

......ధీరులుగ నుండుడు. భయరహితులుగ నుండుడు. మార్గము నిర్నిరోధము, నిర్విఘ్న మగును......థియాసపిస్టుల (దివ్యజ్ఞానసమాజమువారి) తో మీా కెట్టి పనియు లేదు అనుటను జ్ఞప్తి యుంచుకొనుడు. మీారు ఓర్పు కలిగి నాఅండనుందు రేని మన మింకను ఘనకార్యము సాధింతు మని మీాకు నేను హామీా యిత్తును. నాయనా, క్రమక్రమముగ ఘనకార్యము నిర్వహింపబడబోవునది ఇంగ్లండులో. మీారు అప్పుడప్పుడు అధైర్యపడుచుందురని నాకు తోచుచున్నది. థియాసపిస్టులచేతులలో ఆటబొమ్మలుగ నుంద మను మోజు మీాకు కలుగుచుండును. అదే నా దిగులు. గురుభక్తిగలవాడు విశ్వవిజేతయగు ననుటను స్మరింపుడు—చారిత్రకసాక్ష్య మిదొక్కటే....మానవుని సింహముగ రూపొందించునది విశ్వాసమే. ఎంతపని నేను చేయవలసియున్నదో దానిని మీారు సదా జ్ఞప్తియందుంచుకొనవలయును. ఒక్కొక్కప్పుడు దినమునకు నేను రెండుమూాడుపన్యాసములు కావింపవలసియుండును — ఈవిధముగ నేను అన్ని అడ్డంకులకును ఎదురొడ్డి దారి చేసికొందును — దుష్కరమైన పని'; దుర్బలు డైనను మరణించియుండును.

...బలముతో విశ్వాసముతో పట్టువిడువకుండుడు. సత్యపరులుగ నుండుడు. సత్యశీలురుగ నుండుడు. విశుద్ధులరుగ

నుండుడు. మీలో మీరు కలహించుకొనకుడు. అసూయయే మన జాతికి వేరుపురుగు.

నీయెడను అచటి మన మిత్రులందఱియెడను ప్రేమతో,

భవదీయ
వివేకానంద

## 250

(శ్రీ శారదానందస్వామికి)

228 పడమర 39 వ వీథి,
న్యూయార్కు,
డిసెంబరు 23, 1895.

ప్రియ శరత్తు,

నీ లేఖ నాహృదయమును దుఃఖముతో నింపినది. ఉత్సాహమునంతను గోల్పోయితివని గ్రహించితిని. నేను మిమ్ములనందఱ నెఱుగుదును. మీ శక్తిసామర్థ్యములును, లోపములును నాకవగతములే. నీ శక్తికిమించిన పనిని నిర్వహింపుమని నిన్నెన్నడును కోరియుండను. ప్రాథమికసంస్కృతపాఠములను బోధింపుమనియు, నిఘంటువులు మున్నగుగ్రంథముల సాహాయ్యముతో ఎస్—అను నాతనికి అనువాద ప్రబోధ కార్యక్రమములందు నీవు తోడుపడవలెననియు నేను వాంఛించియుంటిని. ఈకర్తవ్యనిర్వహణమునకై నిన్ను దారిలో పెట్టియుందును.— సుశిక్షితుని జేసియుందును. ఆపనిచేయుట కెవ్వరైన సమర్థులై యుండియుందురు.— సంస్కృతములో ఇంచుక పరిజ్ఞానము మాత్రము తప్పనిసరిగ నుండవలెను. అంతే! కానిమ్ము. ఏమైనను మంచికేవచ్చును. అది దైవ కార్యమగుచో, సరియైనవ్యక్తి, సరియైన స్థానమున, సరియైన సమయమున వచ్చును. మీలో నెవ్వరైనను మానసికముగ

కలతచెంద నక్కఱలేదు. ఇకసన్న్యాసులవిషయమందువా? పైకము నెవ్వరు తీసికొందురో, ఎవ్వరు తీసికొనరో నేనంతగా పాటించు వాడనుగాను. కాని బాల్యవివాహముపట్ల నాకు మిక్కుటమైన జుగుప్సకలదు. దీనివలన దాపురించు యాతనయెట్టిదో నే నెఱుగకపోలేదు. దీనివలన సంక్రమించు పాపమును మనజాతి అనుభవించితీరవలెను. నారకీయమైన ఈ యాచారమునకు ప్రత్యక్షముగగాని, పరోక్షముగగాని నాచేయూత సోకుచో నన్ను చూచి నేనే అసహ్యించుకొందును. ఈ విషయమును గుఱించి నీకీవరలో స్పష్టముగ వ్రాసియుంటిని. "దావాను" గుఱించి, విడుదలకై తానుచేయు ప్రయత్నములను గుఱించి ఏమేమో చెప్పి సన్న్యాసులు నన్ను మభ్యపెట్టనక్కఱలేదు — అట్లు చేయుటకు వానికి హక్కులేదు. వానికి నేనన్నదు నెట్టి హానిగలిగించియుండలేదు. అయినను నన్ను ప్రవంచన వాగురలో నాతడు పడద్రోయనెంచుట మిగుల శోచనీయము. ప్రపంచమనగా నిట్టిదే! నీవుచేయు మంచి వ్యర్థమగును. అట్లని ఏమియు చేయక నీవు చేతులను కాళ్లను ముడుచుకొనికూర్చుంటివేని నీవు ముష్కరుడవని ఎన్నబడుదువు. భగవంతుడు నిన్ను బ్రోచుగాక! నేను తెలిపినది నిక్కమని గుర్తింతువా? ఉద్వేగభరిత ప్రకృతిగలవాడను నేను. చుట్టములును, స్నేహితులును ఈప్రకృతినండజేసికొని సదా నాకు దారుణమైన చెఱుపు దెచ్చుటకై ఉద్దేశించుచుందురు. జగతికి దయ శూన్యము. "దాసోహం" అని మనము నతజానువులమై పలుకునంతకాలము అది మనలను చూచి కనికరించును; మనపట్ల మైత్రిచూపును. నాకట్టెదుట పుడమి విశాలమైయున్నది. ఇందులో నెందెందో నా యునికికొక మూల అగపడకుండునా? భారతీయులకు నాపై నిష్టములేనిచో, నన్నుజూచి యిష్టపడువారుండకపోరు. బాల్యవివాహ మను పైశాచికాచారమును మట్టుపెట్టుటకై నేను శక్తివంచనలేక ప్రయత్నింతును. నీపై నేరముమోపువారెవ్వరు నుండరు. నీ గుండెలో దడపుట్టునేని,

నీవు ఏదేని నిరపాయస్థలమునకు తొలగిపొమ్ము. ముక్కుపచ్చలారని పసిపాపలకు మగలను చేకూర్చు చెట్టలకు చేయిజేసికొనజాలను. ఇట్లు చెప్పవలసివచ్చుచున్నందుల కెంతయు వగచుచున్నాను. ఈశ్వరుడు నన్ను కాపాడుగాక! ఇట్టిపనులతో నా కీవరలో నెట్టి జోక్యము లేదు — ఇకముందుకూడ నుండకుండుగాక!—బాగుగ విషయమును యోచింపుము. ఇంత కంటెమిగుల హేయమై, దారుణమైన విషయము మఱొకటి యుండునా? ఇంత కంటె పిఱికితనమును క్రూరత్వమును చూచియున్నావా? పసినిసుగుకు మగని అంటగట్టువాని యుసుఱులుదీయుటకై నేను సంశయింపను. నాదృష్టిలోని లక్ష్యమిది:—సాహసోపేతులును, ధైర్యశాలురును, మహత్తరక్రియాసాధనకై ముందంజవేయువారును నాకు తోడు పడవలెను. ఇట్టివారులభింపరేని నేనొంటరినై కర్తవ్యము నిర్వహింతును. నేను నెఱపవలసిన మహాశయముగలదు. ఏకాకినై దానిని నిర్వహింతును. ఎవరువత్తురో, ఎవరుపోదురో నేను లక్ష్యింపను. సన్న్యాలు సంసారమునకై ఏర్పడిపోయినాడు. నాయనా, నా హెచ్చరికను గమనింపుము. అప్రమత్తుడవై యుండుమనియే నీకు హితముచెప్పుచున్నాను. ఈసలహా నీకు తెలుపుట నాధర్మమని ఊహించితిని. ఇపుడు మీరందఱు గొప్పవారైతిరి.—నామాటలలో మీకెట్టి విలువ అగపడదు. విస్పష్టముగ విషయవిలోకన మొనరించి, ఘనతరపరిజ్ఞానమునుపడసి, నీ యంతరంగమున చలించు నేటితలపులకంటె ఘనతరమైన భావపరంపర నీచిత్తమున పొడకట్టు సమయము ఆసన్నముగాక తప్పదని ఆశపడుచున్నాను.

ఇక సెలవు! ఇక నీకు విసుగు గలిగింపను. మీకందఱకు ఆశీస్సులు లభించుగాక! ఒక్కొకపుడు మీకు కొంతసేవ సలిపినందులకు (ఇట్లనిమీరు తలతురేని) మురియుచున్నాను. గురుదేవుడాదేశించిన కర్తవ్యములను నిర్వహించుటకై శక్తివంచనలేక ప్రయత్నించితినను ఆత్మవిశ్వాసము నాకు కొంత పరితోషమును

కలిగించుచున్నది. ఈకర్తవ్యములు చక్కగ నివ్వటిలినవో వేఱు తీరునజరిగినవో నేనెఱుగను. కాని వీనిని నిర్వహించుటకై ప్రయత్నముసలిపినందులకే నాకు ప్రమోదముకలుగుచున్నది — ఇక సెలవు. తనపై నాకెట్టి కినుకకలుగ లేదనియు, నాకు విశేషదుఃఖమే కలిగినదని మాత్రము సన్న్యలుతో తెలుపుము. విత్తమును గుఱించిన విషయము నాకు ఖేదముకలిగించుట లేదు. విత్తమునకు విలువేమి? నాహృదయమునకు యాతనకలిగించినవి ఒక నియమోల్లంఘనమును మఱివాని ప్రవంచనోద్దేశమును. వానికిని, మీకును ఏుదివందనము తెలుపుచున్నాను. నాజీవితములోని ఒక అధ్యాయము ముగిసినది. తక్కిన యధ్యాయములు క్రమముగ దాని ననుసరించునుగాక! అన్నిటికిని నేనుసంసిద్ధుడనై యున్నాను. నన్నుగుఱించి, మీకెవ్వరికి మానసికసంక్షోభము కలుగకుండు గాక! ఏదేశమందుగాని, ఏమానవుడుగాని, నాకెట్టి తోడ్పాటు సలుపనక్కఱలేదు. ఇక సెలవు! ప్రభువు మిమ్ములను సదా ఆశీర్వదించుచుండు గాక!

వివేకానంద

## 251

(శ్రీ ఇ. టి. స్టర్డీకి)

రిడ్జ్లీమేనర్,
డిసెంబరు 29, 1895.

ప్రియ మిత్రమా,

ఉపన్యాసప్రతులు ఇప్పటికి నీకందియుండును. వానివలన కొంతప్రయోజనము కలుగునని ఆశపడుచున్నాను. గమనింపవలసిన విషయములు మూడు! కట్టెదుట ఇక్కట్టులు చాలకలవు. వీనినన్నిటిని నెట్టివేయవలెను.

వానిప్రయోజనమేమియు లేదని వారియూహ.— ఇది జాతీయమైనజాడ్యము. ఆకస్మికముగ శీతకాలము నెదుర్కొనుటకై వా రడలు చున్నారు. ఇంగ్లండులో పనిచేయుటకు టిబెట్టువానికి వలసిన శక్తిలేదని వారి తలంపు. నేనుగాకున్న తేపు పనిచేయుటకై ఎవరో ఒకరు రాకతప్పదు.

భవదీయ సదంతర్గత
వివేకానంద

మలిమాట:— జాన్సను దంపతులకు, లేడీ మర్గెసనుకు, క్లార్కుసతికి, కుమారి హావెసుకు, కుమారి ముల్లరుకు, కుమారి స్టీలుకు, మఱి తక్కిన నెచ్చెలులందఱికి క్రిస్త్మసు శుభాకాంక్షలను పంపుచున్నాను.

వి.

పసివానిని నాపరమున ముద్దిడుము; వాని నాశీర్వదింపుము. స్టర్డీసతికి నా శుభాకాంక్షలు తెలుపుము. మనము పనిచేసి తీరుదుము—

గురుకటాక్షము మనపై ప్రసరించు గాక!

వి.

## 251 (అ)

(కుమారి ఎస్. ఫార్మరుకు)

న్యూయార్కు,
డిసెంబరు 29, 1895.

ప్రియ సోదరీ,

ఈవిశ్వమున నేదియు వ్యర్థముకాదు. ఎచ్చో నెద్దియు వ్యర్థముకాదో, జీవనస్థితమృత్యువుమధ్య నెచ్చో వసింతుమో

ప్రజాసమక్షమందును, లేక ఏకాంతమందును, జనసంకులపథములందును లేక ప్రాకార్యలీనసాంద్రగహనాభ్యంతరమందును మనము యోచించు ప్రతిభావము ప్రాణప్రదీపితమై వెలయును. ఈభావములు ఆత్మవ్యక్తీకరణమునందుటకై నిరంతరప్రయత్నమునలుపుచున్నవి. ఆత్మప్రకాశమునకై అవి ఎంతో తపించుచుండును. ఎంతయడంచినను అవి మడియునవికావు. ఏదియు వినాశనమునకు గుఱికాదు. భూతకాలమున చెఱుపుదెచ్చిన తలపులు సయితము ఆత్మప్రకాశమును కాంక్షించును. ఈభావములు బహుళవ్యక్తీకరణములందు నిర్మలములై తుదకు పరిపూర్ణమై, శివమై వెలయును.

కావున ప్రస్తుతము ఆత్మప్రకాశమొనరించుటకై తహతహలాడు భావపరంపర, ఎంతేనికలదు. ద్వైతస్వప్నములను పరిత్యజింపుడని, బాగోగుల తలపులను తీవ్రతర దమనస్వప్నములను మనసునుండి తొలగింపుడనియు, ఈనవ్యాశయము మనకుబోధించుచున్నది. సర్వనాశనముగాక ఉదాత్త పరిచాలనము (ఈశ్వర) శాసనమని అది బోధించుచున్నది. ప్రపంచము మంచి చెఱుపుల కూడలికాదని, ఘన ఘనతర ఘనతమ పురోభివృద్ధుల ఆటపందిరియని అది బోధించుచున్నది. దేనినిగాని అది కాదనక స్వీకరించును. ఏపరిస్థితియు ఆశారహితముకాదని, ప్రబోధించి, మానసిక, నైతిక, ఆధ్యాత్మికాంశములన్నిటిని పరిగ్రహించి, ఎట్టి తెగత్తకు గడంగక, తాను మేలేచేసితిననియు, ఇంకనువిశేషమైన అభ్యుదయమును గలిగించుటకై ఇపుడు పూనెదననియు అది తెలుపుచుండును. దౌష్ట్యము తొలగుననుభావము ప్రాచీనకాలమున ప్రబలెను. ఇపుడు దానికి చోటులేదు. దుష్టశక్తి పరివర్తనమునందుననియు, మహత్తర సౌమ్యస్థితినందుననియు నేడది ప్రబోధించుచున్నది. ఈశ్వరసామ్రాజ్యము సుస్థాపితమైయుండెననియు, ఇచ్ఛగించితిమేని అది మనయది యగుననియు, పరిపూర్ణ

త్వము మనుష్యాంతరంగమున విరాజిల్లుచునేయున్నదనియు అంత ర్దృష్టి కది గోచరించుచుండుననియు అది బోధించుచున్నది.

కడచిన వేసవిలో గ్రీనేకరులో జరిగిన, సమావేశములు ఆశ్చర్యము గలిగించునట్లు విజయవంతముగ నిర్వహింప బడినవి. ఏలయన పూర్వోక్తమైన భావమునకు నీ హృదయమున చోటొసగితివి. నీయందది సువ్యక్తమైనది. ఈశ్వరసామ్రాజ్యము విద్యమానమైయున్నదను సిద్ధాంతమును నీవు సమగ్రముగ విశ్వ సించుటచేతను ఆవిజయము చేకూతినది. ఈసిద్ధాంతమును ఆచరణ మందు రూపొందించుటకై దీక్షాపురస్సరముగ భగవంతుడునిన్ను నియోగించెను. ఈయద్భుత కర్తవ్యనిర్వహణమున నీకు తోడ్పడు వారు ఈశ్వరుని సేవించువారే యయ్యెదరు.

తనసేవకులను సేవించువాడు తనభక్తులలో నగ్రగణ్యుడని భగవంతుడు గీతలో బోధించియున్నాడు. నీవు భగవంతుని సేవకురాలవు. శ్రీకృష్ణుని ఉపదేశ మనుసరించు నేను ఎచ్చట నున్నను దైవప్రేరితమైన నీకార్యక్రమములో ఏసేవచేయవలసి వచ్చినను అది నాభాగ్యమని ఆరాధన మని నేను సదా తలంతును.

సదా భవదీయ ప్రియ సోదరుడు
వివేకానంద



# సూచి


అక్షయకుమారఘోష్ 234, 289, 439, 502, 507-8, 510
అక్షయకుమారా 295
అక్షయఘోష్ ములిక్ 480
అఖండానందస్వామి, శ్రీ (గంగాధరుడు) 1, 8, 21, 38, 42, 44, 50, 59, 70_1, 345, 507, 515
అగ్నిహోత్రపండితుడు 516
అచ్యుతానందసరస్వతి 23, 26
అజగరోపాఖ్యానము 13
అజ్మీరు 516
అతిశయోక్త్యలంకారప్రయోజనము 357
అతులచంద్రఘోష్ 59
అద్వైతవేదాంతము 195, 481 2
అద్భుతలీలలు అనావశ్యకములు 315
అనివార్యశాస్త్రము 96
అనుసార్యులు ఋషులేకాని పాశ్చాత్య పండితులుకారు 563 4
అపేక్షితములుమూడు, గొప్పతనమునకు 153
అపోహ, ఒకానొక తెనుగూర్చి 23_5
అభయసందేశము 278
అభేదానందస్వామి, శ్రీ (కాళి) 43, 57, 60_2, 70_1, 191, 424, 495, 500 1, 516
అమరనాథము 61
అమరప్రేమబద్ధ సంఘము 153
అమలు, మతమునకు కావలసినది 107, 286_7, 294
అమితాభ బుద్ధుడు 45
అమృతత్వము 444
అమెరికా "దేశ" "ప్రజల" వివరములు 103, 112, 131, 137_40, 146, 168-71, 214_5, 241, 257, 260, 262, 272, 274_6, 295 6, 300_1, 311, 331_3, 357_9, 375, 399, 417, 419, 497, 555, 560
అమ్మకై భూమికొను ఆస 406
అమ్మచర్చి 179, 185, 229 30, 239, 252, 291, 298, 323, 399, 457 8, 460_1
అమ్మ టెమ్పులు 323
అరేనా 437, 458
అవకాశములు, దుర్బలుల కెక్కువగ నుండవలెను 391
అవగుణముల నిరాసము, భారతీయుల- 436-7, 466, 496
అవధూత గీత 16
అవస్థా సిద్ధాంతము 313
అశ్లీలవాక్యములు, బెంగాలీలో వ్రాయబడ్డ శ్రీ రా. చరిత్రలో 313
అసూయ, నీగ్రోల 320, 343
అసూయ, భారతీయుల 153, 160, 171, 176
అసూయానైకమత్యముల నిరాసము 342, 347
అస్పృశ్యతాఖండనము 81
అళసింగపెరుమాళు 102, 127, 181, 202, 225_7, 232, 247, 250, 267, 283, 285, 293, 298,

306, 312, 324, 316, 352-6, 378, 411, 413, 418, 435, 442 3, 445-6, 462, 465, 476, 485-6, 512, 563

ఆచారము, గురూపాసనాది 151
ఆడమ్సుసతి 373, 416 8, 454, 557
ఆత్మనిత్యత్వము 460; ప్రత్యయము 276; వత్ సర్వభూతేషు 391
ఆదరము, వ్యక్తులందున్నది, సిద్ధాంతములందు లేదు 361
ఆదర్శవాది, స్వప్నప్రియుడు—స్వామి 408
ఆదాము 487
ఆదేశము, అమెరికనుపత్రికలలో ప్రకటింపుడని 438-40
ఆధిపత్యము, సాహాయ్యముసలుపనివారి 513 4
ఆధ్యాత్మిక ధర్మార్హత, అందఱికిని 388; విషయప్రచారము 205; —సంస్కారముచేతనే ఇతర సంస్కారములు శక్యములు 411
ఆనీదవాతమ్ 564
ఆనీబెసెంటు సతి 128
ఆన్టీయొనెట్ స్టర్లింగుమాడమ్ 488
ఆపదల ఉపయోగము 141-2
ఆబరడ్నేలు 177
ఆబ్బా 'లామాల' వర్ణనము 264
ఆర్భాటము, పాదిరీల 485
ఆలస్యము, సరకులరవాణాకు 381
ఆల్ప్సు 554
ఆల్బెర్టస్సు 475
ఆశయప్రచారకసంస్థావశ్యకత 379-80
ఆసుపత్రులు, నల్లలకు 369
ఆస్టిన్ 124, 202
ఆంగ్లేయులపాలనవలని లాభము 102
ఆండీసు గయాక్షేత్రము 502
ఆంద్రూసు కుమారి 420

ఇచ్చిపుచ్చుకొనుట ధర్మము 305
ఇబ్లిసు 487
ఇమిటేషన్ ఆఫ్ క్రీస్తు 11, 14
ఇవాన్స్టన్ 121, 245
ఇసబెల్ మెకిండ్లీ 185, 188, 230, 245, 282, 291, 398, 412, 559
ఇంగర్సాలు 135
ఇంగ్లీషువారిని శిష్యులను చేసికొనుట తేలిక కాదు 518
ఇంటగ్రేషన్ 182
ఇంటీరియరు 145, 149, 185, 229
ఇండియన్మిత్రులు 274, 334, 382, 561
ఇందు 28
ఇందుమతిమిత్ర 92

ఈశానచంద్రముఖర్జి 31
ఈశ్వరకృష్ణుడు 489
ఈశ్వరసామ్రాజ్యము 570-1

ఉదాహరణములు :—
—తేనెపట్టు 16; నిండిన నిండుచున్న కుండ 20; కన్నెను లేపి పెండ్లి తెలుపుట 72; పర్వతమూలబంధముపై నిర్మితమైన ఇల్లు 92; కూపస్థమండూకములు 109-10, 176, 302, 462; రసాయనపదార్థములను కలుపుట 147, 210, 216; దీపమున కాంతి స్పందనము 151; మాంసాహార ఫలాహారములు 156; పందులయెదుట ముత్యములుచల్లుట 164; గింజకును ఊకకును భేదము

167; మహమ్మగునొద్దకు కొండ వచ్చుట 175, 211, 217; ఊక దంచు రోకలి 192, 451; ఏనుగు చీమకాటు 193; చంద్రునిమీదికి ఉమ్ముట 195; పొగమసినిండినగది 197; పేనబడిన గడ్డిపోచలు ఏనుగునకు బంధనములు 204; ఒడ్డునపడిన చేప 236; రత్నాలగనిని విడిచి గాజుపూసకై దేవులాడుట 242; ఆవుతోలుచెప్పు బ్రాహ్మణునకు దానము 268; అంటించిన నిప్పు ఆఱదు 273, 479; క్రాగిన యినుమునకు సమ్మెటవ్రేటు 289; గంగకట్టున బావిత్రవ్వుట 295; కుడితితొట్టియొద్ద కుక్కలు 305, 486; ద్రాక్షపండ్లు పులుపు 308; పులియబట్టిన కడుగునీరు 309; ఆత్మహత్యకు పేనాకత్తిచాలు, శత్రువధకు మహాయుధములు 317; చాలపైమెట్టెక్కిన పక్షి 343; ఎగురుతిరిగి తన్నెడి శిశువుగొంతులో మందుపోయు వైద్యుడు 347; దయానాగుడికైన మంచుకడ్డీ 358; ఆకులు చెట్టు విలువను తెల్పుః మంచిపండే గాని పుచ్చినపండు కాదు 358; పాటు కడలిలోని రత్నములను చూపును 393; సూర్యుడు-భూమి; సముద్రపుపైభాగముననే కల్లోలములు 393; చంద్రబింబము - మేఘము; క్షేత్రగణితమందలి చుక్కలు; భగవంతుడు ఇరుసు 394; దేవుడు ఆకాశము ఆత్మలు చుక్కలు 395; కల్లోలము బుడగలు 481; జోరుతిగ 483; వేరులొద్ద పోయు నీరు 484; వంటకములో ఉప్పు 525
ఉచితముగ పంచిన పుస్తకాలను చదువరు 387
ఉష్ను, టన్నాట్ 125-6, 136, 238
ఉదయనాచార్య 125
ఉదారమిత్రులు, పాదికీలలో 352
ఉపకారులు-అపకారులు 558
ఉపదేశము, కలిసిపాటుపడుడని 204
ఉపదేశములు, శిశి 497, 500
ఉపనిషద్వాక్యోదాహరణము 123-4
ఉపేక్ష, భారతీయుల 208, 213
ఉమాదేవి 405

ఎథికలుసొసైటీ 373

ఏకైకమార్గముసానుభూతి, ప్రేమ322
ఏకంసత్ విప్రా బహుధావదన్తి 476
ఏదియు వ్యర్థముకాదు 570

ఐహిక నాగరకతావశ్యకత 308

ఒకానొక చక్కని బాలిక 165
ఒర్ఘూజి 516

ఓపియము కమీషను 196
ఓల్డు బాయిస్క్లబ్ 161
ఓహియో 454

కంఖలు 2
కంటు, పాదికీల 208
కడలితెవులు 556
"కదాపిన" పండితుడు 107
కన్యాకుమార్యగ్రమున ప్రబోధము174
కపిలమహాముని 17, 46-7
కపూర్తలరాజు 105
కమలాకాంతుడు 55
కమ్మ్రష్లడ్వైటెజర్ 182

కర్తవ్యము, ఉన్న మెట్టునుండి పైమెట్టెక్కించుట 499
కర్తాభజావర్గము 273
కర్మాచరణప్రయోజనము 397
కలకత్తావారిని నిరసించుట 314
కష్టతరము, అవరోహణముకంటె ఆరోహణము 288 9
కాంటను 96 7
కాట్స్కిలు ప్రాంతములో భూమికొను ఉద్యమము 396
కారణము, బంగాళమున ఇస్లాము హెచ్చుటకు 321
కార్పెంటరు, డాక్టరు 351
కార్బిను కుమారి 411, 416
కార్యక్రమము, కేంబ్రిడ్జిలో 323; న్యూయార్కులో 407 - 8, 414, 442, 561-2
కార్యకూరతోపదేశము 337, 355 6, 377, 515
కాల్విల్లా 238
కాల్విల్లు 293
కావ్యఖండము 116 9
కాశీవర వేదాంతవాగీశుడు 521
కాళిదాసు 338
కాళీకృష్ణబాబు 132, 344
కాళీచరణబెనర్జి 283-4
కాళీభట్టాచార్య 33
కుంభమేళ మహోత్సవము 27
కుక్సు 113, 227, 252
కుటిచకదశ 316
కుటీరము, మనదేశజీవస్థానము 148
కుటుంబస్థితి, స్వామీజీ 10
కుమారిలభట్టు 45
కుసుమాంజలి 125
కూరింగు కుమారి 437
కృష్ణమయి 28, 33
కృష్ణానందస్వామి 561 2
కేంద్రస్థానావశ్యకత 65-70, 353-4, 415, 516-7
కేశవచంద్రసేన్ 200, 225
కొలంబో విశేషములు 94
కోరాస్టాక్వాము 239, 244
కౌశికవృత్తి 521
క్రతుకలాపనిరాసము 368-9
క్రిశ్చియన్నైన్సు 201, 412
క్లార్కుసతి 569
క్షత్రియుల విశిష్టత 159
ఖేత్రీమహారాజు 86 - 8, 91, 93, 136, 179, 199, 247, 260, 345, 356, 381 - 2, 421, 457, 460, 473, 495

గగనచంద్రరాయ్ 33, 51, 53, 60
గార్గి 363, 500
గిబ్బన్సుదంపతులు 374
గిరీశచంద్రఘోష్ 40, 71, 168, 184, 515
గుణనిధి 193, 345 6, 371, 195
గుణప్రశంస, సోదరశిష్యుల 493
గురుపరంపరలో ఎడతెంపుండరాదు 370
గూఢమతాశయములు 426
గృహిణి విశిష్టత 356-7
గెరెన్సే 229, 267, 298, 399, 405, 448-9, 559
గేలి, భర్తదారకలేదా అని 418
గోపాల్ 199, 515
గోవింద చౌధురి 23

గోవిందసహాయ్, లాలా 73-5, 327 8
'గా' 22
గార్మా 342
గ్రంథవిక్రయము, ఇంగ్లండులో 383, 522
గ్లాడ్‌స్టన్, భారతదేశపు 200
ఘోరదోషములు రెండు 509

చండీసప్తశతి 171-2
చక్రవర్తి 128-9
చారుచంద్రుడు 248, 462
చిత్రకూటము 26
చునీబాబు 28, 526
చైతన్యస్వామి, శ్రీ 16, 45, 309
చైనా 60;—వాడుస్నానముచేయడు 97
చోరుని ధర్మసూత్రము 158

జగన్నాథస్వామి రథము 163
జగ్మోహనుడు 370
జడ్జి 376
జపాను వివరములు 99-100
జర్శీ గోవు 163
జాకు 3ు6
జాగరూకత, ఆరోగ్యవిషయిక 506
జాన్ 96, 3ు6
జాన్ డేవీస్ 489
జాన్ లియాన్ 126
జాన్సన్ దంపతులు 106, 569
జీ, సోదరి 23ు
జీవితముఖ్యాభిలాష, స్వామిది 147
జీసను 79
జెస్సీ 82
జేమ్సు డాక్టరు 241, 326
జైన్ డాక్టరు 373

జోజో 408, 417, 420, 448, 469-70, 472, 475, 512, 527, 529, 555, 559
జోషు (జోసఫు మామ) 456
జోసఫైన్‌లాకు 415
జోస్పీ డాక్టరు 560
జ్ఞానభాస్కరుడు 156
జ్ఞానయోగము 430
జ్ఞానానందుడు 5, 7

టూంకే 529
టాటను 291-3, 297
టాడ్ 434
టిబెట్టు 2, 7, 8, 44, 60, 382, 569
టెమ్పుల్ యూనివర్సల్ 438
ట్రాన్‌స్క్రిప్టు 247, 252
ట్రిబ్యూన్ 191, 297
ట్రుబ్నరు 489

డచరు కుమారి 430, 444, 450-1, 456, 460, 468, 470, 477
డార్విన్ 491
డేవిడు 82
డ్యూడు 240
డ్యూరైన్ 240
డ్యూసెన్ను 491

తాంత్రికాచారము 45
తారకుడు 330, 834, 345, 498, 507, 524-5;—నితో రామేశ్వరమేగిన బాలుడు 370
తారతమ్యము:—
బుద్ధ × శంకర 48; రాజపుత్రులు × దక్షిణరాజులు 84; భారతీయులు × జపానీయులు 100); ఆసియా × యూరప్ × అమెరికా 131; పుణ్యము ×

పాపము 156; అమెరికనుమహిళ× భారతీయ మహిళ 172; ప్రాచ్యులు ×పాశ్చాత్యులు 209, 254, 285, 296, 303, 319, 349, 368, 386, 413, 464; బెంగాలీలు× మదరాసీలు 228; బోస్టను × న్యూయార్కు 246, 326; అమెరికను సతులు×యూరపియనుసతులు 258; మహిళలు×మగవారు 326, 359; జి. జి. × అళసింగ 353; పుస్తకములు × పత్రికలు 354; సోమరితనము×త్యాగము 368; మదరాసీయులు × ఇతరులు 387; చైతన్యదేవుడు × శ్రీరామకృష్ణుడు 392; సామాన్యమానవుడు × జ్ఞాని 401; ఆశ × నైరాశ్యము 406, 409; మతాచార్యుడు × లౌకికమానవుడు 440; ధర్మము × అధర్మము 463; కర్మ×అకర్మ 498; అభేదానందుని ఇంగ్లీషు × శారదానందుని ఇంగ్లీషు 502; న్యూయార్కు × కల్కత్తా 511; అమెరికనులు × ఆంగ్లులు × జర్మనులు 555; యూరోపునగరములు×న్యూయార్కు 559.
తారాదేవీక్షేత్రము 60
తులసీదాసు 220, 405
తులసీరామ్ 28, 31, 370
తొందరకూడదు 317-8
త్రిగుణాతీతానందస్వామి, శ్రీ (శారదుడు) 333, 381

థర్స్బి కుమారి 373-4, 400, 411, 416, 441
థాకూర్ 76
థామసు డాక్టరు 149
థియాసఫిస్టులు 311, 376, 479, 564

దక్షుడు 72, 504
దరిద్రదేవోభవ 346
దర్జివాడు, డియర్బారన్ అవెన్యూ 117
దసు 344
దాపరికము కూడదు 310
దాస్యత్రిపుటి 459
దిననాథ 503
దీనజనోద్ధరణోద్బోధము 349-50
దుఃఖమే గురువుగనుండు పాఠశాల 108
దేవతాదంపతులు 559
దేశభక్తులు, ప్రజలదుఃస్థితిని పరికింపని 321
దేశాటన ప్రశంస 459
దోరా 469-70

ధనముసంపుమనికోరుట 114; స్త్రీ శారనిరాకరణము 557
ధర్మనిర్వచనము 158
ధర్మపాలుడు 121, 135, 171, 249, 350-2
ధైర్యబోధము 466-7

నంజుండరావు 85, 315-18
నరసింహాచార్యులు(జి. జి.) 107, 130, 134, 202-3, 218, 223, 228, 234, 247-9, 251, 269, 294, 353, 374
నరేంద్రనామనిర్వచనము 167; చంద్రుడు 18
నవ్యభారతదేశచరిత్ర సర్వస్వము 261
నాగర్కరు 128
నాయకలక్షణములు 341

నాయన పోపు 188, 458, 461
'నాయమాత్మాబలహీనేనలభ్యః' 363
నారదసూత్రములు 489, 510, 521
నారదుడు 56
నారాయణదాసు, పండిత 516
నారాయణహేమచంద్రుడు 299
నిరంజనానందస్వామి, శ్రీ 290, 331, 364
'నిర్గచ్ఛతి జగజ్జాలాత్' 463
నిస్స్వార్థతైకాగ్రతల ఆవశ్యకత 415
నెగ్గన్నను, కర్నలు 351
నైచ్యానుసంధాననిరాసము 276 - 81, 385
న్యూయార్క్ హెరాల్డ్ 182
న్యూయార్కు క్రిటిక్కు 306
పంచదశి 521
పక్వతి 415
పట్టణములలో మనస్సంకోచము 1
పతంజలి 56, 483, 489
పత్రికలనుండి ఉద్ధారములు 301 - 2; —పంపవలదనుట 312, 325, 354, 378, 384; — వాణిజ్యచాతుర్యము 427; బూటకము 102, 442; —ప్రయోజనము 501
పరస్పరగుణవినిమయము, అమెరికా భరతఖండముల 140, 175
పరిణామవాదము 22
పరిష్కారము, శ్రీకృష్ణుని 498
పల్లెప్రజలలో విద్యావ్యాపనము 211
పవహారీబాబా 33 63
పవిత్రకుటుంబము 179, 181, 327, 460
పవిత్ర గోవు 449
పాటరు సతి 218
పాణినీయవ్యాకరణము 2 4
పాదరక్షలనుగూర్చిన శాస్త్రము 255
పామరు 161 3, 165, 180, 218, 234, 298
పార్థసారథిస్వామి 110-1, 142
పాలూశాలూసు డాక్టరు 234
పాశ్చాత్య వేషానుకరణము రోత 518
పిటు వ్యంగ్యచిత్రము 292
పినాంగు విశేషములు 94-5
పిల్లి 248
పీక్వతి 417
పీల్వతి 559
పురుషోత్తమ జోషి 116
పూర్ణబాబు 23
పుల్మను సతి 236
పెట్రో 298
పేదలపీడించినవారికి ప్రతిక్రియ 320-1
పేర్లమోసము 415
ప్రకాశానంద సరస్వతి 16
ప్రకృతి దురతిక్రమణీయత 152
ప్రచారము చేయుడను ఆదేశము 312
ప్రజోద్ధరణము 109, 134, 140, 148, 175, 210, 334-5, 483
ప్రజ్ఞాపారమిత 45, 47
ప్రతిఘటనముశక్తిని పెంపొందించును 183
ప్రపంచము ఆటపందిరి 570
ప్రమదాదాసమిత్ర 1-2, 4, 6, 7-22, 25 6, 31, 34 8, 42-3, 52, 57, 61, 64-70
ప్రయాణక్రమము 563
ప్రవక్తకు స్వదేశమున గౌరవము 185
ప్రియ వైద్య 61-2
ప్రెస్సుసోసియేషన్ 444
ప్రేమయే సర్వసాధకము 307; —హా

రము 222; ఆదర్శము, గురుదేవునిది స్వామీజీది 371-2
ప్రేమానందస్వామి 5, 58, 63
ప్యారీమోహనముఖర్జీ రాజా 193, 304
ప్లిమత్తు 244

ఫకీరు 33, 329
ఫణిభాష్యము 521
ఫలప్రదములు, 'శీల' 'సాధన' 'సాక్షాత్కారము'లు 427
ఫార్మరుకుమారి 327, 372, 374, 409, 411, 414, 429, 431, 454, 569
ఫిగ్సు సతి 239
ఫిలిప్సు కుమారి 236, 266, 373, 443, 450, 517, 521
ఫిష్కిలు 244, 267
ఫెన్నీహార్లే 245
ఫెర్సీ 447, 469, 471-2
ఫోరమ్ 186
ఫ్రాంక్వా 246
ఫ్రెడరిక్ డగ్లస్ 292
ఫ్లాగ్ 161, 164

బజ్జోసు డాక్టరు 129, 183, 224, 232, 234, 359, 375, 435, 441
బలరామ్బోసు 11, 23, 27, 29, 32, 39, 57, 328, 526
బహిరంగోపన్యాసముల మాను కోరిక 556
బాగ్లీసతి 165, 180, 183, 188, 207, 234, 236, 245, 252
బానిసలే ఇతరులను బానిసలుగా చేయుదురు 309
బాని 359-60
బార్డ్లాండు 447
బార్బ్హాసు 129
బాలాజీ 85, 107, 141, 248, 269, 378
బాల్యవివాహ నిరసనము 139, 255-6, 389, 566-7
బాహ్యకర్మల పటాటోపనిరాసము 368
బిమల 388
బుద్ధుడు 19, 45, 47 8, 462, 498
బురద బురదను కడుగదు 157
బుల్సతి 245, 266, 262, 292, 324, 326, 372 3, 393, 396, 400, 402-3, 409; 414, 417, 421, 429, 441, 444, 447, 452, 470, 487, 526, 528, 556, 560
బృహస్పతులు, మదరాసు 223
బేబి 458
బైము 202
బోస్టను—బుద్ధిస్థానము 375
బ్రహ్మానందస్వామి, శ్రీ(రాఖాలు)21-2, 26,39, 72, 367, 384, 480, 495, 504, 511, 517, 519-20, 523
బ్రహ్మవాదిన్ 476, 562
బ్రాడ్లీ 120-1, 245
బ్రాహ్మణనగరము 268
బ్రాహ్మసమాజము 261
బ్రీడు సతి 179, 187, 189, 236
బ్లూనోసు 145

భక్త భక్తుల విశిష్టత 503, 571
భగవదేకపరత్వోపదేశము 242
భగవద్గీత 521
భట్ 144; —ఆచార్య 112, 206, 247, 295
భర్తృహరి 171, 194 5, 385, 404, 410, 460

భగవానుడు 344
భారతదేశగుణనీతి 173
భుక్తిముక్తులు ఒరులకు కల్గించుటే మన కవి వచ్చుటకు మార్గము 371
భూతోపాసనము 426
భూలోకపరిష్కృత 487

మంచూరియా 60
మజుందారు 121, 128-9, 167, 182, 186, 188, 197, 200, 202, 227, 251, 262, 338-9
మతనిర్మాణాదేశము 387, 501-2
మడిసోను 136
మణి అయ్యరు 375, 435
మణీలాల్ ద్వివేది 134, 300
మణీలాలునభూభాయ్ 75-7
మతఖండనము, భారతీయుల యిప్పటి 366, 391-2
మతవిషయములలో మహిళలప్రీతి 195
మతాచార్య కైతవము 101, 108, 132, 308-9, 349, 389, 464
మదరాసీ పిల్లజట్టు 226
మధ్యతరగతివారే కార్యనిర్వాహకులు 496
మనస్సుఖారామ్ 78
మనువు 138-9, 172, 255, 402, 409
మనోవ్యాయామసిద్ధాంతము 46
మన్మథనాథభట్టాచార్య 253
మర్రెసన్ సతి 569
మలేరియానివారణవిధానము 365
మహమ్మదీయులు హిందువులకు నేర్పిన విషయములు 308
మహిమాచక్రవర్తి 502
మహిళల అందములో దేశభేదము 259
—ఉద్ధరణము 134, 499-500
మహేంద్రనాథగుప్త (మాస్టరుమహాశయ) 5, 507, 526
మహేశచంద్రన్యాయరత్న 231
మహోపకారకార్యక్రమము 366
మాక్సుముల్లరు 135, 433-4, 456-7, 460
మాక్డూవెల్సతి 165
మాక్మోమోరియలు భవనము 441
మాతృశ్రీకి కావలసిన యిల్లు, దాని పోషణము 360-1; —ప్రభావము 363-4
మానవుని పరిష్కృత, జీవులలో 487-8
మాఘై: 296, 503, 526
మిల్లరు కుమారి 295, 458
మిల్సు సతి 238-9, 245
ముల్లరు కుమారి 512, 558, 561-2, 569
మూడు మెట్లు, ప్రతిపనికి 474
మూర్ఖదేవోభవ 346
మెథడిస్టులు 468
మేరీ హేలు కుమారి 137, 162, 166, 168, 179, 200, 220, 229, 231, 235, 243, 252, 264, 271-2, 287, 291, 297, 323-4, 338, 372, 400, 407, 433-4, 450, 453, 456, 460, 468-9
మైత్రేయి 363, 500
మైసూరుమహారాజు 88, 183, 214, 247, 413
మొమెరీ డాక్టరు 136
మోక్షత్రిపుటి 459
మోహన్ (స్వామి తమ్ముడు) 199
మోహిత్కుమారభట్టాచార్య 253
మ్లేచ్ఛభావనిరాసనము 296

యంగు కుమారి 293
యగ్దేకరు డాక్టరు 144
యజ్ఞేశ్వరభట్టాచార్య 28, 516
యావద్విశ్వమునకు సొంతముస్వామి 484
యూనివర్సల్ట్రూత్ 238
యోగవాసిష్ఠము 406, 510
యోగానందస్వామి, శ్రీ 26 7, 333
యోగీంద్రుడు పూజారి 525

రతీలాల్ భాయ్ 87, 89
రమాబాయ్ 111, 114, 414
రవివర్మ 76
రాజపుటానా త్యాగశీలుర సెలవు 343
రామకృష్ణానందస్వామి (శశి) 42, 168, 198, 270, 289, 338 386, 423 6, 462, 497, 515, 519
రామదాసుని తండ్రి 113
రామనాథపురరాజు 88, 133, 182
రామమోహనరాయ్ రాజా 132
రామలాల్ 344
రామకృష్ణుడు, శ్రీ, స్వర్ణయుగప్రారంభకుడు 390; ని విశిష్టత 55-6, 152, 154-5, 212, 312 3, 362-3, 499, 507-9; ని జీవితరచనాభిలాష 387; — ని ఆరాధింపుడని నిర్బంధింపరాదు 406; —ని అవతారప్రయోజనము 463-4;--నిలోభక్త్యభివ్యాప్తి482; — డు రత్నవిద్యానిష్ణాత 493; —పుంథీ 502; ని వార్షికోత్సవమునుగూర్చిన సలహాలు 505-6; —డు లోకరక్షకుడు 504-6
రామానుజాచార్య 309, 435, 490
రాముడు 28, 33
రామ్దయాళ్బాబు 381, 383
రాయల్కమిషను 196
రిస్డేవిడ్సు 135
రోఢ్స్బర్గ్రస్తి 559
రివ్యూ ఆఫ్ రివ్యూస్ 186

లండు మహాశయుడు 435
లఘుకౌముది 3
లాండ్సుబర్గ 263, 266, 326, 405, 410, 430-1, 449, 453-4
లాక్ సోదరి 417, 557
లాగ్వాను 162-3
లాటు 331
లాభకరవ్యాపారావకాశము 383-4
లాలూభాయి 103
లిన్క్లబ్బు 180
లియాన్సు దంపతులు 124
లెగ్గెట్టు 420-1, 447 8, 451, 453, 457, 469 - 72, 475, 477, 487-8, 529, 554, 558
లెపెల్గ్రిపిన్ 187
లేడీస్ ఫార్ట్నైట్లీక్లబ్బు 127
లైమన్ ఆబ్బట్టు 189
లోకశ్రేయస్సాధకులు మహాత్ములు 277
లోకహితమే ఆత్మహితము 388

వరదరావు 103, 112
వరల్డ్ఫేర్ 359
వర్ణవ్యవస్థనుగూర్చిన దురభిప్రాయము 132
వాచస్పత్యనిఘంటువు 521
వామాచారము 45
వారణాసి 1, 4, 6, 9, 12, 23, 25-6, 58
వారసు, గురువుకు శిష్యుడు 268

వాల్డోర్ఫ్ 187 8, 455
వాసుకి 18
వింతమానసిక వైద్యము 198
విజయగోస్వామి 502
విజ్ఞానభిక్షువు 489
వితంతు పునర్వివాహనిర్వహణ కార్య క్రమము 148
విద్యానిర్వచనము 15?; — వ్యాప్తి విధానము, వేదలలో 216-7, 330
విరజగీతి 476
విరామతృష్ణ 397-8
విరోచనుని సంతతి 274
వివర్తవాదము 22
వివేకచూడామణి 49
విశ్వజనీనతను ప్రచారముచేయవలె 341
విశ్వమతమహాసభ 125, 128, 134-5, 181, 196, 224-5, 359
విశ్వరూపారాధనము 369
విశ్వవస్తుప్రదర్శనము 219
విశ్వాసప్రభావము 564
వీరచంద్గాంధి 128, 130, 186, 301, 319, 454
వెహిమియాచాండ్ 290
వేదాంతగ్రంథ రచనాభిలాష 439, 444, 455
వైదుష్యసంపాదన వ్యక్తీకరణముల ఆవశ్యకత 522-3
వైరాగ్యమహిమ 410
వ్యాసుడు 17, 19, 159, 174
వ్రూమను సోదరులు 293
వ్హిరల్పూలు సతి 239

శంకరభాష్యము 528; — లాల్ పండిత 79, 516; — రాచార్యులు 13 5, 17, 45, 58, 309
శకుంతములు (అనురాగబద్ధ) 528
శాండిల్యసూత్రములు 106, 510, 521
శాకుంతలము, కాళిదాసుని 9
శారదానందస్వామి 38, 53, 72, 198, 334, 386, 425, 462, 464, 495, 497, 515 6, 521, 560
శాస్త్రవిషయిక ప్రశ్నలు 12-3, 16-9
శిక్షణాదేశము, యువజన 433
శివనాథశాస్త్రి, పండిత 201
శివమహిమ్న స్తోత్రము 357
శివసంహిత 489
శివానందస్వామి 7, 360, 439
శుకభగవానుడు, శ్రీ 32
శ్రీధరుడు 129
శ్రీశవసు 521
శ్వేతాశ్వతరోపనిషత్తు 172
షెర్మన్సతి 180

సంకల్పశక్తి, భగవంతుని 422
సంఘస్వేచ్ఛ 140
సంఘస్థాపనోద్దేశము, ఇంగ్లండులో 526-7
సంఘాచారభిత్తిక 304-5
సంచలనమును ఉపయోగించుకోవలె 384
సంతకముచేయుపద్ధతి వివిధవర్ణాల 93
సందేశప్రచార దీక్ష 150; — మునకే ప్రచారావశ్యకత 287, 329
సంఘపతనమునకు మూలకారణము 497; —నిర్మాణము 478
సచ్చిదానంద 85, 145
సతీశచంద్రముఖర్జి 31-3, 37, 51
సత్పురుషుల ప్రశస్తి 380
సత్యపరులకు ఇచ్ఛకమసాధ్యము 401-4;

—మనకసత్యపు చక్కెరపూత ;
—మే జయించును 310, 479, 500;
—మే దైవము 485;
యుగము 182
సదానందస్వామి 41, 334, 371
సన్యాసులు 191, 193, 344, 386, 388, 392, 405, 492, 504, 507, 566 8
సన్న్యాసి - భేదదృష్టిలేనివాడు 342
సమదృష్టి వివరణ 445-6
సమస్తమతతత్త్వసారము 164
సమాదరము- సన్న్యాసుల, గృహస్థుల పట్ల 15
సరసము-పేరిపాడుగునుగూర్చి 382
సరియైనరీతిమనుష్యులు 421-2, 430-1
సర్వకార్యసాధకములు 500
సర్వదిగ్దర్శనచిత్రము 410
సర్వభూమండలమునకు చెందినవాడు స్వామిజి 513
సర్వమతములు వేదాంతవిభేదములే 438-9
సాంఖ్యకారికలు 489
సాధారణవైష్ణవసంప్రదాయము 23
సాన్బార్ను 115-6, 167
సామ, శ్రీ 453-4
సాయమొనర్చనివారిపైని ప్రేమ విశ్వాసములు 519
సారటోగా 116
సారముగలదే నిలుచును 429
సార్వభౌముడు 16
సాలోమన్ దంపతులు 559
సింగారవేలు మొదలియారు(కిడి) 147, 154, 228, 232, 269, 313, 315, 355, 378, 432, 452, 467
సుందరలాల్జీ 80
సుజనిహోతము 48
సుబోధానందస్వామి21, 26, 39, 370
సుబ్రహ్మణ్య అయ్యరు 325
సురేశచంద్రమిత్ర 57, 66-7, 71, 526
సువర్ణమత్కుణములు 236
సేవకులుకండు నాయకులుకాదు 354, 361, 419, 440-1
సోమరి త్రిమ్మరి కథ 352-3
సోరాబ్జీ కుమారి 135
సౌహృదము జనాంతరము 9
స్కోపెన్హోరు 490
స్టర్గిసు 420, 468, 470-1, 473 7, 528, 554, 559
స్టర్డి 396, 426, 428, 439, 478, 480, 487-8, 510, 512, 515, 517, 519, 522, 526 9, 557 8, 561, 568
స్టాహ్లాము కుమారి 238
స్టీలు కుమారి 569
స్టోను సతి 236
స్పాల్డింగు 323
స్పెన్సరు ఖండనము 22
స్మిత్తు సతి 180, 187
స్వమతదూషకులగు హిందూపలుగాకులు 437
స్వర్గకుంతములు 559
స్వాతంత్ర్యము ఇచ్చువానికే పొందవర్హత 306;
—మే అభివృద్ధికి సాధకము 367 8
స్వామిగడించిన మాటచెల్లుబడి, అమెరికాలో 376
స్వామ్పస్కాటు 230, 235

స్వాయత్తసర్వకార్యత ఆవశ్యకము 523
స్విస్‌యువకు డొకడు 554
హఠయోగ ప్రదీపిక 189
హడ్సను 501
హరమోహనుడు 195, 381, 191, 520
హరి 334, 367, 504
హరిదాసు విహారిదాసుదేశాయి 75-7, 82, 86 91, 149, 168, 207, 287 8, 299, 318
హరిద్వారము 1, 27
హరిపాదమిత్ర 92, 137, 144
హరిసింగు 495
హరీషుడు 504
హాంగ్కాంగు 95-7
హామ్లిను కుమారి 415, 421-2, 430-1, 442
హామ్లెట్టు 86
హారియొట్టుకొండ్లి 165, 236
హార్బర్టు 75
హార్వర్డు ఫిలసాఫికల్ల క్లబ్బు 560
హాలిస్టరు 472, 475, 528, 555
హావేసు కుమారి 569
హిగిన్సను కర్నలు 121, 190, 243, 326-7, 373
హితోపదేశము, మదరాసు శిష్యులకు 306-11
సోదరశిష్యులకు 330-7, 492-4
హిగలు 22
హెన్రీరైటు జాన్ 115, 120, 126, 128, 161, 184, 187, 190, 196, 199, 206, 233, 245, 265, 298
హెన్రీసామర్సెట్ ప్రభ్విణి 323
హెరాల్డు, చికాగో 182, 302
హెలెన్గాడు కుమారి 180
హెల్మెర్ డాక్టరు 449
హైందవఘుంఘూమారుతుడు 162, 339
హోటలాక్రాన్టినెన్టలు 510
హోమపక్షి 221
హోలను 161, 163
హౌకుమారి 190, 239, 244, 246, 292
హౌవరు సతి 455
వ్యాయామము 177 8, 513

